# భావనామ

# ఉగాది కానుక

తెలుగు జాతికి గర్వోన్నత వారసత్వం వున్నది. మహోన్నత చరిత్ర వున్నది. బంగారు భవిష్యత్తును నిర్మించుకునే ప్రయత్నంలో భాగంగా మన సంస్కృతీ సంప్రదాయాలను, గర్వోన్నత వారసత్వాన్ని వర్తమాన, భవిష్యత్తరాలకు అందించవలసిన బాధ్యత మనతరంపై ఉన్నది. ఈ కృషిలో భాగంగానే ఆంధ్ర ప్రదేశ్ పత్రిక ఏప్రిల్ 1994 సంచికను భావ నామ సంవత్సర ఉగాది ప్రత్యేక సంచికగా రూపొందించి తెలుగు పాఠకులకు ఉగాది కానుకగా అందజేస్తున్నందుకు సంతోషంగా ఉంది.

ప్రభుత్వ పథకాలు, కార్యక్రమాలను ప్రజలకు తెలియ జేయడంతోపాటు తెలుగువారి మహోన్నత సంస్కృతీ, సంప్రదాయాలు, చరిత్ర, సాహిత్యంకు అద్దం పట్టేవిధంగా ఆంధ్రప్రదేశ్ పత్రికను రూపు దిద్దుతున్న విషయం పాఠకులకు తెలిసిందే.

ఈ ఉగాది ప్రత్యేక సంచికలో వివిధ రంగాలలో ప్రఖ్యాతులైన మేధావులు, కవులు, రచయితలు, పత్రికా రచయితలు వ్రాసిన వ్యాసాలతోబాటు తెలుగువారి మహోన్నత వారసత్వాన్ని చాటిచెప్పే కొందరు సుప్రసిద్ధ చిత్రకారుల వర్ణచిత్రాలను కూడా ఇందులో పొందుపరచడం జరిగింది. విద్యార్థులు, పరిశోధకులు, జిజ్ఞాసువులైన పాఠకులకు ఎంతో ఉపయుక్తంగా ఉండేందుకు వీలుగా ఈ సంచికను రూపొందించడం జరిగింది. సాహిత్యాభిమానులు పదికాలాలపాటు పదిలంగా దాచుకునేందుకు అనువుగా దీనిని రూపొందించాము. మా కృషిని పాఠకులు గమనించగలరు.

ఈ ప్రత్యేక సంచికకు వ్యాసాలు, కవితలు, వర్ణచిత్రాలు అందజేసిన వారందరికీ కృతజ్ఞతలు. ఈ సంచికను రూపొందించడంలో ప్రత్యేక కృషి సల్పిన మా సిబ్బందికి అభినందనలు తెలియజేస్తున్నాను. మా కృషి అందరికీ ఉపయోగిస్తుందని ఆశిస్తున్నాను.

ఉగాది శుభాకాంక్షలతో...

యం.వి.యస్. ప్రసాద్ ఐ.ఏ.ఎస్.
గౌరవ సంపాదకులు

# ఆంధ్రప్రదేశ్

ఏప్రిల్ 1994

| | |
|---|---|
| ముఖచిత్రం : వసంతాగమనం | చిత్రకారుడు : బాపు |
| రెండవ కవరు : శకుంతల అత్తవారింటికేగుట | చిత్ర కారుడు : కొండపల్లి శేషగిరిరావు |
| మూడవ కవరు : అద్దంలో అందం | చిత్రకారుడు : వైకుంఠం |
| నాల్గవ కవరు : భావనామ సంవత్సరానికి కలశంతో స్వాగతం | చిత్రకారుడు : కాపు రాజయ్య |

## ఈ సంచికలో ...

# భావనామ ఉగాది ప్రత్యేక సంచిక

విడి ప్రతి వెల : రూ. 5, సాలుసరి చందా : రూ.50

గౌరవ సంపాదకుడు
యం.వి.యస్. ప్రసాద్
ఐ.ఏ.ఎస్.

ఎడిటర్-ఇన్-చీఫ్
ఎ. ప్రభాకర రావు

సంపాదకుడు
పి. విఘ్నేశ్వర రావు



ప్రచురణ : కమీషనరు, సమాచార పౌర సంబంధాల శాఖ, సమాచార భవన్, ఎ.సి.గార్డ్స్, హైదరాబాదు.-500 028.

# "భావ" గారికి స్వాగతం

డా॥ ఉండేల మాలకొండారెడ్డి

ఎందుకో ఇంత సంబరం ఉగాదికి.
ఆరంభశూరుడైన తెలుగువానికి
ఉగాది అంటే ప్రకృతి చైతన్యానికి ఆరంభం
అందుకేనేమో ఇంత సంరంభం.
గున్నమామిడి నవ్వుతోంది కొత్తచిగుళ్లతో
గండుకోయిల పాడుతున్నది కమ్మని రాగాలతో
కాని–మనిషి మొగంపై నవ్వు మాసిపోతున్నది
మనసుకోయిల పాడలేకున్నది
ప్రకృతిలో భాగమైన మనిషి
వికృతిగామారిపోతున్న విషకాలం
ఎచట చూచినా విద్వేష జ్వాలా నిలయం
ఎదురులేని విధ్వంసకాండల వలయం
మనిషితుపాకియై పేల్తున్నాడు
మారణహోమం సృష్టిస్తున్నాడు
ప్రకృతిలాగే మానవప్రకృతి
ఆనంద పుష్పాలు పుష్పించేదెప్పుడు
సౌహార్ద పరిమళాలు చల్లేదెప్పుడు
సౌభాగ్యఫలాలు పంచేదెప్పుడు
అన్నిటికి మించి–
మనిషిమనిషిగా రూపొందేదెప్పుడు
ఆశుభముహూర్తమే ఉగాది
శాంతి సౌఖ్యాలకు పునాది
గోముఖ వ్యాఘ్రంలాంటి
"శ్రీముఖ" సంవత్సరం దాటిపోగా
"భావ" నామసంవత్సరం, అభ్యుదయ
భావాలతో ముందుకు రావాలని
స్వాగతం చెబుదాం–అందరం
జేజేలు పలుకుదాం.

# సింధునాగరికత వారసత్వం (యు)ఉగాది

రాంభట్ల కృష్ణమూర్తి

ఉగాది జనభాష. యుగాది పండిత భాష. యుగాది అంటే సంవత్సరాది అని అర్థం. యుగం అంటే సంవత్సరమా? కాదు. యుగం అంటే రెండు అని అర్థం. నిజమే కరయుగం, చరణయుగం, నయనయుగం అంటాం. యుగం అంటే జంట. ఏజంట అయితే మనకు సంవత్సరం అవుతుంది? ప్రశ్నకు జవాబు కావాలంటే మనం కాలగణన పద్ధతులను తెలుసుకొనవలసి వుంటుంది. దానితో పాటే మానవ చరిత్రను కూడా కాస్త పరామర్శించవలసి వుంటుంది. సంవత్స రాదిని తెలుగువారు మాత్రమే ఉగాది అంటున్నారు. మనతో పాటు కన్నడిగులు కూడా అంటున్నారు. ఎందువల్ల?

కాలగణనానికి ఒక భౌతిక ప్రయోజనం కనిపించిన తరవాత ఊహలు రెక్కలు కట్టుకుని గుర్రాల్లా దౌడు తీస్తాయి. అలా పుట్టినవే మన కృతత్రేతాది యుగాలు. ఈ ఊహా యుగాలను కాస్తపక్కకు పెట్టి మన సంవత్సర యుగాన్ని పరిశీలిద్దాం. భూమి ఆత్మ ప్రదక్షిణం ఒక రోజు. చంద్రుని భూప్రదక్షిణం ఇరవై ఎనిమిది రోజులని, పూర్వులు లెక్కగట్టారు. దానికినెల అని పేరు పెట్టారు. చంద్రుని కాంతి ఓ పధ్నాలుగు రోజులపాటు పెరుగుతూ వస్తుంది. దాన్ని తెలుగు జనం "పెంపు" అన్నారు. పండితులు శుక్లపక్షం అన్నారు. తరువాత కాంతి తరుగుతూ వస్తుంది. దాన్ని "చీకు" అన్నారు. పండితులు కృష్ణపక్షం అన్నారు.

ఒక్కొక్క పక్షాన్ని సగం చేసి దాన్ని వారం అన్నారు. అలాగ నెలకు నాలుగు వారాలు తయారయ్యాయి. చంద్రుని కూడా భూమిలాగే ఆత్మ ప్రదక్షిణమున్నది. ఆత్మ ప్రదక్షిణానికీ భూప్రదక్షిణానికి దాదాపు ఒకే సమయం పడుతుంది. అంచాతనే చంద్రునిలో ఎప్పుడూ ఒకే దిక్కు కనిపిస్తుంది. పెంపులో నిండు రోజు పున్నమి-చీకులో నిండు రోజు అమాస. పన్నెండు పున్నమి లైతే ఒక సంవత్సరం. మనిషికి తెలిసిన తొలికాలగణనం ప్రకారం ఏర్పడిన సంవత్సరం. పున్నమినాడు చంద్రునికి దగ్గరగా ఒక నక్షత్రం వుంటుంది. ఆ నక్షత్రం పేరునే ఆ మాసానికి పెట్టారు. చిత్రా పౌర్ణమి చైత్రం అయింది.

ఇలా చంద్రగతి నుంచి పుట్టిన కాలగణనాన్ని చాంద్రమానం అంటారు. ఈ చాంద్రమానం వ్యవహారానికి పనికివస్తుంది. అంచాతనే మనవాళ్ల "వర్తమాన వ్యావహారికే చాంద్రమానం" అని సంకల్పం చెప్పు కుంటూ వుంటారు. చాంద్రమానం నుంచి పుట్టిన వారాలు మాత్రం ప్రపంచ వ్యాప్తంగా చెలామణీలోనే వున్నాయి. చాంద్ర మానం వ్యవహారానికి సరిపోతుంది కాని దానివల్ల రుతువులూ కాలాలు లెక్కకట్టడానికి రావు. అంచాత భూమి సూర్యుని చుట్టూ ప్రదక్షిణ చేసే కాలాన్ని లెక్కగట్టి దాన్ని సంవత్సరం అన్నారు. అది సౌరమాన సంవత్సరం. దాని వల్ల ఋతువులు కాలాలు ఖచ్చితంగా తెలుస్తాయి.

వారాలు చొప్పున లెక్కవేస్తే సంవత్సరానికి నలభై ఎనిమిది వారాలు వస్తాయి. కాని మనం వారపత్రికకు చందా కడితే సంవత్సరానికి యాభై రెండు సంచికలు వస్తాయి. సంవత్సరం అంటే వర్తమాన ఆధునిక సౌరమాన సంవత్సరం. చాంద్రమాన వారాల వారీగా చూస్తే దానికీ సౌరమాన సంవత్సరానికీ ఒక చాంద్రమానం నెల తేడా వస్తుంది. చాంద్రమానం వ్యావహారికం. సౌరమానం పండిత వేద్యం. అంచాత యీరెండు మానాలకూ సమన్వయ సాధనకు యత్నాలు జరిగాయి. ఆరెంటి జంటనే యుగం అన్నారు. ఈ యుగం అయిదేళ్ల కొకసారి సాధ్యం అవుతుంది. అంచాత యుగపరిమాణం అయిదేళ్లు.

మనకు స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో పంచాంగ సంస్కరణ కోసం ప్రభుత్వం ఒక కమిటీనివేసింది. దానికి ప్రముఖ శాస్త్రవేత్త మేఘనాద సాహా అధ్యక్షుడు. దేశంలో నూటయిరవై రకాల పంచాంగాలు, నాలుగుమానాలు, నాలుగు యుగాలు అమల్లోవున్నట్లు ఆ కమిటీ వారు కనుగొన్నారు. వాటన్నింటినీ పరిశీలించి శాస్త్రీయమూ, చారిత్రకమూ అయిన జాతీయ పంచాంగాన్ని వారు రూపొందించారు. శకాల్లో శాలివాహన శకానికి

చారిత్రకతవుంది. మాసాల్లో చైత్ర వైశాఖాది మాసాలకు శాస్త్రీయత వుంది. సౌర సంవత్సరానికి శాస్త్రీయత వుంది. అది విషుద్దినాన మొదలు అనడం సమంజసం. రాత్రీ పగలూ సమానంగా వుండే రోజును "నిగువత్" అంటారు. మార్చి ఇరవై ఒకటి, సెప్టెంబరు ఇరవై రెండు అటువంటి విషువద్దినాలు. మన జాతీయ పంచాంగం ప్రకారం మార్చి ఇరవై రెండు సంవత్సరాది. అంటే చైత్రం ఒకటో తారీకు. సౌరసంవత్సరానికి మూడు వందల అరవై అయిదు రోజులుంటాయి. అంచాత వైశాఖం, జ్యేష్టం, ఆషాఢం, శ్రావణం, భాద్రపదం ఈ అయిదునెల్లకూ ముప్పయి ఒక్క రోజు చొప్పున మిగతా నెల్లకు ముప్పయి రోజుల చొప్పున వుంటాయి మన జాతీయ పంచాంగంలో.

మన దేశాన నాలుగు మానాలు అమల్లోవున్నాయి. అవి చాంద్రమానం, సౌరమానం, సావనమానం, నాక్షత్రమానం. అయిదేళ్లకు సౌరమాసాలు అరవై వుంటాయి. చాంద్రమాసాలు అరవై రెండు, సావన మాసాలు అరవై ఒకటి, నాక్షత్రమాసాలు అరవై ఏడు వుంటాయి. అంచాత చాంద్ర సౌరమానాలను చాంద్రమాన మాసాలను పెంచుతూ వచ్చారు. వాటిని అధిక మాసాలు అంటున్నాం. లెక్కలను సర్దుబాటు చేయడం కోసం పదిహేడు పదునెనిమిది సంవత్సరాల కొకసారి ఒక చాంద్రమాన మాసాన్ని తీసేస్తూ వుంటారు. అలా తీసేసిన మాసాన్ని క్షీణమాసం అంటారు. అధికమాసాల్లోవచ్చే శుభాశుభ తిథులను మనవారు పాటించరు.

కాలాలు కాలమానాలు తెలిశాయి. యుగం అంటే అయిదేళ్లు అని కూడా తెలిసింది. ఈ అయిదేళ్లకూ ప్రత్యేకమైన పేళ్లున్నాయి. యుగాది యేటిని "సంవత్సరం" అంటారు. ఇప్పుడు యీ మాటనే ఎక్కువగా వాడుతున్నాం. ఆ తరవాత వచ్చే యేళ్లను పరివత్సరం, ఇద్వత్సరం, అనువత్సరం, వత్సరం అని పిలుస్తారు. శాస్త్ర ప్రకారం యుగాన్ని పాటించడం లేదు కనక ఆ పేళ్లు వాడుకలోంచి పోయాయి.

అయిదేళ్లయుగాన్ని ఏడాదికి కుదించిన ఘనత మెసపొటోమియా నాగరికత నిర్మాతలది. వారు కాలగణనంలో చరిత్రకు తెలిసిన ఆద్యులు. వారిది షష్ట్యంశమానం. షష్టి అంటే అరవై. దీన్ని ఇంగ్లీషులో "సెక్సాజెసిమల్"అంటారు. కాలగణనంలో ఇది నేటికీ ప్రముఖస్థానం వహిస్తూనే వుంది. మన సంవత్సర చక్రం అరవై యేళ్లు. మనకే కాదు. చైనా, జపాన్ వారు కూడా దీన్నేపాటిస్తారు. అరవై ఏళ్లలో పన్నెండు యుగాలు వస్తాయి. చైనా వాళ్లు యుగానికొక జంతువు పేరున పిలుస్తారు. మనకు అరవై సంవత్సరాలకూ పేర్లున్నాయి. మన రోజుకు అరవై గడియలు. రెండుగడియలు ఒక ముహూర్తం. పదిహేను ముహూర్తాలు పగలు. సూర్యుని అర్ధోదయం నుంచి మూడు ముహూర్తాలు ప్రాతః కాలం దాన్నే ప్రాతస్సంధ్య అంటారు. ఆ తర్వాత ప్రతి మూడేసి ముహూర్తాలకు పూర్వాహ్ణం, మధ్యాహ్నం, అపరాహ్ణం సాయం సంధ్య అని పేర్లు.

ఇప్పుడు మెసపొటేమియా చరిత్రను రేఖా మాత్రంగా పరిశీలిద్దాం. నేటి ఇరాకు తూర్పు భాగాన యూఫ్రె టెస్ టైగ్రిస్ జీవ నదులున్నాయి. ఈ నదుల మధ్య భాగాన్ని గ్రీకులు మెసపొటేమియా అన్నారు. రెండు జలాల మధ్య భూమి, ద్వి+ఆప=ద్వీపం అని ఆ మాటకు అర్థం. కనక మనం దాన్ని లంక అని పిలుచుకుందాం. లంకలో క్రీస్తుకు పూర్వం ఆరో సహస్రాబ్దిలో సుమేరులనే జనం వుండేవారు. వారు గుళ్లూ గోపురాలు కట్టారు. శాస్త్రాలు కావ్యాలు రాశారు. పాఠశాలలు కళాశాలలు నడిపారు. రాజ్య తంత్రం, వైద్యం జ్యోతిషం ఆగమతంత్రం లాంటివి పెంపొందించారు.

వారి భాషకు తల్లీ తోడూ దొరుకలేదు. గోపురాల్ని వారు "మేరువు" లని పిలిచారు. ఈజిప్టు వారు గోపుర నిర్మాణాన్ని రాతను వీరి నుంచే నేర్చుకున్నారు. ఈజిప్టు వారు పిరమిడ్లను మేరువులనే పిలిచుకున్నారు. పిరమిడు అన్నది గ్రీకు మాట. దానికి పొంగరం అని అర్థం. గోపుర నిర్మాణంలో సిద్ధ హస్తులు కనక సుమేరులన్నది వారి బిరుదనామం అయివుండవచ్చును. సుమేరులు తమ భాషలో తమ దేశాన్ని "ఎంగి" అనీ తమను ఎంగిర్లనీ చెప్పుకున్నారు. ప్రాచీన సమాజం గణాలు వ్రాతాలుగా వుంటుంది. ఎంగిర్లు కూడా కొన్ని వ్రాతాలవారయినట్లు కనిపిస్తుంది.

ఒకవ్రాతం ఒక ప్రాంతాన స్థిర పడగానే తమ వ్రాత దేవరకు ముందు గుడి కట్టేవారు. గుడి అర్చకునికి "సంగ" అని పేరు. గుడి నిర్వహణకు ముప్పయి రకాల సంగులుండేవారు. ఇతర సామాజిక వ్యవహారాలు చేసే పెద్దను "ఎన్సీ" అనేవారు. సాగు భూమిని క్షేత్రాలుగా విభజించి ఉగాదినాడు సంగులు ఎన్సీ

ఉద్యోగులూ గ్రామప్రముఖుల సమక్షంలో పాచికలు వేసి క్షేత్రాలను పంచేవారు. ఆ రూపాయంటు మూడు హెక్టేర్లభూమి ఒక క్షేత్రం. ఆ పరిమితిని సుమేరు భాషలో "పురం" అనే వారు. పురం భూమిని సంపాదించినవారినే మన వాళ్లు పౌరులనే వారనుకుంటాను.

భూమికిపన్నూ శిస్తు ఒకటే. దాన్ని యేటా గుడికి అప్పగించాలి. యీ విధంగా వచ్చిన ఆదాయాన్ని ఉమ్మడి వ్యవసాయ పనులకు, సామాజిక నిర్మాణాలకు జనహిత కార్యాలకు జాతి కీర్తిని చాటేందుకు ఉపయోగించేవారు. సంగులు, పౌరులు, ఇతర సమాజసేవకులు నర్తకులు అంతా గుడి చుట్టూ ఇళ్లు కట్టుకునే వారు. అలా ఏర్పడ్డ బస్తీకి "ఊరు" అని పేరు. వ్యవసాయపనులు చేసేవారంతా కొన్ని క్షేత్రాలకు కలిపి ఒక పల్లె కట్టుకునేవారు. అలాంటి పల్లెలకు "ఆల"లనిపేరు. ఇండో యూరోపియన్ భాషలను ఆర్య భాషలనీ హెమిటో సెమెటిక్ భాషలను మ్లేచ్ఛ భాషలనీ సౌలభ్యం కోసం వాడుతున్నాను.

మూడు సహస్రాబ్దాలపాటు అక్కడ ఎంగిర్ల ప్రాబల్యం సాగింది. ఆ తరవాత అది సన్నగిల్లింది. తరవాత, అగ్గడులు, అసురులు, బాబిలన్లు, కసయిట్లు అధికారానికి వచ్చారు. మైతానులు, భృగుపులు, మీదులు, పారసీకులు, గ్రీకులు కూడా ఆ ప్రాంతాన్ని పాలించారు. వీరంతా ఆర్యులు. అసురరాణి "శంబరమాత" ఏలుబడిలో ఒక పెద్ద బృందం, తృతీయ సహస్రాబ్దిలో ఎంగిర్ల నాయకత్వాన మరో బృందం భారతదేశానికి వలస వెళ్లిన చారిత్రకాధారాలు అక్కడ కానవస్తున్నాయి. తొలి బృందం వచ్చినప్పుడు యీ దేశానికి జంబూ ద్వీపం అనీ మలిబృందం వచ్చినప్పుడు దీనికి అజనాభం అనీ పేరు వచ్చి వుండవచ్చును.

లంకలో అసురులు రాజ్యం చేసినప్పుడు "సావనమానాన్ని" ప్రవేశపెట్టారు. ఆమానం ప్రకారం నెలకు ముప్పయి రోజులు. ఆరువారాలు. వారానికి అయిదు రోజులు. ఈ లెక్కన పన్నెండు నెల్లకూ మూడు వందల అరవై రోజులవుతాయి. సౌరమానానికి అయిదు రోజులు అంటే ఒక వారం తక్కువ. ఈ అయిదు రోజుల్నీ ఉగాది పండుగగా ప్రకటించారు. ఆ రోజులకు కాలంలో లెక్కలేదు. సామాజిక ధర్మ శాస్త్రాల్లేవు. రాజధర్మ శాస్త్రాల్లేవు. ఈడూ జోడూ కలిసిన వారు జతకట్టేవారు. కానవచ్చింది తినే వారు తాగేవారు-ఇలాంటి దాన్ని రోమన్లు "శాతర్నాలియా" అనేవారు.

సుమేరు భాషలో "సగ్" అంటే తల. తల వారీ పంపిణీ కోసం పాచికలు వేసేవారని తెలుసుకున్నాం. తెలుగులో పాచికలాటను "సొగటాలు" అంటారు. బహుశా ఇది సుమేరు పదమే అయి వుంటుందేమో! సొగటాలు వేయడానికి ముందు గుళ్లో దేవునిముందు అధిపతిని చెంపలు వాయిస్తాడు పురోహితుడు. ఆ తరవాత జనం అతడిని యాగీ చేసేవారు. ఈ పద్ధతిని అసురులు మార్చారు. ఉగాదికి రెండు వారాల ముందు తమ ఆస్థాన పండితునికి కిరీటం పెట్టి రాజ్యాన్ని అప్పగించేవారు. అతడిని మన వాళ్లు "వర్షోపాధ్యాయుడు" అన్నారు. ఇంగ్లీషు వాళ్ళు "ఈపోనిమస్‌కింగ్" అన్నారు.

వర్షోపాధ్యాయ పదవిని మహా పండితునికే యిచ్చినా వారం రోజుల్లోనే అతడికి పరమ మూర్ఖుడు అనే ముద్ర పడిపోయేది. మన తెలుగులో వున్న ప్రభవ, విభవాది సంవత్సరనామాలకు ఒక కథ వుంది. ఆ కథను బట్టి వాళ్లంతా "వైధేయులు". వైధేయులంటే మూర్ఖ జనం అని అమర నిఘంటువంటిది. మన సంవత్సరాల పేర్లలో కొన్ని అసురనామాలు కూడా కనిపిస్తాయి. 'పండుగ నాడూ పాత మొగుడేనా' అన్న సామెతా, రవికల పండుగులు యీ ఉగాది ఉత్సవాల నుంచే పుట్టి వుంటాయి. కొత్తగా వచ్చిన భూములకు సౌభాగ్య వర్ధనం చేసే పద్ధతి. అది ఆనాడు.

నా చిన్నతనంలో రెండు ఉగాదులకు నేటి విజయనగరం జిల్లా గజపతి నగరంలో వున్నాను. ఉగాదినాడు ఆబాలవృద్ధం దేవాలయంలో చేరి జూదం ఆడుతూ వుండేవారు. నా యీడు వాళ్లతో నేను కూడా చింతపిక్కలతో పందేలు ఒడ్డి పేకాట ఆడాను. శ్రీమంతులు ఆరోజున ఇంటికి వచ్చిన అల్లునికి "జూదర కట్నం, భోగం కట్నం" ఇచ్చేవారని తరవాత విన్నాను. మెసపొటేమియాలో పుట్టిన యుగాది పండుగ వేదాలకు పూర్వమే సింధు పంజాబులకు వచ్చి అక్కడి నుంచి త్రిపుర దాహంతో చెల్లా చెదరయింది.

చెల్లాచెదరయిందేకాని అంతరించలేదు. తెలుగువారూ కన్నడిగులు సింధు నాగరికత వారసులుగా యుగాదిని కాపాడుకుంటూనే వున్నారు. పడమటిలు చరిత్రను పరిశీలిస్తే తప్ప మన వారసత్వం అట్టుముట్టు ఆనవాళ్లు బైటపడవు.

• • •

# ఉగాది వేళలో తెలుగు తల్లి!

డా॥ యస్.టి. జ్ఞానానందకవి

అనవద్య గుణుడు విద్యారణ్య ఋషిమౌళి
యాశీస్సు తెలుగులకాత్మకాగ
హరిహర బుక్కరాయల సోదరుల దృష్టి
తెలుగుబాటకు జగావెలుగుకాగ
ముసునూరి కాపయ్య సిసలైన శౌర్యమ్ము
తెలుగు జాతికి గొప్ప దిక్కుకాగ
మహితమేధావి తిమ్మరుసు మహామంత్రి
తెలుగు మాగాణకు తెరువుకాగ
కృష్ణదేవరాయునిద్ధమహాశక్తి
కడిది తెలుగులకు సిడముకాగ
తొల్లి తెలుగు జాతి నెల్లనేలిన రీతి
నిలుపునేడు మఱల తెలుగుతల్లి!

"తెనుగున్ జాతిక దృష్టహీనమగు తేదీ యేదియో శాతవా
హనరాజన్యులనుండి నేటిదనుకన్ ప్రారంభశూరత్వమే
కనిపించెన్ పిసరంతయైన సమతాగంధమ్ము వాసింపదీ
యనుగుంబిడ్డల యందునీ వెటులనవ్మా
కాచెదాంధ్రేందిరా!"

కనిపించునెదుర మెప్పునుగొన్న తెలుగన్న
నయజీవితమున హుందాతనమ్ము
తినిపించు పరులు తృప్తింబొంద తెలుగన్న
యాతిథ్యమందు మర్యాద గరిమ
వినిపించునోరులు విన్నునసరే తెలుగన్న
నిజముదాచని మేల్మి ఋజుతనమ్ము
అనిపించు పరులచేతనుగూడ తెలుగన్న
మాటలోచేతలో మాన్యుడనుచు
"నీసుతాళికీర్తి భాసురజ్యోతులు
నిఖిలదిక్తటములు నిండిన వియ
కాని సహనశక్తి కాని పింపదదేమి?
దివ్యకల్పవల్లి! తెలుగుతల్లి!"

"నీ పావిత్ర్యపు సచ్చరిత్రమునకున్ నీరాజనంబిచ్చినా
రోపృథ్వీజనముల్ మహాంధ్రజననీ! యూహింపనట్లైనచో
ఆపైతీయనితీరుతీయములు స్నేహ శ్రీలు పొంగారగా
నీపుత్త్రాళి హృదంతరాళముల నిండింపించు మశ్రాంతమున్."

వరుసగ రెండువేలయిదు వందల యేడులనుండి నీ మహా
చరితకు దర్పణంబయిన సంస్కృతి యెట్టుల జీర్ణమౌచునే
డ్తెరనెటులీ తెలుంగులకు డెప్పరమున్ కలిగించెనో వసుం
ధరనదినీ వెఱుంగుదువు నందనులన్ సవరింపగా వలెన్"

బూజుంబట్టిన ప్రాత పద్ధతికి తావుల్లేని యీవేళ రా
రాజుల్నీప్రియనందనుల్ వినయధౌరం ధర్యులవ్వారునీ
తేజఃకీర్తికి దోయిలించుటలు దిగ్దేశాయి శ్లాఘించెనీ
రోజున్నేర్పు ముని కుమారులకు సర్దుంబాటు శ్రాంతిక్షమన్,.

ఆంధ్రులౌదార్య దివ్యజీవనముగాంచి
ప్రస్తుతింజేసె "మెగస్తనీసు"
స్వచ్ఛాంధ్రవిప్రవేదోచ్చారణమువించు
మురిసె "రాజారామమోహనుండు"
అతిమధురమ్ము మహాంధ్ర వాఙ్మయమంచు
నాప్పారవలికె "ఫిలిప్పుబ్రౌను"
ఆంధ్రుల త్యాగ దీక్షాసక్తి తిలకించి
హర్షించెవార్ధా మహాతపస్వి

"ధీరచరితుడయిన మూరురాయరగండ
డనియెదేశభాషలందు తెలుగు
లెస్సయనుచునదొక భిస్సగా నానాటి
దీప్తి నిలుపునేడు తెలుగుతల్లి!"

"నీ యౌన్నత్యమునీ ప్రశస్తి జగతిన్ నిండారగాజేయుటే
ధ్యేయం బైనది తెల్గులందఱకు పోయ్యేగాట పుంజీకటుల్
శ్రేయంబుల్ సమకూర్చు సత్ప్రథకముల్ శ్రీలిచ్చు బల్వెన్నెలల్
పూయంజొచ్చెను సంతసమ్మగు గుణాంభోరాశి! ఆంధ్రావనీ!"

"ఈనాడాంధ్రుడు విశ్వమానవుడుతల్లీ! విశ్వసాహిత్య స
న్మానంబందగలట్టి ధీచతుర తామాన్యుండుసుమ్మీ! జగత్
గ్లానిన్ మాన్పెడు దివ్య సంస్కృతికి నర్థస్థానముంగల్గునీ
సూనుండభ్యుదయ ప్రతోళి పయనించుగాక! యాంధ్రవనీ!"

నాగార్జునాచార్య సాగర శీతల
జలశీకరములకు పులకరించి
గౌతమీగంగా పునీత తీర్థములలో
సంతోషముబుకంగ జలకమాడి
వంశధారా సుధావాహినీ స్వాగత
మందార పత్రాల నందుకొనుచు
ఇవల పెన్నానదీ కవితాది పంచికా
రాగాల భాగాల తీగెమీటి

భువనరంగమునకు భుక్తి వెట్టెడునన్న
పూర్ణయనెడు బిరుదమును వహించి
కల్లలెఱుగనట్టి యిల్లాలివగునీకు
వలపు జోతలగుత! తెలుగుతల్లి!"

# భారత ఇతిహాసంలో ఆంధ్ర దేశం

జి. కృష్ణ

మా స్నేహితుడు శ్రీ చీమకుర్తి శేషగిరిరావు ఇటీవలి కాలంలో "తెలుగులో పాలీ పదాలు" అనే గ్రంథం వెలయించాడు. పాలీ భాషలో బౌద్ధ సాహిత్యం ఉంది. బుద్ధుడు ఇట్లా అన్నాడు, అట్లా అన్నాడు అని ఎన్నో విశేషాలు చెప్పే సాహిత్యం యావత్తూ పాలీ భాషలోనే ఉంది. బుద్ధుడు పాలీ భాషలోనే మాట్లాడేవాడో, అర్థ మాగధిలో మాట్లాడే వాడో!.... ఏమయినప్పటికీ మన తెలుగులో నేటికీ వాడకంలో ఉన్న అనేక శబ్దాలను బుద్ధుని కాలంలో దైనందిన వ్యవహారాలలో ఉపయోగించారు అని విదితం అవుతున్నది. తెలుగు భాషపట్ల ఎంత భక్తి ఉన్నప్పటికీ, తెలుగు లోంచి పాలీ వచ్చిందీ, పాలీలోంచి తెలుగు వచ్చిందీ అనే చర్చ చేయటానికి ఆధారాలు లేవు కాబట్టి, ఇప్పటికీ పాలీలో కానవచ్చిన పాలీ పదాలు 69 అని మాత్రమే చెప్పుకోవాలి.

పైశాచీ భాషలో చాలా తెలుగు పదాలు ఉన్నవని పండితులు ఇదివరకే చెప్పారు కదా. మిత్రుడు శ్రీ తిరుమల రామచంద్రకు పైశాచీ భాషపట్ల మక్కువ. అతడెవ్వరో కొరియా యాత్రికుడు.... బౌద్ధుడు....ఆరవ శతాబ్దంలో భారతదేశానికి, చైనా, అఫ్గానిస్తాన్ ల మీదగా వచ్చాడు. అతడికి ప్రాకృత భాష ఏదో వచ్చును. కైబర్ కనుమనుండి, శ్రీ పర్వతం(నాగార్జున కొండ) వరకు, తనకు వచ్చిన ప్రాకృత భాషలోనే మాట్లాడుతూ పయనించానని వ్రాసుకున్నాడు. జనాలకు తను మాట్లాడే ప్రాకృతం చక్కగా అర్థం అయిందట. భారతీయ భాషలో మాట్లాడితే, భారతీయులలో అన్ని ప్రాంతాల వారికీ అర్థం అయిందని అతడు చెప్పాడు అనుకోవాలి (అప్పట్లో ఇంగ్లీషు లేక పోయినా!)

ఇంకొక స్నేహితుడు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, ఈ మధ్య ఒక సుమేరియన్ శబ్దకోశం, ఒక భాగం కొనుక్కొచ్చాడు. మొత్తం పలభై భాగాలు ... ఒక్కొక్క భాగాన్నీకొనటానికే దాదాపు ముప్పయ్ డాలర్లు కావాలి. ఎవళ్ళయినా ఒక విశ్వవిద్యాలయం వాళ్ళు కొనాలి. కానీ మన విశ్వ విద్యాలయాలకు పెద్దగా విజ్ఞానాసక్తి లేదు. డిగ్రీల దుకాణాలకు విజ్ఞానాసక్తి పట్టే, విద్యార్థులకు భవిష్యత్తు ఉండదనే భయం కలుగుతుంది. దేశంలో అలజడి వ్యాపిస్తుంది.

మేము ఒక పది మందిమి ప్రతినెలా "తెలుగు గోష్ఠి" అనే ఒక చర్చా సమావేశం జరుపుతూ ఉంటాం. మాలో కొందరికి పెద్దల పెద్దరికం పట్ల ఉన్న గౌరవం, వాళ్ళ రచనలపట్ల లేదు. ఆ గోష్ఠికి ఒకనాడు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి ఒక భాగం "సుమేరియన్ శబ్దకోశం"తో వచ్చిపడ్డాడు. తుర్కీ నుండి గంగా మైదానం వరకూ ఏదో ఒక ఉమ్మడి నాగరికత, ఒక కాలంలో ఉండేది. భాషలు ఒక దాని నుండి ఒకటి ఇచ్చిపుచ్చుకున్నాయి. సుమేరియా శబ్దాలు మన భాషలలోకి వచ్చి పడినాయంటాడు శ్రీ కృష్ణమూర్తి. అంతేగానీ, వాళ్లు వీళ్లపైన దండయాత్రలు, వీళ్ళు వాళ్ళపైన దండయాత్రలు చేయలేదని, దాని తాత్పర్యం. పైగా అందరూ ఒకే నాగరికతకో, ఒకే సంస్కార సరళికో చెందినవారై ఉంటారు.

కిందటి శతాబ్దాంతంలో జరిగిన ఒక ముచ్చటను నెమరువేసుకుందాం. మన దేశాన్ని పరిపాలించటానికి బ్రిటిష్ ప్రభుత్వం వాళ్ళు కొందరు యువకులకు శిక్షణ ఇచ్చేవారు. ఆ శిక్షణను పొందిన వాళ్ళు ఐ.సి.ఎస్. అధికారులు. శిక్షణాలయంలో గొప్పవాళ్లచేత ఉపన్యాసాలు ఇప్పించేవాళ్ళు. అట్లా ఉపన్యాసం ఇచ్చినవాళ్లలో మాక్స్‌ముల్లర్ ఒకడు. ఆయన ఆర్య, ద్రావిడ జాతులను గురించి ప్రస్తావించాడు. మరికొన్నేళ్ళు అయిన తర్వాత మళ్లీ ఉపన్యసిస్తూ, పొరపాటున "ఆర్య, ద్రావిడ" జాతులని చెప్పినాననీ, "ఆర్య, ద్రావిడ" నాగరికతలని వాడి ఉండవలసినదనీ ఆయన తన తప్పును దిద్దుకున్నాడు. కానీ అప్పటికే ఈ దౌర్భాగ్య భారతీయులను భాష, జుట్టు, అస్థులు, చర్మం వగైరాల ఆధారంగా, శాస్త్రీయంగా, ఆర్య, ద్రావిడ అనే జాతుల కింద విభజించడం జరిగిపోయింది కాబట్టి, ఇక ఆ తప్పును దిద్దుకునే వీలు లేదని పెద్దలు చెప్పేశారు. రాజకీయాలకు విజ్ఞానశాస్త్రాన్ని ఉపయోగించివేయడం జరిగిపోయింది.

అయితే, ద్రావిడులనే వాళ్ళు కూడా ఆర్యుల కంటే కొన్ని వేల సంవత్సరాలకు ముందు భారత దేశానికి మధ్యధరా సముద్ర ప్రాంతం నుంచి వచ్చినారని, బ్రిటిష్ సామ్రాజ్యవాద విజ్ఞాన శాస్త్రం చెప్తోంది. "ఆర్య, ద్రావిడ" విభజన విజ్ఞానాలలో

భారతీయ పండితులు సంకటంలో పడ్డారు కానీ, కొన్ని సంగతులు తేలక ఊరు కున్నారు. ద్రావిడులు ఈ దేశానికి రాకముందు భారతదేశంలో ఎవ్వరు ఉండేవారు అనేది ఎట్లా తేల్తుంది.

ఇట్లా చాలా చాలా విశేషాలున్నాయి. అసలు సంగతి ఏమిటంటే..... భారత భాషలలో తెలుగు ఉండేది. దాదాపు రెండు వేల ఏళ్ళ కిందటనే బౌద్ధ సాహిత్యాన్ని ఆంధ్ర, తమిళ భాషలలోకి అనుదించారు. ఆ భాషలలో నాటకాలు కూడా వేసేవారు. అప్పట్లో ఎవ్వరూ జననీ తమిళభాషా అని అనలేదు.

వేద కాలపు సంస్కృతం ఇతర దేశాల శబ్దాలను స్వీకరించింది.... తన శబ్దాలను ఇతర దేశీయులకు పంచింది. లౌకిక సంస్కృతం ప్రాకృతులనుంచి అనేక శబ్దాలను స్వీకరించింది. కాబట్టి సంస్కృతంలో చాలా తెలుగు శబ్దాలు చేరి ఉంటాయి. నేటి కాలంలో తెలుగులో సంస్కృత శబ్దాలు దేనికి వాడాలి అని వాదించే మేధావులు పుట్టుకొచ్చారు. అసలు సంగతి ఏమంటే, సంస్కృతంలో మన శబ్దాలున్నాయి. సంస్కృతం అఖిల భారత భాష.

ఇప్పటి బోధన్... ఒకప్పుడు పోదనం... ఒకప్పుడు ఏదో పెద్ద విద్యాలయ ప్రాంతం. బావరీ గోత్రానికి చెందిన ఒక వృద్ధుడు ఆ విద్యాలయ అధిపతి. ఇది బుద్ధుడు జీవించి ఉన్న కాలం నాటి మాట. బావరీ శిష్యులు దాదాపు వెయ్యిమంది రాజగృహ ప్రాంతానికి (పాటలీ పుత్ర ప్రాంతానికి) వెళ్ళారు. బుద్ధుని కలుసు కున్నారు. అతడి తత్వాన్ని తెలుసు కున్నారు. వెళ్లిన వెయ్యిమందిలో ఒక చిత్రకారుడూ ఉన్నాడు. అతడు తెరవెనక మాట్లాడుతున్న బుద్ధుని బాహ్యరూపాన్ని గీచుకోగలిగాడు. తర్వాత ముక్కు, నోరూ, కళ్లు వగైరా వివరాలు నింపుకోవచ్చుననే నమ్మకంతో సరిగా అట్లానే జరిగింది. ముక్కు, నోరూ, కళ్ళు నొసలు వగైరాలను శిల్పులు తమ ప్రాంతానికి తగినట్లు నింపేస్తున్నారు. అఫ్గానిస్తాన్ వాళ్లు, చైనా, జపాన్, బర్మా, ఇండోనేషియా, భారతదేశ ప్రాంతాలు, ఎవళ్ల కనుముక్కు తీరున వాళ్ళు ఆ స్థూల రూపంలో నింపుతున్నారు. ఇంతకూ బుద్ధుని విహార (బిహార) భూమిని ఆంధ్రకు విస్తరింప జేశారు. బుద్ధుని విచార ధారకు బావరీ విచారధార తోడై కొన్ని వందల సంవత్సరాలు చర్చాంశంగా నడిచిఉంటుంది. ఏదైనా ప్రజా గోష్ఠులలోకి వచ్చినప్పుడే దానికి వ్యాప్తి.

ఈ లోగా శ్రీ పర్వతానికి తూర్పున ఉన్న వేదవి అనే కుగ్రామంలో నాగార్జునుడు పుట్టాడు. అతడు పండితుడై, ఈ చర్చల సారాన్ని గ్రహించుకున్నాడు. అంతే.. అద్వం, శూన్యం, విజ్ఞానం, బోధిసత్వ ప్రభృత భావాలన్నీ జనాలలోకి వచ్చి పడ్డాయి. (అవే తర్వాత తర్వాత అద్వైతం, మాయావాదం, నేతివాదం, అవతారాలు వగైరాలైనాయి.) బౌద్ధం మహాప్రచారం లోకి వచ్చి మహాయాన బౌద్ధం రూపొం దింది. మహాయాన బౌద్ధానికి పురిటి గడ్డ ఆంధ్ర దేశం. ప్రపంచంలో బాగా వ్యాప్తి చెందింది ఈ మహాయాన బౌద్ధమే. నాగార్జునుడు ఒక కొత్త ఆలోచనకు పునాది వేశాడు. అతడికి శాతవాహనులు తోడ్పడ్డారు. ఒక శాతవాహన చక్రవర్తికి అతడు ఆప్తుడు అని తేల్తున్నది. అతడికి "సుహృల్లేఖ" అని ఒక జాబు కూడా వ్రాసుకున్నాడు, నాగార్జునుడు.

శాతవాహన చక్రవర్తులు బౌద్ధులు కారు. కాని బౌద్ధానికి చాలా చేయూత నిచ్చారు. నేర నిరోధక చర్యలకు, నీతి ప్రతిష్ఠాపనకు బౌద్ధ ధర్మం చాలా ఉపకరించినదని పరిశోధకుల మాట. శాతవాహనులు దాదాపు సగంపైగా భారత దేశాన్ని పరిపాలించారు. అందువలన ప్రభుత్వ శాసన రూపంలో ఒదిగిన బౌద్ధం, దేశంలో చాలా భాగం అమలులోకి వచ్చి ఉంటుందని తేలికగా ఊహించవచ్చు.

బౌద్ధమతం, శాతవాహనులకు మొదటి నుంచీ ఆదర్శం సమకూర్చి ఉంటుంది. శాతవాహనులు మొదట "ఆంధ్ర భృత్యుల" అనే పేరుతో పాటలీ పుత్రంలో ఉన్నారు. గుప్త చక్రవర్తులకు సామంతులో, ప్రధాన అధికార వర్గంలోని వారో మొత్తానికి సామ్రాజ్యంలో ముఖ్యులు. ఆపైన సిముక సాతవాహనుడు, దక్షిణాపథానికి దిగివచ్చి, చక్రవర్తి అయ్యాడు. అతడి తండ్రి, తాతలు కూడా మంచి అధికారమే అనుభవించి నాడంటారు. పురాణాలలో ఆంధ్ర భృత్యుల ప్రసక్తి ఉంది. వాళ్ళ వంశావళి కూడా ఉన్నది. కాకపోతే ఆంధ్రులు అన్నారే కానీ, ఆంధ్రభృత్యులు అనలేదు. పురాణాలను ఆ కాలం పండితులు ఎక్కడో పాటలీపుత్ర ప్రాంతంలో ఉంటూ రచించి ఉంటారని ఊహ.

ఇంతకూ సాతవాహనులు తర్వాత శ్రీ పర్వత ప్రాంతనుంచి పరిపాలించిన రాజవంశం "ఇక్ష్వాకులు". వాళ్ళు పాలిం చినది చిన్న ప్రాంతం. శతాబ్దానికి కొంచెం ఎక్కువ కాలం మాత్రమే. కాని వాళ్లు రూపొందింపజేసిన శిల్ప సంపద బోలెడు. ఇప్పటికీ కొంత భాగం నాగార్జున కొండవద్ద చూడవచ్చు. ఈ శిల్పాలను చూసి డాక్టరు కె. కృష్ణమూర్తి ఆనాటి క్రీడలను, ఆనాటి దుస్తులను, ఆనాటి సాంఘిక పరిస్థితులను వివరిస్తూ పఠనీయ గ్రంథాలు రచించాడు. ఇక్ష్వాకుల, సాతవాహనుల

కాలపు సాహిత్యం, శాసనాలు అనేకం. ప్రాకృత భాషలో ఉన్నాయి శాసనాలు. వాటిని ఒక క్రమంలో ప్రచురించి వివరించే ప్రయత్నం ఇప్పటికీ జరుగలేదు.

శ్రీ పర్వతానికి దేశదేశాల బౌద్ధులు, పండితులు వచ్చేవారు. అక్కడ ఒక విశ్వ విద్యాలయం ఉండేది. అక్కడ నుంచి బౌద్ధం వ్యాపించింది. అక్కడనే మహా యాన బౌద్ధం కాక, వజ్రయాన బౌద్ధం రూపొందినాయి. టిబెట్టులోని బౌద్ధంవజ్రయాన బౌద్ధమే.

ఇన్ని విశేషాలను బాగా తెలియజెప్పే పరిశోధన మాత్రం లేదు.

ఆ కాలంలో ఆంధ్రులు అనేక దేశాలతో సముద్ర వ్యాపార సంబంధాలు కలిగి ఉండేవారు. ఇక్ష్వాకుల కాలంలో శైలీయులు అనే బౌద్ధ శాఖ ఉండేది. పూర్వశైలీయులు అనీ, అపరశైలీయుల ని. ఇక్ష్వాకుల రాజవంశం అకస్మాత్తుగా అంతమయింది. ఏమయినారందాం. కొద్ది సంవత్సరాలలో ఈ శౌలీయులు (శైలేంద్రులు) ఇండోనేషియాలో రాజ్యం చేయనారంభించారు.

మన ప్రాకృత సాహిత్యాన్ని చాలా వరకు విదేశాల పండితులు, ముఖ్యంగా జర్మనీ వాళ్ళుకొనుక్కున్నారు. ఇప్పటికీ అక్కడ పది పన్నెండు విశ్వవిద్యాలయా లలో ప్రాకృత భాషలపైన పరిశోధనా సౌకర్యాలున్నాయి.

ఇతిహాసం కాల గర్భంలో కలుస్తూ పోతుంది. కానీ వీలైనంత వరకూ దానిని తెలుసుకొనటానికి మానవుడు యత్నిస్తూ ఉంటాడు. ఆ కొంచెం యత్నం కూడా కానరావడం లేదు.

జైనం ఈప్రాంతంలో చేసిన సేవను గురించి పరిశోధకులు అట్టే ఆసక్తి వహించ లేదు. జైనులు ఎక్కడుంటే అక్కడ, ఆ ప్రాంతీయ భాషను క్రమబద్ధం చేయటానికి తగు సూత్రాలు రూపొందించారు. జనాలకు చదువులు చెప్పారు. గణిత శాస్త్రాన్ని నలుగురికీ అందుబాటు చేశారు. ఇట్లా చేయడంలో కొన్ని నమ్మకాలు వ్యాప్తి అయ్యేటట్లు చేశారు. వీళ్ళ ఆలయాలలో గీతాలు పాడారు. ఆ గీతాలు కొన్ని భాషా చరిత్రను అర్థం చేసుకొనటానికి ఉపకరిస్తాయి. బౌద్ధులు కూడా చదువులపట్ల ఆసక్తి వహించారు. జైనులు, బౌద్ధులు శిల్పాన్ని ప్రోత్సహిం చారు. బౌద్ధుల మూలాన జనాలకు గ్రంథ పారాయణ అలవాటు కలిగింది. వాళ్ళు బోధి సత్వుని కథలు పారాయణ చేసేవారు.

ఆంధ్ర దేశపు జైనులకు ఒకటి రెండు ప్రత్యేకతలున్నాయి. అవి ఇతర ప్రాంతాల వారికి ప్రబోధాత్మకమైనవి అనవచ్చు. కేవలం సన్యాసులకు, బ్రహ్మ చారులకు పరిమితమైన బౌద్ధ ప్రచారాన్ని ప్రజలందరూ అనుష్ఠించదగు, ఆచరించదగు మతంగా నాగార్జునుడు తీర్చిదిద్దినట్లు, ఆంధ్ర దేశంలో జైనాన్ని కూడా సంస్కరించారు. ఇది కాక, శ్వేతాంబరులకూ, దిగంబరులకూ సయోధ్య కుదర్చటానికి ఇక్కడివారు కొందరు యత్నించినట్లు కనపడుతుంది. (యాపనీయులు).

ఇక్కడ ఊళ్ళ పేర్ల చరిత్రను శోధిస్తే కూడా కొన్ని విశేషాలు తెలుస్తాయి కానీ, కొత్తగా దేన్ని అయినా కనుక్కోవటం, విద్యా పరిశోధనల లక్ష్యం కాదు కాబట్టి, ఊళ్ల పేర్లకు సంబంధించిన విజ్ఞానం విద్యకు తోడ్పడం లేదు.

కానీ బాహ్యుబలి విగ్రహం లాంటివి బోధన్ లాంటి జైన కేంద్రాలలో ప్రతిష్ఠించారనేది విదితం – వాటిని చితక కొట్టారు కూడాను.

ఏది ఏమైనప్పటికీ ఇక్కడ బ్రాహ్మణమతానికి సంస్కరణగా బౌద్ధ,జైనాల ఆచారాలు చాలా వచ్చిపడి నాయి. నూతన బౌద్ధానికి ఇది పుట్టిన చోటు కాబట్టి, ఈ మార్పులు ఇక్కడినుంచే దేశానికి అంతటికీ వ్యాపించినాయనవచ్చు. ఎన్నిమార్పులు వచ్చినా బ్రాహ్మణమతం పేరు మాత్రం మిగిలి ఉంది అనేది విశేషం.

దాదాపు శాతవాహనులు పరిపాలించి కొంత దేశభాగాన్ని, విష్ణుకుండినులు కూడా పరిపాలించారు వారి రాజధాని నల్లగొండ జిల్లాలోని ఇంద్రపాలనగరం... అది నేటి కాలంలో ఏ ఊరు? ... ఆ గ్రామ పరిపాలకుడు తరతరానా తన బిరుదును ప్రకటించుకునేవాడు... "ఇంద్రపాల్" అని ఆ బిరుదు... నేటి తుమ్మలగూడెం గ్రామం. విష్ణుకుండిన రాజ్యంశాన్ని గురించిన శాసనాన్ని బి.ఎన్. శాస్త్రి కను గొన్నాడు. కనుగొన్నాడు కానీ, ఆ రాజుల పరిపాలన నేడు ప్రాముఖ్యం లోకి వచ్చిన క్షేత్రాలకు, వాటికి గల నేటి పేర్లను కనుగొనే ప్రయత్నం జరగలేదు. డాక్టరు అజయ్ మిత్ర కొంత కృషి చేశాడు.ఆ పైన ఏమి జరిగిందో తెలియదు.

ఆంధ్ర ఇతిహాసంలో ప్రధానంశం ఏమిటంటే, ఎవరైనా వచ్చి, ఇక్కడి విశేషాలను విశదం చేయటానికి పరిశోధన చేపట్టే బాగుంటుంది. భారతదేశం అంటే రాష్ట్రాల సమ్మేళనం. రసికత్వంలో చెప్పాలంటే రాష్ట్రగుచ్ఛం...రాష్ట్రమాల... రాష్ట్రబృందం... ఒక విధంగా చూస్తే, దేశం అంతా రాష్ట్రాలే. ఈ రాష్ట్రాలన్నీ కలిసి, మన దేశం. ఏ రాష్ట్రానికీ మిగతా రాష్ట్రాలకు భిన్నమైన ప్రత్యేకతలేదు.

భారతరాజధాని ఢిల్లీలోనే ఆంధ్ర

ఇతిహాసానికి చెందిన కొన్ని విశేషాలను సేకరించవచ్చు. తుగ్లుకాబాదు ప్రాంతంలో ఒక ఆంధ్ర ప్రముఖుని గోరీ కానవస్తుంది. పేరు మాలిక్ మక్బూల్. తుగ్లక్‌ల ప్రధానమంత్రి అసలుపేరు గన్నయ. అప్పుడు కాకతీయుల ప్రధానమంత్రి. చాలా ప్రయోజకుడట.

మరి ఆరు శతాబ్దాలు గడిచిన తర్వాత ఆంధ్రులు కొందరు భారతగణ రాజ్య అధిపతులైనారు... డాక్టరు రాధాకృష్ణన్, శ్రీ వి.వి. గిరి, శ్రీ నీలంసంజీవరెడ్డి. ఇటీవలికాలంలో ఒక ఆంధ్రుడు ప్రధానమంత్రి అయినాడు. శ్రీ పి.వి. నరసింహరావు. ఈ విశేషాలేవీ ప్రత్యేకమైనవి కావు. ఎవరో ఒకరు ఒక పదవిలో ఉండాలి కాబట్టి. వీళ్ళు అక్కడ చేరుకున్నారు. సీతాదేవి లంకలో ఎక్కడో అక్కడ కూర్చోవాలి... అశోక వృక్షం కింద కూర్చున్నది... అశోక వనికాన్యాం అంటే ఇదే. కానీ శ్రీనరసింహారావు ప్రధాన మంత్రిత్వం, స్వాతంత్ర్యనంతరం భారత ఆర్థిక వ్యవస్థ పడినగాడిని మార్చేటట్లు కనిపిస్తున్నది.

పొగడ్త కాదుగానీ, శ్రీనరసింహారావును గురించి ఇతిహాసంలో పేర్కొనటం తప్పనిసరి కావచ్చు.

ఇతిహాసం చాలా పినాసిది. అది ఎంత గొప్ప వానినయినా తేలికగా వదలివేస్తుంది. కానీ ఇతిహాసానికి ఒక మలుపు ఇచ్చిన వానిని... అది మంచికైనా, చెడుకైనా... తప్పక పేర్కొంటుంది.

కుతుబ్‌షాహీలు ఆంధ్రదేశానికి చేసిన మేలు చెప్పుకోదగినది ఏదీ లేదు గానీ, వాళ్ళల్లో చివరి పరిపాలకుని ప్రధానమంత్రి, నిజాం పరిపాలకుడు. ప్రభుత్వ అధికారి పదవులను వేలం వేసే పద్ధతిని మాన్పించి, అధికారులను నియమించి, వారి వ్యవహారణను నిర్దిష్టమైన నియమ నిబంధనల కిందకు తెచ్చాడు. ఆ ప్రధాని మాదన్న.

అతడిని చంపే వరకూ ఔరంగజేబు నిద్రపోలేదు... ఎందువలన?... పరిపాలనను ఒక సుస్పష్టపద్ధతి ప్రకారం నడిపితే, ఏ ఒక్కనికీ ప్రత్యేకత ఉండదు... పై పదవులలో ఉన్న వారికి యధేచ్ఛ ప్రవర్తన వీలుకాకుండా పోతుంది! ఇది పరిపాలనా విజ్ఞానంలో మారువరాని నీతి.

ఇప్పటివారిలో పలువురికి నచ్చినా నచ్చకపోయినా సాహిత్యానికి సంబంధించిన కొన్ని యావద్భారత ప్రాధాన్యం గల విశేషాలు పేర్కొందాం.

సంస్కృతంలోని మహాకావ్యాలను, అధ్యాపకులు, విద్యార్థులు అర్థం చేసుకొనటానికి అనువుగా, మహామహోపాధ్యాయ కొలిచెలమ మల్లినాథసూరి సబోధక వ్యాఖ్యానాలు వ్రాశాడు. సంస్కృత కావ్యాలు చదివేవారికి ఇవి తప్పనిసరి. పాత పద్ధతిలో సంస్కృతం నేర్చే ప్రతివాడూ మల్లినాథసూరి పేరు తల్చక తప్పదు

మన త్యాగరాజు పేరును తమిళ విద్వాంసులు ఇప్పటి వరకూ వదిలం చేశారు. కృతజ్ఞులం. దేశదేశాల సంగీత విద్వాంసులూ త్యాగయ్య ప్రతిభను గుర్తించారు. తన యావదాస్తినీ వెచ్చించి శ్రీమతి బెంగుళూరు నాగరత్నం ఆయనకు సమాధి నిర్మించి పెట్టింది.మన సంగీత ఔన్నత్యాన్ని తమిళనాడులోని తిరువైయారు నుంచి ఇంకా ప్రచారం చేస్తూనే ఉన్నారు. మా భాష, త్యాగరాయ భాష అని గర్వంగా చెప్పుకోవచ్చు కదా.

మన ఆంధ్ర పండితులు, ఇతర ప్రాంతాల పండితులవలే గ్రంథాలకు గ్రంథాలు వ్రాయలేదు.వ్రాయరు గూడాను. ఒక్క మానవల్లి రామకృష్ణ కవిగారు ఇతర ప్రాంతాల ఆధునిక పరిశోధక పండితులను పోలగలడేమో! భాండార్కర్, ఆప్టే, రనడే, రాజ్వాడీ నానసథా, సంపూర్ణానంద్, మజుందార్ నగైరా పండితులవలె మనవాళ్ళు కృషి చేయలేదు-మన ప్రత్యేకతలు వేరు.

భారతదేశ సంకీర్తనం, కావ్యకంఠ శ్రీ గణపతి ముని చేసినంతగా మరెవ్వరూ చేయలేదు- ఆయనగారు సంస్కృతాన్ని జాతీయ భాషగా నిర్ణయింప జేయాలని బెల్గాం కాంగ్రెసు మహాసభలో ప్రయత్నం చేశాడు. శ్రీ గణపతి ముని ఆంధ్రుడు వేద పండితుడు. బహుకావ్య కీర్తి పరిశోధకుడు. కొన్ని శ్లోకాలు స్మరించుదాం.....

> స్వాతంత్ర్యం వనితానాం
> త్రాతుం మాతరధీశే
> దూరీకర్తుమ్చపారం
> దైన్యం పంచమి జాతే.

(ఓ అమ్మా! స్త్రీల స్వాతంత్ర్యాన్ని కాపాడు. పంచమి జాతి వారి దైన్యాన్ని దూరంచెయ్.)

> అయంకటాక్షస్తవ తోయవాహః
> కారుణ్య కాలేపరిభృంజమానః
> గృహేషులీనాన్ సుఖినో విహాయ
> విరాశ్రయాన్ శిఞ్చతి విశ్వమాతః

[నీ కటాక్షమనే కాలమేఘం, కారుణ్య కాలంలో విజృంబిస్తుంది... గృహాలలో సుభావలలో లీనులై ఉన్నవారిని వదిలివేసి, ఆశ్రయం(ఇల్లో) ఉన్నవారిని తడిపి వేస్తుంది.

• • •

# ఆంధ్రలో పురాతత్త్వ పరిశోధనల ప్రగతి

డా॥ వి.వి. కృష్ణశాస్త్రి

వంశధార, గోదావరి, కృష్ణ, పెన్నా, సువర్ణముఖి మొదలైన నదులు నిరంతరం ప్రవహిస్తూ అతి ప్రాచీనమైన శిలాసంపద కల్గి, నాటికి సంబంధించిన రేగడి భూములతో కప్పబడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము ఆదిమ మానవుని కాలము నుండి నేటి వరకు ప్రజాజీవనమునకు స్వర్గతుల్యముగా నున్నది. క్రీ॥శ॥ 1863 ప్రాంతంలో మొదటిసారిగా మద్రాసునగర సమీపంలోని పల్లవరం గ్రామం వద్ద రాబర్ట్ బ్రూస్‌ఫుట్ అనే ఆంగ్లసర్వేయరు ఆదిమ మానవుని రాతి పనిముట్లను కను గొన్నది మొదలుకొని అనేకమంది పురా తత్త్వవేత్తలు ఆదిమ మానవుని అవశేషాల కొరకు ఇతర ప్రాంతాలలో పరిశోధనలు సాగించారు. వీరిలో ముఖ్యమైన వారు బ్లాండు ఫోర్డ్, విలియమ్‌కింగ్, మొదలైనవారు. వీరి తరువాత నిజామ్ సంస్థాన పురాతత్త్వశాఖవారు అనేక ప్రదేశాలలో ఆదిమ మానవుని అవశేషాలు కనుగొన్నారు. తరువాత ఐజక్, హెచ్, సర్కార్, ప్రొఫెసర్, ఎస్.ఎన్.రావు. ఎమ్. ఎల్.కె. మూర్తి, తిమ్మారెడ్డి, బి.ఆర్. సుబ్రహ్మణ్యం, డేవిడ్‌రాజు, ఆర్.వి.జోషి మొదలైనవారు విస్తృతమైన పరిశోధనలు చేశారు.

ఈ మధ్యకాలంలో మహబూబ్ నగర్ జిల్లాలోని అచ్చంపేట తాలూకాలోని అమరాబాదు అనే గ్రామం వద్దను, చంద్రసాగర డేమ్ సమీపంలోను, నడిమిపల్లి దగ్గర ఆదిమ మానవుని రాతిపనిముట్లు కోకొల్లలుగా దొరికినాయి. అమరాబాదు ఆదిమ మానవుని ఉనికికి ఒక ప్రత్యేకమైన ప్రాంతముగా కనిపిస్తుంది. ఇక్కడ అనేక వందల రాతి గొడ్డళ్లు, చీలిక పనిముట్లే కాక, వీటిని తయారు చేయగా ఊడిపడిన రాతి చెక్కలు గుంపులు గుంపులుగా దొరికినాయి.

నల్గొండ జిల్లాలో నేటి నాగార్జున సాగర్ జలాశయం నీళ్లలో మునిగిపోయిన ఏలేశ్వరం అనే గ్రామంవద్ద పాతరాతి యుగం నాటి పనిముట్లు అనేకం లభించినాయి. ఏలేశ్వరమునకు పడమటి దిక్కుగా వున్న గుట్టంపై 'గుండాల' అనే నీటి బుగ్గ సమీపంలో వందల నేలుగా ఉత్తర రాతి యుగం నాటి రాతి బ్లేడు పనిముట్లు దొరికినాయి. కర్నూలు జిల్లాలో కేతవరం గ్రామ పరిసరాలలో ఉత్తర రాతియుగం నాటి పనిముట్లు చకుముకి రాతితోను తదితర ప్రశస్త శిలలతోను చేయబడ్డ పనిముట్లు లభించినాయి. కరీం నగర్ జిల్లాలో పెద్దపల్లి తాలూకాలో ఠాకూర్ రాజారామ్ సింగ్ సహకారంతో ఈ వ్యాస రచయిత అనేక పాతరాతి యుగం నాటి, మధ్యరాతియుగం నాటి, సూక్ష్మరాతియుగం నాటి పనిముట్లను అనేక చోట్ల కనుగొనటం జరిగింది. కరీంనగర్ జిల్లాలో గోదావరిఖని వద్ద పాత రాతియుగం నాటి పారిశ్రామిక వాడలను, కనుగొనడం జరిగింది. మరొక మధ్యరాతి యుగం నాటి కేంద్రం మేడిపల్లికి దగ్గర లోనున్న కాజీపల్లి. ఇక్కడ ప్రాచీన కాలం నాటి పంది, గుఱ్ఱము, లేడి, దుప్పి, తాబేలు, ఎద్దు, దున్నపోతు మొదలైన జంతువుల శిలాజములతో పాటు మధ్య రాతి యుగపు పనిముట్లైన గొకుడురాళ్ళు, సూదిములుకులు, చిల్లు జేసే పనిముట్లు మొదలైనవి రాజారామ్‌సింగుకు దొరికినాయి. గోదావరిఖనిలోని డిగ్రీ కాలేజీకి సమీపంలో ఉత్తర రాతి యుగం నాటి రాతిబేళ్లు, ఎముకలతో చేసిన పనిముట్లతో బాటుగా ఎద్దు, దున్నపోతు, లేడి, దుప్పి, గొఱ్ఱె, ఎలుక, గుఱ్ఱము, కుక్క మొదలైన జంతువుల ఎముకల శిలాజములు కూడా దొరికినాయి. వీటిని బట్టి ఆ కాలం నాటి మానవుల ఆహారపుటలవాట్లను తెలిసికొనవచ్చును. సూక్ష్మరాతి యుగానికి చెందిన స్థలాల్లో చెప్పదగ్గవి పెద్దపల్లి తాలూకాలోని రాయగిరి కోట దిగువభాగంలో గల గౌరిగుండం అనే గ్రామం. ఇచ్చట సూక్ష్మరాతియుగం నాటి పనిముట్లు కుప్పలు కుప్పలుగా కనుపించాయి. నేను, రాజారామ్‌సింగు కలసి అనేక వేల రాతి పనిముట్లను ప్రోగుచేయడం జరిగింది. ఈ ప్రాంతములో మధ్యరాతి యుగం నాటి మానవుడు చాలా కాలం నివసించినట్లుగా ఆధారాలున్నాయి. రాయగిరి కోటపై భాగం నుండి ఒక నీటి బుగ్గ పార్లుతూ ఇక్కడకు దగ్గరలో ధారగా పడుతుంది. దీని వలన సూక్ష్మరాతియుగపు మానవునికి నీటి కొఱత లేదు. పైగా అనేక రకములైన ప్రశస్త శిలలు దగ్గరలోనే దొరకడం చేత రాతి పనిముట్లు తయారు చేయడానికి ఇబ్బంది పడనక్కరలేక పోయింది.

ఉత్తర లేక సూక్ష్మరాతి యుగం

నాటి మరొక ముఖ్య స్థలము మేడిపల్లికి దగ్గరలోని నరసయ్యపల్లి. ఇక్కడ గల సమతలమైన రాతి పడకల మీద ఉత్తర రాతియుగం నాటి మానవకారాలు వేటాడుతున్నట్లుగాను, చాపల వలలు పట్టుకున్నట్లుగను, త్రికోణాకారాలు, చతుర్భుజాలు మొదలైన డిజైను లేక సంజ్ఞలు అనేకం రాతి మీద గంట్లతో బొమ్మలు వేయబడ్డాయి. రాజారా య్‌సింగుతో పాటు నేను చూచిన ఉత్తర రాతియుగపు స్థలాలు ఆదిలాబాదు జిల్లాలో బోత్ తాలూకాలో వంకిడి అనే యేటి ఒడ్డున ఉన్నాయి. ఆ స్థలము అటవీ వృక్షాలతో ఆవృతమై, మధ్యలో గల గల పాటే వాంకిడి యేరు, ఆ ప్రాంతం అత్యంత మనోహరంగా మఱపురాని దృశ్యం కలిగి ఉంటుంది. దీనికి దగ్గరలో వున్న మాణిక్యగూడెం అనే ప్రాంతంలో కూడా ఆ మాదిరి పనిముట్లే దొరికినాయి.

## క్రొత్త రాతి యుగం

దక్షిణ భారతదేశంలోను, తదితర ప్రాంతాలలో భూమి ఉపరితలం మీద అనేక నునుపు (పాలిసు) చేయబడ్డ రాతిపనిముట్లు ఆ కాలపు మానవుడు నివసించిన తావుకు సంబంధము లేకుండా ఎందుకు లభిస్తు న్నాయో పురాతత్త్వ వేత్తలకు పెద్ద సవాలు అయింది. ఈ మధ్యకాలంలో క్రొత్త రాతియుగపు మానవుడు నివసించిన అనేక ప్రాంతాలు భారతదేశపు అన్ని ప్రాంతాలలో కనుగొనబడ్డాయి. ఈ క్రొత్త రాతియుగ సంస్కృతికి ముఖ్య లక్షణాలు వ్యవసాయం చేసి పంటలుపండించడం, కొన్నిరకాలైన జంతువులను ఇళ్లలో పెంచడం, మట్టి పాత్రలను తయారు చేసుకొనడం, రాతి పనిముట్లను రుద్ది నునుపు చేయడం మొదలైనవి. ఈ యుగపు రెండవ దశలో



ప్రకాశం జిల్లా చంద్రవరంలోని బౌద్ధ స్థూపం

లోహాలను కరిగించి పనిముట్లుగా చేయడం కూడా మొదలయింది. నేటి మాదిరిగా నాటి మానవుడు పటిష్ఠమైన భవంతులు నిర్మించు కునే సదుపాయం, తెలివి లేకపోవడం చేత తన ఆత్మరక్షణ కొఱకు కొండ చరియల లోను, కొండ గుహలలోను నివసించేవాడు. దీనికి కారణం అటవి జంతువులైన పెద్దపులి, [illegible], తోడేలు మొదలైన క్రూర జంతువులు సమీపం లోనికి వచ్చినపుడు వాటిమీద ఎత్తు నుండిపడిసాల రాళ్లతో గాని, ఈటెలతో గాని కొట్టి చంపుటకు లేక బెదిరించుటకు వీలుగా వుంటుంది. రాత్రి సమయాలలో నిద్రించడానికి కొండగుహలు అనువుగా వుంటాయి. వీరు వాడిన కొన్ని గుహలలో అరుగుల వంటి చప్టాలు ఉండడం చేత నిద్రించే సమయంలో పాములు, తేళ్లు, మొదలైన పాకే జంతువుల నుండి రక్షణ ఉండేది.

మన రాష్ట్రంలో క్రొత్తరాతియుగం నాటి స్థలాలయిన నాగార్జునకొండ, గండ్లూరు, వీరాపురం, ఉట్నూరు, అయిజా, రామా పురము, చిన్న మారూరు, పోలుకొండ, పాల వాయి, హులికల్లు మొదలైన ప్రాంతాలలో త్రవ్వకాలు జరిగినాయి.

వరంగల్ జిల్లా పోలుకొండలో అనేక క్రొత్త రాతి యుగం నాటి గొడ్డళ్లు, బాడిసలు ఊరికి ఉత్తరాన గల పెద్ద గట్టుకొండ చరియల మీద లభించాయి. కరీంనగర్ జిల్లా పెద్ద బంకూరు ఒక పెద్ద శాతవాహన స్థలమైనప్పటికి, ఇక్కడ అనేక క్రొత్త రాతి యుగం నాటి పనిముట్లు లభ్యమైనాయి. దీనిని బట్టి శాతవాహనుల కాలం నాటి నివేశం ఇక్కడ కట్టడానికి కొన్ని వందల సంవత్సరాలకు పూర్వమే క్రొత్తరాతియుగం నాటి మానవులు ఈ ప్రాంతంలో నివసించడమో, చరించడమో జరిగింది. దీనికి దగ్గరలో ఎక్కడా కొండలు లేకపోవడం చేత దూరంగా కొండలున్న ప్రాంతాల్లో వీరు నివసించి పెద్ద బంకూరు ప్రాంతంలో వారి పశువులను మేపుకోడానికి వచ్చి వుండవచ్చు.

అనేక చోట్ల క్రొత్త రాతి యుగం నాటి పనిముట్లు, సూక్ష్మరాతి యుగపు



కరీంనగర్ జిల్లా కోటిలింగాల త్రవ్వకాలలో లభించిన
శాతవాహనుల కాలంనాటి బంగారు ఆభరణాలు

అనంతపురం జిల్లాలో, 1978 సంవత్సరంలో రాష్ట్ర పురాతత్త్వశాఖ ద్వారా నేను జరిపిన త్రవ్వకాలలో కూడా రాతి పనిముట్లు, పశుకోష్ఠాలకి సంబంధించిన గుంటలు, మట్టి పాత్రలతో పాటు అనేక పసిపిల్లల సమాధులు కనుపించాయి. వీటిలో కొన్ని సమాధులు నెలల వయస్సుగల పిల్లలవి. ఒక శిశు సమాధి దగ్గర ఆ శిశువు పొడ్డుకోసిన చంద్రవంక వంటి రాగిరేకు, మరొక త్రికోణాకారపు రాగిబ్లేడు, ఒక చిన్న మట్టి పాత్రలో పాలోరేక మరేదో పోసి ఆ బిడ్డ ఆత్మకు సమర్పించినట్లుగా ఉన్నాయి.

అనంతపురం జిల్లాలో పాలవాయి దగ్గర త్రవ్వకాలలో స్థంభాలు పాతిన గుంటలు, మట్టి పాత్రలు, ఎముకలతో చేసిన పనిముట్లు మొదలైనవి దొరికినాయి. ఇక్కడ త్రవ్వకాలలో లభించిన బొగ్గును కార్బన్ పదు నాలుగు అనే పరీక్షకు పంపగా అక్కడి క్రొత్త రాతి యుగపు నివేశనం రమారమి క్రీస్తు పూర్వం 2000 (రెండువేల) సంవత్సరాల ముందు కాలం నుండి వున్నట్లు తెలిసింది.

హైదరాబాదులోని బిర్లా పురావస్తు పరిశోధన సంస్థవారు ఈ మధ్య ఏరాపురంలోను, కేంద్ర ప్రభుత్వ పురాతత్త్వ శాఖవారు కర్నూలు జిల్లా హామాపురంలోను, గుంటూరులోని నాగార్జునా విశ్వవిద్యాలయం వారుగండ్లూరు అనే గ్రామం వద్ద క్రొత్త రాతియుగపు స్థలాల్లో త్రవ్వకాలు చేశారు. వీటి ఫలితంగా ఆ కాలం నాటి ఇండ్ల నిర్మాణపు పద్ధతులు, నిత్య జీవన విధానం గురించి అనేక క్రొత్త విషయాలు తెలిసినాయి. గండ్లూరులోని గులకరాతి నేల లోపల త్రవ్విన అనేక గుంతలు ఆనాటివి కనిపించాయి. ఇదే విధంగా నాగార్జున కొండ త్రవ్వకాలలో కూడా స్థలాల్లోను, కొన్ని లోహయుగపు సమాధుల దగ్గరలో కూడా దొరికినాయి. వరంగల్లు జిల్లాలో దేవర ఉప్పల గ్రామంలో లోహయుగం నాటి సమాధులు కొన్ని వందలున్నాయి. వీటికి దగ్గరలో అనేక క్రొత్త రాతియుగపు పనిముట్లు దొరికినాయి. దీనిని బట్టి ఈ ప్రాంతము క్రొత్త రాతి యుగపు మానవుడు నివసించిన స్థలంగా వాడుకున్న తరువాత ఇనుప యుగం నాటి ప్రజలు ఇక్కడ సమాధులు నిర్మించుకున్నారు. ఇదేవిధంగా కరీంనగర్ జిల్లా సుల్తానాబాదు తాలూకాలో కదంబాపురం గ్రామం వద్ద కొన్ని వందల ఇనుప (లోహ) యుగం నాటి సమాధులున్నాయి. వీటికి దగ్గరలోనే 'తగరరాయి' అనే గ్రామంలో క్రొత్త రాతియుగం నాటి పారిశ్రామిక వాడను కనుగొన్నాము. ఇది మానేరు నది ఒడ్డున వున్నది. రాతి పనిముట్లను తయారుచేసి వాటిని అరగదీసి నునుపు చేయడానికి మానేరు నది వద్ద గల బల్లపరపు బండల మీద అనేక చోట్ల అరగదీసిన గుంటలున్నాయి.

క్రొత్త రాతి యుగపు నివేశన స్థలాలు మెహబూబ్‌నగర్ జిల్లాలో చిన్న మారూరు, కార పాకుల, అయిజా, తాడికొండ, పైడిగుట్ట (సంగమేశ్వరం దగ్గర), సోమశిల, జటప్రోలు, వాగటూరు మొదలైన చోట్లు వున్నాయి. అనంతపురం జిల్లాలో పులికల్లు, పాలివాయి, అక్కన్నకొండ, తాడిపత్రి, ముదిగల్లు మొదలైనవి. కడప జిల్లాలో మైలవరం, ప్రకాశం జిల్లాలో కనిగిరి, పూసలపాడు, ఉప్పలపాడు, ద్రోణాదుల మొదలైనవి. గుంటూరు జిల్లాలో గండ్లూరు, గోదవర్రు, పొన్నెకల్లు, లాము, అమరావతి, చేబ్రోలు మొదలైనవి.

1960-61లో మహబూబ్‌నగర్ జిల్లాలో ఉట్నూరు అనే గ్రామం దగ్గర అల్చిన్ అనే బ్రిటిష్‌పురాతత్త్వవేత్త ఇక్కడ గల క్రొత్త రాతియుగం నాటి బూడిద కుప్పను త్రవ్వకం చేశాడు. దాంట్లో పశువుల కొట్టం తాలూకు స్థంభాలు పాతిన గుంతలు, అనేక మట్టి పాత్రలు, ఇండ్ల పునాదులు మొదలైనవి దొరికినాయి.

క్రొత్త రాతియుగం నాటి గుంతలు వెలికి వచ్చాయి. ఆయా త్రవ్వకాలు జరిపిన పురాతత్త్వవేత్తలు ఈ గుంటలలో క్రొత్త రాతియుగం నాటి మానవుడు నివసించి వుండవచ్చునని అభిప్రాయం వెలిబుచ్చారు. కాని ఇది సత్యదూరమైన, అసాధ్యమైన యోచన. ఏమంటే గుంటూరు జిల్లాలోని గండ్లూరులో గాని, నాగార్జున కొండలో గాని భూమిలోపల గుంతలలో నివసించడమనేది దుర్భరమైన విషయం. ఆ ప్రాంతంలో గ్రీష్మతాపం నూట పదిడిగ్రీలకు పైనే ఉంటుంది. ఎక్కడో హిమాలయ పర్వత సానువుల్లో క్రొత్త రాతియుగపు మానవుడు గుంటలలో నివసించాడంటే, అక్కడున్న చలి వాతావరణానికి కొంత నమ్మదగినది వుండవచ్చును.

గండ్లూరులోని గుంతలలో కొన్ని కొన్ని చెంబుల వంటి మట్టి పాత్రలు దొరికిన కారణంగా ఆ గుంటలు ధాన్యాన్ని దాచుకునే నేలమాళిగలుగా వాడి ఉంటారని చెప్పవచ్చు. ఈ చెంబుల వంటి పాత్రలు ధాన్యాన్ని కొలవడానికి వాడిన తప్పెలు, మానికలు కావచ్చును. దీనిని బట్టి క్రీస్తు పూర్వం 2000 నుండి 1500 సంవత్సరాల నాటికే గుంటూరు ప్రాంతంలోనే క్రొత్త రాతియుగపు ప్రజలు వారి అవసరాల కంటే ఎక్కువగా ధాన్యాలను పండించే వారని, వాటిలో కొంత ధాన్యాన్ని నేల మాళిగలలో దాచుకునే వారని తెలుస్తుంది. ఉత్పత్తి చేసిన వస్తువు దాచటం అనేది ఆర్థిక పురోభివృద్ధికి సోపానం వంటిది. దాపరికం అనే పద్ధతి లేకపోతే ఎక్కువగా పండించే అవసరం కూడా లేదు.

నా ఆధ్వర్యంలో రాష్ట్ర పురాతత్త్వ శాఖవారు గుంటూరు జిల్లా గుత్తికొండ బిలంలోపల జరిపిన పరిశోధనలలో ప్రవేశ మార్గం దగ్గర క్రొత్త రాతియుగపు మానవులు నివసించిన ఆధారాలున్నట్లు తేలింది. వారి మృత దేహాలను గుహకు బాగా లోపల అంటే ఇంచుమించు ప్రవేశ ద్వారానికి ఒక వంద మీటర్ల లోపల గుహలో పాతిపెట్టి, చనిపోయిన వ్యక్తులు వాడిన రాగి ఖడ్గాలు, కొన్ని మట్టి పాత్రలు కూడా ఆ సమాధిలో ఉంచబడ్డాయి.

కర్నూలు జిల్లాలో బెలుం అనే గుహలు ప్రపంచంలో అన్ని గుహల కంటే పొడుగైనవి. ఈ గుహలోపల పొడవు ఆరు కిలోమీటర్లకు పైగా వున్నది. ఇక్కడ కూడా క్రొత్త రాతియుగపు మానవులు ముఖ ద్వారం దగ్గర నివసించి మృత దేహాలను మట్టి పాత్రలలో వుంచి గుహకు లోపలి భాగంలో పాతి పెట్టినట్లుగా జాడ దొరికింది. కర్నూలు జిల్లాలోని బిల్లాసర్గం గుహలలోను, మహబూబ్‌నగర్ జిల్లాలో లాడికొండ వద్ద వున్న గుహలలో కూడా ఇదే పద్ధతి గమనింపబడింది. చనిపోయిన వ్యక్తుల ఆత్మశాంతికి ఆహార పదార్థాలు కాని, [illegible] కాని సమర్పణ చేసే ఆచారం లోహ యుగంలో ముఖ్యాంశంగా కనిపించినప్పటికి ఇది క్రొత్త రాతి యుగం నాటికే ప్రారంభమైనట్లుగా పైన చెప్పిన ప్రదేశాలలో ఆధారాలు దొరికినాయి. క్రీస్తు పూర్వము 2000 సంవత్సరాల నాడు ఇంచుమించు జీవిక జీవితం గడిపిన క్రొత్త రాతియుగపు మానవునికి చనిపోయిన తరువాత శరీరము, ఆత్మ వేరవుతాయని, ఆత్మను శాంతింపజేయడానికి కొన్ని వస్తువులు సమర్పించుకోవాలని, పునర్జన్మ అనేది వున్నదనే నమ్మకం ఉండేదంటే ఆశ్చర్యం కలుగుతుంది.

పైన చర్చించిన విధంగా క్రొత్త రాతియుగపు మానవుని ఆర్థిక విధానం ముఖ్యంగా కోస్తా ఆంధ్రదేశంలో వ్యవసాయం మీద ఆధారపడిందని, మిగిలిన ప్రదేశాలలో వ్యవసాయం ఉన్నప్పటికి పశుసంపద మీద, జంతువుల వేట మీద ఎక్కువగా ఆధారపడినట్లుగా కనిపిస్తుంది. దక్షిణ భారతదేశంలో కొన్ని క్రొత్త రాతియుగం నాటి స్థలాల్లో ముఖ్యంగా మెదక్ జిల్లాలో పాలడుగు అనే చోట, కర్నాటకలో తెక్కలకోట అనే చోట రాగిని కరిగించి వస్తువులు తయారు చేయడంతో పాటు, బంగారపు వస్తువులు తయారు చేయడానికి అవసరమైన సాంకేతిక నైపుణ్యం ఉన్నట్లుగా విశదమైంది. క్రొత్త రాతియుగపు ఆఖరు దశలో అంటే రమారమి క్రీస్తు పూర్వం 1200లేక 1000 సంవత్సరాల నాటికి గనుల నుండి ఇనుప ఖనిజాన్ని సేకరించి ఇనుమును తయారు చేసే నిపుణత వున్నట్లుగా రుజువైంది.

క్రొత్త రాతియుగపు అవసానదశ నుండి మానవుడు ఇనుప యుగంలోకి ప్రవేశించిన జాడలు రామాపురం, హాలి కల్లు, చిన్న మారూరు, వీరాపురం, పాలకొండ మొదలైన చోట్ల గమనించబడింది. మెహబూబ్‌నగర్ జిల్లా చిన్న మారూరులో క్రొత్త రాతియుగం నాటి కొన్ని కుటుంబ సమాధులు తరువాతి ఇనుప యుగానికి చెందిన నివేశన స్థలంలో కనిపించాయి. ఇనుప యుగానికి చెందిన సమాధులు క్రొత్త రాతి యుగపు నివేశన స్థలంలో నిర్మింపబడ్డాయి.

## లోహయుగము లేక ఇనుప యుగము

దక్షిణ భారతదేశంలో లోహ యుగము గురించి పరిశోధనలు చేయాలంటే ఆ కాలం నాటి సమాధులే మనకు



**మహబూబ్ నగర్ జిల్లా పెద్ద మారూరులో లభించిన లోహయుగంనాటి సమాధి (క్రీస్తు పూర్వం 8 లేక 6 శతాబ్దంనాటిది)**

ఆధారం. ఈ సమాధులు మన రాష్ట్రంలో గోదావరికి దక్షిణాన కొన్ని వందలు, వేలుగా ప్రతి జిల్లాలో కనిపిస్తాయి. ఇంత వరకు శ్రీకాకుళం, విశాఖపట్నం, విజయనగరం, తూర్పుగోదావరి, ఆదిలాబాదు మొదలైన జిల్లాలలో ఈ సమాధులున్న జాడలు దొరకలేదు. ఆ జిల్లాలలో ఎవ్వరూ నాటి గురించి ఎక్కువగా పరిశోధనలు చేయలేదు. గత దశాబ్దాలలో నిజామ్ సంస్థాన పురాతత్త్వ శాఖ వారు ఖమ్మం జిల్లాలోను, వరంగల్లు జిల్లాలోను, నేటి రంగారెడ్డి జిల్లాలోను అనేక చోట్ల ఈ సమాధులను త్రవ్వడం జరిగింది. వీటిలో జానంపేట, రాయగిరి, హన్మత్‌పేట మొదలైనవి వున్నాయి. తరువాత కేంద్ర పురాతత్త్వశాఖవారుగుంటూరు జిల్లాలో నాగార్జున కొండ వద్ద గల సమాధులను నాగార్జున సాగర్ కింద మునిగిపోవడానికి ముందే త్రవ్వారు. ఇదే విధంగా నాగార్జున కొండకు పడమటి దిక్కున కృష్ణకు ఎడమ గట్టునున్న నల్గొండ జిల్లా ఏలేశ్వరంలో రాష్ట్ర పురాతత్త్వశాఖ వారు కొన్ని సమాధులను త్రవ్వారు. ఈ మధ్య కాలంలో శ్రీరామ్‌సాగర్ ప్రాజెక్టు కింద ఉన్న పోచంపాడులో వున్న సమాధులను, కరీంనగర్ జిల్లా కదంబా పూరు లోను, కృష్ణా జిల్లా ఆకిరిపల్లిలోను, తెన్నేరు లోను, నెల్లూరు జిల్లా జొన్నవాడలోను, శ్రీశైలం ప్రాజెక్టు ముంపు ప్రాంతంలో వున్న చిన్న మారూరు, పెద్ద మారూరు, ఉప్పలపాడు, చాగటూరు, కారపాకల, శేరుపల్లి మొదలైన చోట్ల గల సమాధులు త్రవ్వ బడ్డాయి.

పోచంపాడు త్రవ్వకాలలో మానవ కంకాళ అవశేషాలతో పాటు ఇనుప ఈటెలు, గండ్ర గొడ్డళ్లు, కాలి చెప్పు ఆకారంలో వున్న పట్టీలు గల గొడ్డళ్లు, నాగి, పిడులు గల బాకులు, త్రిశూలాలు, ఏనుగు అంకుశం, గుఱ్ఱపు రికాబులు. బహుశా దీపం పెట్టడానికి ఉపయోగించే ముక్కాలిపీట మొదలైనవి సమాధులలో దొరికినాయి. వీటితో పాటు ఎరుపు, నలుపుగల ద్వివర్ణ పాత్రలు, పూర్తి నలుపు పాత్రలు దొరికినాయి. ఇవన్నీ ఆ కాలం నాటి మానవులు చనిపోయిన తరువాత వారి వారి ఆత్మలకు, వారి ఇహలోక జీవన విధానాన్ని దృష్టిలో ఉంచుకుని సమర్పించ బడిన వస్తువులు, ఆయుధాలు మొదలయినవి. విశదంగా చెప్పాలి అంటే ఏ వృత్తుల్లో వున్న మానవులకు ఆ వృత్తుల తాలూకు వస్తువుల్ని వారి సమాధులలో నిక్షిప్తం చేసేవారు. వీటితో పాటు మట్టితో చేసిన లేడిబొమ్మలు, ఏనుగు దంతంతో చేసిన దువ్వెన కూడా దొరికాయి. కరీంనగర్ జిల్లాలో పెద్దపల్లి తాలూకాలోని కదంబాపూరు దగ్గర సమాధులు త్రవ్వినపుడు చేతికి గాజుల వలె వాడిన అడుగులు కోయబడ్డ శంఖాలు, శంఖ వలయాకృతిలో వున్న బంగారపు కర్ణాభరణములు మానవ కంకాళాలకు దగ్గరలో దొరికినాయి. వీటితో పాటు ఈటెలు, బాకులు, గండ్ర గొడ్డళ్లు, బాణపు ములుకులు కూడా దొరికినాయి. కృష్ణా జిల్లా తెన్నేరు సమాధుల్లో మానవ కంకాళాల్ని మట్టి పెట్టెల్లో పెట్టి పాతి పెట్టారు. ఈ పెట్టెకి అడుగున ఆరు లేక ఎనిమిది కాళ్లున్నాయి. నెల్లూరు జిల్లా

జొన్నవాడలోని సమాధులు గులకరాతి భూమి లోపల కుంభాకార పాతర త్రవ్వి, ఆ పాతరకు అడుగు భాగంలో మట్టి తొట్టెలలో శవాల నుంచి పాతిపెట్టేవారు. వీటితో పాటు ముక్కాలి పీటలు, త్రిశూలము, దీపం పెట్టే చిన్న పళ్లెము దొరికినాయి.

• మానవ అస్థిసంచయాన్ని పాతి పెట్టిన అనేక రాతిపెట్టెలు ఖమ్మం జిల్లా జానంపేట, దొంగతోగు మొదలయిన ప్రాంతాల్లో కనిపించాయి. చిన్న మారూరు లోని సమాధులన్నీ ప్రథమ శ్రేణికి చెందినవి. వీటిలో చనిపోయిన వెంటనే మృత కళేబరాన్ని నిక్షిప్తం చేసి ఖననం చేసేవారు. కాని మిగిలిన చాలా చోట్ల దొరికిన సమాధులలో మానవ కళేబరాన్ని కొంత కాలం ఎత్తైన వేదికల మీద ఎండబెట్టి చర్మమాంసాదులు హరించగా మిగిలిన ఎముకలను ప్రోదిచేసి సమాధి చేసే పద్ధతి కనుపిస్తుంది. పెద్ద మారూరులోని సమాధులు కుటుంబాలకు చెందినవి అంటే ఒక వంశములో వారందరూ ఒకే సమాధిలో పాతిపెట్టబడేవారు. ఈ సమాధులను రాతి చెక్కలతో పెట్టెలుగా తయారుచేసి ఒక్కొక్క పెట్టెను రెండు లేక మూడు విభాగాలు చేసి ఒక్కొక్క విభాగంలో కుటుంబం తాలూకు ఒక్కొక్క వ్యక్తి ఎముకలను ఖననం చేసేవారు. పెద్ద మారూరు రాతిపెట్టె సమాధిలో రెండు మట్టి పెట్టె సమాధులు లభించినాయి. ఇందులో ఒకటి పడవ ఆకారంగాను, రెండవది నేత మగ్గపు నాడె ఆకారంగా చేయబడ్డది. ఈ పెట్టెలలో చిన్న పిల్లల కళేబరాలుంచబడ్డాయి. ఆ కాలంలో పసిప్రాయపు మరణాలెక్కువగా వున్నట్లుగా తెలుస్తుంది. ఉప్పలపాడులో ఒక చెక్కతో చేయబడ్డ శవపేటిక సమాధి గుంటకు అడుగు భాగంలో పెట్టబడింది. పెద్ద మారూరులో ఒక మట్టి తొట్టె వంటి శవ పేటికకు మట్టితో చేయబడ్డ దున్నపోతు తల అతికించబడింది. యముని వాహనం మహిషం కాబట్టి బహుశా ఈ శవ పేటికలో వుంచిన మానవ కళేబరం తాలూకు ఆత్మను సూటిగా యమ ధర్మరాజు వద్దకు పంపాలనే తలంపుతో ఈ విధంగా చేసి వుంటారు.

చాగటూరులో ఒక పెద్ద పెట్టె సమాధిలోపల రెండు ప్రక్కల రాతి బెంచీలనుఏర్పాటు చేశారు. బహుశా మృత కళేబరాలను ఈ బెంచీతల మీద కొన్ని రోజులు పరుండబెట్టి గద్దలు, కాకులు, చీమలు తదితర జీవరాసులు మాంసాదులను హరించగా మిగిలిన ఎముకలను ప్రోదిచేసి మరొక సమాధిలో పెట్టేవారు. అది శవాలను ఎండబెట్టే ఆవరణమని తెలియడానికి దానిచుట్టూ 100 అడుగులు పొడవు, 100 అడుగులు వెడల్పు గల రాతిగోడ నిర్మింపబడింది. నల్గొండ జిల్లాలోని వలిగొండలో నున్న బండరాతి జ్ఞాపికలకు (మెన్‌హిర్‌లు) చుట్టూ ఈ విధంగానే గోడలునిర్మించారు.

పై చర్చ మూలంగా బృహత్ శిలా యుగపు సంస్కృతి ఆంధ్రదేశంలో పూర్తిగా విస్తరించినట్లుగావిశదమవుతుంది. ఈ సమాధుల చుట్టూ పెద్ద పెద్ద బండరాళ్లు వలయాకారంగా పెట్టే ఆచారం వుండడం చేత ఇవి పెద్ద రాతి లేక బృహచ్ఛిలా సమాధులుగా పేరొచ్చింది. ఈ ఆచారం క్రీస్తు పూర్వం 1100 లేక 1000 సంవత్సరాల పూర్వం నుండి క్రీస్తు పూర్వం 4 లేక3 శతాబ్దాల మధ్యకాలంలో ఉన్నట్లుగా తెలుస్తుంది. ఈనాటి ప్రజలు చిన్న చిన్న నదులకు, సెలయేళ్లకు ఆనకట్టలు కట్టి బ్రహ్మాండమైన సరస్సులను ఏర్పాటు చేసేవారు. ఇటువంటి అనేక సరస్సులు వారి సమాధులకు సమీపంలో అనేక చోట్ల కనిపిస్తాయి. ఈ చెఱువు నుండి ప్రవహించే నీటి ద్వారా పంటలు పండించేవారు. వారి వారి అవసరాల కంటే పంటలు ఎక్కువగా పండించి మిగులు ధాన్యాన్ని దాచుకోవడం కాని విక్రయించడం గాని చేసేవారు. ఈ కాలంలో ఎడ్లబండ్ల తోపాటుగా గుఱ్ఱాలను గూడా విరివిగా వాడేవారు. ఇనుప గుఱ్ఱపు రికాబును (**Stirrup**) కనిపెట్టడం చేత త్వరితగతిన దూరాలను అధిగమించడానికి వీలుకల్గింది. ఇనుమును కరిగించి ఆయుధాలు తయారుచేసి చిన్న చిన్న సైన్యాలను ఏర్పాటు చేసికుని దండయాత్రల ద్వారా చుట్టుపట్ల వున్న ప్రజలను స్వాధీన పరచుకొని నాయకులని, మహారథులని, మహా తలవరు అని బిరుదుల వహించి తమ తమ పేర నాణాలు ముద్రింపించడం ప్రారంభించారు. బహుశా ఇదే బిరుదు గద్యాణాలకి ప్రారంభ దశ కావచ్చు.

ఋగ్వేదం పదో మండలంలో ఆర్యులు మృతదేహాలను రెండు విధాలుగా వదల్చుకునే వారని చెప్పబడింది. ఒక పద్ధతి ప్రకారం భౌతిక కాయాన్ని అగ్నిలో దహింప చేయడం, రెండవ పద్ధతి భూమిలో ఖననం చేయడం. అగ్నిలో దగ్ధం చేయబడ్డ పితృ దేవతలతో బాటు భూమిలో ఖననం చేయబడ్డ పితృదేవతలు గూడా స్వర్గంలో నివసిస్తారని ఋగ్వేదంలో చెప్పబడింది. మృతి చెందిన వారిని ఖననం చేసే పద్ధతి, అగ్నిలో దహనం చేసే పద్ధతి కంటే చాలా ప్రాచీనమైనది. ఋగ్వేదంలో ఒక సూక్తంలో ఖననం చేసే పద్ధతి గురించి విశదంగా చెప్పబడింది. ఋగ్వే దానికి భాష్యం వ్రాసిన సాయణాచార్యులు మృత

దేహాలను ఖననం చేయడమే ప్రాచీన పద్ధతి అని చెప్పాడు. అధర్వణ వేదంలో మానవ భౌతిక కాయాన్ని వదుల్చుకునే పద్ధతులు నాలుగు విధాలుగా చెప్పబడ్డాయి. మొదటిది ఖననం చేయడం, రెండవది దహనం చేయడం, మూడవది విసిరి వేయడం, నాలుగవది ఉద్ధితము చేయడం అంటే కప్పి వేయటం లేక ప్రత్యేక ప్రదేశంలో ఎండబెట్టడం. ఋగ్వేదంలో ఒక చోట 'భూమి గృహ' మని వాడబడింది. యజుర్వేదంలో పితృమేధము అనేయాగంలో మృతులైన వారిని తగలబెట్టగా మిగిలిన ఎముకలను ప్రోగుచేసి ఒక కుండలో వుంచి భూమిలో పాతిపెట్టే కార్యక్రమం ఉన్నది. అధర్వ వేదంలో శవపేటిక గురించి చెప్పబడింది. శతపథ బ్రాహ్మణంలో చనిపోయిన వారి జ్ఞాపకార్థం నిలువురాతి వంటి స్మృతి చిహ్నాన్ని నిలబెట్టేవారని చెప్పబడింది. ప్రొఫెసర్. కీత్ అభిప్రాయం ప్రకారం స్వర్గంలోకి పంపబడడానికి శవాన్ని దహనం చేసే పద్ధతి వైదిక సాంప్రదాయం కాదు. ఋగ్వేదం పదో మండలంలో గ్రామానికి స్మశానానికి మధ్య ఎత్తైన మట్టికట్ట ఏర్పాటు చేయాలని చెప్పబడింది. అదే మండలంలో సమాధి చుట్టూ శిలావలయం కూడా ఏర్పాటు చేయాలని వున్నది.

మహబూబ్‌నగర్ జిల్లాలో ఊరు కొండ అనే గ్రామం వద్ద లోహయుగం నాటి సమాధులకు, ఆనాటి గ్రామ శిధిలాలకు మధ్య ఎత్తైన మట్టి కట్ట ఉన్నది. అమంగల్ లేక అమంగళం గ్రామానికి తూర్పు దిక్కుగా కొన్ని వందల సమాధులున్నాయి. దీనికి దగ్గరలోనే మంగళం పల్లి అనే గ్రామం వున్నది. ఈ మంగళం పల్లి లోహయుగం నాటి నివేశన స్థలం కావచ్చు. అమంగళం ఆ గ్రామం తాలూకు స్మశానమై వుంటుంది.

అధర్వ వేదంలో మనుష్యులకు (మర్త్యులకు) ప్రథముడైన యమ ధర్మరాజు కు రొట్టెలు, పాలు, నెయ్యి, మాంసము, తేనె, నీళ్లు అర్పించినట్లుగా చెప్పబడింది. రొట్టెలు, ధాన్యాలు, నువ్వులతో కలిపి ఎముకలపైన ఉంచబడేవి. అనేక రకాల ఆహార పదార్థాలు మృణ్మయ పాత్రలలో వుంచి చనిపోయిన వారి అస్థికలతో పాటు నిక్షిప్తం చేసేవారు. అశ్వలాయనుని గృహ్యసూత్ర ప్రకారం మనిషి చనిపోయిన వెంటనే గ్రామానికి ఈశాన్య దిశలో కాని, నైరుతి దిశగా గాని దక్షిణానికి ఏటవాలుగా ఉండే ప్రాంతం చూచి ఒక స్మశానాన్ని నిర్మించాలని చెప్పబడింది. కరీంనగర్ జిల్లా సుల్తానాబాద్ తాలూకాలోని కదంబాపూరు అనే గ్రామం వద్ద గల లోహ యుగపు సమాధులున్న ప్రదేశము దక్షిణ దిశకు ఏటవాలుగా నున్నది.

ఈ పైన చేసిన చర్చ సారాంశ మేమంటే దక్షిణ భారతదేశంలో కోకొల్లలుగా కనుపించే లోహయుగం నాటి సమాధులను నిర్మించినవారు ద్రావిడులు కాదని ఆర్యులేనని అనందిగ్ధంగా చెప్పవచ్చు. ఆర్యులలో కొందరు శవాలను ఖననం చేసేవారని, మరికొందరు అగ్నిలో దహనం చేసేవారని చాలా మంది పురాతత్త్వవేత్తలు నమ్ము తున్నారు. ఈ వాదాన్ని కొంచెం ముందుకు నడిపిస్తే యముని అనుచరులు అంటే యముని గొప్ప దేవుడుగా భావించేవారు మృతులను పాతిపెట్టే పద్ధతిని అవలంబించే వారని, ఇంద్రుని అనుచరులు దహనం చేసే పద్ధతిని అవలంబించేవారని సిద్ధాంతీకరించవచ్చు. యముడు దక్షిణ దిక్కుకు అధిపతి. కొన్ని సమాధులు (మెహబూబ్‌నగర్ జిల్లాలోనివి) దక్షిణ దిశకు ప్రవేశ ద్వారం కలిగి వున్నాయి. పైగా యముని వాహనం ఎనుబోతు. ఈ ఎనుబోతు మట్టిబొమ్మలు అనేకం సమాధులలో దొరికినాయి.

## తొలి చరిత్ర

భారత స్వతంత్ర శకంలో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో అనేక చారిత్రిక స్థలాల్లో విస్తృతంగా త్రవ్వకాలు జరిగినాయి. వీటి వల్ల ఆంధ్రదేశ చరిత్రలోని అనేక చీకటి పుటలను వెలుగులోనికి తీసికురావడం జరిగింది. ప్రొఫెసర్ రాయప్రోలు సుబ్రహ్మణ్యం గారి ఆధ్వర్యంలో కేంద్ర పురాతత్త్వ శాఖవారు గుంటూరు జిల్లా నాగార్జున కొండలో పెద్ద పెట్టున చేసిన త్రవ్వకాలలో ఇక్ష్వాకుల నాటి అనేక స్థూపాలు, చైత్యాలు, విహారాలు, క్రీడాస్థలం, కోట, అనేక హైందవ దేవాలయాలు బహిర్గతమయినాయి. నాగార్జున కొండ ఒకనాటి గొప్ప బౌద్ధ కేంద్రమే కాక అచ్చట ప్రాక్చరిత్ర నుండి మధ్య యుగం దాకా అవిచ్ఛిన్నంగా చరిత్ర నడచిందని తెలిసింది. రాష్ట్రపురాతత్త్వశాఖ వారు నల్గొండ జిల్లా ఏలేశ్వరంలో త్రవ్వకాలు సాగించి అనేక పాత రాతి, మధ్య రాతి, క్రొత్త రాతి, లోహయుగ, బౌద్ధయుగ, తొలిచరిత్రల నాటి అనేక అవశేషాలను వెలికి తీసికువచ్చారు. తదనంతరం కరీంనగర్ జిల్లా పెద్ద బంకూరు అనే గ్రామంలో నా ఆధ్వర్యంలో విస్తృతంగా జరిపిన త్రవ్వకాల్లో శాతవాహన కాలం నాటి ఇటుక ప్రాకారాలు, గృహాల అవశేషాలు, ఇటుక కట్టడాలతో నిర్మించిన బావులు, రాగి, ఇనుము వస్తువులు, మృణ్మయ పాత్రలు కోకొల్లలుగా దొరికినాయి. ఇటుక బావులకు దగ్గరలో మురుగు నీరు పోవడానికి సోకేజి గుంటలు, స్నాన గదులలో వాడిన నీరు దూరంగా

తీసుకుపోయే కప్పులు గల తూములు వగైరాలు వెలికి వచ్చాయి. ఇవేకాక అనేక వందల పురాణములని పిలవబడే వెండి నాణములు, రోము చక్రవర్తుల నాణములు, కొన్ని వేల శాతవాహన నాణములు కూడా దొరికినాయి.

పెద్ద బంకూరుకు పడమటి దిశగా 10 మైళ్ళ దూరములో నున్న దూలికట్ట త్రవ్వకాలలో ఒక శాతవాహన కాలం నాటి మట్టికోట వద్ద త్రవ్వడం జరిగింది. రమారమి 36 ఎకరాల వైశాల్యం గల శాతవాహన నివేశన స్థలం చుట్టూ ఒక మట్టి కోట నిర్మింపబడినది. కోటకు నాలుగు వైపులా ప్రవేశ ద్వారా లున్నాయి. కోట మధ్య భాగంలో జరిపిన త్రవ్వకాలలో శాతవాహనుల కాలం నాటి అనేక గదులు కలిగిన రాజమందిరం సున్నంతో గిలాబా చేయబడ్డ ఇటుక గోడలు, నేలపైన ఇటుకలు పఱచిన గదులు కనిపించినవి. ఇవే కాక అనేక ఇటుకలతో కప్పబడిన బావులు, ధాన్యాగారాలు, రాగి, ఇనుము, బంగారములతో చేయబడ్డ వస్తువులు, దంతంతో చేయబడ్డ ఒక రాజముద్రిక మొదలైనవి దొరికినాయి. ఈ రాజ ముద్రికపైన బ్రాహ్మిలిపిలో "అజని సిరియగామేకుమారియ" అని వ్రాసి వున్నది.

ఈ రాజ భవనానికి 1 కిలోమీటరు ఉత్తర దిక్కుగా ఒక బౌద్ధ స్థూపము, దానికి ఉత్తర దిక్కున ఒక విహారము త్రవ్వబడ్డాయి. ఈ స్థూపం చుట్టూ అలంకరింపబడిన ఆయక పటాల మీద వ్రాయబడ్డ శాసనాలను అనుసరించి ఈ స్థూపం క్రీస్తు పూర్వం 3వ శతాబ్దంలో నిర్మింపబడ్డట్టుగా తెలుస్తుంది. ఈ స్థూపానికి నాలుగు దిక్కులా నున్న ఆయక వేదికలు, ఆయక పటములతో (రాతి పలకలు) అలంకరింపబడ్డాయి. ఈ పటముల మీద ఆ కాలం నాటి స్త్రీ పురుషుల విగ్రహాలు అత్యంత మనోహరంగా మలచబడ్డాయి.

కరీంనగర్ జిల్లాలో గోదావరీ నదీ తీరాన గల శాతవాహన క్షేత్రము కోటి లింగాల అనే గ్రామానికి ఆనుకుని పడమటి దిక్కుగా ఉన్నది. ఈ స్థలము గోదావరికి, దాని ఉపనదియైన పెద్దవాగుకు మధ్య స్థితంగా వున్నది. ఇంత వరకు ఆంధ్ర ప్రదేశ్ లో కను గొనబడ్డ శాతవాహన కాలం నాటి స్థలాలన్నిం టిలోను కోటి లింగాల విస్తృతమైనదిగా తెలుస్తోంది. ఇక్కడ త్రవ్వకాలలో గోబధ, సమగోప, చిముక, సిరిసత మొదలైన రాజుల నాణములు కొన్ని వందలు లభించాయి. గోబధుని, సమగోపుని నాణములు భూమి లోపల బాగా లోతైన పొరలలో దొరకగా, చిముకుని, సిరిసతులునాణములు పైపై పొరలలో లభించినాయి. దీనిని బట్టి చిముక లేక శ్రీముఖ శాతవాహనుని పరిపాలనకు ముందు ఈ ప్రాంతము గోబధ, సమగోప అనేరాజుల పరిపాలనలో ఉండినట్లుగా తెలుస్తుంది.

ఇక్కడి శాతవాహన క్షేత్రము ఇంచుమించుగా ఉపరితలానికిపైన ఇరవై అడుగుల ఎత్తుగా వుండి, యాభై హెక్టార్ల వైశాల్యము కలిగి వున్నది. దీని చుట్టూ మట్టికోట నిర్మింపబడి ముఖ్య దిక్కులలో ప్రవేశ ద్వారాలున్నాయి. ఈ కోట గోడలు తూర్పు నుండి పడమరకు 1054 మీటర్ల, పొడుగు, ఉత్తర దక్షిణాలుగా 333 మీటర్ల వెడల్పు కలిగి వున్నాయి. మట్టి కోటకు అడుగు భాగాన నిర్మింపబడ్డ ఇటుక పునాది ముప్పై అడుగుల ఎత్తు కలిగి వున్నది. ఈ కోట గోడకు నాలుగు మూలల ఇటుకలతో నిర్మింపబడ్డ బ్రహ్మాండమైన బురుజు లున్నాయి. ఈ కోట లోపల అనేకమైన రాతి పునాదులపైన నిర్మింపబడ్డ అండాకార గృహములు, ఇటుక కట్టడాలు, ఇటుక బావులు, మురికినీటి కాలువలు వెలికి వచ్చినాయి. వేసవి కాలంలో గోదావరికి అవతల ఒడ్డు నుంచి ఇవతల ఒడ్డుకు బళ్లు, పశువులు దాటిపోవడానికి వీలైన మార్గాలున్నాయి. బహుశా ఈ కోట శాత వాహనుల కాలం నాటి సరిహద్దు దుర్గమై వుండి, ఇక్కడ ఒక రాజప్రతినిధి నియమింపబడి వుండవచ్చు.

కోటి లింగాల త్రవ్వకాలలో క్రీస్తు పూర్వం 3, 4 శతాబ్దాల నాటి బౌద్ధ స్థూప అవశేషాలు, వేదిక శిలలు దొరికినాయి. బహుశా తరువాతి కాలంలో ఈ స్థూపం పూర్తిగా నేలమట్టం చేయబడి వుంటుంది. కోటి లింగాలకు 3 మైళ్ల పడమటగా పాసిగాం అనేగ్రామానికి దగ్గరలో నున్న గుట్టలపైన విడివిడిగా మూడు బౌద్ధ స్థూపాలు, చైత్యం తాలూకు వేదిక, బ్రాహ్మి లిపితో వ్రాయబడ్డ ఒక శిలాఛత్రము లభించినాయి. మౌర్యుల కాలంలోను, శాతవాహనుల కాలంలోను కరీంనగర్ జిల్లాలో బౌద్ధమతానికి విపరీతమైన ఆదరణ ఉండేదని పై ఆధారాల వల్ల తెలుస్తుంది.

ప్రకాశం జిల్లా మార్కాపురం తాలూకా లో గుండ్లకమ్మ నది ఒడ్డున గల చందవరం అనే గ్రామ సరిహద్దులో ఒక బ్రహ్మాండమైన బౌద్ధ స్థూపాన్ని త్రవ్వడం జరిగింది. ఈ స్థూపం సింగరకొండ లేక సింగాల కొండ (బహుశా సింహాల బొమ్మలుండే కొండ అయి వుంటుంది) మీద నిర్మింపబడింది. ఇది చందవరం గ్రామానికి తూర్పు దిక్కుగా 4 కిలోమీటర్ల దూరంలో వున్నది. ఇక్కడ త్రవ్వకాలలోఇక బ్రహ్మాండమైన బౌద్ధ స్థూపం, దానికి నాలుగు దిక్కులా ఆయక

వేదికలు, అనేక శిల్పాలు గల ఆయక పటాలు లభించినాయి. దిగువ వేదిక చుట్టూ ఒక ప్రదక్షిణ పథము, వేదికకుపైన 10 అడుగుల వెడల్పు గల మరొక ప్రదక్షిణ పథము వున్నాయి. పైనున్న ప్రదక్షిణ పథము అండభాగము చుట్టూ ఉన్నది. అండానికి ఆనుకొని చుట్టూ 10 అడుగుల ఎత్తు గల రాతి ఆయక పటాల అంటించబడ్డాయి. వీటిని చూస్తూ అండభాగం చుట్టూ బౌద్ధులు ప్రదక్షిణం చేసేవారు. ఈ ఆయక పటాల మీద బుద్ధుని భోది వృక్షము, ధర్మచక్రము, స్థూపాకారములు చెక్కబడ్డాయి. వేదిక చుట్టూ వున్న నాయక పటాల కొన్నింటి మీద రమణీయమైన స్త్రీలు స్థూపాన్ని అర్చిస్తున్నట్లు, బుద్ధుని జీవిత చరిత్రలోని ముఖ్య ఘట్టాలయిన నలగిరి దమనము మొదలయిన ఉపకథలు అమరావతి శైలిలో మనోహరంగా మలచబడ్డాయి.

ఈ బౌద్ధ స్థూపం కొండ మీద నిర్మింపబడడం చేత యాత్రీకులకు అనువుగా దక్షిణ వైపు నుండి మెట్ల వరసలు నిర్మింప బడ్డాయి. దీని అండభాగము, వలయాకార వేదిక, ఆయక వేదికలు చెక్కు చెదరకుండా వున్నాయి. ఈ స్థూపం యొక్క వ్యాసము 148 అడుగులు కాగా, గుంటూరు జిల్లా అమరావతి స్థూప వ్యాసము 162.7 అడు గులు, భట్టిప్రోలు స్థూప వ్యాసము 148 అడుగులు, ఘంటసాల స్థూపము 122 అడుగులు, నాగార్జున కొండ మహాస్థూపము 106 అడుగులు ఉన్నాయి. మౌర్యుల కాలం నాటి స్థూప నిర్మాణ పద్ధతి ప్రకారం చందవరం స్థూపం కూడా ధృడముగా నిర్మింబపడింది. దీని ఒక్కొక్క ఆయక వేదిక 6 మీటర్ల పొడవు కల్గి, ఆయక స్థంభములను నిలబెట్టుటకు ధృడముగా నిర్మింపబడ్డాయి. ఒకప్పుడు ఆయక స్థంభములు నిలబెట్టబడ్డ గుంటలు నేటికీ కనిపిస్తాయి. ఒక్కొక్క వేదిక మీద 5 ఆయక స్థంభములు ఉండేవి. ఇవి బుద్ధుని జీవితంలో అయిదు ముఖ్య ఘట్టాలను సూచిస్తాయి. అవి జన్మము, మహాభి నిష్క్రమణము, సమ్యక్సంబోధి, ధర్మచక్ర ప్రవర్తన, మహాపరినిర్వాణము.

హైదరాబాదుకు 45 కిలోమీటర్ల ఈశాన్య దిక్కుగా నున్న కీసరగుట్ట నేటికీ ఒక మహాశైవక్షేత్రము. కీసరగుట్ట కొండల మీద ఉపరితల పరిశోధన ద్వారా అక్కడ ఒక పటిష్ఠమైన కోట ఉండిన చిహ్నాలు కనిపించాయి. ఈ కోట గోడల పునాదులు 10 అడుగుల వెడల్పు కల రాతితో కట్టబడిన పునాదిపైన, ఈ కోట గోడ పై భాగం పెద్ద సైజు ఇటుకలతో (50× 25×8సెం.) నిర్మింపబడింది. ఈ ఇటుకల పరిమాణాన్ని బట్టి త్రవ్వకాలలో దొరికిన విష్ణుకుండిన నాణాలను బట్టి ఈ కోటను నిస్సంశయంగా విష్ణుకుండిన రాజులు నిర్మించినట్లు విశదమవుతుంది. ఈ కోటకు మూడు ప్రవేశ ద్వారాలు, ఒకటి తూర్పున, రెండవది పశ్చిమాన, మూడవది ఉత్తరాన ఉన్నాయి. ఈ ప్రవేశ ద్వారాలకు ఎదురుగా శత్రుసైన్యాలు ఒక్కసారిగా మూకుమ్మడిగా దండయాత్ర చేయ కుండా నిలిపేందుకు గాను, ప్రవేశ ద్వారాలకు ఎదురుగా గోడలు కట్టబడి, లోనికొచ్చే మార్గం ఒక పక్క నుండి ఉండేటట్లుగా ఏర్పాటు చేయబడింది.

ఇక్కడ రామలింగేశ్వర దేవాలయానికి పశ్చిమాన గల కొండమీద ఇటుక యోని పీఠాలు మీద నిలబెట్టబడిన 70 శివలింగాలు 4 వరుసలలో ఉండి, ఒక్కొక్క లింగానికి 10 అడుగులు మధ్య దూరం వున్నది. ఈ లింగాలు నల్లరాతి మీద మలచబడి నునుపు చేయబడ్డ రుద్రభాగము, అష్ట భుజములు కలిగిన విష్ణు భాగము, చతుర్ముఖములు కలిగిన బ్రాహ్మభాగము కలిగి ఇటుక యోని పీఠములు మీద నిలబెట్ట బడ్డాయి. కీసరగుట్ట కొండమీద కనుపించే ప్రతి చెఱువు, ప్రతి నీటి గుంటల ఒడ్డున ఇటుక యోని పీఠాల మీద నిలబెట్టబడిన విష్ణుకుండినుల కాలమునాటి లింగములు ఉన్నాయి.

రామలింగేశ్వర దేవాలయానికి దిగువున వున్న చెఱువుకు పడమటి దిశగా జరిపిన త్రవ్వకాల ఫలితంగా విష్ణుకుండినల కాలం నాటి అనగా 4వ శతాబ్దం నాటి శివా లయం బహిర్గతమయింది. ఇది చతురస్రా కారముగా వుండి, మధ్యలో ఇటుకలతో నిర్మించిన యోని పీఠముంది. ప్రస్తుతము ఆ పీఠములో లింగములేదు. బహుశా దానిని ఈ మధ్యకాలంలో దొంగిలించి వుండవచ్చు. శివాలయానికి లోపల నేల ఇటుకలతో పఱచబడి వున్నది. అభిషేక జలం బయటకు పోవడానికి ఒక మూల ఇటుకలతో నిర్మింపబడ్డ తూము వున్నది. గర్భాలయానికి బయట నాలుగు దిక్కులా వసారాలు నిర్మింపబడ్డ గుర్తు లున్నాయి. వీటి తాలూకు కళ్లు స్థంభాలు గ్రేనైట్ రాతి పతికల మీద నిలబెట్టబడ్డాయి. క్రీ॥శ॥ 4వ శతాబ్దం నాటి శివాలయాలకు ఇది ఒక ముఖ్య నమూనా వంటిది.

రామలింగేశ్వర దేవాలయమున్న కొండకు కింది భాగంలో పెద్ద సెట్టున త్రవ్వకాలు సాగింపబడ్డాయి. ఈ త్రవ్వ కాలలో వెలికివచ్చిన అయిదు గదులు గల భవనానికి ముందు వసారా, దానికి ముందు ఆనుకుని పోర్టికో, దానికి ముందు మెట్ల వరసలు నిర్మింపబడ్డవి. ఈ భవనపు

గది గోడలు 2 మీటర్ల వెడల్పు ఉండడం చేత ఇది అనేక అంతస్థులు కలిగి ఉండవచ్చునని తోస్తుంది. బల్లపరపుగా నిర్మించిన ఈ భవన కప్పుభాగము చతురస్రాకారపు తారసు బిళ్ళలతో కప్పబడి, వాటిపైన సున్నపు గిలాబా చేయబడింది. ఈ ముఖ్య భవన మునకు ఇరువైపులా నిలువుగా మరి రెండు భవనములు నిర్మింపబడ్డాయి. త్రిశూల నమూనాలో నిర్మింపబడ్డ ఈ భవనములు చుట్టూ ప్రాకారమున్నది. ఈ ప్రాకార తూర్పు గోడ మధ్యలో ఎత్తైన ద్వారము నిర్మింపబడి దానికి ఇరువైపులా సోపాన తంతులు నిర్మింపబడ్డాయి. ఈ ముఖ్య భవమునకు బయట అనేక గదులు గల మరొక భవనముండటం చేత ఇవి రాజ భవన సముదాయముగా నిర్ణయించబడింది.

ఇక్కడి త్రవ్వకాలలో ముందు వైపు సింహము గుర్తుండి, వెనుక వైపు దీప స్థంభముల మధ్య గల కలశము గల అనేక విష్ణుకుండిన నాణములు దొరికినాయి. ఈ త్రవ్వకములో లభ్యమైన మరొక ముఖ్య వస్తువు మట్టితో చేయబడ్డ గోళాకారపు గర్భాపాత్ర. దీని చుట్టూ వికృత రూపులైన అయిదు బొమ్మలుండి, రెండు సర్పములు ఈ పాత్రను చుట్టు కున్నట్లుగా చూపబడ్డాయి. ఈ పాత్ర మూత మీద కూర్చున్న మానవాకారము వాస్తు పురుషుడు కావచ్చును. ఈ గర్భాపాత్ర భూదేవతకు సూక్ష్మరూపమై ఉండి వాసుకి, అర్గళ మొదలైన సర్పముల చేత చుట్టుకొని ఉన్నట్లుగా చూపబడింది. దీని పైనున్న వికృత రూపులు పంచ భూతాలయని భూమి, నిప్పులు, నీళ్లు, వాయువు, ఆకాశాలను సూచిస్తాయి. ఈ



కొత్త రాతియుగంనాటి పనిముట్లు

గర్భాపాత్ర అక్కడ త్రవ్వకాలలో వెలికి వచ్చిన దేవాలయపు అంతరాళంలో ఒక మూలగా నిక్షిప్తం చేయబడింది. బహుశా దీంట్లో నవరత్నాలు, నవ ధాన్యాలు వుంచి నిక్షిప్తం చేసి వుంటారు. తరువాత కాలాల నాటి దేవాలయాల్లో ఈ గర్భాపాత్రలు విమాన అగ్రభాగానుండే సూచి స్థంభము నకు క్రిందగా పెట్టటం ఆచారం అయింది.

ఇక్కడ త్రవ్వకాలలో దొరికిన రాతిఫలకము మీద చెక్కబడిన మాతృ దేవత చాలా అపురూపమైనది. ఈమె రెండు కాళ్లు పారచాచి ఎత్తిన కుడి చేతిలో సింహము తలను, ఎడమ చేతిలో శివ లింగాన్ని పట్టుకున్నట్లుగాను చూప బడింది. ఒక మరిగుజ్జు వంటి మానవాకారం భిక్షాపాత్రను ధరించి శివలింగానికి కింది భాగంలో చూపబడ్డాడు. ఈ ఫలకం శైవ, వైష్ణవాల మీద శాక్తే యౌన్నత్యాన్ని తెలియజెప్పే విధంగా మున్నది. సింహము వైష్ణవానికి చిహ్నం. లింగం శైవానికి చిహ్నం. దీనిని బట్టి క్రీ॥శ॥4వ శతాబ్దం నాటికే శైవ, వైష్ణవ, శాక్తేయాల మధ్య పెనుగులాటలున్నట్లు తెలుస్తుంది.

ఇక్కడ దొరికిన పురావస్తువుల్లో పురుష మర్మావయమును పోలిన ఒక అంగుళం ఎత్తుగల శివలింగం దొరికింది. దీనితోపాటు మట్టితో చేయబడ్డ మరొక లింగము, ఒక నంది, ధారాపత్ర కూడా దొరికినాయి. కొద్దిగా పగిలిన మహిషాసుర మర్దిని రాతి ఫలకయు, మట్టితో చేయబడ్డ గణపతులు 4వ శతాబ్దం నాటికి ఆయా దేవతల ప్రాచుర్యాన్ని తెలుపుతాయి. వీటితో పాటు ఎరుపు, నలుపు రంగులు కల పాత్రలు, సూది, బెజ్జపు మూతులు కలిగిన మద్యపాన పాత్రలు, గుప్తుల సాంప్రదాయంలో చేయబడ్డ, సుకు మారంగా మలచబడ్డ సున్నపు బొమ్మలు, శంఖాలతో చేయబడ్డ గాజులు, మట్టి పూసలు మొదలైనవెన్నో దొరికినాయి.

ఈ పురావస్తు సంచయాన్ని బట్టి కీసరగుట్ట ఇంచుమించుగా నాగార్జున కొండకు సమకాలీనంగా వర్థిల్లినట్లుగా

తెలుస్తుంది. నాగార్జున కొండలో క్రీ॥శ॥ 3వ శతాబ్దంలో ఇక్ష్వాకులు పరిపాలింపగా, కీసరగుట్టను రాజధానిగా చేసుకొని విష్ణుకుండినులు పరిపాలించి వుండవచ్చు. తెలంగాణాలో ఖమ్మం జిల్లాలోని నేలకొండపల్లి విడిచి మరెక్కడా ఇక్ష్వాకుల నాణములు గాని, శాసనములు గాని లభించలేదు. దీనిని బట్టి కోస్తా ఆంధ్ర దేశంలో ఇక్ష్వాకుల రాజ్య పాలనాకాలంలో తెలంగాణా నుండి విష్ణుకుండినులు పరిపాలించినట్లు తెలు స్తుంది. కీసరగుట్ట వద్ద జరిపిన త్రవ్వకాలను దృష్టిలో వుంచుకుని విష్ణుకుండినుల రాగిరేకు శాసనాల బట్టి నిర్ధారించిన రాజ్య వర్షాలను కొంత మార్పులు రేయవలసిన అవసరం వున్నది. 3,4 శతాబ్దాల కాలంలో కీసరగుట్టలో స్వచ్ఛమైన హైందవ సంస్కృతి విలసిల్లగా, నాగార్జున కొండలో హైందవ, బౌద్ధ మతాలు అమరికలు లేకుండా విలసిల్లినాయి.

ఖమ్మం జిల్లాలోని నేలకొండపల్లి, భద్రాచల రామాలయ ప్రతిష్ఠాపకుడైన రామదాసు జన్మించిన స్థలంగా ప్రఖ్యాతి చెందింది. ఈ గ్రామానికి ఈశాన్య దిశగాను, తూర్పు దిశగాను విస్తారమైన ఇక్ష్వాకుల, విష్ణుకుండినిల నాటి చారిత్రిక నివేశన స్థల మున్నది. ఒక దశాబ్దం క్రిందట నేలకొండ పల్లిలో రహదారని వెడల్పు చేసే కార్యక్రమాన్ని చేపట్టగా, అమరావతి శైలిలో మలచబడ్డ తొమ్మిది బుద్ధుని విగ్రహాలు వివిధ ప్రమాణములలో వెలికివచ్చాయి. ఈ విగ్రహాలు దాచే పల్లిలోలభించే లేత ఆకుపచ్చ పాలరాతి మీద అత్యంతసుందరంగా మలచబడ్డాయి. ప్రస్తుతం ఇవి గుంటూరు లోని రాష్ట్ర పురావస్తుశాఖ వారి మ్యూజియం లో వున్నాయి.

ఈ విగ్రహాలు దొరికిన చోట పాలరాతి ముక్కలు, వాటికి దగ్గరలోనే ఒక నీటి తొట్టె కనిపించడం చేత ఇక్ష్వాకుల కాలంలో నేలకొండపల్లిలో బౌద్ధ విగ్రహాలను తయారు చేసి ఇతర ప్రాంతాలకు ఎగుమతి చేసేవారని తెలుస్తుంది. ఇక్కడ ఉపరితల పరిశోధనలలో కొన్ని వందల ఇక్ష్వాకు, విష్ణుకుండినుల నాణములు దొరికినాయి. బహుశా నేలకొండపల్లి ఇక్ష్వాకులకు, విష్ణుకుండినులకు సరిహద్దు వ్యాపార కేంద్రమై వుంటుంది.

ఈ గ్రామానికి ఈశాన్యదిశగా 2 కిలోమీటర్ల దూరంలో ఒక మహోన్నతమైన బౌద్ధస్థూపం వున్నది. దీనిని ఒకపెద్ద సరస్సుకు దక్షిణ తీరం మీద నిర్మించారు. ఈ బౌద్ధ స్థూపం మీద జరిపిన త్రవ్వకాల ఫలితంగా ఈ స్థూప వ్యాసం 42 మీటర్లు ఉన్నట్లుగాను, వేదిక అయిదు ఒక దానిలోఒకటి నిర్మింపబడ్డ ఇటుక వలయాలు కలిగి వుండి, మధ్య గల ఇరుసు నుండి బయటి వలయానికి ఆకులు కలిగి వున్నది. నేటికి చెక్కుచెదరని ఈ బౌద్ధ స్థూపం భూతలం నుండి 45 అడుగుల ఎత్తు కలిగి, ఆంధ్రదేశంలోని మహోన్నతస్థూపాలలో ఇది ఒక్కటిగా చెప్పవచ్చు. ఇక్ష్వాకుల, విష్ణుకుండిని రాజుల నాణాలు లభించడం బట్టి ఈ స్థూపం క్రీ॥శ॥ 3వ శతాబ్దంలో నిర్మింపబడిందని భావించవచ్చు. ఇక్కడి త్రవ్వకాలలో అత్యంత మనోహరమైన బౌద్ధ విగ్రహం దొరికింది. దీని తల దగ్గర విరిగి, మెడకు కింది భాగం లభించలేదు. దీనితో పాటు $1^1/_2$ అడుగుల ఎత్తు మలచబడ్డ రాతిస్థూపం కూడా లభించింది.

బౌద్ధ యాత్రికులు ఉత్తర భారతదేశం నుండి విదర్భ, కోశల రాజ్యాల మీదుగా ప్రయాణం చేసి కాళేశ్వరం వద్దనో, కోటిలింగాల వద్దనో, గోదావరి నదిని దాటి పాసిగాం, ధూలికట్ట, ఫణిగిరి, గాజులబండ, తిరుమలగిరి, వర్తమానపేట మొదలయిన బౌద్ధక్షేత్రాలను దర్శిస్తూ నేలకొండపల్లి చేరి అక్కడ నుండి జగ్గయ్యపేట మీదుగా నాడపల్లి దగ్గర కృష్ణను దాటి నాగార్జున కొండకాని, అమరావతికాని చేరేవారు.

ఈ మధ్యకాలంలోవిశాఖపట్నం జిల్లాలో బావికొండ, గోపాలపట్నం, తోట్ల కొండ, భీముని పట్నం దగ్గర గల పావురాల బోడు మొదలైన చోట్ల విస్తారమైన బౌద్ధ క్షేత్రాలున్నట్లు తెలిసింది. బావికొండ, తోట్లకొండ మీద జరిపిన త్రవ్వకాలలో అనేక బౌద్ధ స్థూపాలు, విహారాలు, మండపాలు, మొదలైనవి దొరికినాయి. వీటితో పాటు రోమను, శాతవాహనులు కాలాల నాటి నాణాలు లభ్యమవడం చేత ఈ బౌద్ధ క్షేత్రాలు క్రీస్తు పూర్వం 1,2 శతాబ్దాల నుండి కీ॥శ॥ 2,3 శతాబ్దాల దాకా వాడుకలో వున్నట్లుగా తెలుస్తుంది. తూర్పు గోదావరి జిల్లాలో తునికి 15 కిలోమీటర్ల దూరంలో వున్న గోపాలపట్నం మరొక పెద్ద బౌద్ధ క్షేత్రం. ఇక్కడ స్థూపాలు, విహారాలు గట్టుల మీద నిర్మింపబడ్డాయి. ఈ బౌద్ధ క్షేత్రాలు సముద్రం ఒడ్డున నిర్మించడం చేత దేశ, విదేశాల నుండి అనేక మంది బౌద్ధయాత్రికులు వీటిని దర్శించడానికి రావడం, ఇక్కడి నుండి బౌద్ధులు విదేశాలకు పయనమై బౌద్ధ మతాన్ని తూర్పు ఆసియా ప్రాంతంలో విస్తృత ప్రచారం ద్వారా విస్తరింపచేసి, తెలుగు బావుటాను ఎగురవేశారు.

• • •

# ఆంధ్ర వైభవం

అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాఁడు,
ఓరుగల్లున రాజవీరలాంఛనముగఁ
బలు శస్త్రశాలలు నిలుపునాఁడు,
విద్యానగరరాజవీథులఁగవితకు
పెండ్లిపందిళ్ళు కప్పించునాఁడు,
పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయస్తంభ మెత్తించునాఁడు!

ఆంధ్రసంతతి కే మహితాభిమాన
దివ్య దీక్షాసుఖస్ఫూర్తి తీవరించె
నామహావేశ మర్థించి యాంధ్రులార
చల్లుఁ డాంధ్రలోకమున నక్షతలు నేఁడు!

తన గీతి యఖిలజాతిని పాటకులనుగా
దిద్ది వర్ధిల్లిన తెనుఁగువాణి,
తన పోటులు విరోధితండంబులకు సహిం
పనివిగా మెరసిన తెనుఁగుకత్తి,
తన యందములు ప్రాంతజనుల కభిరుచివా
సన నేర్ప నలరిన తెనుఁగురేఖ,
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ
లనుజేయఁ జెలఁగిన తెనుఁగుభూమి,
అస్మదార్ద్రమనోవీథి నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాడ; చావలేదు,
చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చి చదువుఁడో సదయులార!

కృష్ణాతరంగపంక్తిన్ ద్రొక్కి త్రుళ్ళింత
నాంధ్రనౌకలు నాట్యమాడునాఁడు,
ఇంటింట దేశిసాహిత్యదీపములతో
నాంధ్రతేజస్సు రాపాడునాడు,
సుకుమారశిల్పవస్తు ప్రపంచమునందు
నాంధ్రనైపుణి పంతమాడునాఁడు,
సమరసేనావ్యూహజయపతాకలక్రింద
నాంధ్రపౌరుషము చెండాడునాఁడు;

చూచి, సంతోషమున తలలూఁచి, గర్వ
మూచి, ఆంధ్రపుత్రీపుత్రు లందఁగలరు
శాంతి, నందాక లేదు విశ్రాంతి మనకు,
కంకణ విసర్జనల కిది కాల మగునె!

– రాయప్రోలు

# తెలుగు సంస్కృతి - సంప్రదాయాలు

డా॥ పి.యశోదారెడ్డి

'సంస్కృతి' అనే పదం ఈనాడు బహుళ వ్యాప్తంగా ప్రతినోటా వినిపిస్తూంది. ఈ పదానికి సమానార్థకంగా 'కల్చర్' అనే ఇంగ్లీషు పదాన్ని పర్యాయంగా ఉపయోగిస్తున్నారు. అయినా మనం అనుకున్నంత తేలిక పదం కాదు. ఎంతలోతుగా ఆలోచిస్తే అన్ని రంగులను ప్రదర్శిస్తూ చిక్కుపెట్టే బహుళార్థసాధకమైన పదం ఇది. అందుకే నిఘంటుకారులకు అన్ని అర్థాలు ఇవ్వవలసి వచ్చింది. అవసరాన్నీ సమయ సందర్భాలనూ, ప్రకరణ శుద్ధినీ పురస్కరించుకొని ఎప్పటికేది అతుకుతుందో ఆ అర్థాన్ని గ్రహించవలసి ఉంది. 'సంస్కృతి అంటే సంపూర్ణమైన సర్వతోముఖాభివృద్ధి అన్నారు. ఇట్లే కల్చర్ అనే పదాన్ని పురస్కరించుకొని,"The acquired ability of an individual or a, people to recognise and apriciate generally accepted esthetic and intellectual excellence, 2. The esthetic and intellactual achievement of civilization, 3.The total of human behaviour patterns and technology communicated from genration to genera". అంటూ రెండు మూడు నిర్వచనాలను ఇచ్చినారు నిఘంటుకారులు.

'సంస్కృత' అనే పదార్థాన్ని పురస్కరించుకొని చూస్తే ప్రయత్నము, నిశ్చయము, సిద్ధము చేయుట, ఒకదానితో ఒకటికలుపుట, తీర్చుట, మెరుగులు దిద్దుట, నిర్మించుట, పరిపూర్ణము చేయుట అనే అర్థాలు కన్పిస్తున్నాయి. అందుకే ఇన్ని ముడులకో, చిక్కులకో ఉన్న అర్థాన్ని కాకుండా, సామాన్య జనానీకానికి అందుబాటులో ఉంటూ, ముంజేతికంకణంలా, తన స్వరూపాన్ని వెంటనే ప్రకటించే సర్వ సాధారణమైన అర్థాన్ని అంటే ప్రస్తుతంతో సంబంధించిన అర్థాన్ని గ్రహిస్తే మంచిది. అప్పుడు సంస్కృతి అంటే ఒకవ్యక్తి యొక్కగానీ, సంఘం యొక్క గానీ జీవన విధానం అంటూ సులభంగా తేలుతుంది. అయితే, ఈ సంస్కృతి జన్మ సిద్ధమైకానీ, వారసత్వంగాకానీ లభించేదికాదు. ఇది ప్రయత్నసిద్ధం. అందుకే సంపాద్యం అనవచ్చు. సంపాద్యం అన్నానని డబ్బుతో కానీ, మరి వేరే వస్తువులతో కానీ కొనేది కాదు ఈ సంస్కృతి. ఇది వ్యక్తులకు, సంఘాలకు, అనేక తరాలుగా కూడబెట్టిన అనుభవరాశివలన ఈతరంలో సాధించిన నేర్పుకు దక్కేఫలం. అందుకే "స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతేనరః" అంటూ పూర్తిగా నమ్మి ఆచరణలో ఉంచింది మనహైందవ సంఘం. ఈ సంఘజీవితానికి పట్టుకొమ్మ గృహస్థు. 'యథావాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః।
'తథాగృహస్థమాశ్రిత్యవర్తంతే సర్వ ఆచారాః॥
అన్నారు. అంటే ఏవిధంగా వాయువును ఆశ్రయించి సకల జీవకోటి జీవిస్తుందో అట్లేకుటుంబాన్ని ఆశ్రయించి ఆచారాలు ప్రబలుతాయి, సంప్రదాయం జీవిస్తుంది. సంప్రదాయం' అంటే మనలో, చాలా మందికి మూఢాచారం, గుడ్డినమ్మకం, ప్రగతి నిరోధకమార్గం, అనే విపరీతభావమే ద్యోతకమౌతుంది. నిజానికి సంప్రదాయం అనే పదానికి విశిష్టమైన అర్థం ఉంది 'సమ్యక్ ప్రదీయత ఇతి సంప్రదాయః అన్నారు. అంటే సుష్ఠుగా ఒకతరం నుడి మరో తరానికి అందించే ఆచార వ్యవస్థ. ఇది కనిపించని మానదండం. రాజశాసనం కన్నాకూడా కఠినంగా, సున్నితంగా, బహుచమత్కారంగా తన ఆజ్ఞలను అనుసరింపజేస్తుంది. అందుకే సంప్రదాయానికి సార్వభౌమత్వాన్ని కల్పించినారు. ఒక సంఘంలో ఈ ఆచార వ్యవస్థ పారంపరికమై ఆచార్యుల నుండి శిష్యగణానికీ, తాతలనుండి తండ్రులకూ వారినుండి వారి సంతతికీ సంక్రమిస్తూ, ఆయా వ్యక్తులు చూసే ఆదరణవల్ల వికాసాన్ని పొందుతూ అనాదరణ వల్ల మసక బారుతూ, కొన్ని మార్పులనూ చేర్పులనూ చేర్చుకుంటూ సాగివస్తుందేకానీ, ఆ తంతువుమాత్రం, సమూలంగా తెగిపోదు. అట్లా పెరికి పారు పరచడం కూడా నాగరికలక్షణం కాదు. ఈ కారణం వల్లనే సంప్రదాయం భూత వర్తమానాలకు ఒక వారధి. భవిష్యత్తును భద్రపరిచే ఒక లక్ష్మణరేఖ. సాధారణంగా, సంస్కృతీ సంప్రదాయాలు రెండూ జంటగా కలసి, సంస్కృతీ నాగరికతలవలె ఈనాటి సభ్య ప్రసంగాల్లో పేర్కొనబడకపోయినా ఈ రెంటికీ అవినాభావ సంబంధముంది. ఒకవ్యక్తి జీవనరీతిని ఆతని కర్మాచరణం నిర్ణయిస్తుంది. తిరిగి ఆ వ్యక్తి ధ్యేయం ఆ ఆచారచక్రాన్ని సృష్టిస్తుంది. అందుకే మహాభారత అనుశాసనికపర్వంలో భీష్ముడు-

'ద్రుమముల దళ కుసుమఫలో
ద్గమముల క్రియ గర్మముల నొదవు
దత్ఫలముల్
దమతము తరిగర్తకు భో
గ్యములై నియతిని శుభా శుభకారములన్'

అంటూ చెట్లకు పుట్టిన ఆకూ, పూవు ,రెమ్మ, పిందే, పళ్ల వలె వ్యక్తి చేసిన కర్మ ఫలాలన్నీ ఆ వ్యక్తికి, శుభాశుభ రూపంలో అనుభవింపక తప్పదు అన్నాడు.

ఈ విధంగా కర్మ ప్రధానమైన భావనలో పరిపుష్టమైన భారతీయ సంఘంలో రూపు దిద్దుకున్న సంస్కృతిలో సకల శాస్త్రాలూ, సమస్త విద్యలూ, కళలూ, మతాలూ, ఆచార వ్యవహారాలన్నీ ఐహిక ఆముష్మికాలకు, ఏక సూత్రతను ఘటించడానికే పూనుకున్నాయి. అందుకే సంస్కృతి అంటే మన సంపూర్ణ జీవన విధానం. అందులో మంచీ చెడూ రెండు ఉండవచ్చు. మంచిని మాత్రమే సంస్కృతిగా ముద్రవేసి, మనదృష్టితో కొలిచి ఆ ప్రమాణాలకు అందనిది సంస్కృతి కాదు అనలేము. సంస్కృతి ఎక్కడి నుండో మిన్నులు పడ్డ తావు నుండి రాదు. వ్యక్తిని విడిచి సంస్కృతి ఉండదు. మానవుడు జన్మించినది మొదలు చివరి ఊపిరి పీల్చే వరకు జరిగే క్రియా కలాపమే కాకుండా, మృతుడైన తరువాత పరలోక కాంక్షతో జరిపే సంస్కారం అంతా సంస్కృతిలో చేరుతుంది. తిరిగి ఇది ఆ సంఘానికి సంప్రదాయంగా మారుతుంది. అందుకే సంస్కృతిలో ఆచార వ్యవహారాలూ, విధులూ, నిషేధాలు, విందులూ, వేడుకలు, పూజలూ పురస్కారాలు, ఆహార విహారాలూ, వ్రతాలూ, నోములు, పండుగలూ పబ్బాలు, కళలూ, అలంకరణలు, చమువులూ, సంధ్యలు, పెండ్లిళ్లూ, పేరంటాలు, యాత్రలూ, జాతరలు, శిక్షలూ, ఆంక్షలు, అన్ని చేరుతూ పరిపూర్ణమైన సంఘ జీవితాన్ని ప్రదర్శిస్తూ ఉంటాయి. చరిత్ర హీనుడైన పురుషుడివలెనే సంప్రదాయం లేని జాతి ఉన్నతాదర్శాలపై ఒక్క చరిత్రను సృష్టించడం కష్టం. మంచి సంప్రదాయం జాతి వృక్ష మూలాలకు ఆప్యాయమైన సత్తువను సమకూరుస్తూ పదికాలల పాటు పచ్చగా ఉంచుతుంది. కానీ ఈ ఎరువులో రసాయనాల పాలు ఎక్కువై చెట్టునేతిని వేయకుండా జాగ్రత్తలు తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఏది ఏమైనా సంప్రదాయం లేని జాతి కానీ, మతం కానీ, దేశంకానీ, సంఘం కానీ లేదు అంటే అతిశయోక్తికాదు. ఈనేపథ్యంలో ఇప్పుడు మనకు ప్రస్తుతమైన తెలుగు సంస్కృతీ సంప్రదాయాలను గూర్చి ఆలోచించవలసి ఉంది.

## తెలుగుజాతి

తెలుగు జాతి కొన్ని వేల సంవత్సరాల దీర్ఘ చరిత్ర కలిగిన జాతి. ఋగ్వేదకాలం అంటే ఐతిరేయ బ్రాహ్మణ కాలం నాటికే ఆంధ్రులు ఒక జాతిగా గుర్తింపును పొందినారు. దీని తరువాత పురాణ వాఙ్మయంలో బౌద్ధ గ్రంథాల్లో, అశోకుని శాసనాల్లో, రామాయణ మహాభారతాల్లో, విద్ధసాల భంజిక నాటకంలో ఆంధ్ర పదం జాతి పరంగా, దేశ పరంగా కూడా ఉపయోగింప బడి కనిపిస్తూ ఉంది. ఈ దేశాన్ని టాలెమీ 'ట్రిలింగాన్' అన్నాడు. ప్రతాపరుద్రీయ కర్త ఐన విద్యానాధుడు త్రిలింగ దేశం అన్నాడు. మహమ్మదీయ చరిత్ర కారులు తెలింగ, తలింగ, అంటూ పేర్కొన్నారు. నన్నయ భట్టారకుడు తెలుగు, తెనుగు అంటూ మన భాషను సంకేతించి స్థిరపరిచినాడు. తెలుగు, తెనుగు పదాలకు వ్యుత్పత్తులను చెబుతూ కొందరు తెల్లని తిలల వంటి గోసమృద్ధమైన దేశం అనీ, వింధ్యకు దక్షిణ ప్రాంతమైన ద్రవిడ దేశానికి దక్షిణ దిశగా ఉన్న దేశం అనీ, తైలాంగ్ నదీ తీరం నుండి వచ్చినందున మనవారు తైలాంగ్ తెలుగు వారనీ అనేక ఉపపక్షులను సూచించినారు. కానీ అన్నిటికన్నా ప్రధానంగా, ద్రాక్షారామ, శ్రీశైల, కాళేశ్వరాలు అనే మూడు శివలింగాలకు లేదా క్షేత్రాలకు మధ్యస్థమైన దేశం, మూడు పర్వతాలు (నగాలకు) నడిమి భాగం అనే వ్యుత్పత్తులే సార్థకాలై సమంజసంగా కనిపిస్తున్నాయి. త్రిలింగ భవం తెలుగు, త్రినగ భవం తెనుగు అంటూ స్వీకరించ వచ్చు. ఏది ఏమైనా మనం తెలుగు వారలం, మన దేశం తెలుగుదేశం, మన భాష తేనె వంటి కమ్మని తెలుగు భాష. ఈ భాషను గూర్చి కవిసార్వ భౌముడైన శ్రీనాథుడు 'దేశ భాషలందు తెలుగు లెస్స' అంటే, పాశ్చాత్య విద్యాంసులు శ్రవణ సుభగమైన, మన భాషను 'Italian of the East' అంటూ ప్రశంసించినారు. ఎవరేమన్నా 'ఆంధ్ర త్వ మాంధ్ర' భాషా చనాల్పస్య తపసః ఫలమ్' అంటూ సాగిపోదాం.

## తెలుగువారి స్వభావం

వ్యక్తి ప్రగతి పతనాల ఆంచనకు వారి వారి ప్రకృతి ప్రవృత్తుల వలెనే జాతి ప్రగతి కూడా ఆ జాతీయుల స్వభావ స్వరూపాదులపై ఆధారపడి ఉంటుంది. సంస్కృతి నిర్మాణంలో ఇది పోరాని చుట్టంగా నిలున్తుంది. లభించిన ఆధారాలను పురస్కరించుకొని చూస్తే ఈ జాతి ఆర్య ద్రావిడ సమ్మేళనంతో వికాసం పొందిన కొత్త విత్తనంగా గోచరిస్తుంది. బహుశః అందుకే నేమో, పాత స్మృతుల వలె ప్రాచీనార్య సంప్రదాయపు బిగువూ, ద్రావిడోయమైన జన్మ

లక్షణ లతో కలిసి ముచ్చట గొలుపుతుంది. సాధారణంగా తెలుగువారు జన్మతః ఉత్సాహవంతులు. ఆరంభశూరులు, ఉద్యమకారులు, కానీ పాలపొంగు వలె అంచులను మించి పొంగే ఉద్వేగం ఎంత తొందరగా పుంజుకుంటుందో అంత తొందరగా చల్లారుతుంది. కాపట్యం తక్కువ. మానధనులు. ఆత్మ పౌరుషం పై మమకారం ఎక్కువ. ఒకరి నాయకత్వాన్ని సులభంగా అంగీకరించరు. అంగీకరించినా దీర్ఘ కాలం లొంగి ఉండరు. అందుకే ఇన్ని శతాబ్దుల దీర్ఘ కాలంలో తెలుగు నేలను ఏకచ్ఛత్రాధిపత్యం కిందికి తెచ్చిన రాజ వంశాలు రెండు మూడింటి కన్నా ఎక్కువ లేవు. ప్రజలు నిర్భీకులైనా క్రూరకర్ములుకారు. పాప భీతి కలవారు. శృంగార ప్రియులు. కవితా హృదయం కలవారు. కళాత్మక ప్రకృతులు. ఉమ్మడి కుటుంబ వ్యవస్థకై మక్కువ కనబరిచే వారు. గ్రామీణ వాతావరణంలో రమించే స్వభావం కలవారు. జానపదీయమైన ప్రకృతి వల్ల వావివరుసలపై నమ్మకం ఉన్నవారు. ఉన్నత వర్గాల వారు విలాస ప్రియులు, పొగడ్తలకు ఉబ్బే గుణం ఎక్కువ. పండితులు తర్క ప్రియులు, శాస్త్ర దృక్కులు. ప్రతిభా పాటవాల పట్ల ఈర్ష్యాసూయలు ఎక్కువ. పురుషకారం కనా కూడా దైవానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవారు. అందుకే శాతవాహనుల కాలం నుండీ ఎన్నెన్నో మతాలు ఈ దేశం లోకాలూని పెరిగి పెద్ద పేటనే వేసుకున్నవి.

తొలి రోజుల్లో దేశి భాషగా తెలుగు అవ్యాకృత రూపంలో ఉన్నా రాజ భాషగా శాతవాహన చక్రవర్తులు ఉపయోగించ లేదు. ఈనాటి ఇంగ్లీషు వలె ఆనాడు సంస్కృత భాషను గౌరవ చిహ్నంగా సంభావించెడివారు. ప్రజా బాహుళ్యంలో ప్రాకృతమూ దాని విభేదాలైన మాగధీ, అర్ధమాగధీ, పాళి, మహారాష్ట్రీ, పైశాచీ భాషలు వ్యవహారంలో ఉండేవి. ఇందుకు గుణాఢ్యుని బృహత్కథను ప్రబల సాక్ష్యంగా పేర్కొనవచ్చు. దక్కన్ పీఠభూమిలో నివసించే కారణంతో వీరు దృఢమైన శరీరయష్టి కలవారైనా దీర్ఘ కాయులుకారు. కోటేరు ముక్కులు తక్కువ. పచ్చని బంగారు వన్నె కూడా తక్కువే. గోధుమ రంగు చామనచాయ నుండి కారునలుపు వారు కూడా ఉన్నారు.

## సాంఘిక వ్యవస్థ

భారతీయ సంఘం వలెనే తెలుగు వారిలో కూడా వర్ణ వ్యవస్థ కట్టు దిట్టంగానే ఉంది. ఇప్పుడు క్షత్రియులు లేరు. మధ్య కాలంలో దేశీయులైన రైతు కుటుంబాలు కత్తినివట్టి బాహుబలంతో శౌర్య ప్రదర్శనంతో శత్రు సంహారం కావిస్తూ రాజ దండాన్ని చేతబట్టి ఆది రాజుల వలె ప్రజా పాలనం చేసినారు. వారిలో చాళుక్య, రాష్ట్రకూట, రెడ్డి, వెలమరాజ వంశాలను పేర్కొనవచ్చు. కానీ రాజ్యాలు సమసి పోయిన తరువాత ఈనాడు వీరు వ్యవసాయం ప్రధానవృత్తిగా జీవిస్తున్నా, పూర్వపు వాసనా బలంతో రాజకీయ రంగంలో ప్రధానులుగానే ఉన్నారు. వ్యవసాయ మూలకమైన తెలుగు దేశంలో ఇతర వర్గాల వారు అంటే వృత్తులవారు కమ్మరి, కుమ్మరి, వడ్రంగులే కాకుండా, గీత, నేత, కుట్టు, మొదలైన పనిపాటల వారందరూ సంఘ వ్యక్తికి ప్రధానమైన అంగాలవలె ఉండేవారు. తొలి నుండి వేద విద్యాధికారంతో అగ్రవర్ణంగా, గుడి, బడి, మడి మాన్యాలతో గౌరవంగా జీవించేవారు బ్రాహ్మణులు. అయినా ఎవరి స్థానం వారిదే ఎవరి ప్రాముఖ్యం వారిది. దెబ్బ విడిచినా, ఏది కించపడినా సంఘ వ్యక్తి ఆరోగ్యం దెబ్బతింటుంది. తెలుగు వారి మడి బట్ట మరక పాలైనట్లుగా జాతిలో అంటరాని సమస్య ఒకటి ఉండేది. కాలం తెరిచిన కన్నుతో ఆ మరక ఇప్పుడు చెరిగిపోయింది. కానీ రాజకీయ కారణాల వల్ల పూర్వం కన్నా ఇప్పుడే వర్ణవ్యవస్థ వింత పువ్వులను పూస్తూ చిలువలు పలవలుగా పెరిగింది. పంక్తి భోజనాలూ, కౌగిలింతలూ ఉన్నా అరమరికలు లేని నిండైన నమ్మకాలు లేవు. ఈనాటి ప్రజాస్వామ్యంలో అందరూ సమానులు. అందరూ అన్ని పదవులూ నిర్వహించ వచ్చు అనే అభయ హస్తంతో, వృత్త్యా ధారమైన కుల వ్యవస్థ సడలి అది జన్మతో ముడిపడింది. ప్రతి రంగంలో అర్హతల కన్నా మరి ఇతరాలకు ప్రాధాన్యం ఎక్కువైంది. పోటీ నాగరికతలో అహ మహమికలు ఎక్కువై, మార్గాలేవైనా గమ్యం చేరడమే ప్రధానం అనుకుంటు న్నాడు పాపం మన తెలుగు వాడు కూడా.

## రాజకీయ వ్యవస్థ

క్రీస్తు శక పూర్వ శతాబ్దుల్లోనే పాలకులు గా ప్రసిద్ధులు కాబట్టి వీరు రాజతంత్రకుశలురు అని వేరే చెప్పవలసిన పని లేదు. అందుకే మన తెలుగు దేశం అనేక దండయాత్రలకూ, విప్లవాలకూ, హత్యలకు సాక్షీ భూతంగా నిలుస్తూ చేదు గుళికలను మింగింది. ప్రజా రంజకులైన ఆయా ప్రభువుల లాలనలో, సుఖాన్ని పొందింది. బ్రిటిష్ పరిపాలననూ రుచి చూచింది. దాస్యంలో, దారిద్ర్యంలో అజ్ఞానంలో, క్రుగ్గింది. దేశ భక్తులైన యువకులెందరో తల్లి దాస్య విముక్తి కోసం ఎన్నో పోరాటాలు జరుపుతూ నిండు ప్రాణాలను బలి ఇస్తూ ఉంటే దీనంగా చూచిందాతల్లి. అవే అనేక పేర్లతో రూపొందిన ఉద్యమాలు, పార్టీలు, కాంగ్రెస్,

కమ్యూనిష్టు, రామదండు, జస్టిస్, మార్క్సిస్టు, సోషలిస్ట్, స్వతంత్ర, మొదలైనవి. ఈనాడు తెలుగు దేశంలో జనతా, భారతీయ జనతా, తెలుగుదేశాలే కాకుండా అనేక దళాలు, నక్సలైట్లు, సమావాద, అతివాద, మితవాద, భయవాద, ధోరణులతో నానానేక రాజకీయ వర్గాలెన్నో బయలు దేరినాయి. పాపం అందరినోట్లో మెలిగే వాడు అట్టడుగువాడు. ఈనాడు వాడే అందరి ఆశలకు కుదురైన వాడు, నోటు కూ సీటుకూ పసందైన మొండి పెదవాడు.

## మతవ్యవస్థ

ఒక వ్యక్తి మతాన్ని సృష్టించినా దాన్ని పాటిస్తూ అనుసరించే జన బాహుళ్యం లేనినాడు మతం కాదు. మతం అంటే ప్రగాఢమైన విశ్వాసం. ఇది దేవుడు ఉన్నాడు అనే నమ్మకం వైపు గమించినప్పుడు ఆస్తి కం ఔతుంది. లేని నాడు నిరీశ్వరాకాలైన తర్క న్యాయ, వైశేషిక రూప దర్శన సిద్ధాంతాలుగా రూపొం దుతాయి. వీటికి బుద్ధి బలమే ప్రధానం. మరికొన్ని, ఈశ్వరుడున్నాడా లేడా అనే వాదంతో ప్రమేయం లేకుండా జీవకారుణ్య రూపమైన మానవతా విలువలపై నిలిచిన మతాల్లో జైన, బౌద్ధ మతాలు ప్రధానంగా పేర్కో దగ్గవి. కానీ ఈ రెండూ రాను రాను తమ ప్రాభవాన్ని గోల్పోయి తెలుగు దేశాన్ని దాటి పరసీమలు తొక్కినాయి. బుద్ధ దేవుడు ఆవతార పరంపరలో ఒక అవతారంగా స్వీకరింపబడి సాగతమత ధుర్యుడుగా పూజలందుకున్నాడు. మన దేశంలో శాక్తేయ, గాణాపత్య, కాలభైరవ, కాపాలిక, తాంత్రిక, మతాలు కూడా ప్రబలి ఉగ్ర, రహస్య పూజా విధానాలకు పుష్టి చేకూరింది. మహా మేధావి ఐన శంకరా చార్యులూ, కుమారిల భట్టు వీరిరువురూ వైదిక మతాన్ని పునరుద్ధరింపచేసిన కారణ జన్ములుగా గ్రహింపబడుతున్నారు. పూర్వ మీ మాంసా విధానాన్ని 'తెలుగు నాట, కుమారి భట్టు ఉద్ధరించి తెలుగు నాడును యజ్ఞ యాగాది కర్మ కాండలతో పునీతం చేస్తూ సామాన్యుడిని భగవంతునికి దూరం చేస్తే, ప్రచ్ఛన్న బౌద్ధుడుగా ఆది శంకరులు మిథ్యా వాదాన్ని పరికల్పించి అద్వైత మతానికి పట్టుకొమ్మ గా నిలిచినారు. ఈవిధంగా సంసార బంధం నుండీ, తాపత్రయ వలయం నుండీ మానవుణ్ణి ఉద్ధరించేందుకు ఏర్పడ్డ మతం మానవుణ్ణి మరింత బంధిస్తూ ఈ కర్మ కాండలో ముంచెత్తినప్పుడు ఊపిరి సలుపని సామాన్యుడిని ఉద్ధరించేందుకు భక్తి మార్గం సులభతరమై కనిపించింది. అవే, వీరశైవ, వీరవైష్ణవ మతాలు.

## భక్తి ప్రధాన మత స్వరూపం

సంఘం కేంద్రంగా స్త్రీ పురుష విభేదం, వర్ణాశ్రమ ధర్మం, యజ్ఞ యాగాది కర్మలతో నిమిత్తం లేని బౌద్ధం తెలుగు నేలను పునీతం చేస్తూ ప్రాంతీయ భాషలకు ప్రాభవాన్ని కల్పించిన రీతి, కొందరు మేధావుల దృష్టిని ఆకర్షించింది. ఈ సిద్ధాంత స్వరూపం ప్రాతిపదికగా కర్ణాటక దేశంలో బ్రాహ్మణకుటుంబంలో జన్మించిన బసవేశ్వరుడు ఉపనయ నాది సంస్కారాలను త్యజించి శివుడే పరదైవంగా భావిస్తూ గురు లింగ జంగమార్చన రూపమైన వీర భక్తి విధానాన్ని ప్రవచించినాడు. ఇది ఒక మహాగ్ని జ్వాలవలె తెలుగు దేశాన్నీ తాకింది. స్త్రీ బాల వృద్ధమైన తెలుగు నేలంతా విభూతి దారణతో రుద్రాక్ష మాలికలతో అలంకృతమై శివ నామంతో మారు మ్రోగింది. ఈ మతం, కేవలం మతపరంగానే కాకుండా సాంఘికంగా, సాహిత్య పరంగా కూడా తిరుగులేని విప్లవాన్ని తెచ్చింది. ఈ మతంలో పంచము లెందరో చేరి తరించినారు. ఈ మతం సోమరితనాన్నీ, అగ్రవర్ణాల అహంకారాన్నీ, పురుషాధిక్యాన్నీ నిరసించింది. ఈశ్వరుణ్ణి భక్తుడు ప్రియుడుగా ఆరాధించవచ్చు. వారి దృష్టిలో శివుడొక్కడే పురుషుడు, తక్కిన వారందరూ స్త్రీలే. శివాపచారం చేసినప్పుడు వివాహిత ఐన స్త్రీ భర్తను వదిలి వేయవచ్చు అంటూ స్త్రీ స్వాతంత్ర్య దిశలో ఒక పెద్ద మలుపును చూపింది. బలహీన వర్గాలను చేరదీస్తూ సంఘటిత పరిచి ఒక బలవంతమైన సంఘ శక్తిగా రూపొందించింది. అందుకే వీర శైవులు రాజకీయాల్లో కూడా ప్రముఖమైన పాత్రను వహించినారు. ఆ కాలం నుండే భవుల దర్శన స్పర్శలను పరిహరించిన పాల్కురికి సోముడు పాటకు అనుకూలమూ, దేశీయమైనద్విపద ఛందస్సులో కావ్యాలు వ్రాసి జాను తెనుగును ప్రచారం చేసినాడు. ఇట్లే తమిళ దేశంలో భక్త శిఖామణులైన నయనారులూ, ఆళ్వారులు విష్ణు పారమ్యం తో వైష్ణవానికి అంటే విశిష్టాద్వైతానికి కొత్త రూపాన్ని కల్పించినారు. భజ 'సేవాయం' అనే ధాతు నిష్పన్నమైన భక్తి మార్గంలో నవ విధ భక్తి మార్గాలూ చోటు చేసుకుని సంకీర్తనా చార్యులైన తాళ్లపాక వారి వల్ల రసధునిగా జాలు వారింది. మహా కవులైన ఎఱ్ఱన, పోతనలు భక్తికి శృంగారాన్ని జోడించి దైవరతికమైన దివ్య శృంగార రూపంలో ప్రచారం కావించినారు. 'గోపిక లెవ్వరు? గోపాలుడెవ్వరు? సర్వాత్మకుడైన హరి క్రీడ సలిపె' అంతే కదా! అంటూ తేల్చి నాడు. ఎండిన మోడులు చిగురించేంతటి మధుర రసాయనాన్ని నింపి, నీరసమైన సంసారాన్ని సంసారంగా తీర్చింది మధుర భక్తి. ఈతత్త్వమే గోదా దేవిచే శ్రీ రంగేశుని భర్తగా వరింపచేసింది.

దేశమంతటా ఆలయాలూ, కోవెలలలూ వెలసినాయి. అంగ రంగ వైభోగాలు, మేళ తాళాలూ, నృత్య గీత వాద్యాలూ, మేలు కొలుపులు, సేవలు ఊరేగింపులు, ఉత్సవాలు, దీపారాధనలు, అలంకరణలు, కళ్యాణోత్సవాలు, రథోత్స వాలు. అన్నీ తప్పనిసరి. భుక్తీ ముక్తీ రెండిటికీ పుష్కలంగా వీలు చిక్కింది. దేవాలయాల్లో సకల జగత్సార్వ భౌముడైన స్వామిని రంజింప చేసేందుకు నృత్యం అనివార్యమైంది. అందుకోసం దేవదాసి వ్యవస్థ ఒకటి, సరంగా, శాసంగా కూడా సంఘంలో ప్రవేశించింది. ఇదే పద్ధతి శివాలయాల్లో బసివి అనే ఆ జన్మ బ్రహ్మచారిణిగా స్వామి పేరు మీద విడిచిన పసరంలా ఉండే వ్యవస్థకు దారితీసింది. ఇదే వ్యవస్థ రాను రాను ఆట పాటలను తగ్గించి వ్యభిచారాన్ని వృత్తిగా నిలిపింది.

మన తెలుగు దేశంలో సిద్ధ సంప్రదాయం ఒకటి మధ్య కాలంలో బాగా వ్యాప్తిలో ఉండేది. మహరాష్ట్రవలెనే ఇక్కడ కూడా నాథ సంప్రదాయం ప్రచారంలోకి వచ్చింది. అందుకే సిద్ధులూ, యోగులూ ప్రబలినారు. ఈ భక్తి భావనలో నానా విధాలైన మంత్ర తంత్ర ఔషధ ప్రక్రియలు ప్రబలి నాయి. ఈ మధ్యలో మహమ్మదీయ ప్రభావంతో పీరీలు, న్యాజులు, దర్గా సందర్శనాలు, తావీజులు, నెమలి కట్టతో దులిపి ఊదుపొగ వేయడాలు, పీరీల పండగ నాడు అలాయి (నిప్పు గుండంలో) నడవటం, శివమెత్తి ఊగడం మొదలైనవి అన్నీ మన గ్రామీణులల్లో చోటు చేసుకున్నాయి. అట్లే కోస్తా జిల్లాల్లో మేరిమాత పూజలు, అధికంగా కనిపిస్తాయి. ఈ ప్రభావం పేర్లల్లో కూడా పడింది. జార్జిరెడ్డి, మస్తానమ్మ, జోసఫ్ శర్మ, మేరీ సరస్వతి అనే పేర్లు వినిపిస్తున్నాయి.

తెలుగువారు ఆస్తికులే కాదు నాస్తికులు కూడా. చార్వాకసిద్ధాంతా సక్తులైన వారు పరలోకాన్ని నమ్మరు. రేపటి జన్మలేదు. ఏ అనుభవమైనా అప్పటికదే సత్యం. నిన్నా రేపులు లేవు అంటూ బోధించేవారున్నారు. లెక్కలేని సంఖ్యలో బాబాలు, జోగులు, జంగాలు, మఠాధిపతులు, స్వాములు, జియ్యరులు, ముండిత శిరస్కులు, కౌపీనధారులు, ఎన్నడూ కత్తి పెట్టి ఎరుగని గడ్డాలు మీసాల అయ్యలు, నీళ్లపై నడిచేవారు, ముండ్లపై నిద్రించేవారు, వాయుభక్షకులు జలభక్షకులు, సుఖాసక్తులు, భోగులు, శుష్క దేహులు, అందరూ ఇహ పరాలను గూర్చి చెప్పేవారే. ఇందరిలో వేమన యోగి, వీరబ్రహ్మం, సత్యసాయీలు మన తెలుగు వారికి పరమ ఆప్తులు.

ఇంకొక వంక అతి సామాన్యులైన గ్రామీణులు గ్రామ దేవతలను సృష్టించుకొని ఆవరివారాన్ని సాధ్యమైనంత పెంచినారు. ఈ దేవతలల్లో పోచమ్మ, వెల్లమ్మ, బాలమ్మ, మైసమ్మ, పైడతల్లి, గంగానమ్మ, నూకాలమ్మ, మల్లమ్మ, ఎందరో అట్లే బీరప్ప, మల్లన్న గట్టయ్య, నాగరాజు మొదలైన పురుష దేవతలు. వీరికి తోడు ఆవు, పాము, కప్ప, ఎద్దు మొదలైన జంతు పూజలు, వృక్షపూజలు, ఇవన్నీ మన సంస్కృతిలో చేరి ఇహ పరాలకు నిచ్చెనవేసినట్లుగా జాతిని నడిపిస్తూ సంప్రదాయ బద్ధం చేస్తున్నాయి.

ఏ సంప్రదాయమైనా గాలి మేడలా ఏ ఆధారం లేకుండా నిలవదు. ఒక ఆచారం సంప్రాదాయంగా పాదు కునేందుకు రాజకీయ, సాంఘిక, మత, దేశ, కాలశీతోష్ణాదులెన్నో కారణాలై ఉపకరిస్తూ ఉంటాయి. అందుకే ఇంత పెద్ద ఉపోద్ఘాతం అవసరమైంది. ధర్మార్థకామమోక్షరూపమైన పురుషార్థ సాధనకూ, గృహ నీతికీ, సుఖ శాంతులకూ, శిక్షణా పోషణా పాలనలకు స్త్రీ వినా గతిలేదు. అందుకే ఆమెను అన్ని కట్టుదిట్టాలతో పెంచడం. సదాచారాలకూ, సంప్రదాయ పరిరక్షణకు ఆమె ఉపాదాన కారణం. ఆమె కేంద్రంగా ఆచారాలు, కట్టుబాట్లు, అన్నీ సంపన్నమౌతాయి. అయినా ఆమె జీవితం, కత్తి మీది సామువంటిది. ఆమె ఎప్పుడు దైవీయమైన శక్తి ఒకటి తనను కాపాడవలెనంటూ కోరుతుంది. భర్తప్రేమ కోసం తపిస్తుంది. ఆయనే ఆమెకు ఏదుగడి. అందుకే స్త్రీకి మంచి వరుడు కావాలన్నా, సుమంగళిగా వర్ధిల్లవలెనన్నా, కడుపు పండవలెనన్నా దాపురించిన చిక్కులు సమసిపోవలెనన్నా, గండం గడుప వలెనన్నా. నోములూ, వ్రతాలూ, పూజలూ, మొక్కుబడులూ, ముడుపులూ తప్పవు. ఈ నోములల్లో సత్యనారాయణ వ్రతం, గౌరీ నోము, శ్రావణ శుక్రవారపు నోము, తులసి పెండ్లి, మూగనోము, చిట్టి బొట్టునోము ముఖ్యం. పండుగ, పబ్బం, నోము, వ్రతం అంటే ఇల్లు కదలని స్త్రీలకు క్లబ్‌తో సమానం. తెలుగు స్త్రీలకు పసుపు కుంకుమలు ముఖ్యం. అవి మాంగల్య చిహ్నాలు. అట్లే, సువాసనలు వెదజల్లే గంధం కూడా ఇష్టమే. కాళ్లకు పసుపురాసి, మంగళసూత్రాలకు పసుపులు ఇవ్వడం, గడుపలకూ, చేతులకు గంధం రాయడం ఆచారం. రవికె కణుసులు, గాజులు, కుంకుమ భరణీలు, శెనగలు చేటలతో వాయనాలివ్వడం, కొబ్బరి కాయను ఫలదానంగా ముత్తైదువకు ఇవ్వడం విశేషం.

## నగలు

తెలుగు వారికి ఏడు వారాల సొమ్ములుండేవి. ముత్తైదువకు

అన్నిటికన్నా ముక్కెర ప్రధానం, అదే ఈనాడు ముక్కుపోగు, ముక్కుపుడక రూపంలో వాడుతున్నాం. ముక్కుకు బులాకీలు ఉండేవి. తలకు నాగరం, శిగ బిళ్ల, సూర్య చంద్రులు, రాకిడి, చంద్ర వంక, పింపిణి, జడకుచ్చులు, జడ బంగారు, నవరకుప్పె, బంగారు మొగ్గలు, రాళ్లు పొదిగిన పాపెటసేరు, హంసపిన్నులు ఉండేవి. చెవులకు బుగిడీలు, బావులీలు, తణుకులు, గువ్వ పోగులు, కమ్మలు, గంటీలు, గున్నాలు, చెంపసరాలు, ముత్యాల గొలకలు, కర్ణాభరణాల్లో వజ్రాలు, కెంపులు, చేతులకు కడియాలు, కంకణాలు, వొడిగొలుసులు, పోంచీలు, గిరిగాజులు, వారి వారి తాహతుననుసరించి రవ్వలూ, ముత్యాలు పొదిగిన గాజులూ, ఉంగరాలు ముంజేతులపైకి వొంకు, దండకడియం. నాఫణి, చేతి పురులు, చౌకట్లు, ఒడ్డె కొంకులు ముఖ్యం.

నడుముకు వొడ్డాణం, గజ్జెలు, గంటలు, బిళ్లలతో సింగారింపబడేవి. వీటిపైన అపురూపమైన నగిషీ పని కనిపించేది. పూల తీగలాలను మొలకట్లని, మొలనూళ్లని పిలచేవారు. ఇతర స్త్రీలకన్నా ఆంధ్ర స్త్రీల నడుము సన్నగా ఉండడానికి కారణం నడుముకు పెట్టే బిగువైన మొలనూళ్లేనేమో. బీద వారు పురికోసను కట్టుకునేవారు. పనిపాటలప్పుడు తమ చీరను పిరిసుట్టు పోస్తారు అంటే బిగువు కట్టుకడ్తారు. కాళ్లకు కడియాలు, కాకర కాయ, తుమ్మకాయ గొలుసులు, పాంజీబులు, తొడాలు వెండివి, సంపన్నులకు బంగారం మామూలు. వివాహితలు మాత్రం కాలి రెండవ వ్రేలికి మట్టెలు తొడుగుతారు. లేని వాళ్లకు కంచువైనా సరే మాంగళిక చిహ్నంగా తప్పక పెట్టుకుంటారు. అవివాహితులైన కన్యలు పెద్దన వ్రేలికి అలంకారార్థం ధరించెనగను పిల్లాండ్లు అంటారు.

## కంఠాభరణాలు

స్త్రీలు మెడలో ధరించే నగలకు లెక్కలేదు. వివాహానికి ముందు అమ్మాయికి మెడలో 'తీగ' పెట్టి, తమ పిల్ల అనిపించుకునేవారు. 'కంటె' ఇది రాళ్ల కంటె, ముత్యాలకంటె, బంగారు కంటె అనే భేదాలతో అనేక విధాలు. 'తుస్సె' ఇది బంగారు గజ్జెలు చుట్టు రాచుట్టిన నగిషీ బిళ్లలు అమర్చిన నగ. నాను, వన్టెడ, జోమాల దండ, యాకళ్ళసరం, పచ్చల దండ, నక్షత్రమాల, అడ్డిక, మామిడి పిందెల దండ, ఒంటిగజ్జె, ముత్యాలహారాలు, తాయిత్తులు, చిలుకల పేరు, నవరత్నాల దండ, కాసులపేరు, బన్నసరం, పొట్లపూస దండ, చంద్రహారం, సూర్యహారం, గుండ్లటిక్కి, గుండ్ల పేరు, చింతాకు పతకం, లవంగాల దండ, గుమ్మడి గింజల పేరు, జతగుండ్లు, మొగ్గల దండ, తాపళం, నాను పతకం ఇది బంగారు ఆభరణాలు, ఓరుమిడి దండ, ఇవేకాకుండా రత్నాభరణాలు. వజ్రాల పొదుగులు, తలనిక్కులు కొప్పుగొలుసులు, ఎన్నో పేర్లు తెలియని ఆభరణాలు మన ఆంధ్ర స్త్రీలు ధరించేవారు. పేదవారు రాగి, వెండి, కంచు, ఎముకలలో చేసిన నగలు ధరించేవారు. చెవులకు తాటాకులతో చేసిన సొమ్ములను ధరించే కారణంతో చెవి కమ్మలను తాటంకాలని అంటారు. ఉన్నా లేకున్నా ఆడవారికి సొమ్ములంటే ప్రీతి. అవి పోతపగడాలైనా, రంగు పూసలైనా సరే అలంకరించుకుంటారు. పూర్వపు కథలల్లో లేని తల్లి లక్కాకు నల్ల పూసలను రత్నాభరణాలకన్నా, ఎక్కువగా సంభవించింది. శ్రీమంతం తో పని లేకుండా ముత్తైదువలు అందరికీ నల్ల పూసలు తప్పని ఆభరణ విశేషం. స్త్రీ ఆభూషణాలను ధరిస్తే భర్తకు ఆయువు వృద్ధి ఔతుందనే సమ్మకం తెలుగువారి విశేషం. ఏ శుభకార్యం చేసినా అది నిర్వర్తించే ఇల్లాలు ముక్కుపోగు లేకుండా కూర్చోదు. ముక్కుకు రంధ్రం లేకున్నా, తనతో ఆ నగలేకపోయినా అరువుగా తెచ్చుకొని, మెడ దండకు చేర్చి ఆవిధి నిర్వహణ చేసే ఆచారం ఉంది. పై సింది (ఉద్వర్తనం), కాటు, ఆగరు (చాను) ఇంట్లో తయారు చేసుకునేవారు. ఎన్నో తీరుల తిలకాలు, తీర్చుకునేవారు.

## పురుషుల ఆభరణాలు

చెవి పోగులు, కొనికె పోగులు, దండకడియాలు, పట్టీలు, గుండీలు, గొలుసు గుండీలు, ఉంగరాలు, మెడలో హారాలు, గొలుసులు, ముత్యాల దండలు వేసుకునేవారు. వేసుకుంటున్నారు. వీర చిహ్నంగా కాలికడియం పెండేరం, గండ పెండేరం, మొలకుబడికి బేడీలు ధరించేవారు. వయసు మళ్లినవారు రుద్రాక్షతో కూడిన తావళాన్ని తులసి పూసల దండలు వేసుకుంటారు.

ధోవతులు, రవన ల్లాలు, జరీసెల్వాల వాడకం ఎక్కువ ఉత్సవ వేళల్లో కలవారు పట్టుధోవతి, పట్టు కండువాలు వాడేవారు. తలకు విచిత్ర వర్ణాల తో నేసిన పెద్ద తలపాగాల ను ధరించేవారు. విశేషసందర్భాల్లో బుజ్జాలు, కూర్పాసాలు, అంగర ఖాలు, అంగీలు తొడిగేవారు. ధోవతిని కట్టే పద్ధతులు అనేకాలు. శుభకార్యాలు చేసేప్పుడు తలకు రుమాలు (తలపాగా అవసరం) అది లేకపోతే ఏదైన తుండుగుడ్డను కట్టి పని ప్రారంభిస్తారు. భుజం మీద అంగ వస్త్రం కూడా ముఖ్యం. మీసం మగ వాడికి గర్వ చిహ్నం. అయినా కొందరు పెంచని వారు కూడా ఉన్నారు.

## స్త్రీల వస్త్ర విశేషాలు

వస్త్ర వ్యాపారాభివృద్ధికి ముఖ్యాతిక ముఖ్యసం పాలు స్త్రీలే ఆలంబనం. మన తెలుగు దేశం నూలు, పట్టు వస్త్రాలకు ప్రసిద్ధి.మనకు పీతాంబరాలు, ముత్యాల పందిళ్లు శ్రీవన్నెనాలు, దుకూలాలు, ముగ్గొంగు చీరలు, గువ్వకన్నంచులు, రుద్రాక్ష అంచులు, బొమ్మంచులు, అత్త కోడళ్ల చీరలు, కళానతులు, ఉడ్డపట్టెలు, జింక చాళ్లు, పులిచాళ్లు, కలినేతలు, జలతారు మళ్లు, కోటకొమ్మలు, బిల్లసాళ్లు, హంసపన్నెలు, చిలుకల చిన్నెలు, గంగ సరాలు, అంచుపట్టులు, మెకాల వేటలు, జరీపూలు, చుక్కల చీరలు, అద్దకాల చీరలు, గట్టి అంచులు, అర్ధ సింహాసనాలు, సింహాసనాలు, ఇవి పూర్తిగా జరీ ముద్దలు. ఒక వైపు బంగారు తలుకు తానె వెండిజరీ, రెండవవైపు పట్టు మాత్రమే కనిపించే దోహరీ నేతలో ఉన్న విలువైన చీరలు ఇవి. ఇవన్నీ తెలుగువారి హస్త కళా సంపదకూ, నేతపనితనానికీ, కళాభిరుచికీ అద్దం పడ్తుంటాయి. దేశంలో గద్వాల, పెద్దాపురం, కొత్త కోట, వెంకటగిరి, నారాయణ పేట, ఆర్మూరు. పుల్లంపేట, కాళహస్తి, గుంటూరు ప్రధాన స్థానాలు.

## రవికెలు

అద్దాల రవికెలు, పోత రకవికెలు, కసీద కుట్టు రవికెలు, జింగణ్ణ రెక్కలు కుట్టిన రవికెలు, పూసల రవికెలు, చాళ్లు, అంచులు, హంసలు, చిలుకలు, వరుసలు, అషరీఫీలు, అక్షింతల కుట్లు, కుట్టిన అపురూపమైన రవికలెన్నో తెలుగు వారి సొమ్ము.

పసిపిల్లలను కూడా ఆభరణాలతో తల్లులు అలకంరిస్తారు. మెడలో అసిలి, పులిగోరు దండ, మొలతాడు, గజ్జెల మొలతాడు, చేతులకు వొత్తులు, చాకట్లు, చెవిపోగులు తప్పవు. స్త్రీ పురుషులు ఇద్దరికి చెవులు కుట్టించడం తెలుగువారి ఆచారం. కాళ్లకు కడియాలు, ఆడపిల్లలకు సిగ్గుబిళ్ళ వేయడం ఇంకా మానలేదు. పసిపిల్లలకు పుట్టు వెంట్రుకలు దైవ సన్నిధిలో తీయడం చిన్నపాటి ఉత్సవం చేసుకోవడం మన ఆచారం.

మన ఇంటికి తప్పక రావలసిన బంధు మిత్రులను బొట్టు పెట్టి పిలుస్తాం. దాన్ని బొట్టు చెప్పడం అంటారు. శుభకార్యావసరాల్లో బంధు మిత్రులు ముట్ట చెప్పే ధనరూపమైన కానుకలకు ముయ్యేలు అంటారు. అది స్వీకరించిన వారిపై ఉన్న ఋణం దీన్ని తిరిగి వారింటి శుభ కార్యాలప్పుడు చెల్లించుకుంటారు. బొట్టు చెప్పిన కడప సంఖ్యను బట్టి వచ్చే సంఖ్యను అంచనా వేసి భోజనాలను ఏర్పాటు చేసు కుంటారు.

కన్య సమర్తాడినప్పుడు, వేరుగా హోమూలన గుడ్డపరిచి కూర్చోబెట్టడం, వరిచిన బట్టకు నాల్గవైపులా తమలపాకులల్లో నువ్వులూ నూకలూ కలిపి పొయ్యడం పద్ధతి. ఆ అమ్మాయికి ముత్తైదువలు అంబుతో (చొప్ప కట్టెకు ఆకును ముల్లుతో కుచ్చినది) తలపై నూనె వేస్తారు. రెండు పూటలా హారతి ఇచ్చి పాటలు పాడ్తారు. ఆ అమ్మాయిని అనేక వేషాలతో అలంకరించి మేలు కల్లు చాందినీ కిందకూర్చోబెడ్తారు. ఇంట్లోకి వచ్చే రోజు పండుగ చేసుకుంటారు. ఇప్పుడా పద్ధతులు లేవు. కడప ముందు కర్ర, చెప్పులు ఉంచడం పరిపాటి. కత్తికి నిమ్మకాయకుచ్చి పెడ్తారు.

## వివాహం

అన్ని జాతులకు వలెనే తెలుగువారికి కూడా పెండ్లిళ్లు వేడుకలు. తెలుగువారు పెండ్లికి ముందు వరపూజ చేసారు. అట్లే మగ పెళ్లివారు నిశ్చితార్థం చేస్తారు. మనకు వెదురు కోళ్లు ముఖ్యం. తరలి వచ్చిన పెండ్లి వారిని విడిదిలో దింపి పసుపు కుంకుమలిచ్చి, బుక్కా గులాలు చల్లి, చల్లని పానీయాలు ఇచ్చి, దుమ్ము కాళ్లు కడిగి దివిటీలు వెలిగించి వరుస కలిసిన వారితో సరస సల్లా సాలాడుతూ తీసుకొని రావడం విశేషం.

తరలి వచ్చిన వరుడు పందిరి చేరే ముందు నలుపూ, ఎరుపూ, పసుపు కలిపిన అన్నపు ముద్దలు దిగదుడుపుగా తిప్పి పారవేయడం లాంఛనం. వధూవరులిద్దరికి పెళ్లి బొట్టు, పాదాలకు పసుపూ పారాణి, చెంపన చుక్క పెట్టడం ఆచారం. కళ్యాణ ముంటపానికి వచ్చే ముందు పెళ్లికూతరు ఐరేండ్లను పూజించి గౌరీ పూజ చేస్తుంది. ఆ పిల్ల ఎర్ర అంచున్న తెల్ల చీర కట్టి, కొనలు కుట్టని జంట రవికలు తొడగడం సంప్రదాయం. చీరపై మరో వస్త్రాన్ని ముసుగుగా కానీ, మెడలపై కానీ ఉండవల సిందే. బ్రాహ్మణేతరులకు పెద్దల సాక్షి తప్ప అగ్ని సాక్షిగా-వివాహం కాదు. లాజహోమం లేదు. కానీ పొలం వెళ్లడం చాళ్లుగీచి పత్తి గింజ వేయడం ఉంది. ఆడ బిడ్డ పాలు పెరుగు కలిపి ఒకే గిన్నెలో ఇద్దరికీ తాగిస్తుంది. పెరుగన్నం పెడుతుంది. పెళ్లికి ముందు గాడిపొయ్యిలు తీయడం, ఆచారం, అట్లే పప్పులు చిట్లించడ కుందెనలో బియ్యం పోసి దంచి కొట్నం పెట్టడం, రోకలి సాయంతో వడ్లు పోస్తూ పోలు గీయడం, కంకణం కట్టి పూజించిన కాణిని వరుడు పట్టడం, చేతిలోకత్తికానీ, అడ కత్తి కానీ పట్టు కోవడాలు, కాపూ, క్షత్రియ సంబంధాన్ని సూచించే ఆంధ్రుల ప్రత్యేకతలు. పదహారవ నాడు అంటే పందిరి గుంజ (ఇదే పాల గుంజ)

తీసేనాడు 'అట్లు' పోసి దగ్గరి బంధువులకు భోజనాలు పెట్టడంతో పెండ్లి తంతు ముగుస్తుంది. పాల గుంజ చిగిరిస్తే తొందరగా కడుపు పండుతుందనే నమ్మకం ఉంది. పెళ్లి కూతురు వెంబడి సారెపెట్టి పంపడం, ఒడి బియ్యం పోయడం. తెచ్చిన సారె కుడుకలను నలుగురికి పంచడం ఆనవాయితి.

పెళ్లికని అరిసెలు వండినప్పుడు పాకం బాగా కుదిరితే ఆ పెళ్లి సజావుగా జరుగుతుందనే నమ్మకం మనవారికి ఉంది.

## అలవాట్లు

బల్లి పలికినప్పుడు కృష్ణ కృష్ణ అనడం, ఆవులించినప్పుడు చిటికెలు వేయడం, తుమ్మినప్పుడు శతాయుషు అనడం సంప్రదాయం. శుభకార్యాల్లో విస్తట్లో తియ్యపప్పు కానీ, పరమాన్నం కానీ తొలుతగా వడ్డించడం ఆచారం. భోజన సమయాల్లో ఉప్పు వడ్డించడండి అని కాక సెరుతోడు వడ్డించండి అనడం సంప్రదాయం. బంతిలోని వారు అందరు లేస్తే కాని లేసకూడదు. స్త్రీ పురుష భేదం లేకుండా శుభకార్యాల్లో నలుగులు పెట్టడం సంప్రదాయం.

## చేయకూడనివి

వడ్డించే స్త్రీలు ముఖాలకు కుంకుమ లేకుండా వడ్డించ కూడదు. చింగులు నేల రాయకూడదు. కొంగు దోపు కోవలసి ఉంటుంది. ఆవులించకూడదు.

స్త్రీలు నడిచేప్పుడు నేల రాయ కూడదు. చప్పుడు చేయకూడదు. గోళ్ళు కొరక కూడదు. మగవారు మంగళవారం క్షవరం చేయించుకోకూడదు. ఉత్తర దిశగా తలపెట్టి నిద్ర పోకూడదు. శుక్రవారం, సూర్యాస్తమయం తరువాత తులసిని కోయరాదు. తాకరాదు. సుమంగళి ఉపవసించినా, శుక్రవారం సంపూర్ణ నిరాహార వ్రతం కూడదు. ఏక భుక్తం మంచిది. ఇల్లు పొయ్యి పెట్టినా, పిడుకలకుచ్చెన పేర్చినా, కొన్ని వార నక్షత్రాలు వర్జ్యాలు. పీటలు ఉపయోగించిన తరువాత గోడకు అన్చేటప్పుడు సవ్యంగా ఉండకూడదు. తిరగ వేయవలెనట. శవ స్నానం అప్పుడు సవ్యంగా ఉంచడం పరిపాటి. అట్లాగే శవానికి నిప్పు పెట్టిన తరువాత తిరిగి చూడకూడదు.

## తెలుగు వారి భోజనం, వంటకాలు

తెలుగువారు భోజన ప్రియులు. రుచులు తెలిసినవారు ఉప్పు కారం, పులుసూ సమపాళ్లగా వాడుతారు. వంటకాల్లో చక్కెర కన్నా బెల్లపు వాడుక ఎక్కువ. పచ్చళ్లంటే ప్రీతి. వరి అన్నం ముఖ్యాహారం. పప్పు, కూర, పులుసు, చారు, నెయ్యి మజ్జిగలు నిత్యాహారం. చిత్రాన్నం, పులిహోర, దద్ధ్యోజనం, వంకాయ పూర్ణం, కాకర పులుసూ, గుమ్మడి పులుసూ, పప్పుకూర, అంటు పులుసు, దప్పళం, అరటికూర, గుమ్మడి పప్పు, పులుసు, వేపుళ్లు, రోటి పచ్చళ్లు, వడియాలు, అప్పడాలు, పులగం, పాయసం, పరమాన్నం గంటె జారుగా వుండే తీపి వంటకాలు. బొబ్బట్లు (భక్ష్యాలు) మినప వడలు, చక్కిలాలు, బూరెలు, గారెలు, సున్ని ఉండలు, మణుగుబూలు, బెల్లప్పాస, కారపు అప్పాలు, జంతికలు, గవ్వలు, లడ్డూలు, పేణీలు, ఎన్నెన్నో బందరు తొక్కుడు లడ్డూ, రాజమండ్రిపూత రేకులూ, గుంటూరు గోంగూర పచ్చడీ, తెలంగాణ పు పేణీలూ, సకినాలు ప్రత్యేకాలు. సామాన్యులు పేదవారు జొన్న, సద్దరొట్టెలు, గట్క (సంకటి) కారం మజ్జిగ కలిపి తింటారు. ఇప్పుడు సంకటి స్థానాన్ని ఉప్మా ఆక్రమించింది. జొన్నంబలి, తయిద(రాగి) అంబలి తాగేవారు, ఎండా కాలంలో రైతు కుటుంబాలు, కలిపోసి కాచిన అంబలిని మధ్యాన్నం తాగేవారు. ఇప్పుడు మజ్జిగలు లేవు. పసిపిల్లలకు పాడి ఉన్న ఇంట వెన్నలు పెట్టేవారు. వెన్నలో జాజికాయ, వాము కలిపి స్నానానికి ముందు పెట్టడం ఆచారం. ఈనాడు బలవర్ధక మైన నేయి పరిహార్యం.

తెలుగువారి ఇంట్లో తులసి, గగ్గెర, సదాపాకు, కలమందలు ఉండేవి. ఇవి గృహ వైద్యాలకు దివ్య మైన మూలికలు. అల్లే, మిరియాలు, పిప్పళ్లు, సొంటి, కరక్కాయ, అల్లం, పటిక, సైంద్ర లవణం, చేదు జిలకర్ర, దుంప రాష్ట్రం, ఎప్పుడూ ఇంట్లో ఉండే వస్తువులు, ఏదు పొట్ట, కుందేటి పొట్ట, మసాంబరం, పిల్లలకు పనికి వచ్చే వస్తువులు.

## వినోదాలు

స్త్రీ పురుషులకు జాతరలు, తీర్థాలు, తిరునాళ్లు, ఒక పెద్ద వినోద యాత్ర. ఇది ఇహపరసాధకం. వినోదం - విజ్ఞానం రెండూ దొరికేవి. అక్కడ రంకురాట్నం ఎక్కడం, ఏనుగులెక్కడం, కాశీ పట్నం చూడడం ఎంతో చిత్రం. గారడి విద్యలు, దొమ్మరి ఆటలు, పాముల వాడు, కోతులవాడు ఇచ్చే ప్రదర్శనలు చూడ ముచ్చటైనవి. స్వామి వారి ప్రభా దర్శనం, కుంకుమలు, గులాలు, అద్దపు పెట్టెలు, పోతరవికెలు, అద్దాల దర్శిని.

స్త్రీలు తీరిక సమయాల్లో కొంత కలిగిన వారు పులి కట్ట, బారకట్ట, పచ్చీసులు ఆడుకునేవారు. భాగాన్ని పొందే భిక్షుక గాయకులు వచ్చేవారు. వారిలో శారద

కాండ్రు, హరిదాసులు, భజన పరులు ఉండేవారు. గోత్రాలు చెప్పే పిచ్చుకుంట్లు కాలక్షేపానికి మంచి సాధనం. గంగిరెద్దుల వాండ్లు తెలుగువారికి పోరాని చుట్టాలు. రామున్న సీతమ్మలు అందరి మనస్సులను రసస్ఫానితం చేసే ఎద్దూ ఆవులు, ఇట్లే పగటి వేష గాండ్రు, బహురూపులోడు, ఎరుకలసాని అందరికీ ఆప్తురాలు. ఊళ్లల్లో, తెలుగు నాట దొమ్మరి అనే ఒక పాత్ర ఈయన ఉత్తుత్త మాంత్రికుడు కానీ అందరూ గౌరవిస్తారు. స్త్రీ వేషంతో ఉంటాడు. తర్వాత పంచలవారు, భజంత్రాలు వచ్చి ఏదో పుయిం పుయిం అంటారు. మధ్యాహ్నం దక్కా ఊపుతూ గంట వాయిస్తూ వచ్చే జంగం ఈయనే బుడుబుక్కల వాడు అతని చేతి వాద్యం చేసే బుడుక్కు, బుడుక్కు అనే శబ్దంతో వచ్చిన పేరు ఇది.

రాత్రిళ్లు కొన్ని చోట్ల కథలు సాగుతాయి. ఆ కథలల్లో కలియుగ పొన్న కథ, గులేబకావళి కథ, బాల నాగమ్మ కథలంటే తెలుగువారికి ప్రాణం. కథకులేకాకుండా ఇంట్లో నాయనమ్మ, అమ్మమ్మలు పేను చెట్టు కథ, పేదరాశి పెద్దమ్మ కత, ఆనగ అనగ వో రాజు కతలు చెప్పుతారు. పిల్లలకు వినోదం విజ్ఞానం రెండూ దొరుకుతాయి. మన తెలుగువారు పాల్కురికి సోమనాథుని కాలం నుండి కూడా రంగ స్థలనాటకాలను ఎరిగిన వారని చెప్పుకోవచ్చు. వీరు బైలాటలు ఆడేవారు, జాజర పాటలు పాడేవారు, ఏలలూ, జోలలూ, నివ్వాళులు, ధవళాలూ, వెన్నెల పదాలు, తుమ్మెద పదాలు పాడుకునేవారు. వీథి భాగవతాలూ, నూనె భగవతాలూ, గంటె భాగవతాలు ఉండేవి. కాముని పున్నమి నాడు వేసే విచిత్ర వేషాల్లో ఎలుగు బంటి వేషం ముఖ్యమైంది.

దసరానాడు పురుషులే స్త్రీ వేషం వేస్తూ పారిజాతాపహరణం ఆడ్తారు. నారధుని వేషం విచిత్రంగా ఉటుంది. కాళ్లకు పాత శాండిల్స్ తొడికి నోట్లో బీడి వెలిగిస్తూ ముఖాన అర్ధశం (హరితశః = పచ్చరంగు) పులుముకొనిస్తాడు. కృష్ణమూర్తి ఊదా రంగులో ముసుగి సైకిల్ కట్టుతో పసుపు దోవతి కట్టి నెమిలి ఈకను తలకట్టుగా కట్టి 'తలుపు దియ్యవె భామా" అంటూ చిందులు వేస్తాడు. చూచి తీరవలసిందే!

కొంత చదువుకున్న వారికి హరికథలు ఉండనే ఉన్నవి. ఇట్లే ఉన్నత స్థాయి సంగీత రూపకాల్లో కురవంజి, యక్షగానాలను పేర్కొనచ్చు. కురవంజి ఆటవికమైనా, తెలుగు నాట మెరుగులు దిద్దీ యక్షగానంగా మలచుకున్నారు. తోలు బొమ్మలాటలో మనవారు ప్రసిద్ధులు. నృత్యంలో దేశి నృత్తం మనసొమ్ము. స్త్రీ పురుష సామాన్యంగా ఆడే ఆటలల్లో కోలాటం, జడకుచ్చులు వేయడం మన ప్రత్యేకత. అట్లే కూచి పూడి భామా కలాపం, ఆంధ్ర నాట్యం మన సొమ్ము. పేరిణి, గొండ్లి, జగ్గ, దండ లాస్యాలు, రెడ్డి, విజయ నగర ప్రభువుల కాలం నుండీ మన తెలుగు నర్తకీ మణులు తమ సొమ్ముగా ఏలినారు.

## పందేలు

కోడి పందేలు, పొట్టేలు పోరాటాలు, మల్ల యుద్ధాలు, తెలుగు నాట పుట్టినవే

## ఆటలు

ఊపిరి గింజలాట, గచ్చ కాయలాట, గవ్వలాట, వాన(వోమన) గుంటాట, కుంటి బిచ్చ, బొమ్మలాట, పావులాటలు, గుజ్జన గూళ్ల వంటకాలు తెలుగింటి ఆడపిల్లలు ఆడే ఆటలు.

పుంగిళ్లు పూయడం, భూమి సముద్రం ఆట, దేవుడమ్మ దేవుని ఆట, తిమ్మక్క కోడి ఆట, గాజప్పాట, చెమ్మ చెక్కాట, చెండాటలు కొంత పరిశ్రమతో కూడిన ఆడ పిల్లల ఆటలు, బొమ్మరి గడలు, బైసికళ్లు, మొగ్గ వాలడం, కోకో, కబడ్డి గిల్లి దండ, తుపాకి గుండె, మొదలైనవి మూడు కాళ్లాట (Three legged race) దీన్నే హరిణ క్రీడ అని కూడా పేర్కొనవచ్చు. ఇట్లే కథా గర్భితమైన ఆటలు ఎన్నో మనవారు ఆడుతారు. జలక్రీడలల్లో ఈత ఒకటి. వర్షాలు సరిగా వర్షంపడక, నాట్లకు తడి తప్పుతున్నప్పుడు నిష్ఠతో విరాట పర్వం చదివితే వర్షాలు పడ్తాయి. అనే నమ్మకంతో విరాట పర్వాన్ని చదివిస్తారు. వారి నమ్మకం రూపు దాల్చినట్లుగా వర్షాలు కురుస్తాయి. ఇట్లే కప్పకు దారం కట్టి తలక్రిందుగా వ్రేలాడదీస్తూ 'కప్ప తల్లి నీళ్లాడె కడవలన్ని నీళ్ళాయె, చేపతల్లి నీళ్లాడె చెరువలన్ని నిళ్లాయె' అంటూ గ్రామంతా తిరుగుతారు. అప్పుడప్పుడు వర్షం వస్తుంది. –

ఉరుము ఉరిమినప్పుడు అర్జునుని పేర్లను దండకంగా చెప్పుకుంటారు. అట్లే నిద్రించేప్పుడు దుస్స్వప్న నివారణ శ్లోకాన్నీ, దీపారాధన సమయంలో దీపం జ్యోపరం బ్రహ్మ ంటూ సంధ్యా దీపాన్ని సంస్తుతించి నమస్కరిస్తారు. పలకల పూజలు ఉండేవి. అంటే సరస్వతీ పూజ అని అర్థం.

పూజ తరువాత తీర్థాన్ని తీసుకునేప్పుడు చేతిని దొప్పలా చేసి, చూపు వ్రేలిని బొటన వ్రేలి క్రింది గా దించి గ్రహించ వలసి ఉంటుంది. తీర్థం తీసుకున్న తరువాత ఆ చేతిని తలకు అప్రయత్నంగానే రాచుకుంటారు. అది సంప్రదాయ ప్రబలం.

పెళ్లి తంతులో ఒకటిగా పగలైనా సరే అరుంధతిని చూపే ఆచారం ఉంది. ఆ నక్షత్రం కనపడకపోయినా, చూడవలసిన అవసరం లేకపోయినా పురోహితుడు చూపడం ఆచారం, చూచినట్లుగా వరుడు తల ఊపడం సంప్రదాయం.

శివరాత్రి నాడు గజేంద్ర మోక్షాన్ని చదవడం, వినాయక చవితి నాడు శమంతకోపాఖ్యానాన్ని చదవడం, ఆరాత్రి చంద్ర దర్శనం చేయకపోవడం సంప్రదాయం. ఇట్లే దసర నాడు పాలపిట్టను చూడడం, దీపావళినాడు పొద్దుటే దుందుభి (నువ్వు కర్రలను తిప్పడం) భోగి పండగ నాడు భోగి మంటలు వేయడం, పాత వస్తువులు కాల్చడం, గొంతెమ్మ (గొబ్బెమ్మలు = పేడ ముద్దలు పెట్టడం) ఆచారం. ఇట్లే ఉగాది నాడు పచ్చడి తాగడం, పంచాంగం శ్రవణం చేయడం, భక్ష్యాలు వండడం సంప్రదాయం.

బల్లి పడినప్పుడు స్నానం చేసి ఆంజనేయ స్వామి గుళ్లో దీపం పెట్టి, 'ఆలం పూరు జోగు శంబా' అంటూ స్మరించి పెద్దవారి పాదాలకు మొక్కడం సంప్రదాయం.

దేవుడు, గర్భవతి, గురువు, పసిపిల్లలు ఉన్న చోటికి ఉత్త చేతులతో పోగూడదు అనడం సంప్రదాయం.

రోటిపైన కూర్చో కూడదు, కడపపై తుమ్మకూడదు. విసురు రాతినీ, రోటిని బోర్లించకూడదు. ప్రయాణపు బండ వోటు పడకూడదు. ఆషాఢంలో నూతన వధూవరులు కలువకూడదు.

కొందరికి కొన్ని అచ్చిరావు. కొందరు పుట్టిన పిల్లలను విస్తట్లో వేసి ఇస్తారి, పెంటయ్య అనే పేర్లు పెడ్తారు, అట్లా చేస్తే బాలారిష్టం ఈ పిల్లవాడిని మరిచి వెళ్లిపోతుంది. మరి కొందరు ఉయ్యాలలో వేయరు. క్రొత్త మంచంలో పడుకోరు. ఇవన్నీమానసికమైన వత్తిడుల ప్రభావంతోతనలో కల్పించుకొన్న భయం, శంకలు అనే తత్వాల ప్రభావం వల్ల ఏర్పడ్డ మూఢనమ్మకాలు, అయినా ఆ ఇంటివారు సంప్రదాయంగా పాటిస్తారు.

## జానపద సంప్రదాయం

తెలుగు దేశంలో సామాన్య జనానీకంలో అధిక భాగం జానపద సంప్రదాయం నిత్యనైమిత్తిక జీవిత సరళిని శాసిస్తూ ఉంటుంది. జానపదం అంటే కేవలం పామర జనం అని మాత్రమే కాదు. మానవులు చిన్న చిన్న సంఘాలుగా ఉన్నప్పుడు అలవర్చుకున్న ఆచారాలు ప్రాచీన జన సంఘాలకు ప్రకృతి సర్వస్వం ఆరాధనీయం, భూమి, చెట్టూ, పుట్టా, గట్టూ, నీరు, నిప్పు, అన్నీ, అందుకే మన తెలుగువాడు కూడా ఈనాటికీ, తన జీవితాన్ని పోషించే పంటను ఇచ్చేకారణంతో భూపూజ చేస్తాడు. పండిన పంటను కోసి కల్లం చేసి బంతి కట్టి గింజను రాశిగా పోసిన తరువాత ఆ రాశికే భూదేవికీ ఉపహారంగా గొర్రెనుకోసి కడుపులోపలి సామాను అంతా అక్కడే పాతి పంటను కొత్త కుండలో వండి అందరూ కలిసి తింటారు. ఇంటికి తీసుకొని పోకూడదు. మాంసం తాకని పూజారికి స్వయం పాకం ఇచ్చినా పంట తేసుకొని తినవలసింది మాత్రం అక్కడే. ఈ విందులో కష్టపడ్డ ప్రతిపాలేరుకూ భాగం ఉంటుంది. ఎవరి వంతు వాళ్లకు దక్కుతుంది.

## ద్యావర చేయడం

దేవతారాధనం ఊళ్లోకానీ, పక్క ఊళ్ళోకాని అంటు వ్యాధులున్న సూచన వచ్చినప్పుడు గ్రామ పెద్దలు చేరి ఆదేవత పూజారిణితో వేప చీర కట్టిస్తారు. వేప చీర అంటే స్త్రీ నగ్నంగా ఉండి కేవలం వేప కొమ్మలూ ఆకులనే రవిక, చీరగా కట్టడం, ఆ చీరతో ఆమె బొడ్రాయి వరకు వచ్చి, పసుపూ ,దారు (దేవుడి కుంకుమ) పెట్టి తానూ పెద్దగా బొట్టుపెట్టుకోగానే శివమెత్తుతుంది.

## లింగాలపూజ

నీళ్ళుకెల్లడం - పాప పుట్టిన తరువాత ఏడవ నాడు పురుడు పోస్తారు. ఈనాడు వెల్లిపాయ కాటుక తల్లీ పిల్లలకు పెట్టి, గోర్లు తీసి బిడ్డతోకూడ తల్లిని కూర్చోబెట్టి అన్నపు రాశిని పోస్తారు. దానిపై దీపం ఉంచుతారు. దాన్నికుంభం పోయడం అంటారు. ఆ అన్నపు రాశిని ఇంటి చాకలి అంటే మంత్రసాని వేసుకుంటుంది. ఆ తరువాత 21వ నాడు నామకరణం తొట్లో(ఉయ్యాలలో) వేయడం. ఆనాటి సాయంకాలం ఇంతవరకు పని ముట్టని బాలెంత మంచి నీళ్ల బావికి తొమ్మిది మందితో కలసి వెళ్లి మొదటి చేద వేసి నీళ్లు చేదుతుంది. ఆ బొక్కెనలో వెన్న ముద్ద వేసి పెద్ద ముత్తైదున అందుకుంటుంది. తరువాత అయిదు పలుగురాళ్లు (తెల్లని రాళ్లు) లింగాలుగా బావి గట్టుపై పెట్టి పూజించి నవ ధాన్యంపోసి ఇంటికి బయలు దేరుతారు. అంతవరకే పెద్ద ద్వారం వద్ద సిద్ధంగా ఉన్న ఆ అమ్మాయి వయసు వారు అల్లరి చేస్తూ మగని పేరు చెప్పించుకుంటారు. పెండ్లినాడు ఆలూమగ లిద్దరూ వారి వారి పేర్లు చెప్పవలసి ఉంటుంది. ఆ తరువాత బాలెంతరాల ఎర్రంగు చేతుల కద్దుకొని రెండు వైపులా చేతి ముద్రలు వేసి లోపల ప్రవేశిస్తుంది. ఇంతలో ఉయ్యా లోల పొత్తిళ్లుపరిచి కింద గుగ్గిళ్లుపోసి పాపను

ఉంచుతారు. తరువాత ఆ గుగ్గిళ్లను, వచ్చిన ముత్తైదువలకు ఇస్తారు. ఈ సంప్రదాయానికి కారణం తెలియదు. వెన్న ముద్దను పిల్లలు లేని స్త్రీచేత మింగిస్తారు. ఆ వెన్న ముద్దను మింగిన స్త్రీ గొడ్డువీగి సంతానవతి ఔతుంది అనే నమ్మకం ఈ సంప్రదాయానికి మూలం ఇంది.

## పొలిమేర కట్టడం

ఆ గ్రామస్తులు ఎవరైనా ఊరు విడిచి వెళ్లేటప్పుడూ, కొత్త వధువు అత్తవారింటికి వెళ్లేప్పుడు ఆ గ్రామ దేవతతో సెలవు తీసుకున్నట్లుగా పొలిమేరలో ఏ చెట్టు కిందనో వెలసిన దేవతకు నతులు చేసి సాంబ్రాణి పొగ వేసి వీలైతే కొబ్బరి కాయ కొట్టి వెళ్లడం ఆచారం. ఇది ఆ గ్రామానికీ ఆ గ్రామ ప్రజలకూ ఉన్న సువిస్త సంబంధాన్ని తెలుపుతుంది. అంటే ప్రతి గ్రామ రక్షణకు ఒక దేవత కాపు ఉంటుందనే నమ్మకం. ఇది రామాయణంలో లంకాలక్ష్మితో లంకిణిని తలపుకు తెస్తూ ఉంది.

## గండదీపం

ఆపద మొక్కులల్లో గండదీపం మోయడం ఒకటి. మొక్కుబడి ఉన్న వ్యక్తి స్నానం చేసి ఒక పళ్లెంలో దీప ప్రమిదను వెలిగించిపెట్టి నిరాహారంగా ఆ నేడిని భరిస్తూ మైళ్లు నడిచి తాను మొక్కిన క్షేత్రానికో ఆలయానికో వెళ్లి ఆ దీపాన్ని అక్కడ ఆరిపోకుండా భద్రంగా దించి రావడం.

## బాలమ్మ పూజలు

పసిపిల్లలను పుట్టింది మొదలు పన్నెండేళ్లు వచ్చేవరకు పురుటి గండం బాలగండం అంటూ అరిష్టాలెన్నో ఉంటాయి. ఇవన్నీ బాల హంత్రి ఐన అరిష్ట దేవత ప్రభావం. అందుకే ఆమెను ప్రసన్నురాలినిచేసుకోవలసి ఉంటుంది. ఒకొక్కప్పుడు పాప చన్ను ముట్టదు, మరొకప్పుడు పాలధార తల్లికి సరిగారాదు. ఆ సందర్భాల్లో బాలమ్మను పూజిస్తూ ఆ ఇంటి పెద్దముత్తైదువ సాకపోసి, దోసిలో నైవేద్యం (గ్రామీణ పరిభాషలో ఎడ అంటారు.) పెట్టి తల్లీ నూనె ధార నీకు - పాలధార నాకు అంటూ వేడుకుంటుంది ఒకొక్కప్పుడు గుగ్గిలం పొగవేసి కల్లు సాక కూడా పోస్తారు.

## ఎల్లమ్మ

ఎల్లమ్మ రెండువిధాలు. బ్రాహ్మణ ఎల్లమ్మ, బయటి ఎల్లమ్మ. ఇంటి గోడను ఎర్ర మట్టి తో అలికి చుక్కలు పెట్టి సాత్త్వికనైవేద్యంతో చేసే పూజలు అందుకునేది బ్రాహ్మణ ఎల్లమ్మ. జంతు బలిని, మాంసాహారాన్ని కాంక్షించేది వేరే ఎల్లమ్మ. ఈమె రేణుకాదేవి.

## పెద్దమ్మ

గోరాకారంతో ఉన్న శక్తి దేవత. పెద్దమ్మ పండుగను తరుచుగాచేయరు. దీనికి పెద్ద తదంగం ఉంటుంది. ఈమె పశువులకు ఉప ద్రవం వచ్చినప్పుడు, తదితర భయంకర వ్యాధులు వ్యాపించినప్పుడు కొలిచే దేవత.

## మంగళహారతులు

ప్రతి శుభకార్యానికి మంగళ హారతి లేనిది గడవదు. తెలుగు వారికి సీతమ్మ ఆదర్శం. ఆ తల్లిని ఆడపడచుగా, కోడలుగా, కూతురుగా, వదినెగా, భావిస్తూ పాటలు కట్టి స్త్రీలు ఆ వ్యపదేశంతో ఆనందిస్తారు. నలుగులు పెట్టేప్పుడు, సేసలు చల్లేప్పుడు, వాడినించేప్పుడు, తలంబ్రాలుపోసేప్పుడు, శోభనం నాడు సరసాలడేప్పుడు ఆపాటలే పాడ్తారు. అది సంప్రదాయం. తెలుగు నేలలో తట్లు, (పొడుపు కథలు = ప్రహేళికలనే) విజ్ఞాన దాయకమైన క్రీడ ప్రత్యేకంగా ఉంది. పామరు భూపండితులూ, పెద్దా చిన్నా అందరూ క్రీడించే బుద్ధి .జన్యమైన క్రీడ ఇది.

ఆంధ్రదేశం చిత్ర, శిల్పకళలకు కూడా కాణాచి, అజంతా కుడ్య చిత్రాలు, ఎల్లోరా శిల్ప సౌందర్యం జగత్ప్రసిద్ధిని పొందింది. అట్లే రామప్ప దేవాలయం, వేయిస్తంభాల గుడి కాకతీయ శిల్పకళా వైభవానికి ఎత్తిన పతాకం వంటివి. రామప్ప దేవాలయపు గుడి గోడలకు ఆనుకుని ఉన్న స్త్రీ భంగిమలు నృత్తరత్నావళి నాట్య భంగిమలకు ఉదాహరణ పూర్వక నిదర్శనాలుగా తీర్చబడ్డాయి అనడంలో సందేహంలేదు. అట్లే, లేపాక్షి ఆలయం ప్రాంగణంలోని కుడ్య చిత్రాలు జైన కళా స్ఫూర్తితో అజంతా చిత్ర కళా సౌంద ర్యాన్ని రంగరించుకొని వింతైన తెలుగు తనాన్ని ప్రదర్శిస్తూ అపురూపంగా ఉన్నాయి. ఆలయ ప్రతిమా శిల్పకళలకు తమిళుల వలె మనవారూ ప్రారంభికులే. మన తెలుగు వారు పట చిత్ర నిర్మాణం లోకూడా నిపుణులు. కాకి పడగల వారు అనే ఒక తెగవారు దేశీయమైన వర్ణాలతో భారత, భాగవత కథలనుపటాలపై వేసి, ఆ బొమ్మలను Scroll వలె జరుపుతూ కతనుసాగిస్తారు. ఇది చిత్ర లేఖనం, సంగీతం, కథ, అనే మూడు కళల విచిత్ర విధానం. ఇది తెలుగు జాతి ప్రత్యేకత.

ఇట్లే బందరు లో కలంకారీ అద్దక విధానం దేశీయ మైన ప్రత్యేక కళ. వరంగల్లులోని పెంబర్తిలో జాతి పద్ధతిలో చేసే నగీషి వెండి పనులు,కళాత్మకమైన ఇత్తడి వస్తు నిర్మాణం, నిర్మల్ బొమ్మలు, కొండపల్లి బొమ్మలు,ఏటి కొప్పాక

బొమ్మలు, చిత్తూరు మట్టిగుర్రాలు, కడప అద్దాల చిత్రాలు, అనంతపూరు, తిరుపతుల ఎర్ర చందనం, లక్క బొమ్మలు,ఎంతో ప్రత్యేకమైన హస్త కళా నైపుణ్యానికి ప్రతీకలు. అట్లే హసన్ పర్తి, మట్టేవాడ తివాచీలనూ, పేర్కొనక తప్పదు. ఇదంతా కళా సంప్రదాయం.

కవిత్వంలో ఈ నాడు మనం సాధించని ప్రక్రియ లేదు. పురుషు లే కాదు స్త్రీలు సయితం తమతమ వంతు చెల్లిస్తూ ఉన్నారు. జ్ఞాన పీఠ బహుమతి హీతలల్లో మన వారి దే పై చేయి. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనలో మన రాష్ట్రమే తొలిది. భూ సంస్కరణలల్లో మనమే మొదటి వారం. అట్లే నూతనోద్యమాలను చేపట్టడంలో, సాహిత్యంలోనూతన ప్రక్రియలను వెలయించడంలో, అవధాన విద్యలో, మన దేపై చేయి. అంతేకాదు ప్రబంధ సాహిత్యం ద్వ్యర్థి కావ్య ప్రక్రియలు మన తెలుగు వారి ప్రత్యేకతలు.మేనరికం మనలో విశేషం. ఉద్యమం మన సంప్రదాయం కానీ నియమ పాలనం మనకు నచ్చదు. ప్రస్తుతం జరిగే సంప్రదాయికతలో, సంప్రదాయక విచ్ఛేదంలో మనమే మొదటి వారం. ఆస్తికులలో మనదే తొలి అంకె. నాస్తికులలో, విప్లవకారులలో మనం గణనీయులమే.

ఈనాడు భారతదేశంలోని అత్యున్నత పదవులు అంటే భారత రాష్ట్రపతి, భారత ప్రధాని అనే పదవులను దక్కించుకొని ఆ పదవులకు గౌరవాన్నికొని తేగలిగిన తెలుగు బిడ్డలను కన్న జాతి మనది. ఈ వారసత్వం, ఈ సంప్రదాయం సదా భద్రంగా నిలుపవలెననీ, దాన్ని కాపాడే బాధ్యతను ప్రతి తెలుగు బిడ్డ స్వీకరించాలని ఆకాంక్షిస్తున్నాను.

# ఈ ఉగాది శుభ దినాన!

డి.సి. కేశవరావు

చైత్ర భాను వాడి,
వేడి కిరణాలకు
తాళ లేక చలిరక్కసి
పరుగులెత్తె వడి వడిగా
దిగంతాల నీడలకు !
"పచ్చ[illegible]" వలువనుకట్టి
ప్రతి తరుణిక నవవధువై
చివురల చిరు నగవుతోడ
సోయగాలు చిందెంచెను !
మావికొమ్మ వేదిక పై
చేరినలచి కోయిలమ్మ
మధురమధుర గానాలను
చెవుల కింపు చేయసాగె !
ప్రతి జీవి నరనరాల
చైతన్యం ఒలికిపార
ప్రతి వదనంలో కాంతి
ప్రతి డెందంలో శాంతి
యే వెలుగై ప్రకాశించే !
గతం నంత పాతి పెట్టి
క్రొత్త బాట పై జనత
సాగి పోవగా నెంచెను
ఈ ఉగాది శుభదినాన
ఆనంద వేద జల్లుకు !!

# మన పండుగలు-పుట్టుపూర్వోత్తరాలు

• డా॥ తిరుమల రామచంద్ర •

పండుగలు మానవ సంఘాలతోనే పుట్టి, వాటితోనే పెరిగి, అవి మారినప్పుడు మారుతూ, అవి అంతరించినా వాటి పరిణామ దశలకు సూచకాలుగా నిలిచిపోతాయి. సంఘం నిత్యవికసన శీలం, కొత్త సంఘటనలతో, కొత్త ఆవిష్కారాలతో, కొత్త జ్ఞానంతో ముందుకు సాగిపోతున్నప్పుడు, సంఘటన - ఆవిష్కారలతో, కొత్త జ్ఞానంతో ముందుకు సాగిపోతున్నప్పుడు సంఘటన-ఆవిష్కార - జ్ఞానాల ప్రాదుర్భావ కాలాలు విశిష్టంగా సంఘశ్రేయస్సుకు వినియోగపడతాయి. ఆనంద సందాయకాలవుతాయి. అవే పండుగలు-పర్వాలు.

మానవుడు ఋతుపరివర్తనం పరిశీలించాడు. నభోమండలంలో మిలమిలలాడే నక్షత్ర తారాగ్రహాల గతులను గమనించాడు; నూతన విషయాలు కనుగొన్నాడు; ఆ కనుగొన్న వాటిని గుర్తుంచుకొన్నాడు. ఆనందించాడు; ఆరాధించాడు. ఆ ఆనందం, ఆ ఆరాధన పండుగలయాయి.

మన పండుగలు ప్రధానంగా ఐదు విధాలు - ఋతు పరివర్తన ఫలితాలు, పరంపరాగత వృత్తి గాధావిలసితాలు, గ్రహనక్షత్ర సన్నివేశ జనితాలు, వివిధ జాతి, సంఘ, సంస్కృతి సమన్వయ సమ్మేళన సముద్భవాలు, మహాపురుషావిర్భావ సూచకాలు, ఈ విధంగా స్థూలంగా ఐదు భాగాలుగా వింగడించినా, ఋతుపరివర్తన జనితమైన ప్రకృతి పరిణామమే చాల పండుగలలో ప్రతిబింబస్తుంది. తాము కనుగొన్న సత్యాలను నిత్య జీవితంలో మేళవింపజేసి వానికి నిత్యత్వం సంతరింపజేయాలనే అభిలాష పండుగలలో కానవస్తుంది.

ఋతు పరివర్తనంతో ఏర్పడిన పండుగలకు ఉగాది, నాగపంచమి, వరలక్ష్మీ వ్రతం, బతకమ్మ పండుగ, మకరసంక్రాంతి, హోలీ మున్నగువాటిని పేర్కొనవచ్చు. వృత్తులకు సంబంధించినవి ఏరువాక పున్నమి, శ్రావణ పూర్ణిమ, విజయదశమి మున్నగునవి. గ్రహనక్షత్ర సన్నివేశపు పండుగలు వినాయక చవితి, దీపావళి అమావాస్య, వైకుంఠ ఏకాదశి మున్నగునవి. సంస్కృతి సమ్మేళనోత్సవాలు నాగ పంచమి, దీపావళి వంటివి. మహాపురుషుల ఆవిర్భావానికి సంబంధించినవి రామనవమి, కృష్ణాష్టమి, బుద్ధజయంతి, శంకర జయంతి, రామానుజ జయంతి వంటివి. కాలం మార్పుతో కొత్త కొత్త పండుగలూ ఆచరణలోకి వస్తాయి. గాంధీజయంతి, స్వాతంత్ర్య దినోత్సవం, రిపబ్లిక్ దినం వంటివి.

ఇంతేకాక ఆయా మతాను యాయులకు ఆయా నాయకుల అవతరణ, అంతర్ధానదినాలూ పండుగలే. అనూచానంగా ఆచరణలో ఉన్న పండుగలను కొన్నిటిని సంక్షిప్తంగా తెలుపడమే ఈ వ్యాసం ఉద్దేశం.

## ఉగాది

ఉగాది మనకు ముఖ్యమైన మొదటి పండుగ. దీనితో మన నూతన సంవత్సరం ఆరంభమవుతుంది. ఇది మనకేకాక చాంద్ర మానం అనుసరించే కర్నాటకులకు, మహారాష్ట్రులకు మాళవదేశీయులు మొదలయిన వారికి కూడా సంవత్సరాది. ఇది చైత్రశుద్ధ పాడ్యమి నాడు వచ్చును.

ఉగాది అనే మాట విచిత్రంగా కనిపిస్తుంది. నిజానికి ఇది యుగాది, అంటే, నూతన యుగానికి, నూతన కాలానికి ఆది అని అర్థం. తెలుగు యుగాది క్రమంగా ఉగాది అని వాడుకలోకి వచ్చింది. కర్నాటకులు, మహారాష్ట్రులు దీనిని యుగాది అనే వ్యవహరిస్తారు. యుగం అంటే ఒక కాల విభాగము. వైశాఖ శుద్ధ తృతీయనాడు కృతయుగము, కార్తిక శుద్ధ నవమినాడు త్రేతాయుగము, భాద్రపద బహుళ త్రయోదశినాడు ద్వాపరయుగము, మాఘ బహుళ అమావాస్యనాడు కలియుగము ప్రారంభమవుతాయని, చంద్ర సూర్య గురువులకు కొన్ని నక్షత్రములతో సంబంధము కలిగినప్పుడు యుగాదులు ఏర్పడుతాయని విష్ణు పురాణ భారతాదులు చెప్పుతున్నాయి. ఈ యుగాదులలో మానవులు స్నానంచేసి, పూజా పురస్కారాలు చేసి, దానధర్మాలు చేసి, జప తపాదులు చేసి పుణ్యఫలం పొందాలని మహాభారతం చెబుతున్నది. దీనిని బట్టి యుగాది - ఒక సమయానికి మొదలయిన దినం, ఒకటి పూర్వం కూడా పండుగ దినంగాను, పర్వదినంగాను భావించబడేదని స్పష్టమవుతున్నది. ఆ యుగాదినే మన మిప్పుడు 'సంవత్సరాదిగా' పండుగ చేసుకొంటున్నాము.

ఈసంవత్సరాది నిర్ణయమూ మన పురాణేతిహాసాలలో అనేక విధాలుగా ఉంది. ఒకప్పుడు ఆశ్వయుజ పూర్ణిమ, ఆశ్వయుజ అమావాస్య, కార్తిక పూర్ణిమ, మార్గశిర సంక్రాంతి, పుష్య సంక్రాంతి,

మాఘ పూర్ణిమ, మాఘ బహుళాష్టమి,వసంత పంచమి, ఫాల్గుణ పూర్ణిమ - హోలి పండుగ, చైత్రశుద్ధ పాడ్యమి, వైశాఖ పూర్ణిమ - ఇలా పెక్కు విధాలుగా ఉంది. దీనికి కారణము ఋతు పరివర్తనము. వసంత కాలమున ప్రకృతిలో నవచైతన్యము మోసులెత్తుటనుబట్టి, ఈ కాలమే నూతన సంవత్సరారంభమని పూర్వులు అభిప్రాయపడినారు. క్రీస్తుశకం నాల్గవ శతాబ్దములో ఉన్న జ్యోతిర్వేత్త వరాహ మిహిరాచార్యుడు వసంత విషువత్కాలము వివిధ నక్షత్రములకు చలించి అశ్వినీ నక్షత్రాదిలో సంభవించుట గ్రహించి, మన ప్రాచీన దేవమాన దిన ప్రారంభకాలమైన ఉత్తరాయణ పుణ్యకాలాదే వసంత కాలమని వసంత విషువత్కాలం నిర్ణయించి మాస ఋతు సామరస్యం సాధించి సంవత్సరాది వసంతకాలంలోనే అని నిర్ణయించినాడు. అప్పటినుంచి చైత్రమాసమే సంవత్సరాదిగా పరిగణిస్తున్నాము.

చైత్రమాసంలో ఏదో ఒకనాడు ఈ పండుగ రాకూడదా, పాడ్యమినాడే ఎందుకు? అనే సంశయం కలుగవచ్చు. దీనికి కొంత చర్చ అవసరం. పూర్వము పూర్ణిమ నుంచి పూర్ణిమకు నెల లెక్కకట్టు ఆచారమూ ఉండినది. అమావాస్య నుంచి అమావాస్యకు నెలలెక్కకట్టడమూ ఉండేది. ఈ విషయమును నిర్ణయ సింధుకారుడైన కమలాకరభట్టు చాలా చర్చించాడు. చంద్రగతితో నెల లెక్కపెట్టడం సులభం గనుక, అది అనాదిగా వున్నందున, శుక్ల పక్షాదితో నెల లెక్కపెట్టాలని నిర్ణయించాడు. ఇంతే కాక భాస్కరాచార్యుడు సిద్ధాంత శిరోమణి అనే గ్రంథంలో సూర్యుడు చైత్రమాస శుక్లపక్ష పాడ్యమినాడు లంకానగరంలో ఉదయించడంవల్ల అనగా భూమధ్యరేఖపై ఉండడంవల్ల ఆనాడే యుగ, దిన, మాస, వర్షారంభం అవుతుందని నిర్ణయించాడు. ఇలాంటి నిర్ణయమయిన తర్వాత హేమాద్రి, మొదలయిన వారు "బ్రహ్మ ఈ జగత్తును చైత్రమాసంలో శుక్ల పక్షంలో మొదటి దినాన, సూర్యోదయ వేళ సృష్టించినాడు. గ్రహ నక్షత్ర ఋతు మాస వర్ష వత్సరాధిపతులను ప్రవర్తింపజేసినాడు" అని ఆస్తికులకు బోధించినారు; పండుగ చేసుకొనే పద్ధతినీ వివరించినారు.

ఈ ఉగాది పండుగనాడు తెలుగు వారు ఉషఃకాలంలోనే మంగళాభ్యంగ స్నానం చేసుకుంటారు. సంపన్నులైన వారు కొత్త బట్టలు కట్టుకొంటారు. ఇండ్ల తలవాకిలికి, తక్కిన వాకిళ్ళకు మామిడి ఆకుల తోరణాలు పూవుల తోరణాలు కడతారు; ఇంటి భవంతిని అలికి ముగ్గులు పెట్టి, మంటపం నిర్మించి ఆ సంవత్సరం నూతన పంచాంగాన్ని ఆ సంవత్సరాధి దేవతను షోడశోపచారాలతో పూజిస్తారు. పిండివంటలను, ఉగాది పచ్చడిని భగవంతునికి నివేదించి ఆరగిస్తారు. ఉగాది పచ్చడికి ఉగాది గొజ్జు అని కూడా పేరు. ఇది ఈ దినం చాలా ముఖ్యం. వేపపూత, మామిడి ముక్కలు, కొత్తబెల్లం, కొత్త చింతపండు, పచ్చిమిరపకాయ ముక్కలు, ఉప్పు, గసగసాలు మొదలైన వాటిని కలిపి ఈ పచ్చడి సిద్ధపరుస్తారు. దీనికి నేయి తిరుగబోత చేయడమూ కద్దు. షడ్రసోపేతమైన ఈ రసాయనము సుఖదుఃఖ మిళితమైన మానవుని సంవత్సర జీవితానికి ప్రతీక. సంవత్సరమంతా కలుగనున్న సుఖదుఃఖాలను మానవుడు ఆనాడే చవిచూడడం ఆరంభిస్తాడని దీని భావం. దీనిలో నేయి కలపడం, మానవుడు సుఖదుఃఖాలకు అంటకుండా వుండాలనడానికి సూచన. ఇలాంటి రసాయనం సేవించిన తర్వాత, ఇష్టజనంతో మృష్టాన్నం భుజిస్తారు.

భోజనానంతరం మూడుజాముల తర్వాత, స్వగృహంలోనో, గ్రామ దేవాలయంలోనో, గ్రామం చావిడిలోనో, జనమంతా చేరి పంచాంగశ్రవణం చేస్తారు. ఆ సంవత్సరం తమకు జరిగే యోగాలను, కందాయఫలాన్ని, ఆదాయవ్యయాలను, రాజపూజ, రాజావమానాలను పంచాంగం ద్వారా తెలుసుకొని, తదనుగుణంగా ప్రవర్తించడానికి ఆనాడే సంకల్పించుకొంటారు. కొన్ని ప్రాంతాలలో ఉగాది నాటి సాయంకాలం ఎడ్లబండిపోటీ జరుపడం ఉంది, ధర్మ సింధు నిర్ణయం సింధు, భవిష్య పురాణము మొదలయిన ధర్మశాస్త్ర గ్రంథాలు "సంవత్సరారంభ దినం ఉదయం తలంటి పోసుకొని, నూతన సంవత్సరం నామకీర్తనం చేసి ప్రతి ఇంటిమీద ధ్వజాలు పెట్టాలి. వేపాకు తినాలి. సంవత్సరాది ఫలం వినాలి. వసంతనవరాత్రం ప్రారంభించాలి." అని శాసించినాయి. ఈనాడు ఇంద్రోత్సవం చేయాలని భారతం చెబుతున్నది. రామభక్తులు ఈ సంవత్సరాది మొదలు శ్రీ రామనవమి ఉత్సవాలు ప్రారంభించి, చైత్రశుద్ధ దశమినాడు పట్టాభిషేకంతో ముగిస్తారు. వీటిని రామ నవరాత్రోత్సవాలు అంటారు.

చాంద్రమానా సంవత్సరాది అతి ప్రాచీనమైనదని మన పురాణాలు, ధర్మ శాస్త్రము చెబుతున్నవి. సౌర బార్హస్పత్య మానాలు పాటించేవారూ వేద విహిత కర్మలను ఆచరించడానికి చాంద్రమానమే అనుసరిస్తారు. అగ్ని పూజకులైన పార్సీల సంవత్సరాది "నౌరోజ్" దాదాపు మన ఉగాది దరిదాపులలో రావడం వల్ల కూడా మన చాంద్రమాన సంవత్సరాది అతి

ప్రాచీనమనడానికి మరొక నిదర్శనం.

సౌరమానమును మన దేశంలో తమిళ, కేరళ, వంగ, పంజాబు, సింధు, అస్సాం వాసులు పాటిస్తారు. చాళుక్యుల పరిపాలన కాలంలో తెలుగు నాట సౌరమానం వాడుకలో ఉండేది. బార్హస్పత్య మానాన్ని నేడు గుజరాతు, రాజస్థానాది ప్రాంతాలు పాటిస్తాయి.

## శ్రీరామ నవమి

శ్రీ రామ నవమి చైత్రశుద్ధ నవమి నాడు ఆచరించబడుతుంది. రామకృష్ణులు మహావిష్ణువు సంపూర్ణావ తారాలని మన పురాణేతిహాసాలు ఉద్ఘోషిస్తున్నాయి. సీతా రామ లక్ష్మణులను మనకు అన్ని విధాల ఆదర్శప్రాయులుగా మనదేశ ప్రజలం దరూ కొలుస్తున్నారు. పాతివ్రత్యానికి సీతమ్మను, పితృవాక్య పరిపాలనకు, ఏకపత్నీ వ్రతానికి, సత్యసంధతకు, పరాక్రమానికి శ్రీ రాముని, భాతృప్రీతికి, పరదార విముఖతకు లక్ష్మణుని మన దేశ వాసులు ఆదర్శంగా స్వీకరిస్తున్నారు. వీరి గుణగణాల ప్రశంస అయిన రామా యణము మనకు ఆదికావ్యమైన భారత దేశంలోని అన్ని భాషల సాహిత్యాలను ప్రభావితం చేసింది. జైన బౌద్ధమత గ్రంథాలలోని రామాయణ కథలు, కావ్యాలు వాల్మీకి రామాయణంతో కొన్ని ఘట్టాలలో భేదిస్తున్నా, రామలక్ష్మణ సీతల గుణగణాల వర్ణనంలో భేదించడం లేదు. రామాయణ గాథ అతి ప్రాచీన మనడానికి అమెరికాలోని రెడ్ ఇండియను జాతిలో ఏడాది కొకమారు సతారామోత్సవం జరపడం, వారి పాటలలో సీతారాముల పాటలుండడం మరొక నిదర్శనం.

తన శీల సంపదతో మానవజాతికే ఆదర్శప్రాయుడైన రాముడు శ్రీ రామ నవమి నాడు అవతరించినట్టు వాల్మీకి రామాయణం తెలుపుతున్నది. "పుత్ర కామేష్టి పూర్తి అయిన తర్వాత ఆరు ఋతువులు నడిచాయి. పిదప పన్నెండో నెల అయిన చైత్ర మాసంలోనవమి తిథినాడు, పునర్వసు నక్షత్రంలో, కటక లగ్నంలో గురు చంద్రులుండగా, ఐదు గ్రహాలు ఉచ్ఛస్థానంలో ఉండగా, కౌసల్యా దేవి రామచంద్రుని ప్రసవించింది" అని వాల్మీకి తెలిపినాడు.

రామనవమినాడు ఉపవాసంచేసి, పూజా పురస్కారాలు జరిపి, రాత్రి జాగరణ చేయవలెనని వ్రత గ్రంథాలు తెలుపు తున్నాయి. రామనవమినాడు ఉపవాస జాగరాలుచేసి, దశమినాడు భక్తితోరాముని పూజించి, రామ భక్తులకు దానం చేయాలని, అన్ని వ్రతాలలోను రామ నవమి వ్రతం ఉత్తమోత్తమం గనుక దీనిని విడువరాదని ధర్మశాస్త్ర వ్రతగ్రంథాలు తెలిపాయి.

చైత్ర శుద్ధ పాడ్యమి నుండి రామనవరాత్రోత్సవాలుజరుపుతారు. ఈ తొమ్మిది దినాలు పగలు వాల్మీకి రామా యణము,రాత్రి రామకథా కాలక్షేపాలు జరుపుతారు. నవమినాడు రామజనన ఘట్టం చదివి పూజలు చేస్తారు. పానకము, పణ్యారము (వడపప్పు) ఆరగింపు పెట్టి అతిథులకు ప్రసాదంగా పంచుతారు. దశమినాడు రామపట్టాభిషేకఘట్టము చదివి పట్టాభిషేకోత్సవం చేస్తారు. సీతారామ కల్యాణము జరుపుతారు. ఈ కళ్యాణము భద్రాద్రి మొదలైన దేవా లయాలలో నవమినాడు మహా వైభవంగా జరుపుతారు. కొన్ని ప్రాంతాలలో వసంత నవరాత్రో త్సవం అనే పేర దేవీ నవరాత్రోత్సవం జరిపి దేవీపూజ చేయడమూ ఉంది. కొందరు రామ రామ అని రామకోటి ప్రారంభించి దానిని మరుసటి సంవత్సరం రామనవమికి ముగించి పూజాదులు సంతర్పణలు జరుపుతారు.

మన దేశాన్ని అనాది కాలం నుంచి ఒక్కటిగా చేస్తున్నది రాముడు, అతని చరిత్ర, రామకథను ఆబాలవృద్ధము అందరూ ఎంతో కొంత తెలుసుకొని వుంటారు. దేశాన్ని ఏకం చేసిన రామకథ శాశ్వతంగా వుంటుందని మన దేశ వాసుల విశ్వాసం కనుకనే భారత జాతిపిత అయిన గాంధీజీ స్వరాజ్యం సాధించిన తర్వాత రామరాజ్యం స్థాపించాలని ఉపదేశించారు. రామరాజ్యమంటే - గాంధీజీ ఆశయం - అందరికీ జీవితావసరాల సౌకర్యాలు కలిగించడం, అందరి అభివృద్ధికీ అవకాశాలు కల్పించడం, సత్యధర్మ నిష్ఠతో,ప్రజలు పాలకులు ప్రవర్తించడమూ నని మనం గ్రహించవచ్చు.

## శ్రావణ పూర్ణిమ – రాఖీపూర్ణిమ

ఋతువులను అనుసరించి ప్రతి పనిని ప్రారంభించే మన పూర్వులు విద్యారంభానికీ ఒక కాలం నిర్ణయించు కొన్నారు. ఆ విద్యారంభ కాలమే శ్రావణ పూర్ణిమ. ఈనాడు ద్విజులు అధ్యాయో పాకర్మ జరిపేవారు. ఇదే ఉపాకర్మ అని వ్యవహారం పొందింది. అధ్యాయోపాకర్మ అంటే వేదాధ్యయన ప్రారంభం; వేదం కొత్తగా అధ్యయనం చేయడమేకాక, జ్ఞాపకం ఉంచుకోడానికి ఆవృత్తి చేయడం, వల్లెవేయడానికి కూడా ఈ దినం నిర్ణయించుకొన్నారు.

ఈ వేదోక్తకర్మ ద్విజులందరికీ సమానమైనా, నేడు బ్రాహ్మణులు మాత్రమే అనుసరిస్తున్నారు. వారు ఈ పూర్ణిమనాడు ఉదయమే లేచి నిత్యకర్మ తర్వాత "ఇంతవరకు నేను చేసిన లోపాలు కామక్రోధాలవల్ల చేసినాను, కామమే చేయించింది; నేను కర్తను కాను" అని

అర్థమిచ్చే "కామోకార్షీత్" మంత్రం 108 సార్లు జపిస్తారు. ఇది ఆత్మ పరిశీలన చేసుకొనే మంత్రం. మధ్యాహ్నం అందరూ కలిసి నదికో, చెరువుకో వెళ్ళి స్నానాదులు మళ్ళీ చేసి, కొత్త యజ్ఞోపవీతం, మౌంజి, అజినం దరించి, కాండఋషి తర్పణం - మూల ఋషులను స్మరిస్తూ తర్పణం చేస్తారు. తర్వాత వేదాధ్యయనాన్ని ప్రారంభించి నందుకు చిహ్నంగా ప్రతివేదం ఆద్యంత మంత్రాలు, ప్రతి ఉపనిషత్తు ఆద్యంత వాక్యాలు పఠిస్తారు. ఇంటికి వచ్చి అధ్యయన హోమం చేస్తారు. మరునటి దినం ఉపాకర్మాంగ భూతంగా 108 సార్లు గాయత్రీ జపం చేస్తారు, కొందరు గాయత్రీ హోమమూ చేస్తారు. కర్మకాండ అంతా సంగ్రహమైన ఉపనయన మని అనవచ్చు.

విద్యారంభకాలమూ, వేద పునశ్చరణ కాలమూ ఇదే అనడానికి కారణమేమి అని ప్రశ్నించవచ్చు. వర్షఋతువునుంచి చాతుర్మాస్య వ్రతం ఆరంభమవుతుంది. వానల వలన ఎక్కడికీ పోవడానికి అవకాశం ఉండదు. ఏరువాక సాగి మళ్ళలో మొలకలు తలెత్తుతుంటాయి. తీరిక ఉంటుంది. కనుకనే గృహ్యసూత్రకారులు "ఓషధీనాం ప్రాదుర్భావే" - ఓషధులు మొలకెత్తిన తర్వాత, శ్రవణ నక్షత్ర యుక్త శ్రావణ పూర్ణిమనాడు గాని, హస్తా నక్షత్రం గల దినంలోగాని వేదాధ్యయనం చేయాలి - అని ధర్మ శాస్త్రకారులు అన్నారు. కనుక హస్తా నక్షత్రం, మరునటి చవితినాడు రావడాన్ని బట్టి సామవేదులు వినాయక చవితినాడుఉపాకర్మ చేస్తారు.

వేదాధ్యయన దీక్షకోసం నూతన యజ్ఞోపవీత ధారణం అనే ఆచారం ఇతర వర్గాలలో నూతన కార్యారంభానికి రక్షా బంధంగా ఏర్పడింది, కనుక దీనికి రక్షాపూర్ణిమ, రాఖీపూర్ణిమ అనే వ్యవహారం ఏర్పడింది. ఇది ప్రాచీనకాలం నుంచి వున్నట్లు భవిష్యోత్తర పురాణ వాక్యలను హేమాద్రి ఉదాహరించినాడు. దానవులతో ఓడిపోయిన ఇంద్రునికి శచీదేవి రక్షకట్టి, గెలిపించిందట. ఇది క్రమంగా మొగలు రాజుల కాలంలో స్త్రీల రక్షణకోసం రాజ పుత్రులు అనుసరించినారు. చిత్తూరు మహారాణి కర్ణావతి, తన కోటను గుజరాత్ నవాబు బహదూర్ షా ముట్టడించినప్పుడు, రక్షించమని రక్షాబంధనం పంపి హుమాయూనును కోరింది. అతడు దానిని స్వీకరించి ఆమెను సోదరిగా భావించి రక్షించినాడు. నేడిది ఉత్తర దేశం మంతటా, సోదరి సోదరునికి రక్షగా రాఖీ కట్టే సంప్రదాయంగా వ్యాపించింది. నిజానికి ఇది దీక్షాకంకణధారణమే తప్ప వేరొకటి ప్రసక్తి లేదు.

పాల్కురికి సోమనాథుడు ఈ శ్రావణ పూర్ణిమను నూలి పున్నమ అన్నాడు. నూలి పున్నమ అంటే యజ్ఞోపవీతం వేసుకొనే పున్నమ. నూల్ యజ్ఞోపవీతం. తమిళంలో దీని పూనూల్ అంటారు.

మహారాష్ట్ర, కర్ణాటాదిక ప్రాంతాలలో సముద్ర తీరవాసులు ఈ పండుగను విశేషంగా జరుపుకొంటారు. సముద్రాన్ని పూజించి నారికేళాలు సమర్పిస్తారు. కనుక దీనిని నారికేళ పూర్ణిమ, నార్లీ పూర్ణిమ అంటారు.

రక్షాబంధనం కట్టుకొనడానికి ఒక మంత్రమూ హేమాద్రి తెలిపినాడు. శ్రావణ పూర్ణిమనాడు ఋషితర్పణం తర్వాత, అపరాహ్ణంలో రక్షాపోటలిని పొట్లంను, అక్షతలు, ఆవాలు మొదలయిన వాటితో సిద్ధపరచి, పూజించి

"యేనబద్ధో బలిరాజా
దానవేంద్రో మహాబలీ
తేనత్వాం అభిబధ్నామి
రక్షే మాచల మాచల"

"నీవు మహాబలసంతుడైన బలిని కట్టివేసినావు, నిన్ను కట్టుకొంటున్నాను" అనే మంత్రంతో కట్టుకోవాలి.

## వరలక్ష్మీ వ్రతం

వరలక్ష్మీ వ్రతం శ్రావణ పూర్ణిమ వెనుక వచ్చే శుక్రవారం జరుపుతారు. అది వీలుకాకపోతే, శ్రావణ మాసంలో ఏ శుక్రవారమయినా చేస్తారు. దీనిని స్త్రీలు సౌమంగల్యంకోసం సత్సంతానాభివృద్ధి కోసం చేస్తారు.

ఈ వ్రతదినం ఉదయమే స్త్రీలు మంగళస్నానంచేసి, కొత్త బట్టలు కట్టుకొని, ఇంటి వసంతిలోగాని, మరొకచోటగాని మంటపంకట్టి, దాని మధ్యన ముగ్గులతో కమలం తీర్చి కలశం స్థాపించి, దానిపైన కొబ్బరికాయ పెట్టి, దానికి లక్ష్మీరూపం అలంకరించి, లక్ష్మిని ఆవాహనం చేసి, షోడశోపచారాలతో పూజిస్తారు. పూజానంతరం పసుపు పూసిన తోరం చేతికి కట్టుకొంటారు. సాయంకాలం ఆరతి యెత్తి పేరంటం చేస్తారు. పూజానంతరం వరలక్ష్మీ వ్రత కథ చదువుతారు. ఈ కథ తెలిపేపాటలు అనదిగా జానపద గాథల మట్టులో ఉన్నవి- పాడతారు.

మంటపాన్ని వర్షాకాలంలో ఫలించే పండ్లలో అలంకరించడం, నైవేద్యానికి ఆవిరికుడుములు వంటి తేలికయిన తినుబండారాలను సిద్ధపరచడం, అన్నిటిని ఐదైదుగా పెట్టడం మొదలయిన ఆచారాలనుబట్టి ఇది వర్షఋతువు పూజగానో, వరాలు ప్రసాదించమని ప్రకృతి లక్ష్మిని పూజించడంగానో ప్రారంభమయి ఉంటుందని అనవచ్చు. ఇది పూర్తిగా

ప్రకృతి దేవి పూజగానే కనిపిస్తుంది.

## కృష్ణాష్టమి

రామకృష్ణావతారాలుమహావిష్ణువు సంపూర్ణావతారాలని మనవారి విశ్వాసము. కృష్ణావతారం దశావతారాలలో ఎనిమిదవది. కృష్ణచరితం హరివంశ భాగవత విష్ణు పురాణాలలో విపులంగా ఉంది. ఈ మహామహుడు దివ్య సుందరమూర్తిగాను, మహాబలపరాక్రమవంతుడుగాను, రాజనీతి దక్షుడుగాను, తత్త్వవేత్తగాను వర్ణించ బడినాడు. భారత భాషలలో కృష్ణునిపై ఉన్నంత సాహిత్యం ఏ ఇతరునిపైనను లేదనవచ్చు. ఇతడు మనకు ప్రసాదించన గొప్ప వరము "భగవద్గీత" రాజనీతి దృష్టితో ఇతడు భారతదేశంలో ప్రపంచంలోనే - తొలిసారిగా కేంద్ర పరి పాలన పద్ధతిని నెలకొల్పి దేశసమైక్యమును పటిష్టం చేసినాడు.

ఈ మహాపురుషుని జన్మదినో త్సవం శ్రావణ బహుళ అష్టమినాడు జరుపు తున్నాము. అష్టమినాడు రోహిణీ నక్షత్రం లో రాత్రి అవతరించినాడు గనుక, అష్టమినాడు పగలంతా ఉపవాసం చేసి, సాయంకాలం పూజలు జరుపుతారు. మంటపంకట్టి దానిని ఈ ఋతువులో లభించే ఫలాలతో ఫలాపళికట్టి, అలంకం రిస్తారు. జనన సూచికంగా ఉయ్యాలలు కట్టి కృష్ణుని ఆడించడం, మంచంపై విగ్రహాన్ని పడుకోబెట్టి పూజించడం, బాలింతలకు శొంఠి ముఖ్యం గనుక శొంఠి, బెల్లం కలిపిన వెన్నను, వివిధ భోజ్యాలను నైవేద్యం పెట్టడం ఆచారం. కృష్ణుడు బాల్యంలో వ్రేపల్లెలో జరిపిన లీలలకు చిహ్నంగా వీథులలో ఉట్లు కట్టడం, మరుసటి దినం వాటిని పోటా పోటీలతో కొట్టడం మొదలైన వినోదాలు దేశ మంతటా జరుపుతారు. విష్ణు దేవాలయాలలో ఉత్సవాలు విశేషంగా చేస్తారు.

కృష్ణుడు కలియుగారంభమయిన తర్వాత 28వ ఏట భాద్రపద బహుళాష్టమి నాడు జన్మించినాడని వ్రత గ్రంథాలు తెలుపుతున్నాయి. బహుళపక్షంతో ఆరంభమయ్యే నెలల పద్ధతి మనకు ఒకప్పుడు ఉండేది. దీని ప్రకారం భాద్రపద మాసమని కొందరు ఇప్పటి భాద్రపద. మాసంలోనే శ్రవణనక్షత్రం ప్రధానమని మరికొందరు రెండు విధాలుగా జరుపు తున్నారు. మన పండుగలన్నిటికీ ఉన్నట్లే దీనికీ, జ్యోతి శ్శాస్త్ర సంబంధం ఉంది. భాద్రపద కృష్ణాష్టమినాడు వచ్చే రోహిణీ నక్షత్రాన్ని 'జయంతీ' అనడం జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయం. ఈ శ్రావణ భాద్రపద మాసాలలో అష్టమితో కలిసిన రోహిణిని జయంతీ అని, కృష్ణా అని అంటారు. ఇది గొప్ప దినమని వసిష్ఠ సంహిత తెలుపు తున్నది. ఈ దినం చంద్రునికి అర్ఘ్యమివ్వాలని నియమించారు వ్రత గ్రంథకారులు. దీనిని బట్టి ఇది మొదట జ్యోతిశ్శాస్త్ర ప్రాధాన్యం కలిగినట్టిదని, తర్వాత దీనికి కృష్ణ జన్మగాథ అనుసంధింపబడిందని తోస్తుంది.

ఈ కృష్ణుడు పూర్ణాయుస్సుతో ఉండినాడని , 125 ఏండ్లు జీవించాడని హరివంశ విష్ణుపురాణ భాగవతాలు తెలుపుతున్నాయి. దేవకీ సూనుడైన కృష్ణునికి ఆంగిరసుడనే ఋషి పురుష యజ్ఞవిద్యను ఉపదేశించాడని, దానిని అతడు ఆచరించి 116 సంవత్సరాలు జీవించాడని, ఛాందోగ్యంలో ఉన్నది. పురుష యజ్ఞానికి తపస్సు, దానము, ఆర్జవము, అహింస, సత్యము దక్షిణలట. అంటే, ఈ గుణాలు గలవాడు దీర్ఘజీవి అవుతాడని అర్థం.

కృష్ణుని చరితం పరమపవిత్ర మైనదని, వేదంలో జ్యోతిర్గణ విషయంలో చెప్పిన కృష్ణ, రాధ, అర్జునాది పదాలను వాటి ఆంతర్యం తెలియని వారు కథలు కల్పించి మూలతత్త్వం మరుగచేసి నారని విమర్శకులు అభిప్రాయపడు తున్నారు.

వందే బృందావనచరం
వల్లవీజన వల్లభమ్
జయంతీ సంభవం ధామ
వైజయంతీ విభూషణమ్

## వినాయక చవితి

మనదేశంలో త్రిమూర్తుల తర్వాత విశేషంగా పూజింపబడే దైవం వినాయ కుడు. ఏ కార్యమైనా నిర్విఘ్నంగా సమాప్తి కావడానికి వినాయకుని పూజతో ప్రారంభ మవుతుంది. ప్రతిశుభకార్యం మొదట్లో ఆరాధింపబడే ఈ దైవం భాద్రపద శుక్ల చతుర్థినాడు జన్మించినట్లు పరిగణిం చడంవల్ల ఆ దినం విశేషపూజలు జరుపుతారు.

భాద్రపద శుద్ధ చవితినాడు మంగళ స్నానం చేసి, బంకమట్టితో చేసిన వినాయక విగ్రహాన్ని ఇంటి భవంతిలో అరుగుమీద పీటవేసి, దానిపై వడ్లుగాని, బియ్యంగాని పరిచవుంచి, అలకంరించి, వినాయకుని ఆవాహనచేసి, పూజలు జరుపుతారు. భాద్రపదమాసంలో లభించే మాచిపత్రి, తులసి, బిల్వం, మరువం, నాకుడు, గరిక, ఉమ్మెత్త, రేగు, ఉత్తరేణి, మామిడి, గన్నేరు, విష్ణుక్రాంత, దానిమ్మ, దేవదారు, వావిలి, జాజి, గణకి, జమ్మి, రావి, మద్ది, జిల్లేడు 21 పత్రులతోను, పూవులతోను పూజిస్తారు. కుడుములు, ఉండ్రాళ్లు ప్రత్యేకంగా నైవేద్యం పెడుతారు. ఇవి 21 విధాలుగా నేతితో చేస్తారు. ఇవే కాక ఈ ఋతువులో వండేనేరేడు, వెలగ

మొదలయిన పండ్లన్నీ నివేదిస్తారు. వినాయక విగ్రహం వద్ద అఖండ దీపం పెడతారు. ఇది మరుసటి దినం సాయంకాలంవరకు ఉండాలి, మరునాటి సాయంకాలం విగ్రహాన్ని నదిలోనో, చెరువులోనో, బావిలోనో విసర్జిస్తారు. కొన్ని ప్రాంతాలలో ఈ విగ్రహాన్ని ధాన్యపు గాదెలలో ఉంచడం, గూళ్ళలో పెట్టి అద్దంవేసి మెత్తివేయడం ఆచారం. దీనివల్ల ధాన్యం అక్షయంగా వుంటుందని, అపుత్రులు పుత్రసంతులవుతారని ప్రజల విశ్వాసం.

వినాయక చవితినాడు చంద్రుణ్ణి చూడడం వల్ల లేనిపోని అపవాదాలు కలుగుతాయని ప్రజలలో ఒక విశ్వాసం వుంది. ఒక వేళ చూస్తే ఆ దోష పరిహారార్థం

*"సింహం ప్రసేన మవధీత్*
*సింహో జాంబవతా హతః*
*సుకుమారక మా రోదీః*
*తవ హ్యేష శమంతకః"*

అనే శ్లోకం పఠించవలెనని, శమంతకోపాఖ్యానం వినాలని పురాణాలు చెబుతున్నాయి. ఈ విషయమై స్కంధ పురాణంలో ఒక గాథ వుంది : "గణపతికి రుద్రుడు గణాధిపత్యం కట్టినాడు. బ్రహ్మదేవుడు అణిమాద్యష్టసిద్ధులను వినాయకునికి భార్యలుగా చేసినాడు. దానికి వినాయకుడు సంతోషించి బ్రహ్మను వరముడుగుమన్నాడు. సృష్టి కార్యము నిర్విఘ్నంగా కొనసాగేట్టు వరమిమ్మని బ్రహ్మకోరగా 'తథాస్తు' అన్నాడు వినాయకుడు. తర్వాత గణపతి మోదకాలు చేతబట్టి, మూషిక వాహనం ఎక్కి సప్తలోకాలూ విహరించి, చంద్రలోకానికి వెళ్లాడు. రూపగర్వితుడైన చంద్రుడు వినాయకుని చూచి పకపకన నవ్వాడు. గణపతి కోపగించుకొని, "నీ మొగం చూచిన జనం అపనిందల పాలవుదురు గాక!" అని శపించాడు. శాపభయంతో చంద్రుడు సముద్రంలో దాగినాడు. అప్పుడు లోకాలు అంధకారబంధురమయ్యాయి. దేవతలు వినాయకుని దర్శించి చంద్రుని శాపం మరల్చమని ప్రార్థించారు. వినాయకుడు అనుగ్రహించి "భాద్రపద శుద్ధ చవితినాడు చంద్రుణ్ణిదర్శించేవారికి మాత్రం ఈ అపవాదం సంవత్సరం పర్యంతం వుంటుంది. తక్కిన వారికి వుండదు. ఆనాడు కూడా శమంతకోపాఖ్యానం వింటే, ఆ అపవాదము వుండదు" అని సెలవిచ్చినాడు.

వినాయకుని పుట్టు పూర్వాలను గురించి పెక్కు గాథలున్నాయి:-

దేవతల కష్టాలు నివారించడానికి శివుడు వినాయకుని సృష్టించినాడు. పార్వతి పసుపు ముద్దకు ప్రాణం పోయగా ఏర్పడినవాడు వినాయకుడు. శివపార్వతులు గజేంద్రరూపంతో కలియగా పుట్టినవాడు గజాననుడు. ఈశ్వరుని చూడడానికి వచ్చిన పరశురాముని అడ్డగించగా జరిగిన పోరులో వినాయకుని ఒక కొమ్ము విరిగినది. కనుక ఏకదంతుడైనాడు-ఇట్లే ఎన్నో గాథలున్నాయి.

వినాయకుడు విద్యాధిదేవతగాను ఆరాధింపబడుతున్నాడు. "శ్రీ గణేశాయ నమః"తోనే అక్షరాభ్యాసం ఆరంభమవుతుంది. సామవేదులు ఈనాడు ఉపాకర్మ చేయడమూ వినాయకుడు విద్యాధిదేవత అనడానికి గుర్తు. వినాయకునికి గల ఆకారము, వాహనము, పూజావిధానము మొదలయిన వాటిని బట్టి వినాయకుడు పంటల దేవుడని కొందరు విమర్శకులంటున్నారు. పురాణగాథలకును, ఖగోళ దృశ్యాలకును సంబంధం కల్పించడం అనాదిగా ఉన్నదని, వినాయకచవితినాడు సూర్యోదయానికి ముందు తూర్పున ఎలుక ఆకారము, దానిమీద ఏనుగు ఆకారముగల రెండు నక్షత్రముల గుంపులు ఉదయిస్తాయని, సూర్యోదయానికి ముందు ఏ నక్షత్రం ఉదయిస్తుందో ఆ నక్షత్రానికి సంబంధించిన దైవాన్ని పూజించాలని ఋగ్వేదంలో వున్నందున వినాయక పూజ భాద్రపదశుద్ధ చవితినాడే జరుపుతున్నామని ఆచార్య శ్రీ విస్సా అప్పారావుగారు తెలిపినారు. ఈ వినాయక నక్షత్రము ఆరునెలల తర్వాత ఫాల్గుణ చవితినాడు సూర్యాస్తమయం తర్వాత తూర్పున ఉదయిస్తుందని ఆయన తెలిపారు. "శమంతకమణి గాథలోని సింహము సింహమాసము. మణి సూర్యుడు; జాంబవంతుడు సప్తర్షి మండలము. గజాసురవధ కూడ జ్యోతిర్మండల విశేషమే" అనీ ఆయన తెలిపారు.

## విజయదశమి

నవరాత్రోత్సవం తర్వాత ఆశ్వయుజ శుద్ధ దశమినాడు జరుపు పండుగ విజయదశమి. దీనిని దసరా అనీ, దశరా అనీ వ్యవహరిస్తారు. ఇది శరన్నవ రాత్రోత్సవానికి మకుటాయమానమైన పండుగ.

ఆరోజు ఉదయం ప్రజలు తలంటి పోసుకొని, నూతన వస్త్రాలు ధరించి ఇష్టదైవాన్ని కొలిచి, మృష్టాన్నాలు భుజించి, సాయంకాలం మహోత్సాహంతో మేళతాళాలతో ఊరిబయటికి పోయి, పొలిమేర దాటి, జమ్మిచెట్టును పూజించి, తిరిగి గ్రామం ప్రవేశించి, పెద్దలకు జమ్మి ఇచ్చి నమస్కరించి, ఆశీర్వాదాలు పొందుతారు. జమ్మి ఇచ్చేటప్పుడు

"శమీ శమయతే పాపం శమీ శత్రువినాశినీ,

అర్జునస్య ధనుర్ధారీ, రామస్య ప్రియదర్శనీ."

అనే శ్లోకం చదువుతారు. శమీపూజ, ఊరి పొలిమేరదాటడం-సీమోల్లంఘనం-ఈ పండుగనాడు అతి ముఖ్యమైనవి. ఉత్తరదేశంలో రావణకుంభకర్ణుల బుట్ట బొమ్మలు చేసి ఊరేగించి, వాటిని పెద్ద మైదానంలో పెట్టి కాల్చివేస్తారు. దీనిని 'రామలీల' అంటారు. పూర్వం సంస్థానాలలో-ముఖ్యంగా మైసూరులో-దర్బారులు, దసరావేడుకలు జగత్ప్రసిద్ధాలు.

ఈ దశమిని విజయదశమి అని అనడానికి కారణాలు పురాణల్లోను, వ్రతగ్రంథాల్లోను వివిధవిధాలుగా ఉన్నవి. రాముడు రావణుని వధించినందుకు సంతోషించిన దేవతలు దేవిని విశేషంగా పూజించారని, అందువల్ల విజయదశమి అయిందని, కనుక శాబరోత్సవం-బండు బూతులతో, విచిత్ర వేషాలతో తైతక్కలాడడం- జరపాలని కొన్ని పురాణాలు చెప్పగా, ఆశ్వయుజ శుద్ధ దశమి సాయంకాలం నక్షత్రాలు ఉదయించినకాలం విజయమనబడుతుంది. ఇది సకల కామప్రదం అని జ్యోతిష గ్రంథాలు తెలుపుతున్నాయి. ఈ సమయంలో అపరాజితను పూజించాలని, సీమోల్లంఘనం చేసి, శమీపూజ జరిపాలని, దేశాంతర ప్రస్థానానికి ఇది శుద్ధసమయమని ధర్మశాస్త్రాలు తెలుపుతున్నాయి. ఇలాటి ప్రమాణాలు చూడగా, ఇది క్షత్రియులు విజయయాత్రకు బయలుదేరే సమయానికి ఉపలక్షణంగా కనిపిస్తుంది. వానలు వెలిసిన తర్వాత నిర్మలమైన శరత్కాలం రాజుల విజయయాత్రకు అనువైనదని చెప్పనక్కరలేదు.

"అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శనీ" అనే శ్లోకంలో వున్నట్లు రామాయణ భారతాల సంబంధమూ సరిగాలేదు. నిజానికి రావణ వధ విజయ దశమినాడు జరుగలేదని ఫాల్గుణామావాస్య యందు రావణుని రాముడు వధించాడని రామాయణ వ్యాఖ్యాత అంటున్నాడు. పాండవులు జమ్మిని పూజించి తాము దాచిన ఆయుధాలను తీసుకొన్నారన డానికీ ప్రమాణాలులేవు. కనుక జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన 'విజయ' పారిభాషికపదానికి రామాయణ, భారతకథలు అంటగట్టినట్లు మనం గ్రహించవచ్చు. ఏమైనను ఇది రాజుల పండుగ.

కృష్ణరాయల కాలంలో ఇది కడువైభవంగా జరిగేదని పోర్చుగీస్ యాత్రికుడు పేజ్ వర్ణించాడు. ఇది ముఖ్యంగా రాజుల దండయాత్రోత్సవమైనా, క్రమంగా నూతన కార్యారంభోత్సవంగా ప్రజలలో నాటుకొన్నది.

### దీపావళి

దీపావళి చాల ఆనందదాయమైన పండుగ. దీనిని దేశమంతా జరుపుతారు గనుక, దేశ సమైక్యోత్సవమనీ అనవచ్చు. ఇది దక్షిణభారతంలో మూడునాళ్ళ పండుగ-ఆశ్వీజ బహుళ చతుర్దశి, అమావాస్య, కార్తీక శుద్ధ పాడ్యమి మొదటిదినం నరకచతుర్దశి, రెండవనాడు దీపావళి అమావాస్య, మూడవనాడు బలిపాడ్యమి. ఉత్తరభారతంలో ధన త్రయోదశి, నరకచతుర్దశి, దీపావళి అమావాస్య, బలి పాడ్యమి, యమద్వితీయ-అని ఐదునాళ్లు చేస్తారు.

ఈ పండుగను జరిపే పద్ధతిని వ్రతగ్రంథాలు ఇలా తెలిపాయి. "త్రయోదశినాడు అపమృత్యు నివారణార్థం దీపాలు పెట్టాలి. దీనిని యమదీపమంటారు. చతుర్దశి తెల్లవారుజామున నరకభయ నివారణార్థం అభ్యంగ స్నానంచేయాలి; సాయంకాలం దేవాలయాలలో మఠాలలో దీపాలు వెలిగించాలి. అమావాస్యనాడు పంచ త్వక్కులు-మర్రి, మామిడి, అత్తి, జువ్వి, నేరేడు చెట్ల పట్టలు-నీటిలో వేసి, నానబెట్టి, ఆ నీటితో అభ్యంగనం చేసుకోవాలి. ప్రదోష కలంలో దీపదానం చేసి, ఉల్కలను (కొరువులను) తిప్పాలి. పిదప అలక్ష్మీ నివారణార్థం లక్ష్మీపూజ చేయాలి. అంతటా దీపాలు వెలిగించాలి. రాత్రి ఊరిలోని స్త్రీలు చేటలు, తప్పెటలు వాయిస్తూ, అలక్ష్మిని పారదోలి, ఇండ్ల భవంతిలో బలిచక్రవర్తిని స్థాపించి పూజించాలి పాడ్యమినాడు బలికి పుత్సవం చేయాలి. ఉదయం జూదమాడాలి. ఆనాడు జూదంలో జయం పొందినవారు సంవత్సరం పొడవునా విజయంతో వుంటారు. తర్వాత గోవర్ధనపూజ చేయాలి. దారిచూపడానికి మార్గపాలిని కట్టాలి. పశువులను యథేష్టంగా ఆడుకోనివ్వాలి. యమద్వితీయ భ్రాతృ ద్వితీయ. ఆ దినం చెల్లిలి ఇంట్లో భోజనం చేయాలి.

వ్రతగ్రంథాలలో ఇట్లా వున్నా, దీపావళి పండుగలో చాల గాథలు ముడిపడ్డాయి. 1. నరకాసుర వధ 2. బలిచక్రవర్తి గాథ 3. రావణ వధానంతరం రాముడు భరతునితో సమావేశం కావడం 4. విక్రమార్క పట్టాభిషేకం. నరకాసుర గాథ భారతదేశమంతటా ప్రచారంలో వుంది. లోకకంటకుడైన నరకుణ్ని కృష్ణుడు సత్యభామా ద్వితీయుడై ఆశ్వయుజ కృష్ణ చతుర్దశినాటిరాత్రి సంహరించాడు. కనుక నరక చతుర్దశి పండుగ చేసుకొంటున్నాము. బలిచక్రవర్తిని వామనుడు త్రివిక్రముడై మూడడుగులచే పాతాళానికి అణచివేశాడు.

గనుక ఈ వుత్సవం జరుపుతున్నారు. రావణవధానంతరం రాముడు లంకనుండి బయలు దేరి భరతుని కలుసుకొన్నాడు గనుక ఇది గొప్పగా పండుగ చేసు కుంటున్నాము. ఉజ్జయినని పాలించిన విక్రమార్కుడు (క్రీస్తుకు ముందు 58 సం.) కార్తీక శుక్ల పాడ్యమినాడు పట్టాభిషేకం చేసుకొన్నాడు గనుక ఇది గొప్ప పండుగ.

ఈ కథలలో బలిచక్రవర్తి గాథ తప్ప మరేదీ వ్రతగ్రంథాలలో లేదు. టపాకాయల ప్రసక్తి అసలేలేదు. దీపదానం చేయాలని, నరక చతుర్దశితో మహా కాళరాత్రి వచ్చింది గనుక నరకనివారణార్థం, నరకంలో వున్న పితరులకు దారి చూపడానికి కొరువులు తిప్పి, దీపాలు పెట్టాలని మాత్రమే వుంది. ఇక రాముడు చైత్రశుద్ధ పంచమినాడు భరతుని చూచినట్లు రామాయణ వ్యాఖ్యాతలు తెలిపినారు. విక్రమార్క శకం ఈ పండుగ నుంచి ప్రారంభమయినట్లు ప్రమాణాలు లేవు. కనుక ఇది పితరులను నరకవిముక్తు లను చేయడానికి ఏర్పడిందే గాని, రామ, కృష్ణ, విక్రమార్కులతో సంబంధించినది కాదు; తర్వాత ఇవన్నీ చేరివుంటాయి.

కాని నరకాసుర గాథ దీనితో ముడి పడడానికి జ్యోతిశ్శాస్త్రరహస్యం ఒకటి వుంది. నరకచతుర్దశినాడు తులారాశి తూర్పు క్షితిజము మీద ఉదయిస్తుంది. మేషరాశి పశ్చిమ క్షితిజం మీద అస్తమించ బోతుంది. మేషరాశి, కుజరాశి, నరకుడు భూమిపుత్రుడు. ఆ దినాలలో మేషరాశి సూర్యాస్తమయ సమయంలో ఉదయి స్తుంది. అది అస్తమించేవరకు చీకటే. మేషరాశి పై సూర్యుడు-కృష్ణుడు. చంద్రునితో - సత్యభామతోపాటు యుద్ధానికి బయలుదేరినట్లగుపిస్తుంది. మేషరాశి పడిపోగానే కన్యారాశిపైకి వచ్చును. దీనినే పురాణకథతో కలిపినారు.

మహావీరుడు దీపావళి అమావాస్య నాడు నిర్వాణము చెందినందున ఆనాడు దేవతలు దీపమాలతో పూజించారని జైనుల విశ్వాసం గనుక వాళ్లూ దీపావళి గొప్పగా చేస్తారు.

ఈ దీపావళి మహావైభవంతో జరిగేదని పదకొండవ శతాబ్దివాడైన అరబ్ యాత్రికుడు అల్ బెరూనీ, మొదలయిన వారు తెలిపారు. విజయనగరకాలంలో జరిగిన ఈ పండుగ వైభవాన్ని 'ఆకాశభైరవ కల్పః' అనే గ్రంథం తెలుపుతున్నది.

కార్తికపూర్ణిమనాడు దీపాలు పెట్టడం కూడ వుంది. దీనిని కౌముదీ మహోత్సవమని అన్నారు. దీపావళినాడు కుమార్తెను, అల్లుణ్ని పిలిపించి గౌరవిం చడం అనాదిగా ఉంది.

## వైకుంఠ ఏకాదశి

వైకుంఠ ఏకాదశిని ముక్కోటి ఏకాదశి అని కూడ అంటారు. ఏకాదశి అంటే పదకొండవ తిథి. ప్రతినెలలో రెండు పక్షాలలో రెండు ఏకాదశులు వస్తాయి. ఏకాదశులలో హరికీర్తనము ప్రధానంగా చేయబడుతుంది కనుక దీనికి హరివాసరమనే పేరు వచ్చింది.

శిష్టులు ఏకాదశీవ్రతాన్ని కఠినంగా ఆచరిస్తారు. దశమి రాత్రి ఉపవాసం ఉండి, ఏకాదశి పూర్తిగా ఉపవాసం చేసి, ద్వాదశినాడు ఉదయం పారణ చేస్తారు. అసమర్థులయినవారు ఫలాహారమో, పాలో పుచ్చుకోవచ్చు. ఏకాదశీ వ్రతమహాత్మ్యం గురించి రుక్మాంగద, అంబరీష చరిత్రాదులు ఎన్నో పురాణగాథలున్నాయి. ప్రతినెలలో ఏకాదశులకు పేర్లున్నాయి. ఆషాఢశుద్ధ ఏకాదశి ప్రథమైకాదశి. దీనినే శయనైకాదశి అంటారు. విష్ణువు శేషతల్పంపై శయనిస్తాడు. దక్షిణాయనం ప్రారంభమవుతుంది గనుక సూర్యుడు దక్షిణానికి జరిగినట్లు కనిపిస్తాడు. ఆషాఢబహుళైకాదశి కామికైకాదశి; శ్రావణ శుద్ధైకాదశి పుత్రైకాదశి; బహుళైకాదశి అజైకాదశి. భాద్రపదంలో మొదటిది పరివర్తనైకాదశి. ఈనాడు విష్ణువు పక్కకు పొర్లుతాడు; రెండవది ఇంద్రైకాదశి. అశ్వీజంలో పాపాంకుశైకాదశి, రమైకాదశి. కార్తికంలో మొదటిది ప్రబోధిన్యేకాదశి; దీనినే ఉత్థానైకాదశి అంటారు. ఈనాడు విష్ణువు మేల్కొం టాడు. అంటే సూర్యుడు ఉత్తరాయణం సమీపిస్తాడన్నమాట. రెండవది ఉత్పత్తైకాదశి. మార్గశిరశుద్ధైకాదశి మోక్షైకాదశి. దీనినే వైకుంఠాకాదశి అంటారు. బహుళైకదశి విమలైకాదశి, దీనినే సఫలైకాదశి అంటారు. పుష్యంలో మొదటిది నందైకాదశి, రెండవది కల్యాణ్యేకాదశి, మాఘంలో మొదటిది భీష్మైకాదశి, రెండవది జయైకాదశి, ఫాల్గుణంలో మొదటిది ధాత్ర్యేకాదశి, రెండవది సౌమ్యైకాదశి. చైత్రంలో మొదటిది దమనైకాదశి, రెండవది బహులైకాదశి. వైశాఖంలో మొదటిది మోహిన్యేకాదశి, రెండవది సిద్ధైకాదశి, జ్యేష్ఠంలో మొదటిది త్రివిక్రమైకాదశి, దీనినే నిర్జలైకాదశి అంటారు; రెండవది యోగిన్యేకాదశి.

సూర్య పర్యాయాలన్నీ తర్వాత విష్ణువుకు అన్వయించడం వల్ల, విష్ణు ప్రాధాన్యాన్నిబట్టి ఇది హరివాసర మయింది. వైకుంఠ ఏకాదశి ప్రధానం కావడానికి కారణమిదిః-

ఈ ఏకాదశి నాటికి దాదాపు ఉత్తరాయణం ప్రారంభమవుతుంది. ముప్పది మూడు కోట్ల దేవతలూ ఈనాడు భూలోకానికి దిగివస్తారని పెద్దలంటారు. అంటే, దేవతలకు మన ఆరునెలలు పగలు, ఆరు నెలలు రాత్రికదా. దక్షిణాయనమనే

రాత్రి తొలగి ఉత్తరాయణమనే పగలు ప్రారంభం కానున్నదన్నమాట. దీనికి సూచనా విష్ణ్వాలయాలలో ఉత్తరాన ఒక ద్వారం తెరుస్తారు. తెల్లవారుజామున దేవదర్శనానికి ఈ ద్వారం గుండా పోవాలి. వారికి మోక్షం తప్పదు. సూర్యుని ఉత్తరాయణప్రవేశ చిహ్నంగా ఈ వైకుంఠ ద్వారం తెరవడం ఆచారమయింది.

శ్రీ వైష్ణవాళ్వారులలో ఒకరైన నమ్మాళ్వారు ఈనాడు పరమపదించడం వల్ల కూడ వైష్ణవులు దీనికి విశేషప్రాధాన్యం ఇస్తున్నారు.

## మకర సంక్రాంతి

మకర సంక్రాంతిని సంక్రాంతి పండుగ అంటారు. ఈ సమయానికి మనకు పంటలు పండి, ఇంటికి వచ్చి, సమృద్ధిగా వుంటుంది గనుక పెద్ద పండుగ అంటారు. శ్రీనాథుడు దీనిని 'పెనుబండువు' అన్నాడు. పరిశ్రమోపజీవులైన మన పూర్వులు తాము పండించుకొనిన పంటలను విజయోత్సాహంతో పొంగించి వండుకొని, పంచభూతాలను తనియించి, తామును తనిసి, చలిమంటల వెలుగులో గొబ్బిళ్లు, గొండ్లి ఆడి మైమరచిన పండుగ ఇది.

ఇదిమార్గశిర పుష్యమాసాలలో సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినప్పుడు, ఉత్తరాయణం ప్రారంభంతో వస్తుంది. ఇది మూడు నాళ్లు జరుపునట్టి పండుగ. మొదటి దినము భోగి పండుగ. రెండవనాడు సంక్రాంతి. మూడవనాడు కనుము. ఇవి మూడూ మన ప్రాచీనాచారాల ప్రతీకలే. మకర సంక్రమణం వెనుకటి నెలంతా ధనుర్మాసం. దీనికి పండుగ నెల అని పేరు. ధనుర్మాసం ముప్పదినాళ్ళూ భక్తులు తెల్లవారుజాముననే లేచి స్నానాదులు నిర్వర్తించి, దైవారాధనం ముగించి, వైష్ణవులైతే ఆండాళు రచించిన తిరుప్పావై పాశురాలు దినానికొకటిగా పాడి అర్చించి, భజనలతో గ్రామ ప్రదక్షిణం చేస్తారు. స్త్రీలు ఇంటి ముంగిళ్లను ముగ్గులచే అలంకరించి పేడముద్దలతో గొబ్బెమ్మలు పెట్టి వాటిలో గుమ్మడిపూలు చెక్కుతారు. భోగి పండుగనాడు ఇండ్ల ముంగిట్లో మంటలు వేసి, పాత వస్తువులను కాల్చి వేస్తారు. వీటికే భోగిమంటలనిపేరు. దీనిని ఉత్తరభారతంలో 'లోడి' అంటారు. మధ్యాహ్నం పులగం - పొంగలి వండి భుజిస్తారు. స్త్రీలు సాయంకాలం పిల్లలకు పండ్లు పోసి పేరంటం చేస్తారు. రెండవనాడు సంక్రాంతి. ఈనాడు తర్పణ శ్రాద్ధాదులు జరిపితే, పుణ్యలోకాలు వస్తాయని, ఈనాడు నాస్తి యనే శబ్దం వుండరాదని, దానాలు చేయాలని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. ఈనాడు సజ్జలు అద్దిన నూవులు పండే ప్రాంతాలలో నూవులు సజ్జరొట్టెలు చేసి ఆరగిస్తారు. ఉత్తరదేశంలో కంబళ్లు దానం చేస్తారు. సాయంకాలం చిన్నవారు పెద్దవారికి నమస్కారాలు చేస్తారు. కనుక దీనికి మొక్కుల పండుగ అనే పేరూ వుంది. మూడవనాటి కనుము పండుగ పూర్తిగా కర్షకులపండుగ. తమ కృషికి బాసటగా నిలిచిన పశువులను కడిగి అలంకరించి, కొమ్ములకు రంగులు పూసి, సింగారిస్తారు. పసుల కొట్టంలో పొంగలి వండి, అది ఉడుకుతున్నప్పుడు 'పొల పొంగలి, పసుల పొంగలి' అని కేకలు వేసి, దేవతలకు నైవేద్యం పెట్టి, పొలాలకు వెళ్ళి ఆ పొంగలిని పసుపు కుంకుమలతో కలిపి వెదజల్లుతారు. దీనిని 'పొలిచల్లడం' అంటారు. ఇది పూర్వపు రక్తసిక్తాన్న బలికి గుర్తు. తర్వాత దిష్టితీసి గుమ్మడికాయను పగులగొడుతారు. ఇది పశుబలికి ప్రత్యామ్నాయం. సాయంకాలం పశువులను పూలదండలు, నగలు, గజ్జెల పట్టెడలతో అలంకరించి పూరేగిస్తారు. చక్కెరపొంగలి తినిపిస్తారు. పొలిమేరల్లో ఎడ్ల పోటీలు, పొట్టేళ్ళ పోటీలు, కోడిపందేలు జరుగుతాయి. గంగిరెద్దుల వారి సంబరం చెప్పనక్కరలేదు. తమిళనాడులో ఎడ్లకొమ్ములకు డబ్బులు కట్టి పరువెత్తించి వాటిని విప్పుకొని వచ్చే పోటీలు జరుపుతారు. నాల్గవనాడు ముక్కనుమును జరుపుతారు.

స్త్రీలు భోగినాటినుండి గొబ్బిగౌరీ వ్రతమనే వ్రతం జరుపుతారు. భోగి నాటి సాయంకాలం మంటపాన్ని నిర్మించి కూరగాయలతో, పండ్లతో అలంకరించి బంకమట్టితో గౌరీవిగ్రహం చేసి, పూజానంతరం పాటలుపాడి గొబ్బిళ్లుతట్టి పేరంటం చేస్తారు. రాత్రి దేవిని నిద్రపుచ్చి మరల ఉదయం మేల్కొల్పుతారు. నాల్గవదినం ఉద్వాసన చేస్తారు. మంటపాన్ని అలంకరించిన కూరగాయలతో కూర వండుతారు. దీనిని గొబ్బి కూర అంటారు. నాల్గవనాటి సాయంకాలం గొబ్బి గౌరిని చెరువులో గాని, నదిలో గాని ఓలలాడిస్తారు కొందరు స్త్రీలు పుట్టినింటి క్షేమంకోసం "కాకి పిడచలు పెట్టడం" అనే వ్రతం చేస్తారు. కొన్ని ప్రాంతాలలో భోగి నుంచి పదినాళ్లు బొమ్మల కొలువు పెడుతారు. దీనిని సంక్రాంతి కొలువు అంటారు.

ధనుర్మాసంలో పొంగలి వండడం వైద్యశాస్త్రం ప్రకారం ఆచారమయింది. చలికాలంలో రాత్రులు పెద్దవి, పగళ్లు చిన్నవి గనుక, నిద్రలేవగనే ఆకలి అవుతుంది గనుక ముద్దాన్నం తిన మన్నారు. ఈ ఆచారం దేవాలయాలలో ప్రాకింది. భోగి అనేది సంస్కృత పదంగా కనిపిస్తుంది గాని, నిజానికి పొంగలి నుంచి పుట్టిందనే నా విశ్వాసం. ఈ పదవ్యవహారం

ఉత్తరదేశంలో లేనందున, ఇది పొంగించు, పొగు అనే సంస్కృతేతర పదాల నుంచి పుట్టి భోగి అయి సంస్కృతీకరింపబడి భోగి అయివుంటుంది.

## రథ సప్తమి

రథసప్తమి పండుగ మాఘశుద్ధ సప్తమినాడు జరుపుతారు. షష్ఠినాడు రాత్రి ఉపవాసం చేసి, సప్తమినాడు అరుణోదయానికి ముందే నదిలో దీపం వదలి, స్నానం చేయాలి. స్నానం చేసేటప్పుడు ఏడు జిల్లేడాకులు, ఏడు రేగాకులు తలపై పెట్టుకోవాలి.

**"జనని త్వంహి లోకానాం, సప్తమీ**
**సప్త సప్తికే,**
**సప్తవ్యాహృతికే దేవి, నమస్తే**
**సూర్యమాతృకే"**

అనే మంత్రంతో సూర్యునికి అర్ఘ్యమివ్వాలి. సూర్యునికి పొంగళ్లు, చిమ్మిలి వంటి పదార్థం పండాలి-అని వ్రత గ్రంథాలు చెబుతున్నాయి. దీనిని ఉత్తరాయణ పుణ్యకాలమంత ప్రముఖంగా భావిస్తున్నారు. దీనిని బట్టి, సూర్యమాతృకే, సూర్యునితల్లీ-అనడాన్ని బట్టి, సూర్యుడు ఈనాటికి కొద్దిగా రథంలాగ కనిపించి ఉంటాడని, కనుకనే సూర్యుని కనేతల్లి అని వర్ణించబడిందని, ఇది సూర్యారాధనోత్సవమని మనం విశ్వసించవచ్చు. ఈనాటి నుంచి చలి తొలగి, వెలుతురు ఎక్కువవుతుంది. కనుకనే శ్రీనాథుడు "మెరయు వేసవి రథసప్తమి దివసమున" అని అన్నాడు.

## మహాశివరాత్రి

మహాశివరాత్రి మాఘ బహుళ చతుర్దశినాడు ఆచరించబడుతున్నది. ఇది ఈనాడు ప్రధానంగా శివభక్తుల పండుగ. ఈనాడు శివభక్తులు తెల్లవారుజాముననే లేచి, స్నానాద్యనుష్ఠానాలు నిర్వర్తించి, ఉపవాసం చేసి, రాత్రిపన్నెండు గంటలకు లింగోద్భవకాలం గనుక రాత్రంతా పూజలు అభిషేకాలు, అర్చనలు, శివలీలా కథనములు జరిపి, మరునాటి ఉదయం పారణ చేస్తారు. శివక్షేత్రాలలో ఈ ఉత్సవం గొప్పగా జరుగుతుంది. శ్రీశైలంలో పూర్వం ఈ ఉత్సవం జరిగే తీరును పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో విపులంగా వర్ణించాడు.

ఈనాటి మహిమను గురించి లింగపురాణాది శైవపురాణాలలో మృగ వ్యాధ కథలు మొదలగునవి ఎన్నో ఉన్నాయి. నాకు చూడగా ఇది సృష్టిలింగోద్భవ కాలమని, వసంతలింగోద్భవ కాలమని; తర్వాత శైవకథలు దీనికి అనుసంధింపబడినవని తోస్తుంది. వసంత విషువత్తు మృగశీర్ష నక్షత్రంలో వచ్చే కాలానికి ఇది సూచకమయి వుంటుంది. వసంత విషువత్తు, వెక్కు నక్షత్రాలకు మారడం "ప్రాచీన ఖగోళము" అనే గ్రంథంలో శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు విపులీకరించారు. కనుక ఇది కూడ వసంతలింగోద్భవకాలమే.

## హోలీ – ఫాల్గుణోత్సవం

ప్రకృతి దేవి మంచు తెరలు తొలగించుకొని కొత్తసింగారంతో సాక్షాత్కరించినప్పుడు, ఆమెకు స్వాగతం పలుకడం భారతీయుల అనాది ఆచారం. ఈ ఆచారం ఆనందస్వరూపమే ఫాల్గుణోత్సవం-హోలీ. పూర్వం వసంత విషువత్తు ఈనాడే సంభవించడంచేత వైదికకాలంలో నూతన వర్షం ఈనాడే ప్రారంభంకావడం చేత దీనికి వసంతోత్సవమని, మదనోత్సవమని వ్యవహారం వుంది. ఇది ఆంధ్రదేశంలో కాముని పున్నమిగాను, కన్నడ ప్రాంతంలో కామదహనంగాను వ్యవహరింపబడుతున్నది. ఇది కామ పునరుజ్జీవనంగా ఏర్పడినదని 'హోహో' అనే అరపులే హోలీగా మారిందని పండితులంటారు గోధుమపంట మూర్చిడి కోలాహలమే ఇది అని కొందరన్నారు.

ఈ పూర్ణిమనాడు ప్రతి ఇంటి ముంగిట ఒక గుంట తవ్వి దానిలో ఆముదపు కొమ్మ నాటుతారు. గడ్డి గాదం, పిడకలు దానిచుట్టూ పోగుచేస్తారు. హోలీ, హోలిక అనే దేవతను పూజించి, చేతి వెనుక భాగంతో నోరు కొట్టుకుంటారు. గడ్డి గాదం కాల్చిన బూడిదను, వసంతం బుక్క పిడి చల్లుకుంటారు. బండ బూతులతో తిట్టుకుంటారు. ధూళి చిమ్ముకుంటారు. దీనిని ఉత్తరదేశంలో 'ధులండీ' అంటారు. స్నానానంతరం పూర్ణపు బొబ్బట్లు చేసి, హోలికాగ్ని-గడ్డిగాదం కాల్చిన నిప్పు-లో వేసి హోమం చేస్తారు.

ఇది వసంతోత్సవం గనుక అతి ప్రాచీన కాలం నుంచి జరుపబడుతున్నది. గాథా సప్తశతిలో దీనిని 'ఫగ్గుచ్ఛణం' అని చాలచోట్ల వర్ణించారు. ఈఉత్సవంలో బురద చల్లులాడడం కూడా విరివిగా వర్ణించబడింది. బుద్ధుని కాలంలో దీనిని 'బాలనక్ఖత్త' అన్నారు. ఇది శ్రావస్తిలో జరిగేదట. దీనిని 'మూర్ఖుల పండుగ' అనవచ్చు. ఇది ఏడురోజులు జరిగేది. ఇది చాల ప్రబలంగా వుండడాన్ని బట్టి మీమాంసకులు దీనిని వైదికంగా పరిగ్రహించారు. విజయనగర సమ్రాట్టుల కాలంలో ఇది గొప్పగా జరిగేది.

పూర్వుల ఆనందోత్సవంగా మనదేశంలో వున్న ఈ వుత్సవం వంటివి విదేశాలలోను వున్నాయి.

• • •

# పరిణామక్రమంలో మన శిల్ప-చిత్రకళలు

చలసాని ప్రసాదరావు



సుందర దృశ్యం (లాండ్‌స్కేప్) - సంజీవ్‌దేవ్

*ఈనాటి చిత్ర - శిల్పులకున్న ఆధునిక పరికరాలు, సౌకర్యాలు ఏవీలేని రోజుల్లోనే "పరిపూర్ణ" కళా విలువలతో తెలుగు వారి శిల్ప కళ, చిత్రకళ బహుముఖంగా వికసించి ఉండటం, దాని లోతుపాతులు తెలిసిన వారికి ఆశ్చర్యం కలిగించదు.*

ఒకనాటి మన కవులు ప్రాచీన శిల్పాల్ని చూసి, వాటిల్లో కొట్టవచ్చినట్లు కనిపించే సజీవత, లయబద్ధతలకు ముగ్ధులై "లేపాక్షి బసవయ్య లేచి రావయ్యా" లాంటి కవితలను గానం చేశారు: అంటే మన తెలుగు శిల్పుల కళా నైపుణ్యం ఆనాటికే అవధులు అందుకుని ఉందనే గదా! దాని అర్థం.

విజయనగరం శిల్పులకన్నా ముందు వారయిన కాకతీయ, నాగార్జున కొండ శిల్పుల సృష్టిని చూసి, సంభ్రమంతు కవితలు, కావ్యాలు అల్లిన వారూ ఉన్నారు. అమరావతి సంగతి సరేసరి. అది ఆనాడే ఖండాంతర ఖ్యాతి నందింది.

ఈ వారసత్వ కళా పరంపరలో బహుశా "లేపాక్షి"చివరిదవుతుంది. ఆ తరువాత కూడా కళ వర్ధిల్లినప్పటికీ, అమరావతి, నాగార్జున కొండ, కాకతీయ, విజయనగర కాలల్లో లాగా ఒక ఉద్యమంలా కొనసాగలేదు. ఎక్కడి కక్కడ స్థానిక ప్రభువుల పోషణలోనే కొనసాగింది. అందువలన అవి చరిత్రలో భాగంగా మిగిలాయి తప్ప ప్రత్యేకాసక్తి కలిగించేలా అభివృద్ధి చెందలేదు.

ఆ తరువాత బ్రిటిష్‌పాలనా కాలం లోనే ఆధునిక యుగపు విద్యావంతులతో కూడిన చిత్ర - శిల్పుల బృందాలు రూపొందాయి. బ్రిటిష్‌వారు రాజకీయం గా ఏం చేసినా కళాపరంగా స్థానిక కళలపట్ల ప్రత్యేకాసక్తి ప్రదర్శిస్తూ వచ్చారు. వీరి హయాంలో దేశం నలుమూలా ఫైన్ ఆర్ట్స్ స్కూల్స్, కాలేజీ లు నెలకొని ఎందరో చిత్రకారులకు శిక్షణ నిచ్చి, వెలుగులోకి తెచ్చాయి. ఈ విషయంలో వారి అవసరాలు వారివనుకున్నా పనిలో పనిగా మన కళారంగం సుశిక్షిత విద్యావంతులతో సంపన్నం అయింది. వారు మరలా దేశంలో వివిధ ప్రాంతాలలో మరిందరు కళాకారుల్ని అభివృద్ధి పరిచారు.

తెలుగు దేశంలో బందరు జాతీయ కళాశాలలో ప్రమోదకుమార్ చటోపాధ్యాయ, మద్రాస్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో దేవీ ప్రసాద్ రాయ్ చౌదరి అలా వచ్చిన వారే. మన చిత్ర కళా పునరుజ్జీవనానికి నాంది పలికిన తొలి వ్యక్తిగా చిరస్మరణీయు డైన దామెర్ల రామారావుకు మార్గదర్శిగా నిలిచిన ఆస్వాల్ట్ కూల్ డ్రే బ్రిటిష్ వాడే గదా. ఒక ముఖ్య పరిణామం ఏమంటే, సాంప్రదాయికంగా మన చిత్రకారులు తమకు అందుబాటులో ఉండే రంగుల్ని, తామే తయారుచేసుకునే రంగుల్ని, తమకు లభ్యమయే చెక్కలోలు వంటి బేస్ పై ఉపయోగించి, అప్పటి ప్రజల అభిరుచుల్ని, లేదా కళాపోషకుల అవస రాల్ని బట్టి చిత్రించినారు. అవి వందల సంవత్సరాల తర్వాత కూడా పాడవకుండా నిలిచి ఉండగల విధంగా రూపొందడం గొప్ప విషయమే. అది ఆనాటి వారి సాంకేతిక పరిణితికి కొండగుర్తు.

ఆ తరువాత ఇటు బ్రిటిష్ వారి



విరాగిణి—ఉర్చి

ద్వారా మన దాకా వచ్చిన యూరోపియన్ ఆయిల్ కలర్ పెయింటింగ్ విధానాలూ, అటు కలకత్తా శాంతినికేతనోద్యమ ఫలంగా ప్రచారంలోకి వచ్చిన ప్రాచ్య దేశాలు చైనా, జపాన్ వాటర్ కలర్ చిత్రణా విధానాలూ కూడా మన కళాకారుల చేతిలో పటిష్టమై, అది మన స్వంతమే అనదగిన విధంగా కలగలిగిపోయి విస్తృత ప్రచారం లోకి వచ్చాయి. అది ఒక దశ.

ఈ దశలో దామెర్ల వరదా వెంకట రత్నం, అంకాల వెంకట సుబ్బారావు, పైడి రాజు గోఖలే, కౌతా సోదరులు, గోలి శేషయ్య, మొక్కపాటి కృష్ణమూర్తి, పి.యల్. నరసింహమూర్తి, వడ్లమాని మధుసూధనరావు, కొండపల్లి శేషగిరిరావు, కాపు రాజయ్య, పి.ఆర్. చిత్రా, వి.వి. భగీరధి వంటి చిత్రకారులెందరో కళయే జీవిత సర్వస్వం అన్నట్లుగా కృషిచేసి మన కళా రంగాన్ని సుసంపన్నంచేశారు. ఎవరికి వారే, అందరి కందరూ అన్నట్లుగా ఒక్కొక్కరూ ఒక్కో ప్రత్యేకతను ప్రదర్శిస్తూ కళా రంగాన్ని స్వర్ణశోభితం చేశారు. దేశంలోని మరే ప్రాంతపు చిత్ర శిల్పులకూ తీసిపోని కళా ప్రతిభను ప్రదర్శించారు.

పైగా, ఆ తర్వాతి తరంలో మరి కొందరు ఏకంగా పాశ్చాత్య కళాప్రక్రియల్లో, ప్రయోగాల్లో సైతం తమ ప్రతిభను ఆశ్చర్యకరంగా ప్రదర్శించి విఖ్యాతు లయారు. యూరోపియన్ కళాకారులకు దీటుగా ఉన్నాయని నిరూపించారు. కృష్ణా రెడ్డి, ఎస్.వి. రామారావు, వై.వి. లక్షయ్య యూరప్‌లో అనేక ప్రతిష్టాత్మక బహుమతులు పొందిన మన చిత్రకారులే. రామారావు ఏకంగా కామన్‌వెల్త్ దేశాల చిత్రకారుల్లోకెల్లా "ఉత్తమ" చిత్రకారునిగా గోల్డ్‌మెడల్ సాధించుకున్నాడు.

ఆ తర్వాతి దశలో మన చిత్ర కళారంగానికి హైదరాబాదే కేంద్రం. హైదరాబాద్ ఆర్ట్స్ సొసైటీ, లలిత కళా అకాడెమీల ఛాయల్లో కొద్ది కాలమే అయినా ఉత్సాహంగా కృషి చేసిన ఒక క్రొత్త యువతరం చిత్రకారుల బృందం ఇక్కడ రూపొందింది. కాలక్రమాన ఇపుడు వీరే సీనియర్ కళాకారులు అని చెప్పుకోదగిన స్థాయికి వయసుకు వచ్చారు.

వీరిలో కె. లక్ష్మాగౌడ్, సూర్య ప్రకాష్, గౌరిశంకర్, మహమ్మద్ యాసిన్, దొరై స్వామి, శ్రీహరి ఖోలేకర్, నరేంద్ర రాయ్ వైకుంఠం వంటి వారు కనీసం ఒక పాతికమంది దాకా తమ వ్యక్తిత్వాన్ని నిరూపించుకుని నిలబడే స్థాయిలో కృషి చేశారు. తేడాఅల్లా వీరిలో కొందరు రకరకాల కారణాల వలనా వెనుకబడితే, కొద్ది మంది మాత్రం స్థిరంగా నిలబడ్డారు. ముఖ్యంగా లక్ష్మాగౌడ్, వైకుంఠం, సూర్యప్రకాష్ తమ ప్రత్యేక చిత్రణ విధానాల వలనా, వాటికి మూలమైన ఆలోచనారీతి, భావపరంపరల వలనా అందర్నీ ఆకట్టుకోగలిగారు. వైకుంఠం తెలంగాణా గ్రామీణ రూప చిత్రాల సమూహాలు సర్వత్రా ప్రశంసలు పొంది అతన్ని పైకి తెచ్చాయి. లక్ష్మాగౌడ్ తొలి నాళ్లనుండి ఒక ఆలోచనా పరంపరకు అంకితమై తన స్వంత చిత్రణా పద్ధతిని ప్రాచుర్యంలోకి తేగలిగిన సర్వ సమర్థుడు. అనదగిన వారనేకులున్నారు.

ఇప్పుడు మరో క్రొత్త తరం, యువ కళాకారులు ముందుకు వస్తున్నారు. రకరకాల ప్రయోగాలతో వీరు కళా రంగంలో తమ స్థానం కోసం, తమ 'ముద్ర' కు గుర్తింపుకోసం తీవ్రంగా కృషిచేస్తు న్నారు. అద్దాల మీద చిత్రిస్తూనూ, ప్రాచీన కళాశైలులకు నూతన కోణం నుంచి అనువాదాలిస్తూనూ, తంజావూరు పెయింటింగ్ శైలికి ఆధునిక రేఖానువాదం చేసే ప్రయత్నంతోనూ, భారతీయ ఇతి వృత్తాలకు పాశ్చాత్య కోణం నుండి రూప కల్పన చేసే ప్రయత్నం తోనూ ఈనాటి యువచిత్ర కారులు రకరకాల ప్రయోగాలు చేస్తున్నారు.

కళా కృషి వరకూ అందరూ బాగానే చేస్తున్నారు. సాంకేతికంగా ఎవరికి వారే సమర్థులూ, మరెవరికీ తీసిపోని వారునూ అయినా మన చిత్ర కళా రంగంలో ప్రస్తుత పరిస్థితి ఏ కొద్దిమంది వేళ్ళమీద లెక్కించ



భయానకం(హర్రర్) – పి.ఆర్ రాజు

దగిన వారికో తప్ప ప్రోత్సాహకరంగా లేదు.

అందుకు కారణం మరేం లేదు. ఇది ఒక రకంగా కళా రంగంలో సంధి యుగం లాంటిది. మొన్న మొన్నటి దాకా చిత్రకారుల్ని అకాడెమీలే ఒక రకంగా పోషించాయి. ఇపుడవి రాజకీయాల్తో, ముఠా తత్వాల్తో, అవినీతితో వెనుక బడ్డాయి. మారుతున్న సామాజిక, కళా రంగ పరిస్థితులకనుగుణంగా అవి మారలేదు, అభివృద్ధి చెందలేదు. ఫలితంగా కళాకారులు వాటి నుండి ఆశించ దగిన దేమీ లేకుండా పోయింది.

అదే సమయంలో పారిశ్రామిక రంగంలో లబ్ది ప్రతిష్టులైన ఆధునికులు కొందరు కళా రంగంపై దృష్టి సారించి సాయం చేయనారంభించారు. అది వారి అవసరాలకోసమే అయినా, ఇటు కళా కారులకూ ఒక క్రొత్త ప్రపంచాన్ని చూపింది. కళకు వ్యాపార రీత్యాగల విలువ ఏమిటో తెలియజేసింది. వేలు, లక్షల రూపాయలకు ఒక్కో పెయింటింగ్ అమ్ముడుపోయే వాతావరణాన్ని వారి ముందుంచింది. ఈ కారణం వలన కూడా మారని అకాడెమీలు అవశేషాల్లో మిగిలిపోయాయి.

మన చిత్రకారులు ఇన్నేళ్లలోనూ దేశ దేశాల కళారూపాల్ని, శైలుల్ని, భావజాలాన్ని ఆపోసనం పట్టారు. ఆ దిశగా పరుగులు కూడా తీశారు. అయితే బహుకొద్ది మందే తమ స్వంత భావ పరంపరను, చిత్రణా పద్ధతిని, వ్యక్తిత్వాన్ని స్థిరపర్చుకోగలిగారు.

మన చిత్రకారుల్లో ప్రయత్న పూర్వక మైన వైవిధ్యం కొంత వచ్చిందే గానీ, అది సహజంగా అభి వృద్ధి చెందలేదు. అందుకు కారణం ఆ వివైధ్యం, అందు కోసం జరిగిన ప్రయత్నం జాతి జీవితంలోంచి వచ్చింది కాకపోవడమూ, ఆ జీవితం నుండి నేర్చుకునే ప్రయత్నం కాకపోవటమూనూ.

పాశ్చాత్య కళనుండి పాఠాలు నేర్చుకోవలసిందే తప్ప అందులోనుండే ఉత్తేజం పొంది, అనుకరించి ఔన్నత్యం సాధించగలమనుకోవడం భ్రమ. అది హానికరం కూడా.



గాంధీజీ – నరేంద్రరాయ్



విష్ణు – పి.టి. రెడ్డి

మన తెలుగు చిత్ర, శిల్ప కళా రంగాలు ఈ దృష్ట్యా మరో పున రుజ్జీవనోద్యమం రావాల్సిఉందీనాడు. దానికి జీవితమే కేంద్ర బిందువు కావలసిఉంది. ఇదీ మన కళ అని సగర్వంగా చూపుకోగల కళాసృష్టికి దోహదం చేయవలసి ఉంది.

'మన' అంటే అర్థం ముడిగట్టుకు కూర్చోటం కాదు. అనంతంగా వికసించిన ఈ కళా ప్రపంచంలో 'మన' ప్రత్యేకత ఏమిటో ప్రదర్శించాల్సి ఉంది. అది లేకుండా ఏ కళా బ్రతకదు.

కానీ, మనకళాకారులు ఆ విశిష్టతను సాధించగల సర్వసమర్థులే. నేడుగాకున్నా రేపయినా అలా జరగక తప్పదు.

• • •

# తెలుగు పనితనం వాడి-వేడి

భండారు పర్వతాలరావు

'పలుచని సన్నకావి వలిపంబులు కట్టగ నిచ్చి నెచ్చెలుల్', అన్నాడు జక్కన విక్రమార్క చరిత్రంలో. తెలుగు నాట నేత పనివారు నేసిన ఆ వలిపాలు ఎంత పలుచనివో ఆయన చెప్పలేదు. కాని ఆ సంగతి ఆ తరువాత ఎన్నేళ్లకో ఒక అగ్గిపెట్టె చెప్పింది. ఎలా? ఆ అగ్గిపెట్టె అన్ని అగ్గిపెట్టెల లాటిదే కాని అందులో ఒక తాను పలుచని నేతబట్టను పెట్టి బందరు నుండి లండనుకు పంపటమే విశేషం. ఎంతపలుచని వలిపమయితే, తాను గుడ్డ ఒక అగ్గిపెట్టెలో పట్టించగలుగుతారు? అదీ తెలుగు వారి అద్భుతహస్తకళా నైపుణ్యం!

## పానుగంటి వారి ప్రశ్న

ఈరోజు ఆవిరితో, నూనెతో, విద్యుచ్ఛక్తితోనడిచే యంత్రాలు ఎన్నో కనిపెట్టబడ్డాయి. కాని పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారు 'సాక్షి'లో అడిగినట్లు- "ఏదో? ఒక్కదేశంలోనైనా, ఒక్క జాతిలో నైనా అటువంటి సెల్లాలు నేయగలిగారా? 'మహామహానిశితములై, మహాసూక్ష్ములైన- యనేక సహస్రాశ్వ ధాటిగల యంత్రములైన దీయజాలని- మిగుల సన్ననైన దారములను మననేతపనివారు పట్టి చేతులతో దీయగలుగుట యత్యంత పరిశ్రమోన్నత శక్తికధిక తమావధికాదా? ఆహా! వారి వ్రేలికొన లెంత మృదులములో-యెంత సూక్ష్మములో-యెంత స్పర్శేంద్రియ మహాశక్తి మహనీయములో-యెట్టిసంపూర్ణ చాకచక్యపరిపక్వతాదశ నొందియున్నవో- ఆలోచించు కొనుటకైన మనకు భావనాశక్తి కలదా?"-అని ఆయన ప్రశ్నించారు. 1920 నవంబరు 24 ఆంధ్రపత్రికలో హస్తకళల గురించి 'సాక్షి' వ్యాసపరంపర ముఖంగా వ్రాస్తూ ఆ ప్రశ్ననాటికీ నేటికీ మన చెవులలో మార్మోగుతూ జవాబు చెప్పండని తెలుగు వారినందర్నీ నిలదీస్తూనే వుంది. నిజానికి ఆయన ఆ ప్రశ్న తెలుగు వారినొక్కరినే కాదు, భారతీయులనందరినీ అడిగారు. భారతీయ సంస్కృతీ సంప్రదాయ సంపదలకు అద్దంపట్టే హస్తకళా వారసత్వం అందరి సొత్తు కదా!

## కలంకారీ

ఆంధ్రప్రదేశ్ ప్రత్యేకంగా సగర్వంగా చెప్పుకోదగిన హస్తకళలు ఎన్నోవున్నాయి. మచిలీపట్నం, కాళహస్తి మొదలయిన చోట్ల తయారయ్యే కలంకారీ వస్త్రాలు ఆనాడే అలగ్జాండర్ చక్రవర్తి దృష్టిని కూడ ఆకట్టుకొన్నాయి. హరప్పా వద్ద జరిపిన తవ్వకాలలో బయటపడ్డ ఒక వెండి పాత్రపై కప్పివున్న బట్ట కలంకారీ వస్త్రం అంటే యీ వరిశ్రమ యెంత పురాతనమైందో అర్థమవుతుంది. మన పురాణగాథలను కనుల విందుగా చిత్రించే కలంకారీ పనివారు నేటి అవసరాలకు తగినట్లు పక్కబట్టలు, డోర్ కర్టెన్లు మొదలైనవే గాక గృహాలంకరణకు పనికివచ్చే అనేక రకాల వస్త్రాలు తయారుచేస్తున్నారు.



## చేనేత

ఇక, చీరల విషయంలో తెలుగాడ పడుచుల ఆసక్తీ, అభిరుచీ అందరికీ తెలిసిన సంగతే. వారి అభిరుచికీ, కళాపిపాసకూ తగినట్లు అనేక ఆకర్షణీయమైన రంగులలో, డిజైన్లలో తెలుగునాట నేతపనివారు చీరలు నేస్తున్నారు. ముఖ్యంగా పోచంపల్లి, ధర్మవరం పట్టుచీరలు, నారాయణపేట, గద్వాల్, వెంకటగిరి జరీచీరలు పేర్కొనదగినవి. పొందూరు ఖద్దరు ధోవతులు సరేసరి! అంతరించి పోతున్న కళలలో ఒకనాడు రాజులు, జమీందారులు ఆదరించిన పెనుగొండ(పశ్చిమగోదావరి) కావిరంగు ధోవతులు చెప్పుకోదగినవి.

## బొమ్మల కొలువు

పిల్లల పేరుతో కొనే బొమ్మలు నిజంగా పెద్దవాళ్ళే ఎక్కువ పదిలంగా

దాచుకుంటారు. దసరా, సంక్రాంతి పండుగలలో బొమ్మల కొలువులు తీర్చి పేరంటాలు చేయటం తెలుగు మహిళలకు రివాజు: కొండపల్లి కొయ్యబొమ్మలు, ఏటి కొప్పాక లక్క-పూత బొమ్మలు, తిరుపతి ఎర్రచందనం బొమ్మలు (జపాన్‌కు ఎగుమతుల ధర్మమా అని యిప్పుడివి అరుదయి పోయాయి)-యివన్నీ ఏ బొమ్మల కొలువులోనైనా కొలువు తీరక తప్పదు.

## సిల్వర్‌ఫిలిగ్రీ

వెండి నగిషీకి కరీంనగర్ ప్రసిద్ధి. ఈ కళను సిల్వర్ ఫిల్‌గ్రీ అంటారు. ఇవి ఏ వస్తువుకావస్తువే ప్రత్యేకం! వీటిలో తాళం, చెవిరింగులూ, గొలుసులూ, ట్రేలూ కాక రకరకాల పక్షులూ, జంతువుల బొమ్మలు లభిస్తాయి.

## బిద్రీ

అలాగే బిద్రీ. 13వ శతాబ్దంలో పర్షియాలో ప్రాచుర్యం పొందిన యీకళ ఎలాగో భారతదేశానికి చేరి తెలుగునాట వేరూనింది. సూఫీసాధువుల సౌమ్య భావన, తెలుగు జోదుల శౌర్యసాహసాలు, మొగల్ పాదుషాల కళాతృష్ణ యీ కళలో నేటికీ ప్రతిఫలిస్తూంటాయి. నలుపు తెలుపుల వైరుధ్యం ఆధారంగా నయనానందం చేసే కళారూపాల కాణాచి బిద్రీ. ఇందులో కత్తులు, డాళ్ల దగ్గర నుండి పాన్‌దాన్‌లు, యాష్ ట్రేలు, షేర్వాణీ గుంజీల దాకా అనేక రకాల వస్తువులు లభిస్తున్నాయి.

## పెంబర్తి

లోహపు పనితనానికి మన రాష్ట్రం పెట్టింది పేరు. పెంబర్తి లోహపాత్రలు అలంకరించని డ్రాయింగ్ రూంగాని, స్టార్ హోటల్స్‌గాని అరుదు. లోహపు వస్తువు



లలో షీట్ మెటల్‌తో చేసినవి కాకతీయ శిల్పకళా సౌందర్యాన్ని పర్షియన్ కళాకారుల నైపుణ్యాన్ని పుణికి పుచ్చుకొన్నాయి. పూలమొక్కల కుండీలు, గోడకు తగిలించే చిత్రాలు, స్టేషనరీ సామానులు, విగ్రహాలు యిందులో చూడవచ్చు.

## నిర్మల్

నిర్మల్ చిత్రాలు జగత్ప్రసిద్ధినందాయి. కేవలం చిత్రాల తయారీతో సరిపెట్టక, నిర్మల్ కళను ఆధునిక అభిరుచుల కనుగుణంగా మలచి డ్రాయింగ్ రూం, డైనింగ్ హాల్, బెడ్ రూంలలో ఉపయోగించే ఫర్నీచర్ తయారీవరకు విస్తరించారు.

## శిల్పం

శిల్పకళకు సంబంధించి దుర్గి, ఆళ్లగడ్డ, తిరుపతులలోను, విజయవాడలోనూ ఉలులూ, సుత్తులూ చేసే శిలా మృదంగ ధ్వానాలు యిప్పటికీ చెవులకు విందు చేస్తుంటాయి. ఆంధ్ర శిల్పుల హస్తవిన్యాసాలలో గండ శిలలే కరిగి, వెన్న ముద్దలై, శిల్పి మెదడులో మెదిలే రూపులు తమంతతామే ధరించి కూచుంటాయి. అవయవ సౌష్ఠవం మాత్రమేకాక దివ్య దీప్తి తొంగిచూసే ముఖారవిందాలతో వెలసిన రకరకాల దేవతా విగ్రహాలు, నర్తకీ మణుల మూర్తులు యిందుకు నిదర్శనాలు.

## బంజారా కుట్టుపనులు

'బంజారా ఎంబ్రాయిడరీ' అన్న పేరుతో ప్రసిద్ధమైన కుట్టుపనులకు బంజారా మహిళలే ఆద్యులూ, ఆధారభూతులు కూడ. అద్దం ముక్కలతో అందంగా తీర్చి తయారు చేసే యీ దుస్తులకు బాగా గిరాకీ వుంది.

## తివాచీలు

ఏలూరు, వరంగల్ పట్టణాలు తివాచీ నేతకు ప్రసిద్ధి. రకరకాల అలంకారాలతో తయారవుతున్న వరంగల్ 'డెర్రీ'లు విదేశాలకు ఎగుమతవుతున్న హస్తకళావస్తు సముదాయంలో వున్నాయి.

## బుడితి

శ్రీకాకుళం జిల్లాలో వున్న బుడితిలో కంచుపాత్రలు, లోహమిశ్రమాలతో తయారయే వస్తువులు లభిస్తాయి. రేఖాగణిత విన్యాసాలు, పుష్పరూపాలు తొంగిచూసే కళానైపుణికి బుడితి పుట్టిల్లు. ఇవిగాక, యింకా నరసాపురం లేసులు, బందరు కాగితం గుజ్జు బొమ్మలు, ఉప్పాడ ధోవతులు మొదలయినవి అనేకం వున్నాయి.

## అంతరించి పోతున్న హస్తకళలు

**తేలియా రుమాల్:** ఒకప్పుడు బాగా ప్రచారంలో వుండి క్రమంగా అంతరించి పోతున్న తెలుగు వారి హస్తకళలలో తేలియా రుమాల్ తయారీ ఒకటి. ఇకత్ సెల్లాలుగా పేరొందిన యీ రకం బట్టలను ధరించిన వ్యక్తుల చిత్రాలు మనకు అజంతా గుహలలో కన్పిస్తాయి. ఉత్తరాదిన పటోలాగా పేరొందిన యీ బట్టలను తెలుగునాట అటు చీరాలలోను, యిటు పోచంపల్లిలోను నేస్తారు. రమ్యమైన రంగులతో రకరకాల డిజైన్లతో నేసే ఈ రుమాళ్లు సాధారణంగా చతురస్రాకారంగా వుంటాయి. పండుగ సమయాలలో, పెళ్లిళ్లవంటి కార్యాలలో ప్రత్యేకించి వీటిని ధరించటం ప్రముఖులకు ఆచారంగా వుంటోంది. హిందూ, ముస్లిం తారతమ్యం లేకుండా అంతా వీటిని ధరిస్తారు. వీటిలో దుపట్టాలు కూడా వున్నాయి. బంగారు జరీ కలిపి నేసే యీ దుపట్టాలను హైదరాబాదులో కులీన కుటుంబాల వారిప్పటికీ వాడు తున్నారు.

**వీణ, మృదంగం:** వీణలను, మృదంగాలను తయారుచేసే కళకూడ అంతగా వర్ధిల్లటం లేదు. ఎక్కువగా విజయనగరం, పిఠాపురాలలో యివి తయారు చేసే కుటుంబాలు యింకా వున్నాయి. వీటి తయారీలో పనస చెక్క వాడతారు. పనస చెక్క తగినంతగా దొరకకపోవటం, ఎక్కువ వెలతో కొని చేసే తాహతు పనివారికి లేకపోవటంతో పాటు వాటికి తగిన గిరాకీ లభించకపోవటం కూడా ఈ కళ అంతరించేందుకు దోహదం చేశాయేమో!

## డోక్రా

ఆదిలాబాదు జిల్లాలో చిత్తర్‌బోరి, ఉషేగాం పల్లెలలో డోక్రా పోతపని కనిపిస్తుంది. మూసపోసి చేసినా, ఏ రెండు వస్తువులూ ఒకే రకంగా వుండకపోవటం ఈ ఆదివాసి కళ ప్రత్యేకత.

## తోలుబొమ్మలు

తోలు బొమ్మలాట యిటు హస్తకళగా అటు జానపద ప్రదర్శన కళగా కూడ చెప్పుకోదగింది. శ్రీశైలంలో శివరాత్రి ఉత్సవంలో ఏర్పాటయిన జానపదకళా రీతులలో తోలు బొమ్మలాట కూడ వుందని పాల్కురికి సోమన తన "పండితారాధ్య చరిత్రలో" ప్రస్తావించటాన్ని బట్టి యీ కళ ప్రాచీనత తెలుస్తుంది. రామాయణ, మహాభారతాదులను తెరపై రంగురంగుల బొమ్మలతో చూపించే యీ రూప వాచక ప్రక్రియ రూప వాణికి (ఆడియో-విజువల్ టెక్నిక్‌లకు) నాంది పలికింది. మాధవపట్నం (తూర్పు గోదావరి), డి.సి. పల్లె (నెల్లూరు), నిమ్మలకుంట (అనంతపూర్) లలో యింకా ఈ బొమ్మలాటలవారు తమకు వారసత్వంగా లభించిన యీ కళను సజీవంగా వుంచటానికి తంటాలు పడుతున్నారు. నిమ్మలకుంటలో తోలుబొమ్మలను తయారు చేయటమే గాక అదే విధానంలో టేబిల్ లైట్ డోములు మొదలైన ఉపయోగకరమైన వస్తువులను తోలుతో కళాత్మకంగా చేస్తున్నారు. లోగడ బనగానిపల్లె నవాబు గారి కోరికపై జమ్ములమడుగు-కోయిలకుంట్ల రోడ్డుపై గల నొసం గ్రామంలో తోలుతో చీట్లపేక తయారుచేసేవారు. ప్రస్తుతం ఆ కళ అంతరించటం దురదృష్టం.

## పునరుజ్జీవనం

పారిశ్రామిక విప్లవంతో యంత్రయుగనాగరికత దెబ్బ ఒక ప్రక్క, పరాయిపాలన మూలంగా కలిగిన విదేశీ వస్తువ్యామోహం మరో ప్రక్క మన హస్తకళాకారుల జీవనానికి విఘాతం కలిగించాయి. తరతరాల వారసత్వంగా సంక్రమించిన యీ హస్తకళా సంపద అంతరించిపోయే ప్రమాదం సంభవించింది. ప్రభుత్వం ఆ ప్రమాదాన్ని నివారించేందుకు, హస్తకళాకారులకు అన్ని విధాలా ప్రోత్సాహం అందించేందుకు ఆంధ్రప్రదేశ్ హస్తకళాభి వృద్ధి, సంస్థను ఏర్పాటు చేసింది. ఈ సంస్థ 'లేపాక్షి' విక్రయశాలలద్వారా మన హస్తకళలకు మార్కెట్ సౌకర్యాన్ని కలిగిస్తూవుంది. మనరాష్ట్రంలోనేగాక, ఇతర రాష్ట్రాలలో, యితర దేశాలలో కూడ తెలుగు పనితనం వాడి, వేడికి ఆదరణ లభించేలా కృషి సాగిస్తూంది. ఈ అమూల్య వారసత్వ సంపద మనందరిదీ. దీనిని కాపాడుకొనటం మనందరి విధి, బాధ్యత, కర్తవ్యం.

● ● ●

# ఆసియా రుమాల్

## అంతరించి పోతున్న హస్త కళ

వనం జ్వాలా నరసింహారావు

సాంప్రదాయిక హస్తకళలను కళాకారులను గుర్తించి, ప్రోత్సహించి, అభివృద్ధి పర్చి కావల్సిన మార్కెటింగ్ సౌకర్యాలను సమకూరుస్తూ, అపారమైన ఆంధ్ర రాష్ట్ర హస్తకళల వారసత్వాన్ని పరిరక్షించేందుకు దశాబ్దం క్రితం ప్రభుత్వరంగ సంస్థగా నెలకొల్పబడింది ఆంధ్ర ప్రదేశ్ హస్తకళల అభివృద్ధి సంస్థ. ఈ సంస్థ కార్యక్రమాల్లో భాగంగా అంతరించిపోతున్న పురాతన హస్తకళలను పునరుద్దరించే లక్ష్యంతో ఎంపిక చేయబడిన కొన్ని హస్తకళల సమగ్ర అధ్యయనం కూడావుంది. ప్రప్రధమంగా ఈ లక్ష్యసాధనలో ఎంపిక చేయబడింది ప్రపంచ ప్రఖ్యాత 'తేలియారుమాల్ 'లేక' ఆసియారుమాల్'.

చతురస్రాకార రూపంలో వుండే "చీరాల తేలియారుమాల్" లేక "చీరాల ఆసియా రుమాల్" ఆంధ్ర ప్రదేశ్ హస్తకళల్లో అపురూప మైనదని చెప్పుకోవాలి. అయితే ఈ అపురూపమైన కళాఖండం అంతరించి పోయే ప్రమాదం కూడా లేక పోలేదు. పారిస్, బేసెల్, జురిచ్ లాంటి ప్రపంచ ప్రఖ్యాత నగరాల్లోని టెక్స్టైల్ మ్యూజియాంలో అతి జాగ్రత్తగా భద్రపరచ బడిన అపు రూపమైన ఈ డిజైన్‌లు కొన్ని సంవత్సరాల తర్వాత తయారు చేసేవారు బహుశా వుండకపోవచ్చు నని, వీటిపై సమగ్ర అధ్యయనం చేసి, ఆంధ్రదేశ్ హస్తకళల అభివృద్ధి సంస్థ వారికి సమర్పించిన ఓ నివేదికలో శ్రీమతి అమృతా సింగ్ పేర్కొన్నారు. ఆ కళ అంతరించి పోకుండా తీసుకోవాల్సిన జాగ్రత్తలు కూడా అందులో ఆమె తెలియజేసారు. శతాబ్దాల తరబడి ఆంధ్రరాష్ట్ర టెక్స్టైల్ కేంద్రంగా పేరుగాంచిన చీరాల నగరంలో ఆవిర్భ వించిందీ హస్తకళ. రాష్ట్రంలోని కోస్తాతీరప్రాంతపు ప్రకాశం జిల్లాలో వుంది చీరాల. ఈ శతాబ్దపు మూడవ దశకంలో నాలుగు వందల మంది నేత కార్మికులు ఈ తేలియా రుమాల్‌లు తయారు చేసేవారని, వారి సంఖ్య ప్రస్తుతానికి అయిదు కుటుంబాలకే పరిమితమై పోయిందని, అక్కడవున్న మాస్టర్ వీవర్ శ్రీ గుంటి భాస్కరరావు శ్రీమతి అమృతాసింగ్‌కు తెలియజేసారు. ఒకానొక రోజుల్లో నిజామ్ నవాబుగారి దివాణంనుంచి వచ్చిన రాజప్రతినిధులు చీరాలలోని దుప్పట్లు, రుమాళ్లు కొనుక్కొని పోయేవారని ఇప్పుడది గతవైభంగా మిగిలిపోయిందని అక్కడ మిగిలివున్న అయిదు కుటుంబాల నేతవారు వర్ణించారని శ్రీమతి అమృతాసింగ్ తన నివేదికలో పేర్కొన్నారు. నాటి నిజామ్ ప్రతినిధులు చీరాలలోని స్థానిక ముస్లిమ్‌లను సంప్రదించి వారి సలహాల మేరకు రుమాళ్లను కొనుగోలు చేసేవారట.



తేలియా రుమాల్ డిజైన్

ఆంధ్ర ప్రదేశ్ హస్తకళల అభివృద్ధి సంస్థ వారు అంతరించి పోతున్న హస్తకళల అధ్యయనం గురించి చేస్తున్న కృషిలో భాగం గా శ్రీమతి అమృతా సింగ్‌ను కొద్దికాలం పాటు డాక్యుమెంటేషన్ కన్సల్టెంట్‌గా నియమించారు. ఆమెకు హస్తకళల గురించి సమగ్ర అవగాహన వుంది. చక్కని ఆంగ్ల భాషలో ఇకత్ దుస్తులు, వాటి పుట్టుక, చారిత్రక విశేషాలు, మరెన్నో వివరాలు పొందుపరిచి కూలంకషంగా అధ్య యనం చేసి తన నివేదికను తయారుచేసారామె.

నేత విధానం, టైడై ప్రక్రియ, తరతరాలుగా డిజైన్ల అభివృద్ధి, మొదలైన విషయాలను ఈ నివేదికలో తెలియజేయడం జరిగింది.

ఆ రోజుల్లో చీరాలనుండి మధ్యప్రాచ్య దేశాలకు సరాసరి నేరుగా వాణిజ్య బేరసారాలు జరుగుతుండేవట. ఏనాడో 1936లోనే, చీరాలనుండి మధ్య ప్రాచ్య దేశాలకు ఓ పడవ ద్వారా తేలియా రుమాళ్లను ఎగుమతి చేసారని మాస్టర్ వీవర్ శ్రీ గుంటి భాస్కరరావు చెప్పారు. అందుకే ఆసియా రుమాలన్న పేరు వచ్చింది. 1991 వరకూ, బొంబాయికి చెందిన ఓ వ్యాపారస్తుడు వీటిని విదేశాలకు ఎగుమతి చేస్తూండేవాడు. ఆ తర్వాత వీటికి ఎందుకో మార్కెట్ పడిపోయింది. కొనే నాథుడు లేక పోయాడు. కాకపోతే, ఆంధ్ర ప్రదేశ్ హస్తకళల అభివృద్ధి సంస్థ, దేశవ్యాప్తంగా వున్న తన లేపాక్షి హస్తకళల విక్రయ కేంద్రాలద్వారా – ముఖ్యంగా హైదరాబాదు, ఢిల్లీ, మద్రాసులోని ఎంపోరియాల ద్వారా ఈ రుమాళ్లకు మార్కెటింగ్ సౌకర్యాన్ని కలుగజేస్తున్నారు.

శతాబ్దాల తరబడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రముఖ నేతదుస్తుల కేంద్రంగా వుంటూ వచ్చింది. పూర్వకాలం నుంచి కూడా శ్రీకాళహస్తి, పల్లకోట, పుచిలీ పట్నం, చీరాల, వెంకటగిరి, ధర్మవరం-మొదలైన స్థలాలలో అత్యంత నాణ్యమైన నేతదుస్తులను తయారు చేస్తుండేవారు. వీటిలో చీరాల, పోచంపల్లిలలో తయారవుతుండే డబుల్ ఇకత్ తేలియా రుమాళ్లు ఆదిలో అంతగా ప్రాచుర్యం పొందినవికావు.

దక్షిణ అమెరికా,ఐరోపాలోని మధ్య ప్రాచ్య ప్రాంతం, 17, 18 శతాబ్దాల నాటి ఇటలీ, మెక్సికో, గౌతమాలా, యూక్వెడార్, పెరూ, టర్కీస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, ఫ్రాన్స్, స్కాండనేవియా, జపాన్ దేశాలలో ఇకత్ దుస్తులు నేయబడినప్పటికీ, ప్రపంచంలోని కేవలం మూడు దేశాలలో మాత్రమే డబుల్ ఇకత్ దుస్తులు తయారయ్యేవి. అవి భారతదేశం, ఇండో నేషియాలోని ఓ గ్రామం, జపాన్ దేశం. డబుల్ ఇకత్ దుస్తులను టై-డైడ్ దుస్తులనీ రెసిస్ట్ డైడ్ ఫాబ్రిక్స్ అని కూడా అంటారు. ఈ విధానంలో నేతలోని నిలువు పోగులు, అడ్డుపోగులకు ఇకత్ తరహాలో రంగులద్దటం జరుగుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లోని రెండే రెండు ఇకత్ నేత దుస్తుల తయారీ ప్రదేశాల మధ్యదూరం వందలాది మైళ్లు. ఒకప్పటి హైదరాబాద్ రాష్ట్రం–నేటి తెలంగాణాలోనివెనుకబడ్డ ప్రాంతమైన నల్లగొండ జిల్లాలో పోచంపల్లి దానిపరిసర గ్రామాలుండగా, తూర్పు కోస్తా తీర ప్రాంతంలోగల చీరాల ప్రకాశం జిల్లాలో వుంది. సాంప్రదాయిక చేనేత వృత్తి వారైన పద్మశాలి కులానికి చెందిన ఇద్దరు సోదరులు ఇరవైయ్యో శతాబ్దపు ప్రారంభంలో ఈ హస్తకళలను చీరాల నుండి పోచంపల్లికి తరలించారని అంటారు.

ఇరవైయ్యో శతాబ్దపు తొలిదశలో, మధ్యప్రాచ్య దేశాలకు తేలియా రుమాళ్లను తలపాగా దుస్తులుగా ఎగుమతి చేస్తుండే వారు. ఈ ఎగుమతి వ్యాపారం రెండవ ప్రపంచ యుద్ధకాలం వరకు దేదీప్య మానంగా కొనసాగి, క్రమేపీ తిరుగు ముఖం పట్టింది. పోచంపల్లి నుండి ఇకత్ లో శిక్షణ కొరకు చీరాల వెళ్లి వచ్చిన నేత పనివారు, ఇకత్ నేతను సరళం చేయటమే కాకుండా రసాయినిక రంగులను కూడా ప్రవేశ పెట్టారు. అయితే, ప్రాచీనకాలం నుండీ తాము తయారు చేస్తున్న చీరాల తేలియా రుమాళ్లను మార్కెటింగ్ చేయటం లో వైఫల్యం చెందసాగారు. దీనికి ప్రధాన కారణం–ఒకప్పుడు దేనికొరకైతే వాటిని ఉపయోగం చేశారో ఇప్పుడు ఆ అవసరం లేకపోవటమేనని శ్రీమతి అమృతాసింగ్ అంటారు.

ఒకే రకమైన కొలతతో, దాదాపు చతురస్రాకారంలో వుంటుండే ఈ నూలు గుడ్డ తేలియా రుమాళ్లను ప్రధానంగా అన్ని రకాలుగా ఉపయోగపడే దుస్తులుగా వాడేవారు ఒకప్పుడు. భారతదేశంలోని పశ్చిమ తీరప్రాంతంలోని బెస్తవారు లుంగీలుగానూ, తలపాగాలుగానూ ఉపయోగించేవారు వీటిని. అలాగే చీరాల పరిసర ప్రాంతాలలోని గొర్ల కాపరులు కూడా ఉపయోగించేవారు. హైదరా బాద్ దాని పరిసరప్రాంతాల చాకలి వారు కూడా తేలియా రుమాళ్లను తలపాగాలుగా, లుంగీలుగా ధరించేవారు. హైదరాబాద్ సంస్థానానికి చెందిన సంపన్న కుటుంబ స్త్రీలు తేలియా రుమాళ్ల నమూనాలో తయారవుతుండే దుప్పట్లను ధరించేవారు. సుమారు 45 అంగుళాల నిడివి గల చతురస్రాకార సైజులో ఎంతో అందంగా టై-డై పద్ధతిలో నేయబడినప్పటికీ ఈ దుప్పట్లకు మార్కెటింగ్ అంతంత మాత్రం గానే వుండేది. మధ్యప్రాచ్య దేశాల ఎడారి ప్రాంత ప్రజల అవసరాల కనుగుణంగా సూర్య కిరణాల వేడి ప్రభావాన్ని అరికట్టేందుకు తైలంలో ముంచే విధానంతో తయారు చేస్తుండేవారీ రుమాలును. టేబుల్‌పై గుడ్డగా కూడాఇది ఉపయోగించే వీలున్నప్పటికీ, ఇది దొరికే సైజు నిర్ణీత ప్రమాణంలో వుండటం మూలాన ఆ అవసరాల కొరకు కొనేవారు ఎక్కువ మంది లేక పోతున్నారు. కేవలం చతురస్రాకారంలో వుండే టేబుల్ పైనే దీన్ని వేయటానికి వీలవుతుంది. అదే

విధంగా కుషన్ కవర్‌గా వాడాలంటే సైజు పెద్దదవుతుంది. వెజిటబుల్ రంగులద్దకం ద్వారా క్లిష్టతరమైన ఉత్పత్తి విధానాన్ని అనుసరించటం వలననూ, మరింత క్లిష్టతరమైన డిజైన్లలో తయారుచేయటం వల్లనూ, చీరాల తేలియా రుమాళ్ల ధర కొద్దిగా ఎక్కువనే చెప్పుకోవాలి. అయితే పోచంపల్లిలో తయారయ్యే తేలియా రుమాళ్లతో పోల్చి చూస్తే రంగులద్దే విధానంలోనూ, మూలికలలోనూ, చీరాల నేతపనివారి తెలివితేటలు, సూక్ష్మబుద్ధి కొట్ట వచ్చినట్లు కనిపిస్తాయని అంటారు ఎందరో నిపుణులు.

1991లో అనాధగా మరణించిన స్వర్గీయ శ్రీ పి. నరసింహన్ అనే గురువుగారి వద్ద ఈ హస్తకళను, జటిలమైన డిజైన్ల రూపకల్పననూ తాను నేర్చుకున్నానని 68 సంవత్సరాల మాస్టర్ వీవర్ శ్రీ భాస్కరరావు తెలియజేసారు. వాస్తవానికి, ఆయనింట్లో, 1937లో ప్రచురించబడిన ఒక పాత వార్తా పత్రికపై అతుకు పెట్టబడిన, ఓ రుమాలు గ్రాఫ్ ఇప్పటికీ అక్కడికెళ్లిన వారికి కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. కాకపోతే, ఆయన ఇద్దరు కుమార్తెలు చేనేత వృత్తి పని వారిని వివాహమాడలేదు. అదే విధంగా ఆయన ఏకైక కుమారుడు కామర్స్ పట్టభద్రుడవటమే కాకుండా తన తండ్రి అడుగుజాడల్లో ఈ తేలియా రుమాళ్ల తయారీ వృత్తిని చేపట్టే ఆలోచనలో వున్నట్లు కనిపించరు. శ్రీ భాస్కరరావుగారి సోదరుని కుటుంబ సభ్యులు కూడా అంతే. ప్రస్తుతం ఐదు మగ్గాల ఆధారంగా, సంవత్సరానికి ఇరవై తానుల తేలియా రుమాళ్లను (సుమారు 400 మీటర్లు) మాత్రమే ఉత్పత్తి చేయటం జరుగుతున్నది చీరాలలో. శ్రీ గుంటి భాస్కరరావు టై-డైడ్ దారాన్ని సరఫరా చేస్తుండే అయిదుగురు చేనేతపనివారి వయస్సు కూడా 65 సంవత్సరాలపైబడే. వారి పిల్లలెవరికీ కూడా ఈ వృత్తిపై మక్కువ వున్నట్లుగా కనిపించదు. తరతరాలుగా, వంశపారంపర్య వృత్తిగా సంక్రమిస్తూ, అనుసరిస్తూ వస్తున్న ఈ హస్తకళోత్పత్తి ఈ తరంవారితో అంతరించి పోయే ప్రమాదం పొంచుకుని వుందంటారు శ్రీమతి అమృతాసింగ్.

క్లిష్టమైన-సాదావియైన రేఖా చిత్రాల గీతలను, మార్జిన్లను గుడ్డలపై రూపుదిద్దటం చీరాల రుమాళ్ల తయారీలో ఓ సహజమైన కార్యక్రమం. ఈ రేఖా చిత్రాల కేంద్రం చతురస్రంలో చిన్న చిన్న బ్లాకులు, నక్షత్రాలు, చుక్కలు-గీతలు. డైమండ్‌లో డైమండ్ ఆకృతి చిత్రాలు వుంటాయి. ప్రాథమిక డిజైన్ల పరిధిలో రకరకాల మార్పిడులు-కూర్పులు, చేర్పులు చేసు కుంటూ పోతూ, ఓ గ్రాఫ్ కాగితంపై తనుకు కావల్సిన డిజైనును వీవర్ తయారు చేసుకుంటాడు. ఈ విధంగా తయారు చేయబడే తేలియా రుమాళ్లను దుప్పట్ల గానూ, టేబుల్-కుషన్ కవర్లగానూ భవిష్యత్‌లో ఉత్పత్తి చేయగల్గితే బాగుంటుం దని శ్రీమతి అమృతాసింగ్ తన నివేదికలో పేర్కొన్నారు.



తేలియా రుమాలను నేస్తున్న వృద్ధ కళాకారుడు

దారాన్ని మొట్ట మొదట తైలంలో ముంచి తీసి ఆరవేసే కార్యక్రమం, అలిజారిన్ లేక వెజిటబుల్ రంగులద్దకం పద్ధతికి అత్యంత అవసరం కాబట్టి వీటిని తేలియారుమాళ్లు (తేలియా-తైలం-మూనె) అని పిలుస్తారు. ప్రారంభంలో సుమారు రెండు గంటలపాటు దారాన్ని తైలంలో ముంచి తద్వారా దారంపైన వుండే గ్రీజ్, గంజిని తొలగిస్తారు. ఆ తర్వాత ఆ దారాన్ని సమాన భాగాలుగా

విడతీస్తారు. ప్రతి భాగాన్ని (దారం కట్టలను) గొర్రె పేడకలిపిన నీటిలో ఓ రాత్రంతా ముంచి వుంచుతారు. ఆ తర్వాత ఆ దారం వుండలను పిండి మరుసటి రోజు వుదయం నుంచీ ఆరబెట్టారు. ఈ కార్యక్రమాన్ని నాల్గురోజులపాటు చేస్తారు. ఆ తర్వాత-గొర్రె పేడ పూర్తిగా తొలగి పోవటానికి దారాన్ని పరిశుభ్రమైన నీటిలో ఉతుకుతారు. ఆముదపు గింజల పై భాగాలను నీటిలో కాలబెట్టి తద్వారా వచ్చే బూడిదతో ఆయిల్ షేకును తయారు చేస్తారు. దీనికి నువ్వుల నూనెను కలుపుతారు. పాల తెలుపు ఆకృతిలో వుండే ఈ మిశ్రమంపై నున్న బూడిదను శుభ్రమైన గుడ్డతో అద్ది దానిలోంచి విడగొడ్తారు. ఓ రాత్రంతా ఇంతకు ముందు తయారు చేసి పెట్టుకున్న దారపు కండెలను ఈ తైల మిశ్రమంలో కలిపి పిండి వుంచు తారు. మరుసటి రోజు ఉదయం ఎండలో నీటిని ఆరవేస్తారు. ఈ ప్రక్రియ ఆఖరు రోజున దారాన్ని పరిపూర్ణంగా ఉతికి శుభ్రపర్చి ఎండలో తిరిగి ఆరవేస్తారు. ఇక ఇప్పుడీ దారం రంగులద్దకానికి తయారుగా వుంటుంది. ఆ తర్వాత నేతలోని నిలువు పోగులను విస్తరించి బొగ్గుతో డిజైన్లను గీస్తారు. తెలుపుగా వుండాల్సిన భాగాలను ముదలు ముడివేస్తారు. అలిజారిన్ రెడ్ స్ఫటికలను, ఉతిక పొడరును తగినంత పరిమాణం నీటిలో కరిగిస్తారు. ఈ ద్రవం 50 డిగ్రీల వేడిలో వున్నప్పుడు ఇంతకు ముందు తయారు చేసి పెట్టుకున్న దారాన్ని దానిలో ముంచి, తీసి, ముంచుతుంటారు. నీటి ఉష్ణోగ్రత మరిగే స్థితికి చేరుకున్నప్పుడు ఈ దారాన్ని మధ్య మధ్య ముంచి కలుపుతుంటారు. ఈ 'డై' ద్రావకంలో ఐదుగంటలపాటు దారాన్ని వుంచి, ఆ తర్వాత బయటకు తీసి చల్లని నీటిలో పరిశుభ్రంగా కడుగుతారు. గొర్రెపేడ నీటిలోనూ, తైలంలోనూ ముంచి తీసి ఆరవేసినందువల్ల ఎరుపురంగు అనుకున్న పద్ధతిలో కావల్సిన రీతిలో ఆకర్షణీయంగా అంటుకుంటుంది. ఈ ఎరుపు భాగాలను, తెలుపు భాగాలతో ముడివేస్తారు. నేరేచోట అలిజారిన్, కాపర్ సల్ఫేట్ పొడర్లను నీటిలో కరగిస్తారు. దారాన్ని మరో మారు ఈ ద్రవంలో ముంచి నానబెట్టి, ద్రవం ఉష్ణోగ్రతను మరిగే స్థితికి తీసుకొస్తారు. దారాన్ని గంటసేపు ఈ వేడి మిశ్రమంలో వుంచి ఆ తర్వాత మరో అయిదు గంటలు చల్లబడ్డ తర్వాత వుంచుతారు. అప్పుడు బయటకు తీసి సంపూర్ణంగా పరిశుభ్రమైన చల్లని నీటిలో ఆ దారాన్ని వుతికి కడుగుతారు. ఇంతటితో "హై-డై" ప్రక్రియ పూర్తవు తుంది.

ప్రస్తుతం నలభయ్యో నంబర్ దారాన్ని వాడి, తేలియా రుమాళ్లను తయారు చేస్తున్నారనీ, ఉత్పత్తి విధానాన్ని సమగ్రంగా తనకు తెలియచేసేటందుకు మాస్టర్ వీవర్ శ్రీ గుంటి భాస్కరరావు సుముఖంగా లేరని వీటిపై పరిశోధనజరిపి నివేదికను తయారు చేసిన శ్రీమతి అమృతాసింగ్ అన్నారు. ఆ విధానాన్ని తెలియచేయటంలో చాలా చాక్యంతో అతను అనుసరమనుకున్నంత మేరకే తనకు చెప్పారని ఆమె పేర్కొన్నారు.

నేత, నారు తేలియా రుమాళ్లను తయారు చేయటంలో అత్యంత జాగరూకత వహిస్తారని ప్రతి విషయం కూలంకషంగా ఆలోచిస్తారని శ్రీమతి సింగ్ పేర్కొన్నారు. మంచి పనితనం వున్న వ్యక్తి రోజుకు నాలుగు రుమాళ్లను నేయగల్గుతాడు.

దుప్పట్లు, టేబుల్-కుషన్ కవర్లు, తేలియా రుమాళ్ల ప్రక్రియలో ఉత్పత్తి చేస్తే మార్కెటింగ్ వుంటుందంటారామె.

శ్రీమతి అమృతాసింగ్ రూపొందించిన నివేదిక ఆధారంగా ఈ హస్తకళను అంతరించి పోకుండా, కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాల సహాయ సహకారాలతో తగు చర్యలు తీసుకునే ప్రయత్నంలో వుంది ఆంధ్రప్రదేశ్ హస్తకళల అభివృద్ధి సంస్థ. అంతరించి పోతున్న హస్తకళలన్నింటిపైనా ఇలాంటి నివేదికలను తయారుచేస్తున్నదీ సంస్థ.

## ఆంధ్ర ప్రశస్తి

గోదావరీపావనోదారవాఃపుర
మఖిలభారతము మా దన్ననాఁడు,
తుంగభద్రాసముత్తుంగ రావముతోడ
కవుల గానము శ్రుతిగలయునాఁడు,
పెన్నానదీ సముత్పన్న కైరవదళ
శ్రేణిలో తెమ్మ వాసించునాఁడు,
కృష్ణాతరంగ నిర్ణిద్రగానముతోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాఁడు;

అక్షరజ్ఞాన మెఱుఁగదో యాంధ్రజాతి,
విమలకృష్ణానదీసైకతములయందు
కోకిలవుబాట పిచ్చుక గూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమానిశలయందు!

-విశ్వనాథ

# జీవనాధారాలు మన నదులు

నీలంరాజు మురళీధర్

ఎక్కడో పుట్టి, కొండలూ, కోనలూ, అరణ్యాల మధ్యగా ప్రవహించి, వివిధ జాతుల వారినీ, వివిధ భాషల వారిని పోషిస్తూ, అలరిస్తూ, చివరకు స్వస్వరూపాన్ని పూర్తిగా కోల్పోయి, ఆనందంగా అనంత సముద్రంలో కలిసి పోతాయి జీవ నదులు.

అన్ని ఋతువులలోనూ ప్రవహించేదే జీవ నది. మనదేశంలో ఈ కోవకు చెందిన పన్నెండు నదులు వుండగా, అందులో మూడు-గోదావరి, కృష్ణ, తుంగభద్ర-మన రాష్ట్రంలోనే ప్రవహించడం తెలుగువారి అదృష్టం.

భారతీయ సంస్కృతీ, సంప్రదాయా లపై నమ్మకం వున్నవారు, భగవంతుని దయవల్లనే వర్షాలు కురుస్తున్నాయని నమ్ముతారు. ఆ వర్షాపాతమే నదులుగా ప్రవహించి, ప్రజానీకానికి పంటల ద్వారా ఐహికఫలాన్ని అందిస్తున్నవని చెబుతాయి మన పురాణాలు.

అంతకన్నా మిన్నగా, జీవనదులు ప్రజానీకానికి ప్రసాదించే ఆముష్మిక ఫలాన్ని గురించి కూడా అత్యద్భుతంగా వివరిస్తాయి పురాణాలు.

నదులలో స్నానం చేసి, పితృదేవతలకు తర్పణాలు అర్పిస్తే, పవిత్రత, పుణ్యం రెండూ లభిస్తాయని మన నమ్మకం.

శ్రద్ధ కర్మలప్పుడు, పిండాలు నదుల లో కలిపితే, పితృదేవతలు తృప్తి చెందుతారనీ, పుష్కర సమయాలలో నదులలో స్నానమాచరిస్తే విశేషమైన పుణ్యం వస్తుందని కూడా నమ్ముతాము.

ఎన్నిపాపాలు చేసినా, ఒక్కసారి గంగ లో స్నానం చేస్తే, నిప్పులో పడిన దూదిలాగా అన్ని పాతకాలు హరిస్తాయనీ, ఆ నదిలో పుట్టికి కూడా పాపాన్ని హరించగల శక్తి వుందనీ, "గంగా, గంగా" అని ఉచ్చరిస్తూ, ఇతర నదులలో స్నానం చేసినా, గంగా నామ స్మరణ మాత్రాన్నే సకల పాపాలు పోతాయని ఘోషిస్తున్నాయి మన పురాణాలు.

చరాచర జీవులన్నిటికీ నీరే ఆధారం.(Water is life) సహజ సంపదలలో ఈనాడు నీరే ముఖ్యం. ఆ నీరు మనరాష్ట్రానికి పుష్కలంగా వున్నందువల్లనే ఆంధ్రప్రదేశ్ నదీ రాష్ట్రమని, (River State), నదులు ప్రసాదించే నీటిలో మన రైతులు ధాన్యరాసులు పండిస్తున్నారు కాబట్టి మన రాష్ట్రానికి అక్షయ పాత్ర (Rice Bowl) అని పేరు వచ్చింది.

గోదావరినది మహారాష్ట్రలో అరేబియా సముద్రానికి 50 మైళ్ల దూరంలో పుట్టినా, ఆంధ్రులపై వున్న అవ్యాజ ప్రేమవల్ల కాబోలు-900 మైళ్లు తూర్పు దిక్కుగా పయనించి, ఆంధ్రప్రదేశ్‌ను పునీతం చేసి, బంగాళాఖాతంలో కనుమరుగు అవుతున్నది. కాని, దగ్గిరగా వుంది కదా అని, అరేబియా సముద్రంలోకి పారడం లేదు.

దక్షిణా పథంలో 'గౌతమిగంగ' గా ప్రసిద్ధి చెందిన గోదావరి మహారాష్ట్రలోని సహ్యాద్రి పర్వత శ్రేణిలో నాసిక్ మండలంలోని త్ర్యంబకంలో పుట్టి, నాసిక్ పక్కగుండా ప్రవహించి, శాతవాహనుల రాజధానియైన పైఠాన్ (ప్రతిష్ఠానపురం) ను చుట్టి, ఆంధ్రప్రదేశ్‌లోని నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలకు దక్షిణదిశగా ప్రవహించి, వరంగల్, ఖమ్మం మండలాలకు తూర్పు దిక్కుగా పోయి, ఉభయ గోదావరి జిల్లాలకు మధ్యగా పయనించి, రాజమండ్రి దగ్గర ఏడుపాయలై, బంగాళాఖాతంలో కలుస్తున్నది. ఆ ఏడు పాయలూ సప్తర్షులైన కశ్యప, అత్రి, గౌతమ, భరద్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని, వశిష్ఠుల పేర్లతో వుండడం మరొక విశేషం. రామాయణంలోను, భారతంలోను గోదావరి ప్రసక్తి వున్నదికాని, ఎందువల్లనో రామాయణంలో కృష్ణానది పేర్కొనబడ లేదు.

భారతంలోని ఆదిపర్వంలో అర్జునుడి తీర్థయాత్రను వర్ణించేటప్పుడు నన్నయభట్టు గోదావరిని 'దక్షిణగంగ' గా పేర్కొన్నాడు. చూడబోతే, ఆ రోజులలో గోదావరిని గంగగా వ్యవహారంలో చెప్పుకునేవారేమో! బమ్మెర పోతన భాగవత రచన ప్రారంభం చేస్తూ ఇలా అన్నాడు.

"మరియు, మదీయ పూర్వజన్మ సహస్ర సంచిత తపః ఫలంబున శ్రీ మన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుండనై, ఒక్క రాకా నిశాకాలంబున ,సోమోపరాగంబు రాకం గని, సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగయగు గంగకుం జని, గ్రుంకులిడి, వెడలి, మహనీయ మంజుల పులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచు, కించి దున్మీలిత లోచనుండనై యున్న యెడ........."

పోతే, గోదావరి ఉద్భవించిన నాసిక్ ప్రాంతం, త్ర్యంబకేశ్వరంగా ప్రసిద్ధి పొంది, దేశంలోని ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రాలలో ఒకటిగా వాసికెక్కింది. తన మార్గమధ్యంలో గోదావరి నది, మంజీర, ప్రాణహిత, వరద, ఇంద్రావతి, శబరి వగైరా ఉపనదులకు ఆతిథ్యమిచ్చి, ఆ భాగ్యాన్ని అందరికీ పంచిన తరువాతనే సాగరగర్భంలో అదృశ్యమవుతున్నది.

గోదావరి తరువాత, ఆంధ్రప్రదేశ్‌లో ప్రవహించే గొప్పదీ, పెద్దదీ

అయిన కృష్ణానది కూడా మహారాష్ట్రలోని పశ్చిమ కనుమలలో మహాబలేశ్వర్ వద్ద ఆవిర్భవించి, కర్ణాటక మీదుగా మన రాష్ట్రానికి వచ్చి, బంగాళాఖాతంలో రూపాంతరం పొందుతున్నది. మొత్తం 800 మైళ్లు పారే కృష్ణ వేణీ నది, మన రాష్ట్రంలో 280 మైళ్లు పయనిస్తున్నది. ఇందులో కలిసే ముఖ్యమైన ఉపనదులు భీమ (భీమరథి), తుంగభద్రలు.

ప్రాచీన సాహిత్యంలో కృష్ణవేణ్యా అని పిలువబడే కృష్ణమ్మ, సహ్యాద్రి పర్వతపంక్తిలో, కృష్ణ, వేణి, కకుద్మతి, సావిత్రి, గాయత్రి, అని ఉద్భవించే పంచ నదుల కలయిక.

కృష్ణ పుట్టిన కొండప్రక్క మహాదేవుని దేవాలయం వుంది. ఈ దేవాలయంలో ఒక చెలువు వుంది. ఆ చెలువులో నుంచి సదా పారుతున్న పరిశుద్ధమైన జలమే కృష్ణానది జన్మస్థానం. అక్కడి ప్రజలు దానిని 'కృష్ణా బాయి' అని పిలుస్తారు.

అక్కడి నుంచి సతారా జిల్లాలో దాదాపు 140 మైళ్ళు ప్రవహించిన తరువాత వెణ్ణానదితో కలిసి, మరికొంత దూరం పారిన తరువాత, ఘటప్రభ, మాలప్రభ ఉపనదులను కూడా తోడు తీసుకొని, ఆ తర్వాత భీమనదిని వెంట బెట్టుకొని, ఇంకా, ఇంకా ప్రయాణం చేసి, సంగం దగ్గర తుంగభద్రతో కలుస్తున్నది. కృష్ణానది ఉపనదులలో భీమానది తర్వాత, తుంగభద్రే పెద్దది. అక్కడి నుంచి కృష్ణానది నల్లమల అడవుల ద్వారా శ్రీశైలం మీదుగా పయనిస్తున్నది. తెలంగాణా ప్రాంతం నుండి పారే దిండి, పెద్దవాగు, మూసి ఉపనదులు కూడా కలుపుకొంటున్నది. మూసీ తీరాన్నే రాష్ట్ర రాజధాని హైదరాబాద్ వుంది.

కర్నూలు జిల్లా నల్లమల అరణ్యాలలో పుట్టిన భవనాశి అనే ఉపనది కూడా, సిద్ధాపురం, ఆత్మకూరు, పెంటకోట, జూటూరు గ్రామాలకుండా ప్రవహించి సంగమేశ్వరం వద్ద కృష్ణవేణితో కలుస్తున్నది. అంటే ఆంధ్రప్రదేశ్ ఉత్తరంలో వున్న తెలంగాణాన్ని, దక్షిణంలో వున్న రాయలసీమను, మధ్యలో వున్న కోస్తా జిల్లా లను తన జలాలతో అభిషేకం చేస్తున్నదన్న మాట.

భారీ ఎత్తున ప్రవహించే గోదావరి, కృష్ణవేణి నదుల తరువాత, పెన్న, తుంగభద్ర, వంశధారా నదులను మధ్య తరహా నదులుగా పేర్కొనవచ్చు. ఇవిగాక, చామల్దా, శారదా, గుండ్లకమ్మ, పాలేరు, స్వర్ణముఖిలాంటి చిన్న తరహా నదులు 30కి పైగా వున్నై.

తుంగ, భద్ర కలిసినదే తుంగభద్ర. రెండు నదులూ కర్ణాటకలోని వరాహ పర్వతాలలో పుట్టినవే. తుంగానది శృంగేరి వైపుగా పారి, కూడలి దగ్గిర భద్రతో కలుస్తున్నది.

పెన్నానది ప్రాచీన నామం 'ఉత్తర పినాకిని'. కర్ణాటక రాష్ట్రంలోని కోలార్ జిల్లాలో చెన్నకేశవ పర్వతాలలో పుట్టి, 48 కిలోమీటర్లు కోలార్, టుమ్‌కూరు జిల్లాలలో ప్రవహించి, తరువాత అనంతపురం జిల్లాలోని హిందూపూర్ లో ప్రవేశిస్తున్నది. అయితే, 128 కిలో మీటర్లు ప్రవహించిన తరువాత పెన్న తిరిగి కర్ణాటకలోని పావగడ తాలూకాలో ప్రవేశించి, ఆ తరువాత మళ్లీ అనంతపురం జిల్లాలోని కళ్యాణ దుర్గ తాలూకాలో ప్రవేశిస్తున్నది.

కర్ణాటకలోని బెంగుళూరు, కోలారు, టుమ్‌కూరు జిల్లాలోను, ఆంధ్రప్రదేశ్ లోని అనంతపురం, చిత్తూరు, కడప, నెల్లూరుజిల్లా లోను, మొత్తం 600 కిలో మీటర్లు ప్రవహించిన తరువాత గాని, బంగాళాఖాతంలో కలవడం లేదు పెన్నానది.

ఆంధ్రప్రదేశ్ లోని దివ్యక్షేత్రాలు అనేకం కొండలపైనో, అడవుల మధ్యలోనో వున్నాయి. ఇవిగాక నదీ తీరాల్లో కూడా అనేక దివ్యక్షేత్రాలు వున్నవి.

గోదావరీతీర పుణ్య స్థలాలలో భద్రాచలం ప్రముఖమైంది. పర్ణశాల, పట్టిసాల, కోటిపల్లి మొదలైన అనేక క్షేత్రాలు కూడా, గోదావరీ తీరాన్న వెలసివున్నై. మనరాష్ట్రంలో ప్రసిద్ధిగాంచిన పంచారామ క్షేత్రాలలో, నాలుగు క్షేత్రాలు గోదావరీ తీరాన్నే వున్నవి. దక్షిణ కాశి అని పేరు గాంచిన ద్రాక్షారామమే కాక, కుమారారామం (సామర్లకోట), క్షీరారామం (పాలకొల్లు) సోమారామం (గునుపూడి, భీమవరం) గోదావరి గట్టున వుండగా, ఒక్క అమరారామం (అమరావతి) మాత్రమే కృష్ణానది తీరాన్న వున్నది.

ఇక కృష్ణానదీ తీరాన శ్రీశైలం మల్లికార్జునస్వామి, విజయవాడ కనకదుర్గ కాక, వేదాద్రి, అమరావతి, మోపిదేవి వగైరాలు కూడా పేరుగాంచిన క్షేత్రాలే. ఉత్తర శ్రీరంగంగా ప్రసిద్ధి కెక్కిన శ్రీరంగనాయకులు (నెల్లూరు), పుష్పగిరి ఆలయ సముదాయం కూడా పెన్నా నది తీరాన్న వున్నవి.

ఈ విధంగా అశేష తెలుగు ప్రజల వైహికాముష్మిక జీవనానికి పట్టుగొమ్మలుగా వున్న నదీమ తల్లులు–మనకు మరొక గొప్ప సందేశాన్ని ఇస్తున్నవి.

గోదావరి, కృష్ణానదులే కాక, ప్రతి భారతీయుడు, ప్రతి నిత్యమూ దేశంలోని ఇతర పవిత్ర నదులను స్మరించాలన్నదే ఆ సందేశ సారం.

**"గంగే చ యమునే కృష్ణే గోదావరి సరస్వతి! నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధం కురు!అనే శ్లోకాన్ని పఠించాలి.**

జాతీయ సమైక్యతా భావం ప్రజల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోవడానికి ఇంతకు మించిన మంత్రం లేదని వేరుగా చెప్పనక్కరలేదు.

● ● ●

# తెలుగు రైతు–నాడు, నేడు





అబ్బూరి రామారావు

మనిషి కేవలం తిండికోసమే జీవించడనేది వాస్తవమేగానీ తిండిలేకుండా జీవించే మానవ 'సంఘాన్ని' ఇప్పటి దాకా ఎవ్వరూ సృష్టించలేదని ప్రముఖ చరిత్రకారుడు డి.డి. కోశాంబి వ్యాఖ్యానించారు. ప్రత్యక్షరసత్యమైన ఆ వ్యాఖ్యకు మన చరిత్రలే అద్దాలు పడుతున్నాయి. అన్నం లేకపోతే నాగరికతా సంస్కృతులు, కళలు, సాహిత్యం, శాస్త్ర విజ్ఞానం ఏవీ ఉండేవి కావు. అందుకే అన్న దాత తర్వాతే ఎవరైనా ! మనిషి ఆహార సేకరణం నుంచి ఆహారోత్పత్తి చేసే దశకు చేరుకోవడానికి వేన వేల సంవత్సరాలు పట్టింది. ఆహార సేకరణమనేది చరిత్రకు ముందు దశ. చరిత్ర తొలిదశలో రైతుల జీవితం గురించి తెలుసుకోవడానికి జాతక కథలు ఎంతగానో ఉపయోగపడతాయి. వాటి ఆధారంగా చెప్పాలంటే - ఆనాడు, రాజులు పన్నులు, జరిమానాలు, హింసలతో జనాన్ని పీడించుకు తినేవారు. పన్నులు వసూలు చేసే రాజోద్యోగులు రైతుల కష్టార్జితాన్ని దోచుకుతినే దొంగలుగానే ఉండేవారు. భూమి పన్ను చెల్లించలేని రైతులు కుటుంబాలతో సహా పల్లెల్ని వదలి పారిపోయేవారని, చివరికి పాలకుల పీడనకు వ్యతిరేకంగా ప్రజలు తిరుగుబాట్లు చేసిన కథలు మనకు జానపద గాథల్లో అనేకం కనిపిస్తాయి. నాగేటి వ్యవసాయంతో శాతవాహన శకంలో ఆరంభమైన వ్యవసాయిక వ్యవస్థ సుమారు 600 సంవత్సరాలనాటికి స్పష్టమైన ఫ్యూడల్ రూపం ధరించింది. కాకతీయుల కాలంలో తెలుగు రైతులు బహుముఖ



అష్టదిష్టంగా వరినాట్లు వేస్తున్న కూలీలు – ఆధునిక పద్ధతిలో యంత్ర సహాయంతో వరినాట్లు

వృద్ధి సాధించారు. కాకతీయులు తవ్వించిన అనేకానేక చెరువుల ఫలితాలు అంటూ నేటికీ తెలంగాణాలో రైతులు బల్లగా ఉంటున్నారు. నైజాం నవాబుల కాలంలో జాగిర్దారీ విధానం రైతుల్ని పీల్చి పిప్పిచేసింది. జాగీర్దార్లు, దేశ్‌ముఖ్‌లు వేలాది ఎకరాలు సొంతం చేసుకొన్నారు. దొరలుగా చలామణి అయిన వీళ్ళు భూస్వామి, వడ్డీవ్యాపారి, షావుకారు, గ్రామాధికారి వంటి బహుపాత్రధారులై జనాన్ని పట్టి పీడించారు. సర్కారు జిల్లాల్లో పరిస్థితి వేరుగానే ఉండేది. జమీందారీ వ్యవస్థ కొన్ని ప్రాంతాల్లో రైతులకు కష్టాలను సృష్టించినా, ఇతర ప్రాంతాల్లో మాత్రం రైతాంగం పరిస్థితి మెరుగ్గా ఉండేది. కోస్తా జిల్లాల్లోని డెల్టా భూములు వ్యవసాయ యోగ్యమైన స్థాయికి ఎదగటానికి చాలా శతాబ్దాలు పట్టింది. 19వ శతాబ్దంలో కృష్ణా గోదావరుల మీద బ్రిటిష్ పాలకులు ఆనకట్టలు కట్టాక, డెల్టా ప్రాంతంలో వ్యవసాయం అనూహ్యమైన ఊపుని పుంజుకొని, అభివృద్ధి సాధించింది. ఇదంతా చరిత్ర దృక్పథంగా సాగిన విహంగ వీక్షణం.

## స్వతంత్ర జీవనం

సామాజికంగా చూస్తే, రైతుకు ఎన్ని కష్టాలు, పీడనలు ఉన్నా, అతను స్వతంత్ర జీవనమే సాగించేవాడు. తనకు తోచిన విధంగా వివిధ పద్ధతులు ఆచరించి పంటకు రక్షణ కలిగించేవాడు. మేలైన విత్తనాల్ని ఎంచుకోవటం, భూసారానికి సేంద్రియ ఎరువులు వాడటం, వేప చెక్క, ఆముదం చెక్కలు వేయటం, పీడలు నివారణకు [illegible] కషాయాలు చల్లటం చేసేవాడు. ధాన్యం నిల్వకు బూడిద, వేపాకులు, ఎర్రమట్టి వంటివి కలిపి పురుగు పట్టకుండా శ్రద్ధ వహించేవాడు. కుటుంబానికి తగినంత పండిస్తే చాలునేది ప్రాథమిక ధోరణిగా ఉండేది. వ్యాపారాత్మక గుణాలేవీ కానవచ్చేవి కావు. ఇది కూడా గతకాలం కథే!

## ఇటీవలి పరిణామాలు

గ్రామీణ రైతాంగం చరిత్రను మరీ లోతుగా, ప్రాచీనకాలం నుంచి కాకుండా ఇటీవలి గతాన్ని పరిశీలించటం ఈ వ్యాసం ప్రధానోద్దేశం. గత శతాబ్దకాలంలో చూస్తే మనకు స్వాతంత్ర్యపూర్వదశ, స్వాతంత్ర్యానంతర దశ అని రెండు స్పష్టమైన కాలాలు గతమైన విభాగాలు కానవస్తాయి. స్వాతంత్ర్యానంతర దశనూ మనం మూడు భాగాలుగా పరిశీలించవచ్చు. 1947 నుంచి 1955 వరకు, 1955 నుంచి 1960 వరకు, ఆ తర్వాత కాలాన్ని వేర్వేరుగా పరిశీలిస్తే వ్యత్యాసాలు స్పష్టమవుతాయి.

## అభివృద్ధికి శ్రీకారం

మన దేశంలో వ్యవసాయానికి ప్రత్యేకంగా ఒక కేంద్రమంత్రిత్వశాఖ అంటూ ఏర్పడింది 1871లోనే! 1882 తర్వాత ఆనాటి వివిధ ప్రదేశాల్లో, ప్రాంతాల్లో వ్యవసాయ శాఖలు ఏర్పడటం జరిగింది. నిజానికి అంతవరకు గ్రామీణ స్థాయిలో గానీ, రైతుల పరంగా గానీ సాగిన అభివృద్ధి నామమాత్రమే. వ్యవసాయం పట్ల పాలకులకు ఏ శ్రద్ధా ఉండేదికాదు. ఫలితంగా వ్యవసాయరంగం నిర్లక్ష్యానికి గురయింది. గ్రామాల్లో పెద్ద రైతులు, మధ్య తరగతి రైతులు అధికంగా ఉండేవారు. పశువుల పెంపకం, పంటల సాగు వారి చేతిలోనే ఉండేది. దిగుబడులు స్వల్పంగా, ఖర్చులు అధికంగా ఉండేవి. మార్కెట్ సదుపాయాలు, రవాణా సదుపాయాలు బొత్తిగా శూన్యం. పంటలకు నీటి వనరులు తక్కువైన. వర్షాధారంపైన,



పాత పద్ధతిలో వరి కోత – యంత్ర సహాయంతో వరికోత

వెరువుం పైన ఆధారపడి పంటలు పండించేవారు. పశువుల్లో హెచ్చుగా పాలిచ్చే ఆవులే ఉండేవి. గేదెలు బహుతక్కువ. సంకరజాతి పశువులు లేవు. ఆవులను అధికంగా కోడెదూడల ఉత్పత్తికి పెంచే అలవాటు ఉండేది. గేదెలను పాడికి పెంచేవారు. గడ్డిభూములు పుష్కలంగా ఉండేవి. అయితే–వ్యవసాయాభివృద్ధి జరగనిదే దేశాభివృద్ధి లేదని గ్రహించిన పాలకులు 1905లో 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసెర్చ్' పేరుతో బీహార్‌లోని పూసా నగరంలో ఒక వ్యవసాయ పరిశోధన సంస్థను ఏర్పాటు చేశారు. ఈ సంస్థ సాధించిన ఘన విజయాలు అధికంగానే ఉన్నా, అక్షరాస్యత తగినంత లేని రైతులకు [illegible] అల్పంగానే ఉండేవి. రైతులకు లభించేది, లాభించేది స్వల్పంగానే ఉండేది. మార్గదర్శకులు తగినన్ని లేకుండా ఉత్పాదక పెంపుదల రైతులకు తోడ్పాటు కరువులు, కాటకాలు రైతులను బాధించేవి. ఇవన్నీ గుర్తించిన భారత ప్రభుత్వం 1929లో 'ఇంపీరియల్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసెర్చ్' (ఇదే ఇప్పుడు 'ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసెర్చ్'గా అయింది) ను ఏర్పాటు చేసింది. దీనితో వ్యవసాయరంగ సమగ్రాభివృద్ధికి పునాది పడిందనుకోవచ్చు.

## కొంతలో కొంత మెరుగు

స్వాతంత్ర్యానంతరంనుంచి రైతుల పరిస్థితి కొద్దిగా మెరుగుపడటం ఆరంభమయింది. అంతక్రితం దుక్కిదున్నేందుకు, దమ్ము చేసేందుకు, కుప్పనూర్చేందుకు మానవ శక్తి మీదే రైతులు ఆధారపడుతూ వచ్చేవారు. నీటి వసరులు తగినంత లేని కారణంగా రైతులు బావులు తవ్వుకొని, మోటలు, ఏతాములు వంటి వాటి మీదనే ఆధారపడే వారు. రైతులకు మంచి విత్తనాలు లభించేవి కావు. 1952లో భారత ప్రభుత్వం అధికాహారోత్పత్తి సాధనకై 'గ్రో–మోర్ ఫుడ్ కమిటీ'ని ఏర్పాటు చేసింది. గ్రామ రైతుల జీవితంలో అభివృద్ధి ఉంటేనే తప్ప అధికాహారోత్పత్తి సాధ్యం కాదని ఆ కమిటీ స్పష్టం చేసింది. దీనికి 'బ్లాక్'ల ఏర్పాటు అవసరమని సూచించింది. విలేజ్ లెవెల్ వర్కర్లను ప్రతి అయిదు, పది గ్రామాలకు ఒకరి చొప్పున నియమించాలని సిఫార్సు చేసింది. దీని తర్వాత 1953లో 'నేషనల్ ఎక్స్‌టెన్షన్ సర్వీసెస్' పేరు మీదుగా రైతులకు శిక్షణాకార్యక్రమాలు ఇచ్చే చర్యలు చేపట్టారు. ఇవన్నీ రైతుల పరిస్థితి బాగుపడేందుకు తోడ్పడుతూ వచ్చాయి. ఎక్స్‌టెన్షన్ సర్వీస్ కార్యక్రమాల్లో భాగంగా కొత్త వంగడాలు, పరికరాలు, యంత్రాలు, క్రిమికీటక నాశనాలు వంటి వాటి గురించి వివరించటంతోబాటు, పాడి పశువుల పెంపకం, కోళ్ల పెంపకం వంటి వాటి గురించి తెలియజెప్పటం, తద్వారా వారి ఆర్థిక, సాంఘిక జీవన ప్రమాణాలను మెరుగుపర్చటం లక్ష్యంగా పెట్టుకొన్నారు. 1955 తర్వాత దేశంలో పంచాయితీ రాజ్ వ్యవస్థపై ప్రభుత్వం దృష్టి నిలిపింది. 1958లో తీసుకొన్న నిర్ణయంప్రకారం పంచాయితీ సమితి, జిల్లా పరిషత్తులు ఏర్పడ్డాయి. పరిశోధనపరంగా, పాలనా పరంగా తీసుకొన్న ఈ చర్యలు రైతాంగ జీవనంలో ఎంతో నాణ్యత తెచ్చాయి. తర్వాత దేశంలో వ్యవసాయ విశ్వవిద్యాలయాల ఏర్పాటుకు శ్రీకారం చుట్టారు. రైతుల సమగ్రాభివృద్ధి పేరిట పలు చట్టాలు చేశారు. భూసంస్కరణలు అమలు చేశారు.



నాగటి చాలులో విత్తనాలు వేసే పాత పద్ధతి – ఒకేసారి ఎనిమిది సాళ్ళలో విత్తనాలు ఎరువులు వేసే ఆధునిక పరికరం

## కష్టాలూ...కడగండ్లూ...

పెరుగుతున్న ఫలితంగా నేడు రైతుల స్థితి బహుళ చిత్రంగా ఉంటోంది–పొలాల విస్తీర్ణం బాగా తగ్గింది. అయిదు ఎకరాలకు మించి పొలా లున్న రైతులు సంఖ్య బాగా తగ్గింది. పెత్తందారులు, భూస్వాములు తగ్గి పోయారు. ఉన్న వారిలో అధిక సంఖ్యాక రైతులు తమ పొలం పుట్రలను అమ్ము కొని నగరాలకు తరలి వెళ్లి పోతున్నారు. ఆధునాతన, విలాసవంత జీవనం మీద మోజు పెరగటం ఒక కారణమయితే గ్రామీణ ప్రాంతాల్లో విద్య వైద్య సదుపాయాలు తగినంత లేకపోవటం మరో కారణం. భూసంస్కరణల కారణంగా పొలాల మీద ఆసక్తి తగ్గిన వారూ ఉన్నారు. ఫలితంగా చిన్న, సన్నకారు రైతుల సంఖ్య బహుళమయింది. భూమి లేని వారు కూడ చిన్న చిన్న కమతాలను కౌలుకు తీసుకొని సాగుచేయటం మొదలు పెట్టారు. నీటి వనరులు–ముఖ్యంగా కాలువకింద సాగు అధికమయింది. చెరువులను నిర్లక్ష్యం చేయటం, ఆక్రమించటం ఎక్కువ యింది. యంత్రపరికరాలు ముఖ్యంగా ట్రాక్టర్ల వాడకం పెరిగింది. దుమ్ము చేసేందుకు, దుక్కి దున్నేందుకు, కోతకోసి కుప్ప నూర్చేందుకు యాంత్రాలు లభిస్తున్నాయి. కొత్తరకం వంగడాల రూపకల్పనతో దిగుబడులు పెరిగాయి. రసాయన ఎరువుల వాడకం కారణంగా పెరిగిన క్రిమికీటకాల నాశనం కోసం క్రిమి సంహారిక మందుల వాడకమూ విస్తృతమయింది. సేంద్రియ ఎరువులు, జీవన ఎరువుల వాడకాన్ని రైతు దాదాపు మర్చి పోయే స్థితి వచ్చేసింది. ఇదంతా నాణానికి ఒక వైపు అయితే, మరోవంక రైతులు పడే బాధలూ పెరిగాయి. వర్షాలు సకాలంలో పడనికారణంగానో, అతివృష్టి అనావృష్టి కారణంగానో రైతులు పంటలు చేతికి వచ్చేంత వరకు నిశ్చింతగా ఉండలేక పోతున్నారు. వేలు, లక్షలు రుణాలు తెచ్చి పొలాల్లో పోసి, గింజల్ని ఏరుకొనే స్థితి వస్తుందన్న భయం పెరుగుతోంది. రుణభారం అధికమై చివరికి ప్రాణ త్యాగం చేసుకొనే దుస్థితినీ మన పత్తి రైతులు ఎదుర్కోవాల్సి వచ్చింది. అధిక పంట చేతికి వచ్చినా, ధర లభిస్తుందో లేదో తెలీదు. దళారులకు అమ్మి, దొరికింది పొందటం తప్ప మరోగతి లేని స్థితి రైతుకు ఎదురవుతోంది. అరకొర మార్కెటింగ్ సదుపాయాల మీద ఆధార పడకుండా రైతు అవస్థల పెంపొందించుకోవాలి.

## రైతు ఎన్నడూ ఆశాజీవే!

దేశంలో–ముఖ్యంగా నగరాల్లో ప్రజలను చూస్తే వారి జీవన ప్రమాణాలను పరిశీలిస్తే రైతన్నకు ఆగ్రహం కలిగే స్థితి ఉంది. నేటికీ 'అన్నదాత'గా మిగిలిన రైతు జీవిత ప్రమాణం ఇతర వర్గాలతో పోలిస్తే చాలా తక్కువగా ఉంటోంది. 'ఏటికేత మెత్తి ఎయిపుట్లు పండించి ఎన్నడూ మెతుకెరగనన్నా" అన్న నాటి రైతు ఆక్రందన నేటికీ దాదాపు అలాగే ఉండటం విషాదమైన వాస్తవం. ఆహా రోత్పత్తి రంగంలో హరితవిప్లవము' గొప్ప మార్పు తెచ్చినా, రైతు జీవితం మాత్రం ఏమంత మెరుగుపడలేదు. నిత్యదుర్భిక్ష ప్రాంతాలయిన రాయలసీమ, తెలంగాణా లలో తెలుగుగంగ, శ్రీశైలం కుడిగట్టు కాలువ, ఎడుమగట్టు కాల్వ, జూరాలవంటి ప్రాజెక్టులనిర్మాణం పూర్తయితే రైతన్నల జీవన స్వరూపం మారిపోగల అవకాశాలు కనిపిస్తున్నాయి. దేశ ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక అయిన అన్నదాత రైతన్న శ్రేయస్సుతోటే దేశకళ్యాణం ముడిపడి ఉందన్న విషయం అందరూ గ్రహిస్తేనే–రైతన్న జీవితం 'నిత్యకళ్యాణం–పచ్చతోరణం' అవుతోంది.

# మన జానపద సాహిత్యం

ప్రొ. [illegible] రామరాజు

పురములు నగరములు నీవృత్తులు జనపదములు అని మన ప్రాచీన జనావాసాలకు పేర్లు. జనపదములంటే పల్లెటూళ్ళు. జనపదాల్లో ఉండే వారు జానపదులు. వాళ్ళ విజ్ఞానం జానపదవిజ్ఞానం. Folklore అనే పాశ్చాత్యుల మాటకు జానపద విజ్ఞానం సమానంగా వాడుకుంటున్నాము. ఈ జానపదవిజ్ఞానం నాలుగు చందాలు.

**1. మౌఖిక సారస్వతం (Oral Literature) :** ముఖోద్గతంగా వెలువడే మాట పాట పలుకు దీనిలో చేరుతాయి. తీరుతీరు పాటలు, వచన రూపంగా ఉండే కథలు, సామెతలు, పొడుపులు, మారుమూల పదాలు, మాండలికాలు యాసలు, నుడికారాలు, తిట్లు, ఒట్లు, కూనిరాగాలు, గొణుగులు, ఆశ్చర్యార్థకాలు, సంబోధనలు, మెచ్చుకోళ్ళు, పిలుపులు మచ్చికకూతలు, అరుపులు, కేకలు, ఉచ్చాటనలు, శోకాలాపాలు మొదలైనవన్నీ జానపదుల మౌఖిక సారస్వతానికి చెందినవే.

**2. భౌతిక సంస్కృతి (Material Culture) :** భౌతిక జీవితానికి సంబంధించిన వృత్తులు, పనులు, కుటీర పరిశ్రమలకు సంబంధించిన నేర్పు, పాక కళ, నిర్మాణ వాస్తు విజ్ఞానం, నేత, అల్లిక, సూచీకర్మ, వ్యవసాయ పద్ధతులు, పశు పక్షి పాలనాదులు, ఉపకరణాలు వస్తు వాహనాలు పాత్రలు చేసే నేర్పు, వేష భూషణాలు అలంకరణాలు, తెరపటాలు, ముగ్గులు, పచ్చ బొట్లు, మాలాకార విద్య, జలచర భూచర ఖేచరముల వేట వంటివన్నీ భౌతికసంస్కృతికి చెందినవే.

**3. జానపద సాంఘికాచారం (Social Folk Custom) :** మౌఖిక సారస్వతానికీ భౌతిక సంస్కృతికీ మధ్యన ఇరుగుపొరుగులా పెరుచుకొన్న సాంప్రదాయిక ఉనికికి సంబంధించిన సమస్త ఆచారాలు దీని క్రిందికి వస్తాయి. పుట్టినది మొదలు గిట్టే వరకు జరిగే సమస్త కర్మలకు సంస్కారములకు సంబంధించిన తీరు తీరు ఆచారాలు, వేడుకలు వినోదాలు, ఆటలు, గీతనృత్తములు, పండుగలు పబ్బాలు తిరునాళ్ళు పరసలు, ప్రభలు, సిరులు, బోనాలు, వీరాచారాలు, బలులు, సూతకపు లాచారాలు, సమాధులు, తిరుపళ్లెలు, కొత్త పెట్టడం, మంత్ర తంత్రాలు, మందులు మాయలు, ప్రయోగాలు, కట్టుబోతు విద్యలు, తాయెతులు రక్షలు దిగదుడుపులు, సంతర్పణలు సమారాధనలు దానధర్మాలు, పూజలు నైవేద్యాలు, శాంతిక పౌష్టిక క్రియలు, మొక్కుబడులు ఆరాధనా విశేషాలు కొలుపులు పూనకాలు, మూలికా వైద్యం బైరాగి చిట్కాలు, రాక్షస వైద్యం, తీర్థం విభూతి కుంకుమలు, మంత్రాక్షంతలు వంటివి ఇందులో చేరుతాయి.

**4. జానపద ప్రదర్శన కళలు (Performing Folk Arts) :** వైయక్తిక - బృంద నృత్త నృత్యాలు, గాత్ర వాద్య సంగీతాలు, యక్షగానాలు, వీధి భాగవతాలు, గొట్టల్ల భాగవతం, చిందు భాగవతం, కలాపాలు, కొరవంజులు, కోలాటాలు, భజనలు, పగటి వేషాలు, తోలు బొమ్మలాటలు, చెక్క - బట్ట బుట్ట బొమ్మలాటలు వాలకాలు, దొమ్మరాటలు, గారడి - కాటి పాసం విద్యలు, విప్ర వినోదులు, పులి వేషాలు, అర్ధనారీశ్వర దాదినమ్మ వేషాలు, గుఱ్ఱపు నృత్యాలు, కోతులాట, భంగిమలు, ముద్రలు, చిరుతలాట, జరటకోపులు, ఉరుము నృత్యాలు, గొరవయ్య నృత్యం, గరగ నృత్యం, తుపాకి రాముడు, లప్పెట గుండ్లు, గంగిరెద్దులాట మొదలైనవి జానపద ప్రదర్శన కళలు.

ఇంత విశాల జానపద విజ్ఞాన వారాశిలో చేరే జానపద వాఙ్మయం ఒక మహానది. అందులో చేరే ఒక ఉపనది జానపద సారస్వతం. జానపదుల ఆధ్యాత్మిక ఆధిభౌతిక భావ వ్యాప్తికి లక్ష్య భూతమైనదీ జానపద సారస్వతం. అందులో చేరే ఒక పిల్ల కాలువ జానపద సాహిత్యం. ఇందులో రసానందం, భావ సౌకుమార్యం భాషా సౌందర్యం ప్రధానాంశాలు. ఐతే సాహిత్య సారస్వత శబ్దాలు మన దేశంలో పర్యాయ పదాలుగా వాడుతున్నాము.

ఆంధ్ర దేశి సారస్వతాన్ని నిబద్ధ దేశి అని అనిబద్ధ దేశి అని రెండుగా విభజించవచ్చు. నిబద్ధ దేశి శిష్టులు రచించినది. అనిబద్ధ దేశి జానపదుల సామూహిక రచన. కనుక దీన్ని జానపద దేశి అనవచ్చు. జానపద దేశిని కూడ ఆటవిక దేశి, పామర దేశి, జాతి దేశి అని మూడుగా ఆయా జనుల సంస్కృతిని బట్టి విడదీయ వచ్చు. ఆటవికులకు గిరిజనులకు సంబంధించిన సారస్వతం ఆటవిక దేశి. చదువు సంధ్యలు రాని పల్లీయులకు సంబంధించినది పామర దేశి. అక్షరాస్యులైనా కాకున్నా అగ్ర వర్ణాల వారికి ప్రత్యేకంగా స్త్రీలకూ

సంస్కారవంతులకు సంబంధించినది జాతి దేశి. ఈ మూడింటి సమాహారాన్ని జానపద సాహిత్యమని విజ్ఞులంటున్నారు. కావలెనని పని కట్టుకొని ఉద్దేశపూర్వకంగా రచించే చదువరుల రచనలకంటె భిన్నమైనదీ జానపద సాహిత్యం.

అనుద్దేశపూర్వక సామూహిక కర్తృత్వం, నిర్ణీత రచనా కాల రాహిత్యం, సహజ శైలి, జనసామాన్య పరిచిత వస్తుకం, మౌఖిక ప్రచారం, భిన్న పాఠ ప్రచురకం వంటి ప్రధాన లక్షణాలతో పాటు కొన్ని ఉప లక్షణాలున్నదీ జానపద సాహిత్యం. తెలుగు భాష అవతరించిన కాలం దీని పుట్టిన దినం, తెలుగు నేల ఉన్నంత మేర దీని సంచారం; తెలుగు జనం ఉన్న చోటంతా దీని నివాసం. తొలకరి జల్లు నాటి పుడమి తల్లి పులకరింపుల గుబాళింపు, చెట్టుపై ఆరుమగ్గిన సీతాఫలం రుచి, మంచు ముత్యాల అలంకరించుకున్న పచ్చిక బయళ్ళ మెత్తదనం, శరత్కాలపు టెనుక తిన్నెల చలువ, సెలయేటి గలగలల గానం రంగరించి మాటల మూసలో పోస్తే జానపద సాహిత్యం ఔతుంది. దేవుడిచ్చిన గాలినీరు వెలుతురు వలె ఇది అందరి సొత్తు. ఒక జాతి చరిత్ర సమగ్రంగా తెలుసుకోవటానికి శిష్ట సాహిత్యం కంటె జానపద సాహిత్యమే ఎక్కువ తోడ్పడుతుందనే విషయం ఇటీవలి పరిశోధకు లంగీకరించటం చేత జానపద సాహిత్యం ఇప్పుడిప్పుడే ఆధునికుల ఆదరానికి నోచుకుంటున్నది. తెలుగు జాతి మనస్తత్వం, తెలుగు జాతి ఆర్థిక సామాజిక రాజకీయ మత పరిణామాలు, వీరుల ఉదంతాలు, పతివ్రతల గాథలు, అత్యాచారాలకు బలై పోయిన వారి చరిత్రలు, ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు, వినోదాలు, వేడుకలు విందులు, ఆటలు పాటలు, అన్యోన్యానురాగాలు, సంయోగ వియోగాలు, సౌందర్య సౌభాగ్యాలు, సుఖదుఃఖాలు, కన్నీటి గాథలు, అభ్యుదయ పతనాలు - ఈవిధంగా తెలుగువారి సమస్త జాతీయ జీవితం తెలుగు జానపద సాహిత్యంలో ప్రతిబింబిస్తుంది. భద్రపరచే వాళ్ళుంటే బండ్ల కెత్తదగినంత జానపద సాహిత్య సంపద మనకు దక్కి ఉండేది. కాని ఆ భాగ్యం మనకు లేదు. సి.పి.బ్రౌన్ జె.వి. బోయెల్ వంటి పాశ్చాత్యులు కండ్లు తెరిపించిన తరువాతనే మనం మేల్కొన్నాము. ఈ శతాబ్దం ప్రారంభం నుండే కొందరు దూరదృష్టి గల సహృదయులు జానపద సాహిత్యం సేకరించి భద్రపరచే ప్రయత్నాలు చేసినారు.

తెలుగు జాతి యెంత ప్రాచీనమో తెలుగు జానపద సాహిత్యం అంత ప్రాచీనం. కాని ఆ ప్రాచీన సాహిత్యమంతా మన ప్రాచీనులతోనే పోయింది. మనకు కూడా ప్రాచీన జానపద సాహిత్యం ఉండేది అనటానికి మన ప్రాచీన శాసనాలు, నన్నిచోడ పాల్కురికి వంటి వారి రచనలు సాక్ష్యాధారాలు. తరువాతి కాలం సాహిత్యం పోయింది పోగా మిగిలింది కాలాంతరాన రూపాంతరం పొంది కొంతైనా మనకు దక్కింది. తెలుగు జానపద సాహిత్యమనే కల్ప వృక్షానికి గేయ - వచన - రూపకములనే ప్రధాన శాకలున్నవి. ఒక్కొక్క శాఖకు కొమ్మలు రెమ్మలు పెక్కు. నాటికి చిలువలు పలువలు అనేకానేకం. మన జానపద సాహిత్యాన్ని ప్రక్రియ ఆధారంగా గేయం-వచనం రూపకములనీ, రసం ఆధారంగా శృంగార వీరాద్భుత కరుణ హాస్య సాహిత్యమనీ, వస్తువు ఆధారంగా పౌరానిక, చారిత్రక, మత, పారమార్థిక సాహిత్యమనీ, ఆలంబనం ఆధారంగా బాల స్త్రీ, శ్రామిక సాహిత్యమనీ తీరుతీరులుగా విభజించ వచ్చు.

ప్రక్రియ ఆధారంగా మన జానపద సాహిత్యాన్ని గేయ-వచన-రూపక శాఖలుగా విభజించుకున్నాము. గేయ శాఖలో కథా సహితములు కథారహితములని రెండు ఉపశాఖలు. కథా రహితములనే జానపద గేయాలని పల్లెపాటలని వ్యవహరిస్తున్నారు. వాటిలో రసము వస్తువు ఆలంబనములు ఆధారంగా శృంగార హాస్య కరుణ రస గేయాలు, పిల్లల పాటలు, స్త్రీల పాటలు, శ్రామికుల పాటలు, వేడుక పాటలు, పారమార్థికములు, ప్రకీర్ణములు అని తీరుతీరుల పాటలున్నవి. పిల్లల పాటలు కూడా రెండు విధాలు. పిల్లలను లాలించటానికి, నిద్ర పుచ్చటానికి పెద్దవాళ్ళు పాడేవి లాలిపాటలు జోలపాటలు. పిల్లలను ఆడించటానికి ఉగ్గు పెట్టటానికి నడిపించటానికీ ఉత్సాహం కల్పించటానికి కూడా పెద్దవాళ్ళు పాటలు పాడు తుంటారు. పిల్లల కోసం పెద్దలు పాడేవి ఒక తీరు పాటలు, పిల్లలే ఆటలప్పుడు గాని, పెద్ద వాళ్ళను అనుకరిస్తూ గాని ఎగతాళి చేస్తూ గాని పాడేవి రెండవ తీరు పాటలు. వేడుక పాటల్లో చాలా తీరులున్నవి. బ్రతుకమ్మ, బొడ్డెమ్మ, దీపావళి, సంక్రాంతి, దసరా, కాముని పున్నమ వంటి పండుగులప్పుడు పెండ్లి, సమర్త, శోభనం, శ్రీమంతం, పురుడు వంటి వేడుకలప్పుడు స్త్రీలు పురుషులు పాడే పాటలు ఈకోవలోనివే. ఒక్క పెండ్లి సందర్భంగా పాడే పాటల్లోనే ఎంతో వైవిధ్యం ఉన్నది! కొట్నాల పాటలు, నలుగు పాటలు, ముఖం కడుగు పాటలు, పతిభక్తి పాటలు, మిధున విధముల పాటలు, అవిరేణి పాటలు, తిలకం పాటలు, పసుపు, పాటలు, బూజం బంతి పాటలు, అలుక పాటలు, వసంతా లాట పాటలు, వరుస పాటలు అప్పగింత పాటలు వంటివి ఎన్నో తీరులు, గృహ జీవితానికి, సుఖదుఃఖాలకు, సంతానము, నోములు వ్రతాలు, పేరంట ములు, అన్న దమ్ములు, ఆడబిడ్డలు,

అత్తమామలు తల్లిదండ్రులు మొదలైన విషయాలకు సంబంధించినవన్నీ స్త్రీల పాటలే. స్త్రీలు పురుషులు శ్రమించేటపుడు కష్టం కనపడకుండా ఉండటానికి, ఉత్సాహం కలిగించటానికి పాడేవి శ్రామిక గేయాలు. ఇల్లలుకుతూ, పిండి విసురుతూ, ధాన్యం దంచుతూ చెరుగుతూ, కదురు కవ్వాలాడిస్తూ, పరినాటు, కలుపు విత్తులు చల్లుతూ, మోట తోలుతూ, ఏతమొత్తుతూ, ఏరువాక సాగుతూ, కళ్ళం తొక్కుతూ, బరువులు మోస్తూ, కావడి పాలకి మేనాలు మోస్తూ స్త్రీలు పురుషులు పాడేవన్నీ శ్రామిక గేయాలే. ఇంకా ఇతర కుటీర పరిశ్రముల వాళ్ళు చర్మకార సాలె కంసాలి [illegible] ఈడిగ మేదరి కమ్మరి వృత్తుల్లోను భారీ పరిశ్రముల్లో పెద్ద కర్మాగారాల్లో పనిచేసే కూలీలు శ్రమాపనోదనం కోసం తీరు తీరు పాటలు పాడుకుంటారు. శారీరక శ్రమ అధికంగా ఉండే పనులు చేస్తూ పాడే పాటల్లో 'సెక్స్' పాటలు అధికం. శ్రామిక గేయాలు తరుచుగా ఆయా వృత్తుల్లోని శ్రమకులయానుగుణంగా ఉంటవి. మోక్ష సాధనాలైన భక్తి కర్మ జ్ఞానములను బోధించేవి, శైవ వైష్ణవ వివిధ దేవతా స్తోత్రాలు, కీర్తనలు, మేలుకొల్పులు, భూపాళాలు, మంగళ హారతులు, తత్వాలు, కాలజ్ఞానాలు, తిరునామాలు, గాయక భిక్షుకుల జోలెలు నింపటంతో పాటు శ్రోతలకు నీతులు బోధించే వన్నీ పారమార్థిక గేయాలు. ఇక రసం ఆలంబనంగా శృంగార హాస్య కరుణాద్భుత గేయాలు కూడ చాలా తీరుల గేయాలున్నవి. జానపద గేయాలు వైశిష్యం. గుర్తించటానికై కొన్ని పాటలు ఉదహరిస్తాను.

కన్యకలు పాటలు పాడుతూ 'బిత్తి' తిరుగుతారు. ఇది ఆడపిల్లలకు మంచి వ్యాయామం. బిత్తి తిరుగుతూ పాడే పాటలు చాలా ఉన్నవి. పాఠాంతరాలతో ఉన్న రెండు బిత్తి పాటలు గమనించండి.

1. ఒప్పుల కుప్పా - వయ్యారి భామా
మినపా పప్పూ - మెంతీ పిండీ
తాటీ బెల్లం - తవ్వెడు (తపిసపి?) నెయ్యీ
గుప్పెడు దిండీ- కులుకూలాడే
నడుమూ గట్టీ - నామాటబట్టీ

2. ఒప్పుల కుప్పా - ఒయ్యారి భామా
సన్నా బియ్యం - చాయా పప్పూ
(మినపా పప్పూ - మెరికా బియ్యం)
పాలు నెయ్యీ - పాశం ముందూ
నీ మొగుడు దింటే - ఆనందముంటే

ఈ రెండు పాటలు జానపదులు ఆరోగ్య విజ్ఞానానికి ఉదాహరణములు మొదటి పాటలో స్త్రీలకూ రెండవ పాటలో పురుషులకూ వాజీకరణ యోగాలున్నాయని ఆయుర్వేద శతావధాని శ్రీమాన్ వేదాల తిరుమల రామానుజస్వామిగారు 6-5-1940 నాటి గోలకొండ పత్రికలో వివరణ వ్రాసినారు.

ఒక ప్రోషిత భర్తృక ఏరువాకతో తన బావ వస్తారని ఉప్పొంగి పోతూ పాడే బావసోకుమార్యం గల ఈ ఏరువాక పాట చిత్తగించండి.

"తొలకరీ ఒక మబ్బు తొంగి చూచింది - మబ్బులో ఒక మెరుపు మెరిసి పోయింది
పెరటిలో ఒక జల్లు కురిసి వెలిసింది - జల్లులో నా మనసు జారిపోంది
ఏ కొమ్మ మీదనో ఎండతాకిన పిట్ట - ఏటి తోవలు పట్టి ఎగిరిపోయింది
ఏరువాక నాటి కేడాది దాటింది - ఎదురు చూచిన గుండె చెదిరిపోయింది
పిట్టపిట్టా ముద్దు పెట్టుకున్నాయి - గోవులన్నీ ఇల్లు చేరుకున్నాయి.
ఏటి గాలికి చిలుక లెగిరి పోయినవి - ఎందుకో నా ఆశలిగిరి పోయినవి
ఏటి ఒడ్డున నేను పాటబాడే వేళ - నవ్వుతూ మా బావ పువ్వు తేరే వేళ
కొంటె కోయిల పైన కూత కూసేవేళ - లేత మనసులు విచ్చి పూత పూసేవేళ
బావొచ్చి నాతోటి బాసలాడాలె - ముద్దొచ్చి నాతోటి మురిపి పోవాలె
ఏరువాకమ్మ మాకెదురు రావాలె - తల వంచుమము చూచి దీవించి పోవాలె"

బావ రాకకోసం ఎదురు చూచే పడుచు తీయని కోరికలు లలిత పద బంధాలతో మధుర భావాలతో ఈ పాటలో రూపు కట్టుకున్నాయి.

ప్రజల్లో చైతన్యం వెల్లి విరిసి తిరుగుబాటు వచ్చే దాకా తెలంగాణంలో వెట్టి చాకిరీ ఉండేది. గ్రామాల్లో మాల మాదిగలు వెట్టి చాకిరికి బలియై పోయినారు. ఒకడెంత తప్పించుకో జూచినా తప్పింది కాదీ వెట్టి. అందుకై వదిన తన మరదిని ఈ పాటలో ఉపాలంభిస్తున్నది.

"తొవ్వొంట బొయెటోడ తెల్లబట్టలోడ
మందులు పెడ్తనంటివి నా మరిదికీ
మందులు పెడ్తనని మైలతుత్తుర బెడితె
మంటలు పోట్లాయె నా మరిదికీ
మంటలు పోట్లాయెనని మడుగుల పండబెడితె
నల్వాలు మించుకొచ్చె నా మరిదికీ
నల్వాంలొచ్చెనని పాయికాడ పండబెడితే
బొంత కాలిపోయె నా మరిదికీ
బొంత కాలెనని గొందొల్ల పండబెడితె
ఎలుకలు యెక్కిరించె నా మరిదినీ
ఎలుక లెక్కిరించెనని సావల్ల పండబెడితే
వెట్టి ముల్లెలు బెట్టిరి నా మరిదికీ
జానపద గేయ శాఖలో కథా సహిత

గేయాలు విశిష్టమైనవి. వీటినే గేయ గాధలంటారు. వీటిని ఛందస్సు శైలిని బట్టి జంగం పదాలని, శారద పదుపలని, తందాన పదాలనీ (బుఱ్ఱకథలు), నిడివిని బట్టి గాథా చక్రములని గాధలు గాధికలని, రసమును బట్టి శృంగార వీర కరుణాద్భుత బీభత్స భయానక గాధలని, వస్తువును బట్టి పురాణేతిహాస గాధలని, చారిత్రక రాజకీయ గాధలని, సామాజికార్ధిక గాధలని పుక్కిటి గాధలని విభజించవచ్చును. రామాయణ భారత భాగవత అష్టాదశ పురాణాల గాధలన్నీ పురాణేతి హాసగాధల క్రిందికి వస్తాయి. పలనాటి వీరుల కథలు, కాటమరాజు కథలు, కుమార రాముని కథ, దేశింగు రాజు కథ, బొబ్బిలి కథ, సర్వాయి పాపని కథ, సోమనాద్రి కథ, సదాశివారెడ్డి కథ, పెద్దాపురం కోడిపుంజుల కొట్లాట, పద్మనాభయుద్ధం కథ, వలూ వెంకట రెడ్డి, రాణీ శంకరమ్మ, కర్నూలు నవాబు కథలు రాజకీయ చారిత్రక గాధలు. ఆరెమరాటీలు, బంగారు తిమ్మరాజు, బల్లారి కొండ్రాయుని కథలు అస్పష్ట చారిత్రకాలు. అల్లూరి సీతారామరాజు, రేణికుంట రామిరెడ్డి, గొడ్డి కొమురయ్య యంకపల్లె యాదగిరి కథలు, స్వాతంత్ర్య సమర వీరుల గాథలు, సామాజిక ఆర్థిక గాధల్లో వైవిధ్యం ఎక్కువ, కనక, కామమ్మ, సన్యాసమ్మ, లక్ష్మమ్మ, మండపేట పాపమ్మ, ఎరుకమ్మ, తిరుపతమ్మ, సరోజిని, వీరమ్మ, నారాయణమ్మ, రంగమ్మ, చిన్నమ్మ, రాములమ్మ, [illegible]బంగాళ్ కథలు సాగుమానం చేసిన వారివో లేదా అత్యాచారాలకు గురైన వారివో విషాద గాధలు. కుంటిమల్లారెడ్డి, చిన్నపరెడ్డి, ధర్మపురం నరసింహుడు, దొరవారి నరసింహారెడ్డి కథలు సాహస గాధలు, బడేసాబు, మియాంసాబు, పండు సాయన్న, నక్కపల్లి రాముడు, దువ్వన్న దొర కథలు బందిపోట్ల గాధలు. కుంటి పుల్లారెడ్డి, మానందిరెడ్డి, ఎల్లసుందరా యుడు, చెన్న కృష్ణారెడ్డి, గదెం[illegible]నాగిరెడ్డి, పరిగి రామకృష్ణారెడ్డి, [illegible] గోపిరెడ్డి కథలు గ్రామీణ కక్షల గాథలు. పాకనాటి డ్రైవరు నాగయ్య కథ [illegible] వివాద హత్యా గాథ. అద్దా[illegible]లు, చిన్న మునెమ్మ, వీశసోటు, ఆదెమ్మ కథలు భర్తలను చంపించిన రంకుటాండ్ర గాథలు. ఒద్దిరాజులు, బోన కతలసెడ్డి, ముసలమ్మ, వరద రాజమ్మ కథలు సమాజ కళ్యాణం కోసం ప్రాణాలు ధారపోసిన త్యాగధనుల గాధలు. బుద్దా వెంగళ రెడ్డి, సుద్దపల్లి లక్ష్మమ్మ, యాదాళ్ళ నాగమ్మ, శిమ్మె డొక్కా సీతమ్మ కథలు పదాన్య గాధలు. ఎల్లల చెరువు వరదలు, మూసీనది [illegible]ంగు, పెన్నేరు వరదలు, జనగాము రైలు ప్రమాదం, జడ్చర్ల రైలు ప్రమాదం ధాత కరువు సంబంధించిన ప్రమాదాలకు సంబంధించిన గాధలు. నమ్మరాని అద్భుతాలలో అతిమానుష విషయాలతో నిండినవి గాంధారి, కాంభోజరాజు, కమ్మవారి పణతి, ఎలనాగిరెడ్డి, రత్నాంగి, రక్త కుమారుడు అనుముల బ్రహ్మారెడ్డి గాధలు. ఈ గాధా గేయాలన్నీ చాలా దీర్ఘమైనవి కనుక పరిమితమైన ఈ వ్యాసంలో ఉదాహరించలేను. సురవరం ప్రతాపరెడ్డి గారు తను "ఆంధ్రుల సాంఘిక చరిత్రలో మన చరిత్రకు సంబంధించిన రెండు గేయ భాగాలు చేర్కొన్నారు.

1. రెడ్డొచ్చె రెడ్డొచ్చె రెడ్డొచ్చె నమ్మా – వీరభద్రారెడ్డి విచ్చే ననమ్మా

ప్రొద్దున్నె మారెడ్డి సారకూడిపించు – నిలువెల్ల నడివీధి నీరు జల్లించు

సందుగొందులలోన సొమ్ము పోయించి – చీకట్ల పసుపు కుంకుమలు పూయించు

రంగవల్లుల మూరు రాణింప జేయు – తోరణ పంక్తుల తులకింప జేయు

దివ్వెలను వెలిగించు దివ్య మార్గాలా – మాపెల్లి పాలించు మంచి మార్గాలా

ఎండలకు పందిళ్ళు వేయించు లాడూ – పొందుగా మారేళ్ళు కోయించు లాడూ

ఊరిగావులలోన ఉప్పు మన్నాలా – వెదజల్లు ఏటేట నిండు పున్నానా" –

ఈ పాట రాజ మహేంద్రవరాన్ని పాలించిన వీరభద్రారెడ్డి (క్రీ.శ. 1423-1448) చేసిన ప్రజాహిత కార్యాలను కీర్తించే చారిత్రక గేయ ఖండం.

2. "కొండవీడు మనదేరా – [illegible]డంపల్లి మనదేరా

కొదని వాదుకు వస్తే – కటకం దాకా మనదేరా"

ఈ గేయఖండం విజయనగర సామ్రాజ్య విస్తృతిని చాటేది. పూర్వకాలంలో రాజులు దండ యాత్రలకు బయలుదేరేముందు శుభశకునాలు చూచుకునేవారు. శ్రీకృష్ణదేవరాయల వారు (క్రీ.శ. 1509-1530) కటకం మీదకి దండెత్తి పోయేనాడుదయం ఒక చాకలి బట్టలుతుకుతూ ఈ గేయం పాడటమే ఉపశ్రుతిగా భావించినారట.

జానపద సాహిత్య వృక్షానికి రెండవ ప్రధాన శాఖ వచనం ఈ వచన శాఖకు కథలు – సామెతలు – పొడుపులు ఉపశాఖలు. కథలను పురాణ కథలనీ (Myths) ఐతి హ్యాలనీ (Legends) జానపద కథలనీ (Folk tales) మూడు పెద్ద బృందాలుగా విభజించవచ్చు. జానపద కథల్లో జనప్రియక కథలనీ (Popular tales), కిన్నెర కథలనీ (Fairy tales), కట్టుకథలనీ (Marchen), స్థలం – వ్యక్తి – సంఘటనలకు సంబంధిన కథలనీ (Sage) తీరు తీరుగా విభజించినారు. భారతదేశం కథల పుట్ట అనీ మనదేశం నుండే కథలు

ఇతర దేశాలకు వ్యాపించినాయనీ ఒక వాదం ఉన్నది. కథా సరిత్సాగరం, పంచతంత్రం, జాతకకథలు, అవదాన కథలు, శుకసప్తతి, హంసవింశతి, భోజకాళిదాసు, బట్టి విక్రమార్కులు, శాలివాహన కథలు, కాశీమజిలీలు, రామేశ్వర మజిలీలు, తిమ్మరుసు కథలు, దిలారాము కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, రేచుక్క-పగటిచుక్క కథలు, మదన కామరాజు కథలు, మర్యాద రామన్న కథలు, సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి కథలు, సారంగధర కథలు, తెనాలి రామలింగ కథలు, పేదరాశి పెద్దమ్మ కథలు, కాంభోజరాజ కథలు, కీరబహత్తరి కథలు, చార్ దర్వేషు కథలు, చిత్తూరు రాజుల కథలు, గోల్కొండ పాదుషాల కథలు, చిలుక చెప్పిన కథలు, తాతాచార్ల కథలు, లోకీనామా కథలు, దక్కను పూర్వ కథలు, పలుక రాని పద్మాక్షి కథలు, బత్తీసు పుత్రి కథలు, బేతాళ పంచవింశతి కథలు, విజయ నగర రాజుల కథలు, ఐదుగురు దొంగల కథలు, ఈసపు నీతి కథలు, అరేబియన్ నైట్సు కథలు, నలుగురు మంత్రుల కథలు, పురాణ కథలు, పర్షా వినోద కథలు వంటివి తెలుగుదేశంలో బాగా ప్రచారంలో ఉన్నవి. ఈ కథలు కాలక్షేపానికి తీరిక వేళల్లో పెద్దలు చెప్పుకోవటమే కాక చిన్న పిల్లలకు తాతలు, నాయనమ్మలు, అమ్మమ్మలు చెప్పి నిద్ర పుచ్చటం తెలుగునాట అలవాటు. సంప్రదాయ కథల్లో మన సంస్కృతి ప్రతిబింబించినట్లే కల్పిత కథల్లో తెలుగు వారి నీతి నిజాయితీ హాస్య ప్రియత్వం, చురుకుదనం, యుక్తి తిరస్ఫూర్తి, తెలివితేటలు, తుంటరితనం ప్రస్ఫుటంగా కనవస్తాయి. తెలుగు కథలు చాలా పొడుగైనవి ఉన్నాయి. చాలా పొట్టివి కూడా ఉన్నవి. పెద్ద కథలను ఉదాహరిస్తే పేజీలు పెరిగిపోయే ప్రమాదం ఉంది కనుక ఒక చిన్న తెలుగు కథను ఉదాహరిస్తాను

"కృతజ్ఞుడు - కృతఘ్నుడు"

"అనంగనంగ ఒక రాజు. ఆ రాజు కొలువులో ఒక మంత్రి ఉండేవాడు. ఒకనాడు రాజుగారు మంత్రిని పిలిపించి చేసిన మేలును మరిచే ఒక కృతఘ్న ప్రాణినీ, చేసిన మేలు మరువని విశ్వాసం గల మరొక కృతజ్ఞ ప్రాణినీ రేపు దర్బారుకు తీసుకు రావలసిందని ఆజ్ఞాపిస్తాడు. రాజుగారు అభిమతమేమిటో ఆయనకు సమాధానం ఎట్లా కలుగుతుందో ఎటువంటి ప్రాణులను రాజుగారి సద్దకు తీసుకొని పోవాలో మంత్రి గారికి తోచక చింతాక్రాంతుడై నాడు. ఇంటికిపోయి అన్నం నీళ్ళు ముట్టక విచారంతో ఉంటాడు. మంత్రికి మహాచురుకైన ఒక కూతురు ఉన్నది. తండ్రి విచారం గమనించి సంగతేమిటి అని ప్రశ్నిస్తుంది. రాజు గారి ఆజ్ఞ తండ్రి కూతురుకు వినిపిస్తాడు. ఆమె ఇంతేనా అని చిరునవ్వుతో రేపుదయం దర్బారుకు మీ అల్లుణ్ణీ, మన కుక్కనూ తీసుకపొండి అని సమస్యకు పరిష్కారం చెప్పింది.

మరునాడుదయం మంత్రి ఈ రెండు ప్రాణులను దర్బారుకు తీసుక పోయినాడు. తనను ఎగతాళి చేస్తున్నాడని రాజుగారికి కోపం వచ్చింది. ఐతే పరమశాంతుడైన మంత్రి రాజుగారితో "మహారాజా ఈ ప్రాణికి సంతృప్తి అనేది లేదు. ఎంత పెట్టినా ఈతని దాహం తీరదు. విశ్వాసం లేదు. ఇంకా మహారాజా మీరూ నేనూ కూడా ఒక యింటికి అల్లుండ్లమే. మన అత్త మామలు మనకు చేసిన మేలంతా మరచిపోయినాము. ఈ కుక్క మాత్రం ఏది పెడితే అది తిని ఎంతో విశ్వాసంతో ఉంటున్నది. మన కావలి కాస్తున్నది" అన్నారు. మంత్రి సమాధానం రాజుకు బాగా నచ్చింది. కథ కంచికి మన మింటికి".

జానపద వచన సాహిత్యంలో రెండవ ఉపశాఖ సామెతలు. అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని చెప్పేవి సామెతలు. ఒక జాతి అనుభవసార సర్వస్వంగాను, పెక్కుమంది అనుభవం ఒక్కని వివేకంగాను లయబద్ధంగానో ప్రాసయుక్తంగానో అలంకార యుతంగానో సామెతలు ప్రదర్శిస్తాయి.. పురాణేతిహాసాలకు, వివిధ కులాలకు, వృత్తులకు సంబంధించినవి, విజ్ఞాన దాయకములు, నీతి ప్రబోధకములు, శృంగార హాస్య పూరితములు, గృహ జీవన సంబంధ విషయాలు. వరుస వావులకు సంబంధించి నవి, బూతులు బుంగలు తీరు తీరు సామెతలున్నవి. కొందరు మాటకారులు సామెతల్లోనే మాట్లాడు తుంటారు. పాత తరాల వారిలో మాటమాటకు సామెత వాడేవాళ్ళున్నారు. భారతీయమైన ఇతర భాషలతో పాటు విదేశ భాషల్లో ఉన్న సామెతలకు కూడా తెలుగు సామెతల్లో కొన్నింట పోలికలు గుర్తించవచ్చు. తెలుగు సామెతల సంకలనాలు పరిశోధన గ్రంథాలు ఇటీవల చాల వచ్చినవి. కీ.శే. చిలుకూరి నారాయణరావు గారు లక్ష సామెతలు సేకరించినరాట. తెలుగు వారి నాడుకలో బహుళ ప్రచారంలో ఉన్న కొన్ని సామెతలు చిత్తగించండి.

1) అంగట్లో అన్నీ ఉన్నా, అల్లుని నోట్లో శని ఉన్నది.
2) ఇంటి పేరు కస్తూరి వారు - ఇంట్లో గబ్బిలాల వాసన.
3) ఉన్ననాడు ఉగాది లేనినాడు శివరాత్రి.
4) ఎవడు తవ్వుకున్న గోతిలో వాడే పడతాడు.
5) ఒంటె పెదవికి నక్కాశ పడ్డట్లు.
6) కరువుకు చింతలు - కాలానికి మామిండ్లు.

7) గతిలేనమ్మకు మతిలేని మొగుడు.
8) చదువు చారెడు బలుపాలు దోసెడు.
9) జంగమైనదీ దానరైనదీ తాళ్లు దాటితే తెలుస్తుంది.
10) తంతే పరుపులో పడ్డట్లు -

వచనంలో మూడవ ఉపశాఖ పొడుపు కథలు. వీటినే శాస్త్రాలని, తట్లని, మారుకతలనీ అంటారు. సంస్కృతంలో వీటిని ప్రహేళిక అంటారు. గూఢ పన్నమయములు, బుద్ధికుశలతా నికుషోపలాలు, ఉక్తి వైచిత్రీ విలసితములు, ఆలోచనాలోచనములు, విజ్ఞాన వినోద సాధనాలీ పొడుపు కథలు. మహాభారతంలోని యక్షప్రశ్నలు కొన్ని పొడుపు కథలవంటివే.' పొడుపు కథలు అన్ని భాషల్లోను ఉన్నవి. తెలుగు పొడుపులు వచనంలోనేకాక గేయాల్లో పద్యాల్లో కూడ ఉన్నవి. పిల్లలకూ పెద్దలకూ వినోదం విజ్ఞానం పంచేవి పొడుపు కథలు. పొడుపు కథల స్వరూప స్వభావాలను బట్టి, హ్రస్వ దీర్ఘతలను బట్టి, లయను బట్టి, అలంకారాలను బట్టి, కథల తీర్పును బట్టి, వస్తువును బట్టి, తీరుతీరులుగా విభజించవచ్చును. కొన్ని పొడుపులు పైకి అశ్లీలాలుగా తోచినా అర్థం అశ్లీలం కాదు. కొన్ని పొడుపులు పైకి సభ్యంగా తోచినా అర్థం అశ్లీలంగా ఉంటవి.

కొన్ని పొడుపు కథల ఉదాహరణలు.

1) అడవిలో పుట్టింది, అడవిలో పెరిగింది, చెంబులో నీళ్లన్ని చెడలాగుతుంది.

(గంధపు చెక్క)

2) ఆకులేని పంట అరవై యారు పుట్లు (ఉప్పు పంట)
3) కిటకిట తలుపులు కిటారి తలుపులు - ఎప్పుడు తీసినా చప్పుడు గావు. (కనురెప్పలు)
4) తోకలేని పిట్ట తొంబై ఆమెడ పోతుంది. (జాబు)
5) అనుమకొండ చెరువులో ఐదు స్తంభాలు ఊపితే ఊగుతాయి - పీకితే రావు. (చేతిలో వ్రేళ్ళు)
6) తల్లి దయ్యం పిల్ల పగడం (రేగుచెట్టు - పండు)
7) మూతి పిసకటం ముడ్డి నాకటం. (మామిడిపండు)
8) ఈగ ముసరని పండు. (నిప్పు)
9) చూస్తే చూపులు, నవ్వితే నవ్వులు, గుద్దితే గుద్దులు. (అద్దం)
10) జోరు గుఱ్ఱాల పైన ఒకడే రాజు (చెప్పులు)
11) వాడు పోతుంటే నేను పిలుస్తుంటి వాడు పెద్తుంటే నేను ఏడుస్తుంటి. (గాజులు)
12) చక్కని ఆడదానికి పక్కలో తూటు. (పిడకల గూడు)

జానపద సాహిత్యంలో మూడవ ప్రధాన శాఖ రూపకం. రూపకం ప్రదర్శన కళ. ఇందులో యక్షగానాలు, వీధి నాటకాలు, చిందు భాగవతాలు, కలాపాలు, కొరవంజులు, తోలుబొమ్మలాటలు, నాలకములు, హరికథలు వంటివి చేరుతాయి. పాల్కురికి సోమనాథుని కాలం నాటికే తెలుగు దేశంలో యక్షగానాలుండేవి. క్రీడాభిరామంలో జక్కులపురంధ్రి ప్రదర్శనం వర్ణించబడింది. మనకు దక్కిన ప్రాచీన యక్షగానాల్లో విప్రనారాయణ చరిత్ర క్రీ.శ. 1545 నాటిది; సుగ్రీవ విజయం క్రీ.శ. 1568 నాటిది. విజయనగరం తంజావూరు రాజుల కాలంలో యక్షగానాలు కొరవంజులు చాలా వచ్చినవి. దాదాపు 500 యక్షగానాలు అచ్చైనవి. అచ్చుగానివెన్నో! తోలుబొమ్మలాటలు క్రీస్తుశకం పూర్వమే తెలుగు దేశం నుండి ద్వీపాంతరాలకు అటునుండి పాశ్చాత్య దేశాలకు పోయినట్లు చారిత్రకులు కథనం. నాలకమనే ప్రక్రియ విశాఖ, శ్రీకాకుళం మండలాల్లో ప్రచారంలో ఉన్నది. వీధి నాటకాలు చిందు భాగవతాలు, కలాపాలు ఈనాడు ఆంధ్రదేశమంతటా వినోదమూ విజ్ఞానమూ పంచుతున్నవి.

భారతీయ భాషలన్నింటిలోను జానపద విజ్ఞాన అధ్యయనం విరివిగా సాగుతున్నది. విశ్వవిద్యాలయాలు, జానపద పరిషత్తులు, ప్రభుత్వ సమాచార శాఖలు, అకాడమీలు ఈరంగంలో చేయవలసిన కృషి ఎంతైనా ఉన్నది. కాలం గడచిన కొలది ఈ జాతీయ సంపద అంతరించి పోతుంది. నవ నాగరకత ముదిరిన కొలది ఈ జాతీయ సంపద అంతరించి పోతుంది. నవనాగరికత ముదిరిన కొలది విజ్ఞానం సన్నగిలుతుంది. మూడు కాళ్ళ ముదుసళ్ళు, పాతతరాల పండుటాకులు రాలిపోకముందే ఈ సంపదను సేకరించి భద్రపంచి విశ్లేషించి విజ్ఞానం పంచాలి. దీపముండగా ఇల్లు చక్కదిద్దుకోవటం బుద్ధిమంతుల లక్షణం. తమిళ కర్నాటక దేశాల్లో జానపద విజ్ఞాన రంగంలో విశేషమైన కృషి జరుగుతున్నది. మైసూరు, ధార్వాడ, బెంగుళూరు విశ్వవిద్యాలయాల్లోను, ప్రభుత్వ సహకారంతో నడిచే నాలుగైదు సంస్థల ద్వారాను కన్నడ జానపద విజ్ఞానం అధ్యయనం బాగా జరుగుతున్నది. మైసూరులో ఉన్న **Folklore Museum** భారత దేశంలో దానికదే సాటి. తెలుగు విశ్వవిద్యాలయంలో జానపద విజ్ఞానాధ్యయనం ప్రారంభించటం వలన మన జానపద రంగంలో కూడ విశేషకృషి జరుగగలదని ఆశిద్దాము.

● ● ●

# తెలుగువారి జానపద కళారూపం-బుర్రకథ

వై.పి. రాజు

'వినరా భారత వీర కుమార విజయం మనదేరా' అదే కదండి బుర్రకథంటే, నాకు చిన్నప్పటి నుంచి చాల ఇష్టం' అని ఒకరంటే; 'బుర్రకథంటే.... ఓహో, ఒకప్పుడు జనాన్ని ఊపేసిందండి' అని ఇంకొకరు; 'నా చిన్నతనంలో నాజరనీ ఉండేవాడు. ఆయనది గుంటూరను కుంటాను. మంచి భలే చెప్పేవాడండీ, కూర్చున్న వాడు మైమరచి వినేవాడు. ఇప్పుడు ఆ కథలు వినే వాళ్ళేరండీ?' అని మరొకరు బుర్రకథ ప్రస్తావన వచ్చిన చోట అంటూ ఉంటారు. ఇది నిజం. ఆనాటి నుండి ఈనాటి వరకు బుర్రకథ కళారూపం చెక్కుచెదరక ప్రజల నోళ్ళల్లో ఇంకా బ్రతుకుతుందీ అంటే అది ఎంత శక్తివంత మైన కళారూపమో ఇప్పటికే అర్థమై ఉండాలి.

బుర్రకథ జానపద కళారూపం. ఒక్క బుర్రకథే కాదు, జముకుల కథ, ఒగ్గుకథ, హరికథ, పల్లెసుద్దులు, కోలాటం, చెక్క భజన, వీధి నాటకం, తోలు బొమ్మలు, బుట్టబొమ్మలు, బైండ్ల, కొమ్ముదాసర్లు, సంక్రాంతి దాసులు, డప్పుల నృత్యం, గారడీలు, కోయ, చెంచు, బుడబుక్కల, గంగిరెద్దులాట, దొమ్మరాట, వీరనాట్యం గరగలు, కోల సంబరం, చిందు భాగవతం, గొబ్బిళ్ళు, బతకమ్మ..... మరెన్నో అవన్నీ జానపద కళారూపాలే. జాతి సంస్కృతికి అపురూపాలే. ఇంతకీ జానపదమంటే? జనపదంలోంచి వచ్చినదంతా జానపద మౌతుంది. 'జనపదం' ఒక ప్రదేశాన్ని సూచిస్తుంది. అనగా గ్రామాన్ని తెలియ జేస్తుంది. గ్రామీణ జీవితానికి సంబంధించిన సర్వవిషయాలు జానపదమౌతుంది. ఆచారాలు, సంప్రదా యాలు, సంగీతం, నృత్యం దుస్తులు, నమ్మకాలు, పండగలు, నాటాలు, కథలు, ఇవన్నీ మన సంస్కృతిలో భాగాలే. జనపదంలోని సాహిత్యం జానపద సాహిత్యమౌతుంది. జనపదం లోని కథలు జానపద కథలు ఔతాయి. కాబట్టి మనజాతి సంస్కృతిని నిలబెట్టేవి పల్లెలు. అట్టి పల్లెల నుంచి పుట్టినవే ప్రజాకళలు. ఒక్క మాటలో చెప్పాలంటే, ప్రజల్లో పుట్టి, ప్రజల్లో పెరిగి, తిరిగి ప్రజలకు వినోదాన్ని, విజ్ఞానాన్ని కల్గించేవి ప్రజాకళారూపాలు.

అట్టి ప్రజాకళలలో, సంస్కరింప బడి, పండిత, పామర, పరిశోధకుల దృష్టిని సైతం ఆకర్షించుకొన్న నిత్య నూతనమైన, అత్యంత శక్తివంతమైన కళారూపం బుర్రకథ, అనడం ఎంతమాత్రమూ అతిశయోక్తి కాదు. ఇలాంటి ఎన్నో ప్రజా కళారూపాలకు ఊపిరిపోసి ఉద్యమాలు నడిపించిన ఘనత ఒక్క ప్రజానాట్య మండలికే దక్కుతుంది.

తెలుగు సాహిత్య కళారంగంలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన మహత్తరమైన చరిత్రను సృష్టించుకుంది బుర్రకథ. ఏ సంఘటననైనా ఇతివృత్తంగా స్వీకరించి, అవసరమైన వరిధిలో సమాజానికి సందేశాన్నిచ్చే సంస్కారమైన కళారూపం బుర్రకథ. ఇది జాతీయ సమైక్యతతో, ఎన్నో ఉద్యమాలకు ఊపిరిపోసి, మరెందరో ఉద్యమాకారులను సిద్ధం చేసింది.

ఇంతకీ ఇందులో మూడు పాత్ర లుంటాయి. ప్రధానపాత్ర కథకుడు. మిగిలిన రెండు పాత్రలు వంతలు. కథకునికి కుడిభుజంమీద తంబుర, ఎడం చేతిలో అందెలు, చిటికెన వ్రేలుకు చిన్న చేతి రుమాలు, కాళ్ళకు గజ్జెలు ఉంటాయి. వంతలను, హాస్య రాజకీయ పాత్రలంటారు. వీరు, కథకునికి ఇరువైపులా ఉండి భుజాలకు డక్కీలు ధరించి, కథకునికి పాటకు లయాను గుణంగా వాయిస్తూ; తంబురమీటుతూ గానం చేసే (కథకుని) చరణాన్నే వీరు సహగానం చేస్తారు. కథా ప్రదర్శనలో కథకునికి వంతలు; వంతలకు కథకుడు సందేశాత్మక ఘట్టాలతో; శహభాష్, భలే, ఆహా, ఓహో, ఔనౌను, అంటారు. యుద్ధఘట్టాల్లో; అర్రెరె ర్రెర్రె... పొడిచెయ్, నరికెయ్, కొట్టు, అడుగో, ఇడుగో, ఇదుగో, ఇదిగో, అంటూ వీరావేశంతో ఉత్సాహంగా కదంతొక్కు తారు. విషాదఘట్టాల్లో, అయ్యయ్యో..... రాము...రాము, దేవా, హరీహరీ అంటూ నిట్టూర్పులిడుస్తారు.

ఇక వేషానికి వస్తే, ముగ్గురు ముఖాలకు రంగుపూసుకుంటారు.

మూడు గౌన్లు, మూడు సుర్వాయిలు, చెవులకు, చేతులకు మెడకు ఆభరణాలు, పూసల దండలు, తలకు తలపాగాలు, ధరిస్తారు. ఆధునికంలో రాజకీయ పాత్రలు కొందరు తలపాగాను ధరించడం లేదు.

ఇంతకీ బుర్రకథంటే? ఈ ప్రశ్నకు చాల మంది పరిశోధకులు చాల రకాలుగా చెప్పారు చెబుతున్నారు. తంబుర కథనీ, తందాన పాటనీ, గుమ్మెట కథనీ, డక్కీల కథనీ, అనేక పేర్లతో ఈ కళారూపాన్ని పిలుస్తున్నారు. వాద్య విశేషాన్ని బట్టి కొందరూ, వంతపాటను బట్టి కొందరూ, ఆయా విధాలుగా పిలుస్తూన్నప్పటికీ, కథకుడు ధరించే తంబురనాదమాధారంగా గానం చేయబడుతుంది. కనుక తంబుర యొక్క బుర్రను బట్టీ బుర్రకథ అనడం సముచితంగా ఉందనీ ఇంచుమించు పరిశోధకులందురూ ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు.

1941-42 ప్రాంతంలో ఆవిర్భవించి, నాటి నుండి నేటి వరకు సంఘ ప్రయోజనాన్నాశిస్తూ; సమాజాన్ని ప్రభావితం చేస్తూ, అందరి హృదయాలకు హత్తుకుపోయి, విశిష్ఠస్థానాన్ని సంపాదించుకొని, సామాజిక స్పృహను కల్గిస్తున్న ఈ బుర్రకథ కళ తొలిరూపమే జంగం కథ. జంగాలూఅంటే సంచారులు (తిరిగేవాళ్ళు) అని అర్థం. స్థిరనివాసం లేక, ఇంటింటా, ఊరూరా తిరుగుతూ కథలు చెప్పి, పొట్ట పోషించుకొనే వారు కాబట్టి వీరికా పేరు వచ్చింది. అదిక్రమంగా కులం పేరుగా ప్రసిద్ధమయ్యింది. జంగం చెప్పే కథ జంగం కథయ్యింది. వీటిని పోలినవే శారద కథలు. ఈ కథలకు మూలం యక్షగానం. అందువలన బుర్రకథ యక్షగాన విశేషమని ఒకరు; 'దాని అభివృద్ధి రూపం' అని వేరొకరు, వీరగాథను సరణములని ఇంకొకరు; అలా పరిశోధకులు తమ తమ పరిశోధనా ఫలితాంశాలను బట్టి వివరిస్తు న్నారు. కాల న్నిర్ణయంలో కూడ, పద కొండనీ, పంద్రెండనీ, పదమూడనీ, పద్నాల్గనీ భావిస్తున్నారు. అయితే బుర్రకథలకు మాతృకలైన జంగం కథలు చాల ప్రాచీనాలనీ, శ్రీనాథుని-క్రీడాభిరామం, కాశీఖండం, పాల్కురికి సోమనాథుని-పండితారాధ్య చరిత్ర మొదలైన గ్రంథాలాధారంగా చెప్పవచ్చు.

## క్రీడాభిరామంలో

"తకుదుమ్ముల్ యకతాళముల్
జనని కల్ తందాన్మ్యకున్
ఏక వీరమ్మకు మాహురమ్మకు
నభో హ్రీంకార మధ్యాత్మకున్"

అన్న 132వ పద్యపాదాలను బట్టి, తందాన కథలు ప్రాచీనాలని, అంటే కాకతీయులు కాలం నాటికీ జంగం కథలుఎక్కువ ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తుంది.

శ్రీనాథుని కాలానికి ముందే ద్విపద ప్రబంధ బుర్రకథలున్నట్లు క్రీడాభిరామంలో "ద్రుతతాళంబున వీరగుంభి తక ధుం ధుం కిటత్కార్ సంగతి వాయింపుచు నాంతరాళికయతి గ్రామాభిరామంబుగా యత్ గూడం ద్విపద ప్రబంధ మున వీరానీకముంబాడె నొక్కతె ప్రత్యక్షరముం గుమారులు ఫీట్కారంబు నదూలగన్"

అన్న 116వ పద్యాన్ని బట్టి తెలుస్తుంది. క్రీడాభిరామం 14వ శతాబ్దంలో రాయబడింది. పద్యంలోని ఇతివృత్తం వీరచరిత్రకు సంబంధించింది. ఒక స్త్రీ వీరగుంభి వాయిస్తూ ద్విపద కావ్యం పాడడం, ప్రదర్శనను చూస్తున్న ప్రేక్షకుల్లో కొందరు [illegible] ఉత్సాహంతో ఈలలు వేయడం పద్యంలోని సారాంశం.

థిం థిం త; తక థిం తక్క. తక థింతక్క, థిం థింత, థింతక్క, థింతక్క థింత; థింతక్ తక్ తథిం థింతక్ తక్; థింతక్క తక థిమ్మి; తక థిమి తకథిమి. ఇవి ఈనాడు బుర్రకథలో వినిపిస్తున్న డక్కీ ధ్వని విశేషాలు. పైన పేర్కొన్న అంశాలను పోల్చి, పరిశీలించినపుడు, యక్షగానాలు, వీరగాథలు, జంగం కథలు, శారద కథల అభివృద్ధి రూపం బుర్రకథనీ మనంచెప్పవచ్చు. 1900 నుండి 1940 వరకు జంగం కథలు ఎక్కువ ప్రచారంలో ఉండి, క్రమేపి తగ్గి పోగా, 1941-42 ప్రాంతంలో మనం నేడు చూస్తున్న బుర్రకథ పుట్టింది.

ఇది జంగం కథకుల ద్వారా బుర్రకథకులకు సంక్రమించిన విద్య గనుక జంగం కథకులలో ముఖ్యులు మనం మరిచిపోకూడని వ్యక్తులు దొడ్డరపు వెంకటస్వామి,తర్వాత ఆమూసలో చెప్పు కోదగినవాళ్ళు అంజ్ కోటిదాసు, జంగా సుబ్బదాసు, రెంటపాళ్ళ గుడ్డి జంగం, ముంతెన జంగాలు మొదలైన వారు.

నేటి తరానికి అందించిన నాటి బుర్రకథకులు, కళాకారులు, సుంకర సత్యనారాయణ (కష్టజీవి బుర్రకథ రచయిత) కాకుమాని సుబ్బారావు (బాబూరావు కథ రచయిత) పద్మశ్రీ షేక్ నాజర్, లక్ష్మీకాంతమోహన్ డా॥ మిక్కిలినేని రాధాకృష్ణ మూర్తి, పట్టిశెట్టి ఉమామహేశ్వరరావు, ఉప్పు గుండూరు

క్రిష్ణమూర్తి, పెరుమాళ్ళ బెనర్జీ, మాచినేని వెంకటేశ్వరరావు, నందిగామ వెంకటేశ్వర రావు పల్లం నరసింహారావు, మోటూరి ఉదయం, కొండేపూడి రాధ, జూనియర్ నాజర్, బళ్ళ మృత్యుంజయ రావు, కట్టా వీరయ్య, పేపకాయల వెంకట్రావు, ముండె సుబ్బిరెడ్డి, తేతల అమ్మిరెడ్డి మున్నగు వారెందరో ఉన్నారు.

నేడు నడుస్తున్న బుర్రకథ బృందాలు; బాపూజీ, భానూజీ, ప్రేమా నందం, కొమురశ్రీ. జి. కృష్ణమూర్తి, భద్రకాళి, హేమాబృందం, యేసుపాదం బృందం, కరిరామారావు, షేక్ బాబ్జీ మరియు పార్టీ. మాస్టర్ పండు, మిరియాల అప్పారావు, విభూతి బాబూ రావు, కె. రాజ గోపాల్, జి. నాగరాజు, రామ్మోహనగౌడ్, సబ్బి కనకారావు, ఎల్లోజీరావు, మస్తాన్ రావు, వామనమూర్తి బృందం; టి. నాగభూషణం, వై. రాజా రెడ్డి, జె. సూర్యారావు. జంగం వెంకటేశ్వరరావు, ఎం.ఎం. దాసు, చేజర్ల శివరామయ్య, లోకా బాబూరావు, పాల్ మాష్టారు, నిట్టల బ్రదర్సు, దిండీ బ్రదర్సు, యన్. రామసుబ్బారాయుడు బ్రదర్సు, తిరుపతి మారెమ్మ బృందం, డి. శంకరయ్య, ఎ. అప్పలసూరి బృందం మొదలైనవి.

కొంత రూపాంతరం చెంది బుర్రకథ అవతరించినట్లే, ఇతివృత్తంలో కూడ అనేక మార్పులొచ్చాయి. పల్నాటి వీరచరిత్ర, బొబ్బిలి రాజుకథ, బాలనాగమ్మ, తిరుపతమ్మ, కామమ్మ, లక్ష్మమ్మ, చిన్నమ్మ, మొదలైనవి జంగం కథలయితే, అవి బుర్రకథలుగా మార్పు చెందే ఉత్తరదశలో సాంఘిక పరిస్థితులు చోటు చేసుకొన్నాయి.

బుర్రకథగా అవతరించిన తర్వాత సమకాలీన సమస్యల నాధారం చేసుకొని వచ్చిన కథల్లో సుంకర 'కష్టజీవి' తొలి బుర్రకథని తెలుస్తొంది. ఇది అనేక రచనలకు మార్గదర్శకమైంది. ఈ కథను తిరుగనది రామంజనేయులు హరికథగా, పాణిగ్రాహి సుబ్బారావు గారి చేతిలో జముకుల కథగామలచబడింది.

తర్వాత దేశభక్తుల పేర్లు మీదుగా విప్లవ వీరుల, కరువు కాటకాల, పేర్లు మీదుగా ఇతివృత్తాలు చోటుచేసు కున్నాయి. బుర్రకథల శక్తియుక్తులను, ప్రచార పద్ధతులను గమనించిన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, ఆకాశవాణి, దూర దర్శనాలు తమ ప్రచారాలకుఅను గుణంగా ఇతివృత్తాలను మార్పు చేసుకొన్నాయి. వయోజన విద్య, గ్రామ పారిశుద్ధ్యం, కుటుంబ నియంత్రణ, పొదుపు, అక్షర జ్యోతి, సారానిషేధం మున్నగునాటి ఉదాహరణలుగా చెప్ప వచ్చు. మతపరంగా, దేశపరంగా, వర్గ పరంగా ప్రాంతీయపరంగా, జాతి పరంగా ఎన్నో విధాలుగా ఇతివృత్తాలు వెలువడ్డాయి.

నేడు సంఘంలో జరుగుతున్న ప్రతిచిన్న అంశంపై బుర్రకథ లొచ్చాయి. వ్యక్తుల పేర్లు, శక్తుల పేర్లు, చెట్లు పేర్లు, సంస్థల పేర్లు, మీదుగా ఇతివృత్తాలు వెలువడ్డాయి.

ఇంతవరకు ఉదహరించిన వ్యాసాన్ని, మనం సూక్ష్మేక్షతో పరిశీలిస్తే బుర్రకథ కళారూపం ఎంత శక్తివంతమైన ప్రచార, ప్రజాకళారూపమో అర్థమైందను కుంటాను.

అంతశక్తివంతమైన కళారూపం నేడు శక్తిహీనమయ్యేస్థితిలో ఉంది. ముఖ్యంగా పండగల, పెళ్ళిళ్ల, ఉత్సవాల ఊరేగింపుల జాతర్ల, తీర్థాల మొ॥ సందర్భాలలో బహిరంగ చలనచిత్ర ప్రదర్శనాలను, 16 యమ్ యమ్ చిత్రాలను ప్రభుత్వం నిషేధిస్తే చాల వరకు ఈ కళను బ్రతికించవచ్చు. ప్రభుత్వ సంబంధమైన ప్రతి చిన్న సందర్భానికి ఈ కళా ప్రదర్శనాన్ని ఏర్పాటుచేసి, ఉత్సాహమైన పారితోషికాన్ని ఇప్పించి బ్రతికించ వచ్చు.

బుర్రకథ బృందాల కళాకారులకు ఇటీవల సమాచార పౌరసంబంధశాఖ ఆధ్వర్యంలో ఉద్యమ కర్త, రక్తకన్నీరు నాగభూషణంగారి పర్యవేక్షణలో వై.పి. రాజు ఆచార్యకత్వంలో త్యాగరాయగాన సభ మినీ థియేటర్‌లో మార్చి 21 నుండి 27 వరకు జరిగి బుర్రకథ శిక్షణా శిబిరాలు అఖిలాంధ్ర బుర్రకథ కళా కారులను ఉత్తేజపరిచాయి. వారిలో సంతృప్తిని కల్గించాయి. అలాంటి ఉన్నత శిక్షణా శిబిరాలు జిల్లాల వారిగా హైదరాబాదు కేంద్రంగా మరిన్ని ఏర్పాటు చేసినట్లైతే ఈ కళారూపానికి ఒకమంచి భవిష్యత్తు ఏర్పడుతుంది. మంచిగా శిక్షణ పొందిన బృందాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విరివిగా తమ ప్రచారాలకు వాడుకొనుటకు సమృద్ధిగా నిధులు కేటాయించినప్పుడు, బుర్రకథ కళారూపం భవిష్యత్తు బంగారు బాట కాగలదు అనడం ఎంత మాత్రమూ సందేహం లేదు. ఇటీవల చదువరులు ఎక్కువమంది బుర్రకథ కళాకారులుగా అభివృద్ధి చెందుతున్న దృష్ట్యా అలాంటి వారికి నిరుద్యోగ సమస్యను పరోక్షంగా పరిష్కరించునట్లు ఔతుంది.

• • •

# మార్పు

డా॥ దమ్మ్ము శ్రీనివాసబాబు

ప్రభవ మొదలు కొని
అక్షయ వరకు ఉన్న
అరవై సంవత్సరాల
తెలుగు ఆనవాయితీలో-
సంవత్సరాల పేర్లలో మార్పులే-
కొత్తదనం ఎప్పుడోగానీ కనిపించడం లేదు.

యుగాలు గడిచినా
తరాలు మారినా
అవే లేత మామిడి చిగుళ్ళు
మత్తులో ముంచే మల్లెపూలు
వగరు రుచుల వేపపూలు

మృదువుగా తడిమి
తనివితీరా ఆస్వాదించి
తీపి, వగరు, మత్తు రుచుల్ని
అందరికీ అందించాలనే సదుద్దేశ్యంతో
చల్లగా అలలు అలలుగా వీచేగాలి-

సంగీతంలోని సప్తస్వరాల్ని
సాధన చేసే కోకిలలు
కమ్మగా పాడే కోకిలలు
కాకుల రంగుల్లో కోకిలలు
గొంతునూ పాటనూ మార్చేస్తున్నాయ్
రాజకీయాల్ని నేర్చుకుంటున్నట్టున్నాయ్.

కోకిల గొంతంటే అందరం యిష్టపడతాం
ఆ పాటకు వసంతకాలం తన్మయిత్వం చెందుతుంది.
లేతమామిడి చిగుళ్ళూ
రకరకాల పూలు, తీగలు
కొత్త చిగుళ్ళ సింగారాలు
ఒకటేమిటి?
ప్రకృతినంతా పులకరించేలా చేస్తుంది పాట
గొంతెత్తి పాడే కోకిలమ్మల పాట.
ఆ పాటల్లో ఎన్నెన్ని భావాలో!
ఎన్నెన్ని రాగాలో!!

యిప్పుడు గొంతు మార్చిన కోకిలమ్మల పాటల్లో
'హింసా' రాగరిప్రజ్వరిల్లుతోంది.
స్వార్థం పడగ విప్పి కోడెత్రాచులా
బుసలు కొడుతూ విషం చిమ్ముతోంది.

కులమత ప్రాంత వర్గ భాషా విభేదాల మత్తును
అమాయిక ప్రజల నషాలానికంటిస్తోంది.
ఉగ్రవాదు వెర్రితలలు వేస్తూ
మానవత్వాన్ని మంట కలుపుతోంది.

కాకుల గుంపుల్లో కోకిల బ్రతకలేదు
కాకులు-తమలా కనిపించే కోకిలను
గొంతు విప్పనంతవరకే తమతో మెలగనిస్తాయి
కోకిల గొంతు విప్పిందా?
జాతి భేదం తెలుస్తుంది
గొంతు విప్పిన కోకిల
తన గాన మాధుర్యాన్ని లోకానికి వినిపిద్దామనుకున్న
కోకిల
కాకుల దాడికి గురి అవుతుంది.
అందుకేనేమో కోకిల
గొంతు మార్చింది - పాటా మార్చింది.

మానవత్వానికి పట్టం కట్టాలన్న
నీతి నిజాయితీలు కలకాలం నిలవాలన్నా
మనిషిలోని దోచుకునే గుణాన్ని తరిమివేయాలని ఉన్నా
హింసా ప్రవృత్తిని మానుకోవాలన్నా
ప్రపంచ మానవాళిలో శాంతితత్వాన్ని కోరుకున్నా
కాకుల్లోని ఐకమత్యం-కోకిల గొంతులోని తీయదనం
యీనాడు యీ సమాజానికి కావాలి
యీ మనుషుల్లో మార్పురావాలి.

# ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్యోద్యమం

మాదల వీరభద్రరావు

వేలమైళ్ల దూరానవున్న బ్రిటీష్ సామ్రాజ్యాధిపతులు, కోట్ల జనాభా కలిగిన మన సువిశాల భారత భూమిని తను వలస రాజ్యంగా చేసుకుని, 200 ఏండ్లకుపైగా పరిపాలించడం, ఎవరికైనా ఆశ్చర్యం కలిగించకపోదు. కాని సామ్రాజ్యవాదుల కుటిల నీతికి, బ్రిటీష్ రాజ్య మస్త్రంతానికి యిది చరిత్రలో నిలిచివుంది. బ్రిటీష్ సామ్రాజ్య వాదులు భారతీయులను పైడిపంజరాలలో పట్టిబంధించారు. ఆ శ్వేతజాతి చెప్పుచేతల్లో మెలగడమే గతి అయింది. వారి దుష్పరిపాలన వల్ల మనదేశం అన్ని విధాల అధ్వాన్నస్థితికి దిగజారింది. క్రమేణా మనకు జ్ఞానోదయం అయింది. దేశభక్తులైన మేధావులు మనకు వెలుగుబాట చూపారు. ప్రజల్లో చైతన్యం కలిగించారు. వ్యక్తిత్వాన్ని వికసింపజేసారు. ఈ సర్వపసానమే మన భారత స్వాతంత్రోద్యమం.

విజ్ఞాపనలు విఫలంకాగా పూర్ణ స్వరాజ్యం కోసం హక్కులకోసం ఆందోళనలు సాగించారు ఉద్యమాలు నడిపారు. బ్రిటీష్ ప్రభుత్వం నిర్బంధాలతో ఉద్యమాలను అణచివేయజూచింది. "విభజించి పాలించే" కుటిలనీతిని అనుసరించింది, ఉద్యమాలు ఉధృతమైన కొలదీ, ఏవో స్వల్ప రాజ్యాంగ సంస్కరణలతో ప్రజలను బుజ్జగించతలపెట్టింది. కాని మన భారత జాతీయోద్యమం ముందు వారి పాచికలేమీ పారలేదు. వారి పశుబలం, నిర్బంధ విధానం పరిష్కారమార్గం కాదని స్పష్టమైంది. ఎట్టకేలకు భారత దేశంలో బ్రిటీష్ పాలన అంతరించింది స్వరాజ్యం సిద్ధించింది. సైనిక దాడులనైనా అరికట్ట వచ్చునేమోగాని ప్రజల హృదయాంతరాళాలనుండి వెల్లుబికివచ్చే స్వాతంత్ర్యను స్వేచ్ఛా భావతరంగాలను ఆపజాలదనేది చరిత్రలో రుజువైంది.

ఈ స్వరాజ్య సంరంభంలోని ముఖ్యమైన అన్ని ఘట్టాలలోను, ఆంధ్రదేశం అత్యంత ప్రముఖ పాత్రను నిర్వహించింది. దేశదాశ్య విముక్తికోసం జరిగిన స్వాతంత్ర్యోద్యమ పోరాటా లన్ని దశల్లోను, అశేష ఆంధ్ర ప్రజలు, స్త్రీ పురుషులు అకుంఠిత దీక్షతో పాల్గొన్నారు. అసమాన త్యాగాలు చేశారు. అగ్రశ్రేణిలో వుండి పోరాడారు.

వీటన్నిటిని గూర్చి ఈ స్వల్ప వ్యవధి లో వివరించడం కష్టసాధ్యం, కాని కొన్ని ముఖ్య ఘట్టాలను సంగ్రహంగా చెప్పడానికి ప్రయత్నిస్తాను. ఇప్పటికే పలువురు ప్రసిద్ధ స్వాతంత్ర్య సమర యోధులు అనేక గ్రంథాలు రచించారు. కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు కూడా స్వరాజ్య ఉద్యమాలపైన గ్రంథాలు వెలువరించాయి. వాటిని అధ్యయనం చేసి నేటి యువతరం స్ఫూర్తిని పొందవలసి వుంది.

## ప్రధాన ఘట్టాలు

1. 1857 లో ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం (సిపాయిల తిరుగుబాటు) జరిగిన తరువాత 1885లో దేశీయ కాంగ్రెస్ మహాసభ ఏర్పడిన నాటినుండీ 1905 వరకు-బ్రిటీష్ పాలకులకు విజ్ఞాపనలు, వినతి పత్రాలు సమర్పించడం జరిగింది.

2. 1905-11 వరకు "వందే మాతరం" ఉద్యమం సాగింది.

1916-18 మధ్య "హోమ్ రూల్" ఉద్యమం నడిచింది.

3. 1920-23 వరకు మహాత్మా గాంధీ నాయకత్వాన అసహాయోద్యమం సహాయనిరాకరణోద్యమం నడిచింది.

4. 1928 లో సైమన్ కమీషన్ బహిష్కరణ, 1930-33 మధ్యకాలంలో ఉప్పు సత్యాగ్రహం జరిగింది.

5. 1940-43 తుదిపోరాటం, క్విట్ ఇండియా ఉద్యమం సాగింది. 1947 ఆగష్టు 15న స్వాతంత్ర్యం సిద్ధించింది.

ఇవీ మన స్వాతంత్ర్యోద్యమంలో ప్రధాన ఘట్టాలు. వీటిని గూర్చి విన్నవీ, కన్నవీ, చదివినవీ క్లుప్తంగా వివరిస్తాను.

## ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం

ఈస్టిండియా కంపెనీ దుష్పాలనము వల్ల మనదేశం ఆర్థికంగా, నైతికంగా కూడా పతనమైంది. వారు నల్ల-తెల్ల సైనికుల మధ్య తేడా చూపారు అవమానించారు. స్వదేశీ సంస్థానాలపట్ల వారి వైఖరి మహా దారుణంగా వుండేది. అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగా సంస్థానాధీశుల నుండి సన్యాసుల వరకు ప్రజలు తిరుగుబాటు చేశారు. ఈ యుద్ధంలో నానాసాహెబ్, తాంతియా తోపే, మహమ్మద్ షా, కుమార్ సింగ్,



1930లో మదరాసు నగరంలో ఉప్పు సత్యాగ్రహం గావిస్తున్న ప్రకాశం గారు, దేశోద్ధారక నాగేశ్వర రావు, దుర్గాబాయి తదితరులు

బేగంబాద్, ఝాన్సీలక్ష్మీబాయి మున్నగు వారు ప్రముఖ పాత్రవహించారు. ఈ పోరాటంలో రెండు లక్షల మంది భారత ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. తిరుగుబాటును క్రూరంగా అణచివేసింది. ఇది సిపాయి మ్యూటినీ కాదు, ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధమని ప్రసిద్ధి గాంచింది. వీరసావర్కార్ దీనిని గూర్చి ఒక ఉత్తమ గ్రంథం వ్రాశారు. First war of Independence' అని. తర్వాత బ్రిటీష్ ప్రభుత్వమే రాజ్యాధికారాన్ని స్వీకరిస్తున్నట్లు విక్టోరియా రాణి ప్రకటించింది.

ఉత్తర భారతంలో మనసిపాయిలు తిరుగుబాటు చేశారన్నవార్త విని, బళ్లారి ప్రాంతంలోని భీమారావు 1858 లో తిరుగు బాటు లేవదీశారు. హొస్పేట్ సమీపం లోని ఒక కోటను స్వాధీనం చేసుకుని బ్రిటీష్ సైనికులతో పోరాడాడు. ఆ పోరాటం లో [illegible] వందమంది మరణించారు. 70 [illegible] పట్టుకుని ఉరితీశారు. ఆ సాహస గాథ ఒక బుర్రకథ రూపంలో ప్రచారంలో వుంది.

పశ్చిమ గోదావరి ప్రాంత యర్న గూడెంవద్ద సుబ్బారెడ్డి మరో తిరుగుబాటును లేవదీశాడు. సుబ్బారెడ్డిని, అతని అనుచరులను 7గురిని బ్రిటీష్ సైనికులు ఖైదు చేసి తర్వాత ఉరితీసారు. కోయలకుంట్ల ప్రాంతంలో ఉయ్యాల వాడ నరసింహారెడ్డి అనుపాలెగాడు తన సైన్యంతో పోరాడి వాళ్లను ముప్పుతిప్పలు పెట్టాడు. తెల్లసైనికులు అతనిని అనుచరులను కాల్చివేశారు. ఈ పోరాటాలకు, సిపాయిల తిరుగుబాటుకు ఎంతవరకు సంబంధంవున్నదో చరిత్ర పరిశోధకులు లోతుగా పరిశీలించవలసి వుంది.

## వందేమాతరం ఉద్యమం

ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం తదుపరి, కొన్నాళ్లకు జాతీయ కాంగ్రెసు సంస్థ నిర్మాణమై, సభలు జరుపుకున్న రోజులవి. బ్రిటీష్ ప్రభుత్వం బెంగాలు - అస్సాములను విభజన చేయతలపెట్టింది. బెంగాలు విభజనకు వ్యతిరేకంగా బిపిన్ చంద్రపాల్ మొదలగువారు తీవ్రాందోళన సాగించారు. "స్వరాజ్యం నా జన్మహక్కు" అన్న లోకమాన్య బాలగంగాధర తిలక్ నినాదం స్వాతంత్ర్యోద్యమానికి జవసత్వం కలిగించింది. తిలక్ మహాశయుని ప్రభుత్వం మాండలే జైలులో నిర్బంధించింది. "పంజాబు కేసరి" లాలా లజపతిరాయ్‌కి ద్వీపాంతరవాస శిక్షవిధించింది. బాల్, లాల్, పాల్ నాయకత్వాన ఈ వందేమాతరం ఉద్యమం దేశ వ్యాప్తమైంది. ఈ ఉద్యమ ప్రభావం ఆంధ్ర దేశంపైన కూడా ప్రసరించింది. బిపిన్ చంద్రపాల్ సభలలో గావించిన ప్రసంగాలు ఆంధ్రలో గొప్పరాజకీయ చైతన్యం కలిగించాయి.

అప్పటివరకు మదరాసు రాష్ట్రంలో కలిసియున్న ఆంధ్రులు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర వాంఛను వెలిబుచ్చసాగారు. కళాశాలల్లో విద్యాబోధన, కోర్టులలో

న్యాయవిచారణ, శాసనసభల కార్య కలాపాలు మాతృభాషలో జరగాలనేదే భాషాప్రయుక్త రాష్ట్రంకోరేవారి ప్రధా నలక్షణంగా వుండేది. పాశ్చాత్య విద్యా సంపర్కంతో ఉన్నత విద్యనభ్యసించి వచ్చిన ఆంధ్రప్రముఖులు చేసిన సమాలో చనల పర్యవసానమే "ఆంధ్రమహాసభ" సంస్థాపన.

1907 లో సూరత్ కాంగ్రెసు మహాసభకు వెళ్లివచ్చిన ఆంధ్రనాయకు లలో జాతీయ కళాశాల స్థాపనోద్దేశం కలిగింది. ఫలితంగా కొ్పెల్ల హనుమంత రావు, డాక్టర్ పట్టాభి, ముట్నూరి కృష్ణారావుగార్ల ఆధ్వర్యంలో బందరులో నేషనల్ కాలేజి ఏర్పడింది ఆంధ్రపట్టణాల లో స్వదేశీవ్రత సందేశం బాగావ్యాపిం చింది. గుంటూరులో "దేశాభిమాని" బెజవాడలో "స్వరాజ్య", బందరులో నవయుగ, రాజమండ్రిలో "ఆంధ్రకేసరి" పత్రికలు వెలిసినవి. స్వదేశీ పరిశ్రమలు ఏర్పడినవి. ఈ "వందేమాతరం" ఉద్యమ ప్రభావంతో ఆంధ్రదేశంలో కలిగిన గొప్ప సంచలనాన్ని గురించి క్లుప్తంగా తెలుసు కుందాం:

రాజమండ్రిలో 1907 ఏప్రిల్ 19వ తేదీనుండి 24 వరకు బిపిన్ చంద్రపాల్ రాజమండ్రి వచ్చి, సభలలో ప్రసంగించారు. ఆయన దేశభక్తిని, స్వదేశీప్రాముఖ్యతను వివరించారు. యువకులు, విద్యార్థులు "బాలభారతి" సంఘాన్ని స్థాపించుకున్నారు. భోదనా భ్యాసన కళాశాల విద్యార్థులు గోదావరి నదిలో స్నానంచేసి, వందేమాతరం బ్యాడ్జీలు ధరించి ఊరేగింపు చేశారు. ఈ నేరానికి పిన్సిపాల్ హంటర్ 138 మంది విద్యార్థులను "డీబార్" చేశాడు. హరిసర్వో త్తమరావుకు ఎక్కడా ఉద్యోగం యివ్వ రాదని ఉత్తర్వు చేశాడు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఎడిటర్గ్గా బెజవాడ నుండి "స్వరాజ్య" పత్రికను నిర్వహిస్తుండేవారు. ఆయన రచనకు రాజద్రోహ నేరం మోపి 3 ఏండ్ల కఠిన శిక్షవిధించడం జరిగింది. ప్రింటరుగా వున్న బోడే నారాయణరావుకు 6 మాసాలు శిక్షవేశారు. సింగళి లక్ష్మీనారాయణ అరెస్టు కాకుండా తప్పించుకుని రహస్యంగా పాండిచ్చేరి వెళ్లి తర్వాత సన్యసించి 'నారాయణానంద' గా స్వరాజ్యసమరాల్లో పాల్గొని జైలు శిక్షలననుభవించారు.

కాకినాడలో 1907 మే 31వ తేదీన జిల్లా వైద్యాధికారిగా వున్న కెంపు దొర బజారున వెళ్తుండగా బాలురు "వందే మాతరం" అనునినాదాలు చేశారు. అతను కోపంతో కోసల్లెకృష్ణారావు అనే విద్యార్థిని తీవ్రంగా కొట్టాడు. కెంపు వైఖరి పురజనుల లో సంచలనం కలిగించింది. అతను దాగిన క్లబ్ మీద దాడిచేశారు. జిల్లా కలెక్టర్కు కూడా దెబ్బలు తగిలినవి ప్రజలు దౌర్జన్యం చేశారని పోలీసులు 50 మందిని అరెస్టుచేశారు. ప్రభుత్వం వారిపై కేసులు పెట్టి, విచారణ చేసి 13 మందికి శిక్షలు విధించింది.

## కలెపరం బాంబుకేసు

1909 లో తెనాలి సమీపానగల కంచెర్ల పాలెం వద్దొక బాంబు ప్రేలింది. చుక్కపల్లి రామయ్య, కోటంరాజు వెంకట్రామయ్య, లక్కరాజు బసవయ్య అను ముగ్గిరిని అరెస్టుచేసి పోలీసులు కేసుపెట్టారు. రామయ్యకు 10 ఏండ్లు శిక్ష పడింది. మిగితా యిద్దరికీ మూడేండ్ల చొప్పున శిక్షలు విధించారు. ముద్దాయిల ఇండ్లను సోదా చేయగా "సత్వర స్వరాజ్య సాధన" అను ధ్వన పత్రాలు దొరికినవి. వందేమాతరం ఉద్యమ కాలంలో బెంగాలు విప్లవకారులు వచ్చి, ఈ ప్రాంతంలో కూడా బాంబులు తయారు చేయడం నేర్పారు. ఈ సందర్భంలో గుంటూరు, బెజవాడ, బందరు, తెనాలి మున్నగు చోట్ల దేశాబిమానుల ఇండ్లు సోదా చేయడం జరిగింది.

## కోటప్పకొండ తిరునాళ్లలో

మహాశివ రాత్రినాడు కోటప్ప కొండ తిరుణాలలో ఒక ముఖ్యసంఘటన జరిగింది. రెడ్డి పాలెం రైతు చిన్నప్పరెడ్డి ప్రభను కట్టుకుని ఆ తిరుణాలకు వెళ్లాడు. ప్రభకు కట్టిన కోడెలు బెదిరి జనం మీద పడినవి. పోలీసులు తుపాకీతో కోడెను కాల్చారు. ఆ ఆవేశంలో జనం తిరగబడి "వందేమాతరం-మనదే రాజ్యం" అంటూ పోలీసులకు తగిన శాస్తి చేసారు. కేసుపెట్టి చిన్నప్పరెడ్డికి ఉరిశిక్షవేశారు. 11 మందికి 7 సంవత్సరాల చొప్పున కఠినశిక్షలు విధించారు. "సైరా చిన్నపరెడ్డి నీ పేరే బంగారు కడ్డీ" అనే పాటలు జిల్లాలో గ్రామీణులు జానపద గీతాలుగా పాడు కుంటూవుంటారు. ఆంధ్రలో "మండల మహాసభలు" ఈ ఉద్యమ కాలంలో బాగా వ్యాప్తిచెందాయి. ఇవన్నీ ఆంధ్రప్రజల్లో దేశభక్తినీ స్వాతంత్ర్య తృష్ణను రగిల్చి, స్వరాజ్య సమరాల్లో అగ్రశ్రేణిలో నిలిచి పోరాడేటట్లు చేశాయి. ఆంధ్రులలో స్వభాషాభిమానం పెరిగింది.

## హోమ్రూల్ ఆందోళన

1916లో దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షులైన అనీబీసెంట్ భారతీయులకు స్వపరిపాలన కావా అని "హోమ్రూల్" ఆందోళన ప్రారంభించారు. దేశంలో మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్దాస్ నాయకత్వాన "స్వరాజ్యపార్టీ" ఏర్పడింది. ఆంధ్రలో గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు. ఉన్నవ లక్ష్మినారాయణ ఆధ్వర్యాన ఒక

శాఖను స్థాపించారు. వివిధ పట్టణాలలో 53 ఉపశాఖలను నిర్మాణం చేశారు. వీరు రాజకీయ కరపత్రాలు ప్రచురించి, ప్రజలలో గొప్ప ప్రబోధం గావించారు.

ప్రథమ ప్రపంచ యుద్ధంలో ధన ధాన్య సైనిక సహాయం అందచేసిన భారత దేశానికి స్వపరిపాలన యివ్వనటువంటి బ్రిటిష్ ప్రభుత్వం పైన విద్యావంతులలో అసంతృప్తి హెచ్చు పెరిగింది. ఈ సందే సూతరం, ఈ హోమ్ రూల్ ఉద్యమ కాలంలోనే, ఆంధ్రదేశంలో గ్రంధాలయోద్యమం ప్రారంభమైంది. 1914 నుండి ఆంధ్ర మహాసభలతోపాటు, గ్రంథాలయ సభలు కూడా జరుగు తుండేవి. గ్రామ సీమలలో విజ్ఞాన వ్యాప్తికి, రాజకీయ చైతన్యం పెంపొందించడానికి యివి ఎంతగానో తోడ్పడినవి. వివిధ ప్రజోద్యమా లకు యివి పునాదిరాళ్లయినవి.

## సహాయ నిరాకరణోద్యమం

మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత 1918లో ప్రభుత్వం "మాంటేగు చమ్స్‌ఫర్డు" నివేదికను ప్రకటించింది. అందులో ముఖ్య అధికారాలన్నీ బ్రిటీష్ ప్రభుత్వ ప్రతినిధులైన ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్ల చేతుల్లోనే వుంచుకున్నారు. ఈ సంస్కరణలు "కొరమాలినవి" అని కాంగ్రెసు ఆంధ్రమహాసభ కూడా తీర్మానించింది. ఈ స్థితిలో తిలక్ పరమపదించడం, గాంధీజీ భారత రాజకీయ రంగంలో ప్రవేశించడం జరిగింది. మితవాద ప్రముఖుల సుతిమెత్తని రాజకీయాలు, విజ్ఞాపనలుగాని, టెర్రరిస్టుల సాహస 'కృత్యాలుగాని, స్వరాజ్య సాధనకు 'మార్గాలు కాజాలనని, గాంధీజీ గ్రహించారు. సాత్వికనిరోధం, శాంతియుత సత్యాగ్రహ పద్ధతి, సహాయనిరాకరణలను ఆయన



**1934లో బెజవాడలో నెహ్రూజీని ఆహ్వానిస్తున్న ప్రకాశం పంతులు, అయ్యదేవర కాళేశ్వర రావు, బులుసు సాంబమూర్తిగార్లు**

ప్రవేశపెట్టారు. అహింసాయుత ఆందోళనలో ఆత్మబలం కీలకమన్నారు. భారత రాజకీయాలలో నూతనఘట్టం ఆరంభమైంది. 1920లో ప్రభుత్వంతో సహాయ నిరాకరణకు ఆయన పిలుపు నిచ్చారు. రౌలట్ బిల్లు జలియన్‌వాలా బాగ్ హత్యలతో దేశం ఉడికెత్తి పోయింది. దేశమంతటా హర్తాళ్లు జరిగినవి. గాంధీజీ బార్డోలీలో పన్నుల నిరాకరణకు పూనుకున్నారు.

ఈ నాన్‌కో ఆపరేషన్ ఉద్యమంలో ఆంధ్రదేశం అద్వితీయ పాత్రను నిర్వహించింది. ఈసందర్భంలో పల్నాటి పుల్లరి సత్యాగ్రహం, పెదనందిపాడు పన్నుల నిరాకరణ, చీరాల-పేరాల ప్రజల శాసన ధిక్కారం మున్నగునవి సహాయ నిరాకరణ ఉద్యమంలోని సువర్ణ ఘట్టాలు. పల్నాడు తాలూకాలోని 30 గ్రామాల వారు పుల్లరి నిరాకరించారు. ప్రభుత్వం మిలటరీని పంపింది. మించాలపాడు వాస్తవ్యుడు రైతు పెద్ద కన్నెగంటి హనుమంతును కాల్చి చంపారు. మాచెర్లలో వున్నవ లక్ష్మీనారా యణను, మాడభూషి నరసింహాచారిని అరెస్టు చేశారు. అందుకు నిరసన తెల్పుతూ గుంటూరులో బ్రహ్మాండమైన "హర్తాళ్" జరిగింది.

బాపట్ల తాలూకాలో పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం, పర్వతనేని వీరయ్య చౌదరి నాయకత్వాన సాగింది. ఆ ప్రాంత గ్రామోద్యోగులంతా ఒక్కుమ్మడిగ రాజీనామాలు చేశారు. ప్రభుత్వ పనులన్నీ స్తంభించి పోయినవి. చీరాల-పేరాల ప్రజలు, రేట్‌పేయర్లు మునిసిపాలిటీ పన్నులు చెల్లించ తిరస్కరించారు. అరెస్టులకు గురి అయినారు. పూరివెలుపల పూరిపాకలు నిర్మించుకొని దానికి రామ్‌నగర్ అని నామకరణం చేసుకున్నారు. "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఆధ్వర్యాన, ఈ మహోద్యమం జరిగింది. ఆ 11 మాసాలు, ప్రజలు ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోగల్గారు. ఈ సంఘటనలు

బ్రిటీష్ పార్లమెంటులో ప్రస్తావించబడినవి. "గుంటూరు జిల్లాలో జరిగిన పన్నుల నిరాకరణోద్యమం బ్రిటీష్ ప్రభుత్వ పునాదులనే కదిల్చి వేసినది" అని అప్పటి గవర్నర్ వాపోయాడు. బెజవాడలో అఖిల భారతకాంగ్రెస్ కమిటీ సమావేశం జరగడం గాంధీమహాత్ముని పర్యటన ఈ సంచలనానికి దోహదమిచ్చింది. "దేశభక్త" కొండ వెంకటప్పయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, నడింపల్లి నర్సింహరావు మున్నగు ఉద్యమ నాయకులను అరెస్టు చేసినప్పుడు ప్రజలు గొప్ప నిరసన ప్రదర్శనలు జరిపారు. గ్రామీణ రైతాంగ సమస్యలను మునిసిపల్ రేట్ పేయర్ల సమస్యలను జోడించి స్వరాజ్య ఉద్యమాన్ని ఆంధ్రదేశంలో నిర్వహించి నట్లు చరిత్రపుటలు తిలకిస్తే తేట తెల్లమవుతుంది. దీనితో అంతవరకు కొలది మంది మేధావులకు, విద్యావంతులకు మాత్రమే పరిమితమైన రాజకీయోద్యమంలో, మధ్యతరగతి వర్గాలవారికి, రైతులకు ప్రాముఖ్యత కలిగినట్లయింది ఇది రాజకీయ రంగంలో వచ్చిన గణనీయమైన పరిణామం.

"ఈ నాన్ కోఆపరేషన్ ఉద్యమంలో 1921 జూన్ ఆఖరు వరకు ఆంధ్రదేశంలో 103 మంది లాయర్లు న్యాయవాద వృత్తిని విసర్జించారు. 44 మంది ప్రభుత్వోద్యోగులు, 17 మంది ఉపాధ్యాయులు తమ ఉద్యోగాలకు రాజీనామా చేశారు."

"ఇక కాంగ్రెసు నిర్మాణం సంగతి చూస్తే, 2204 గ్రామ కాంగ్రెసు కమిటీలు ఏర్పాడ్డాయి. 77,938 మంది కాంగ్రెసు సంఘ సభ్యులుగా చేరిపనిచేస్తున్నారు. 44,092 మందిచే రాట్నాలు పనిచేస్తున్నాయి. తిలక్ స్వరాజ్యనిధికి రూ. 48,123లు వసూలైనవి. 31 చోట్ల పంచాయితీ కోర్టులు ఏర్పడ్డాయి. 111 గ్రామాల్లో ప్రజలు పూర్తిగా మద్యపానం మానివేశారు. 176 మంది నేతనాల మీద కార్యకర్తలు 292 మంది గౌరవ కార్యకర్తలు పూర్తికాలం కాంగ్రెసు ప్రచారం చేస్తున్నారు." అని అప్పటి ఆంధ్ర కాంగ్రెసు సంఘ నివేదికలో పేర్కొన్నారు. దానిని బట్టి అప్పటి కాంగ్రెసు నిర్మాణాన్ని, కార్యకర్తల సేవలను తెలుసుకోవచ్చును.

## మన్య విప్లవం–సీతారామరాజు

ఈ సహాయ నిరాకరణోద్యమం వల్ల ప్రభావితుడైన శ్రీ అల్లూరి కోయ ప్రజలను సంఘటిత పరిచాడు. రెండేళ్ళు ఏజెన్సీ ప్రాంతంలో బ్రిటీష్ ప్రభుత్వానికి ఎదురొడ్డి నిలిచి, సింహ స్వప్నమైనారు. కోయప్రజల దుర్భర దారిద్ర్య పరిస్థితులు, ప్రభుత్వోద్యోగుల దమన నీతి వారిని సాహసకార్యాలకు పురిగొల్పింది. ముందుగా చెప్పి పంపి, పోలీసు స్టేషన్లను కొల్లగొట్టారు. చివరకు 1924 మేలో సీతారామరాజు బలిదానంతో మన్యం ప్రజలు తిరుగుబాటు క్రూరంగా అణచి వేయబడింది. గంటం దొర పోరాడుతూ నేలకొరిగాడు. మల్లుదొరకు పదేండ్లు ద్వీపాంతర వాసం శిక్ష విధించబడింది. అనేక మంది అరెస్టులకు, నిర్బంధాలకు గురిఅయినారు. ఈ పోరాటం జరిగింది 2 ఏండ్లయినా, ఆ వీరోచిత విప్లవ గాథలు ఆంధ్ర యువకులను ఎంతగానో ఉత్సాహ పరిచినవి. సీతారామరాజు అనుసరించిన విప్లవ పోరాటపద్ధతులతో ఏకీభవించక పోయినప్పటికి గాంధీ మహాత్ముడు "సీతారామరాజు ప్రదర్శించిన అకుంఠిత సాహసం, త్యాగదీక్ష, ఏకాగ్రత ఉత్తమశీల సంపద ఎల్లరకు ఆదర్శప్రాయమైనది." అని అభినందించారు, మన స్వాతంత్ర్యోద్యమంలో అదొక చిరస్మరణీయ ఘట్టం.

## ఉప్పు సత్యాగ్రహోద్యమం

భారతదేశంలో ఏ విధమైన రాజ్యాంగ సవరణలు ప్రవేశపెట్టాలో తెలుసుకునేందుకు బ్రిటీష్ ప్రభుత్వం 1928లో "సైమన్ కమీషన్"ను పంపింది. ఇందులో అందరు తెల్లదొరలు మాత్రమే సభ్యులు. కాంగ్రెసు సంస్థ సైమన్ కమీషన్‌ను బహిష్కరించాలని నిర్ణయించింది. ఒక్కసారి ప్రజల స్వాతంత్రేచ్ఛ వెల్లువికింది. కమీషన్ రాకకు ఎక్కడ చూచినా నల్లజండాలే ఎదురైనవి. "గోబాక్ సైమన్" అను నినాదాలు మార్మోగినవి లాహోరులో లాలాలజపతిరాయ్‌ని పోలీసులు లాఠీచార్జి చేసి తర్వాత ఆయన మోరమరణానికి కారణమైనారు. మదరాసు నగరంలో బాయ్‌కాట్ చేస్తున్న ప్రదర్శకు లపై కాల్పులు చేయగా ఒకరు మరణించారు. ఆ దేశభక్తుని శవాన్ని కూడా చూడ నివ్వలేదు. ప్రకాశం కాల్చుమని రొమ్ము నిచ్చి ముందుకు నడచి "ఆంధ్ర కేసరి" గా ప్రసిద్ధిగాంచారు.

గుండె దెబ్బకు జంకబోరన్నా!
చొక్కాను చింపి, గుండెదానికి
పందె మిడుసున్నా! అనే పాట ఆనాటి నుండీ సత్యాగ్రహులను ఉత్సాహ పరుస్తూవచ్చింది. ఇదేకాలంలో సామ్యవాద ప్రచారం చేస్తున్నా రనే కుట్ర నేరం మోపి, విప్లవ కారులను అరెస్టు చేశారు. ఈ మీరట్ కుట్ర కేసు గొప్ప సంచలనం కలిగించింది. ముద్దాయిల వాజ్ఞ్మూలాలు భారతజాతీయోద్యమ కార్మిక కర్షకోద్యమ చరిత్రలుగా తయారైనవి. వారందరికీ దీర్ఘకాలిక శిక్షలు విధించారు.

ఈ సందర్భంలో మరొక ముఖ్య

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులతో 'ఆంధ్ర కేసరి'. కళా వెంకట్రావు, వి.వి.గిరి, కడప కోటి రెడ్డి, నీలం సంజీవరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి మున్నగువారు

విషయం గమనించదగినది. సైమన్ కమిషన్ ముందు వినతి పత్రాలు సమర్పించిన ఒరిస్సా వారికి ప్రత్యేక రాష్ట్రం వచ్చింది. ఆంధ్రనాయకులు ముందు స్వరాజ్యానికే ప్రాధాన్యం యిచ్చి సైమన్ కమిషన్‌ను బహిష్కరించారు. స్వరాజ్య సాధనంలో పాల్గొన్నారు. 1929 సం॥ లో ప్రభుత్వం ఆంధ్ర దేశంలో రీ సెటిల్మెంటును ప్రవేశ పెట్టి, పన్నులను ఎక్కువ చేయతలపెట్టింది. గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాల రైతాంగం రీ సెటిల్మెంటుకు వ్యతిరేకంగా తీవ్రాందోళన గావించి, అరెస్టులకు గురిఅయినారు. వెంకటగిరి జమీలో కంచె పుల్లరి, చెరువు మెరసుత్తులకై పెద్ద ప్రచారం జరిగింది. ఇవన్నీ ఆంధ్రరైతు ఉద్యమానికి తర్వాత పునాదులైనవి.

జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన, 1929లో లాహోరు కాంగ్రెసు మహాసభ సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించింది. ఆంధ్రప్రాంతమంతటా ఖాదీ స్వాతంత్ర్య దినోత్సవాలు జరిగాయి. గాంధీజీ 79 మంది సహచరులతో సబర్మతీ ఆశ్రమం నుండి, దండియాత్ర సాగించారు. శాసనోల్లంఘనం చేసి ఉప్పు తయారు చేశారు. ఈ చరిత్రాత్మకమైన ఉప్పు సత్యాగ్రహంలో ఆంధ్రదేశం ముందంజ వేసింది. ఎక్కడలా ఖాదీ ప్రతిష్ఠాపనలు, విదేశ వస్త్ర, వస్తు బహిష్కరణలు ఉప్పు కొఠార్ల పైకి దాడులు, స్వచ్ఛంద సేవకుల ఊరేగింపులు, ప్రభుత్వం అరెస్టులు, లాఠీ చార్జీలు కాల్పులు చేసి ఉద్యమాన్ని అణచ చూసింది. కాని సత్యాగ్రహుల సంఖ్య నానాటికీ హెచ్చుతూ వచ్చింది. దేశభక్తులైన మహిళలు రణరంగంలో దూకారు. కవుల కలాలు దేశభక్తిని రగుల్కొల్పినవి. "మా కొద్దీ తెల్లదొరతనము, మా ప్రాణాలపై పొంచి మానాలు హరియించె, అనీ పద్దురా మనకొద్దురా, పరపాలనంబిక వద్దురా! వద్దూ వద్దూ లేని పన్నులు దుద్ది పిల్చుచునుండెరా"–అను గీతాలు వ్రాసిన కవులందరినీ అరెస్టు చేశారు. వీరగంధము తెచ్చినారము! వీరులెవ్వరో తెల్పుడీ, అని మహిళా సత్యాగ్రహులు పాటలు పాడుతూ వస్తూ వుంటే, ఉత్సాహోద్రేకంతో పల్లె ప్రజలు కూడా సత్యాగ్రహంలో దూకేవారు.

కాకినాడ, బందరు, చిన్నాపురం, దేవరంపాడు, కనపర్తి, పల్లిపాడు, నౌపడ మొదలగు సముద్ర రేవులు ముఖ్య సత్యాగ్రహ కేంద్రాలైనవి. ఉప్పు తయారుచేసి, పట్టణాలకు తెచ్చి అమ్ముతుంటే ఒక్క ఉప్పు పొట్లం వేల రూపాయిలు యిచ్చి కొన్న వారున్నారు. దేశారాధకులైన బులుసు సాంబమూర్తి, డా॥ బ్రహ్మజ్యోశ్యుల సుబ్రమణ్యం ఖాసాసుబ్బారావు, మొదలైన వారిపైన దురహంకారులైన పోలీసుబలగాలు అనేక దుండగాలు జరిపారు. కేసులు పెట్టి కఠిన శిక్షలు విధించారు. గ్రామాలపైన అపరాధపు పన్నులు వేశారు. కాంగ్రెస్ సంస్థలను అక్రమ సంఘాలుగా నిషేధించారు. కాంగ్రెస్ కార్యాలయాలను వశపరుచుకున్నారు. గుడివాడ ఏలూరు మొదలగు చోట్ల తుపాకులు పేల్చారు. గుంటూరు బందరు, రాజమండ్రి, అంగలూరు, తెనాలి, బెజవాడలలో లాఠీ చార్జీలు చేశారు. మహిళా సత్యాగ్రహులపైన పిచికారులతో రంగు నీళ్ళు చల్లి, నిర్మానుష్య ప్రదేశాలలో వారిని వదిలి పెట్టేవారు. ఈ విధంగా ఉద్యమాన్ని అణచివేయడానికి చేయరాని అకృత్యాలన్నీ చేశారు. అయినా సత్యాగ్రహులు శాంతిని విడనాడలేదు. సత్య అహింసలను పాటించారు. క్రమశిక్షణతో మెలిగారు. అపూర్వ త్యాగాలు చేశారు. జాతీయోద్యమంలో పాల్గొన్న ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క వీరోచిత చరిత్ర వుంది.

ఆంధ్రపత్రిక కృష్ణాపత్రిక, వాటి సంపాదకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరావు, ముట్నూరి కృష్ణారావు స్వాతంత్ర్యోద్యమ వ్యాప్తికి తమ రచనల ద్వారా ఎంతగానో దోహదమిచ్చారు. విప్లవ నాయకులు సర్దార్ భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవులకు ఉరిశిక్షలు వేసినప్పుడు యువతరం తీవ్ర నిరసనలు తెల్పింది. విప్లవ కారుల త్యాగం, దేశభక్తి నిరుపమానమైనది. యువకులను, విద్యార్థులను ఉత్తేజపరిచింది.

ఆంధ్రలో 1930 లో మూడు వేలమంది పైగా సత్యాగ్రహులు జైలు శిక్షలకు గురి అయినారు. 1930-32 లో గుంటూరు జిల్లాలో 191 మంది, కృష్ణాలో 112 మంది, పశ్చిమ గోదావరిలో 92 మంది, తూర్పు గోదావరిలో 35 మంది, నెల్లూరు జిల్లాలో 36 మంది, విశాఖలో 19 మంది గంజాం జిల్లాలో 14 మంది, అనంతపురం జిల్లాలో 14 మంది దీర్ఘకాలజైలు శిక్షలు అనుభ వించారు. వందలాది మంది సబ్ జైళ్లలో మగ్గి లాఠీచార్జీలకు గురిఅయిన వారున్నారు.

దేశం మొత్తం పైన 1930 ఉప్పు సత్యాగ్రహ ఘట్టంలో 200 మంది వలంటీర్లు తనువుల నర్పించారు. 80 వేల మంది అరెస్టు అయినారు. 1932 లో మొదటి 6 మాసాలలో ఒక లక్షా, 50 వేల మంది దేశభక్తులు అరెస్టు అయినారు. లక్షలాది మంది లాఠీచార్జీలకు గురి అయినారు. వేలాది గ్రామాలపైన ప్రభుత్వం సమిష్టి జరిమానాలు విధించింది. గద్దర్ పార్టీ విప్లవ కార్యాకలాపాల్లో పాలు పంచుకున్న దరిశి చెంచయ్య, భగత్సింగ్‌తో పాటు, లాహోరు కుట్ర కేసు ఖైదీగా విప్లవ కారుడైన విజయ కుమారు సిన్హా కాకినాడ బాంబు కేసులో ద్వీపాంతరవాస శిక్షననుభవించిన ప్రతివాది భయంకరచారి మున్నగు వారు ఆంధ్రులు కావడం, మనకు గర్వకారణమైన విషయం. అయితే, ఆంధ్రదేశం శాంతి యుత సత్యాగ్రహ శాసనోల్లంఘనోద్యమాలకు స్పందించిన విధంగా, ఈ జాతీయ విప్లవ కారుల సాహసచర్యలకు అదంతగా స్పందించినట్లు కనిపించదు.

జాతీయ స్వాతంత్ర్యోద్యమ తొలి రోజుల్లో మన రాజకీయ, సాంఘిక పరిణామాల మీద తిలక్, గాంధీజీల ప్రభావం ఎలా పనిచేసిందో అలానే పాశ్చాత్య దేశాల్లో వచ్చిన సోషలిస్టు, నూతన ప్రజాస్వామిక విప్లవసిద్ధాంతాల ప్రభావం, ఆంధ్రనవ సమాజం మీద ప్రసరించి, 1935 దరిమిలా యువజనావళిలో సామ్యవాద భావాలు వ్యాప్తి చెందాయి. గంగా ప్రవాహంగా, ఇవన్నీ త్రివేణీ సంగమంగా స్వాతంత్ర్య సంగ్రామ ప్రవంతిలో కలసి జాతీయ మహోద్యమంగా రూపుదిద్దు కున్నాయి. కడకు విజయాన్ని సాధించాయి.

గాంధీజీ ప్రతి పదేండ్లకు సత్యాగ్రహోద్యమాలు నడుమ్పుతూ మధ్యకాలాల్లో అస్పృశ్యతా నివారణ, హరిజనోద్ధరణ, సర్వమత సామరస్యం, హిందూ-ముస్లిం ఐక్యత, హిందీ, ఖద్దరు, స్వదేశీ మొదలగు నిర్మాణ కార్యక్రమాలకు అత్యంత ప్రాధాన్యత నిచ్చారు. సత్యాగ్రహ ఆశ్రమాలను స్థాపించి, త్యాగశీలురైన దేశ సేవకుల బృందాన్ని తయారుచేశారు. దరిద్రనారాయణుల సేవకు అంకితం అయినారు. గాంధేయ నిర్మాణ కార్యక్రమాలన్నిటిని ఆంధ్రదేశం త్రికరణ శుద్ధిగా అమలు జరిపి, యితరులకు మార్గదర్శకమైంది.

ప్రభాకర్ జీ, సాధు సుబ్రహ్మణ్యం, ఉమ్మెత్తల కేశవరావు, వంటి సర్వోదయ నాయకులు, పుచ్చలపల్లి సుందరయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, కంభంపాటి సత్యనారాయణ, రావి నారాయణ రెడ్డి వంటి సోషలిస్టులు, కమ్యూనిస్టులు, గరిమెళ్ల సత్యనారాయణ, దామరాజు పుండరీకాక్షుడు. గరికెపాటి మల్లావధాని దాశరథి. కాళోజి వంటి కవిశేఖరులు. ముద్దూరి అన్నపూర్ణయ్య, ముద్దుకూరి చంద్రశేఖర్ రావు. క్రొవ్విడి లింగరాజు వంటి పత్రికా సంపాదకులు. తొలుత జాతీయ స్వాతంత్ర్యోద్యమం నుండే ఉద్యమ కాలాల్లో ఎట్టి కుల, మత, ప్రాంతీయ తత్వాలకు తావివ్వలేదు. జాతీయ సమైక్యతా భావంతో కృషిచేశారు. భారత జాతీయ సంస్కృతీ పరిరక్షణకు, సాంస్కృతిక పునరుజ్జీవనానికి పాటుపడ్డారు.

## క్విట్ ఇండియా ఉద్యమం

యుద్ధరేంగే
సిద్ధమరేంగే!
షురూహువాహైజంగ్ హమారా
చలావోలాఠీ చలావో జండా
ఉడాయేంగేహమ్ అపనాజండా! షురూ!
యుద్ధకరేంగే సిద్ధమరేంగే
నరనారీయుత్ సాత్ హమారా! షురూ!

హరీంద్రనాథ్ చటోపాధ్యాయ

1939 సంవత్సరంలో ద్వితీయ ప్రపంచయుద్ధం వచ్చింది. ప్రజా ప్రతినిధుల సమ్మతి లేకుండా భారత దేశాన్ని యుద్ధంలోకి దించరాదని కాంగ్రెస్ సంస్థ కోరింది. ఇందుకు బ్రిటిష్ ప్రభుత్వం తిరస్కరించింది. ప్రభుత్వ వైఖరికి నిరసనగా రాష్ట్రాల్లోని కాంగ్రెస్ మంత్రిత్వాలు రాజీనామా చేశాయి. 1940 అక్టోబర్‌లో గాంధీజీ వ్యష్టి సత్యాగ్రహం ప్రారంభించారు. వినోబాభావే ప్రథమ సత్యాగ్రహి. వేలాది మంది సత్యాగ్రహంలో

ప్రొల్గొని అరెస్టు అయినారు. "యుద్ధానికి సహాయం చేయ వద్దు"- "యుద్ధనిధులు యివ్వద్దు" అని నినాదాలు చేస్తూ సత్యాగ్రహులు పాద యాత్రలు చేశారు. కాంగ్రెసు నాయకులతో సర్ స్టాఫర్డ్ క్రిప్సు జరిపిన రాయభారాలు, సంప్రదింపులు విఫలమైనాయి. 1942 ఆగష్టు 7, 8 తేదీలలో బొంబాయిలో కాంగ్రెసు ఎ.ఐ.సి.సి. మహాసభ జరిగింది. "క్విట్ ఇండియా" (భారతదేశాన్ని వదిలిపొండి) అనే తీర్మానం ఆమోదించింది.

"Here is a Mantra, a short one That I give to you
The Mantra is'Do or Die'
We shall either free India or die in the attempt. అని మహాసభలో గాంధీజీ శంఖారావం చేశారు.

ఈ చరిత్రాత్మకమైన క్విట్ ఇండియా తీర్మానాన్ని మహాసభ ఆమోదించగానే 9వ తేది తెల్లవారేసరికి, కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులను, నాయకులను ప్రభుత్వం అరెస్టు చేసి, జైలులో నిర్బంధించింది. ఈ వార్త దావానలం వలె దేశమంతటా వ్యాపించింది. ఎక్కడి వారక్కడ తమకు తోచిన విధంగా అంతిమ స్వరాజ్య సమరానికి పూనుకున్నారు. ప్రభుత్వం కాంగ్రెస్ సంస్థను నిషేధించింది. కాంగ్రెసు కార్యాలయాలను స్వాధీనం చేసుకుంది. ఈ ఆగష్టు విప్లవంలో భారత ప్రజలు ప్రదర్శించిన పోరాటదీక్షత్యాగ నిరతి, ధైర్య సాహసాలు స్వాతంత్ర్య ప్రియు లందరిచేత శ్లాఘించబడ్డాయి. నానాపాటిల్ ప్రభృతుల నాయకత్వాన సతారా ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వానికి పోటీగా పంచాయితీ రాజ్యాన్ని స్థాపించిన ఉదంతం ప్రజలను ఉత్తేజపరిచింది.

ఆంధ్రదేశంలో జరిగిన క్విట్ ఇండియా ఉద్యమం ఏ ప్రాంతానికీ తీసిపోదు. తెనాలి గుంటూరు, చీరాలలో పోలీసులకు, ప్రజలకు మధ్య జరిగిన భీకరపోరాటం, యావద్భారత ప్రజలను ఆశ్చర్యచకితులను చేసింది.

ఉద్యమ ప్రారంభ దినాల్లోనే ప్రకాశం, పట్టాభి, వి.వి. గిరి, సంజీవరెడ్డి, ఆచార్యరంగా, మొదలగు రాష్ట్రకాంగ్రెస్ నాయకులందరినీ ప్రభుత్వం ముందుగానే అరెస్టు చేసి బంధించింది. కొందరు ఎట్లాగో అజ్ఞాత వాసంలో వుండి ఉద్యమాన్ని సాగించారు. విద్యార్థులు, యువకులు ముందంజ వేశారు. నాయకుల అరెస్టులకు నిరసనగా పట్టణాల్లో హర్తాళ్లు జరిగాయి. ఇందులో తెనాలి, గుంటూరు, చీరాలలో జరిగిన పోరాటాలు ప్రత్యేకంగా పేర్కొనదగినవి.

తెనాలి: ఆగస్టు 11వ తేదీన కల్లూరి చంద్రమౌళి, శరణు రామస్వామి, మోటుపల్లి బాబూరావు, భావయ్య చౌదరి, ఇస్మాయిల్, రావి సత్యనారాయణ మొదలగు నాయకులను అరెస్టు చేశారు. పట్టణంలో 'హర్తాళ్' జరిగింది. 12వ తేదీ తెనాలి పట్టణం పెద్ద రణరంగ మైంది. ఒకవైపు పోలీసు బలగాలు, మరొకవైపు వేలాది జన సమూహం ఎదురుమల్లి నిలిచి, భీకర పోరాటం సాగించారు. రైలు పెట్టెలకు నిప్పంటించారు. టెలిఫోన్ తీగెలను తెంచివేశారు. పోలీసుల కాల్పులకు మాజేటి సుబ్బారావు, శ్రీగిరి లింగం, భాస్కరుని లక్ష్మీనారాయణ తమ్మినేని సుబ్బారెడ్డి, ప్రయాగ రాఘవయ్య, గాలి రామకోటయ్య, జాస్తి అప్పయ్య బలి అయినారు. 11 మందికి గాయాలు తగిలి పడిపోయినారు. అనేక మందిని అరెస్టు చేశారు. ఆ పోరాట ప్రాంతానికి ప్రజలు 'రణరంగచౌక్' అని నామకరణం చేశారు. మృతవీరుల స్మారకచిహ్నంగా అక్కడ స్థూపాలు నిర్మించుకున్నారు. ఆ సాయంత్రమే జంపాల సాంబశివరావు నాయకత్వాన కార్యకర్తలు దుగ్గిరాల రైల్వే స్టేషన్‌ను దగ్ధం చేశారు. 'మదరాసు-విజయవాడల మధ్య రైళ్ల రాకపోకల బందైనాయి.

13వ తేదీన గుంటూరులో స్వరాజ్య పార్కునుండి వేలాదిమంది, నాయకుల అరెస్టుకు నిరసన ప్రదర్శనలు జరుపుతుండగా, పోలీసులు కాల్పులు చేశారు. తుపాకీ కాల్పులకు ఇరువురు వీరమరణం చెందారు. వారం రోజులు పట్టణంలో విద్యార్థులు సమ్మె చేశారు.

చీరాలలో పోలీసులు కాల్పులు చేయగా యిద్దరు నేలకొరిగారు. పలువురికి గాయాలైనవి. 17వ తేదిన పాలకొల్లులో పోలీసు క్వార్టర్సును పడగొట్టారు. రిజర్వు దళం చేసిన కాల్పులలో ఒకరు మరణించారు. తాలూకా ఆఫీసును, మేజిస్ట్రేట్ కోర్టును ప్రజలు మూసివేయించారు.

17వ తేదీన భీమవరంలో ప్రజలు రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు చేత రాజీనామా చేయించారు. కాంగ్రెస్ జెండాను చేతికిచ్చి, ఊరేగింపులో నడిపించారు. రైల్వేస్టేషన్ వద్ద పోలీసులు జరిపిన కాల్పులలో ముగ్గురు మరణించారు. 5గురు గాయపడ్డారు. దెందులూరులో రోషావేశ ప్రజలు రైల్వే స్టేషన్‌కు నిప్పంటించి దగ్ధంచేశారు. ఆకివీడు రైల్వేస్టేషన్‌ను తగులపెట్టారు. గ్రామోద్యోగుల రికార్డులను ధ్వంస్వం చేశారు. జనం చిలుమూరు రైల్వే స్టేషన్ తగుల పెట్టారు. చెరుకుపల్లి సబ్ రిజిస్ట్రారు కార్యాలయాన్ని దగ్ధం చేశారు.

తెనాలి, చీరాల, బోడిపాలెం, నిడుబ్రోలు, అప్పికట్ల. పొన్నూరు, అమ్మనబ్రోలు, ఒంగోలు, మండవపాలెం,

మున్నగు అనేక గ్రామాలపైన ప్రభుత్వం సామూహిక జరిమా నాలు విధించింది.

జగ్గయ్యపేట సభలో జిల్లా అధికార్లపైన చేతి బాంబులు విసిరి గాయపరిచారు. ఆ సందర్భంలో 9 మందిని అరెస్టు చేసి, [illegible] శిక్షలు విధించారు. కౌతరం, [illegible], [illegible]వరం, నందివాడ, గుడివాడ, [illegible], కొణకంచి మొదలైన అనేక గ్రామా[illegible] ప్రభుత్వం సామూహిక జరిమానాలు [illegible]. ఈ విధంగానే యానదాంధ్ర దేశంలో [illegible]ల్లకు ఈ ఉద్యమం వ్యాపించింది. ప్రభుత్వ భవనాలపైన కాంగ్రెస్ పతాకాలను ఎగురవేశారు. రైలు పట్టాలు పీకివేశారు. తంతి తపాలాలకు అంతరాయం కలిగించారు. సైన్యంలో చేరకుండా పికెటింగులు చేశారు.

'ఆంధ్రాసర్క్యులర్' రహస్యంగా వివిధ ప్రాంతాలకు చేరి కాంగ్రెస్ వలంటీర్లకు మార్గదర్శకమైంది.

"వద్దురా మనకొద్దురా"

పరవాలనంబిక వద్దురా!" అను పాటలు పాడుకుంటూ, ఉత్సాహావేశంతో విద్యార్థులు యువకులు ఈ క్విట్ ఇండియా ఉద్యమాన్ని సాగించారు. రహస్య ఉద్యమాన్ని సాగించండి. అనే సైక్లొస్టైల్ కరపత్రాలను పంచారు.

1940 వ్యక్తి సత్యాగ్రహంలో అరెస్టులు–జరిమానాలు.

"ఆంధ్రదేశంలో 882 మంది సత్యాగ్రహులు అరెస్టు అయినారు. రూ. 76,533 లు జరిమాన విధించబడింది. దేశం మొత్తం మీద 4749 మంది అరెస్టు అయినారు. రూ. 2,09,663 లు జరిమానాలు విధించబడినవి. (ఇందులో పంజాబ్ రాష్ట్రానివి చేరలేదు.)"

## ఆంధ్రలో 'క్విట్ ఇండియా' ఉద్యమం అరెస్టులు

"ఆంధ్రదేశంలో 21 ప్రదేశాలలో పోలీసు కాల్పులు జరిగినవి. 39 మంది మరణించారు. (భారతదేశం మొత్తం మీద 68 చోట్ల కాల్పులు జరిగినవి. [illegible]7 మంది మరణించారు.) 5 పోలీస్ స్టేషన్లు ధ్వంసమైనాయి. 17 చోట్ల బాంబులు ప్రేలినవి. ఒక ఇరిగేషన్ సిస్టంకు, 41 విద్యుత్ సరఫరా యంత్రాలకు నష్టం వాటిల్లింది. 232 చోట్ల రోడ్లకు నష్టం కలిగింది. ప్రభుత్వం యిద్దరికి మరణ శిక్ష విధించింది. 285 మందికి కొరడా దెబ్బలు తగిలినవి. 5,729 మంది అరెస్టు చేయబడినారు".

"ఆంధ్రదేశంలో 21 చోట్ల పోలీసులు కాల్పులు చేశారు. ఆ కాల్పులలో 39 మంది మరణించారు. ఉద్యమకారులు 5చోట్ల పోలీసు స్టేషనులను ధ్వంసం చేయడం జరిగింది. 17 చోట్ల బాంబులు పేల్చారు.

ఈ క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో, ఇద్దరికి మరణశిక్షలు పడ్డాయి. 285 మంది కొరడా దెబ్బలు తిన్నారు. 5729 మందిని అరెస్టు చేశారు. 897 మందికి క్రిమినల్ కోర్టుల్లో శిక్షలు విధించారు."

(ప్రొఫెసర్ సరోజినీ రేగాని గ్రంథం నుండి)

"1942 ఆగస్టు ఉద్యమంలో ఆంధ్ర జిల్లాలు అన్నింటిలోను గుంటూరు జిల్లా తుఫాను చెలరేగిన ప్రధానకేంద్రంగా వుంది" అని రాష్ట్ర ప్రభుత్వాధికారి ప్రకటించారు.

ఆంధ్ర జాతీయ విద్యార్థి, యువజన సంఘాలను ప్రభుత్వం నిషేధించింది. మాదు నూరు కేంద్రంలో కాంగ్రెస్ రహస్య కర పత్రాలు, బులిటెనులు అచ్చు అవుతుండేవి. కళా వెంకటరావు తాను అరెస్టు అయ్యే ముందుగా, రోటరీ మిషన్‌ను అన్నె అంజయ్యకు పంపించారు. అక్కడ 'జై భారత్' రహస్య పత్రిక అచ్చు అయ్యేది. రామకుమార్ వర్మ ఎస్.వి.ఎస్. ప్రసాదరావు, మైనేని రామకోటయ్య, ఒంగోలు ప్రాంత యువకులు చీమకుర్తి శేషగిరిరావు, ముదిలి సత్యనారాయణ, వేమూరి వెంకట సుబ్బయ్య, బాంబులు తయారు చేయ ప్రయత్ని[illegible] ప్రేలి వారికే గాయాలైనవి.

ఈ వి[illegible]గానే, మదరాసు కు[illegible] కేసులో నిందితులైన ఆంధ్ర యువకులు రమేష్‌చౌదరి, [illegible] జగన్నాథం, తిరుమల రామచంద్ర ప్రభుతలపై పెట్టిన కేసులో ప్రకాశం గారు కోర్టులో వాదించి వారి విడుదలకు తోడ్పడ్డారు.

భూపతి కలాపాల సూర్య ప్రకాశరావు, వి.ఎల్. సుందరరావు, చీమకుర్తి శేషగిరిరావు, పన్నవనేని వెంకట్రావు. చక్రధర్ మొదలగు యువక నాయకులు రహస్యంగా వుండి ఉద్యమం కొనసాగించడానికి కృషి చేశారు.

దేశంలో జరిగిన హింసాపూరిత అల్లర్లకు 'మీరే బాధ్యులని' ప్రభుత్వం కాంగ్రెసుపై ఆరోపించింది. మీ సామ్రాజ్య ప్రభుత్వ దుశ్చర్యలే యిందుకు కారణం అని గాంధీజీ వైస్రాయికి సమాధానం వ్రాశారు.

కనివినీ ఎరుగని రీతిలో, స్త్రీ పురుషులు కులమత వర్ణ విచక్షణ లేకుండా ప్రజలు ముఖ్యంగా విద్యార్థులు, యువకులు విజృంభించి, ఆ రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించారు. ప్రభుత్వం కూరనిర్బంధాలతో ఆ మహోద్యమాన్ని తాత్కాలికంగా అదుపు చేసినప్పటికీ 1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వరాజ్యం యిచ్చివైదొలగకతప్పలేదు.

## హైదరాబాదు సంస్థాన ప్రజల "విమోచనోద్యమం"

హైదరాబాదు నిజాం సంస్థానం, భారత యూనియన్‌లో విలీనంతో గాని, ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర సరిసమాప్తకాదు. సంస్థాన ప్రజల పోరాటాల్లో నాలుగు ఘట్టాలు ముఖ్యమైనవి. వాటిని క్లుప్తంగా మననం చేస్తాను.

1. 1938 – స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం : విద్యార్థుల 'వందేమాతరం ఉద్యమం'.
2. 1940 – వ్యష్టి సత్యాగ్రహం : 1942 క్విట్ ఇండియా ఉద్యమం
3. 1947 – భారత యూనియన్‌లో హైదరాబాదు విలీనోద్యమం
4. 1948 – భారత ప్రభుత్వంచే పోలీస్ చర్య ప్రజాప్రభుత్వ స్థాపన.

హైదరాబాదు సంస్థాన ప్రజలు, ముఖ్యంగా సోదర నిజామాంధ్రులు ఈ పోరాట ఘట్టాలలో నిర్వహించిన వీరోచిత పాత్రను క్లుప్తంగా తెలుసుకుందాం.

బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వానికి లాబేదార్లు అయిన నిజాం సంస్థానాధీశులు తమ పెత్తనాన్ని, రాచరికాన్ని, శాశ్వతంగా కొనసాగించుకుందామని కలలుగన్నారు. ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర ప్రజలని అణచివుంచి బానిసలుగా చేశారు. సంస్థానంలో జాతీయభావాలు, పొడ చూపకుండా అనేక కట్టుదిట్టాలు చేసుకున్నారు. బయట వారిని స్టేటు లోనికి రాకుండా నిర్బంధాలు నిషేధాలు విధించారు. ఏ మాత్రం స్వతంత్రభావాలు వ్యక్తం చేసినా, వారిని స్టేటు నుండి వెలుపలకు వెడలగొట్టారు. "సంస్థానంలో ఎట్టిరాజకీయ సాంస్కృతిక సంస్థలను కూడాఏర్పడ నివ్వలేదు మత దురహంకార పూరితులైన సంస్థానాధి పతులు, నిరంకుశపాలన సాగించారు. ఇదీ ఆనాటి పరిస్థితి.

1920లో అఖిల భారత కాంగ్రెస్‌కు అనుబంధంగా శ్రీ వామన్‌నాయక్ నిర్మాణ కార్యక్రమాల్లో పనిచేస్తుండేవారు. 1922లో ఆంధ్ర కేంద్రజనసంఘం ఏర్పడి, నిజాం ఆంధ్ర మహాసభగా అభివృద్ధిగాంచింది. క్రమేణా తెలంగాణాలో ఆంధ్రోద్యమం రాజకీయోద్యమంగా పరిణితిచెందింది. 1930-32 దేశంలో జరిగిన రాజకీయోద్యమ ప్రభావం సంస్థాన ప్రజల మీద కూడా పడింది. ఉప్పు సత్యాగ్రహంలో 150 మంది దేశసేవకులు యిక్కడినుండి బొంబాయి మదరాసు, కాకినాడలకు వెళ్లి పాల్గొన్నారు.

ఈ దశలో ఫజుల్ రహమాన్, పద్మజానాయుడు నాయకత్వాన హైదరాబాదులో 'స్వదేశీ లీగ్' ఏర్పడింది. కాని వీరి పని సిటీకే పరిమితమైంది. 1931 లో బీరారులోని అకోలాలో ప్రథమ రాజకీయ మహాసభ జరిగింది. "ఘనత వహించిన అసఫ్ జాహీ ఛత్రచ్ఛాయల క్రింద బాధ్యతా యుత ప్రభుత్వాన్ని ఏర్పరచవలెనని" మాత్రమే అప్పట్లో నాయకులు తీర్మానిస్తూ వుండే వారు. ఆంధ్ర మహా సభలలో కూడా రాజకీయ ప్రవేశం వద్దని వాదించడం జరిగింది. తర్వాత క్రమేణా రైతాంగ సమస్యలు, విద్యాసంస్కరణలు తీసుకుని, పనిచేస్తుండేవారు. వెట్టిచాకిరి ముఖ్య సమస్య అయింది.

1937-38 సంవత్సరాల్లో పరిసర రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడటం రాజకోట, ధెంకనాల్, తిరువాన్కూరు, మైసూరు మున్నగు సంస్థానాల్లో ప్రజా ఉద్యమాల విజృంభణ, హైదరాబాదులో కూడా రాజకీయ చైతన్యం కలిగించింది. స్వాతంత్ర్య పోరాటదీక్షను యినుమడింప చేసినవి. స్వామీ రామానంద తీర్థ ఆధ్వర్యాన, 1938 జనవరి 29వ తేదీన హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం ప్రారంభించాలని తీర్మానించింది. అక్టోబరు 24వ తేదీన గోవిందరావు నానక్, రామకృష్ణ దూత్,జనార్థన రావుదేశాయి, రావి నారాయణ రెడ్డి, శ్రీనివాస రావు బోరికర్ ప్రథమ దళంగా శాసనోల్లంఘనం చేసి జైలు శిక్షలకు గురైనారు. 2 నెలల స్వల్ప కాలంలోనే 400 మంది వాలంటీర్లు నిర్బంధింపబడినారు.

ఉస్మానియా యూనివర్సిటీ అధికార్లు 'వందేమాతరం' గీతాన్ని పాడరాదని ఆటంక పరిచారు. యూనివర్సిటీ విద్యార్థులు సత్యాగ్రహం చేశారు. అరెస్టులు జరిగినవి. కొందరు విద్యార్థులు పూనా, నాగపూరులకు వెళ్లి తర్వాత చదువుకున్నారు. సంస్థాన ప్రజా ఉద్యమం యువజన, విద్యార్థి కార్యకర్తలను సంపాదించుకున్నది. మత, ధార్మిక సంస్థలుగా వున్న ఆర్యసమాజ్, హిందూ మహాసభకూడా శాసనోల్లంఘనానికి ఉపక్రమించినవి. ఇత్తహాద్ ముస్లిమీన్,సంస్థ నిజాం ప్రభుత్వ అండ దండలతో, ప్రజలపైన అనేక దుర్మార్గాలు చేయడానికి పూనుకుంది. ప్రభుత్వం తీవ్ర నిర్బంధాలతో సత్యాగ్రహాన్ని అణచి వేయ జూచింది. భువనగిరి తాలూకా కొలనుపాక, మొదలగు చోట్ల ప్రజలు జాగీర్దార్లకు పన్ను కట్టతిరస్కరించారు. మతరీత్యా నష్టం వస్తుందని భావించి, కాంగ్రెస్ సత్యాగ్రహాన్ని ఆపుచేయండని గాంధీజీ సలహాపంపారు. అంతటితో అది విరమించ బడింది. నిజాం ప్రభుత్వం ఏవో బూటకపు సంస్కరణలంటూ ప్రవేశపెట్ట చూచింది. 'ప్రజా స్వామికంగా ఎన్నికలు జరపాలనీ శాసన సభకు బాధ్యత వహించిన మంత్రి వర్గానికి అధికారం అప్పగించాలని, స్టేట్ కాంగ్రెస్ తీర్మానించింది. 1945-46 సంవత్సరాలలో దేశముఖ్‌లకు ప్రతి కూలంగా తెలంగాణాలో జాగిర్దారీ వ్యతిరేక పోరాటం ఉధృతమైంది, జనగాము తాలూకా విసునూర్ దేశముఖ్‌కు ప్రతికూలంగా

మొదలైన స్థానిక ప్రజా పోరాటం తెలుగు జిల్లాలకు వ్యాపించింది. ఈ ప్రజోద్యమాలకు ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీలు నాయకత్వం వహించి, నడిపినవి ఈ ఉద్యమం 'భూమిపంపిణీ' సమస్యను ప్రధానమైనదిగా ముందుకు తెచ్చి, దొరల భూములను పేద ప్రజలకు పంపిణీ చేయసాగింది. ముఖ్యంగా నల్లగొండ, వరంగల్లు అడవి ప్రాంతాల్లో గ్రామ రాజ్యాలు ఏర్పడినవి. వ్యాయామశాలలు నిర్మాణమైనవి.

ఈ ప్రజా పోరాటాలను అణచి వేయడానికి ఇత్తెహాద్ ముస్లిమీన్ పార్టీ రజాకార్ మూకలను ప్రభుత్వం గ్రామాలపైన ఉసిగొల్పి ఊళ్లకు ఊళ్లే తగులబెట్టించింది. రజాకార్ల మూకలు విచ్చలవిడిగా వీరవిహారం చేశాయి. పల్లెలను రక్షణకు రైతుకూలీ వలంటీర్లు చేజిక్కిన ఆయుధాలు పట్టి, ఎదురొడ్డి పోరాడారు. ప్రజా ఉద్యమబలంపైన ప్రజలకు అచంచల విశ్వాసాన్ని, గొప్ప రాజకీయ చైతన్యాన్ని కలిగించింది. 1947 1948 సంవత్సరాల్లో స్టేట్ కాంగ్రెస్ కూడా సత్యాగ్రహం సాగించింది. ఈతచెట్లు నరకడం, కరోడ్గిరి శాసనాలు ఉల్లంఘించడం, కాంగ్రెస్ జెండాలు ప్రతిష్ఠించడం కాంగ్రెస్ కార్యక్రమాలుగా ఉండేవి. కొందరు నాయకులు ప్రక్క రాష్ట్రాలలో వుండి పోరాటాలు నిర్వహించారు. తెలంగాణా వారికి విజయవాడ, మదరాసు స్థావరాలైనవి. వరంగల్లు కోటపైన త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసిన మొగులయ్య హత్య చేయబడ్డారు. ఇమ్రోజ్ పత్రికా సంపాదకుడైన జాతీయవాది షోయబుల్లాఖాన్‌ను హైదరాబాదులో దుర్మార్గులు నరికివేశారు. వందలాది రైతు కూలీ కార్యకర్తలను పొట్టన పెట్టుకున్నారు. స్త్రీలను చెరబట్టారు. వారు జరిపే ఘోరదురంతాలకు అంతులేకుండా పోయింది. అత్యంత క్లిష్ట పరిస్థితులలో ఈ విముక్తి పోరాటం సాగించవలసి వచ్చింది. అనేక మంది వీరులు నేలకొరిగారు. జైళ్లలో సత్యాగ్రహులు కష్టనష్టాలు అనుభవించారు. ఈ రీతి హైదరాబాదు ప్రజల స్వాతంత్ర్య సమరం బహుముఖంగా నడచింది. ఎట్టకేలకు 1948 సెప్టెంబరు 12న భారత ప్రభుత్వం పోలీస్ యాక్షన్ చేయ నిర్ణయించింది. 18వ తేదీన భారత సైన్యాలు హైదరాబాదు స్టేట్‌లోకి ప్రవేశించగానే ప్రజా వ్యతిరేక నిజాం ప్రభుత్వం ఒక్కసారిగా కుప్పకూలి పోయింది. లయకాలీ పాకిస్తాన్ పరుగెత్తాడు. అంతటితో నిజాం రాజరిక పాలన నశించింది. హైదరా బాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనమైంది. స్టేట్‌లో బూర్గుల రామకృష్ణా రావు ప్రధానత్వాన ప్రజా ప్రభుత్వం ఏర్పడింది. 1956లో హైదరాబాదు రాజధానిగా, ఆంధ్ర ప్రదేశ్ అవతరించింది. ఆంధ్రుల చిరకాలవాంఛ ఈడేరింది. ఈ స్వాతంత్ర్యోద్యమ గాధ చరిత్రాత్మకమైనది. అందులో పాల్గొన్న ఆ వీరులందరికీ జోహారులర్పిద్దాము! •

## ఉగాది పాట

### తిరునగరి

పాత ఆకురాల్చి లేత చిగుళ్ళతో
వనములెల్లను కుసుమవనములయ్యె
వచ్చె ధరకు రమ్య వాసంతమోహిని
క్రొత్త పరిమళాలు విస్తరింప

పాతకిలుమువద్దు పాత కక్షలు వద్దు
కలతలెంచు గతపు కథలు వద్దు
క్రొత్త ఏడు వచ్చె క్రొత్తందనమ్ముతో
గుండెలందు సుధలు నిండవలయు

'భావ' వత్సరమ్ము భాగ్యదాయినియంచు
ఆగతాన స్వర్గభోగమంచు
గున్నమావిపైన కోయిల గొంతెత్తి
ఆలపించె మధురమైన గీతి

భేదభావములకు వీడ్కోలు అనవలె
సఖ్యమునకు ఇంక స్వాగతమ్ము
'భావ, వత్సరమున ప్రతి వ్యక్తి గుండెలో
ప్రేమదీపకళిక వెలుగవలయు
భాగ్యలక్ష్మివోలె భావాబ్దమరుదెంచె
నవనవమ్ముగాను అవని తోచె
భవిత ఉజ్వలమ్ము, స్వర్ణమయమ్మింక
కలసిపాడుదము ఉగాదిపాట

# కొడిగట్టని ఆశల దీపం!

అనుభవాల వేడిలో

అనుభూతులు ఆవిరవుతున్న వేళ

కాలం కొట్టిన దెబ్బలతో

మనసు కదుళ్లు కట్టిన వేళ

నడిచి వచ్చిన దారిని చూస్తూ

బతుకు గతాన్ని గమనిస్తే

అన్నీ అపశృతులే

అన్నీ వొడిదుడుకులే

సాధిద్దాం అనుకున్నది ఎంతోవున్నా

సాధించింది నిండుసున్న

ఎంతో ఎత్తుకు ఎదిగానని ఎంతనుకున్నా

కంటినుంచి నేలదూరం ఆరడుగులలోపే

విశ్వమంతా తెలుసనుకున్న విశ్వాసం

నిట్టూర్పుల నిశ్వాసాల్లో కలిసిపోతోంది

అంతా ఎరుకే అనుకున్న అహంభావం

అపజయాల అడ్డవాయల్లో అణగిపోతోంది

అయినా కానీ, ఆశ చావకూడదు, చావనివ్వను

ఆశే బతుకు – అదే గమ్యం

ఆశా–ఆశయం తోడయితే విజయం తథ్యం!

భండారు శ్రీనివాసరావు

# స్వాతంత్ర్య ఉద్యమంలో ఆంధ్రుల పాత్ర - తెలంగాణా

ఎం. ఎల్. నరసింహారావు

బ్రిటిషు ప్రభుత్వ పరిపాలనలో భారతదేశంలో అయిదు వందలకు పైగా దేశీయ సంస్థానాలు వుండేవి. వీటి అన్నింటిలోను హైదరాబాదు సంస్థానం చాలా పెద్దది. నిజాం రాజుల నిరంకుశ పరిపాలనలో ఈ సంస్థానంలో తెలుగు, మరాఠీ, కన్నడ భాషలు మాట్లాడే మూడు ప్రాంతాలు ఉండేవి. ఎనిమిది జిల్లాలలో ప్రజలు తెలుగు భాష మాట్లాడేవారు. అయిదు జిల్లాలలో మరాఠీ, మూడు జిల్లాలలో కన్నడం మాట్లాడే ప్రజలు నివసించేవారు. విస్తీర్ణము జనాభాలో పెద్ద సంస్థానమైనా అభివృద్ధిలో వెనుకబడి ఉండేది. ప్రక్క రాష్ట్రమైన మద్రాసుతో పోల్చి చూచినా, సంస్థానంలోని మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలతో పోల్చినా హైదరాబాదు తెలుగువారి స్థితి కడు శోచనీయంగా ఉండేది. ప్రభుత్వ ఉద్యోగులలో తెలుగు వారి సంఖ్య బహు స్వల్పం. నూటికి అయిదుగురు మాత్రమే చదువుకున్నవారు. అధికార భాష ఉర్దూ. ప్రభుత్వ కార్యకలాపాలు, ఉత్తర ప్రత్యుత్తరాలు ఉర్దూలోనే జరిగేవి.

ప్రజలకు పౌరసత్వ హక్కులు ఏమాత్రం ఉండేవి కావు. పత్రికా స్వాతంత్ర్యం మృగ్యం. రాజకీయేతర సభలు సమావేశాలు జరుపుకోవలెనన్నా, ప్రభుత్వ అనుమతి అవసరమయ్యేది. ప్రజలు అజ్ఞానాంధకారాలలో కొట్టుమిట్టాడుతూ వుండేవారు.

నిద్రాణమైన తెలంగాణాలో జాగృతి కలిగించడానికి కొందరు మహనీయులు పూనిక వహించారు. తెలుగు భాషాభివృద్ధికి, సంస్కృతీ వికాసానికీ కృషి చేసే ఉద్దేశంతో హైదరాబాదు నగరంలో 1901వ సంవత్సరంలో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం అనే పేరుతో ఒక గ్రంథాలయాన్ని స్థాపించారు. శ్రీయుతులు కొమర్రాజు లక్ష్మణరావు, రాజా పార్థసారధి అప్పారావు (పాల్వంచ రాజా), మునగాల రాజా నాయని వెంకట రంగారావు, రావిచెట్టు రంగారావు, కొఠారు వెంకట్రావు నాయుడు దీని మూల స్థంభాలు. తరువాత తెలంగాణా ప్రాంతంలో అయిదు సం॥రాల కాలంలో పాతిక గ్రంథాలయాలు వెలసినవి. 1914వ సంవత్సరం వరకు నూటాపాతిక గ్రంథాలయాలు స్థాపితమైనవి. ప్రాథమిక హక్కులు సైతం లేని రోజులలో నిజాం నిరంకుశ ఫ్యూడల్ పరిపాలనలో ప్రజలకు మాతృభాష పట్ల మమకారం కలిగించి, సాంస్కృతిక చైతన్యాన్ని తీసుకొని రావడానికి ఈ గ్రంథాలయాలు నిర్వహించిన పాత్ర చరిత్రాత్మకమైనది. ఈ గ్రంథాలయాలు కేవలం పుస్తక భాండాగారాలుగా, పఠన మందిరాల వరకే



పరిమితమై ఉండలేదు. సాహిత్య, సాంస్కృతిక, వైజ్ఞానిక సభలు, సమావేశాలు, సదస్సులు జరుపుతూ ప్రజలలో ఒక అపూర్వమైన చైతన్యాన్ని కలిగించడానికి దోహదపడినవి. అననుకూలమైన వాతావరణంలో ఎన్నో అవరోధాలు, అడ్డంకులు ఎదుర్కొంటూ ఈ శతాబ్ది మొదటి యాభై సంవత్సరాల కాలంలో తెలంగాణా ప్రాంతంలో గ్రంథాలయోద్యమం నిర్వహించిన పాత్ర చారిత్రాత్మకమైనది. ఈ ఉద్యమ నిర్వహణలో కృషి చేసిన వైతాళికులు శ్రీయుతులు మాడపాటి హనుమంత రావు, సురవరం ప్రతాపరెడ్డి, కొండా వెంకట రంగారెడ్డి, బూర్గుల రామకృష్ణారావు, ఎన్.కె. రావు, ఆదిరాజు వీరభద్రరావు, వేలూరి రంగధామ నాయుడు మొదలైన వారు.

తెలంగాణా ప్రాంతంలో గ్రంథాలయాల స్థాపన వల్ల ఆంధ్ర యువకులలో మాతృభాష పై అభిమానము గౌరవము ఏర్పడినవి. తెలుగు చరిత్ర పరిశోధన పట్ల ఆసక్తి కలిగింది. గ్రంథాలయోద్యమంతో పాటు ఆంధ్రోద్యమానికి కూడా విఘ్నేశ్వర పూజ జరిగింది. 1921వ సం॥రంలో ప్రారంభమైన ఆంధ్రోద్యమం తెలంగాణా అంతటా అతి త్వరగా వ్యాప్తి చెందటానికి గ్రంథాలయాలు మార్గాన్ని సుకరం చేసినవి.

1921వ సం॥రంలో హైదరాబాదు నగరంలో జరిగిన ఒక సంఘటన కారణంగా నిజాం రాష్ట్రంలో ఆంధ్రోద్యమానికి నాందీ ప్రస్తావన జరిగింది. 1921 నవంబర్ 11, 12 తేదీలలో హైదరాబాదు నగరం

లోని గౌలీ గూడాలో ఉన్న వివేకవర్ధనీ థియేటర్ లో నిజాం రాష్ట్రసంఘ సంస్కరణ సభ జరిగింది. ఈ సభకు ప్రఖ్యాత సంఘ సంస్కర్త, పూనాలో మహిళా విశ్వ విద్యాలయం స్థాపించిన మహర్షి ధోండే కేశవ కార్వే అధ్యక్షత వహించారు. ఆయన తన మాతృభాష యైన మరాఠీ లోనూ తరువాత ఇంగ్లీషులోనూ ప్రసంగించారు. నగరంలోని ఒక ప్రముఖ న్యాయవాది శ్రీ ఆలంపల్లి వెంకట్రామారావు తెలుగు లో ఉపన్యసించడం ప్రారంభించగానే సభలో వున్న ఆంధ్రేతరులు ఆయన ఉపన్యాసానికి అడ్డుపడి కేకలు వేసి ఉపన్యాసం కొనసాగకుండా చేశారు. శ్రీ వెంకట్రామారావు గత్యంతరం లేక మధ్యలోనే తన ప్రసంగం ముగించవలసి వచ్చింది. ఈ సంఘటన ఆ సభలో వున్న ఆంధ్ర యువకులలో ఆగ్రహావేశాలు కలుగచేసినవి. శ్రీ వెంకట్రామారావుకు జరిగిన అవమానం తెలుగు భాషకు తెలుగు జాతికి జరిగిన అవమానంగా భావించారు. ఆ సభాకార్యక్రమం పూర్తి కాక ముందే సభలో వున్న ఆంధ్ర యువకులంతా ఆ సభ నుంచి నిష్క్రమించారు.

అదేరోజు నవంబర్ 12, 1921 వ తేదీన అప్పటి హైకోర్టు న్యాయవాది శ్రీ టేకుమాల్ రంగారావు ఇంట్లో పదకొండు మంది ఆంధ్ర యువకులు సమావేశమై సంఘ సంస్కార సభలో తెలుగువారికి జరిగిన అవమానాన్ని గురించి చర్చించారు. అప్పటికప్పుడే ఆంధ్ర జన సంఘం అనే పేరుతో ఒక సంఘం స్థాపించారు. తెలంగాణాలో ఆంధ్రోద్యమానికి అదే ఆరంభం. ఆంధ్ర జన సంఘం నిజాం రాష్ట్ర ఆంధ్రుల తొలి ప్రజా సంస్థ. భవిష్యత్తులో నిజాం నిరంకుశ అధికారాన్ని



సవాల్ చేయటానికీ, తెలుగు ప్రజల ఆత్మ గౌరవాన్ని నిలబెట్టి వారిలో ఐక్యతను సాధించడానికి ఆవిర్భవించిన తెలుగు సంస్థ అది. ఆనాటి సమావేశంలో పాల్గొన్న ఆంధ్ర యువకులు శ్రీయుతులు 1. టేకుమాల్ రంగారావు, 2. మిట్టా లక్ష్మీ నరసయ్య, 3. నడింపల్లి జానకిరామయ్య, 4. ఆదిరాజు వీరభద్రరావు, 5. మందుముల నరసింగరావు, 6. బూర్గుల రామకృష్ణారావు, 7. బూర్గుల నరసింగరావు, 8. కొమ్మవరపు సుబ్బారావు, 9. పందిటి రామస్వామి నాయుడు, 10. బోయినేపల్లి వెంకట్రామారావు, 11. మాడపాటి హనుమంతరావు.

ఈ పదకొండు మంది సభ్యులతో కూడిన మొట్టమొదటి ఆంధ్ర జనసంఘం సమావేశంలో శ్రీ మాడపాటి హనుమంతరావును కార్యదర్శిగా ఎన్నుకొన్నారు. తెలుగు భాషాభివృద్ధికి కృషి చేయటంతో పాటు ప్రజలను విజ్ఞానవంతుల్ని చేయటానికి, వారిలో విజ్ఞాన తృష్ణ కలిగించడానికి ప్రయత్నం చేయాలని నిర్ణయించారు. అంతే కాక తెలుగు చరిత్ర పరిశోధన చేపట్టాలని, ఆంధ్ర బాల బాలికలకు వసతి గృహాలు ఏర్పాటు చేయాలని, వితంతు శరణాలయాలు నెలకొల్పాలని, స్త్రీ విద్యా వ్యాప్తికి బాలికా పాఠశాలలు స్థాపించాలని తీర్మానించటం జరిగింది.

ఈ సంఘ తీర్మానాన్ని అనుసరించి ఆంధ్ర పరిశోధక మండలి అనే పేరుతో ఒక పరిశోధన సంస్థ స్థాపించారు. ప్రఖ్యాత చారిత్రక పరిశోధకులు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు, స్వర్గస్థులైన తరువాత ఈ సంస్థకు లక్ష్మణరాయ పరిశోధక మండలి అని నామకరణం చేశారు. ఈ మండలికి శ్రీ నాయని వెంకట రంగారావు అధ్యక్షులు. శ్రీ ఆదిరాజు వీరభద్రరావు కార్యదర్శి. తెలంగాణా ప్రాంతంలో వివిధ చారిత్రక ప్రదేశాలకు సంబంధించిన చారిత్రక సామాగ్రిని తాళపత్ర గ్రంథాలను సేకరించి ఈ సంస్థ ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన ఎంతో విలువైన సమాచారం సేకరించింది. ఈ సంస్థ పక్షాన శేషాద్రి రమణ కవులు తెలంగాణా జిల్లాలలో పర్యటన జరిపి ఎన్నో శాసనాలు సేకరించారు. ఈ సంస్థ సేకరించిన 123 శాసనాలు "తెలంగాణా శాసనములు" అనే గ్రంథ రూపంలో ప్రచురించారు.

ఆంధ్ర జనసంఘం కార్యదర్శి శ్రీ మాడపాటి హనుమంతరావు నిర్విరామ కృషి ఫలితంగా రెండు మూడు సం॥ రాలలోనే తెలంగాణాలో యాభై ఆంధ్ర జనసంఘాలు ఏర్పడినవి. దీనికి తోడు గ్రంథాలయోద్యమం కూడా వ్యాప్తిలోకి రాసాగింది. ఈ రెండు ఉద్యమాలు పరస్పర సంబంధ సహకారాలతో పని చేయసాగినవి. ఆనాటి నిజాం ప్రభుత్వ ఉద్యోగులు గ్రామాలలో వర్తకులపై జరిపే అక్రమాలను అరికట్టడానికి, వర్తకులకు చట్టరీత్యా ఉన్న హక్కులను తెలియ చేయడానికి ఒక చిన్న పుస్తకం "వర్తక స్వాతంత్ర్యం" అనే పేరుతో ప్రచురించారు. అట్లాగే "వెట్టి చాకిరి" "జాగీర్లు" ఇంకా రైతులకు ఉపయోగపడే ఎన్నో గ్రంథాలు ప్రచురించడం జరిగింది. ఇట్లా

భాషా విషయకంగా, సాంస్కృతికంగా అణచివేయబడిన తెలుగు ప్రజలలో తమ మాతృభాష, సంస్కృతి పట్ల గాఢాభిమానం కలిగించడానికి ఆంధ్ర జన సంఘం చేసిన కృషి శ్లాఘనీయమైనది.

ఆంధ్ర జన సంఘం నాయకు లందరూ హైదరాబాదులో సమావేశమై ఆంధ్ర జన సంఘంతో పాటు తెలంగాణా లో వివిధ రంగాలలో పని చేసే సంస్థలన్నిం టినీ ఏకం చేసి అప్పటి వరకు ఆంధ్ర జన సంఘం నిర్వహిస్తున్న కార్యకలాపాలను విస్తృత పరచవలెననే లక్ష్యంతో ఒక కేంద్ర సంస్థను "నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ" అనే పేరుతో నెలకొల్పారు. ఇట్లా 1930లో నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ ఆవిర్భవించింది. అదే సంవత్సరం మార్చి నెలలో మెదక్ జిల్లా జోగిపేట లో నిజాం రాష్ట్ర ప్రథమాంధ్ర మహాసభ జరిగింది. సుప్రసిద్ధ పండితులు, పరిశోధకులు, సాహితీవేత్త పత్రికా సంపాదకులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డి ఈ మహాసభకు అధ్యక్షత వహించారు. తెలంగాణాలోని ఎనిమిది జిల్లాల నుంచి ఎందరో విద్యావంతులైన యువకులు, రచ యితలు, కవులు, పండితులు, సంఘ సేవకులు, న్యాయవాదులు ఈ సభలో పాల్గొన్నారు. అప్పుడు యువకుడైన శ్రీ రావి నారాయణరెడ్డి శ్రీ ఆరుట్ల రామచంద్రా రెడ్డితో సహా పదిహేను మంది యువకులు ఆ మహాసభకు సైకిళ్ళపై వెళ్ళి వాలంటీర్లుగా పని చేశారు. ఈ మహాసభలో ప్రధానంగా సాంఘిక సమస్యలే చర్చకు వచ్చినవి. బాల్య వివాహాల నిషేధం, వితంతు వివాహాలు చట్టసమ్మతం చేయాలని తీర్మానించారు. అదే సభా ప్రాంగణంలో శ్రీమతి నడింపల్లి సుందరమ్మ అధ్యక్షతన ఆంధ్ర మహిళా మహాసభ జరిగింది.



రెండవ మహాసభ నల్లగొండ జిల్లా దేవరకొండలో 1931 మార్చి 3, 4, 5, తేదీలలో శ్రీ బూర్గుల రామకృష్ణారావు అధ్యక్షతన జరిగింది. ఈ మహాసభ జరుపుకోవడానికి అనుమతి ఇచ్చేటప్పుడు నిజాం ప్రభుత్వం కొన్ని షరతులు విధించింది. సభాధ్యక్షుడు ఈ రాష్ట్రం నివాసియై వుండాలి. మహా సభలో జరిగే చర్చలన్నీ రాజకీయేతరములై వుండ వలెను. ఈ మహాసభలో జరిగే ఏదైనా విషయం ప్రభుత్వ విధానానికి వ్యతిరేకంగా ఉన్న పక్షంలో రాబోవు సంవత్సరమున ఇటువంటి సభ జరుపుకోవటానికి ఇచ్చే దరఖాస్తులు అంగీకరింపబడవు. రెండవ మహాసభ దిగ్విజయంగా జరిగింది. ఈ సభకు హాజరైన ప్రముఖులలో "హైదరా బాదు బులిటెన్" పత్రికా సంపాదకులు శ్రీ బుక్కపట్నం రామానుజాచారి (వీరు బి.ఆర్. చారి అనే పేరుతో ప్రసిద్ధులు) ప్రజామిత్ర సంపాదకులు, సుప్రసిద్ధ చలన చిత్ర దర్శకులు శ్రీ గూడవల్లి రామబ్రహ్మం, దేశభక్త బిరుదాంకితులైన శ్రీ వామన నాయక్, సుప్రసిద్ధ సంఘ సంస్కర్త శ్రీ బాజీ కిషన్‌రావు, బారిస్టర్ శ్రీనివాస శర్మ, మొదలైనవారు ఉండటం విశేషం.

మూడో ఆంధ్ర మహాసభ శ్రీ పులిజాల వెంకట రంగారావు అధ్యక్షతన ఖమ్మంలో జరిగింది. ఆనవాయితీగాజరిగే ఆంధ్ర మహిళా సమావేశానికి శ్రీమతి యల్లాప్రగడ సీతా కుమారి అధ్యక్షత వహించారు. నాలుగో మహాసభ 1935లో ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంత రావు అధ్యక్షతన కరీంనగర్ జిల్లా సిరిసిల్లలో జరిగింది. ఈ మహాసభ వరకు ఆంధ్ర మహాసభకు ప్రజా ఉద్యమ స్వరూపమేర్పడి ఉచ్చస్థాయికి చేరింది. ఆ తరువాత 1936లో అయిదవ మహాసభ శ్రీ కొండా వెంకట రంగారెడ్డి అధ్యక్షతన షాద్‌నగర్‌లో జరిగింది. 1937లో ఆరవ మహాసభ రయ్యత్ పత్రికా సంపాదకులు శ్రీ మందుముల నరసింగరావు అధ్యక్షతన నిజామాబాదు లో జరిగింది. అదే సందర్భంలో నిజాం రాజు తన సంస్థానంలో కొన్ని రాజకీయ సంస్కరణలు ప్రవేశ పెట్టవలెనని సంకల్పించి అందుకు గాను తగిన సూచనలు చేయటానికి శ్రీ ఆరావముద్ అయ్యంగార్ ఆధ్వర్యంలో ఒక కమిటీని నియమించాడు. ఈ కమిటీకి తమ సూచనలు అందచేయాలని నిజామాబాదు మహాసభ తీర్మానించింది. ఆంధ్ర మహాసభ బహిరంగ సభలో రాజకీయ తీర్మానం చేయటం ఇదే ప్రథమం. నిజామాబాదు ఆంధ్ర మహాసభ తరువాత ఆంధ్రోద్యమ స్వరూపమే పూర్తిగా మారిపోయింది. ఇప్పటివరకు రాజకీయేతర సంస్థగా పరిగణించబడుతూ ఉన్న ఆంధ్ర మహాసభ రాజకీయ సంస్థగా రూపుదాల్చే స్థితికి చేరుకున్నది. అతివాద మితవాద వర్గాలు అని రెండు వర్గాలు స్పష్టంగా ఏర్పడినవి.

సప్తమాంధ్ర మహాసభ 1940లో హైదరాబాదు జిల్లా మల్కాపురంలో శ్రీ

మందుముల రామచంద్రరావు అధ్యక్షతన జరిగింది. '1938లో స్టేటు కాంగ్రెసుపై నిషేధం తొలగించాలని సత్యాగ్రహో ద్యమం జరిగిన దృష్ట్యా ప్రభుత్వం వారు ఆంధ్ర మహాసభ జరుపుకోనటానికి సకాలంలో అనుమతి ఇవ్వలేదు. ఈ ఏడవ ఆంధ్ర మహాసభలో యువ నాయకత్వం బలపడి వారిదే పై చేయి అయింది. ఆ తరువాత ఆంధ్ర మహాసభ అతివాదులే అభ్యుదయవాదులైన వామపక్షాలవారి చేతుల్లోకి పోయింది. వీరిలో మళ్ళీ రెండు వర్గాలు ఏర్పడినవి. ఒకటి జాతీయ పక్షం, రెండవది కమ్యూనిష్టు పక్షం.

1941లో నల్లగొండ జిల్లా చిలుకూరు గ్రామంలో ఎనిమిదవ ఆంధ్ర మహాసభ శ్రీ రావినారాయణరెడ్డి గారి అధ్యక్షతన జరిగింది. శ్రీ నారాయణరెడ్డి తను అధ్యక్షోపన్యాసంలో దేశీయ సంస్థానాలలో ప్రజల ఇక్కట్లు, సామ్రాజ్య వాద యుద్ధం, పెట్టుబడిదారీ వ్యవస్థ మొదలైన సమస్యలను గురించి ప్రస్తావించారు. 1942లో తొమ్మిదవ ఆంధ్ర మహాసభ శ్రీ మాదిరాజు రామకోటేశ్వరరావు అధ్యక్షతన వరంగల్ జిల్లా ధర్మవరం గ్రామంలో జరిగింది. పదవ ఆంధ్ర మహాసభ శ్రీ కొండా వెంకటరంగారెడ్డి అధ్యక్షతన హైదరాబాదు నగరంలో జరిగింది. 1944లో భువనగిరి లో జరిగిన పదకొండవ ఆంధ్ర మహాసభకు శ్రీ రావి నారాయణరెడ్డి అధ్యక్షత వహించారు. ఈ భువనగిరి ఆంధ్ర మహాసభ సంపూర్ణంగా కమ్యూనిస్టు భావాలు గల వారి చేతుల్లోకి పోయింది. 1945 నుంచి ఆంధ్ర మహాసభ కార్యకర్తలు (కమ్యూనిస్టు భావాలు కలవారు) జాగీర్దార్లు, భూస్వాములు, దేశ్‌ముఖ్ ల అక్రమాలు దౌర్జన్యాలకు వ్యతిరేకంగా రైతులను సమీకరించి ఎన్నో పోరాటాలు జరిపారు. ఇట్లా ఆంధ్ర మహాసభ విప్లవ భావాలు గలవారి చేతుల్లోకి పోయిన తరువాత కాంగ్రెసు భావాలు, గాంధీజీ సిద్ధాంతాల పట్ల విశ్వాసం కల వారంతా వరంగల్ జిల్లా మడికొండలో సమావేశమై జాతీయాంధ్ర మహాసభ నిర్వహించారు. కమ్యూనిస్టు ఆంధ్ర మహాసభ శ్రీ రావి నారాయణరెడ్డి అధ్యక్షతన ఖమ్మంలో జరిగింది. ఇట్లా నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ రెండుగా చీలిపోయింది.

1946లో మెదక్ జిల్లా కంది గ్రామంలో సర్దార్ జమలాపురం కేశవరావు అధ్యక్షతన పదమూడవ జాతీయాంధ్ర మహాసభ ఘనంగా జరిగింది. కంది మహాసభ చరిత్రాత్మకమైనది. వేలాది ప్రజలు ఈ మహాసభకు హాజరైనారు. ఇదే తుది మహాసభ. ఆ తరువాత ఆంధ్ర మహాసభ జరగలేదు. స్టేటు కాంగ్రెసు పై నిషేధం తొలగించడం వల్ల జాతీయాంధ్ర మహాసభ ఆంధ్ర కాంగ్రెసు సంఘంగా మారిపోయింది. అదే విధంగా కమ్యూనిస్టుల ప్రాబల్యం గల ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టు పార్టీగా రూపొందింది.

సర్దార్ జమలాపురం కేశవరావు నాయకత్వంలో ఆంధ్ర కాంగ్రెసు (తెలంగాణా) విప్లవాత్మకమైన కార్యక్రమాలు చేపట్టింది. జాతీయ భావాలు కల యువకార్యకర్తలు అనేకులు ఆయన నాయకత్వంలో సత్యాగ్రహోద్యమాలలో చేరి ఎటువంటి త్యాగానికైనా సంసిద్ధులైనారు.

## కమ్యూనిస్టు పార్టీ

అట్లాగే శ్రీ రావి నారాయణ రెడ్డి అధ్యక్షులుగా ఉన్న కమ్యూనిస్టు ఆంధ్ర మహాసభ రద్దు అయింది. దాని స్థానంలో కమ్యూనిస్టు పార్టీ రూపొందింది. అంతకు ముందే హైదరాబాదు నగరంలో కమ్యూనిస్టు భావాలు కల యువకులంతా కలసి "కామ్రేడ్స్ ఎసోసియేషన్" పేరుతో ఒక చర్చా వేదిక నడిపిస్తూ వుండేవారు. ఇందులో శ్రీ రావి నారాయణరెడ్డి, రాజ బహదూర్ గౌడ్, మఖ్దూం మొహియుద్దీన్, ఆలం ఖున్‌మేరి ముఖ్యులు. ఆంధ్ర మహాసభలో పనిచేస్తున్న కమ్యూనిస్టు భావాలు కల వారిలో శ్రీ బద్దం ఎల్లారెడ్డి, శ్రీ దేవులపల్లి వెంకటేశ్వరరావు, శ్రీ వి.డి. దేశ్‌పాండే, చంద్రగుప్త చౌదరి ముఖ్యులు. కమ్యూనిస్టు పార్టీ అవతరణ తరువాత వీరంతా ఆ పార్టీలో క్రియాశీల పాత్ర వహించారు.

ఆంధ్ర మహాసభ రెండుగా చీలిపోయేవరకు వివిధ వర్గాలు, వివిధ భావాలు గలవారు, సమిష్టిగా నిజాం నిరంకుశ విధానానికి వ్యతిరేకంగా సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. 1938 లో జరిగిన ప్రథమ సత్యాగ్రహోద్యమంలో శ్రీ రావి నారాయణరెడ్డి పాల్గొన్నారు. అట్లాగే వందేమాతరం ఉద్యమంలో శ్రీ సర్వదేవభట్ల రామనాథం, దేవులపల్లి వెంకటేశ్వరరావు పాల్గొన్నారు. వీరు కమ్యూనిస్టు భావాలు కలవారు. కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం తరువాత ఆ పార్టీలో అగ్ర నాయకులుగా ప్రముఖ పాత్ర వహించారు.

## హైదరాబాదు స్టేటు కాంగ్రెసు

భారత స్వాతంత్ర్య ఉద్యమంలోనూ, వివిధ సందర్భాలలో ఆవిర్భవించిన అనేక ఉద్యమాలలోనూ హైదరాబాదు సంస్థాన ప్రజలు మహత్తరమైన పాత్ర నిర్వహించారు. 1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం మొదలు కొని, రాజారాంమోహన్ రాయ్ ప్రారంభించిన సంఘ సంస్కరణోద్యమం, దయానంద సరస్వతి ఆర్యసమాజ్ ఉద్యమము,

గాంధీజీ సహాయ నిరాకరణ సత్యాగ్రహోద్యమాలలో అంతో ఇంతో భాగస్వాము లయ్యారు. ఈ ఉద్యమాల ప్రభావం సంస్థాన ప్రజలపై పడకుండా ఉండలేదు. ఈ సంస్థానాన్ని పరిపాలించే ఆసఫ్‌జా రాజులు ఎన్ని అడ్డంకులు, ఇబ్బందులు, నిషేధాలు కల్పించినా భారత దేశంలో వివిధ ప్రాంతాలలో జరుగుతూ వచ్చిన సంఘటనల నుంచి ఇక్కడి ప్రజలను దూరంగా ఉంచలేకపోయారు.

1885వ సం॥రంలో బొంబాయిలో భారత జాతీయ కాంగ్రెసు స్థాపన జరిగినప్పుడు హైదరాబాదు ప్రముఖులు శ్రీయుతులు అఘోరనాథ్ ఛటోపాధ్యాయ (సరోజినీ నాయుడు తండ్రి), ముల్లా అబ్దుల్ ఖయూం, రామచంద్ర పిళ్ళే, ముత్యాల రామన్న, మొహిబ్ హుస్సేన్ మొదలైనవారు జాతీయ సంస్థయైన జాతీయ కాంగ్రెసు స్థాపనను హర్షించి బలపరిచారు. ఆరోజుల్లో హైదరాబాదు నుంచి వెలువడే 'దక్కన్‌టైమ్స్' పత్రికలో కాంగ్రెసు తలపెట్టిన కార్యక్రమాలను బలపరుస్తూ వ్యాసాలు కూడా వ్రాయటం జరిగింది. హైదరాబాదు నగరవాసి ముల్లా అబ్దుల్ ఖయూం జాతీయ కాంగ్రెసులో సభ్యుడుగా చేరిన ప్రథమ జాతీయవాది. ఈయన కాంగ్రెసు క్రియాశీల సభ్యుడుగా మద్రాసు, బెనారస్ కాంగ్రెసు మహాసభలకు హాజరైనాడు.

1892వ సం॥లో హైదరాబాదులో ఆర్యసమాజ్ స్థాపన జరిగింది. ఆర్యసమాజ్ నాయకులు గైర్‌ముల్కీలనే నెపంతో ప్రభుత్వం వారిని అరెస్టు చేసింది. ప్రభుత్వం ఎన్ని నిర్బంధాలు విధించినా సంస్థానంలో ఆర్యసమాజ్ దినదిన ప్రవర్థమానమవుతూ పోయింది. ప్రముఖ సంఘ సేవకులు శ్రీ కేశవరావు కోరట్కర్, దామోదర్ సత్వాలేకర్‌లు ఆర్యసమాజ్‌ను పటిష్టం చేయటానికి ఎంతో కృషి చేశారు. బాలగంగాధర్ తిలక్ ప్రారంభించిన గణేశ్ ఉత్సవాలు ఆర్యసమాజ్ ఆధ్వర్యంలో హైదరాబాద్ సంస్థానమంతటా జరుగుతూ వచ్చినవి. నిజాం నిరంకుశ పరిపాలనలో ఇక్కడి మతోన్మాదపూరిత వాతావరణంలో ఆర్యసమాజ్ సంస్థానంలోని హిందువులలో ఆత్మ విశ్వాసాన్ని, మనోధైర్యాన్ని కలుగచేయటమే కాక సంస్థానంలో ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పాటుకు జరిగే పోరాటానికి వారిని సంసిద్ధం చేసింది.

1920 ఖిలాఫత్ ఉద్యమ సందర్భంలో హైదరాబాదులో శ్రీ కేశవరావు కోరట్కర్, నవాబ్ అస్గర్ యార్‌జంగ్ ఉద్యమానికి నాయకత్వం వహించారు. వివేకవర్ధనీ పాఠశాల ఆవరణలో జరిగిన ఒక బహిరంగ సభకు పదివేలమంది ప్రజలు హాజరయ్యారు. ప్రజలలో వస్తున్న ఈ చైతన్యానికి ప్రభుత్వం బెదిరిపోయింది. గస్తీనిషాన్ 53 ద్వారా సభలు సమావేశాలు జరపకుండా నిషేధాజ్ఞలు జారీ చేసింది. అప్పటి ప్రధానమంత్రి సర్ అలీ ఇమాం మోటెంగ్యు - ఛేంస్‌ఫర్డ్ సంస్కరణల పద్ధతిలో హైదరాబాదులో కూడా కొన్ని రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టవలెనని సంకల్పించి, రాయెబాల ముకుంద్ ఆధ్వర్యంలో ఒక సంస్కరణల సంఘాన్ని నియమించాడు. కాని వారి ప్రతిపాదనలేవీ వెలుగులోనికి రాలేదు.

సంస్థానంలో రాజకీయ సభలు జరపటం నిషేధం కాబట్టి 1931లో హైదరాబాదు సంస్థానం వెలుపల అకోలాలో హైదరాబాదు ప్రజలు ప్రథమ రాజకీయ మహాసభ జరుపుకొన్నారు. ఈ సభలో ప్రసంగాలు చేసిన పలువురు పెద్దలు హైదరాబాదు రాష్ట్రం ప్రాథమిక హక్కులు కూడా కరువైనవని విమర్శించారు. 1930 ప్రాంతంలో శ్రీమతి పద్మజానాయుడు (ఈమె సరోజినీ నాయుడు కూతురు) కొందరు ముస్లిం మిత్రుల సహాయంతో స్వదేశీ ఉద్యమాన్ని ఆరంభించారు. వీరు ఖాదీ ప్రచారానికి ఎంతో కృషి చేశారు. 1935, 36 సం॥రాలలో హైదరాబాదు రాష్ట్రంలో జాతీయ కాంగ్రెసు శాఖ నెలకొల్పడానికి ప్రయత్నాలు జరిగినవి. కాని అవి ఫలించలేదు.

## స్వామీ రామానంద తీర్థ

స్వామీ రామానంద తీర్థ హైదరాబాదు స్టేటు కాంగ్రెసు ఉద్యమాన్ని చేపట్టిన తరువాతనే దానికొక నిర్దిష్ట స్వరూపం ఏర్పడింది. రాష్ట్రస్వాతంత్ర్య ఉద్యమానికి నాయకత్వం వహించి అహోరాత్రులు అవిరళ కృషి జరిపిన మహనీయుడాయన. విద్యావేత్తగా, కార్మిక నాయకుడుగా, పాత్రికేయుడుగా, సామ్యవాదిగా అనేక రంగాలలో ఆయన నిర్వహించిన పాత్ర శ్లాఘనీయమైనది. ఆనాటి యువకులకు ఆయన ఆచార్యుడు, మార్గదర్శి, తత్వబోధకుడు.

1936లో ఆయన హైదరాబాదు నగరానికి వచ్చి ఇక్కడ నివాసం ఏర్పరచుకొన్నాడు. నగరంలోనే కాక తెలంగాణా మరాత్వాడ, కర్నాటక జిల్లాల్లో పర్యటన జరిపి అనేక మంది యువ కార్యకర్తలను తయారు చేశాడు. స్టేటు కాంగ్రెసు సంస్థను స్థాపించాలని నిశ్చయించుకొన్నాడు. 1938 జూలై నాటికి దాదాపు 1500 మందిని కాంగ్రెసులో ప్రాథమిక సభ్యులుగా చేర్పించాడు. వీరంతా విద్యావంతులైన యువకులు. ఎటువంటి కష్టనష్టాలనైనా ఎదుర్కొనటానికి సంసిద్ధులుగా ఉన్నవారు. హైదరాబాదులోని

ఆనాటి పరిస్థితుల దృష్ట్యా ఈ విషయం అతి రహస్యంగా ఉంచబడింది. 1938 సెప్టెంబర్ నెలలో సభ్యులను సమావేశ పరచి కార్యవర్గం ఎన్నికలు జరిపించటానికి ఏర్పాట్లు చేశాడు. ఈ విషయాన్ని తన రహస్య సమాచార శాఖ ద్వారా తెలుసు కున్న నిజాం ప్రభుత్వం హైదరాబాద్ స్టేటులో జాతీయ కాంగ్రెసు నిర్మాణాన్ని నిషేధించింది. ప్రభుత్వ నిషేధాజ్ఞలను ధిక్కరించాలని నిర్ణయించుకొని శ్రీ గోవిందరావు నానక్ అధ్యక్షులుగా, శ్రీ రామకృష్ణధూత్ కార్యదర్శిగా స్టేటు కాంగ్రెసు కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు.

1938 అక్టోబరు 24వ తేదీన ఉదయం పది గంటలకు శ్రీ గోవిందరావు నానక్ హైదరాబాద్ నగరంలోని సుల్తాన్ బజార్‌లో ప్రత్యక్షమై స్టేటు కాంగ్రెసు నిర్మాణం జరిగిందనీ, దానికి తాను అధ్యక్షుణ్ణి అని ప్రకటించుకొని సత్యాగ్రహం చేశారు. ఈ సత్యాగ్రహంలో ఆయనతో పాటు శ్రీ యుతులు జనార్దన రావు దేశాయ్, రామకృష్ణధూత్, శ్రీనివాస్‌రావు బోరీకర్, రావి నారాయణ రెడ్డి కూడా వున్నారు. వీరందరినీ ప్రభుత్వం అరెస్టు చేసి జైలుకు పంపిం చింది. స్వామీ రామానంద తీర్థను 27వ తేదీన అరెస్టు చేశారు. హైదరాబాదు నగరంలోనే కాక వరంగల్లు, నల్లగొండ, మహబూబ్‌నగర్, నిజామాబాద్, ఔరంగా బాద్, నాందేడ్ మొదలైన అనేక పట్టణాలలో అనేకమంది కార్యకర్తలు సత్యాగ్రహాలు చేసి అరెస్టు అయ్యారు. సర్దార్ జమలాపురం కేశవరావు మధిర పట్టణంలో సత్యాగ్రహం చేశారు. ఆయనను అరెస్టు చేసి వరంగల్ జైలుకు పంపించారు.

## వందేమాతరం ఉద్యమం

1938 వ సంవత్సరం హైదరాబాదు స్టేటు స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో అత్యంత ప్రధానమైనది. ఆ సంవత్సరం మొట్టమొదటిసారిగా నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా సామూహిక సత్యా గ్రహాలు జరిగినవి.

1938 లో దసరా పండుగనాడు ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థులు 'బి' హాస్టల్‌లో సమావేశమై వందేమాతర గీతాన్ని పాడుకొన్నారు. విశ్వవిద్యా లయాధికారులు వందేమాతర గీతాన్ని పాడడం నిషేధమని ప్రకటించారు. ప్రభుత్వ నిషేధాజ్ఞలను ధిక్కరించారు విద్యార్థులు. తత్ఫలితంగా నవంబర్ 29వ తేదీన హాస్టల్‌లో ఉండే విద్యార్థులందరినీ కళాశాల నుంచి బహిష్కరించారు. కొద్ది రోజులలోనే రాష్ట్రమంతటా వందేమాతర ఉద్యమం వ్యాపించి అన్ని కళాశాలల్లోనూ ఈ గీతం ఘూర్ణిల్లిమ్రోగింది. కళాశాలలో చదివే దాదాపు నాలుగు వందల మంది విద్యార్థులను తరగతుల నుంచి తొలగి స్తున్నట్లు ఉత్తర్వులు జారీ చేశారు.

భారతదేశంలో ఏ విశ్వ విద్యా లయంలో కూడా వీరికి ప్రవేశం ఇవ్వ కూడదని ఇంటర్ యూనివర్సిటీ బోర్డుకు వ్రాశారు. అయితే అప్పటి మధ్యప్రదేశ్ లోని నాగపూర్ విశ్వవిద్యాలయం వారు బహిష్కృతులైన విద్యార్థులకు ప్రవేశం ఇచ్చారు. వందేమాతరం ఉద్యమంలో పాల్గొనే విద్యార్థులను అభినందిస్తూ పండిత జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్ర బోసు సందేశాలు పంపించారు. వందే మాతరం గీతం పాడుకొనే హక్కు భార తీయ విద్యార్థులందరికీ ఉన్నదని గాంధీజీ వ్రాశారు. ఈ వందేమాతరం ఉద్యమంలో పాల్గొని బహిష్కరణకు గురియైన వారిలో నేటి మన భారత ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు కూడా వుండటం విశేషం. ఇంకా ఇతరులు శ్రీ యుతులు కె. అచ్యుత రెడ్డి, ఎన్. రామచంద్రారెడ్డి, సర్వదేవభట్ల రామనాధం, మొదలైనవారు వీరంతా తరువాత నాగపూర్ విశ్వవిద్యాలయంలో చేరి చదువులు కొనసాగించారు.

## ఆర్యసమాజ్ ఉద్యమం

అదే సమయంలో పౌరహక్కుల కోసం, నిజాం నిరంకుశ మత పక్షపాత వైఖరికి నిరసనగా ఆర్యసమాజ్ కూడా సత్యాగ్రహానికి పిలుపు ఇచ్చింది. ఆర్య సమాజ్ పిలుపునందుకొని వందలాది హిందూ మహాసభ నాయకులు, కార్యకర్తలు సంస్థానంలో సత్యాగ్రహాలు చేసి అరెస్టు అయ్యారు. 1939 జనవరి 21వ తేదీన మహాత్మా నారాయణ స్వామి తన అను చరులతో సంస్థానంలోకి ప్రవేశించి ప్రభుత్వ నిషేధాజ్ఞలను ధిక్కరించి అరెస్టు య్యారు. పండిట్ నరేంద్రజీ, వందే మాతరం రామచంద్రరావు, వందేమాతరం వీరభద్రరావు, కృష్ణదత్ పండిత శ్యాంలాల్ వంటి ఆర్యవీరులెందరో జైళ్ళకు వెళ్ళారు. ఇది హిందువులు, ముస్లిం ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేస్తున్న మత సంబంధమైన ఉద్యమమని నిజాంప్రభుత్వం ప్రచారం చేసింది. ప్రభుత్వం కొన్ని నిర్బంధాలు సడలించగలమని హామీ ఇవ్వడం గాంధీజీ ఉద్యమాన్ని విరమించుకోమని సలహా ఇవ్వడంవల్ల ఈ ఉద్యమాన్ని విరమించారు.

## వ్యక్తి సత్యాగ్రహం

నిజాం ప్రభుత్వ విధానంలో మార్పు రాలేదు. తాను చేసిన వాగ్దానాన్ని ప్రధానమంత్రి సర్ అక్బర్ హైదరీ నెరవేర్చలేదు. స్టేటు కాంగ్రెసుపై నిషేధం తొలగించలేదు. 1940లో స్వామీ రామానంద తీర్థ వార్ధా వెళ్ళి గాంధీజీని కలుసుకొని వ్యక్తి సత్యాగ్రహం చేయటానికి అనుమతి కోరాడు. పరిమిత సంఖ్యలో ఈ ఉద్యమం నిర్వహించవలెనని ఆదేశం

చారు గాంధీజీ. హైదరాబాదు చేరుకోగానే స్వామీజీని తదితర స్టేటు కాంగ్రెసు నాయకులను అరెస్టు చేశారు. స్వామీజీని నిజామాబాదు జైలులో నిర్బంధించటం జరిగింది. భారతదేశమంతటా వ్యక్తి సత్యాగ్రహం ముమ్మరంగా సాగింది. హైదరాబాదులో కూడా ముఖ్యులు అరెస్టు అయ్యారు.

## క్విట్ ఇండియా ఉద్యమం

1942 ఆగస్టు మొదటి వారంలో బొంబాయి లో జరిగిన అఖిల భారత జాతీయ కాంగ్రెసు మహాసభలో క్విట్ ఇండియా తీర్మానం ఆమోదించటం జరిగింది. బ్రిటిష్ ప్రభుత్వం వెంటనే భారతదేశం వదలి వెళ్ళాలని ఈ తీర్మానం సారాంశం. ప్రతి భారతీయుడు ఈ ఉద్యమంలో భాగస్వామి కావాలని గాంధీజీ విజ్ఞప్తి చేశారు. బ్రిటిషు ప్రభుత్వం జాతీయ నాయకులందరినీ అకస్మాత్తుగా బొంబాయి లో అరెస్టు చేసింది. ఆసేతు హిమాచలం జైళ్ళన్నీ నిండిపోయినవి. క్విట్ ఇండియా ఉద్యమ నినాదం దేశమంతటా మారుమ్రోగింది. జయప్రకాశ్ నారాయణ, రామమనోహర్ లోహియా, అరుణా అసఫ్ ఆలీ వంటి సోషలిస్టు నాయకులు అజ్ఞాతవాసంలోకి వెళ్ళి పోరాటాన్ని ఉధృతంగా శక్తివంతంగా నడిపించారు. స్వామీ రామానంద తీర్థ బొంబాయి నుంచి హైదరాబాదు చేరుకోగానే ఆయనను అరెస్టు చేసి జైలుకు పంపించారు. హైదరాబాదు రాష్ట్రమంతటా పందలాది కార్యకర్తలు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. సంస్థానంలో జైళ్ళన్నీ నిండిపోయినవి. సంస్థానంలో ప్రతి పట్టణంలో హర్తాళ్ళు, నిరసన ప్రదర్శనలు జరిగినవి. భారతదేశమంతటా పెల్లుబికి క్విట్ ఇండియా ఉద్యమం బ్రిటిషు ప్రభుత్వాన్ని గడగడలాడించింది. ఈ సందర్భంలో జయప్రకాష్ నారాయణ హైదరాబాదును సందర్శించారు. సుభాష్ చంద్రబోస్ స్థాపించిన ఐ.ఎన్.ఏ. లో హైదరాబాదు కు చెందిన ఆబిద్ హసన్ సఫ్రానీ, సురేష్ చంద్ర చేరారు. 1943 డిసెంబర్ నెలలో స్వామీజీని మరికొందరు నాయకులను విడుదల చేశారు. 1944 మేలో గాంధీజీ విడుదలయ్యారు. బ్రిటిషు ప్రభుత్వంతో సంప్రదింపులు ప్రారంభమైనవి. 1945లో జాతీయ కాంగ్రెసు నాయకులందరు విడుదలయ్యారు. గాంధీ–జిన్నాల మధ్య జరిగిన సంభాషణలు విఫలమైనవి. బ్రిటిషు ప్రభుత్వం కాంగ్రెసు, ముస్లిం లీగ్, ఇరు పక్షాల నాయకులను చర్చలకు ఆహ్వానించింది.

## స్వతంత్ర భారత అవతరణ

ఉవ్వెత్తున పొంగివస్తున్న ప్రజా ఉద్యమాన్ని తట్టుకోలేకపోయింది బ్రిటిషు ప్రభుత్వం. అప్పుడు బ్రిటన్ లో అధికారం లో వున్న లేబర్ పార్టీ ప్రభుత్వం భారత దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాలని నిర్ణయించింది. పాకిస్థాన్ ఏర్పడాలని ముస్లిం లీగ్ పట్టుపట్టింది. భారతదేశ విభజన జరగక తప్పలేదు. 1947 ఆగస్టు 15వ తేదీన భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభించింది. ఢిల్లీ ఎర్రకోటపై త్రివర్ణ పతాకం రెపరెపలాడింది. పండిట్ జవహర్ లాల్ నెహ్రూ ప్రధానమంత్రిగా జాతీయ ప్రభుత్వం ఏర్పడింది. ఉప ప్రధాని సర్దార్ వల్లభాయ్ పటేల్ దీక్షాదక్షతలు, రాజకీయ చతురత వల్ల భారతదేశంలోని స్వదేశీ సంస్థానాలన్నీ ఒక్కొటొక్కటే ఇండియన్ యూనియన్ లో విలీనమైనవి. హైదరాబాదు సంస్థానం రాజు మీర్ ఉస్మాన లీఖాన్ ఇండియన్ యూనియన్ లో చేరకుండా పేచీ పెట్టాడు. తాను స్వతంత్రంగా వుండగలనని ప్రకటించాడు.

## తుది పోరాటం

హైదరాబాదు రాష్ట్రం ఇండియన్ యూనియన్ లో విలీనం కావాలని, సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొల్పాలని స్టేటు కాంగ్రెసు తీర్మానించింది. కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టులు పోరాటానికి పిలుపు ఇచ్చారు. 1947 ఆగస్టు 7వ తేదీన రాష్ట్రమంతటా "ఇండియన్ యూనియన్ విలీన దినోత్సవం" జరపాలని స్టేటు కాంగ్రెసు నిర్ణయించింది. సంస్థానమంతటా పెద్దపెట్టున సత్యాగ్రహోద్యమం జరిగింది. వేలాది కార్యకర్తలు త్రివర్ణ పతాకాలు ఎగురవేసి అరెస్టు అయ్యారు. స్వామీజీని అరెస్టు చేసి వదిలి వేశారు. ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులు సర్దార్ జమలాపురం కేశవరావు మధిరలో పదివేల మంది జనసమూహం మధ్య సత్యాగ్రహంచేసి అరెస్టు అయ్యారు. "హైదరాబాదు సంస్థాన ప్రజలు స్వతంత్ర పౌరులుగా స్వతంత్ర భారతావనిలో అంతర్భాగంగా అయినప్పుడే హైదరాబాదు గౌరవ ప్రతిష్టలు ఇనుమడించగలవు: స్వతంత్ర్యంగా ఉండటానికి నిజాం రాజు చేసే ప్రయత్నా లన్నింటినీ ప్రజలు ప్రతిఘటించగలరు" అని స్వామీ రామానంద తీర్థ ప్రకటించారు.

స్టేటు కాంగ్రెసు పిలుపు నందుకొని ప్రజలు సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. న్యాయవాదులు కోర్టులు బహిష్కరించారు. విద్యార్థులు పాఠశాలలు వదలివేసి ఉద్యమంలో దూకారు. గ్రామాలలో పటేల్ పట్వారీలు రికార్డులు ప్రభుత్వానికి వప్పచెప్పి తమ పదవుల నుంచి వైదొలగారు. వర్తకులు, కార్మికులు, కర్షకులు అంతా నిజాం నిరంకుశ పరిపాలన 'ఆజాద్ హైదరాబాద్' ఆలోచనకు వ్యతిరేకంగా పోరాటానికి సంసిద్ధులైనారు. కమ్యూనిస్టు పార్టీ సాయుధ పోరాటాన్ని ఆరంభించింది. గ్రామాలలో ఇత్తెహద్ ల్ము

సల్మీన్ సంస్థ రజాకార్లు, నిజాం పోలీసుల హింసా కాండను కమ్యూనిస్టు దళాలు ఎదుర్కొన్నవి. విజయవాడ, షోలాపూర్, బ్రాందీ, బొంబాయి పట్టణాలలో స్టేటు కాంగ్రెసు ప్రాంతీయ కార్యాలయాలు నెలకొల్పింది. సరిహద్దు శిబిరాలు ఏర్పడినవి. రజాకార్ల దౌర్జన్యాలు, హింసా కాండను ఎదుర్కొనటానికి కాంగ్రెసు నాయకులు, కార్యకర్తలు కూడా ఆయుధాలు ధరించవలసి వచ్చింది.

సంస్థానంలో శాంతి భద్రతలు పూర్తిగా క్షీణించినవి. ఇత్తెహాదుల్ముసల్మీన్ సంస్థ అధ్యక్షుడు సయ్యద్ ఖాసిం రజ్వా హైదరాబాదు సంస్థానం స్వతంత్రంగా ఉండగలదని పదే పదే ప్రకటనలు చేయసాగాడు. అతనిని అదుపు చేసే ధైర్యం నిజాంకు లేకపోయింది. ప్రజల ధన, మాన ప్రాణాలకు రక్షణ లేకుండా పోయింది. ఈ పరిస్థితిలో 1948 సెప్టెంబర్ 13వ తేదీన పోలీసు చర్య జరిగింది. ఇండియన్ యూనియన్ సైన్యాలు సరిహద్దు దాటి హైదరాబాదు సంస్థానంలోకి ప్రవేశించినవి. నిజాం సైనికులు కొద్దిపాటి ప్రతిఘటన తరువాత భారత సైన్యానికి లొంగిపోయారు. హైదరాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనమవుతున్నట్లు నిజాం ప్రకటన చేశాడు. నిజాం రాజు రాజ్ ప్రముఖ్‌గా నియమితుడైనాడు.

1952లో హైదరాబాదు రాష్ట్రంలో వయోజన ఓటింగ్ పద్ధతిపై ఎన్నికలు జరిగినవి. శ్రీ బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ప్రథమ ప్రజాస్వామ్య ప్రజా ప్రభుత్వం ఏర్పడింది.

ఎందరో మహనీయులు, త్యాగధనులు వివిధ ఉద్యమాలలో, పోరాటాలలో పాల్గొన్నారు. ఎన్నో కష్టనష్టాలకు గురి అయ్యారు. దేశస్వాతంత్ర్యం కోసం బలి అయ్యారు. అటువంటి దేశభక్తులంతా చిరస్మరణీయులు. వారికి నా శ్రద్ధాంజలి.

# వసంత శోభ

ఆచార్య సోమంచి అనంత పద్మనాభ శాస్త్రి

వసంతుడొచ్చాడు చెలీ!
వసంతుడొచ్చాడు విను,
కొమ్మలలో కోయిలమ్మ
రమ్మన మని పిలుస్తోంది!

మల్లెపూల పరిమళాలు
ఉల్ల మలర చేయుచుండ
మధుమాసం నాలోపల
మధురోహలు పెంచువేళ -
విరబూసిన మందారం
చిరునవ్వులు రువ్వువేళ
ఎడమొగమై పెడమొగమై
ఎందుకు కూర్చున్నావు ?
కలలలోనె, గడిపేయుట
కాలం తగునా ?
కల నిజముకు దూరంగా
బ్రతుకుట తగునా ?

సంసారం మొదలుపెట్టి
సహకాలం జరిగె - !
సంపాదన పెరగలేదు
పెరిగెను సంసారం !....
మధుమాసపు కోరికల -
తలపదేలనోయ్ ?
వయసొచ్చిన వధువు కింక
వరుని చూడవోయ్
ఎదుగుతోన్న పిల్లలకిక,
సాఫీగా బతికేందుకు
తెరువు చూడవోయ్ !
బ్రతుకు తెరువు చూడవోయ్!

# తెలుగునాట మహిళోద్యమం

మల్లాది సుబ్బమ్మ



సారా నిషేధించాలని కోరుతూ ఆంధ్ర ప్రదేశ్‌లో పెల్లుబికిన అపూర్వ మహిళా ఉద్యమం

తెలుగునాట మహిళోద్యమాన్ని గురించి రాయాలంటే తెలుగు మహిళలు పాల్గొన్న భారతీయ మహిళోద్యమాన్ని గురించి స్పృశించక తప్పదు. తెలుగు స్త్రీల ప్రత్యేకతగా విలసిల్లిన వారి ఉద్యమాల చరిత్రను రాయడం తప్పనిసరి. మహిళోద్యమం అంటే రెండు రకాలుగా అర్థం చేసుకోవచ్చు. మహిళల శ్రేయస్సు కోసం స్త్రీ పురుషులు చేపట్టే ఉద్యమాలు మొదటివి. కాగా మహిళలు మాత్రమే తమ బాగోగులను మెరుగు పర్చుకునే ఉద్యమాలు రెండవ కోవకు చెందుతాయి.

మహిళోద్యమాన్ని అనేక కోణాల నుండి పరిశీలించవచ్చు. మహిళోద్యమ చరిత్రను దశలవారీగా విభజించి ఆయా కాలాల్లో ఉద్యమ చరిత్రను వివరించటం ఒక పద్ధతి. 1860–1918 సామాజిక సంస్కరణ యుగం గాను, 1919–1942 జాగృతి శకంగాను, 1943–1952 తిరుగుబాటు, ఆందోళన కాలంగాను, 1953–1974 స్థిరీకరణ దశగాను, 1975–1984 మహిళా దశాబ్దంగాను 1985 నుండి నేటివరకు మహిళా దశాబ్దానంతర కాలం గాను పరిగణిస్తున్నారు. అలా దశలవారీగా ఉద్యమాన్ని అధ్యయనం చేయుటం విలక్షణమయినదే. మహిళోద్యమంలో ప్రబలంగా వున్న సిద్ధాంతాలను పేర్కొని వాటి తాలూకు కార్యాచరణను విశదీకరించటం రెండవ విధానం. స్త్రీ స్వేచ్ఛా ఉద్యమం ఈనాడు ఉదారవాద, మార్క్సిస్టు, సోషలిస్టు, హ్యూమనిస్టు, రాడికల్, సెక్సువల్ సిద్ధాంతాలవల్ల ప్రభావిత మవుతున్నది. స్త్రీలకు ఉన్న సమస్యలను వారి వర్గ స్వభావాన్ని బట్టి తెలియజెప్పడం మరో విధం. ధనిక స్త్రీలు, మధ్య తరగతి స్త్రీలు, కార్మిక స్త్రీలు అని మహిళా ప్రపంచాన్ని విభజించి, గుర్తించి వారి సమస్యలను, చరిత్రను తరచి చూడటం మూడవ మార్గం. వీటి అన్నింటికీ భిన్నంగా స్త్రీల ప్రధాన సమస్యలను పేర్కొని వాటి పరిష్కారానికి ఎవరు, ఏ వర్గం వారు, ఏ సిద్ధాంతం వారు, ఏ సంఘం

వారు ఎలా కృషి చేశారో వీలయినంత సమగ్రంగా, విశ్లేషణాత్మకంగా ఉదహరించటం చివరి తీరు. ఆంధ్రలో మహిళోద్యమం అంటే 133 సం॥ (1860-1993) చరిత్రను ఏకరువు పెట్టడం యీ వ్యాస పరిధికి మించిన పని. కాగా స్టేటస్ కమిటీ రిపోర్టు, మహిళా దశాబ్దం ఫలితంగా 1975 నుండి మహిళోద్యమం ఊపందుకున్న విషయం సర్వజన విదితం. అయితే ఈ వేగానికి ప్రాతిపదికగా నిలిచింది 1953-1974 నాటి స్థిరీకరణ దశ. కనుక 1860-1952 కాలపు మహిళోద్యమాన్ని చారిత్రక దృష్టితో గమనించి, స్పృశించి 1953 నుండి యీనాటి వరకు అంటే 40 ఏళ్లుగా జరిగిన కాలాన్ని సమీక్షించ పూనటం సబబు.

ఇందులో 1985 నుండి యిప్పటి వరకు జరిగిన మహిళాభ్యుదయాన్ని ప్రత్యేక శ్రద్ధతో చూడటం ఆవశ్యకం కదాను. కనుక ముందుగా స్త్రీ జనాభ్యుదయానికి తోడ్పడిన ప్రముఖులను పేర్కొనటం సముంజసం. ఈనాడు స్త్రీలు యింత స్వాతంత్ర్యం తాము మనుష్యులమే, కనుకనే హక్కులున్నాయి, పురుష ప్రాధాన్య సమాజం కాక భాగస్వామ్య సమాజం కావాలని, తను వ్యక్తిత్వం, హుందా గౌరవించబడాలి అని ఆందోళన చేయగల్గుతున్నారంటే అనేకమంది పేరెన్నికగన్న మహనీయులయిన స్త్రీ పురుషుల కృషి ఫలితమే అనక తప్పదు.

మహిళోద్యమం అనగానే ముందుగా కందుకూరి దంపతులు మన స్మృతిపథంలో మెదుల్తారు. యుగకర్త కందుకూరి (1848-1919) కేవలం వితంతు పునర్వివాహోద్యమ ప్రారంభకులే కాదు. స్త్రీజన పునర్వికాసానికి బాటలు వేసిన మహా వ్యక్తి. స్త్రీలకు విద్యావిజ్ఞానాలు అందించటానికి, మూఢ విశ్వాస నిర్మూలనకు, స్త్రీలను బాధించే దురాచారాలను ఖండించటానికి, సమాజంలో స్త్రీలను భాగస్వాములను చేయటానికి పత్రికలు, సభలు, సమాజాలు స్థాపించి ఉపన్యాసాల ద్వారా, రచనల ద్వారా సర్వతోముఖంగా మహిళాభ్యుదయానికి పాటుపడిన మహోన్నతమూర్తి. ఆయన భార్య రాజ్యలక్ష్మమ్మ (1851-1910) స్త్రీ జనోద్ధరణకు కంకణం కట్టుకున్న కాంత. భోగం మేళాలను వ్యతిరేకించి పరిశుద్ధ వర్తనాన్ని ప్రోత్సహించిన రఘుపతి వేంకట రత్నంనాయుడు (1862-1939) స్త్రీ అబల కాదని ప్రవచించి, వృద్ధులయిన పురుషులు బాలికలను వివాహం చేసుకునే దుష్ట సంప్రదాయాన్ని ఖండిస్తూ, పురుష ప్రాధాన్య సమాజపు రీతులను గర్హిస్తూ రచనలు చేసి, స్త్రీలకు విడాకులు కోరే హక్కు కావాలని ఉద్ఘాటించిన ఘనత గురజాడ అప్పారావుది (1862-1915). స్త్రీకి కూడా శరీరం వుంది. దానికి వ్యాయామం యివ్వాలి. మెదడు వుంది. దానికి జ్ఞానం యివ్వాలి. ఆమెకు హృదయం వుంది. దానికి అనుభవం యివ్వాలి అని ఉద్ఘాటించి, ప్రచారం చేసి, బోధించిన చలం (1894-1979) చిరస్మరణీయుడు. స్త్రీలకు లైంగిక స్వాతంత్ర్యం కావాలని గట్టిగా వాదించి చలం స్త్రీలకు మహోపకారం చేశాడు.

స్త్రీల వ్యక్తిత్వాన్ని గౌరవించి, వారి సేవా నిరతిని, సామర్థ్యాన్ని గుర్తించి తన ఉద్యమాలలో (1921, 1930, 1931, 1941, 1942) స్త్రీలకు సముచిత భాగస్వామ్యం కల్పించిన మహాత్మాగాంధీని విస్మరించలేము. ఏవో కొన్ని సమస్యల మీద తప్ప స్త్రీల విషయంగా విప్లవాత్మక భావాలను ప్రకటించిన గాంధి స్త్రీల పట్ల చూపిన సానుభూతి, ఆదరణ, సమానత్వ భావన, కన్యాదాన నిరసన ప్రశంసనీయం. ఆ కాలంలో దేవదాసీ వ్యవస్థ నిర్మూలనకు ఎంతో శ్రమించిన యామినీ పూర్ణతిలకం, గంధం అమ్మన్న రాజాలు ఆయన శిష్యులే. తరువాత స్త్రీ జనోద్ధరణకు అనేక కార్యక్రమాలు చేపట్టి సుప్రసిద్ధులైన దుర్గాబాయ్ (1908-1981) పత్రిక, సంఘాలు స్థాపించి ఆయన యుగంలో ఆయన బోధనలవల్ల ప్రభావితులయిన వారే. అఖిలభారత మహిళా మహా సభకు స్థాపకులయిన మార్గరెట్ కజిన్స్ (1878-1954). దానికి బలాన్ని ఊపును యిచ్చిన సరోజిని నాయుడు (1879-1949), ఆ సంఘ విస్తరణకు విశేషంగా పనిచేసిన కమలాదేవి చటోపాధ్యాయ (1903-1989) గాంధీజీవల్ల స్ఫూర్తి పొందినవారే. యువతులకు ఆత్మ విశ్వాసాన్ని అందించిన ఉన్నవ లక్ష్మీబాయమ్మ (1877-1958), పొణకా కనకమ్మ (1869-1963) ఇత్యాదులు గాంధీజీ ఉద్యమాలలో ఉద్భవించినవారే. గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రథమ గ్రహీత మహిళోద్యమ సారధి గాంధీజీ అడుగుజాడంలో సంచరించిన మహిళయే. విడాకుల విషయంలో మితవాద ధోరణిని అవలంభించినా మహిళోద్యమానికి అండగా నిలిచిన కడప రామసుబ్బమ్మ కాంగ్రెసు వాదియే. స్థిరీకరణ దశలో పలువురు స్త్రీలు వివిధ నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొని కీర్తిని ఆర్జించారు. కమ్యూనిస్టు సిద్ధాంతం అన్ని రంగాలలో స్త్రీ పురుష సమానత్వాన్ని చాటుతుంది. తెలంగాణా పోరాటకాలంలో (1946-1952) ప్రముఖ పాత్ర వహించిన స్త్రీలలో పేరెన్నికగన్న వారు ఐలమ్మ, మల్లు స్వరాజ్యం, నరసమ్మలు. స్త్రీలలో జాగృతిని, చైతన్యాన్ని వ్యాప్తి చేయ

పూనుకొని స్త్రీలకు కుటుంబ నియంత్రణ సందేశాన్ని అందచేసి, స్త్రీలకు సమానత్వం యెడ ఆసక్తిని కలుగజేసిన కొమర్రాజు అచ్చమాంబ (1906-1964) ప్రముఖ కమ్యూనిస్టు కార్యకర్త్రే. ఆంధ్రప్రదేశ్ కుటుంబ నియంత్రణోద్యమానికి సారధ్యం వహించిన ప్రేమలతా గుప్త. అనాధ స్త్రీలను ఆదుకున్న యల్లాప్రగడ సీతాకుమారి ఎం.ఎల్.సి. కూడా మహిళోద్యమ రధసారధులే.

## రాష్ట్రస్థాయి మహిళా సంఘాలు

**జాగృతిశకం:–** ప్రథమ ఆంధ్రరాష్ట్ర మహాసభ 1929లో డా॥ ముత్తు లక్ష్మీ రెడ్డి అధ్యక్షతన జరిగింది. బాల్య వివాహ నిషేధ శాసనాన్ని ఆహ్వానిస్తూ, 10 ఏండ్లలో మద్య నిషేధాన్ని కోరుతూ, దేవదాసీ వ్యవస్థ నిర్మూలనాన్ని ఆశిస్తూ, తండ్రి ఆస్తిలో కుమార్తెకు వాటా కోరుతూ తీర్మానాలు ఆమోదింపబడినాయి. 1931లోని రాష్ట్ర మహాసభలో వివాహిత పురుషులను స్త్రీలు వివాహమాడరాదని, స్త్రీలకు ప్రత్యేక కళాశాలలను స్థాపించాలని తీర్మానాలు చేశారు. 1932లో ఆచంట రుక్మిణీదేవి అధ్యక్షతన మహాసభ జరిగింది. సామాజిక దురాచారాలను ఆమె తన అధ్యక్షోపన్యాసంలో ఖండించారు. వివాహాలను రిజిష్టరు చేయాలని ఒక తీర్మానంలో కోరబడింది.

తెలంగాణాలో 1931లో జరిగిన ద్వితీయ ఆంధ్రమహిళా సభ టి. వరలక్ష్మమ్మ అధ్యక్షతన సమావేశమయింది. ఆమె సంఘ సంస్కర్త. ఆమె స్త్రీల ఆరోగ్యం విషయమై శ్రద్ధ వహించాలని కోరారు. 1934లో తృతీయ మహాసభ ప్రముఖ సంఘసేవకురాలు ఎల్లాప్రగడ సీతాకుమారి అధ్యక్షతన కూడింది. 1936లో జరిగిన మహాసభకు బూర్గుల అనంతలక్ష్మి అధ్యక్షత వహించింది. 1940లో చిలుకూరులో రంగమ్మా ఓబుల్‌రెడ్డి అధ్యక్షతన జరిగిన 8వ మహాసభ చెప్పుకొనతగింది. **వితంతువులకు భర్త ఆస్తిలో హక్కులు, భర్తచేత వదలివేయబడిన** స్త్రీలకు పునర్వివాహపు హక్కు ఆనాడే కోరబడి **నాయి.ఆడపాపల వ్యవస్థను, పరదాను తొలగించాలని** కోరారు. బహుభార్యాత్వ నిషేధాన్ని ఆశించారు.

గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి, గంజాం జిల్లాలలో జిల్లా సంఘాలు బాగా పనిచేసినాయి. మదరాసు నుండి బరంపురం దాకా అనేక స్థానిక సంఘాలు ఉద్యమ వ్యాప్తికి తోడ్పడినాయి.

**ఆందోళన కాలం:–** 1945లో జరిగిన 17వ ఆంధ్ర రాష్ట్ర మహిళా మహాసభను విస్మరించలేము. అందులో వివాహిత పురుషుని వివాహమాడిన స్త్రీకి సభ్యత్వం నిరాకరించబడింది. ఇది కొమర్రాజు అచ్చమాంబను దృష్టిలో ఉంచుకొని చేసిన తీర్మానం. ఇది ఉత్తరోత్తరా మహిళోద్యమం రెండు కావడానికి తోడ్పడింది. 1946లో నెల్లూరులో సమావేశమయిన మహిళా మహాసభ అస్పృశ్యతా నివారణను, మద్యపాన నిషేధాన్ని కోరింది.

ఆంధ్రప్రాంతపు కమ్యూనిస్టు మహిళలు ఆంధ్ర మహిళా మహాసభలనుండి విడివడి 1947 లో ప్రథమ రాష్ట్రమహాసభను జరుపుకున్నారు. గ్రామాలకు వ్యాప్తిచేసిన మహిళోద్యమం వారి మహాసభలో ప్రతిఫలించింది. అంతకు ముందు వారి కార్యకలాపాలు ప్రజల దృష్టిని ఆకర్షించాయి. 150 మంది మహిళా వాలంటీర్లు పురుష దుస్తులతో కవాతు చేయటం (1943), అఖిల భారత కిసాన్‌సభ సందర్భంగా 1000 మంది మహిళలు ఊరేగటం (1946), హిందూ 'లా' మార్పును కోరుతూ బి.ఎన్. రావు కమిటీ రిపోర్టుకు మద్దతుగా 50 వేల స్త్రీల దస్కతులు సేకరించడం (1946) ముఖ్య కార్యక్రమాలు. 1975లో నెల్లూరులో జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు స్త్రీల మహాసభకు పొణకా కనకమ్మ అధ్యక్షులు. మహిళా ఫెడరేషన్లు కలిసిపోవాలని ఆశించారు మహాసభ ప్రతినిధులు. దుర్గాబాయ్ చేత మద్రాసులో నెలకొల్పబడిన ఆంధ్ర మహిళా సభ స్థానిక మహిళా సమాజాలలో ప్రతిష్ఠాపూర్వకమైనది.

**స్థిరీకరణ దశ:** అఖిలభారత మహిళా సంఘానికి చెందిన స్త్రీలు నిర్మాణ కార్యక్రమాలను చేపట్టమని సాగించారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల సాయంతో వయోజన స్త్రీలకు సంక్షిప్త 'కోర్సులతో' విద్యాలయాలు, బాల్వాడీలు, 'కాంటీనులు', ఉద్యోగినుల వసతి గృహాలు, శిశువులకు క్రెషీలు యిలా అనేక రకాల నిర్మాణ కార్యక్రమాలను తీసుకోవటం జరిగింది.

1963లో పండిట్ నెహ్రూ చేత హైదరాబాదులో ప్రారంభింపబడిన ఆం.ప్ర. మహిళా మహాసభ గమనించ తగింది. ప్రసిద్ధ సంఘసేవకురాలు సంగం లక్ష్మీబాయ్ అధ్యక్షతన స్థానిక స్వపరిపాలనా సంస్థలో స్త్రీలు ప్రాతినిధ్యాన్ని 'డిమాండు' చేశారు.

1964లో ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టులలో వచ్చిన చీలిక ప్రభావం కమ్యూనిస్టు మహిళల కార్యకలాపాలపై పడింది. కమ్యూనిస్టు పార్టీని అభిమానించిన వారు ఆం.ప్ర. మహిళా సమాఖ్యను స్థాపించుకోగా, కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) ను ఆదరించే స్త్రీలు ఆంధ్ర ప్రదేశ్ మహిళా సంఘంను నెలకొల్పుకున్నారు. రెండు సంఘాలు శ్రామిక స్త్రీల సమస్యలపై ఎక్కువగా

నొక్కి పెట్టారు.

మద్రాసు ఆంధ్ర మహిళా సభ దినదినాభివృద్ధి చెందింది. హైదరాబాదులోని ఆంధ్ర యువతీమండలి స్త్రీ ఉద్యోగుల వసతి గృహ నిర్మాణమే కాక పలు సంక్షేమ కార్యక్రమాలను ఎత్తుకుంది.

**మహిళా దశాబ్దం:** అఖిల భారత మహిళా మహాసభ బాగా స్థిరపడింది. దానికి ఆంధ్రప్రదేశ్‌లో అనుబంధ సంస్థలున్నాయి. అవి వార్షిక సమావేశాలు, ద్వైవార్షిక సమావేశాలు జరుపు కుంటున్నాయి. ఆంధ్ర ప్రదేశ్‌లో అఖిల భారత మహిళా సభకు 7 శాఖలున్నాయి. హైదరాబాదు శాఖ ఒక ప్రాథమిక పాఠశాలను, కుట్టు కేంద్రాన్ని నడుపుతున్నది. ఆంధ్ర యువతీ మండలి, మహిళా నవజీవన మండలి, లేడీ హైదరీ క్లబ్ అనుబంధ సంస్థలలో ముఖ్యమయినవి. విజయవాడ బాలల మహిళా మండలి కోస్తా ప్రాంతంలో పేరు ప్రఖ్యాతులున్న మహిళా సమాజం.

జాతీయ మహిళా ఫెడరేషను 1954 లో పుట్టగా దాని అనుబంధ సంస్థ ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య చురుకుగ పనిచేసింది. 18 జిల్లాలలోని 1 [illegible] మంది స్త్రీలను అక్షరాస్యులను చేసినట్లు 1977 రిపోర్టు తెలుపుతున్నది. 25 శాతం ఉద్యోగాలలో రిజర్వేషనులు కోరింది. 1982 నాటికి లక్షపైగా సభ్యులున్నట్లు తమ మహాసభకు 700 మంది ప్రతినిధులు వచ్చినట్లు సమాఖ్య ప్రకటించింది.

అఖిలభారత ప్రజాస్వామ్య మహిళా సంఘానికి అనుబంధంగా వున్న ఆంధ్ర ప్రదేశ్ మహిళా సంఘం 1979లో స్త్రీలకు కరాటే శిక్షణ తరగతులు నిర్వహించింది. పుస్తకాలు ప్రచురించింది. స్త్రీలపై జరిగిన అత్యాచారాలకు వ్యతిరేకంగా ఆందోళన చేసింది. మురికి పేటలలోని స్త్రీల సమస్యలను చేపట్టింది. భూస్వాముల, పోలీసుల దౌర్జన్యాన్ని ఎదుర్కోవటానికి స్త్రీలకు సాయపడింది.

రాష్ట్రప్రభుత్వ ప్రోత్సాహంతో వేల గ్రామాలలో మహిళా సంఘాలు ఏర్పడినాయి. కాని అన్నీ సక్రమంగా పని చేయటం లేదు. కొన్ని సమర్థవంతంగా నిర్మాణ కార్యక్రమాలు, సంక్షేమ కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి.

హైదరాబాదులో రిజిష్టరయిన అభ్యుదయ మహిళా సమాఖ్య ఆందోళన చేసి 1979లో విదేశాలకు కూరగాయల ఎగుమతిని ఆపించింది. స్త్రీ శక్తి సంఘటన స్త్రీలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా ఆందోళన సాగించింది. భార్యలను చంపిన పురుషుల యిళ్లవద్ద ప్రదర్శనలు చేసింది. లలిత వసంత, వగయిరా మహిళల నాయకత్వాన రమీజాబీబీ కేసును బెంగుళూరులో హైకోర్టులో నడిపింది. మల్లాది సుబ్బమ్మ చేత స్థాపించబడిన మహిళాభ్యుదయ సంస్థ మహిళలలో [illegible] చైతన్యాలను పెంపొందించ [illegible] చేస్తున్నది. స్త్రీల సమస్యలపై 50 పుస్తకాలు ప్రచురించింది. కట్నం, కులం, మత తంతు యివి లేని వివాహాలను ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ వివాహ వేదిక ప్రోత్సహిస్తున్నది, జంపరుస్తున్నది, చేస్తున్నది. స్త్రీల హక్కుల పరిరక్షణా కేంద్రం, వరకట్న హింసలదర్యాప్తు సంఘం మల్లాది సుబ్బమ్మ పర్యవేక్షణలో పని చేస్తున్నాయి.

**మహిళా దశాబ్దానంతర కాలం:—** అఖిల భారత మహిళా మహా సభకు ఆంధ్ర ప్రదేశ్‌లో 8 శాఖలున్నాయి. హైదరాబాదు శాఖ ఉద్యోగినుల వసతి గృహమేకాక రెండు ప్రాథమిక పాఠశాలలను నడుపుతున్నది. ఎ. శ్యామలాదేవి ఆధ్వర్యాన నడిచే ఆంధ్ర యువతీ మండలి హైస్కూలు, శిశువిహార్, 5 పరిసర ప్రాంతాలలో క్రెషిలు వగయిరాలు నిర్వహిస్తున్నది. అలాగే మంగమ్మాచారి గారిచే నడపబడుతున్న మహిళా విద్యాపీఠం, బాజమ్ ఇ ఖల్యాన్ సంఘం, హైస్కూలు, శిశు విద్యాలయం, డిగ్రీ కాలేజీని నిర్వహించే మహిళా నవ జీవన మండలి, భద్రాచలం మహిళా సమితి యిత్యాదులు గణనీయమైన సేవ చేస్తున్నాయి.

మహిళా దక్షతా సమితి ఆం.ప్ర.శాఖ 1990లో పుట్టింది. అది సుమన్ కృష్ణ కాంత్ నాయకత్వాన పనిచేస్తున్నది. నిజామాబాద్, విశాఖపట్నం, వరంగల్, కరీంనగర్, హైదరాబాదు, చిత్తూరు జిల్లాల శాఖలు అనేక కార్యక్రమాలు చేస్తున్నాయి. కుటుంబ సలహా కేంద్రాన్ని హైదరాబాద్ శాఖ నిర్వహిస్తున్నది. ఆం.ప్ర. మహిళా సమాఖ్య పూర్వంలాగానే శ్రామిక స్త్రీల సమస్యలపై పాటుపడుతున్నది. ఆం.ప్ర. మహిళాసంఘం 1993లో స్వర్ణోత్సవాన్ని జరుపుకుంది. మహిళా సమాఖ్యలాగానే పాటకపు స్త్రీల సమస్యలను చేపట్టా క్రైస్తవ భిషప్ క్రైస్తవ మత ప్రచారం కోసం ఆజన్మ బ్రహ్మచారిణులుగా వున్న 'నన్సును' ఏలూరు భిషప్ మఠంలో ఆజన్మాంతం మూసిపెట్టదలిస్తే కోర్టులో ఆందోళన చేసి మాన్పించింది.

సుప్రసిద్ధమైన హైదరాబాదు ఆంధ్ర మహిళా సభ కార్యక్రమాలు అనేకం. నిరక్షరాస్యతా నిర్మూలనం, వికలాంగుల సేవా కేంద్రం, ఆస్పత్రి, డిగ్రీ కళాశాలలు, ఉపాధ్యాయినులు, నర్సుల శిక్షణా కేంద్రాలు యిలా 15 రకాల కార్యక్రమాలను భారీ ఎత్తున కె. సుగుణమణి నాయకత్వాన సాగిస్తున్నది. ఓల్గా చొరవతో

'ఫెమినిస్టు స్టడీ సర్కిల్' అధ్యయన తరగతులను నిర్వహించింది. పుస్తక ప్రచురణ చేసింది. 'అన్వేషి' స్త్రీల సమస్యలపై పరిశోధన సాగిస్తున్నది. మహిళా విముక్తికి పరోక్షంగా ప్రత్యక్షంగా సాయపడిన స్త్రీల చరిత్ర యిప్పటికే రెండు భాగాలుగా ఇంగ్లీషులో సుశీతారు ప్రకటించింది. 'స్వచ్ఛంద ఆరోగ్య సమితి' వారు వీణా శత్రుఘ్న, వసంత కన్నబిరాన్‌ల నాయకత్వాన 'సవాలక్ష సందేహాలు' అన్న గ్రంథం 'స్త్రీ ఆరోగ్యాన్ని' గురించి ప్రచురించింది.

విదేశీ, స్వదేశీ నిధుల సాయంతో పనిచేసిన, చేస్తున్న సంస్థలు ఎంతో విలువైన సేవ చేస్తున్నాయి. అవేర్, క్రాస్, ఆర్టిక్, డబ్ల్యుసిఎడిల్, దక్కన్ డెవలప్‌మెంట్ సొసైటీ, నానోర్డ్ ఆలాంటివి. వారి స్త్రీల శాఖలు ప్రతిభా సంతం. విజయవాడలో మైత్రి ప్రోద్బలంతో నడిచే వాసవ్య మహిళామండలి, నిజామాబాద్ జిల్లాలో హేమలత పర్యవేక్షణలో జోగినులకు సహాయం చేసే 'సంస్కార్', స్త్రీలలో ప్రబోధ కార్యక్రమాలను చేసే 'సమతా', జ్ఞాన విజ్ఞాన యాత్రలు గమనార్హం.

మల్లాది సుబ్బమ్మ నడిపే మహిళాభ్యుదయ సంస్థ తన శాఖలు 'కుటుంబ సలహా కేంద్రం', 'స్త్రీ విమోచన', 'స్త్రీల హక్కుల పరిరక్షణా కేంద్రం' స్త్రీలలో జాగృతి కల్గించటానికి కృషిచేస్తున్నది. చర్చా వేదికలు నిర్వహించడమేకాక వాటి పరిశోధనా పత్రాలను పుస్తకాలుగా ప్రచురించిన విశిష్టత దానిది. అలా విలక్షణమైన సారస్వతాన్ని ఆంధ్ర స్త్రీలకు అందించింది. సతీ సహగమనానికి, మొనాస్టరీలకు వ్యతిరేకంగా ఆందోళన చేసింది. ఆంధ్రలో సారా వ్యతిరేక

వీరేశలింగంచే స్థాపించబడిన 'సతీహిత బోధిని' (1883), సంగీతరావు బాపిరాజుచేత నెలకొల్పబడిన 'శ్రీ బాలిక' (1869), నత్తిరాజు సీతారామయ్య ప్రారంభించిన 'హిందూ సుందరి' (1902) కౌతా శ్రీరామమూర్తి యొక్క 'శారద' (1923) రాయసం వెంకట శివుడి 'జనానా', డా॥కె.ఎన్. కేసరి నిర్వహించిన 'గృహలక్ష్మి' (1929), మద్రాసు రాష్ట్రంలో స్త్రీ సంక్షేమ శాఖ ప్రచురించిన 'సౌభాగ్య' (1947), వనిత (1975), వనితా జ్యోతి (1978) మహిళ (1975), 'కలువ బాల' మొదటి కోవకు చెందినవి.

ఉద్యమంలో తన వంతు పాత్ర నిర్వహించింది.

## పత్రికలు

ఉద్యమాలకు పత్రికలు జీవగర్రలు. మహిళోద్యమానికి బాసటగా నిలిచిన పత్రికలు మూడు రకాలు. మహిళల శ్రేయస్సుకోసం పురుషులు నడిపినవి మొదటిరకం. సర్వులకూ పనికివచ్చే పత్రికలు రెండవ తెగవి. మహిళల కొరకు మహిళల చేత ప్రచురింపబడేవి మూడవవి. మహిళోద్యమ చరిత్రను పరిశీలించి మూడు రకాల పత్రికలను పేర్కొనటం అవసరం.

వీరేశలింగంచే స్థాపింపబడిన 'సతీహిత బోధిని' (1883), సంగీతరావు బాపిరాజుచేత నెలకొల్పబడిన 'శ్రీ బాలిక' (1869), నత్తిరాజు సీతారామయ్య ప్రారంభించిన 'హిందూ సుందరి' (1902) కౌతా శ్రీరామమూర్తి యొక్క 'శారద' (1923) రాయసం వెంకట శివుడి 'జనానా', డా॥కె.ఎన్. కేసరి నిర్వహించిన 'గృహలక్ష్మి' (1929), మద్రాసు రాష్ట్రంలో స్త్రీ సంక్షేమ శాఖ ప్రచురించిన 'సౌభాగ్య' (1947), వనిత (1975), వనితా జ్యోతి (1978) మహిళ (1975), 'కలువ బాల' మొదటి కోవకు చెందినవి. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఈనాడు, ఉదయం, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, ప్రజాశక్తి దినపత్రికలు వాటి సంవత్సర, ప్రత్యేక సంచికలు, శ్రీ రాజ్యం పిన్హా, 'మాతృభూమి', సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మ 'తెలుగు దేశం' గోరా 'సంఘం', 'అస్మిక సమత', రాడికల్ హ్యూమనిస్టుల 'రాడికల్ హ్యూమనిస్టు', 'సమీక్ష'లు వట్టికొండ విశాలాక్షి 'ప్రజావాణి', మల్లాది సుబ్బమ్మ 'వికాసం', 'సృజన', 'ప్రజాసాహితి', ఎస్.ఎస్. లక్ష్మి 'ఆహ్వానం' రెండవ తెగకు చెందినవి.

పులుగుర్తి లక్ష్మీ నరసమాంబ 'సావిత్రి', 'అనసూయ', [illegible] పూర్ణతిలకం 'హిందూ యువతి', ఆర్చిబాల్డ్ సమితి 'వివేకవతి', బి. రమాబాయ్ 'సౌందర్యవతి' (1920), న్యాపతి కామేశ్వరి 'బాల' (1947), గుమ్మిడిదల దుర్గాబాయమ్మ (దుర్గాబాయ్ దేశ్‌ముఖ్) 'ఆంధ్రమహిళ' (1942), రత్నమాల 'నూతన', 'అనామిక', వి. కోటేశ్వరమ్మ 'ఇల్లు-ఇల్లాలు', మహిళావాణి, లోహిత, మల్లాది సుబ్బమ్మ 'స్త్రీ స్వేచ్ఛ' 'స్త్రీ విముక్తి', 'మహిళా మార్గం', సత్యవతి సంపాదకత్వాన డా॥ జి. భారతి ప్రోత్సాహంతో వడిచే 'భూమిక' త్రైమాసిక పత్రిక మూడవ వర్గానివి.

అత్యధిక సంఖ్యలో చదువరులు కల్గిన స్త్రీలచే నడుపబడే పత్రికలు లేవనే చెప్పాలి. కాగా లాభార్జనా దృష్టితో ప్రకటింపబడుతున్న పత్రికలు-ఇంగ్లీషువి కాని, తెలుగువికాని చందాదారుల సంఖ్యను పెంచుకునే దృష్టితోనయినా స్త్రీల సమస్యలను అప్పుడప్పుడు ప్రత్యేక పుటలను కేటాయించడం గమనార్హం.

స్త్రీలకోసం, స్త్రీల శ్రేయస్సును ఆశించి, స్త్రీలచే సాగించబడే పత్రికల భారీ ఎత్తున పత్రికా ప్రపంచంలోకి అడుగిడితే తప్ప స్త్రీల స్వాతంత్ర్యం, స్వేచ్ఛ, సమానత్వం, వ్యక్తి వికాసం, హుందా రక్షణ పోషింపబడవు.

## ఉద్యమాలు–స్త్రీలు

స్త్రీలు పాల్గొన్నవన్నీ మహిళోద్యమాలు అనుకోవటం పొరపాటు. సంస్కరణోద్యమంలో, గాంధీజీ కొనసాగించిన ఉద్యమాలలో, తెలంగాణా పోరాటంలో, శ్రీకాకుళం నక్సలైటు సంఘర్షణలలో, ప్రత్యేక తెలంగాణా, ప్రత్యేక ఆంధ్ర ఉద్యమాలలో, ఈనాటి నక్సలైటు ఆందోళనలలో మహిళలు గణనీయంగా పాల్గొన్నారు. కొన్నింట సంఖ్య తక్కువయినా పేరెన్నిక గాగల స్థితిలో భాగం పంచుకున్నారు. మరి కొన్నింట–ప్రత్యేకాంధ్ర, ప్రత్యేక తెలంగాణా ఆందోళనలో–భారీ ఎత్తున బహుళ సంఖ్యలో చేరి పేరు సంపాదించుకున్నారు. కాగా స్త్రీలు తమ శ్రేయస్సు కోసం, తమ అభ్యుదయం కొరకు ప్రత్యేకంగా చేసిన పోరాటం 'సారా వ్యతిరేకోద్యమం' అని చెప్పవచ్చు. తమ కుటుంబ సంక్షేమాన్ని ఆశించి, తమ కుటుంబ శాంతిని కోరి, త్రాగుబోతు భర్తలు తమను పెట్టే బాధలనుండి విముక్తి కోసం అంటే తమ అస్తిత్వం కోసం నాయకత్వం వహించి తిరుగుబాటు [illegible] చేసిన ప్రయత్నమే 'సారా వ్యతిరేక ఉద్యమం'. తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, తాముకోరే స్త్రీ పురుష సమానత్వం కొరకు చర్చా వేదికలు, సభలు, మహాసభలు, ఊరేగింపులు, ప్రదర్శనలు అడపాదడపా మహిళా లోకం చేపట్టింది కాని భారీఎత్తున, అవిచ్ఛిన్నంగా ఉద్యమం నడపలేక పోయింది.

## ప్రస్ఫుటమైన ఆందోళనలు

గ్రామాలలో, పట్టణాలలో స్త్రీలకు ప్రత్యేక పాయిఖానాల ఏర్పాటు కోసం, అధిక ధరలకు వ్యతిరేకంగా, కూరగాయల ఎగుమతి నిషేధ విషయంగా, భూస్వాముల, పోలీసుల దౌర్జన్యకాండను నిరసిస్తూ, స్త్రీలపై అత్యాచారాలను ఖండిస్తూ స్త్రీలు ఉద్యమించిన మాట వాస్తవమే. సమిష్టి కుటుంబ ఆస్తిలో కుమార్తెకు వాటాను యిచ్చిన ఎన్.టి.ఆర్. హిందూ వారసత్వ సవరణ చట్టాన్ని (1985) ఆహ్వానించిన విషయం సత్యమే. స్త్రీలకు స్థానిక సంస్థలలో ప్రాతినిధ్యం కావాలని ఆందోళన చేయటం నిజమే. స్త్రీలకు అధికారం కావాలని మహాసభను నిర్వహించినది సర్వజన విదితమే. అయితే స్త్రీజన బాహుళ్యాన్ని మహత్తరంగా కదిలించగల సత్తా ఆంధ్ర ప్రదేశ్ లో మహిళలకు యింకా సమకూడ లేదు. మహిళా విముక్తికోసం, స్త్రీ స్వేచ్ఛా సమానత్వాలకోసం కొన్ని ఉద్యమాలు స్థాపించబడినాయి. అవి తమ తమ సిద్ధాంతాల కనుగుణంగా పనిచేస్తున్నాయి.

## మహిళోద్యమం స్త్రీ విమోచన సిద్ధాంతాలు

ఈనాడు తెలుగునాట పనిచేసే మహిళోద్యమ కార్యకర్తలు విభిన్న స్త్రీ విమోచన సిద్ధాంతాలకు–ఆ విషయం తమకు తెలిసినా, తెలియక పోయినా–కట్టుబడివున్నారు. అన్ని సిద్ధాంతాలవారూ మనకు దర్శనమిస్తారు. పెట్టుబడిదారీ వ్యవస్థలో మార్పును ఆశించకుండా స్త్రీ పురుష సమానత్వాన్ని – సర్వతోముఖంగా–ఆశించే ఉదారవాద స్త్రీ విమోచనోద్యమకారులు (లిబరల్ ఫెమినిస్టు) ఎక్కువగా అఖిల భారత మహిళా మహాసభ (ఆల్ ఇండియా ఉమెన్సు కాన్ఫరెన్సు)కు చెందిన స్త్రీలలలో కన్పిస్తారు.

కేవలం మధ్యతరగతి స్త్రీల సమస్యలనే ఎత్తుకోకుండా, శ్రామిక స్త్రీల బాగోగులకు అవసరమైన సమస్యలను తీసుకొని వారి వేతనాలు, ఆర్థిక పరిస్థితి, గృహవసతి, భూమి యాజమాన్యం, భద్రత, భూస్వాములనుండి పురుష దురహంకారుల నుండి రక్షణవగయిరా వాటిపై నొక్కి పెట్టారు మార్క్సిస్టు స్త్రీ విమోచనవాదులు (మార్క్సిస్టు ఫెమినిస్టు) అయితే ప్రజాపోరాటాలను స్త్రీ విమోచన పోరాటం బలహీన పర్చ రాదని, ప్రజా పోరాటానికి స్త్రీ విమోచన పోరాటం లొంగి వుండాలని వారు ప్రకటిస్తారు. ఇలాంటి కార్యకర్తలు ఆం.ప్ర. మహిళా సమాఖ్యలో, ఆం.ప్ర. మహిళా సంఘంలో, ప్రగతిశీల మహిళా సంఘం (ఇరు శాఖలలో) కృషి చేస్తున్నారు. కమ్యూనిస్టులతిరుగుబాటు ఉద్యమాల లోకూడా స్త్రీలకు ప్రాధాన్యత లేదని, స్త్రీల ప్రతిపత్తిని హుందాను గౌరవించలేదని తెలిసికొన్న స్త్రీలు కొందరు మార్క్సిస్టు ఆచరణ ఎడ విసుగు చెంది, చివరకు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సవరించపూనుకున్నారు. మార్క్స్ ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మాత్రమే ప్రాముఖ్యత యిచ్చాడని, సమాజంలో జరిగే పునరుత్పత్తి **(Reproduction)** క్రమాన్ని, రీతిని సరిగా అవగాహన చేసుకోలేదని వాదించే స్త్రీలు యిటీవల కన్పడుతున్నారు. అయితే మార్క్సిజం యొక్క రాజకీయ ఆర్థిక ఆదార్శాలను, లక్ష్యాలను వారు కాదనటం లేదు. వారు ప్రస్తుతం మేధావి వర్గానికే చెంది వుండటం గుర్తించతగినది. వీరిని సోషలిస్టు ఫెమినిస్టులు **(Socialist feminists)** అనడం సమంజసం. స్త్రీల శారీరక

నిలక్షణత్వం వారి ప్రత్యేకతగా, గొప్ప[illegible] భావించి పురుష పెత్తందారీతనాన్ని, పురుష దురహంకారాన్ని యీసడించే రాడికల్ స్త్రీ విమోచనోద్యమకారులు (Radical Feminists) నికార్సైన వారెవరూ ఆంధ్రప్రదేశ్‌లో లేరు. కాని స్త్రీ వాద రచయిత్రులలో కొందరిలో రాడికల్ స్త్రీ విమోచన సిద్ధాంత ఛాయలు ఉంటున్నాయి. సహనం, సానుభూతి, కరుణ, శాంతికాముకత్వం, దయ, సమానత్వ భావన స్త్రీలకు మాత్రమే ఉంటాయని స్త్రీలకు పూర్తి అధికారం వస్తే ప్రపంచం బాగుపడుతుందని తలచే సాంస్కృతిక స్త్రీ విమోచనోద్యమకారులు (Cultural Feminists) మన రాష్ట్రంలో లేరు. జమిందారీ వ్యవస్థను, పెట్టుబడిదారీ, విధానాన్ని, పురుష ప్రాధాన్య పురుష దురహంకార వ్యవస్థను కాదని, స్త్రీలకు సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, సమానత్వం కావాలని, భాగస్వామ్యం కావాలని, స్త్రీ విమోచనోద్యమం, ప్రజోద్యమానికి లొంగి వుండనవసరం లేదని, స్త్రీ విమోచన ఉద్యమం స్వతంత్ర ప్రతిపత్తి కలిగి వుందని చెప్పేవారు మానవవాద స్త్రీ విమోచనోద్యమకారులు (Humanist Feminists). వీరు ఉదారవాద, మార్క్సిస్టు, సోషలిస్టు, రాడికల్ స్త్రీ విమోచన సిద్ధాంతాలలోని ప్రయోజనకర అంశాలను (Positive Feautures) ఆమోదిస్తారు. నియంతృత్వానికి, నిరంకుశత్వానికి అనాలోచిత ఫలితంగా నయినా దారితీసే సిద్ధాంత అంశాలను త్రోసిరాజంటారు. 'మానవ వాద స్త్రీ విమోచన' అనే పేరుగల 'స్త్రీ విముక్తి' ప్రణాళికను (Women's Manifesto) రచించిన మల్లాది సుబ్బమ్మ యీ రకపు ఆలోచనాధోరణికి చెందిన వ్యక్తి. ఆమె తన సంఘాల కార్యాచరణలో యీ భావజాలాన్ని వెలారుస్తున్నది.

## ఉద్యమ అవసరాలు

ఆంధ్రప్రదేశ్‌లో పలు మహిళా ఫెడరేషన్లు, పెక్కు స్వతంత్ర ప్రతిపత్తిగల మహిళా సంఘాలు (Autonomous Organizations) పని చేస్తున్నా, వాస్తవంగా నిజాయితీ, చిత్తశుద్ధి పట్టుదల కన్పిస్తున్నా, మహిళో ద్యమం విజయాలను తగినంతగా సాధించలేకపోయింది. ఆంధ్రప్రదేశ్‌లో 972 వున్నారు. అక్షరాస్యత 33.71 శాతంమాత్రమే. వారి జీవించే కాలపు అంచనా 1989-90లో 59 సంవత్సరాలు (భారతదేశపు లెక్క). స్త్రీ కార్మికులు 34.80 లక్షల మాత్రమే. 1991 గణాంక లెక్కల ప్రకారం శాసనసభలో 297 మంది సభ్యులలో స్త్రీలు 15 మంది. వారానికి సగటు వేతనం పురుషులకు రూ.120.69 అయితే స్త్రీలకు 110.66. ప్రతి వందమంది బాలికలలో 5వ క్లాసులో 40 మంది, 8వ క్లాసులో 18 మంది, తొమ్మిదవ క్లాసులో 9 మంది మాత్రమే విద్యనభ్యసిస్తున్నారు. ఒక్క బాలిక మాత్రమే జూనియర్ కాలేజీలో చేరగల్గుతున్నది. మధ్యలో చదువు మానివేయడం తరచుగా సంభవిస్తున్నది. స్త్రీలపై అత్యాచారాల లెక్కలను గమనిస్తే ఒక్క అంశం తేట తెల్లమవుతుంది. మహిళలలో జాగృతి, చైతన్యం ఒకవైపు పెరుగుతుంటే మరోవైపున అత్యాచారాలు వృద్ధి అవుతున్నాయి. ఈ దిగువ అత్యాచారల పట్టిక (1991) యీ విషయాన్ని రుజువు చేస్తుంది.

| | |
|---|---|
| **వరకట్నం హత్యలు** | 51 |
| **వరకట్న మరణాలు** | 226 |
| **ఆత్మహత్యకు ప్రోత్సాహం** | 298 |
| పీడకు కల్గించటం | 1262 |
| హత్యలు | 484 |
| మానభంగాలు | 572 |
| ఎత్తుకొనిపోవటం | 413 |
| స్త్రీల మానమర్యాదలకు భంగం కలిగించటం | 1768 |

ఈ పట్టిక మహిళోద్యమ బలహీనతను వెల్లడిస్తున్నది. ఈ బలహీనతకు కారణాలను అన్వేషిస్తే ఉద్యమంలో ఐక్యత లేమి ప్రధాన కారణంగా గోచరిస్తుంది. రాజకీయ పార్టీలకు అనుబంధంగా వున్న మహిళా ఫెడరేషన్లు, ఆ ఫెడరేషన్ల మధ్య ఐక్యత కనీసం సమన్వయం లేకపోవడం, స్వతంత్ర్య ప్రతిపత్తిగల మహిళా సంఘాల కార్యకర్తలలో వివిధ ఆదర్శాలు, లక్ష్యాలయెడ సరియైన అవగాహన లోపించటం, ఉద్యమ పోకడను అర్థం చేసుకోవడం యిని కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నాయి. చాలా మహిళా సమాజాలు నిర్మాణ కార్యక్రమాలతో సరిపెట్టుకుంటున్నాయి.

భవిష్యత్తులో ప్రమాదాన్ని ఎదుర్కొన పోతున్నది మహిళోద్యమం. స్థానిక స్వపరిపాలనా సంస్థల సభ్యుల్లో సంఖ్యలో మూడవ వంతు స్త్రీలకు కేటాయించపోతున్నారు. అంటే ప్రతి పంచాయితీ సంస్థలో సగటున 10 మంది సభ్యులుంటే ముగ్గురు స్త్రీలుంటారు. రాష్ట్రంలో సుమారు 20 వేల పంచాయితీలు వుంటే 60 వేల మంది స్త్రీలు సభ్యులు కానున్నారు. ఇలా అదనంగా రాజకీయ సంస్థలోకి ప్రవేశించి 60 వేల మంది స్త్రీలు సభ్యులు కానున్నారుఇలా అదనంగా రాజకీయ సంస్థలోలకి ప్రవేశించి 60 వేలమంది స్త్రీలకు జాగృతిని, చైతన్యాన్ని అందచేయకపోతే ఆ స్త్రీలు సమాజాన్ని యథాతధంగా వుంచాలనే



శక్తులకు సిద్ధమౌతున్నారు. ఇది చాలా దారుణమయిన పరిణామం. దీనిని అరికట్టాలంటే మహిళోద్యమ కార్యకర్తల్లో ఐక్యత కావాలి. రాష్ట్ర స్థాయి మహిళా వేదికలన్నిట్లలో, స్వతంత్ర ప్రతిపత్తిగల మహిళా సంఘాలలో పనిచేసే స్త్రీలకు సమస్య విషపరిణామం అర్థం కావాలి. అలాంటిది ఏ కొద్దిమందిలోనో కన్పిస్తున్నది. వారి ప్రయత్నాలు చాలడం లేదు. జాగృతి చైతన్యం లేని స్త్రీలకు రాజకీయాధికార పదవులు యిస్తే వారు సమాజాన్ని వెనుకకు నడిపించే స్థితి వస్తుంది. ఇది మహిళా శ్రేయస్సుకు భంగకరం. ఈ ప్రమాదాన్ని తప్పించు కోవడానికి మన రాష్ట్రంలోని మహిళో ద్యమం పుంజుకునే పరిస్థితులు చక్కబడతాయి.

ఆంధ్రలో మహిళాభ్యుదయ గురించి, జరిగిన పూర్వ్ గురించి ఇక్కడొక ముఖ్య విషయం ప్రస్తావించక తప్పదు. 1860 నాటికి మహిళల పరిస్థితి మహా దారుణంగా వుండేది. ఒక వంక బహు భార్యత్వం, మరో వంక బాల్య వివాహాలు, కన్యాశుల్కం, దేవదాసీ వ్యవస్థ కఠోర వైధవ్య విధులు, గృహిణీ ధర్మాలు, పతివ్రతా లక్షణాలు, భార్యల విధినిషేధాలు, పరదా, వేశ్యావృత్తి, ఆడపిల్లలను హతమార్చటం, సతీసహగమనం లాంటి అరాచకాలెన్నో ఆనాటి సమాజంలో గణతికెక్కాయి. స్త్రీ జాతికి ఏమాత్రం వునికి లేకుండా ఆడవారు కేవలం వంటి ఇంటికే, పడకటింటికే పరిమిత మయ్యారు. ఈ ఘోర పరిస్థితిని మార్చి ఈనాడు స్త్రీలోకం ఇంతమాత్రం పురోగమించటానికి ఎందరో సంస్కర్తలు పనిచేశారు. ఎన్నో చట్టాలు వచ్చాయి. మరెన్నో సవరణలు జరిగాయి. మరెన్నో మహిళాభివృద్ధి కార్యక్రమాలను ప్రభుత్వమూ, ప్రజలూ, రాజ్యాంగమూ నిర్వహించాయి. ఈనాటి స్త్రీలు విద్యా, ఉద్యోగాల్లో, సంగీత సాహిత్యాల్లో, చిత్ర లేఖనంలో, ఆటల్లో పాటల్లో, రాణిస్తున్నారు. పరుగుపందాల్లో ముందడుగు వేస్తున్నారు. ఆస్తిహక్కు పొందారు. గోల్డ్ మెడల్సు పొందుతున్నారు. ఇంకా సాంఘిక ఆర్థిక, రాజకీయ రంగాల్లో పోటీలపడి తమ అభ్యుదయాన్ని నిరూపించుకుంటున్నారు. వ్యవసాయ, వ్యాపార, వైద్య పరిశోధనా రంగాల్లో రాణిస్తున్నారు. కాని ఇదంతా ఒక పది శాతమేనని మనకు తెలుసు. అందువల్లే వరకట్న మరణాలు, అత్యాచారాలు గణనీయంగా విజృంభిస్తున్నాయి. జరిగిన అభివృద్ధి కన్నా జరగాల్సిన పురోగతి ఎంతో వుంది. ముఖ్యంగా నేటి స్త్రీలకు రాజకీయంగా సమాన ప్రతిపత్తి రావాలి. కుటుంబ హింసలు తగ్గాలి. అంటే స్వేచ్ఛా సమానత్వాలు అన్ని రంగాల్లో స్త్రీలు సాధించిననాడే అసలయిన స్త్రీ జనాభివృద్ధి జరిగినట్లు. నేటి స్త్రీజాతి, కులమతాతీతంగా ఐక్యతగా కలిసిమెలిసి పోరాడితే తమ హక్కులను అనుభవించగలరు. అభివృద్ధిని సాధించగలరు. కామన్ సివిల్ కోడ్‌ను సాధించి తద్వారా పంచాయితీ నుండి పార్లమెంటు వరకు సమాన విప్పత్తిని పొందగలరు. 21వ శతాబ్దం నాటికి సర్వ రంగాల్లో సంపూర్ణ అభివృద్ధిని సాధించగలరని ఆశించడం అసహజం కాదుకదా!

● ● ●

# తెలుగునాట సంఘ సంస్కరణోద్యమాలు

ఏటుకూరు బలరామమూర్తి

కందుకూరి వీరేశలింగంగారు ఆంధ్ర దేశంలోని సర్వ విధ సంఘ సంస్కరణోద్యమాలకు ఆద్యులు. స్త్రీ విద్య, వితంతు పునర్వివాహోద్యమం, హరిజన సమస్య, ఏకేశ్వరోపాసన మొదలైన పునరుజ్జీవనోద్యమాలన్నీ వారితోనే మొదలైనవి.

అంతకుముందే సామినేని ముద్దు కృష్ణంనాయుడుగారు యీ భావాలన్నిటినీ ప్రచారం చేశారు. హిత సూచని అని వారు రాసిన గ్రంథంలో వీరేశలింగం గారి ఉద్యమాలన్నిటికీ బీజప్రయామైన భావాలు వున్నాయి. అయితే ఆచరణలో ఉద్యమాలను నిర్మించి, అందుకు తన ధనం, ఆయుస్సు సర్వం అర్పణ చేసిన ఘనత వీరేశలింగం గారిది.

వీరేశలింగంగారు ధవళేశ్వరం పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టిన రోజుననే సంఘ సంస్కరణ కృషి మొదలైంది. బంధువులందరూ కూడదని చెప్పినా, వారు అమావాస్య రోజున ఉపాధ్యాయ పదవి స్వీకరించారు. శకునాలపై ప్రత్యక్ష పోరాటం ఆనాడే మొదలైంది. నాటినుండి వారు సంస్కరణోద్యమాలలో వెనుకడుగు వేసింది లేదు.

40కి పైగా వారు వితంతు వివాహాలు జరిపించారు. వివాహితులందరికీ రెండేండ్ల పాటు ఆర్థిక వసతిని కల్పించేవారు. స్త్రీ విద్య ఆవశ్యకతపై వారు అసంఖ్యాకమైన రచనలు చేశారు. వారి ప్రోత్సాహంతోనే చిలకమర్తి

వీరేశలింగంగారు ధవళేశ్వరం పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టిన రోజుననే సంఘ సంస్కరణ కృషి మొదలైంది. బంధువులందరూ కూడదని చెప్పినా, వారు అమావాస్య రోజున ఉపాధ్యాయ పదవి స్వీకరించారు. శకునాలపై ప్రత్యక్ష పోరాటం ఆనాడే మొదలైంది. నాటినుండి వారు సంస్కరణోద్యమాలలో వెనుకడుగు వేసింది లేదు.

లక్ష్మీనరసింహంగారు ఒక బాలికా పాఠశాలను స్థాపించారు.

ఈ ఉభయుల కార్యస్థానం రాజమహేంద్రవరం అని వేరే చెప్పనక్కర లేదు. రఘుపతి వెంకటరత్నంగారు కాకినాడలో ఇదే కృషి కొనసాగించారు.

వీరేశలింగంగారు సాహిత్యాన్ని సంఘ సంస్కరణ ఆయుధంగా వాడుకున్నారు. వందకుపైగా వారు రచించిన గద్య, గ్రంథాలన్నీ స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహం, శకునాలు, మూఢనమ్మకాలు తదితర దురాచారాలపై ఎక్కుబెట్టిన ఆయుధాలు. ఈ కృషిలోనే వారు గద్య తిక్కన అని సార్థక నామం ధరించారు.

1920లో గాంధీజీ ప్రారంభించిన నిర్మాణ కార్యక్రమంలో అస్పృశ్యతా నివారణ భాగం ఆంధ్రలో నాటినుండే హరిజనోద్యమం ప్రారంభమైంది. జాతీయోద్యమంలో అంతర్భాగంగా సాగిన ఈ ఉద్యమంలో కాశీనాథుని నాగేశ్వరరావు, అయ్యదేవర కాళేశ్వర రావుగారలు హరిజన సేవా సంఘాలను రాష్ట్రస్థాయిలోనూ, జిల్లాల స్థాయిలోనూ స్థాపించి అస్పృశ్యతా నిర్మూలనకు కృషి చేశారు.

వీరేశలింగంగారి కృషికి జాతీయోద్యమంలో అంతర్భాగమైన హరిజనోద్యమానికి సేతువుగా ఉన్నవ లక్ష్మీనారాయణ గారు, వితంతు పునర్వివాహోద్యమాలతో ప్రారంభించి, గుంటూరులో శారదా నికేతనం అను బాలికా పాఠశాలను స్థాపించారు. అందులో హరిజనులకు ప్రవేశం కల్పించారు. అంతటితో ఆగక మాలపల్లి అని సుప్రసిద్ధ గ్రంథాన్ని రచించి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు.

ఈ మధ్య కాలంలో తెనాలి కేంద్రంగా త్రిపురనేని రామస్వామిగారు సూతాశ్రమం స్థాపించి, హరిజనోద్ధరణతో పాటు బ్రాహ్మణేతర కులాల సముద్ధరణకు కృషి చేశారు. మూఢ విశ్వాసాలను, పురాణగాథలను విమర్శిస్తూ పెక్కు సంచలనాత్మక గ్రంథాలు రచించారు. తద్వారా ఆంధ్రదేశంలో బావ విప్లవానికి, హేతువాద వ్యాప్తికి కారణ భూతులైనారు.

1937 ప్రారంభంలో గోరా (గోపరాజు రామచంద్రరావు) బందరు

కాలేజీలో ఉపాధ్యాయులుగా వుంటూనే నాస్తికోద్యమ భావాల వ్యాప్తికి, హేతువాద ఉద్యమానికి, హరిజన సేవకు, కుల నిర్మూలనకు కృషి చేయసాగారు. 1940లో వారు ఉపాధ్యాయ వృత్తి మానివేసి, తొలుత ముదునూరునూ, సిమ్మట విజయవాడను కేంద్రంగా చేసుకుని నాస్తికోద్యమ వ్యాప్తికి కృషి చేశారు. అందులో అంతర్భాగంగా వందల సంఖ్యలో అంతర్వర్ణ వివాహాలను జరిపించారు. అస్పృశ్యతా నిర్మూలనకు తీవ్ర కృషి చేశారు. ఈ కేంద్రం ఇప్పటికీ వారి కుమారులు లవణంగారి ఆధ్వర్యంలో, వారి కృషిని జయప్రదంగా కొనసాగిస్తూనే వుంది.

1942 క్విట్ ఇండియా ఉద్యమంలో కూడా భాగస్వామ్యం కలిగిన గోరాగారు జాతీయోద్యమానికి సంఘ సంస్కరణోద్యమానికి వారసులైనారు.

1937 ప్రాంతం నుండి ఆంధ్రలో కమ్యూనిస్టు ఉద్యమం, కుల, మత అతీతమైన సమాజ నిర్మాణానికి, వర్గ రహిత సమాజానికి అంకితమై అపార త్యాగాలు చేసింది. ఇందులో అంతర్భాగంగా ఆంధ్రదేశమంతటా వర్ణాంతర, మతాంతర వివాహాలను ప్రోత్సహించింది. త్రిపురనేని రామస్వామిగారు అంతకుముందే ప్రారంభించిన, పూలదండల పెండ్లి పద్ధతిని విస్తారంగా వ్యాప్తిచేసింది.

గాంధీగారు జాతీయోద్యమంలో ప్రారంభించిన సాంప్రదాయాన్ని ముందుకు తీసుకు వెళుతూ, రాజకీయాలలో మహిళలకు భాగస్వామ్యం కల్పించింది.

గాంధేయ ఉద్యమంలో గుమ్మడి దుర్గాబాయమ్మ, పొణకా కనకమ్మ స్త్రీ జనోద్ధరణకు అపారమైన సేవచేయగా, అదే సాంప్రదాయాన్ని ముందుకు తీసుకువెళ్ళి కమ్యూనిస్టు పార్టీ ప్రజా స్వభావం కలిగిన మహిళా ఉద్యమాన్ని నిర్మించింది. డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ, మోటూరు ఉదయం, కే. శే. మానికొండ సూర్యావతి, గుజ్జుల సరళా దేవిలాంటి మహిళా ఉద్యమ నాయకులను సృష్టించింది.

తెలంగాణా విమోచనోద్యమం, సంఘ సంస్కరణకు కొత్త ఊపు నిచ్చింది. పురుషులతోపాటు స్త్రీలు, పేదవర్గాలకు చెందినవారు, తెలంగాణా సాయుధ పోరాటంలో పాల్గొని ప్రాణాలర్పించారు. అన్ని వర్గాలు, వర్ణాలకు చెందిన అభ్యుదయవాదులు ఈ పోరాటంలో పాల్గొన్నారు.

తెలంగాణాలో సంఘ సంస్కరణోద్యమానికి ఆద్యులు సురవరం ప్రతాపరెడ్డిగారు, మాడపాటి హనుమంతరావుగారు. వెనుకబడిన వర్గాలలో విద్యావ్యాప్తికి ప్రతాపరెడ్డిగారు కృషిచేసి, యువతుల విద్యార్జనకు గొప్ప అవకాశం కల్పించారు. బాల, బాలికా వసతి గృహాలను ఏర్పరచారు.

మాడపాటి హనుమంతరావుగారు అదేవిధంగా స్త్రీ విద్యా వ్యాప్తికి విశేష కృషిచేశారు. ఆంధ్రలో వీరేశలింగంగారు ప్రారంభించి నిర్వహించిన సర్వ సంస్కరణోద్యమాలకు మాడపాటి హనుమంతరావుగారు తెలంగాణాలో తోడ్పాటునిచ్చారు.

జాతీయోద్యమంలో భాగంగా సాగిన సంస్కరణోద్యమంలో రాయలసీమకు చెందిన గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పప్పూరి రామాచార్యులు, కల్లూరు సుబ్బారావుగార్లు ప్రముఖపాత్ర వహించారు.

ఇవన్నీ అగ్రవర్ణ ఉదారవాదుల నుండి ప్రారంభమైనవి. ఇటీవలికాలంలో వెనుకబడిన కులాలు వర్ణాలనుండి సంఘ సంస్కరణోద్యమం మొదలుకావడం హర్షణీయం.

పబ్లిక్ సర్వీస్ కమీషన్ మాజీ సభ్యులు జె. వీరాస్వామిగారి ఆధ్వర్యాన కులనిర్మూలన సంఘం ఏర్పడి గొప్ప సేవ చేసింది. జాషువా, బోయి భీమన్నలాంటి రచయితలు తమ రచనలద్వారా హరిజనోద్యమానికి సేవ చేశారు. ఇప్పుడిప్పుడే తలెత్తుతున్న దళిత ఉద్యమం, దళిత సాహిత్యం, కులనిర్మూలనా లక్ష్యంతో మరింత ముందుకు సాగుతున్నది.

అదేవిధంగా ఇటీవల ప్రారంభమైన స్త్రీ వాద ఉద్యమం కూడా స్త్రీలపై జరుగుతున్న అన్యాయాలకు, అత్యాచారాలకు వ్యతిరేకంగా గొప్ప చైతన్యాన్ని కలిగిస్తున్నది.

సమాజం ఎంతో ముందుకు సాగినా, అబలలపై అత్యాచారాలు, కట్నం చావులు కొనసాగుతూనే వున్నాయి. హరిజనులపై అత్యాచారాలు సాగుతూనే ఉన్నాయి.

ఈ రెండు అత్యాచారాలు అంతమైననాడే, ఆంధ్రలో సంఘసంస్కరణోద్యమం జయప్రదమైనట్లు. మొత్తం సమాజం మరింత ప్రజా తంత్రయుత మైనప్పుడే, ఈ అన్యాయాలు పూర్తిగా నిర్మూలన కాగలవు.

• • •

చూచినంత మాత్రంచేత తన అన్నం మైలపడిందని భుజించడు. విస్తరి విడిచి లేచిపోయేవాడని కందుకూరి వీరేశలింగం తన సత్యవాదిని ఉపన్యాసాలలో పేర్కొన్నాడు. హిందూ సంఘంలో స్వమతస్థులైన మాల-మాదిగల ఎడల చూపెడు అన్యాయం మనందరకూ అవమానకరం. వారు మన వీధుల్లో నడవ కూడదు. వారి పిల్లలు మన బడుల్లో చదవకూడదు. మన బావుల్లోని నీరు త్రాగకూడదు. గాడిదైనను, పందైనను, మన బావినుండి పోవచ్చును గాని, మాలవాడు మాత్రం బారెడు దూరం నుండైనను పోకూడదు. 'చెప్పరానివాడు వచ్చి వీధిలో నిలబడ్డాడు, వెళ్ళిపొమ్మని చెప్పండి' అనే లజ్జాకరమైన భాషా ప్రయోగం అక్కడక్కడా చేయడం జరుగుతున్నది. "నీవు కూడా పాకీ పనికి సిద్ధమైతేనే గాని, నీ అహంకారం చావదన్నాడు గాంధీ.' అస్పృశ్యతా పాపం, హిందూ మతం మీద మాయని మచ్చ న్నాడు" "సర్వమతముల సిద్ధాంతం ఒక్కటే! సర్వలోకాధిపతియైన ఈశ్వరుడు లోకైక పితయన్న విశ్వాసం, జాతి, మత, వర్గ భేదాలు లేక సృష్టిలోని సర్వమానవులు సోదరతుల్యులన్న విశ్వాసం, తాను చేసిన ఉపదేశం తనకే ఆచరణకు పనికిరాని ఎడల మరెవ్వరికి పనికి వస్తుందని వీరేశలింగం పంతులు ప్రశ్నించాడు."

"True religion teaches us toreverence what is under us, to recognize humility, poverty, wrachedness, suffering and death as things divine"

(Goethe)

మనకంటె అడుగున పడియున్న వారి స్థితిగతులను, వారి అణకువ, దారిద్ర్యం, నిర్భాగ్యత, బాధలు, చివరకు వారి మరణం – ఇవన్నియూ దైవమును



కాకినాడలోని ఆంధ్ర బ్రహ్మోపాసన మందిరం

మనకు గుర్తుచెప్పి, వారిని ఆదరణతో సన్మానింపుమని బోధించునదే నిజమైన మతమని గోథే పేర్కొన్నాడు. ఈ సందేశాన్ని మనం పాటించినట్లయితే మానవ సమాజం ఎన్ని ఉరకలు వేసేదో ఊహించవచ్చును.

ఏ సంస్కృతీ-సాంప్రదాయాలు గొప్పవని పొగడుతున్నారో, ఆ నాగరికత, ఆ సంస్కృతుల ధర్మకర్తృత్వం వహించిన వారే, ధర్మభ్రష్టులై పోయారు. సతీ సహగమనం, కులీన బ్రాహ్మణ వివాహాలు, సాంఘిక అసమానతలు ఒకనాడు సంఘాన్ని కలుషితం చేసాయి. మత, సాంఘిక, నైతిక విశ్వాసాలూ, కట్టుబాట్లు సడలి పోయాయి. సతీ సహగమనం బెంగాల్లో దురాచారంగా పరిణమించిన సంగతి మనందరకూ తెలుసు. భర్త చనిపోతే, భార్య చితి మంటల్లోకి దూకాలి. బంధువులను, వితంతువులను బలవంతంగా ప్రాణం తీసే ఆచారంగా మారింది. 1818 నుంచి 1828 వరకూ ఒక్క కలకత్తా నగరంలోనే 5 వేలమంది వితంతువులు సతీసహగమనం ఆచరించినట్లు నివేదికలు తెలుపుతున్నాయి.

1822లో గుంటూరు లో మాను పాపయ్య గారు చనిపోగా, అతని భార్య సహగమనం చేయగా ఆ దృశ్యాన్ని చూసిన వెన్నెలకంటి సుబ్బారావు పంతులు తన స్వీయచరిత్ర వ్రాసారని డాక్టర్ అక్కిరాజు రమాపతి రావు ఒక వ్యాసంలో పేర్కొన్నారు.

బ్రాహ్మణుల్లో ఒక శాఖవారు వందమంది వరకు బాలికలను వివాహం చేసుకోవడమే ఈ కులీన బ్రాహ్మణ వివాహాలు. ఆ శాఖలోని వారికే తమ కూతురునిచ్చి, వివాహం చేస్తే పద్నాలుగు తరాల వారు ముక్తిని పొందుతారనేది, అతి హేయమైన మూఢ నమ్మకం. ఆ బహుపత్నీకుడు ఒకప్పుడు మరణిస్తే, భార్యలందరూ సహగమనం చేసేవారు, లేదా బలవంతంగా చితిలోకి నెట్టబడేవారు. అతిబాల్య వివాహాలు, వృద్ధ వివాహాలు, అగ్రవర్ణాల వారిలోనే అధికంగా వుండేవని గురజాడ అప్పారావు కన్యాశుల్కం నాటకం వలన మనకు తెలుస్తున్నది. ముక్కుపచ్చలారని పసికందులను, తల్లిదండ్రులు అమ్ముకునే వారు. కొందరైతే పుట్టే శిశువు ఆడపిల్ల అయితే, తమకు విక్ర

యించుకుని కొంత డబ్బును చెల్లించి, పల్లెపెద్దలనుండి రక్షణం పొందేవారు మరి కొందరు:

స్త్రీలు చదువుకోకూడదనుట, ఋతుమతీ వివాహం కూడదనుట, వృద్ధ వివాహాలు శాస్త్ర విధి అనటం, అంటరానితనం సదాచారం అనటం, నిర్బంధ వైధవ్యం కొనసాగవలసిందే అని వితర్క వాదనలు చేయటం, 'ఆడది చదివి చెడె', 'మగవాడు చదవక చెడె' అనే సామెతలు పుట్టించి, ఆడదానికి చదువెందుకనే వాదనలు చేయడంవలన సంఘంలో రాజకీయ-మత-నైతిక సాహిత్య పునరుజ్జీవనానికి 18వ శతాబ్ది ఉత్తరార్ధం తొలినాంది పలికింది. దానికి బెంగాల్లో రాజారామ మోహన్ రాయ్ ఆద్యుడైతే, కందుకూరి వీరేశలింగం గారు తన జీవితాంతం సాంఘిక అసమానతలను తొలగించడానికీ, దీనులను, అనాథలను, పతితులను ఉద్ధరించడానికి విశేషమైన కృషి చేశాడు.

## క్రైస్తవ మత ప్రభావం

మనలో ఎవరెవ్వరు అస్పృశ్యులుగా తిరస్కరింపబడుచున్నారో, ఎవరు హీనాతిహీనంగా పరిగణించబడుతున్నారో, వారి మీద క్రైస్తవ పాదరీల దృష్టికూడా పడింది. హిందూ మతంలోని దురాచారాలను, అసమానతలను ఎత్తిచూపి మనలో అన్ని వర్గీయుల యువతీ-యువకులను ధనరూపాన, విద్యారూపాన, వైద్యరూపాన మనలో కొంత హృదయ పరివర్తనం కలిగించారు వారు. తమ జీవకారుణ్యాన్ని చూపుచూ, హిందూ సంఘంలోని వర్ణ వ్యవస్థకు సంబంధించిన కట్టుబాట్లను కొంతవరకూ సడలించగలిగారు. దీనితో హిందూ సంఘం బీటలువారింది. అయితే క్రైస్తవ మత బోధకులుగా వచ్చిన పండితులు ప్రజలను తమ మతంలోకి



రాజా వెంకట మహీపతి సూర్యారావు బహద్దూర్ (పిఠాపురం రాజా)

మార్చడానికి ప్రయత్నించడం వలన వారు మత బేధాలు సృష్టించేవారని ముద్ర పడింది. పక్షపాత ధోరణిలో హిందూ మతానికి వ్యతిరేకంగా వ్యవహరించేవారు. దీనితో క్రైస్తవ పాదరీలకు హిందూ మతంపై సరియైన అవగాహన లేదనే వాదన వ్యక్తమయ్యింది. దీనితో జీవకారుణ్యానికి ప్రతీకయైన క్రీస్తు సిద్ధాంతం మత పండితుల తప్పుడు బోధనల వలన ఆ మతంపై మందున్న భావన తర్వాత కాలంలో సడలింది. ఆంగ్లేయులు, భారత దేశానికి కేవలం వర్తకం కోసమే రాలేదు. అది భారతదేశాన్ని నిద్ర నుండి లేపి, ప్రాచీన భారత చరిత్ర ప్రవాహగతిలో, జాతీయ జీవన స్రవంతిలో క్రొత్త ఆలోచనా భావాల్ని తెలియచెప్పటానికి వచ్చారు. శతాబ్దాల తరబడి మృతప్రాయమైన ఆచారాలు, మూఢ విశ్వాసాలతో కప్పబడిన భారతదేశ ప్రగాఢమైన శాస్త్రాలను వెలికి తీసి, వాటిని ప్రపంచపు ఆలోచనా విధానాలకు నూతన కాలానికి, వ్యవస్థకే, తగినట్టు మలచాలన్న సంస్కరణలు అనుసరించి రామ్ మోహన్ రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగరు, బంకించంద్ర చటర్జీలు ఆలోచించారు. హిందూ మతంలోని ఉత్తమ నియమాలను మలినం చేస్తున్న హేతుబద్ధం కాని విశ్వాసాలనూ, కర్మకాండలనూ నిరసించారు. ఆంగ్లేయులతో కలిగిన పరిచయం వలన, బెంగాల్లోని బ్రహ్మ సమాజ ప్రభావం ఆంధ్ర దేశంలో కొందరిని ఆకర్షించింది. తమ సంఘంలోని అసమానత్వం, హైన్యమూ వారిలో సంచలనం లేకెత్తించాయి. స్త్రీలు విద్యావంతులు కాకపోతే సంఘానికి సద్గతి కలగదని సంఘ సంస్కర్తలందరూ గుర్తించారు. స్త్రీ విద్యను ప్రోత్సహించారు. 1869లో ఆంధ్ర దేశంలో మొదటి బాలికా పాఠశాలను స్థాపించడం జరిగింది. ఈ చర్యలను ఆనాటి పండిత వర్గం, ఛాందసులు, అక్కసుతో ఆంగ్ల ప్రభుత్వాన్ని, ఆంగ్ల భాషను, సంస్కరణోద్యమ కర్తలను మూర్ఖులని, నాస్తికులనీ, పాషండులనీ, నిందిస్తూ వుండేవారు. దీనితో బ్రహ్మ సమాజం ప్రభావం ప్రజల్లో బాగా ప్రభావం చూపింది. సమాజపు గ్రంథాలు బెంగాలీ భాష నుండి తెలుగులోకి అనువదింపబడ్డాయి.

మానవతా వాదం
వర్ణబేధ నిరసనం
విగ్రహారాధనఖండన
దురాచార నిర్మూలనం

లక్ష్యాలుగా సాగిన బ్రహ్మ సమాజానికి ప్రభావితులై తెలుగులో దేవులపల్లి, వేదుల, వసురాయ కవి, వెంకట పార్వతీశం కవులు ముఖ్యులు.

పేతలాంటి భూతం మన
తాతల్లో తండ్రుల్లో
రోతరోతరోత - మంది

ప్రాతర్వియ దాసాసం
ప్రాతరుజ్వలాకాశం - అనే గేయాన్ని దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్రాశాడు.

## ఆంధ్రులు – బ్రహ్మ సమాజం
## కందుకూరి వీరేశలింగం

సమాజంలో అలముకొన్న దురాచారపు చీకట్లను తరిమి వేయడానికి బ్రహ్మ సమాజ సంస్కరణోద్యమం బయలుదేరింది. ఈ ఉద్యమానికి కందుకూరి వీరేశలింగం, సర్ రఘుపతి వేంకట రత్నం నాయుడు గార్లు నాయకులు. వీరేశలింగం ఇంగ్లీషు చదువుకొని, రాజారామ్‌మోహన్‌రాయ్, కేశవ చంద్రసేన్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్ ల బ్రహ్మ సమాజం వలన ప్రభావితుడైన తర్వాతనే సాంఘిక సంస్కరణోద్యమాన్ని చేపట్టాడు. 1870లో రాజమండ్రిలో ప్రార్థనా సమాజాన్ని ప్రారంభించాడు. 1874లో 'వివేకవర్ధని' పత్రికను స్థాపించాడు. రాజశేఖర చరిత్ర, 'బ్రహ్మ వివాహం,' 'వ్యవహార ధర్మబోధిని' వంటి గ్రంథాలు ఆ రోజుల్లో ఎంతో సంచలనాన్ని కలిగించాయి. వీరేశలింగం సాహిత్యాన్ని ప్రజల పరం చేశారు. ఆధునిక సాంఘిక వ్యవస్థలో సామాజిక పరిణామంలో మొట్టమొదటి ప్రజల మనిషి ఆయన. ఆయన ప్రభావంతోనే కొందరు కవులు - 'మలిన దేహుల మాలలనుచూ, మలినచిత్తుల కధిక కులములు, నెలవొసంగిన వర్ణధర్మమధర్మ ధర్మంబే!' అని సాంఘిక అసమానతలను నిరసించారు. ఆనాటి తెలుగుదేశం శవప్రాయమైన ఆచారాలకు అంకితమైపోయింది. నిలువు గీతలు - అడ్డ గీతలతో చిన్నాభిన్నమై వున్నసంఘాన్ని ఉన్నత పథం వైపు నడిపించే బాధ్యతలను కందుకూరి చేపట్టాడు. ఆయన మాటలలోనే -



స్వాతంత్ర్య సమరయోధులు
శ్రీ మాచిరాజు సీతాపతిరావు

"లంచములు తగనున్న రాజకీయోద్యోగులకు కోసం. వేశ్యాంగనా సంగమము పద్దన్న శృంగార నాయకులకు గోపము. పూర్వాచారము మార్చుకోవలెనన్నా పామర జనులకు గోపము నీతి బాహ్య వేషములు మత విరుద్ధములన్నా ఆచార్యపురుషులకు గోపము" అయినా ఆయన వెనుకంజ వేయలేదు. తెలుగు నేలలో వెలుగు చినుకులు కురిపించి, వసంతోత్సవానికి మహాసంకల్పం చేసారు. నవ్యాంధ్ర యుగప్రవక్త అయ్యాడు కందుకూరి.

## రఘుపతి వేంకటరత్నం నాయుడు

'దేవుడొక్కడే, జగత్పిత!
జాతి ఒక్కటే మానవ జాతి
రాజ్యమొక్కటే స్వర్గరాజ్యం
ఒక్క ప్రపంచం - ఒక్క కుటుంబం' - అనే రామ్‌మోహన్ రాయ్ నినాదంలో స్ఫూర్తి పొందిన, వ్యక్తి సర్ రఘుపతి వేంకటరత్నం నాయుడు గారు. 1862లో మచిలీపట్నంలో జన్మించారు. 1882లో మచిలీపట్టణ ప్రార్థనా సమాజాన్ని స్థాపించారు. విగ్రహారాధన లేకుండా, ఆధ్యాత్మికంగా, సామూహికోపాసనలను సాగించుటకు ఈ సమాజాన్ని ప్రారంభించారు. బ్రహ్మ సమాజ నాయకుడు పండిత శివనాథ శాస్త్రి బోధనల వల్ల నాయుడు గారికి బ్రహ్మ సమాజం పట్ల ఆసక్తి ఏర్పడింది. హిందూ మతాన్ని క్రైస్తవ మతాన్ని క్షుణ్ణంగా చదివారు. ఆస్తికత మీద, వేదాంతం మీద, సాహితీ విమర్శ మీద ఆయనతో సరితూగే వ్యక్తులు చాలా అరుదు. 'ఏకేశ్వరోపాసన' సిద్ధాంతాన్ని వ్యాపింప చేయుటకు 1881లో 'బ్రహ్మ ప్రకాశిక' 'పెలోషర్కులర్' పత్రికను నడిపారు. అస్పృశ్యతను, వడుపు వృత్తిని ఆయన ప్రతిఘటించారు. విధవా వివాహాలను బలపరచారు. మద్యపాన నిషేధం కొరకు, వేశ్యావృత్తి నిర్మూలనకు, పారిశుద్ధ్యం కొరకు తెలుగు నాడంతయూ నాయుడుగారు ప్రచారం చేసారు. సాన్వేరి స్టేషనులో కనబడిన నలుగురు అనాధ బాలికలను మరి కొందరిని తన బిడ్డలుగా పెంచి పెద్దలను చేసారు. "మీరే లేనిచో వారేమై ఉండేవాళ్ళు" అని ఒకరనగా "వాళ్ళు లేకపోతే నేనేమై యుండేవాడిని" అని జవాబిచ్చిన ధీశాలి నాయుడు గారు. 1889లో భార్య మరణించింది. తర్వాత వివాహం చేసుకోలేదు. 50 సంవత్సరముల పాటు కఠిన బ్రహ్మచర్యాన్ని అనుసరించారు. హిందూ వితంతువుల మాదిరిగ వుండాలని ఆయన ఎల్లప్పుడూ తెల్లటి దుస్తుల్నే ధరించేవారు. ఆ విధంగా ఆయనకు 'ఆంధ్రదేశ శ్వేతాంబర ఋషి" అని పేరొచ్చింది.

## పిఠాపురం రాజా ప్రోత్సాహం

1904 నుంచి నాయుడు గారికి పిఠాపురం రాజావారితో పరిచయముంది. 1904 నుండి 1909 వరకు పిఠాపురం

యన్.జి. నెల్లింకర్ సమాజం కొరకు ఓ చక్కటి మందిరాన్ని కట్టారు. నెల్లూరు, భీమవరం, రేలంగి, యానాం, రామచంద్రాపురం, మండపేట వంటి ప్రాంతాల్లో సమాజాలు నిర్మించారు. సంఘంలో విశాల దృక్పథం, సర్వమానవ సౌభ్రాతృత్వం, మతాతీత తత్వాన్ని పాత వ్యవస్థ నుండి కొత్త వ్యవస్థకు ఈ బ్రహ్మ సమాజ సిద్ధాంతాలు ఆంధ్రదేశంలో దృఢమైన ప్రభావాన్నే చూపిందని చెప్పవచ్చు.

కంభంపాటి రామశాస్త్రి (తారకం) గారు ఆంధ్రదేశపు బ్రాహ్మ సామాజికులలో కోనసీమలో శ్రోత్రియ కుటుంబం లో పుట్టి, బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నం నాయుడు గారిచే ప్రభావితుడైన సంఘ సంస్కర్త. శుద్ధ ఛాందస సాంప్రదాయం అర్థవిహీనమని భావించి, వర్ణ శృంఖలాలను చేధించి, వెంకటరత్నం నాయుడు గారు పెంచుకున్న పుత్రిక సుగుణ మహాలక్ష్మిని పరిణయమాడిన సాహసమూర్తి తారకం గారు. స్త్రీ జనోద్ధరణ, అనాథ, దీనజన సంరక్షణ, బ్రాహ్మ ధర్మ ప్రచారమునకు తెలుగునాట ఒక కొత్త శకం తారకంగారితో ప్రారంభమయింది. తారకం గారి కుమార్తెలలో ఒకరికి వీరేశలింగం గారి సతీమణి రాజ్యలక్ష్మి పేరునూ, మరొకరికి వేంకటరత్నం నాయుడు భార్య శేషారత్నం పేరును పెట్టడంలో తారకం గారి అభిరుచికి నిదర్శనం. ఈ కుమార్తె లిద్దరూ విద్యాధికులు. ఈనాటికీ బ్రహ్మర్షి ఉపన్యాసాలను, సూక్తులను కాకినాడ నుండి ప్రచారం చేయుచున్నారు. కాకినాడ లో వున్న బ్రహ్మ సమాజ మందిరం, బ్రాహ్మణులకు కాకుండ ఇతరులకు పోతుందేమోనని మానసికంగా బాధపడుతూ, ఒంటరి పోరాటాన్ని నడుపుచున్నారు రాజ్యలక్ష్మి గారు. దానికి ఆమె భర్త డాక్టరు తెలికిచెర్ల శశిభూషణరావు గారి అండదండలుండటం లభించడం ఆమె అదృష్టం. తారకం గారు వీరేశలింగం గారు స్థాపించిన హైస్కూల్లో ప్రధానోపాధ్యాయులుగా కొంతకాలం పని చేశారు. తల్లాప్రగ్గడ సూర్యప్రకాశరావు, నాభి జగన్నాధరావు, తెలికచెర్ల వెంకటరత్నం, కామరాజు హనుమంతరావు, ముత్తంగి జగ్గారావు, నరహరిశెట్టి వెంకటరత్నం వంటివారు తారకం గారి సమకాలికులు. వారితో కలిసి ఆంధ్రదేశంలో సాముహిక వివాహాలను జరిపించారు. తారకం గారి పెద్దమ్మాయికి కులాంతర వివాహం జరిపించాడు. రెండవ అమ్మాయి రాజ్యలక్ష్మిని తెలికిచెర్ల శశిభూషణరావు గారితో జరిపించారు. మనవడు జవహరుకు కులాంతర వివాహం చేశాడు. 1981లో తారకం గారు మరణించారు. వారి కుమార్తెల అధ్వర్యంలో ఈనాడు కాకినాడ బ్రహ్మసమాజ మందిరంలో ప్రతి ఆదివారం బ్రాహ్మ సమావేశాలు, ప్రార్థనలు జరుపుతూ వున్నారు. ఈనాటి వరకు నాయుడు గారి, తారకం గారి ఆదర్శాలను పాటిస్తూ జీవితం గడుపుచున్నారు.

ఆకురాతి చలమయ్య : 1943 వరకూ శాంతి నికేతన్ లో శిక్షణ పొందిన వ్యక్తి. రవీంద్రనాథ్ టాగూరుతో పరిచయం వున్నవారు. బెంగాల్ అమ్మాయిని పెళ్ళి చేసుకొని, కాకినాడకు వచ్చి, కులాంతర వివాహాలు, బ్రహ్మ పద్ధతిలో పెళ్ళిళ్ళు, గృహ ప్రవేశాలు జరిపించాడు. కూతురు సుప్రియ ప్రస్తుతం హైదరాబాదు లో వుంటున్నారు. కొడుకు డాక్టరుగా చీరాలలో స్థిరపడ్డాడు.

## మాచిరాజు సీతాపతిరావు

తూర్పు గోదావరి జిల్లా ఒమ్మంగి గ్రామానికి చెందినవారు. ప్రస్తుతం అతని వయస్సు 93 సంవత్సరాలు. కాకినాడ నుండి 'ధర్మజ్యోతి' అనే బ్రహ్మ సమాజపు పత్రికను నడుపుతున్నారు. దానికి ఎడిటర్ ఆయనే. సీతాపతిరావు గారు ఢిల్లీలో వుండే తెలుగువారి కోసం ఒక భవనాన్ని నిర్మించాడు. ఐ.ఏ.యస్. వారికి కొన్నాళ్ళు తెలుగు బోధన చేసారు. 'చేసి తీరాలి - తెలిసి చెయ్యాలి - చేసి చూడాలి - చూచి తీరాలి' ఇదే బ్రహ్మల సందేశం అంటూ ఈనాటికీ బ్రహ్మ సమాజపు వివాహాలు, జరుపుతున్నాడు. అనేక వ్యాసాలను ప్రచురించాడు. వయస్సును లెక్కచేయకుండా బ్రహ్మసమాజం ప్రచారం కోసం తిరుగుతున్నాడు. గొప్ప వితరణ శీలి. కాకినాడ లోని అనాధలకు, దళితులకు ఈనాటికీ విరాళాలు వారి అభ్యుదయం కోసం అందచేస్తున్నాడు. ప్రస్తుతం కాకినాడ లోని బ్రహ్మ సమాజపు మందిరంలో ప్రతి ఆదివారం ప్రార్థనలకు హాజరవుతుంటారు. బ్రహ్మసమాజ ప్రచారమే అతని ధ్యేయమని అంటాడు.

## బ్రహ్మశ్రీ తల్లా ప్రగ్గడ ప్రకాశరాయుడు

పశ్చిమ గోదావరి జిల్లా నిడదవోలు దగ్గర పశివేదల గ్రామంలో ఒక ఆశ్రమాన్ని నడిపాడు. బ్రహ్మ సమాజపు పత్రిక 'ధర్మ జ్యోతి'కి కొన్నాళ్ళు ఎడిటరుగా పని చేశాడు. అసలుసిసలైన గాంధేయవాది. గుడిపాటి వెంకటచలానికి సహచరుడు. రాయుడుగారు ఆంధ్రాంగ్ల భాషల్లో నిష్ణాతులు. దేశభక్తుడు, ధర్మసాధకులు - ప్రచారకులు. బ్రహ్మ ధర్మాన్ని ఆలింగనం చేసుకొని, దానితో రాజకీయ స్వేచ్ఛను కూడా ముడిపెట్టుకొని కారాగారా శిక్షలను అనుభవించిన త్యాగశీలి ప్రకాశరాయుడు గారు. బ్రహ్మ ధర్మ సుధ అనే గ్రంథాన్ని వ్రాసి, బ్రహ్మ సమా

జపు సిద్ధాంతాలను ప్రచారం చేసిన వ్యక్తి ప్రకాశరాయుడు.

### దాకారపు అప్పారావు

హైదరాబాదు నివాసి. ఉపాధ్యాయ వృత్తి నుండి పదవీ విరమణ చేసాడు. హరిజన కులస్థుడు. జాతీయ స్థాయిలో బ్రహ్మసమాజపు ఆదర్శాలను గురించి, దేశములోని వివిధ సంస్థల గురించి ఒక గ్రంథాన్ని వ్రాసాడు. కాకినాడ బ్రహ్మ సమాజం వారు 1982లో ఆయనకు సమాజం తరపున సన్మానం చేసారు. బ్రహ్మ సిద్ధాంతాలకు, ప్రార్థనలకు కట్టుబడిన వ్యక్తి.

### ఆచార్య సోమంచి అనంత పద్మనాభ శాస్త్రి గారు

1952 వరకూ తారకం గారితో వుంటూ నిరంతర సాహచర్యం కలిగి బ్రహ్మల సిద్ధాంతాలను, బ్రహ్మల పద్ధతిలో వివాహాలను జరిపించిన వ్యక్తి. మంచి రచయిత. రాజా రామ్‌మోహనరాయ్, తారకం గారి మీద అనేక వ్యాసాలు వ్రాసారు. ప్రస్తుతం కాకినాడలో బ్రహ్మ సమాజపు సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్నాడు. అనేక ప్రముఖ వ్యక్తులకు సన్మానాలు జరిపి, సాంఘిక సమానత్వం కోసం పాటుపడు చున్న వ్యక్తి శ్రీ శాస్త్రి గారు.

కొమ్ము దమయంతి, రాజలక్ష్మి ఆనందం పంతగడ బాలక్రిష్ణ, పంతగడ శేషమ్మ, గోగుల పాటి రామ్మోహనరావు, గరిమెళ్ళ రామకృష్ణ, డాక్టరు పి. విద్యాసాగర్, పత్తి మణెమ్మ, పత్తి శేషయ్య మొదలైనవారు ఆంధ్ర దేశంలో బ్రహ్మ సమాజ సిద్ధాంతాలను ఆచరించి ప్రచారం చేస్తున్నారే! ఆధునిక కాలంలో అత్యవసర మగుచున్న మత సామరస్య దృష్టిని ఆనాడే బ్రహ్మ సమాజం ద్వారా కందుకూరి, రఘుపతి వేంకటరత్నం నాయుడు, పిఠాపురం రాజావారు, తారకం గారు, పెద్దాడ రామస్వామి గారు, మాచిరాజు సీతాపతిరావు గారు పిలుపునిచ్చారు. ఈనాడు వారి మార్గాలను మనం అనుసరించవలసి వుంది.

ఆ కాలంలో విద్యా విహీనత వలన, క్షామం వలన, హిందూ సంఘంలో శవప్రాయమైన సాంప్రదాయాలు, మూఢాచారాలు ఏర్పడ్డాయి. అంటే కొంత అర్థముంది. ఈనాటి ఆధునిక కాలంలో కూడా వివిధ ముసుగులు కప్పుకొని బంధుప్రీతి, అవినీతి, స్వపక్ష దురభిమానాలుతో జాతీయ జీవన స్రవంతికి అడ్డుగా నిలుస్తున్నాయి. అంటే మనం ఆశ్చర్యపడక మానం. అయితే యిక్కడ ఒక చారిత్రక సత్యాన్ని మనం గమనించాలి. ప్రముఖ పురావస్తు శాస్త్రజ్ఞుడు గార్డన్ చైల్డ్ ఈ విధంగా అంటున్నాడు. "చారిత్రక క్రమంలోనే సాంప్రదాయాలు ఏర్పడతాయి. సాంప్రదాయాలే సమాజంలో వ్యక్తుల నగటు ప్రవర్తనను నిర్ణయిస్తాయి. సాంప్రదాయాలు మానవ సమాజంలోనే తయారవుతాయి. హేతుబద్ధమైన మార్గాలలో సమాజంలో విస్తరిస్తాయి. కనుక అవి మార్పు లేకుండా స్థిరంగా వుండిపోవు. సమాజంలో కొత్త పరిస్థితులు ఏర్పడే కొద్దీ సాంప్రదాయాలు కూడా మారుతాయి. మనిషి సాంప్రదాయాలతో ప్రభావితమౌతూ, తానూ మారుతాడు, అయితే ఆ సాంప్రదాయాలను రూపొందించిన వాడు తిరిగి ఆ మనిషేనని మరచిపోకూడదు. మానవ చరిత్ర నిర్మాత మానవుడే నని" అంటాడు.

అందువలన...

"అసతోమా సద్గమయి,<br>
తమసోమా జ్యోతర్గమయి,<br>
మృత్యోర్మా అమృతంగమయి<br>
అసత్యం నుండి నన్ను సత్యంను పొందింపుము.<br>
చీకటి నుండి తేజస్సును పొందింపుము.<br>
మృత్యువు నుండి నిత్యపదవిని పొందింపుము.

అని బృహదారణ్యకోపనిషత్తు ఉపదేశం.

**జైహింద్**

# మన తెలుగు సంవత్సరాలు

1. ప్రభవ
2. విభవ
3. శుక్ల
4. ప్రమోదూత
5. ప్రజోత్పత్తి
6. అంగీరస
7. శ్రీముఖ
8. భవ
9. యువ
10. ధాత
11. ఈశ్వర
12. బహుధాన్య
13. ప్రమాది
14. విక్రమ
15. వృష
16. చిత్రభాను
17. స్వభాను
18. తారణ
19. పార్థివ
20. వ్యయ
21. సర్వజిత్
22. సర్వధారి
23. విరోధి
24. వికృతి
25. ఖర
26. నందన
27. విజయ
28. జయ
29. మన్మధ
30. దుర్ముఖి
31. హేళంబి
32. విళంబి
33. వికారి
34. శార్వరి
35. ప్లవ
36. శుభకృతు
37. శోభకృతు
38. క్రోధి
39. విశ్వావసు
40. పరాభవ
41. ప్లవంగ
42. కీలక
43. సౌమ్య
44. సాధారణ
45. విరోధికృతు
46. పరీధావి
47. ప్రమాదీ
48. ఆనంద
49. రాక్షస
50. నల
51. పింగళ
52. కాళయుక్తి
53. సిద్ధార్థి
54. రౌద్రి
55. దుర్మతి
56. దుందుభి
57. రుధిరోద్గారి
58. రక్తాక్షి
59. క్రోధన
60. అక్షయ

# పంచాయితీ రాజ్య వ్యవస్థ

**వావిలాల గోపాలకృష్ణయ్య**

గాంధీజీ ఆశయం గ్రామ పంచాయితీ రాజ్యం. మన రాజ్యాంగ నిర్మాతలు శ్రీ రాజేంద్రప్రసాద్, సర్దార్ వల్లభాయి పటేల్, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూలు ఆనాడు రాజ్యాంగ రచనా విధానాలు విపరించటానికి పోయినపుడు, నా ఆశయాలకు విరుద్ధమైన రాజ్యాంగాన్ని రచిస్తున్నారు. కావున నాసద్దకు రానేరాదన్ని గాంధీజీ అన్నారు. మన రాజ్యాంగంలో 40వ సూత్రం క్రింద ప్రతి గ్రామానికి స్వయంపాలిత పంచాయితీ ఏర్పడవలెనని ఉదహరించినా రాజ్యాంగ నిర్మాణానికి గ్రామ పంచాయితీ, పునాదిగా ఏర్పడనే లేదు. బ్రిటిష్ ప్రభుత్వంతో పోరాడి ఆనాడు స్థానిక సంస్థలకు సాధించిన హక్కులు, అధికారాలు బల్వంత్‌రాయ్ మెహతా సూచనలతో కొంత ప్రతిపాదించి సాగించినా అనుదినం గ్రామ, జిల్లా, పరిపాలన పై అంతస్తుతో కేంద్రీకృతం అయి పోయినాయి. ఈ సందర్భంగా రాజ్యాంగ పరంగా పంచాయితీ రాజ్ వ్యవస్థీకరించడం అభిలషణీయమే.

పంచాయితీ వ్యవస్థ లింకు లేకుండా వుండటం సబబు కాదు. గ్రామ పంచాయితీలు, మధ్య వ్యవస్థ, జిల్లా పంచాయితీలు తమ వ్యక్తిత్వాన్ని వికేంద్రీకరణను కోల్పోకుండా పరస్పరం సంప్రదించుకోవడం అవసరము. షెడ్యూలు అంశాలు నిర్ణయించుకోవాలి. అంతర్ సంస్థల సమస్యలకు, పనులకు అంతర్ కమిటీ ఏర్పాటుకు అవకాశం వుండాలి.

2. గ్రామ మధ్యస్థ జిల్లా పంచాయితీలకు సభ్యులు సరాసరి ఎన్నుకోబడాలి. మూడు ఎన్నికలు ఒకసారి జరుగవలె. వీటితోబాటు ఆయా వ్యవస్థల అధ్యక్షులకు కూడా ఎన్నికలు జరగాలి. మధ్యలో ఖాళీలు వస్తే, ఎన్నికలు పెట్టకుండా క్రితం ఓడిపోయిన వారిలో అధిక వోట్లు వచ్చిన వారికి అవకాశం ఇవ్వాలి. మధ్యంతర ఎన్నికలు వుండకూడదు.
3. ఆయా సంస్థల ఆదాయ వ్యయాలకు, దుబారా ఖర్చులకు ఆ సభ్యులు పూర్తి బాధ్యత సంస్థాగతంగానే కాక వ్యక్తిగతంగా కూడా వుండాలి.
4. రిజర్వేషన్లు రొటేషన్ పద్ధతి మంచిదే. ఆయా వ్యవస్థల ఏరియాలో ఆయా వర్గపు, ఆయా తరగతికి చెందిన ఓటర్లు లేకపోతే రిజర్వేషన్లు అమలు జరుపనిలేదు.
5. గ్రామ సర్పంచ్ మధ్య వ్యవస్థకు, మధ్య వ్యవస్థ అధ్యక్షుడు, జిల్లా వ్యవస్థకు సభ్యులుగా కూడా వుండాలి. ఆ విధంగా లింకు నిర్వహించాలి. శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు, ఓటు లేని సభ్యులుగా వుండాలి.
6. రాజ్యాంగ సవరణ ద్వారా నిర్దేశించిన 1. ఆరు నెలలోగా ఎన్నికలు, 2. ఫైనాన్స్ కమీషను, 3. రాష్ట్ర ఎన్నికల అధికారి 4. రాష్ట్ర ఆడిటరు వుండాలి.
7. ఈ మూడు వ్యవస్థలలో ఒక సమస్యపైన గాని, ఒక కార్యక్రమానికి గాని అభిలాష కలిగిన వ్యక్తిని ఆ పని పూర్తి అయేంత వరకు ఇతర సభ్యులతో అధికారాలు, బాధ్యతలు కలిగిన సభ్యుడుగా స్వీకరించవచ్చు. ఆ పని కాగానే అతని సభ్యత్వం రద్దు అవుతుంది. సెక్షను ఇండియా యాక్టు (1919) (72) (ఎ) (2) (బి) ఇది నామినేషన్ల బదులు ప్రయోజన వంతంగా వుంటుంది.
8. అభ్యర్థులు ఇష్టం లేకపోతే బ్యాలెట్ పేపరు మీద తమ కూడ అభ్యర్థులెవ్వరూ అక్కర్లేదని చెప్పేందుకు బ్యాలెట్ పత్రంలో ఒక కాలం వుంచాలి. ఈ ఓటు మెజారిటి వస్తే ఎన్నిక రద్దు చేయాలి.
9. అధికార రీత్యా, మంత్రులు, ఈ వ్యవస్థలో పాల్గొనడం నిషేధించాలి.
10. మధ్యస్థ వ్యవస్థలో, జిల్లా వ్యవస్థలో వివిధ శాఖల స్థాయీ సంఘాలుండాలి. దీనికి సభ్యుల నుండి అధ్యక్షులను ఎన్నుకోవాలి.
11. అధ్యక్షులు సభా సమావేశాలు నిర్వహిస్తే కార్యనిర్వహణాధికారి కార్యకలాపాలు సాగించాలి. ఆయా స్థాయి సంఘాలకు చెందిన అధికారులు విధిగా సమావేశాలకు హాజరు కావాలి. ఆ అధికార పరిధి ఒకటి కన్నా ఎక్కువ వుంటే రొటేషనుగా రావాలి.
12. స్వయంపాలన అన్నప్పుడు తమకు కావలసిన వనరులు కూడా సాగించుకొనే సాహసం వుండాలి.
13. పై అంతస్తు నుండి వచ్చే వనరులు ఎందుకుద్దేశించారో అందుకే వినియోగించాలి.
14. ఈ వ్యవస్థకు పంచాయితీ రాజ్ వ్యవస్థ అనే పేరుండటమే గౌరవ ప్రధమంగా వుంటుంది. ●

# సమాజసేవారంగంలో మణిపూస దుర్గాబాయి దేశ్‌ముఖ్

గోవాడ సత్యారావు

ప్రాతః స్మరణీయరాలు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్.

సంధ్యావేళ తమ గుడిశలలో దీపం వెలిగించుకొని చేతులెత్తి ఆమెకు నమస్కారం చేసిన కుటుంబాలు నాకు ఎన్నో తెలుసు. వారి జీవితాలలో వెలుగు చూపించిన జ్యోతి శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్. మోడుబారిన జీవితాలకు ఒక అర్థం, గమ్యం చూపించి, వాటి సాధనకు మనస్థయిర్యాన్నిచ్చి, ఆర్థిక సామాజిక సహకారాన్నందించిన మహనీయురాలు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్.

దేశంలో చిరకాలంగా చెదురు మదురుగా జరుగుతున్న సమాజ సేవకు వ్యవస్థాపరమైన ఒక స్వరూపాన్ని కల్పించి, దేశమంతటికీ వ్యాపింపజేసి దరిద్ర నారాయణుల జీవనోద్ధరణకు నిర్విరామ కృషి సల్పిన సమాజసేవిక.

ఆరు దశాబ్దాల క్రితం భారత దేశ స్థితి, ముఖ్యంగా ఆంధ్ర దేశంలో సామాజిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకుంటే, ఎన్నో అడ్డంకులను ఎదుర్కొంటూ ఒంటరిగా సమాజంలోని దీనజనులకు ఒక దారి చూపించడానికి ఆమె రచించిన కృషి, ఆతర్వాత అర్థ శతాబ్దంలో ఆమె స్థాపించి, విజయవంతంగా నడిపిన సంస్థలే ఆమె సమాజ సేవారంగంలో మణిపూస అనడానికి ప్రత్యక్ష సాక్ష్యాలు.

వివిధ సంస్థలు, సంస్థలలోని విభాగాలకు సంబంధించిన 125 పైగా శిలా ఫలకాల వెనుక ఆమె కృషి, తోడ్పాటు ఉంది. మద్రాసులో ప్రారంభించి హైదరాబాదు, ఢిల్లీ, సంగారెడ్డి మహబూబ్‌నగర్, రాష్ట్రంలోని అనేక ఇతర పట్టణాలలో ఆమె కృషితో నెలకొన్న సంస్థలలో వీటిని ఆవిష్కరించారు.

అటువంటి ఒక సంస్థతో, ఆమె నాయకత్వంలో ఒక దశాబ్దం పాటు నాకు అనుబంధం కలగటం నాఅదృష్టం. ఢిల్లీలోని ఆంధ్ర ఎడ్యుకేషన్ సంస్థలో కార్యదర్శిగా నేను సేవచేస్తున్న రోజులు అవి. మరపురాని స్వర్ణావకాశం.

కాకినాడలో 1909 జూలై 15న జన్మించిన ఆతర్వాత దుర్గాబాయిగా ప్రఖ్యాతిగాంచారు. ఆనాటి సామాజిక సంప్రదాయాల కనుగుణంగా ఎనిమిదవ ఏటనే, జమీందారుల ఇంట వివాహమైంది. అయితే ఇది వివాహంగా ఆమె ఏనాడు పరిగణించలేదు. ఆమాటే తన 'భర్త' సుబ్బారావుతో చెప్పి ఆయన మరో వివాహం చేసుకోడానికి తాను అభ్యంతరం చెప్పననీ, సాంఘిక కట్టుబాట్లు, సంప్రదాయాలు బాగా బలంగా ఉన్న రోజులలో, ఏడు దశాబ్దాల క్రితమే ఆమె వ్రాసి యిచ్చింది. సంఘ సంస్కరణ, సమాజ సేవా, మూఢాచారాలకు వ్యతిరేకంగా పోరాటం పసితనంలోనే ఆమెలో ఆసక్తి రేకెత్తించాయి.

నిజానికి ఈ భావాలు అంతకు ముందే, తన 14వ ఏటనే, మహాత్మాగాంధీ



కాకినాడ దర్శించనున్న తరుణంలోనే ఆమెలో మొలకెత్తాయి. ఆనాడే దేవదాసీలు, ముస్లిమ్ మహిళల సమావేశంలో గాంధీజీ ప్రసంగించడానికి కృషిచేసి, స్వరాజ్యనిధికి వారిచే ఉదారంగా విరాళం యిప్పించడం, ఆరోజులలో సామాన్యమైన విశేషంకాదు. ఐదునిమిషాల ప్రసంగానికి ఐదువేల రూపాయలు నిధికి యివ్వాలన్న 'స్థానిక నేత'ల షరతును అంగీకరించి, గాంధీజీని తీసుకువెళ్ళి, అరగంటకు పైగా ప్రసంగం విని, వెయ్యిమంది మహిళలు ఆభరణాలను నిస్సంకోచంగా సమర్పించారు. వాటివిలువ ఆనాడు రు.25,000 లకు మించి ఉందని శ్రీ తెన్నేటి విశ్వనాథం అన్నారు.

గాంధీజీని ఆకట్టుకున్న ఆమె కర్తవ్య దీక్ష, పట్టుదల, సమాజసేవానురక్తి, తర్వాతి కాలంలో గాంధీజీకి మరింత సన్నిహితురాలిని చేశాయి.

కాకినాడ కాంగ్రెసు సభల సందర్భంగా, ఆరు వారాల వ్యవధిలో 400 మంది మహిళలకు హిందీ నేర్పి వాలంటీర్లుగా తీర్చిదిద్దిన దుర్గాబాయి, వయస్సు తక్కువగా ఉన్నదని కాంగ్రెసు సభకు వాలంటీరుగా పనికిరావని తీసివేశారు. అయితే హిందీసమ్మేళనంలోను, ప్రదర్శనలోను మాత్రం వాలంటీరుగా అనుమతించారు. ఎగ్జిబిషన్‌గేటు దగ్గర జవహర్‌లాల్ నెహ్రూ లోనికి ప్రవేశిస్తుంటే, టిక్కెట్ అడగగలిగిన సాహసి- కాదు క్రమశిక్షణ జీర్ణించుకున్న వాలంటీరు దుర్గాబాయి. ఆ వ్యక్తి జవహర్ లాల్‌నెహ్రూ అని తెలుసునని, అయితే టిక్కెట్టు లేకుండా ఎవరినీ లోనికి పోనీయరాదన్న ఆదేశాన్ని అమలు చేస్తున్నానని జంకులేకుండా ఆమె చెప్పినతీరు, ఆమెలోని పట్టుదల,

క్రమశిక్షణ నెహ్రూని ఆనాడే ముగ్ధుణ్ణి చేశాయి. బహుశా తర్వాత కాలంలో, దేశం స్వతంత్ర్యం పొందిన తర్వాత ప్రధాన మంత్రి నెహ్రూ ఆమెకు గురుతరమైన బాధ్యతలు వప్పగించడానికి కారణం అయ్యుంటుంది.

కాకినాడ కాంగ్రెసు మహాసభల ముందు తాను హిందీ నేర్చుకుంటూ, వాలంటీర్లకు హిందీనేర్పే కేంద్రంగా దుర్గాబాయి ప్రారంభించిన భావికా హిందీ పాఠశాల క్రమక్రమంగా అభివృద్ధిచెంది చిత్తరంజన్ దాస్, కస్తూరిభాగాంధి, ఆండ్రూస్ వంటి మహానుభావుల ప్రశంసల నందుకున్నది. ఈకేంద్రంనుండి యేటా 40-50 మంది మహిళలు దక్షిణ భారత హిందీ ప్రచారసభ పరీక్షలకు హాజరై ఉత్తీర్ణు లవుతుండేవారు. ఆమె కృషిని ప్రోత్సహించడానికి, శ్రీ గుమ్మిడిదల వెంకట సుబ్బారావుగారు విశాలమైన భవనాన్ని కొని, ఈ హిందీ పాఠశాలను వప్పగించారు. ఆనాడే దానిఖరీదు లక్షరూపాయలుంటుందని శ్రీమతి దుర్గాబాయి తమ స్వీయచరిత్రలో వ్రాసుకున్నారు. ఆమె స్థాపించిన అనేక సంస్థలకు, స్వంతభవనం లభించడం అదేప్రథమం. ఆతర్వాత ఆమె ఎన్ని సంస్థలను స్థాపించారో అన్నిటికీ స్వంత భవనాలు నిర్మించారు. లక్షలకు లక్షల రూపాయల విలువ చేసే భవనాలు, మరెన్నో లక్షల రూపాయల వార్షిక బడ్జెటుతో కార్యక్రమాలు! నిధులకు ఏనాడు కొరత లేదు. మంచి పనులకు నిధులు సమస్యకానేకాదు అంటుండేవారు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్.

### స్వతంత్ర పోరాటంలో...

కాకినాడ కాంగ్రెసు సభల సందర్భంగా తమ 14వ ఏట స్వతంత్ర పోరాటంలో పాల్గొన్న దుర్గాబాయి ఆతర్వాత మూడు సందర్భాలలో ఉద్యమంలో పాల్గొని, అరెస్టయి జైలు శిక్ష అనుభవించారు. 1930 నాటి ఉప్పు సత్యాగ్రహం ఉద్యమంలో, మద్రాసులో నాయకత్వం వహించిన టంగుటూరి ప్రకాశంగారు, దుర్గాబాయిని, తన తర్వాత 'డిక్టేటర్' గా నామినేట్ చేశారు. అప్పటికి ఆమె వయస్సు 21 సంవత్సరాలు మాత్రమే!

మొదట వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. ఆరోజులలోనే, జైలులో శిక్ష అనుభవిస్తున్న మహిళలను కలుసుకొని, వారి నేరాలు, వారి సామాజిక పరిస్థితులు, అజ్ఞానం వలన కోర్టులలో తమకు పూర్తి న్యాయం జరగక పోవటం వంటి విషయాలను ఆమె అధ్యయనం చేశారు. మూడవసారి అరెస్టయి, మదురై జైలులో ఒంటరిగదిలో శిక్ష అనుభవించారు. ఆప్రక్కనే మరో శిక్షపొంది, ఉరితీతకు సిద్ధంగాఉన్న వారి ఆక్రందనలు ఆమెను మానసికంగా బాగా కృంగదీశాయి. 1933లో జైలునుండి విడుదలైన తర్వాత, ఆమె తిరిగి ..స్వతంత్ర్య పోరాటంలో పాల్గొనలేదు.

వెల్లూరుజైలులో ఉన్నప్పుడు, రాజకీయ ఖైదీలకు ఏ,బి,సి తరగతుల జైలు సౌకర్యాలు కల్పించడాన్ని ఆమె వ్యతిరేకించారు. విడుదలైన తర్వాత కాంగ్రెసు సభలలో ఈ విషయాన్ని ఆమె తీర్మానంగా ప్రవేశపెట్టారు. సభదానిని ఏకగ్రీవంగా ఆమోదించింది.

జైలునుండి విడుదలై 1933లో కాకినాడ తిరిగి వచ్చిన తర్వాత, ఆమెకు చదువుపై దృష్టి మరిలింది. ఏనాడో ఐదో తరగతి చదువుతో మానివేసిన ఆమె, ప్రయివేటుగా చదువుకొని బెనారస్ హిందు విశ్వవిద్యాలయంవారి మెట్రిక్యులేషన్‌కు వెళ్ళవచ్చునని ఆమె గురువు గోపరాజు రామచంద్రరావు సలహాయిచ్చారు. దానిఫలితమే ఆమె బెనారస్ హిందూ విశ్వ విద్యాలయ అడ్మిషన్ పరీక్ష (మెట్రిక్యులేషన్) 1934 మే నెలలో ఆ తర్వాత ఇంటర్మీడియట్ పరీక్షలో ఉత్తీర్ణురాలయ్యారు. పండిత మదన మోహన్‌మాలవ్యా స్థాపించిన ఈ విశ్వవిద్యాలయంలో సంస్థలను చూచి, భవిష్యత్తులో తాను కూడా అటువంటి విద్యాసంస్థలను నెలకొల్పాలనే ఆశయం కలగటం, ఆతర్వాత కాలంలో ఆంధ్ర మహిళాసభవంటి అనేక సంస్థలు రూపుదిద్దుకోడం ఆమెలోని ఆదర్శాలకు, పట్టుదలకు నిదర్శనాలు.

ఇంటర్మీడియట్ పాసయిన తర్వాత, విశాఖపట్టణంలోని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.ఎ.ఆనర్స్‌లో చేరడానికి, విద్యార్థినులకు ప్రత్యేక హాస్టలు లేకపోవడం అడ్డురావడంతో హాస్టలు లేనందున చదువుకోలేకపోయిన 10 మంది విద్యార్థినులను కూడ గట్టి, ప్రత్యేక హాస్టలు ప్రారంభించి, కళాశాలలో చేరారు. 1939 లో పొలిటికల్ సైన్సులో బి.ఎ.ఆనర్స్ ప్యాసై, లండన్ స్కూల్ ఆఫ్ ఇకనామిక్స్‌లో చదువు కోడానికి టాటా స్కాలర్ షిప్ లభించినా, ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడంతో, లండన్ వెళ్ళలేక పోయారు. మద్రాసు న్యాయ శాస్త్ర కళాశాలలో చేరి 1941 లో లా డిగ్రీ పొందారు.

మద్రాసులో ఆంధ్రమహిళా సభ, హైదరాబాద్‌లో ఆంధ్రమహిళాసభ, సంగారెడ్డి, మహబూబ్‌నగర్ తదితర పట్టణాలలో స్థాపించిన సంస్థలకు కాకినాడలో ఆమె 1923లో ప్రారంభించిన భావికా హిందీ పాఠశాల బీజం అనవచ్చు. ఆనాటి లక్ష్యాలే ఈసంస్థలుగా పుష్పించి, ఫలవంతమైనాయి.

బ్రిటీషువారు 1937లో భారత దేశంలోని వివిధ రాష్ట్రాలకు పరిమితంగా స్వపరిపాలనాధికారం యివ్వాలని నిర్ణయించడంతో, అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీ శాసనసభ ఎన్నికలు జరిగి,

శ్రీ సి.రాజగోపాలాచారి ప్రధానమంత్రిగా, శ్రీ టంగుటూరి ప్రకాశం రెవెన్యూ మంత్రిగా కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడింది. శ్రీ బులుసు సాంబమూర్తి శాసనసభ స్పీకరుగా ఎన్నికయ్యారు. ఆమె సోదరుడు కార్యదర్శిగా చేరడంతో దుర్గాబాయి కార్యక్షేత్రాన్ని కాకినాడనుండి మద్రాసుకు తరలించింది. దుర్గాబాయి విశాఖపట్టణంలో చదువుకుంటూ మద్రాసు తరచువచ్చి పోతున్నప్పుడు ఏర్పడినదే 'లిటిల్ లేడీస్ ఆఫ్ బృందావన్' సంస్థ. వారి ఇంటి చుట్టు పక్కల పనిపాటలు లేకుండా తిరుగుతున్న బాలబాలికలను పోగుచేసి వారికి ఆటపాటలే కాక, కొంత చదువు నేర్పించే కార్యక్రమం ప్రారంభించారు దుర్గాబాయి. ఆమె తల్లి శ్రీమతి రుక్మిణమ్మగారు. అదేక్రమంగా చెన్నపురి ఆంధ్రమహాసభలో, మహిళా బాలల విభాగంగా రూపొంది అనతి కాలంలోనే ఆంధ్ర మహిళా సభగా ప్రత్యేక వ్యక్తిత్వంలో ఒక సంస్థగా రూపొందింది. ఆతర్వాత, గడిచిన అర్ధశతాబ్దంలో ఇది శాఖోపశాఖలుగా విస్తరించి విద్య, వైద్య, సాంఘిక సంక్షేమం, వృత్తి విద్య, తదితర రంగాలలో దేశంలోనే కాక, ప్రపంచ స్థాయిలోనే తనదంటూ ఒక ప్రత్యేకతను సాధించుకుంది.

మొదట్లో చిన్నపిల్లలకు ఆటపాటలు, హిందీ పాఠాలు, నృత్యసంగీతాల తరగతులకు పరిమితమైన ఆంధ్ర మహిళా సభ (ముందు లిటిల్ లేడీస్ ఆఫ్ బృందావన్) కార్యక్రమాలు మరింత ప్రయోజనకరమైన దిశగా పురోగమించాయి. మధ్యలో, చిన్నతనంలోనే, చదువు మానేసిన మహిళలకు తిరిగి చదువు చెప్పించి, పరీక్షలకు తయారు చేయడానికి పూనుకున్నది. ఎప్పుడో ఐదారు తరగతులలో స్కూలుకు స్వస్తిచెప్పి, సంసారంలో పడిన స్త్రీ తిరిగి మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్లాలంటే, ఆరేడు సంవత్సరాల కోర్సును కొద్దికాలంలో - రెండుమూడు సంవత్సరాలలోనే నేర్చుకోవలసి ఉంటుంది. ఈ దృష్టిలో పెంపొందు కోర్సును రూపొందించి, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం వారి అడ్మిషన్ పరీక్షకు (మెట్రిక్యులేషన్) తయారు చేయడం ప్రారంభించారు. పేద కుటుంబాలు, బలహీన వర్గాల బాలికలతో చదువు చిన్నతనంలోనే మానిపేస్తారనే దురభిప్రాయం ఉండేది, కాని ఆంధ్ర మహిళాసభ తయారు చేసిన తొలి బ్యాచ్, విద్యార్థినులలో అధిక సంఖ్యాకులు ఉన్నత కుటుంబాలకు చెందిన వారేనంటే ఆశ్చర్యం కలగకమానదు.

మెట్రిక్యులేషన్ తో ప్రారంభమై, ఇంటర్మీడియట్ పరీక్షలకు విద్యార్థినులకు శిక్షణ యివ్వడానికి ఏర్పాట్లు జరిగాయి. క్రమక్రమంగా ప్రయివేటుగా చదువుకొనే సౌకర్యాలు విస్తృతంగా లభ్యం కావడంతో, ఆంధ్రమహిళా సభ పాఠశాలలు, కళాశాలలు ప్రారంభమయ్యాయి.

మెట్రిక్యులేషన్ పరీక్ష అంటే గుర్తుకు వచ్చింది. 1970-72 లో ఢిల్లీ లోని ఆధ్ర ఎడ్యుకేషన్ సొసైటీ సీనియర్ సెకండరీ పాఠశాల మేనేజింగ్ కమిటీ అధ్యక్షులు శ్రీమతి దుర్గాబాయిగారు నన్ను నామినేట్ చేశారు. ఆంధ్ర దేశం నుండి బదిలీ అయి ఢిల్లీ వచ్చే తెలుగువారి పిల్లలు, అంతవరకు తెలుగు మీడియంలో చదువు కొచ్చిన వారు, ఢిల్లీలో ఇంగ్లీషు మీడియంలో ఇమడలేక పోయేవారు. ఈ సమస్యను పరిశీలించి, నేను కూడా ఢిల్లీలో ఆంధ్ర మెట్రిక్ పరీక్షకు క్లాసులు నిర్వహించడం, ఆధ్ర విశ్వవిద్యాలయ అధికారులను ఒప్పించి ఢిల్లీలోనే పరీక్షా కేంద్రం ఏర్పాటు చేయించడం జరిగింది. శ్రీమతి దుర్గాబాయి దేశ్ముఖ్ చూపిన పట్టుదలే నాకు, నా సహచరులకు ఆదర్శ ప్రాయమైంది.

## పార్లమెంటు సభ్యురాలుగా......

సమాజంలో అన్యాయాలకు గురైన వ్యవస్థాపరమైన అసమానతలకు గురైన మహిళలు, బాలబాలికల విద్యా, వైద్య, ఆరోగ్య, సామాజిక అభివృద్ధి రంగంలో అప్పటికే గణనీయమైన సేవచేస్తున్న దుర్గాబాయి 1946 లో రాజ్యాంగ నిర్ణయ సభలో సభ్యురాలుగా ఎన్నికయ్యారు. అప్పటికే, అగ్రనాయకులందరితో పరిచయాలున్న ఆమె, రాజ్యాంగ చట్ట రచనలో చురుకుగా పాల్గొన్నారు. స్టీరింగ్ కమిటీ సభ్యురాలుగా సభ్యులు ప్రతిపాదించిన 750 సవరణలను పరిశీలించారు! ఈ బాధ్యతను సర్దార్ పటేల్ ఆమెకు అప్పగించారు.

భారతదేశం స్వతంత్రమైన తర్వాత ఆర్థిక మంత్రి డాక్టర్ జాన్ మత్తయ్ ప్రతిపాదించిన బడ్జెట్ను సభలో నిశితంగా విమర్శించి సంచలనం సృష్టించిన వ్యక్తి దుర్గాబాయి. "ఇది ధనికుల బడ్జెట్, సామాన్యప్రజల సంక్షేమం గురించి ఎలాంటి ప్రతిపాదన లేదు" అని ఆమె విమర్శించారు.

ఆమె పౌరుష, సాహసం, నిర్మొహమాటంగా జవహర్ లాల్ నెహ్రూతో విభేధాల కారణంగా డాక్టర్ మత్తయ్ ఆర్థిక మంత్రి పదవికి రాజీనామా చేయడం 1950 మే నెలలో డాక్టర్ చింతామణ్ దేశ్ముఖ్ ఆర్థిక మంత్రి కావడం జరిగింది. 1951-52 సంవత్సరానికి బడ్జెటు ప్రతిపాదించిన డాక్టర్ దేశ్ ముఖ్ కు కూడా ఇదే విమర్శ ఎదురైంది. "పొగాకుపై పన్ను విధించి పేదల ఆరోగ్యానికి తోడ్పడుతున్నాయన్నది బాగానేఉంది, కాని ఈ ఆదాయాన్ని పేదలు, అనాధలు, వికలాంగులు, తదితర వర్గాల సంక్షేమానికి కేటాయించండి" సవరించిన బడ్జెటు అంచనాలలో "సాంఘిక సంక్షేమం" అనే పద్దు ఉంటుంది చూడండి అని డాక్టర్

దేశ్ ముఖ్ సమాధానం చెప్పారు.

కేంద్ర బడ్జెటులో సాంఘిక సంక్షేమం అనే అంశానికి ప్రత్యేకత సాధించిన ఘనత శ్రీమతి దుర్గాబాయి గారికే చెందుతుంది.

ఆమె చొరవ, నిర్మొహమాటంగా మాట్లాడే స్వభావం. తన వాక్ చాతుర్యంతో ఎదుట వారిని ఒప్పించగలశక్తి జవహర్ లాల్ నెహ్రూ, పటేల్‌లను ఎంతగానో ఆకర్షించాయి.

అయితే ఆతర్వాత లోక్ సభకు జరిగిన 'ఎన్నికలలో దుర్గాబాయి ఓడిపోవడంతో, మకాం మద్రాసుకు మార్చి, తను ఆంధ్ర మహిళా సభ కార్యకలాపాల పట్ల శ్రద్ధ వహించాలని భావిస్తున్న తరుణంలో, ప్రధానమంత్రి ఆమెను సహాయ పునరావాస కార్యక్రమాలను అప్పగించారు. తర్వాత ఆమెను ప్రణాళికా సంఘంలో సమాజ సేవా కార్యక్రమాలకు బాధ్యత వహించే సభ్యులుగ నియమించారు. ఈ అవకాశం వినియోగించుకొని, అప్పుడే స్వతంత్రమైన భారతదేశంలో సమాజ సంక్షేమ కార్యక్రమాలకు వ్యవస్థాపరమైన రూపకల్పన చేయగలిగారు. సమాజసేవా కార్యక్రమాల అమలులో ప్రభుత్వ నియంత్రణ అతి స్వల్పంగా ఉండాలని, వీటి అమలుకు స్వచ్ఛంద సంస్థలు అనువైనవనీ ఆమె దృఢ విశ్వాసం. దీనిని అనుసరించే, జవహర్ లాల్ నెహ్రూ పూర్తి మద్దతులో కేంద్ర సమాజ సంక్షేమ సంస్థను రూపొందించడం, దానికి అధ్యక్షురాలుగ మార్గ దర్శకత్వం వహించడం జరిగింది.

సంక్షేమ కార్యక్రమాలను అమలు పర్చడంలో కేవలం ప్రభుత్వ శాఖల కృషి సరిపోదని, నిజానికి స్వచ్ఛంద సంస్థలు మరింత సమర్థవంతంగా ప్రయోజనకరంగా వీటిని అమలు పర్చగల వని శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గుర్తించారు. మద్రాసులో తాము స్థాపించి, విజయవంతంగా నిర్వహించిన ఆంధ్ర మహిళా సభ అనుభవాలే ఇందుకు నిదర్శనం. ఇదే సిద్ధాంతం కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘ విధానాలలో వ్యవస్థలో చోటు చేసుకున్నది. తాము రూపకల్పన చేసి, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకు అర్థం, లక్ష్యం కల్పించడంలో ఇదే సిద్ధాంతం ప్రధాన స్థానం ఆక్రమించింది.

ఆర్తులకు చేయూత నివ్వడంలో ప్రభుత్వ నియమ నిబంధనలు, అధికార వైఖరి అడ్డమొస్తుంటాయి. వారికి ప్రయోజనకరంగా ఉండటానికి స్వచ్ఛంద సంస్థలే అనువైన సాధనాలు అని ఆమె తరచు చెప్తుండేవారు. ఈ ఉద్దేశ్యంతో ఆమె ప్రారంభించిన అనేక సంక్షేమ పథకాల అమలుకై "ఊరూరా అనేక స్వచ్ఛంద సంస్థలు" ప్రారంభమై కార్యక్రమాలు కొనసాగించాయి.

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ స్వతంత్ర్య భారతదేశ బడ్జెటులో 'సాంఘిక సంక్షేమం' అనే పద్దుకు రూపకల్పన చేయడంలో ప్రముఖపాత్ర వహించారు. అదేవిధంగా, 1952 లో జవహర్‌లాల్ నెహ్రూ సూచనపై చైనాలో పర్యటించి, కుటుంబ న్యాయస్థానాలు, జనాభా నియంత్రణ, కుటుంబ నియంత్రణ వంటి కార్యక్రమాలకు రూపకల్పన చేశారు. తమనివేదికలో వీటిని గూర్చి సిఫార్సులు చేశారు.

అంధత్వ నివారణ, వయోజన విద్యావ్యాప్తి వంటి రంగాలలో ఆమె సేవలు ఎంతో ముఖ్య మైనవి. హైదరాబాదులో ఆమె నెలకొల్పిన లిటరసీ హౌస్ కార్య క్రమాలు జాతీయస్థాయిలో గుర్తింపు పొందాయి.

అక్షరాస్యతా కార్యక్రమంలో ఆమె సేవలకు నెహ్రూ అంతర్జాతీయ సాక్షరతా బహుమతి ఆమెకు లభించింది. యునెస్కో వారి అంతర్జాతీయ సమన్వయ సంఘంలో సభ్యురాలుగా ఆమె ఎంతో ప్రశంసనీయమైన సేవలు చేశారు.

**దేశ్‌ముఖ్‌తో వివాహం**

శ్రీమతి దుర్గాబాయి 1952 లో కేంద్ర ఆర్థిక మంత్రి డాక్టర్ చింతామణ్ ద్వారకనాధ్ దేశ్‌ముఖ్‌ను వివాహం చేసుకున్నప్పుడు, మొదటి సాక్షి సంతకం చేసినవారు ప్రధానమంత్రి శ్రీ జవహర్ లాల్ నెహ్రూ. అయితే ఈ వివాహం విజయవంత మౌతుందా అనే సందేహం చాల మందికి కలిగింది. నిజానికి దుర్గా బాయి గారికే కలిగింది. డాక్టర్ దేశ్‌ముఖ్ వివాహం ప్రస్తావన చేసినప్పుడు, ఆమె ఈ మాటలే అన్నారు.

"అత్యంత ప్రతిష్ఠాత్మకమైన ఇండియన్ సివిల్ సర్వీసెస్‌కు చెంది, ఎంతో సంస్కారం కలిగి మాట మర్యా దలు, తెలిసి, గొప్ప వ్యక్తిగా అందరి ప్రశంస లనందుకున్న వ్యక్తి డాక్టర్ దేశ్‌ముఖ్. మరి తను పల్లెటూరి బాపతు" అని ఆమె అయనకు చెప్పింది. తనమనసు లోని భావాలను కాళిదాసు శ్లోకంద్వారా వ్యక్తంచేశారు ఆయన. 1953 జనవరి 22 వ నారు వివాహం చేసుకున్నారు. ఎవరు ఎవరిని మారుస్తారో చూడాలి అనేవారు మిత్రులు. అయితే ఎలాంటి ఆలోచనలు, చర్చలు లేకుండానే ఇద్దరిలోనూ మార్పులు వచ్చాయి.

కార్యేషుదాసి, కరణేషుమంత్రి,
భోజ్యేషు మాతా, క్షమయా ధరిత్రి

అన్న సూక్తిని అక్షరాలా నిజంచే శావని డాక్టర్ దేశ్‌ముఖ్ ప్రశంసించారని శ్రీమతి దుర్గాబాయి తన స్వీయచరిత్రలో వ్రాసుకున్నారు.

తను జీవితంలో ఏ విషయాన్ని గురించి అయినా తీవ్రంగా విభేదించిన సందర్భాలు లేవని ఆమె పేర్కొన్నారు. మేమిద్దరం ఒకరిలో ఒకరం అంతర్లీనమై పోయాం అని ఆమె వ్రాశారు.

శరీరాలు రెండు, మనసు ఒకటిగా వారిరువురు జీవించారు. మహోన్నతమైన ఆదర్శాలు గలవారు, ఒకరి భావాలను మరొకరు చక్కగా అర్థం చేసుకున్నారు. జాతి సేవకు జీవితాలను అంకితం చేసినవారు. "నేను ఆంధ్రుల అల్లుడిని" అని ఆయన సంతోషంగా చెప్పుకొం టుండేవారు.

ఒకసారి, ఢిల్లీకరోల్ బాగ్ ఆంధ్ర పాఠశాల వార్షికోత్సవానికి డాక్టర్ దేశ్ ముఖ్ అధ్యక్షులు, శ్రీమతి దుర్గాబాయి దేశ్ ముఖ్ బహుమతులు పంచడానికి మా ఆహ్వానం అంగీకరించారు. ఆహ్వానాలు అచ్చయి, అందరికీ వెళ్ళాయి.

సమావేశానికి అధ్యక్షత వహిస్తూ డాక్టర్ దేశ్ ముఖ్, జేబులోని ఆహ్వానం తీసి దానిపై అడ్రసును "డాక్టర్ అండ్ మిసెస్ దుర్గాబాయి దేశ్ ముఖ్" అని చదివారు. అందరూ నవ్వారు. నాకు మాత్రం చెమటలు పోశాయి. ఎవరో పొరపాటున అలా వ్రాసినందుకు, నేను కార్యదర్శిని మరి.

"ఇది అక్షరాలా సరియైనది. దుర్గాబాయి భర్త అని చెప్పుకోడానికి నేను గర్విస్తున్నాను." అని ఆయన అన్నారు. వారిలో న్యూనతాభావంలేదు.

ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత, ఆంధ్ర మహిళా సభ తన కార్యక్రమాలను హైదరాబాదుకు విస్తరించాలని నిర్ణయిం చింది. దానిఫలితమే, శ్రీమతి కమలా బాయి చటోపాధ్యాయ ప్రోత్సాహంతో, హైదరాబాదులో ప్రాంతీయ చేతిపనుల మహిళా శిక్షణ కేంద్రం స్థాపన. వివిధ చేతివృత్తులలో దక్షిణాది రాష్ట్రాలకు చెందిన 60 మంది మహిళలకు శిక్షణయిచ్చే కార్యక్రమం చేపట్టింది. ఆ వెంటనే మహిళలకు కండెన్సుడు విద్య తరగతులు, కుటుంబ నియంత్రణ కేంద్రం మొదలైనవి. ఆంధ్ర మహిళాసభ హైదరాబాదు శాఖలో భాగాలైనాయి.

శ్రీమతి దుర్గాబాయి దేశ్ ముఖ్ మద్రాసులో మాదిరిగానే, హైదరాబాదులో కూడా తను సంస్థలకు స్థలాలు సేకరించి, భవనాలు నిర్మించి, వివిధ కార్యక్రమాలను నిర్వహించారు. విద్య, వైద్య ఆరోగ్య సౌకర్యాలు, కుటుంబ సంక్షేమం, వయోజనవిద్య, శారీరక వికలాంగుల పునరావాసం, మానసిక వికలాంగుల పునరావాసం వంటి ఎన్నో కార్యక్రమాలను ఈ సంస్థలు నిర్వహిస్తున్నాయి. మహిళా సభ ఆధ్వర్యంలో పాఠశాలలు, కళాశాలలు, బి.ఇ.డి కళాశాల వంటివి ఎన్నో విద్యా సంస్థలు పనిచేస్తున్నాయి.

ఆంధ్రమహిళాసభ కార్యక్రమా లలో వైద్య సదుపాయాలకు ప్రముఖ స్థానం ఉంది. అన్ని హంగులు కలిగిన ఆసుపత్రులు, ఇంటెన్సివ్ కేర్ యూనిట్, కార్డి యోవాస్కులర్ సర్వీస్‌యూనిట్, కార్డియో వాస్కులర్ రిసర్చి యూనిట్, నర్సుల శిక్షణా సంస్థ, ఎ.ఎన్.ఎం శిక్షణ విభాగం వంటి ఎన్నో శాఖలు ఈనాడు పనిచేస్తున్నాయి.

శ్రీమతి దుర్గాబాయి రూపకల్పన చేసి స్వతంత్ర సమాజ సేవా సంస్థగా రూపొందించిన కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు రజతోత్సవ సందర్భంగా బోర్డు సహాయం, బెల్కో కానుక, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రాంటుతో 'మినీ హాస్పిటల్ ఆన్ వీల్స్' అన్ని సౌకర్యాలు కల ఒక చిన్న సంచార ఆసుపత్రిని ఆంధ్ర మహిళాసభ సంతరించుకుంది. గ్రామీణుల దగ్గరకు వైద్యసౌకర్యాలు అందించే కృషి అది.

ఆంధ్ర మహిళా సభ ఆసుపత్రి శాఖల విస్తరణకు దేశవిదేశాలనుండి విరాళాలు వసూలు చేయడమేగాక, తమ సర్వస్వాన్ని సభకు విరాళంగా యిచ్చిన పుణ్య దంపతులు శ్రీ చింతా మణ్ దేశ్ ముఖ్, శ్రీమతి దుర్గాబాయ్ దేశ్ ముఖ్.

## గాంధి శతాబ్ది భవనాలు

గాంధి శతాబ్ది కార్యక్రమాలలో భాగంగా, ప్రతిజిల్లా కేంద్రంలో గాంధి శతాబ్ది కేంద్రాలు నెలకొల్పాలని శ్రీమతి దుర్గాబాయి దేశ్ ముఖ్ సంకల్పించారు. ఆనాటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానంద రెడ్డి సహకారంతో ఒక పథకం రూపొందించి, రాష్ట్రంలో 12 కేంద్రాలు నిర్మించి, కార్యక్రమాలను నిర్వహించ డానికి ఆమె తోడ్పడ్డారు. హైదరాబాదులోని ఆంధ్రమహిళాసభ కళాశాల ప్రాంగణంలో నిర్మించిన గాంధీ ప్రార్థనా మందిరం వీటిలో ప్రధానమైనది. గాంధీ జీ సిద్ధాంతాల ప్రచారానికి, సమాజంలో బలహీనవర్గా లను, ముఖ్యంగా బాలబాలికలు, మహిళలు, వికలాంగులు, అనాధలు, నిరాశ్రయులకు చేయూతనివ్వయడానికి ఈ గాంధి శతాబ్ది కేంద్రాలు ఎంతగానో తోడ్పడు తున్నాయి.

శ్రీమతి దుర్గాబాయి దేశ్ ముఖ్ ఏనాడూ పదవులను ఆశించలేదు. పదవులకై పాకులాడలేదు. సేవాకార్యక్రమాలు నిర్వహించాలన్నదే ఆమె తపన. ఆమె వ్రాసిన గ్రంథానికి ముందుమాట వ్రాస్తూ అప్పటి తమిళనాడు గవర్నరు ప్రభుదాస్‌పట్వారి అన్నమాటలు ఆమె వ్యక్తిత్వానికి అద్దంపడ్తాయి.

"ఆమె కార్యక్రమాలన్నీ గాంధీజీ ప్రవచించిన నిర్మాణ కార్యక్రమభాగాలే. సామజిక అన్యాయాలు, ఆర్థిక అసమానత లతో కూడిన వ్యవస్థ పీడితులతో వారి కష్టసుఖాలను పంచుకుని, వారి ఉద్ధరణకు చిత్త శుద్ధితో కృషిచేసే గాంధేయవాదుల కోవకు చెందిన వ్యక్తి. తమ జీవితంలో శ్రమ, పదవులను, సన్మానాలు గౌరావాలను ఆశించలేదు. ఆర్తుల సేవకే జీవితాన్ని అంకితం చేసింది." ఆమెధన్యజీవి. ●

# తెలుగు కథానిక : దశాబ్ది ధోరణులు

**కేతు విశ్వనాథరెడ్డి**

ఆధునిక తెలుగు సాహిత్యంలో మనం ఈ రోజుల్లో కథ, కథానిక అని వ్యవహరించే సాహిత్య ప్రక్రియ ఒక కొత్త రూపం; సృజనాత్మక వచన రూపం. ఈనాటి ఖండకావ్యం లేదా కవిత్వ ఖండికల్లాగా ఇది ఏకోన్ముఖంగా సాగే సాంద్ర స్పందన అభివ్యక్తి రూపం; నవల లాగా విస్తృతంగా కాక, సంగ్రహంగా మానవ సంబంధాలనూ, చర్యలనూ, వాటి లోని వైరుధ్యాలనూ, వాటి మధ్య అనివార్యంగా తలెత్తే ఘర్షణనూ, పర్యవసానాన్నీ చిత్రించే రూపం. పత్రికల్లో లిఖిత రూపంగా, రేడియోలో శ్రవ్యరూపంగా, టెలివిజన్ లో దృశ్యరూపంగా కన్పిస్తున్నప్పటికీ, కథానిక లిఖిత రూపంగానే వ్యాప్తికి వచ్చింది. కథానిక ప్రచురణ విస్తృతిని గమనించినప్పుడు, కవిత్వం కంటే ఒక మెట్టుకిందా, నవలకంటే ఒక మెట్టు పైనా కథానిక ఉంటుంది. ఏడాదికి ఇంచుమించు మూడువేల కథలకు పైగా పత్రికల్లో వస్తున్నాయి. శిల్ప విషయంలో కవిత్వం కంటే కథానిక తీసిపోవటం లేదు. భాషా శైలుల వాడకం విషయంలో కథానికదే కవిత్వం కంటే అగ్రస్థానం. (కవిత్వంలో వ్యక్తి శైలి ప్రధానం? కేంద్రకం. కథలో భిన్న శైలులు ప్రయోగం ఉంటుంది-కథా జీవితంలో పాల్గొనే వ్యక్తుల ప్రాంతీయ, సామాజిక లక్షణాలను బట్టి) విమర్శ పరంగా చూసినా, ప్రాచుర్యం రీత్యా గమనించినా, కవిత్వం కంటే కథ కింది స్థానంలోనే ఉంది. వచన ప్రక్రియల సాహిత్య తత్వాన్ని విశ్లేషించ గలిగిన విమర్శక సంస్కారం తెలుగుజాతికి ఇంకా అలవడక పోవడం ఇందుకు కారణం కావచ్చు.

గురజాడ (1862-1915) దిద్దుబాటు (1910) మొదలుకొని, నేటి వరకు తెలుగు కథానిక వివిధ సామాజిక, సాంస్కృతిక, రాజకీయ ఉద్యమాలకు ప్రతిస్పందిస్తూ వచ్చింది. వ్యక్తికీ సమాజానికీ, సమూహాలకూ సమాజానికీ, వ్యక్తికీ వ్యక్తికీ, పర్యావరణానికీ మనిషికీ, స్త్రీకి పురుషునికి మధ్య ఉండే లౌకిక సమస్యలను చిత్రిస్తూ వచ్చింది. ఆధునిక సమాజశాస్త్రాలు, శాస్త్ర విజ్ఞానం ప్రభావం వల్ల ఏర్పడిన భిన్న తాత్త్విక ధోరణులను ప్రతిఫలిస్తూ వచ్చింది. సమాజ సంవేదన వ్యక్తీకరణకూ, సమూహాల్లో వ్యక్తుల సంవేదనల ప్రకటనలకూ స్థానం ఇస్తూ వచ్చింది. అంటే సామాజిక సందర్భం, ఆ సందర్భంలోని రచయితలు, పాఠకుల స్వభావాలు, ఆశలూ, ఆకాంక్షలూ, ఆకారణం గా రూపుదిద్దుకునే ఇతివృత్తం, కథనం, రచనా లక్ష్యం, స్వరం, శైలి, ప్రాపంచిక దృక్పథం, సాధారణీకరణ విశ్వసనీయత అనే కథాంగాల విషయంలో వాస్తవికత లక్ష్యంగా తెలుగు కథ సాగిందన్నమాట. ఈ వాస్తవికతలో దేశీయ మౌఖిక కథా వారసత్వంలోని విశ్రేణి కథన కౌశలం, స్వరౌచిత్యం, జీవద్భాషా వైవిధ్యం ఒకవైపు చోటు చేసుకున్నాయి. మరొక వైపు అంతర్జాతీయ కథా సంప్రదాయంలోని మానుషశక్తుల చిత్రణ, రూప సంశ్లిష్టత, నిబిడమైన తాత్త్వికత చోటు చేసుకున్నాయి.

ఎనభై నాలుగేళ్ల కథానిక చరిత్రలో ఆరు తరాల రచయితలు మనకు కన్పిస్తారు. గురజాడ తన తరానికి ఏకైక ప్రతినిధి అని చెప్పుకోవచ్చు. రెండో తరంలో చింతా దీక్షితులు (1891-1960), శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి (1891-1961) చలం (1894-1979) ముఖ్యులు. మూడోతరం లో కరుణ కుమార (1901- ?) త్రిపురనేని గోపీచంద్ (1908-1962) కొడవటిగంటి కుటుంబరావు (1909-1980), బుర్రా వెంకటసుబ్రహ్మణ్యం (1909-1985), మల్లాది రామకృష్ణశాస్త్రి (1905-1965), పాలగుమ్మి పద్మరాజు (1915-1983), చాసో (1914-1984), బుచ్చిబాబు (1916-1967) ముఖ్యులు. మూడోతరం లో రావిశాస్త్రి (1922-1993), కాళీపట్నం రామారావు (1924). హితశ్రీ, (1926), రా.రా. రావూరి భరద్వాజ (1927), మధురాంతకం రాజారాం (1930), పి. రామచంద్రరావు (1931) గోఖలే, ముళ్ళపూడి వెంకటరమణ (1931), బలివాడ కాంతారావు (1927), ఆచంట శారదాదేవి, శ్రీదేవి, రామలక్ష్మి, శివరాజు సుబ్బలక్ష్మి, భానుమతి రామకృష్ణ, వాసిరెడ్డి సీతాదేవి, భరాగో, పరిమళా సోమేశ్వర్, పి. సరళాదేవి, వసుంధరాదేవి, త్రిపుర, అవసరాల, సింగరాజు, మునిపల్లెరాజు, వంటి ప్రముఖులను చేర్చవచ్చు. నాల్గో తరంలో కొమ్మూరి వేణుగోపాలరావు, (1935) పెద్దిబొట్ల సుబ్బరామయ్య (1938) వాకాటి పాండురంగారావు, కేతు విశ్వనాథరెడ్డి (1939) సింగరాజు రామచంద్రమూర్తి (1943) కె. సదాశివరావు (1943), సింగమనేని నారాయణ (1943), పులికంటి కృష్ణారెడ్డి, కలువకొలను సదానంద, వి. రాజారామమోహనరావు (1946), దివి వెంకటరామయ్య, స్మైల్, చంద్ర, అల్లం శేషగిరిరావు, పూసపాటి కృష్ణంరాజు, రంగనాయకమ్మ, వల్లంపాటి, రెడ్డిశాస్త్రి, నగ్నముని వంటి వారు కన్పిస్తారు. అయిదు, ఆరు తరాలు స్వాతంత్ర్యానంతర కథకులు లంక పల్లి,

వివినమూర్తి (1948), జలంధర (1948), ఓల్గా (1950), స్వామి (1952), తల్లావఝ్ఝల పతంజలిశాస్త్రి, పి. సత్యవతి, చాగంటి తులసి, కె.కె.మీనన్, పతంజలి, నారాల కృష్ణమూర్తి, బి.యస్.రాములు, ఉప్పల నరసింహం, భూషణం, అల్లం రాజయ్య వంటి ప్రముఖ కథకులు కన్పిస్తారు. ఇప్పటి తరంలో మధురాంతకం నరేంద్ర, మధురాంతకం మహేంద్ర, గండేడు గౌరు నాయుడు (1954), పాపినేని శివశంకర్, జి.ఆర్. మహర్షి, ఉమామహేశ్వరరావు, సదానంద శారద, తుమ్మేటి రఘోత్తమరాం, గంగుల నరసింహారెడ్డి, దాదాహయత్, కె.ఎన్. రమణ రాయడు, దేవపుత్ర, ఎమ్.ఎస్. సూర్యనారాయణ, కుప్పిలి పద్మ, కొండేపూడి నిర్మల వంటి మంచి కథకులు కన్పిస్తారు. (ఈ తరాలలోని ప్రముఖులలో కొందరు మాత్రమే వీరు. ఈ విభజన నిర్దుష్టం కాదు. స్థూలంగా రచయితల పుట్టిన తేదీ, వాళ్ల రచనా ప్రారంభ జీవితం ఆధారంగా మాత్రమే ఈ విభజన).

గురజాడ అనంతరం అయిదు తరాల కథకులు స్థూలంగా గురజాడ వాస్తవికతావాద వారసత్వాన్ని అనుసరించిన వారే. వాస్తవికతా వాదంలోని సంస్కరణ వాస్తవికతనో, విమర్శ నాత్మక వాస్తవికతనో అభ్యుదయ వాస్తవికతనో అనుసరించిన వారే. విప్లవ వాస్తవికత అనేది అభ్యుదయ వాస్తవికతలోని అతివాద మార్గం. ఇటువంటి వాస్తవికతావాద రచయితలతో పాటు కులాసా కథలు రాసిన వందలాది కథకులు తెలుగు కథా సాహిత్యంలో కన్పిస్తారు.

వివిధ తరాల కథా సాహిత్యాన్ని పరిశీలించినపుడు, సమకాలిక కథా సాహిత్యంలోని ప్రత్యేకతలేమిటో మనం గమనించగలుగుతాము.

ఆర్థిక సంక్షోభానికి (1929-34) అటూ ఇటుగా తెలుగులు కథ ప్రాముఖ్యాన్ని పొందింది. భారతి!81924), వినోదిని, చిత్రగుప్త, ఆంధ్రభూమి వంటి మాసపత్రికలు కథకు మంచి ప్రోత్సాహాన్ని ఇచ్చాయి. అభ్యుదయ సృజన నూతన, అరుణ తార వంటి వామ పక్ష పత్రికలు కూడా కథకు దోహదాన్ని ఇచ్చాయి. ఇవన్నీ పరిమితమైన సర్క్యులేషన్ కల్గిన పత్రికలు. (వామపక్ష పత్రికల సర్క్యులేషన్ మరీ పరిమితం). ఈ పత్రికలతోపాటు 1940-60 మధ్యకాలం ప్రచురణ సంస్థలు కథా సంపుటాలను ప్రచురించి కథకులకు ఉత్సాహాన్ని చ్చాయి. పరిమితమైన పెట్టుబడి, పరిమితమైన సర్క్యులేషన్ స్థానంలో భారీపెట్టుబడి, వేలు, లక్షల సర్క్యులేషన్ లక్ష్యంగా కలిగిన వార, పక్షమాసపత్రికలు రంగప్రవేశం చేసి 1970 ప్రాంతాల తర్వాత మార్కెటును ప్రభావితం చేయటం మొదలుపెట్టాయి. మునుపటి కంటే వినోద కథా సాహిత్యం మనుమకవసరమైన ఒక 'సరుకు' రూపంలో త్వరత్వరగా ఉత్పత్తి కాకతప్పలేదు. పాఠకుల అభిరుచికీ, సర్క్యులేషన్ అంకెలకు మధ్య ఒక విలోమ సంబంధం ఏర్పడింది. అది విషమ సంబంధంగా కూడా రూపుదిద్దుకుంది. అయితే మన కథా వారసత్వంలోని వాస్తవికత నేటి కథను సజీవంగా నిల్పగలిగింది. జీవితంలోని విస్తృతినీ, సంక్లిష్టతనూ ఈనాటి రచయితలు గమనిస్తూ, ఇంతకు ముందు కథకులు స్పృశించని భిన్న సామాజిక పార్శ్వాలను తమ కథల్లో చిత్రిస్తున్నారు. అయితే ఇప్పటి కథకుల అంటే ఈ దశాబ్ది కథకుల రచనా సందర్భం మునుపటి కంటే సంఘ సంస్కరణోద్యమ, జాతీయోద్యమ, వామపక్షోద్యమాల దశలకంటే క్లిష్టమైందన్నమాట.

## ఈ దశాబ్ది రచనా సందర్భం

ఈ దశాబ్దిలో ప్రధానంగా నాలుగు రంగాల్లో సంక్షోభాన్ని కథారచయితలు గుర్తిస్తున్నారు. వాళ్లు గుర్తించిన సమస్యలు ఇవి.

1. పర్యావరణ సమస్యలు 2. సాంస్కృతిక సమస్యలు 3. రాజకీయ సమస్యలు 4. స్త్రీ పురుష సంబంధాల సమస్యలు 5. దళిత సమస్యలు

## పర్యావరణ సమస్యలు

పర్యావరణంలోని మార్పులు ఈ దశాబ్దిలో హఠాత్తుగా సంభవించినవి కావు. వాటికొక చరిత్ర ఉంది. గత చరిత్ర పర్యవసానంగా ఏర్పడిన వర్తమాన చరిత్రకు స్పందించిన రచయితలు ఈ దశాబ్దిలో పర్యావరణ సంక్షోభం మూలంగా ఏర్పడిన సమస్యలను తమ కథల్లో చిత్రిస్తున్నారు. ఈ సమస్యలు నాలుగు రకాలు, అవి: 1. వర్షాభావం, ఆహారపంటలు, వాణిజ్య పంటల నాశనం 2. నేలను అమ్ముకోక తప్పని పరిస్థితులమూలంగా భూ సంబంధాల్లో వచ్చిన మార్పులు 3. పండిన కొద్దిపాటి పైర్లకు తగిన ధరలు లేక పోవడం వల్ల రైతుల ఆర్థిక జీవితంలో కలుగుతున్న సమస్యలు. 4. దొంగ పురుగుల మందులు వగైరాల వాడకంలో పైర్లు దెబ్బతినటం, పురుగుల మందులే ఆత్మహత్యకు కారణం కావటం. ఈ సమస్యలను ప్రధానంగా చిత్రించిన వారు. రాయలసీమ కథకులు, ఒంగోలు, గుంటూరు ప్రాంతకథకులు. సమాజాన్ని గణనీయంగా ప్రభావితం చేయగల శక్తి భౌగోళిక స్వరూపానికి ఉందనీ, పర్యావరణ సమస్యలు భౌగోళిక ప్రాంత సమస్యలనీ ఈ రచయితలు గుర్తిస్తున్నారు. దీనివల్ల ప్రాంతీయ జీవిత చిత్రణ, ప్రాంతీయ వర్గ మాండలిక శైలుల వాడకం సాధ్యమైంది. ఈ కథకుల ప్రాపంచిక దృక్పథం ప్రాంతీయ దురభిమానం కాదు. పర్యావరణ సమస్యల మూలంగా ఏర్పడిన సంక్షోభాన్నీ తమ అనుభవాన్ని చిత్రించటం వీళ్ల రచనా లక్ష్యం.

## సాంస్కృతిక సమస్యలు

విద్యా విధానం[illegible] వచ్చి[illegible] మార్పుల్లో పుస్తకాల బరువు, కాన్వెంట్ల చదువులు, ఇంగ్లీషు వ్యామోహం, నాసిరకం

చదువు, నిర్దాక్షిణ్యమైన పోటీ, మానసిక వికాసాన్ని దెబ్బతీసే పాఠ్య ప్రణాళికలు వీటిపై ఈతరం కథకులు స్పందించారు. స్పందిస్తున్నారు. సైన్స్‌ఫిక్షన్ కొంచెం ఫాంటసీ ఉండే శాస్త్రమున వాస్తవికత ఆధారంగా ఒకశాఖగా వస్తోంది. అయితే ఈ రంగంలో కె. సదాశివరావు వంటివారు ఒకరిద్దరు మాత్రమే కన్పిస్తారు.

## రాజకీయ సమస్యలు

నేటి కథల్లో కన్పించే రాజకీయ సమస్యలు రెండురకాలు. మొదటి రకం నేటి రాజకీయాల్లోని కల్మషాన్ని ఎత్తి చూపటం. రెండో రకం 'శ్వేతరాత్రులు' లోని'రాజ్య' వ్యతిరేకత. తెలంగాణా కథకుల్లో రాజకీయ సమస్యల ప్రాధాన్యం ఎక్కువ.

## స్త్రీ పురుష సంబంధాల సమస్యలు

పూర్వ తరాల్లోని కథకులు శ్రీపాద, చలం, కొడవటిగంటి, గోపీ చంద్, బుచ్చి బాబు, పాలగుమ్మి వంటి వారు. స్త్రీ పురుష సంబంధాలను చిత్రించారు. వారు చూసిన దృక్పథాల నుంచి కాక, నేటి స్త్రీ వాద కథా రచయిత్రులు స్త్రీ వాద దృక్పథంలో కథలు రాస్తున్నారు. స్త్రీలు ఏ విధంగా ఇల్లు అలుకుతూ అలుకుతూ పేరు మరచిపోయిన ఈగల్లాగ ఉంటున్నారో ముక్కు మీద గుద్దినట్లు చిత్రి స్తున్నారు.స్త్రీల వ్యక్తిత్వ వికసనానికి అడ్డుగా కన్పిస్తున్న సకల పురుష సంస్కృతినీ వ్యతిరేకిస్తూ కథలు రాస్తున్నారు. ఓల్గా, పి. సత్యవతి, కుప్పిలి పద్మ, కొండేపూడి నిర్మల. వారిలో ఓల్గా బలమైన స్త్రీవాది. ఆమె 'రాజకీయకథలు' సమకాలిక స్త్రీ చైతన్య వాదానికి దోహదం చేస్తున్నాయి. స్త్రీల ఉద్యోగం పెళ్లిళ్లు, సంతానం, పిల్లల పెంపకం, విడాకులు, వివాహేతర సంబంధాలు, తమ శరీరం పట్ల తమ అదుపు వంటి వివిధ స్త్రీల సమస్యలు ఒక 'జాతి' సమస్యగా, ఒక 'వర్గ' సమస్యగా చిత్రిస్తూ పితృస్వామిక ధర్మాలను నిర్ద్వంద్వంగా ఖండించే దృక్పథంలో కథలు వస్తున్నాయి. పట్టణ, నగర మధ్యతరగతి విద్యావంతుల సమస్యలుగా ఇవి కన్పించ వచ్చు. కానీ, .. .... మన సాంస్కృతిక జీవితంలోని సంక్షోభం ......... పెరుగు తున్న స్త్రీ పీడనకూ ప్రతిఘటన ఈ కథల్లో అంతర్లీనంగా కన్పిస్తుంది.

## దళిత సమస్యలు

వర్ణాధిక్యతను ప్రతిఘటించే దళిత చైతన్యం ఈ దశాబ్దిలో పెరిగింది. పూర్వతరాల్లోని రచయితలు గ్రామీణ ప్రాంతంలోని కుల సమస్యల కారణంగా అస్పృశ్యులుగా పరిగణించబడుతున్న దళితుల పీడనను గురించి కొందరు రాశారు.

జాతీయోద్యమం, వామపక్ష ఉద్య మాలు ఇందుకు దోహదం చేశాయి. అయితే దళిత స్పృహ ఒక కొత్త భావనగా, దళిత చైతన్యం ఒక ప్రతిఘటన శక్తిగా ఈ దశాబ్దిలో ముందుకొచ్చింది. ....దళిత కథకులు తెలుగు కథారంగంలో మరాఠీ దళిత రచయితలతో పోల్చి చూసినప్పుడు చేసిన కృషి తక్కువే. దళితానుకూల చైతన్యం ఈతరం దళితేతర రచయితలు చాలామందిలో కన్పించటం ఒక మంచి పరిణామం.

సంకలనాలూ, అనువాదాలూ. ఈ దశాబ్దిలో విశాలాంధ్ర వంటి పేరుమోసిన ప్రచురణ సంస్థలూ, కథాసాహితి వంటి ఉత్తమ కథల సంకలన ప్రచురణ లక్ష్యంగా చిన్న సంస్థలూ, రచయితలూ వందకుపైగా కథా సంకలనాలను ప్రచురించారు. పూర్వ దశాబ్దుల తర్వాత కథా సంకలనాలు విశేషంగా ప్రచురణ పొందిన దశాబ్ది ఇదే.

కథ ప్రైజ్ స్టోరీస్, కథ రీజినల్ ఫిక్షన్ వంటి సంకలనాల్లో తెలుగుకథల ఇంగ్లీషు అనువాదాలు ప్రచురిత మయ్యాయి. హిందీ, బెంగాలీ, కన్నడం వంటి ఇతర భారతీయ భాషల్లోకి కూడా ముందుకంటే అధికంగా తెలుగు కథలు అనువదితమయ్యాయి.

కథా పత్రికలూ, వేదికలూ 'రచన', 'ఆహ్వానం' వంటి మాసపత్రికలు కథకు ప్రముఖ స్థానాన్ని ఇస్తున్నాయి. కథా సమీక్షలద్వారా కథాసక్తిని పెంపొందించ టానికి ప్రయత్నిస్తున్నాయి. వీటి సర్క్యులేషన్ పరిమితం. అయినప్పటికీ కథా భవిష్యత్తు పట్ల వీరి ఆసక్తి, మిగతా పత్రికలు వారికి కూడా ఉత్తేజకరంగా ఉంది. ఈ వారం కథ ద్వారా, ప్రత్యేక సంచికల ద్వారా, పోటీ బహుమతుల ద్వారాకొన్ని మంచి కథలు ప్రచురితమవుతున్నాయి. కథావేదిక వంటి సంస్థలు కథారచయితలకు పరస్పర భావ వినిమయ వేదికను సమకూర్చాయి.

ఒక దశాబ్దికి చెందిన అంటే దాదాపు మూడువేలకు పైబడిన కథలను చిన్న వ్యాసంలో వివరంగా చర్చించటం సాధ్యం కాని పని. స్థూలంగా ధోరణులను మాత్రమే గుర్తించగలం. ఈ విధంగా గుర్తించినపుడు ఈ దశాబ్ది కథకుల్లో ఈక్రింది లక్షణాలు ప్రస్ఫుటంగా కన్పిస్తాయి.

1. ప్రాంతీయ అనుభవ చైతన్యానికి అధిక ప్రాముఖ్యం ఇవ్వటం (సీమ కథలు, కళింగ కథలు, శ్వేతరాత్రులు, నల్ల వజ్రం) 2. ఒక 'జాతి'గా 'వర్గం'గా స్త్రీ చైతన్యానికి ప్రాధాన్యం ఇవ్వటం (ఓల్గా, సత్యవతి) 3. దళిత చైతన్యాన్ని ఒక ప్రత్యేక చైతన్యంగా గుర్తించటం (బి.ఎస్.రాములు) 4. వ్యక్తి మానసికాను భవాలకు ప్రాముఖ్యం ఇవ్వటం (త్రిపుర, ఎ.వి. రెడ్డి శాస్త్రి, రమణ) 5. ప్రసార సాధనాల్లో వచ్చిన మార్పులు కారణంగా కథానిక రూపం కూడా వార్తా కథన రూపానికి సన్నిహితం కావటం. 6.పర్యావరణ రక్షణ పట్ల జాగృతిని కల్గించటం (కేతు విశ్వనాథ రెడ్డి 'ఒక చిత్రం, మరొక దృశ్యం')

# అభయం

వారణాసి సూర్యనారాయణమూర్తి

ఉగాది వచ్చిందంటే ఏదో తెలియని భయం
ఆవరించుకుంటున్నది అర్థంకాని దిగులేదో
సరిగ్గా క్రిందటి ఉగాదికే కదా అనుకున్నాను
వచ్చే ఉగాదినాటికి మనిషిగా ఎదగాలని
మహత్కార్యం చేయలేకపోయినా
మంచి పనొక్కటైనా చేయాలని
ఏదీ?
చూస్తుండగానే మళ్ళీ ఉగాది వచ్చేసింది
మనసునిండా ఎన్నో ఆలోచనలు
ఒక్కటీ కదిలిరావటంలేదు ఆచరణకి
జీవితం నిన్నే ఇవ్వాళైంది –
ఇవ్వాళే రేపు అవుతుందని భయం
నిన్నంతా మబ్బులు కమ్మిన పగలే!
పీడకలల రాత్రే!
ఎంతసేపూ మనుషులమధ్య
మతం మత్తులో జోగుతున్న రాజకీయాలే
కులాగ్నికి ఆజ్యంపోస్తున్న బేరగాళ్ళే
పత్రికలనిండా పరుచుకుంటున్న హింసలే
తెల్లారిమొదలు, మళ్ళీ నిద్రకుపక్రమించేవరకు
కాలమంతా,
ఉబుసుపోని కబుర్ల కాలక్షేపానికే సరిపోతుంటే,
అనుకున్నది చేసేదెప్పుడు ?
జీవితమంతా ఇలాగే సాగిపోవాలా?
నాకేకాదు, నీకూనూ
నేనూ నువ్వూ అందరం
ఇంచుమించు ఒకే మూస మనుషులం
మాటలపోగుల్నిమాని చేతల్ని చేస్తేకదా !
ఫలితం చేతికందేది
పనికిరాని విషయాలొదిలేసి
పనికొచ్చేదాన్ని గురించే ఆలోచిద్దాం
అప్పుడే మనం జాగృతం అయ్యేది
జాతి జాగృతం కావాలంటే చైతన్యం రావాలి
చైతన్యం రావాలంటే చలనం కావాలి
చలనం కావాలంటే అడుగుముందుకేయాలి
ఆ ముందడుగు కూడా మహిళదే కావాలి
మహిళ వెనుకబడిన జాతికి మనుగడలేదు
ఆ మహిళా చైతన్యంతోనే
సారాలేని నవ్య ఉగాది మనముందున్నదీనాడు
సారాబతుకుతో నిస్సారమైన సంసారాన్ని ఈడుస్తూ
నిషా నెత్తికెక్కిన పెనిమిటికి ఒళ్ళప్పగించటంలోనే
గడిచిపోయిందింతకాలం
జీవితకాలం ఇలాగే మగ్గిపోదలచలేదు
తలెత్తిన సగటు మహిళ చైతన్య ప్రవాహంలోకి దూకింది
భర్త సారా వ్యసనాన్ని దూరం చేసింది
షడ్రుచుల ఉగాది పచ్చడిని
ఈ ఉగాదికి చవిచూడగలిగింది
ఇంటిచూరునుంచి ఎప్పుడో ఎగిరిపోయిన
వసంతరాగపు కోకిలమ్మ
మళ్ళీ తన గాన మాధుర్యంతో
ఆమె వాకిట్లో కొచ్చి వాలింది
అందుకే మనసుతీరా సంతోషంగా
నిజమైన ఉగాది చేసుకుంటుంది నేడు
చైతన్యమే ఊపిరిగా పోరాడి తెచ్చుకున్న
సుందర స్వాప్నిక ఉగాది
ఈ ఉగాది ఆమెకు
అందుకే నువ్వూ నేనూ కూడా
మన నెత్తురుని చైతన్యం చేద్దాం
మహిళా ప్రభంజనంలాగే
చలిద్దాం, జ్వలిద్దాం, ప్రజ్వలిద్దాం
వచ్చే ఉగాదికి భయం మనల్ని వీడిపోతుంది
దిగులు దానంతటదే సమసిపోతుంది
ఇదే
ఈ 'భావ' మనందరికిచ్చే అభయం.

# తెలుగు నవల

అక్కిరాజు రమాపతిరావు

ఆధునిక తెలుగు సాహిత్యంలో నవల అనే ప్రక్రియ ఇంగ్లీషు సాహిత్య ప్రభావంతో కొత్తగా వచ్చి చేరింది. అంతకు పూర్వం వచన రచనలే చాలా తక్కువగా ఉండేవి. ఇంగ్లీషు సాహిత్యంతో పరిచయం కలిసిన తర్వాత భారతదేశంలోని వివిధ సాహిత్య భాషలు ప్రక్రియా వైవిధ్యాన్ని సంతరించుకున్నాయి.

తెలుగులో నవల రచించాలన్న ప్రేరణ 1872 నాటికే కలిగినట్లు కనపడుతున్నది. తెలుగు నవలా సాహిత్య చరిత్రను అధ్యయనం చేస్తే 1872 నాటికే నరహరి గోపాలకృష్ణమ్మ చెట్టిగారనే వారు తెలుగులో ఒక నవల రాయటానికి పూనుకొన్న వైనం కన్పిస్తుంది. ఈయన అప్పట్లో కర్నూలులో డెప్యూటీ కలెక్టర్ గా ప్రభుత్వోద్యోగం చేసేవారు. అంటే ఇంగ్లీషు భాషా సాహిత్యాలతో కొంత సరకైనా పరిచయం ఉన్నవాడని స్పష్టమేకదా. నవల రచించాలన్న కుతూహలం లేదా ప్రేరణ ఈయనకు ఎట్లాకలిగిందంటే ఆనాడు ఇంగ్లీషు వారి పరిపాలనలో భారత దేశ రాజధాని అయిన కలకత్తా నుంచి వెలువడిన ప్రభుత్వ గెజెట్ లోని ఒక ప్రకటన కర్నూలులోని రెవెన్యూ అధికారి అయిన చెట్టిగారు చూడటం తటస్థించటం వల్ల ఆయనకా ఆసక్తి కలిగిందని చెప్పాలి. అప్పట్లో గవర్నర్ జెనరల్ లార్డుమేయో అనేవారు. బెంగాల్ గెజెట్ లో మేయోగారొక ప్రకటనచేశారు. హిందువుల ఆచారాలు తెలిపే నవలను బెంగాలీ భాషలో ఎవరైనా రచించేట్లు ఉంటే అటువంటి రచనకు బహుమానం ఇస్తామని. ప్రభుత్వోద్యోగి కాబట్టి గోపాలకృష్ణమచెట్టిగారా ప్రకటన చూసి ఉంటారు. తెలుగులో అటువంటి ప్రయత్నం తానెందుకు చేయకూడదని అనిపించి ఉంటుంది ఆయనకు. ఈ సందర్భంలో ఒక విషయం గమనార్హం. సర్వభారతీయ భాషలలోనే ఆధునికంగా తొలిసారిగా నవలా రచనకు పూనుకున్న బంకించంద్ర చటర్జీ కూడా కలకత్తా కేంద్ర ప్రభుత్వంలో రెవెన్యూ శాఖలోనే కలెక్టర్ గా పనిచేశారు.

ఏది ఏమైతేనేం గోపాలకృష్ణమ చెట్టిగారు 'శ్రీ రంగరాజు చరిత్రము' అనే పేరుతో నవలా రచన చేసి దాన్ని పుస్తక రూపాన ప్రచురించారు. అదిప్పుడు చదువుతుంటే ఒక జానపద కథ చదువుతున్నట్లుగానే ఉంటుంది. విజయనగర ప్రభువంశానికి చెందిన శ్రీరంగరాయలు వేటకు వెళ్ళటం అక్కడ సోనాబాయి అనే లంబాడీ పిల్ల ఆయనకు తటస్థపడటం ఆమెను శ్రీరంగరాజు ప్రేమించడం అటు తర్వాత వారి ప్రేమ ఫలించటానికి వారు ఎదుర్కొన్న ఆటంకాలు మొదలైనవి ఇతి వృత్తం. చివరకు ఆ సోనాబాయి శ్రీరంగ రాజుకి మేనత్త కూతురే అనీ చిన్నప్పుడు తప్పిపోయి లంబాడీ తండాలో కలిసి పోయిందనీ తెలుస్తుంది. సోనాబాయిని పెళ్లిచేసుకోవాలని అనేక కుటిల ప్రయత్నాలు చేస్తూ వచ్చిన భీమానాయక్ కు ఆశాభంగం కలగడంతో కథ ముగుస్తుంది. అయితే ఈ కథ ఆధారంగా రచయిత ఆనాటి హిందూ సంఘపు ఆచారవ్యవహారాలు, కులకట్టు బాట్లు, నగర, గ్రామీణ జీవన తారతమ్యాలు మొదలైనవి చిత్రించాడు. బెంగాల్ గెజెట్ ప్రకటన కోరింది ఇదే కదా. ఈ నవల సాంఘిక నవల కాదు కాని చారిత్రక, సాంఘిక చిత్రణల కలగాపులగంగా సాగిన చిన్ననవల . ఇందులో 15 ఉల్లాసాలనే చిన్న చిన్న అధ్యాయాలున్నాయి. జానపద గీతం అయిన గంగా గౌరసంవాదం కూడా సందర్భాన్ని బట్టి పుస్తకమైంది. అయితే మరి దీన్ని నవల అనడం ఎట్లా అని సందేహం రావచ్చు. అప్పట్లో సంవత్సరం మొత్తం మీద ప్రాంతీయ భాషలలో ఒక నూరు పుస్తకాలు కూడా వెలువడేవి కావు. అన్ని పుస్తకాలు ప్రభుత్వ గెజెట్ లో నమోదు అయ్యేవి. మద్రాసు గెజటు ఈ శ్రీరంగరాజు చరిత్రాన్ని గూర్చి నమోదుచేసుకుంటూ ఇది తెలుగులో వచ్చిన మొదటి నవల అని పేర్కొంది. ఈకాలపుదే అయిన పురుషార్థ ప్రదాయిని అనే పత్రిక కూడ ఈ రచనను సమీక్షిస్తూ నవల అనే పేర్కొన్నది. ఆ రోజుల్లో పత్రికలలో కొంత తెలుగు విభాగమూ కొంత ఇంగ్లీషు విభాగమూ కూడా ఉండేవి. పురుషార్థ ప్రదాయిని పత్రిక ఈ పుస్తకాన్ని తెలుగులో సమీక్షిస్తున్నప్పుడు వచన ప్రబంధమనీ ఇంగ్లీషులో పరిచయం చేస్తున్నప్పుడు నవల అనీ పేర్కొనడం గమనార్హం.

ఆసక్తికరమైన విషయం ఏమంటే తెలుగులో నవలారచన ప్రారంభమైన తర్వాత 25 సం॥ల దాకా ఈ ప్రక్రియకు 'నవల' అనే పేరు లేదు. ఇటువంటి

రచనలను వచన ప్రబంధమనీ, నవీన ప్రబంధమనీ అనే వాళ్ళు. ఇంకొక ఆసక్తికరమైన విషయం ఏమంటే మొదటి పాతికసంవత్సరాలలో ఇటువంటివి పాతిక రచనలు కూడా లేకపోవడం. 1887 వ సంవత్సరం నుంచే ఈ ప్రక్రియకు నవల అనే పేరు స్థిరపడింది.

శ్రీ రంగరాజు చరిత్రం అప్పటికీ ఇప్పటికీ రెండో ముద్రణలో రానేలేదు. అది వెలువడ్డ పదేళ్ళలోపుననే అది విస్మృతమై పోయింది. ఆసక్తికరమైన విషయం ఏమంటే వీరేశలింగం పంతులుగారు ఈ శ్రీ రంగరాజు చరిత్రం చదివారు. ఆయన సొంత పుస్తక సేకరణలో ఈ పుస్తకం వుంది. అయితే 'తెలుగులో నేనే మొదటి వచన ప్రబంధమును చేసితిని' అని ఆయన స్వీయ చరిత్రలో చెప్పుకోవడం తప్పు కాదా అని ఆయనను కొందరు విమర్శించారు. ఈ శ్రీ రంగరాజు చరిత్రం వీరేశలింగం పంతులుగారికి నవల అనిపించలేదనే సమర్థన మనం ఇప్పుడు చెప్పుకోవాలి. ఇప్పుడు దాన్ని చదివితే మనమూ అటువంటి నిర్ణయానికే వస్తాం.

**శ్రీ రంగరాజు చరిత్రం అప్పటికీ ఇప్పటికీ రెండో ముద్రణలో రానేలేదు. అది వెలువడ్డ పదేళ్ళలోపుననే అది విస్మృతమై పోయింది. ఆసక్తికరమైన విషయం ఏమంటే వీరేశలింగం పంతులుగారు ఈ శ్రీ రంగరాజు చరిత్రం చదివారు. ఆయన సొంత పుస్తక సేకరణలో ఈ పుస్తకం వుంది. అయితే 'తెలుగులో నేనే మొదటి వచన ప్రబంధమును చేసితిని' అని ఆయన స్వీయ చరిత్రలో చెప్పుకోవడం తప్పు కాదా అని ఆయనను కొందరు విమర్శించారు. ఈ శ్రీ రంగరాజు చరిత్రం వీరేశలింగం పంతులుగారికి నవల అనిపించలేదనే సమర్థన మనం ఇప్పుడు చెప్పుకోవాలి. ఇప్పుడు దాన్ని చదివితే మనమూ అటువంటి నిర్ణయానికే వస్తాం.**

శ్రీ రంగరాజు చరిత్రపై ఆధునిక ప్రభావం లేదు. ఇంగ్లీషు సాహిత్య ప్రభావం అసలేలేదు. అయితే సాంఘికాచారాల ప్రస్తావన, దురాచారాల నిరసన ఉండటం వల్ల, బెంగాల్ గెజెట్ ప్రభావం ఉండటం వల్ల ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో ఒక కీలక సన్నివేశంగా దీని ప్రచురణను భావించవచ్చు.

ఇక తెలుగు నవలా రచనకు నారు పోసి నీరు పోసి బాగా అభివృద్ధికి తెచ్చింది వీరేశలింగం పంతులుగారు. ఆయనలోనే తెలుగు సాహిత్యంలో ఈ ప్రక్రియకు ఒక స్థితీ, ప్రాచుర్యమూ కలిగాయి. అందువల్ల తర్వాత తరాల వాళ్ళు పంతులుగారినే తొలి తెలుగు నవలా రచయితగా గౌరవించడం జరిగింది. వీరేశలింగం పంతులుగారి 'రాజశేఖర చరిత్రమనే' నవల ఇప్పటికి 15 ముద్రణలు పొందింది. ఈ నవలపై నస్పష్టంగా ఇంగ్లీషు ప్రభావముంది. ఇంగ్లీషు సాహిత్యంలో ప్రఖ్యాత రచయిత ఆలివర్ గోల్డ్‌స్మిత్ నవల 'దివికారాఫ్ వేక్ ఫీల్డ్'కు వీరేశలింగం గారి రాజశేఖర చరిత్రం అనువాదం కాకపోయినా అనుసరణ గ్రంథం. వీరేశలింగం గారు పూర్తిగా ఈ నవలలో తెలుగు వాతావరణాన్ని ప్రవేశపెట్టారు. ఇంగ్లీషు మూలాన్ని గూర్చి ఆయన ప్రస్తావించి ఉండక పోయినట్లైతే రాజశేఖర చరిత్రకు ఇంగ్లీషు మాతృకుందని కూడా ఎవరూ తెలుసుకోలేక పోయేవాళ్లు. అంత తెలుగుతనంలో నిండి ఉన్నది రాజశేఖర చరిత్రం. గోదావరి నది వర్ణనలో ఈ నవల ప్రారంభమవుతుంది. తెలుగు దేశపు ఆనాటి సాంఘిక వాతావరణమంతా ఈ నవలలో చోటుచేసుకున్నది. ఆనాడు తెలుగు నాట కనపడిన సాంఘిక వ్యవస్థనంతా వీరేశలింగం పంతులుగారు రాజశేఖర చరిత్రంలో చిత్రించారు. బాల్య వివాహాలు, భూతవైద్యం, మాంత్రికులు, కపట సన్యాసులు, గ్రామదేవతల కొలుపులు, పెద్ద మనుషుల మోసాలు, దొంగతనాలు, పురోహితుల వంచనలు, జాతకాలు రాసేవాళ్ల సృష్టించే అబద్ధాలు ఆయా పాత్రలను ఆధారం చేసుకొని పంతులుగారీ నవలలో చిత్రించారు. ఈ నవలలో 15 ప్రకరణాలున్నాయి. భాష వ్యవహారికానికి దగ్గరగా ఉండే సరళ గ్రాంథికం. ఇందులో గోలేటి రాజశేఖరుడు అనే మధ్య తరగతి భూస్వామి కథానాయకుడు. ఆయనకు రుక్మిణి, సీత అనే ఇద్దరు కూతుళ్ళు, సుబ్రహ్మణ్యం అనే కొడుకు ఉంటారు. ముఖస్తుతులకు పొంగిపోయి, కపట స్నేహితుల వల్ల మోసపోయి రాజశేఖరుడు అనుభవించిన కష్టాలన్నీ ఈ నవలలో వర్ణితమైనాయి. చివరకు సుఖాంతమవుతుంది ఈ నవల. ఈ నవలకు 'వివేక చంద్రిక' అనే రెండో పేరు కూడా ఉంది. వీరేశలింగం పంతులు గారికి ప్రబల ప్రతిస్పర్థి అయిన కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు 'వివేక చంద్రికా విమర్శనం' పేరుతో ఈ నవలను విమర్శించారు. తొలి తెలుగు నవలతోనే తెలుగులో నవలా విమర్శకూడా ప్రారంభం కావడం విశేషమే. రాజశేఖర చరిత్రం వెలువడ్డ పాతికేళ్ళదాకా ద్వితీయ ముద్రణ రాకపోవడం వల్ల ఈ ప్రక్రియ పట్ల తమకంత ఆసక్తి కలగలేదని వీరేశలింగం స్వీయచరిత్రలో చెప్పుకున్నారు.

కుటుంబ జీవితాన్ని ఇతివృత్తంగా చేసుకొని తెలుగులో మొట్టమొదట

నవలరచించిన వారు కూడా వీరేశలింగమే. స్త్రీలకోసం ప్రత్యేకించి తెలుగులో మొట్టమొదట పత్రిక నడిపిన వాడు కూడా ఆయనే. ఆ పత్రిక పేరు సతీహిత బోధిని. ఈ పత్రికలో స్త్రీలకోసం ఆయన ఒక నవల వ్రాశాడు. ఈ నవల పేరు సత్యవతీ చరిత్రము. ఈ నవల ద్వారా ఆయన చెప్పదలచుకొన్నది ఏమంటే సంఘంలో స్త్రీ పురుషులిద్దరూ విద్యావంతులైతే తప్ప ఆ సంఘం బాగుపడదని. ఇందుకోసం నాలుగు రకాలైన భార్యాభర్తలను సృష్టించి తులనాత్మకంగా వారి జీవితాల మంచి చెడ్డలను కథారూపంగా వర్ణించారాయన. ఈ నవలలో కూడా 15 ప్రకరణాలున్నాయి. ఒక వేళ పురుషుడు చదువుకోకపోయినా ప్రమాదం లేదు కాని మహిళ విద్యావంతు రాలు కాకపోతే ఆ సంఘానికి మంచి రోజులు లేవని ఆయన తీర్పు చెప్పారు. ఈ నవల ద్వారా నారాయణమూర్తి సత్యవతి, వెంకటేశ్వర్లు సుందరమ్మ, రామస్వామి, మహాలక్ష్మి, సుబ్రహ్మణ్యం, సూరమ్మ అనే నాలుగు జంటలను ఆధారంగా చేసుకొని వీరేశలింగం పంతులుగారు ఆలుమగలిద్దరూ చదువుకున్న వారైనప్పుడు సంసారంలో కష్టాలు సంభవించినా వాటినధిగమించి సుఖపడ్డట్టూ, కనీసం ఇల్లాలు చదువు కొన్నదై భర్త విద్యావంతుడు కాకపోయినా ఆ సంసారం కూడా బాగుపడ్డట్లూ, ఇద్దరూ చదువురాని వారైతే కలహాలతో, కార్పణ్యాలతో, మూర్ఖంగా మొరటుగా నిస్సారంగా జీవితాలు సాగించేట్లూ, భార్య చదువురానిదై భర్త సంస్కారవంతుడైతే ఆ సంసారం నరకప్రాయమయ్యేట్లు వర్ణించారు. ఈ నవలకారోజుల్లో చాలా పేరు వచ్చింది. అరవం, కన్నడం, ఇంగ్లీషుల లోకి కూడా అనువాదం పొందింది.

ఇందులో నారాయణమూర్తి సత్యవతీ ఆదర్శదంపతులు. సత్యవతీ చరిత్రానికి ఎంత మంచి పేరు వచ్చిందంటే ఆ రోజుల్లో కాస్త సంస్కారం గల కుటుంబాలలో ఆడపిల్ల పుడితే ఆ పిల్లకు సత్యవతి అని పేరు పెట్టుకునేవారు. ఇంకొక ముఖ్య విషయం ఏమంటే తెలుగులో వచ్చిన మొదటి దశలోని నవలలకు చరిత్ర అని పేరుండటం. ఉదాహరణకు రంగరాజ చరిత్ర, రాజశేఖరచరిత్ర, సత్యవతీ చరిత్ర మొ॥నవి. వీరేశలింగం ఇంకా సత్య రాజా పూర్వ దేశయాత్రలు అనే నవల కూడా వ్రాశాడు. ఈ నవల నాయన ఇంగ్లీషులో జొనాథన్ స్విఫ్ట్ రచించిన 'గలివర్స్ ట్రావెల్స్' ఆధారంగా తెలుగులో 'ఆడుమలయాళము' 'లంకాయాత్ర' అనే రెండు భాగాలుగా కూర్చాడు. 'ఆడుమలయాళానికి ఆరోజుల్లో బాగా పేరు వచ్చింది. ఆనాడు ఆంధ్రదేశంలో స్త్రీలు అనుభవిస్తున్న అన్యాయాలు, హింసలు, క్రౌర్యాలు, అవమానాలు, అన్నీ 'ఆడుమలయాళం'లో పురుషులు పొందుతున్నట్లు వర్ణించి సంఘ దురాచా రాలను, మూఢవిశ్వాసాలను ఈ నవలలో పంతులుగారు ప్రతిభావంతంగా హేళన చేశారు. 'లంకాద్వీపం' అనే భాగంలో శకునాలు, ముహూర్తాలు, జాతకాలు శాస్త్రీయమని చెప్పే జ్యోతిషశాస్త్రాన్ని వేళాకోళం చేశారు. పురాణ పాత్రలైన చంద్రమతీ, హరిశ్చంద్రుల కథను చంద్రమతీ చరిత్రం పేరుతో 15 ప్రకరణాలలో కథగా కూర్చి దీనిని కూడా వచన ప్రబంధంగానే వారు పేర్కొన్నా దీనిల్లో నవలా లక్షణాలు లేవు. వివిధ ఉపన్యాస సంపుటి లాగా ఈ నవల సాగుతుంది. అయితే ఒక విషయం చెప్పాలి. తెలుగులో హరిశ్చంద్ర కథను రచించిన వాళ్ళందరూ అది నాటకమైనా, కథ అయినా, కావ్యమైనా హరిశ్చంద్రుడి ప్రాముఖ్యాన్నే చెప్పారు కాని ఆ కథకు చంద్రమతి పేరు ఎవరూ పెట్టలేదు. వీరేశలింగం పంతులుగారు మాత్రం హరిశ్చంద్రుడి గొప్పతనానికంతకూ చంద్రమతి విద్యా, వినయ, వివేకాలు, నిబ్బరం, ధైర్యం, తోడ్పాటు కారణాలని ఈ కథలో చిత్రించారు.

వీరేశలింగంపంతులు గారి తర్వాత తెలుగు సాహిత్యం బహుముఖాల వికసిం చింది. తర్వాత నవలా రచయితలందరికీ ఆయన నవలలే మార్గదర్శకమైనాయి. ఈ విషయం చిలకమర్తి లక్ష్మీనరసింహం నంటి గొప్ప నవలా రచయిత స్మరించుకున్నారు కూడాను. మాకప్పుడు నవలలు రచించుటలో వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రయే మార్గదర్శకమై యుండెను అని చిలకమర్తి స్వీయ చరిత్రలో చెప్పుకున్నారు. 1893 లో ఆనాడు రాజమహేంద్రవరం నుంచి వెలువడుతుండిన 'చింతామణి' అనే సాహిత్యపత్రిక తొలిసారిగా నవలల పోటీని ప్రారంభించింది. ఈ పోటీ ప్రారంభ మైనప్పటి నుంచి తెలుగు నవలలు అధిక సంఖ్యలో వచ్చాయి. అంతకు ముందు ఇరవై ఏళ్ళలో 10 నవలలు కూడా రాకపోయినా చింతామణి పోటీలు ప్రారంభమైన తర్వాత ఒక దశాబ్దం కాలంలో తెలుగులో సుమారు 40 దాకా నవలలు వచ్చాయి. ఈ పత్రిక మొదటి సారి పోటీలు నిర్వహించినప్పుడు ముచ్చటగా మూడే నవలలు వచ్చాయి. అందులో మొదటి రెండింటికి ప్రథమ ద్వితీయ బహుమతులు ప్రకటిస్తూ మూడోదానికి కూడా ప్రోత్సాహక బహుమతి ఇవ్వా ల్సిందిగా బహుమాన నిర్ణేతలు సిఫార్సు

చేశారు. వీరేశలింగం పంతులుగారు, వావిలాల వాసుదేవశాస్త్రి, ఆచంట సుందర రామయ్య గారలు ఈ బహుమాన న్యాయ నిర్ణేతలు. ఈ పోటీల వెనక వీరేశలింగం పంతులుగారి అదృశ్యహస్తం ఉండేది. ఈ పోటీ నిర్వహణకు ప్రధాన ప్రోత్సాహకుడు ఆయనే. చింతామణి పత్రికకు యాజమాన్యం న్యాపతి సుబ్బారావు గారిదే అయినా సంపాదకత్వం వీరేశలింగం పంతులుగారిదే అనుకోవలసి వస్తున్నది. ఏది ఏమైనా ఈ పోటీలు ఏడెనిమిదేళ్ళ కంటే ఎక్కువ కాలం సాగలేదు. అప్పట్లో వీరేశలింగంపంతులు రాజమండ్రి విడిచి మద్రాసు వెళ్లటం కూడా ఇందుకు కారణం కావచ్చు. కిందటి శతాబ్ది చివర వరకూ ఈ పత్రిక వచ్చింది. చింతామణి పోటీల వల్లనే అప్పటి వరకూ నాటక రచయిత అయిన చిలకమర్తివారు నవలా రచయితగా రూపొందారు. వరసగా మూడుసార్లు ఆయన చింతామణి నవలల పోటీలో బహుమానం గెల్చుకున్నారు. రామచంద్ర విజయం, అహల్యాబాయి, కర్పూర మంజరి, వంటి చిలకమర్తి నవలలు ఆరోజుల్లో బాగా ప్రసిద్ధి పొందాయి.

పందొమ్మిదో శతాబ్ది గడిచిపోయి ఇరవయ్యో శతాబ్దం ప్రారంభమయ్యే కాలానికి తెలుగులో నవలా రచనకు బాగా ప్రోత్సాహం కలిగింది. అయితే ఈ శతాబ్ది ప్రథమ దశకంలో చారిత్రక నవలకే ప్రాధాన్యం ఎక్కువైంది. అందుకు కారణం లేకపోలేదు. ఆకారణం స్వాతంత్ర్యోద్యమమే. వందేమాతరో ద్యమమే. ఆనాటి గవర్నర్ జనరల్ కర్జన్ వంగదేశాన్ని 1905లో విభజించటంతో వందేమాతరోద్యమం ఉవ్వెత్తుగా ఒక మహా ప్రభంజనం వలె భారతదేశాన్ని చైతన్య జాగరితం చేసింది. అందువల్ల దేశభక్తిని, జాతి రక్తిని ప్రేరేపించే రచనలకు అత్యధిక ప్రాధాన్యం కలిగింది. పురాచారిత్రక వైభవస్మరణం కూడా స్వాతంత్ర్య కాంక్షకు ఉత్తేజకమనీ, ప్రేరేపక మనీ రచయితలు భావించి చారిత్రక నవలల రచనపట్ల అత్యధికమైన ఆసక్తిని కనపరిచారు. భారతదేశమంతటా ఈ స్ఫూర్తి ఆనాడు కనపడుతుంది. బంకించంద్రుడి నవల 'ఆనందమఠం'లోని వందేమాతరం గీతం భారతదేశ స్వాతంత్ర్యోద్యమ కర్షణకాహళిగా మార్మోగింది ఆ రోజులలోనే.

ఆధునికాంధ్రదేశ సాంఘిక చరిత్రలో ముఖ్యంగా సాహిత్య చరిత్రలో 1906 లో కొమర్రాజు లక్ష్మణరావు మహాశయుడు స్థాపింపజేసిన విజ్ఞాన చంద్రికా మండలి ఒక స్మరణీయ ఘట్టం. తెలుగువారి విజ్ఞాన వికాసం కోసం నాయని వేంకట రంగారావు, రావిచెట్టు రంగారావు, కొమర్రాజు లక్ష్మణరావు ప్రభృతులు ఈ సాహిత్య సంస్థను మొదట్లో హైదరాబాదు లో స్థాపించినా ఆనాటి నిజాం రాజయంలోని పరిస్థితులవల్ల మద్రాసుకు మార్చారు. విజ్ఞాన చంద్రికా మండలి, దేశచరిత్ర, మహాపురుషుల జీవితచరిత్ర, శాస్త్రవిజ్ఞానం, తెలుగులో వెలువడటానికి ఎంతో కృషి చేసింది. తెలుగులో విజ్ఞాన సర్వస్వ నిర్మాణానికి కూడా ఈ సంస్థ పూనుకొన్నది. అన్నిటికన్నా ముఖ్యంగా చెప్పుకోదగిన విషయం. విజ్ఞాన చంద్రికామండలి తెలుగులో చారిత్రక నవలల పోటీ నిర్వహించడం. చింతామణి నవలల పోటీ ద్వారా చిలకమర్తివంటి గొప్ప నవలా రచయిత ప్రభవించినట్లు విజ్ఞాన చంద్రికా మండలి పోటీ ద్వారా భోగరాజు నారాయణమూర్తి వంటి అత్యంత ప్రతిభావంతులైన తెలుగు నవలా రచయితలు సృష్టింపబడ్డారు. నారాయణ మూర్తి గారితో పాటు పేర్కొన వలసిన వారు కేతవరపు వెంకటశాస్త్రిగారు. ఆ రోజుల్లో విజ్ఞాన చంద్రికా మండలి ద్వారా ప్రచురితమైన భోగరాజువారి నవల 'విమలాదేవి' చాలా ప్రశంసలు పొంది పాఠక బహుళ్యాన్ని సృష్టించింది. అట్లానే కేత వరపు వారి రాయచూరు యుద్ధం బాగా ప్రశంసపొందింది. తేకుమళ్ళ రాజగోపాల రావుగారి వంటి గొప్ప చరిత్ర పరిశోధకులు కనకవల్లి, విహంగయానము వంటి చారిత్రక, వైజ్ఞానిక నవలలను ఈ కాలంలోనే వెలువరించారు.

ఇంతలో 1920 వచ్చింది. 1923లో కొమర్రాజులక్ష్మణరావు గారు కీర్తిశేషులైనారు. 1880 నుంచి 1920 వరకు తెలుగు నవలా సాహిత్య చరిత్రలో తొలిప్రధాన ఘట్టం. ఈ ఘట్టంలో సాంఘిక నవలలు, చారిత్రక నవలలు కూడా వచ్చాయి. వీరేశలింగం, చిలకమర్తి, భోగరాజు నారాయణమూర్తి, కేతవరపు వేంకటశాస్త్రి ఈ నలభై ఏళ్ళ కాల వ్యవధిలో చెప్పుకోదగిన నవలా రచయితలు. 1914 నాటికే కేతవరపు వేంకటశాస్త్రిగారు 'లక్ష్మీప్రసాద' మనే మంచి సాంఘిక నవల రచించారు.

ఆ రోజుల్లో విద్యావంతులు విదేశీ వ్యామోహానికి గురిఅయి పాశ్చాత్య దేశాలకు వెళ్ళి ఆ సాంఘిక వ్యవస్థ కలిగించిన మెరమెచ్చులకు మోసపోయి మన సంస్కృతిని, సంప్రదాయాలను నిరసిస్తూ అవకాశం ఉంటే అక్కడి వనితలనే పెళ్ళి చేసుకొని స్వదేశానికి వచ్చిన తర్వాత సాంఘిక సమస్యలను, కుటుంబ సమస్యలను సృష్టిస్తూ ఉండేవాళ్లు. ఒక విధంగా పాశ్చాత్య దేశాల భావదాస్యానికి లోబడి వారి మానస పుత్రులుగా కూడా ఒక వర్గం తయారైంది ఆ రోజుల్లో. ఈ

సమస్యను ప్రతిభావంతంగా కేతవరపు వారు తమ 'లక్ష్మీ ప్రసాదం' నవలలో చిత్రించారు.

ఇటు తర్వాత పేర్కొనదగినవారు వేంకటపార్వతీశ్వర కవులు. వీరు రచించిన మాతృమందిరం, ప్రమదావనం గొప్ప నవలలు. ఇవి 1920 ప్రాంతంలో వెలువడ్డాయి. గాంధీ మహాత్ముడి జాతీయోద్యమ ప్రభావం వీరి నవలల్లో కనపడుతుంది. ప్రమదావనం శ్రీకృష్ణదేవరాయల గొప్పతనాన్ని వర్ణించే చారిత్రక నవల. వేంకటపార్వతీశ్వర కవులు తెలుగు సాహిత్యానికి చేసిన గొప్పసేవ ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలను స్థాపించి తెలుగు నవలా సాహిత్యానికి ఒక ఉజ్జ్వలధ్యాయాన్ని చేర్చటం. కొవ్వూరి చంద్రారెడ్డి అనే వదాన్యుడి, ఉత్తమ సంస్కారిని ప్రేరేపించి వారీ పుస్తక ప్రచురణ సంస్థను నిడదవోలు లో స్థాపించి సుమారు ముప్పై సంవత్సరాలు నిర్వహించారు. బెంగాలీ నుంచి ఎన్నో నవలలు అనువదించి ప్రచురించారు. ఈ విధంగా నవలా రచనకునుంచి ప్రోత్సాహంకలిగించారు.

1922 వ సంవత్సరం తెలుగు నవలకు స్వర్ణోత్సవం. అది నిజంగా పరమోజ్జ్వలమైన సన్నివేశమే. ఈ సంవత్సరమే ఉన్నవ వారి 'మాలపల్లి' వెలువడింది. ఈ నవల రచన పరమాద్భుతమైన భూమికలో కూడి ఉంది. ఈ నవలను ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఎవరికీ తెలియకుండా చెరసాలలో రచించారు. ఎవరికీ తెలయకుండా ఎప్పుడు వ్రాసిందిఅప్పుడు బయటకు చేరవేయగలిగారు. 1920లో గాంధీ మహాత్ముడి సత్యాగ్రహోద్యమంలో త్రివిధ బహిష్కరణోద్యమంలో పాల్గొని ఉన్నవ లక్ష్మీనారాయణగారు కారాగారవాసం చేశారు. ఆ సమయంలో జైల్లో వారీ గ్రంథం రచించారు. ప్రపంచ సాహిత్య చరిత్రలోనే కారాగారంలో రచింపబడ్డ గొప్ప గ్రంథాల సరసన 'మాలపల్లి' నిలుస్తుంది. 1914 లో మొదలైన మొదటి ప్రపంచ యుద్ధం 1917లో రష్యాలో అక్టోబర్ విప్లవం సాధించిన ఘన విజయం భూమికగా రాజకీయార్థిక సాంఘిక తాత్త్విక సిద్ధాంతాల ప్రేరణలతో తెలుగులో ఈ గొప్ప నవల వెలువడింది. దీనికి కాశీనాథుని నాగేశ్వర రావుగారు ప్రశస్తమైన ఉపోద్ఘాతం వ్రాశారు.

"మానవ స్వాతంత్ర్య ధర్మ సంరంభమునందు సకలార్థసిద్ధికిని సాహిత్య మాధారము... సర్వతో ముఖమైన మానవ స్వాతంత్ర్య ధర్మావతరణమునకు స్వతంత్ర సాహిత్యము మూలాధారము. వర్తమాన కాల మందు ప్రజా జీవన వికాసమునకాధారములైన వర్ణాశ్రమ ధర్మములు, సాంఘికాచార వ్యవస్థలు, రాజ్యాంగములు, మత విశ్వాసములు, వృత్తులు, ధనార్జన విధానములు, ధర్మసాధనములు, సాహిత్య రచనలు మొదలగు విధమును ప్రపంచావృతమైన మహాపరివర్తనము విశదముచేయుచున్నది. ఉన్నవ లక్ష్మీనారాయణగారు మాలపల్లి యందు సంకల్పించిన నవజీవన నిర్మాణ విధానము లాంధ్ర సాహిత్య సంస్కార మునందు నూతనా ధ్యాయములు" అన్నారు కాశీనాథుని నాగేశ్వరరావు గారు. ఇంకా వారు "మాలపల్లి యందు సాంఘిక రాజకీయార్థిక పరివర్తనములు రసవంతముగ వర్ణింపబడినవి. తక్కెళ్ళ జగ్గడి నాయకత్వమున నడచిన ధర్మ దోపిళ్ళయుదంతము సాంఘిక పరివర్తనమునందు నూతనాధ్యాయము. జగ్గన్నయనుచరులు పాడెడి పాటలు గంభీరముగా సాంఘికార్థిక పరివర్తనా వసరమును వెల్లడి చేయుచున్నవి". ఈ నవలలోని సామ్యవాద విప్లవ భావాలను కూడా కాశీనాథుని వారు బలపరిచారు. మొత్తం నాలుగు భాగాలు 800 పుటలతో పెద్ద నవల ఇది. ఈ నవల మూడో భాగంలో సాంఘిక సువ్యవస్థకు విప్లవమే మూలాధారమని వేంకటదాసు అంటాడు. ఈ వెంకటదాసే తక్కెళ్ళ జగ్గడి పేరున ధన్వంతులను దోచటం ధర్మమే అనే సిద్ధాంత ప్రచారానికి పూనుకొని దానిని ఆచరణలోకి కూడా తెస్తాడు.

"భాగ్యవంతులు బీదలను దోచుకుంటే దానిపేరు వ్యవహారం. బీదలు తమ హక్కును తీసుకుంటే చౌర్యం... అశాస్త్రీయ చౌర్యముల కంటే శాస్త్రీయ చౌర్యములే లోకానికెక్కువ హాని చేస్తున్నవి. భాగ్యవంతులకుపయోగించేది చట్ట సమ్మతం, కానిది నేరం..... బీద వాండ్లను భాగ్యవంతుల క్షేమానికే భగవంతుడు సృష్టించాడని వాండ్ల నమ్మకం. ...కలియుగంలో రాక్షసులు లేరంటారు కాని ధనికులే కలియుగ రాక్షసులు".

సాంఘిక సువ్యవస్థా నిరూపకమైన ఈ నవల ఎటువంటి భావ చైతన్యాన్ని తెస్తుందో నని భయపడి ఆనాటి బ్రిటిషు ప్రభుత్వం ఈ నవల వెలువడగానే నిషేధించింది. ముద్రితమైన ప్రతులన్నిటినీ అందినంత వరకు జప్తు చేసింది. అందువల్ల ఈ నవలకు మరింత ప్రచారం లభించింది. మాలపల్లి తెలుగు సాహిత్యంలో వచ్చిన తొలి వతిహాసిక నవల అని చెప్పాలి. స్వాతంత్ర్యోద్యమ ప్రభావాన్ని చిత్రించిన గొప్ప నవలల్లో ఇదే మొదటిది. భారతీయ సర్వభాషా ఆధునిక సాహిత్యంలోనే మాలపల్లికి గొప్ప స్థానమున్నది. భారతీయ సాహిత్యంలో అస్పృశ్యతా సమస్యను కావ్యీకరించిన గొప్ప నవల మాలపల్లి.

ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి తర్వాత కాలంలో చెప్పుకోవలసిన గొప్ప తెలుగు నవలా రచయితలు నలుగురున్నారు. వాళ్లు అడవి బాపిరాజు, చలం, విశ్వనాథ సత్యనారాయణ, నోరినరసింహశాస్త్రి గార్లు. అడవి బాపిరాజు సౌందర్యారాధకుడు. గొప్ప భావుకుడు. 1913లో ప్రారంభమైన ఆంధ్రుల స్వరాష్ట్ర సంపాదనోద్యమం అడవి బాపిరాజును బాగా ప్రభావితం చేసినట్లు కనపడుతుంది. తెలుగు నవలా రచనా కాశంలో విశ్వనాథ సూర్యుడైతే బాపిరాజు చంద్రుడు. 1923 వ సంవత్సరంలో ఆంధ్రుల పురా వైభవ సంస్మరణోద్దీపకమైన సరమోజ్జ్వల చారిత్రకాధ్యాయమైన శాతవాహనుల చరిత్రను నవలీకరించాడు బాపిరాజు, ఆ నవల హిమబిందు. 1923 లో బందరు నుంచి ప్రారంభమైన 'శారద' అనే సాహిత్య సాంస్కృతిక కళావైశిష్ట్యయ్య పత్రికలో హిమబిందు నవల ధారావాహికంగా వచ్చింది. చలం తొలి నవల 'శశిరేఖ' 1926 లో వచ్చింది. చలం సామాజిక వ్యవస్థను పూర్తిగా కూల్చివేయాలని ఆవేశపూరిత మైన రచనలు చేశాడు. ఆయన నవలలో, కథల్లో, సంఘంలోని ఆత్మవంచన, హింస, క్రౌర్యం, కాపట్యం పట్ల ఏవగింపు కనపడుతుంది. స్త్రీ పురుష సంబంధాలలో ఎటువంటి నియమనిబంధనలూ ఎందుకుండాలని ఆయన తీవ్రావేశంతో వాదించాడు. 1934 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నిర్వహించిన పోటీకి ఆయన 'మైదానం' నవల పంపించారు. ఈనవలలో వివాహవ్యవస్థల వల్ల ఆయనకుండే వైమనస్యం అంతా వెల్లడించాడు. అన్ని స్వేచ్ఛలతో పాటు స్త్రీకి సెక్సు స్వేచ్ఛ కూడా ఉండాలనటం చలం ప్రతిపాదించిన స్వేచ్ఛా సమాజ సిద్ధాంతం. వివాహం, అరుణ, జీవితాదర్శం. దైవ మిచ్చిన భార్య, మైదానం వంటి నవలల్లో చలం తన స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. కాని ఆయన సిద్ధాంతాలు సభ్య సమాజం అంగీకరించ గలిగినవి కావని ఆయన విమర్శకు లంటారు. నాగరిక సమాజం మళ్ళీ ఆదిమ సమాజం వ్యవస్థలోకి వెళ్లిపోవడం సాధ్యం కాదు అని ఆయన విమర్శకుల భావన.

విశ్వనాథ సత్యనారాయణ గారిది తెలుగు నవలా రచయితలలో విలక్షణమైన విశిష్టమైన స్థానం. ఆయన మొత్తం అరవై నవలలు దాకా రాశారు. వేయిపడగలు, ఏకవీర, చెలియలకట్ట, తెరచిరాజు, మాబాబు, మొదలైనవి ఆయన సాంఘిక చారిత్రక నవలలో చాలా ప్రసిద్ధమైనవి. పురాణవైర గ్రంథమాల పేరుతో ఆయన పౌరాణిక చారిత్రక నవలలు కూడా రచించాడు. భారతదేశ చరిత్రలో అసత్యాలు, అసంబద్ధ అవగాహనలు, అభూత కల్పనలు అని ఆయన అనుకొన్న సంఘటనలను సత్యావాస్తవిక దృక్పథమని ఆయన సేకరించిన సాక్ష్యాధారాలతో ఈ నవలలు ఆయన రచించాడు. ఆయన బద్దన్న సేనాని, కడిమిచెట్టు, ధర్మచక్రం నవలలు చారిత్రక నవలలుగా మంచి ప్రాచుర్యానికి వచ్చాయి. భ్రమరవాసిని, సముద్రపుదిబ్బ, హ్రోయు తుమ్మెద ఆయన గొప్ప సృజనాత్మకప్రతిభకు సాక్ష్యంగా నిలిచాయి. భారతీయమైన ఒక వ్యవస్థపట్ల ఆయనకు మక్కువ ఎక్కువ అనీ అభ్యుదయ భావాలకు ఆయన చాలా దూరమనీ ఆయన విమర్శకులంటారు. కాని ఆయన భారతీయ మత ధార్మిక నైతిక వ్యవస్థలో సమాజ సంక్షేమమే ఉంది కాని సంక్షోభం లేదని గట్టిగా విశ్వసిస్తారు. పలవ రాజ్య దురాక్రమణ శక్తులు సాంఘికార్థిక రాజకీయ రంగాలలో తమ వ్యూహ విస్తరణ చేసినట్లే సాంస్కృతిక రంగంలో కూడా భారతీయ వ్యవస్థను విచ్ఛిన్న చేయడానికి ప్రయత్నం చేశారనీ, దానిని తన కోణం నుంచి ఎదుర్కొంటున్నాననీ ఆయన గాఢమైన విశ్వాసం.

అడవి బాపిరాజు నవలలు శుభ్రంగా ఉంటాయి. పాఠకుడికి ఉదాత్తభావాలు కలుగజేస్తాయి. అన్నిటా ఆయన హృదయవాది. సౌందర్యరాసైకజీవి. అయితే మానవజీవితంలోని కల్మషాలను, కష్టాలను, చీకటి కోణాలను కూడా ఆయన చిత్రించక పోలేదు. నారాయణరావు, నరుడు, జాజిమల్లి, కోణంగి, తుపాను ఆయన సాంఘిక నవలలు. హిమబిందు, గోనగన్నారెడ్డి, అడవిశాంతి శ్రీ ఆయన చారిత్రక నవలలు. గొప్ప భావుకలోక సంచారం ఆయన నవలలన్నిటా కనపడుతుంది. తెలుగుతనమన్న, తెలుగు జాతి అన్న, తెలుగు వారి సంస్కృతి, ప్రతిభ, నాగరకత అన్నీ బాపిరాజుకు పరమప్రీతి. ఈ విషయాలు ఆయన నవలలన్నిటా కాస్త సందర్భం వచ్చిందా వ్యాఖ్యానితమవుతాయి.

నోరి నరసింహశాస్త్రి గొప్ప పండితుడు. ఆయన నవలా రచనలో ఒక విశిష్టత కనపడుతుంది. కవుల జీవిత చరిత్రలను ఆయన సుందరంగా ఊహించి పునర్నిర్మాణంచేశాడు తన నవలలో. కవి జీవితాలకు ప్రాధాన్యమిచ్చిన నవలలు మరి ఇతర భారతీయ భాషలలో ఏమైనా వచ్చాయో లేదో తెలియదు. నారాయణభట్టు, రుద్రమదేవి, కవిత్రయం, మల్లారెడ్డి, ధూర్జటి నోరి

వారి గొప్ప నవలలు. 1920 నుంచి 1940ల దాకా విశ్వనాథ, చలం, బాపిరాజు, నోరి తెలుగు నవలా సాహిత్య చరిత్రలో చెప్పదగినవారు. అయితే నోరి నరసింహ శాస్త్రిగారు స్వాతంత్ర్యానంతరమే మల్లారెడ్డి, ధూర్జటి వంటి నవలలు వెలువరించారు.

అటు తర్వాత తరంలో పేర్కొన దగిన నవలా రచయితలు కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్, జి.వి. కృష్ణారావు, బుచ్చిబాబు, రాచకొండ విశ్వనాథశాస్త్రిగారలు. ఒకే ఒక్క నవల రాసి బుచ్చి బాబు తెలుగు నవలా చరిత్రలో చిరస్మరణీయమైన స్థానం సంపాదించు కున్నాడు. ఈయనపై పాశ్చాత్య సాహిత్య తాత్విక దర్శన ప్రభావం ఎక్కువ. 'చివరకు మిగిలేది' ఒక మనోవైజ్ఞానిక నవల. సౌందర్యాన్ని తాత్వికమైన నిశితమైన లోచూపుతో ఆవిష్కరించగల ప్రతిభా వంతుడు బుచ్చిబాబు. రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలపు తెలుగు సంఘం బుచ్చిబాబు నవలలో ఆవిష్కృతమైంది.

కొడవటిగంటి కుటుంబరావు వాస్తవికతావాది. సామ్యవాద దర్శనంతో ప్రభావితుడైన రచయిత. ఈయన రాసిన నవలలు చదువు, ఐశ్వర్యం, తిమింగిలం వేట, కులంలేని మనిషి, పంచకల్యాణి పాఠకులను బాగా ఆకర్షించాయి. 1930లలో భారతదేశాన్ని కుంగదీసిన ద్రవ్యోల్బణం నాటి పరిస్థితులను 'చదువు' నవలలో కుటుంబరావు బాగా విశ్లేషించాడు. ఇది ఒక విధంగా ఆత్మకథాత్మక నవల అని చెప్పవచ్చు. ఇందులో కథానాయకుడైన సుందరం జీవితానుభవాలన్నీ కుటుంబరావు ఇన్‌ఫ్లేషన్ కాలంలో అనుభవించిన సన్నివేశాలే. తెలుగులో వచ్చిన చెప్పుకోదగిన కొద్దిమంచి నవలల్లో 'చదువు' ఒకటి. కుటుంబరావుకు శ్రామిక జన జీవన విలువలు తెలుసు. మధ్య తరగతి కుటుంబాలలో సంప్రదాయం పేరిట నీతి పేరిట చెలామణి అయ్యే స్వార్థపరత్వాన్ని, కుటిలాన్ని అతడు బాగా ఏవగించుకున్నాడు.

జి.వి. కృష్ణారావు రచించిన 'కీలుబొమ్మలు' మనోవైజ్ఞానిక నవల. వ్యవస్థకూ వ్యక్తికీ మధ్య సంఘర్షణ కలిగినప్పుడు వ్యక్తి ఏవిధంగా నలిగిపోతాడో నిరూపించిన నవల ఇది. మానవుడు సాంఘిక పరిస్థితులలో కీలుబొమ్మగా మారిపోయే ప్రమాదం ఉందని తాత్విక గవేషణతో మానవ జీవితాన్ని విశ్లేషించిన నవల ఇది. కృష్ణారావుగారు 'పాపికొండలు' అనే నవల కూడా రచించారు కాని నవలా రచయితగా ఆయన కీలు బొమ్మలు ద్వారానే ప్రసిద్ధుడు.

స్వాతంత్ర్యానంతర కాలం తెలుగు నవలారచయితలలో చెప్పుకోదగిన ప్రముఖ రచయిత త్రిపురనేని గోపీచంద్. ఆయన 'అసమర్థుని జీవయాత్ర' మేధావి రచయిత స్పర్శ కలిగినట్టిది. వ్యక్తికీ సంఘానికీ మధ్య సంబంధాన్నీ అను బంధాన్నీ ఆయన విశ్లేషణాత్మకంగా ఈ నవల్లో వ్యాఖ్యానించాడు. కుటుంబ జీవన వాతావరణం వ్యక్తి ప్రవర్తన పై అనల్పమన్న సత్యాన్ని తాత్విక జిజ్ఞాసాయుతంగా ఈ నవలలో ఆవిష్కరించారు గోపీచంద్. 1960ల తర్వాత ఆయన చాలా నవలలు వ్రాశాడు. మెరుపుల మరకలు, గడియ పడని తలుపులు, పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా, మొదలైన నవలలు ఆయనకు మంచి పేరు తెచ్చాయి. గోపీచంద్ నవలల్లో అస్తిత్వవాద ఛాయలు కనపడతాయి. వ్యక్తి స్వేచ్ఛనాయన అభిలషిస్తారు.

రాచకొండ విశ్వనాథశాస్త్రి ఆధునిక నవలారచయితలలో చాలా చెప్పుకోదగిన నవలా శిల్పాన్ని చూపారు. తెలుగు సాహిత్యంలో చైతన్య స్రవంతి ప్రయోగానికి ఆయన ఒక సువ్యవస్థను కలిగించారు. 'అల్పజీవి' వస్తుగతంగానూ, శిల్పగతంగానూ కూడా తెలుగులో వచ్చిన మంచి నవలల్లో ప్రముఖంగా నిలిచి పోతుంది.

రావిశాస్త్రిది ఉద్వేగభరితమైన శైలి. అది పాఠకుణ్ణి నిలవనీయదు. తన వెంటలాక్కుని పోతుంది. ఆయన 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' తెలుగు నవలా సాహిత్యంలో విలక్షణమైన నవల. అట్లానే 'రత్తాలూ-రాంబాబున్నూ'. 'రాజు-మహిషి-ప్రేమ-మనిషి' ఆయన పూర్తి చేయగలిగి ఉన్నట్లైతే తెలుగులో చాలా గొప్ప నవల అయి ఉండేది. ఇది ఆధునిక తెలుగు సాహిత్యపు క్లాసిక్ అన్నాడు శ్రీ శ్రీ. విశ్వనాథ శాస్త్రి చివరి నవల 'ఇల్లు'. ప్రపంచానికి ఒక సంకేతంగా ఇల్లును గ్రహించాడాయన. ఈ నవలలో ఆయన పాత్ర చిత్రణనే నేర్పు పరాకాష్ఠకు చేరుకున్నది. సామాజిక వాస్తవిక పరిస్థితులకు ప్రతిబింబం ఈ నవల. సృజనాత్మక రచయిత నేర్పు ఏవిధంగా ప్రకాశిస్తుందో ఈ నవలలో ఆయన నిర్వహించిన పాత్రల కదలికలు, వాతావరణ చిత్రణ, మానవ మనోగత ఉద్వేగ చిత్రీకరణమూ వల్ల తెలుస్తాయి.

స్వాతంత్ర్యానంతర తెలుగు నవలా రచనాక్రమ పరిణామంలో మహిళా రచయితలు ఎక్కువగా నవలలు రాయటం చెప్పుకోదగిన సంగతి. ఒకటి రెండు దశాబ్దాలు తెలుగు నవలా రచనలో మహిళలు ముందంజ వేసినంతగా రచయితలు నవలారచనకు పూనుకోలేదేమోననవలసి వస్తున్నది. మాదిరెడ్డి సులోచన, యుద్దనపూడి సులోచనారాణి,

**తెలుగు నవలకు నూటిఇరవై ఏళ్ల చరిత్ర ఉన్నది. శ్రీకారం చుట్టినప్పటినుంచి ఇప్పటి వరకు చూసుకుంటే ఇంతవరకు పదివేల నవలలైనా వచ్చి ఉంటాయి. సమగ్రంగా సమీక్షించాలంటే అది ఒక గొప్ప గ్రంథమే అవుతుంది. కాని గడచిన పాతికేళ్ళలో తెలుగు నవల శిల్పరీత్యా, వస్తురీత్యా గొప్ప పురోగతిని సాధించింది.**

లత, రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి, కోడూరి కౌసల్యాదేవి, ద్వివేదుల విశాలాక్షి, మాలతీచందూర్, మొదలైనవారి పేర్లు స్వాతంత్ర్యానంతరం తెలుగునవలా రచనలో ముందుగా స్ఫురిస్తాయి. రంగనాయకమ్మ మొదట్లో కుటుంబ నవలలు, సంసారికేళీవృత్తాలు, ప్రణయ బంధాలుగా వ్రాసిన రచయిత్రి. అంధకారంలో, జానకి విముక్తి వంటి నవలలు రాసే కాలానికి మహిళా స్వాతంత్ర్యవాదిగా, విప్లవ రచయిత్రిగా పాఠకుల అభిమానాన్ని సంపాదించుకొన్నది.

మాదిరెడ్డి సులోచనగారి నవలలు విశేషించి పాఠకులను అలరించడానికి కారణం వీటిలో చదివించే గుణం. సాంఘికాదర్శాలు, సాహిత్య సిద్ధాంతాలూ, ఆలోచనాత్మకాలూ అంటూ కాకుండా సమకాలీన సంఘంలో కుటుంబ సమస్యలేమిటో, సాంఘిక సమస్యలేమిటో ఉత్కంఠాభరితమైన సన్నివేశాలతో కూర్చడం వల్ల ఈమె రచనలకు మంచి ప్రతిస్పందన లభించింది. కోడూరి కౌసల్యాదేవి గడచిపోయిన జమిందారీ వైభవాలను, ఉద్వేగాత్మకమైన ప్రణయ వైఫల్యాలను, సాఫల్యాలను చిత్రించడం వల్ల. ఒక దశలో వారపత్రిక పాఠకులు ఆమె రచనలను విశేషంగా ఆదరించారు.

యద్దనపూడి సులోచనారాణి తరుణప్రేమికుల హృదయోద్వేగాలను నేర్పుగా తన నవలల ద్వారా చిత్రించడం వల్ల పాఠకుల ఆరాధ్య రచయిత్రి అయినారు. ఈమె నవలలు చాలా సినిమాలు కూడా తీయడం వల్ల తరుణ పాఠకులలో ఈమె పట్ల అభిమానం పెరిగింది.

లత సుమారు 60 నవలలు దాకా వ్రాసింది. 'మోహనవంశి' వంటి తాత్త్వికార్థ ప్రతిపాదకమైన నవలలు కూడా ఆమె రచించింది. గాలి పడగలూ-నీటి బుడగలు వంటి నవలల్లో వేశ్యావృత్తి మౌలికమైన సమస్య లేమిటో ఆమె చర్చించింది.

స్వాతంత్ర్యానంతరం తెలుగు నవల ధోరణులలో మాండలిక భాషా రచనలు పేర్కొనదగినవి. పోరంకి దక్షిణామూర్తి ఆంధ్రదేశంలోని ప్రధాన మాండలికాల ప్రాతినిధ్యం వహించే మూడు ప్రాంతాలకు చెందిన నవలలు వ్రాశారు. తెలుగు వెన్నెల గోదారీ తీర సాంధ్ర మాండలికంలోనూ, ముత్యాల పందిరి తెలంగాణా మాండలికంలోనూ, రంగవల్లి రాయలసీమ మాండలికంలోనూ ఆయన రచించారు. అట్లానే దాశరథి రంగాచార్య తెలంగాణా మాండలికంలో కథలూ, నవలలూ వ్రాశారు. ఆయన చిల్లర దేవుళ్లు నిన్నటి తెలంగాణ సాంఘికోద్యమాలను, సామాజిక జీవితాన్ని ప్రతిభావంతంగా ప్రతిబింబింపజేసిన నవల.

తెలుగు నవలకు నూటిఇరవై ఏళ్ల చరిత్ర ఉన్నది. శ్రీకారం చుట్టినప్పటినుంచి ఇప్పటి వరకు చూసుకుంటే ఇంతవరకు పదివేల నవలలైనా వచ్చి ఉంటాయి. సమగ్రంగా సమీక్షించాలంటే అది ఒక గొప్ప గ్రంథమే అవుతుంది. కాని గడచిన పాతికేళ్ళలో తెలుగు నవల శిల్పరీత్యా, వస్తురీత్యా గొప్ప పురోగతిని సాధించింది.

పాలగుమ్మి పద్మరాజు నల్లరేగడి, రామరాజ్యానికి రహదారి, బలివాడ కాంతారావు వంశధార, దగాపడిన తమ్ముడు, హిత శ్రీ సామాన్యుడి కామన, కొమ్మూరి వేణుగోపాలరావు పెంకుటిల్లు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ చంద్రుడికో మూలుపోగు, పురాణం సూర్యప్రకాశరావు జీవనగంగ, మహీధర రామమోహనరావు కొల్లాయి గట్టితేనేమి, పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి కౌసల్య, రంధి సోమరాజు దుఃఖితులు, సౌందర్యం సౌశల్యం, ఆర్.ఎస్. సుదర్శనం సంసారవృక్షం, మళ్ళీవసంతం, తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు ధర్మ నిర్ణయం, మనకు మిగిలింది ఈ పాతికేళ్ళ నవలా సాహిత్య చరిత్రలో తప్పక పేర్కొన వలసినవి.

ఇటీవల మాలతీచందూర్ గారి 'హృదయనేత్రి' నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. 1930 లలో తెలుగు నాట స్వాతంత్ర్యోద్యమ వాతావరణాన్ని ఉత్తేజకరంగా చిత్రించిన నవల ఇది. చీరాల పేరాల సత్యాగ్రహం కేంద్రబిందువుగా ఈ నవల సాగింది. ఆనాటి స్వాతంత్ర్యోద్యమం కళ్ళకు కట్టినట్లు చిత్రించిందీనవల. డా. కేశవరెడ్డి 'ది ఇంక్రెడిబిల్ గాడెస్' చాలా మంచి నవల. తెలుగు నవల పేరు ఇంగ్లీషులో పెట్టినా రాయలసీమ ప్రాంతపు అట్టడుగుబడుగు వర్గాల దయనీయ సాంఘిక స్థితిని ప్రతిభావంతంగా నిరూపించే నవల ఇది. ఇటీవల వచ్చిన తెలుగు నవలల్లో శ్రీ కాటూరి విజయసారథి 'పితృవనం' చాలా విలక్షణమైనది. తెలుగు నవల ఉజ్జ్వల భవిష్యత్తుకు గత చరిత్ర సూచికగా ఉంది.

• • •

# ఆధునిక తెలుగు నాటకం–నాడు, నేడు

డా॥ పి.వి.రమణ

ఆధునికాంధ్ర సాహిత్యంలో, సమస్యామయ సమాజాన్ని సజీవంగా శక్తివంతంగా, సమగ్రంగా ప్రజలకు చేరువగా తీసుకు రావటంలో నాటకం ప్రముఖమైన పాత్ర వహించింది. సామాన్య ప్రజల్లో కూడా సామాజిక స్పృహను దీప్తివంతం చేసిన ప్రక్రియ సాంఘిక నాటకం. గురజాడ "కన్యాశుల్కం" నాటకానికి ఈ ప్రక్రియలో ఇప్పటికీ అగ్రాసనమే. ఆనాటి సమాజం యొక్క సామాజిక చైతన్య స్వరూప సమగ్ర అంతస్సత్వమే "కన్యాశుల్కం" అందువల్లనే ఇప్పటికీ ఆ నాటకం ఉజ్వల అనుభూతులకు ఆత్మీయ అతిథిగా ఉండిపోయింది. సామాజిక సమస్యను వివేచనాత్మకంగా వ్యాఖ్యానించి చెప్పటమే ధ్యేయంగా పెట్టుకొన్న నాటకాలు ప్రజల జీవితంలో భాగంగా ఉండిపోతాయి. ఇటువంటి నాటకాలు సమాజ చైతన్య వికాసానికి బాసటగా నిల్చి ప్రాచుర్యం పొందుతాయి. "వరకట్నం, చింతామణి, రంగూన్ రౌడి, మధుసేవ, కాలేజీ గరల్" మొదలగు నాటకాలు ఈ వికాసోదయంలో అగ్రభాగాన నిల్చి సజీవ ప్రయోగాలుగా పరిగణింప బడుతున్నాయి నేటికీ. సమకాలీన సమాజచైతన్య ప్రవృత్తిలో సాంఘిక నాటకం సాధించుకొన్న వ్యక్తిత్వం ఆనాడు అంతగొప్పది. సాంఘిక నాటక సాహిత్యం లో ఆనాడు వ్యక్తమైన తాత్విక భిత్తిక, సమస్యా వివేచనా ప్రతిభ, రంగ ప్రయోగంలోని కళాత్మక సహజత్వం విశిష్టమైనవే కాక, ప్రజాజీవనానికి దర్పణం పట్టేవిగా ఉండేవి. సమకాలీన పరిస్థితులను సమగ్రంగా వివేచించేదే గొప్పనాటకంగా కలకాలం ఉండిపోతుంది అన్న ప్రసిద్ధ తాత్వికుడు "స్లైకినోవ్" నిర్వచనానికి నిదర్శనాలుగా ఆనాటకాలు నిలిచి పోయాయి. సాంఘిక జీవనాన్ని అల్లకల్లోలపరిచే దురాచార నిర్మూలనం కొఱకు, దుర్వ్యసనాల నివృత్తి కొఱకు గురజాడ, కాళ్ళకూరి మొదలగువారు నిజాయితీతో, నిబ్బదతతో సాగించిన తపస్సుకు ప్రతిరూపాలు ఆకాలం నాటకాలు.

మానవుని అంతస్సంఘర్షణకంటే బహిస్సంఘర్షణలకు ప్రాధాన్యతయిచ్చే ప్రవృత్తి సాంఘిక నాటకానికున్నా, దాని ఆంతర్యాన్ని బట్టి చూస్తే, మానవ వ్యక్తిత్వంలోని వైవిధ్య లోతుపాతుల్ని అన్వేషిస్తున్నదే అవుతుందని "ఆర్థర్ మిల్లర్" అభిప్రాయపడతాడు. సంఘాన్ని సామూహికంగా సమీక్షించి, సంఘజీవనానికి అవరోధాలైన విభిన్న సమస్యలను కన్యాశుల్కంలో గురజాడ ప్రస్తావిస్తే, ఆతర్వాతి నాటక రచయితలు సంఘంలో తీవ్రప్రజాద్యంగా విజృంభిస్తున్న ఒక ప్రధాన సమస్యనే సవిమర్శనాత్మకంగా నాటకమంతా చిత్రిస్తూ, దానినే సామాజిక సమస్యగా ప్రపంచంగా వ్యాఖ్యానించటం చేస్తూ వచ్చారు. సమస్యాత్మకమైన నాటకాలను చిత్రించటంలో ఆదర్శవాదం ఒక వైపు, స్వాభావిక వాదం మరోవైపు బలమైన ప్రభావాలను సాహిత్యంమీద వేస్తూ ఉంటాయి. ఏ దేశ సాహిత్య చరిత్రను చూసినా నాటకాలమీద ఈరెండింటి ప్రభావం తప్పక కన్పడుతుంది. అంటే తెలుగు నాటకం సంస్కరణవాదం నుండి, స్వాభావిక, ఆదర్శవాదం వైపుకు పరిణామం చెందినట్లుగా మనం గమనించగలం. ఇందుకుదాహరణగా బళ్ళారి రాఘవ, పి.వి.రాజమన్నార్ లు ప్రయోగించిన "సరిపడని సంగతులు" "తప్పెవరిది" నాటకాలను పేర్కొనవచ్చు. దాంపత్యజీవనంలోని సుఖశాంతులకు మూలం భార్యాభర్తల పరస్పర ప్రేమానురాగాలు మినహా, సాంప్రదాయ బంధమేదీ కాదన్న శాస్త్రాన్ని ఈ నాటకాలు తెలియజేస్తాయి. వృద్ధ వివాహాల పట్ల, బలవంతపు వివాహాల పట్ల సాంప్రదాయంపేరిట జరిగే ఈ అసహజ, అవాంఛనీలయధోరణులపట్ల దాంపత్య జీవితం ఎంత విషాదంగా పరిణమిస్తుందో నన్న వాస్తవానికి రూపకల్పన చేయటంలో ఈ రచయితలు కృతకృత్యులయ్యారు. ఈ అనర్థధోరణిని రూపుమాపి దాంపత్య జీవితాన్ని ప్రేమమయం, ఆదర్శవంతం చేసుకోమనే ఆశయంతో రూపుదిద్దిన ఆదర్శవాద నాటకాలివి.

పారిశ్రామిక విప్లవంలో మానవ మనుగడకొఱకు, కొత్తదారుల అన్వేషణ మొదలైంది. సామాజిక జీవనంలోను, మానవ సంబంధాల్లోనూ అనూహ్యమైన పరిణామాలేర్పడ్డాయి. ఈ ప్రభావం సమస్తం సాహిత్యంలోనూ ప్రతిఫలించింది.

సామాజిక విపర్యాయాలన్నింటికీ మూలం ఆర్థిక అసమానతలేననీ, ఈ తీవ్ర ఆర్థిక అంతరం సృష్టించిన వివాద పరిస్థితుల వల్లనే జాతి వర్గాలుగా, వర్ణాలుగా విచ్ఛిన్నమై అనేక సంక్షోభాలకు ఆలవాలమై పోయిందని, ఈ విషజాడ్యాన్ని నివారించక పోతే మానవప్రగతి ప్రశ్నార్థకమైపోతుందనీ ప్రపంచవ్యాప్తంగా రచయితలు గుర్తించారు. మథనచెందారు. ఈ భావం తెలుగు నాటక రచయితల పైనా బలమైన ప్రభావం చూపింది. ఈ పరిణామక్రమంలోనే తెలుగు నాటకరంగంలో అద్భుతమైన ప్రయోగాలు జరిగినై. వర్ణవ్యవస్థకూ, దానికృత్రిమ ఏర్పాటుకు, వైషమ్యాలకూ వ్యతిరేకంగా కొండముది గోపాలరాయ శర్మ" ఎదురీత" వ్రాశారు. ఆర్థిక అంతర అవ్యవస్థలో, వర్ణవైషమ్యాలు మానవ సౌహార్ద్ర, సామరస్య జీవనానికి ఎంతభంగకరంగా పరిణమిస్తాయో, చివరకు వైవాహిక బంధానికి గూడా ఎంత అవరోధం గా నిలుస్తాయో స్పష్టంచేసిన నాటకం ఇది. మానవ సహోదర భవిష్యత్తును విచ్ఛిన్నం చేసే కులవ్యవస్థను, దాని అంతచ్ఛిద్రాన్ని వివరిస్తూ "కులం లేని పిల్ల" (పినిశెట్టి) తరహా నాటకాలు అనేకం ఆతర్వాత వచ్చాయి. ఆర్థిక అసమానతల మధ్య తీరం అందక కొట్టు మిట్టుకులాడే మధ్య తరగతి నేతిబీరకాయ సాంప్రదాయ రోగిష్టి జీవి... న్న అత్యంతశక్తివంతంగా "ఆత్రేయ" సృష్టించాడు "యన్.జి.వొ.", భయం" నాటకాల్లో. మధ్యతరగతి ఇరుకు జీవితాల అంతర్మథనాన్ని, శిథిలమైపోయే కుహనా విలువల్ని పట్టుకొని వ్రేలాడే జీవన్మృతుల ఆర్తనాదాల్ని ఈ నాటకాల్లో నిరుపమానంగా చిత్రించాడు. ఆత్రేయ. నాటక శిల్పరహస్యాలు ఔపోసనపట్టిన మహాశిల్పి ఆత్రేయ. దీనికి తోడు మానవస్వభావ లోతుపాతుల్ని అంచనా కట్టకల్గిన ప్రౌఢపరిపాక జ్ఞాన సిద్ధుడు ఆత్రేయ. 1940-55 మధ్యకాలంలో తెలుగు రంగ స్థలాన్ని ప్రభావితం చేసిన అసంఖ్యాక నాటకాల్లో అధిక భాగంఆర్థిక అంతరాల వల్ల, వర్గవైషమ్యంవల్ల సమాజంలో ఏర్పడ్డ సంక్షోభాలను, సంఘర్షణలను చిత్రకరించినవే ఇబ్బడి,ముబ్బడిగా వచ్చిన రష్యన్ సాహిత్యం ఈ నాటకాలకు ప్రేరణకేంద్రం. భూస్వాముల ఆధిపత్యం, అహంకారం, దోపిడీ పీడనలు, పీడితుల అసహాయరోదనలు ఈ నాటకా... ప్రధాన వస్తువు, భూస్వామ్య ... అమానుష పీడనలపై, రైతుకూలీలు సంఘటితమై సాగించిన మహోద్విగ్న పోరాటాన్ని మహోజ్వలంగా చిత్రించి, "మాభూమి" ముందడుగు" నాటకాలను సుంకర, వాసిరెడ్డి సద్వయం రచించారు. దున్నేవాడిదే భూమి అన్న దృక్పథాన్ని హృదయ ముద్రాంత ల్యాగించే విధంగా సహజ వాస్తవికంగా వ్రాయబడ్డ నాటకాలివి. ఆనాడు పల్లె పల్లెనూ ఈ నాటకాలు ఒక ఊపు ఊపాయి. ప్రజలు ముక్కాలిపీటలు, గోనెసంచులూ తెచ్చుకొని ఈ నాటక ప్రదర్శనల్ని ఎంతో ఆసక్తిగా చూసేవారు. సామాన్యమైన జీవనానుభవాలు, ఘటనలు, ప్రజలకు సుపరిచితమైన భాష ప్రదర్శన జయానికి ప్రజాదరణకు తోడ్పడి తీరుతాయన్న "స్ట్రైక్" "సార్డో" నిర్వచనానికి ఈ నాటకాలు ప్రత్యక్ష నిదర్శనాలు. భూస్వామ్యవర్గంపై పీడిత వర్గం చేసే పోరాటమే ఇతివృత్తంగాగల నాటకాలు తెలుగులో రష్యన్ ప్రభావంతో వచ్చినవే అనిపైన చెప్పుకున్నాం. టాల్‌స్టాయి, గోర్కీ, ష్లిక్ గొగోల్, చెకోవ్, ఆస్ట్రోవ్‌స్కీ మొ॥ రష్యా నాటక రచయితల ప్రభావమే శతాబ్దాల శాపభారం మోసే పీడితుల దుర్భర జీవితాన్ని అక్షర బద్ధం చేయగలదృష్టిని ప్రసరింపచేసింది. "మానవుడన్న పదమే తనను మైమరపింప జేస్తుందనీ, ఆ పీడితమానవుని ప్రగతికోసం వచ్చి నిజాలనే తాను వెల్లడిస్తానని "గోర్కీ ప్రకటించి తన పేరును "చేదు" గా మార్చు కొంటాడు. సామాజిక అసమానతలపై ధ్వజ మెత్తిన తెలుగు నాటక రచయితలకు గోర్కీ రచనలు అందుకే స్ఫూర్తి కేంద్రాలైనాయి. ఈ వరవడిలో వచ్చిన నాటకాలలో బోయిభీమన్న "పాలేరు" "కూలిరాజు" కొడాలి గోపాల రావు "తిరుగుబాటు" "కూలి" కొర్లపాటి" యథాప్రజా తథారాజా" కె.వి.రమణారెడ్డి "అన్నపూర్ణ" మొదలగునవి ప్రసిద్ధాలు. అని శెట్టి "మావూరు" ఆత్రేయ "పరివర్తన" నాటకాలు గూడా ఈ కోవలో చేర్చాన దగినవే. "సమకాలీన వాస్తవ ప్రతిరూపమే సాంఘిక నాటక ధ్యేయంగా ఉండాలి" అన్న బెన్నిస్ వెర్లెండ్ నిర్వచనానికి గీటురాళ్ళుగా తెలుగు నాటకాలు ఇప్పటి వరకు రూపొందుతూ వచ్చాయి.

స్వాతంత్ర్యానంతరం సంఘ సమస్యల కన్నా కుటుంబ సమస్యలు ప్రధానంగా పీడించసాగాయి సామాన్యుల్ని. మధ్య తరగతికి గృహజీవితం దాటిరాని మహాసాగరమే అయింది. నాటక రచయితలు గూడా గృహసంబంధ సమస్యలకే ప్రాధాన్య మిచ్చి నాటకాలు వ్రాశారు. ఈ కాలంలో ఆత్రేయ అద్దెకొంప (యన్.జి.వొ) ఈ తరహా నాటకాలకు చైతన్య దీపిక. కొర్రపాటి "నిజరూపాలు" పినిశెట్టి "ఆత్మీయులు" "రావికొండలరావు" నాలుగిళ్ళ చావిడి" రామస్వామి "వెల్లువ" యండమూరి "రఘుపతి రాఘవ రాజారాం" రాఘవ" కనకపుష్యరాగం" ఆర్.వి.చలం "మాట

తప్పకు" జంధ్యాల "సంధ్యారాగంలో శంఖారావం" ఆదివిష్ణు" బొమ్మబొరుసు" గొల్లపూడి" ఒకచెట్టూ-రెండుపూలు" కె.యస్.టి.శాయి" మహానీయులు" బెల్లం కొండ "పునర్జన్మ" నరసరాజు "వీలు నాదూ" సి.వి.రమణ "దేవతలెత్తిన పడగ" భమిడిపాటి"కీర్తిశేషులు" ఆదిగాగల గృహజీవితభిత్తికలోనే మానవ స్వభావం లోని వైరుధ్యాన్ని, వైవిధ్యాన్ని వివిధ కోణాల్లో వ్యక్తంచేసిన నాటకాలు ఇటువంటి గృహస్థ సమస్యా నాటకాలకు అమెరికా నాటకాలు మన రచయితలకు ప్రేరణనిచ్చాయి. వ్యక్తికీ వ్యక్తికీ ఘర్షణ ప్రధానంగా చూపెట్టే నాటకాలకు బ్రిటిష్ నాటకం మనకు విహారక్షేత్రం, మానవఅంతస్సంఘర్షణను ప్రధాన వ్యక్తాంశంగా తీసికొని గూడా తెలుగు నాట కొన్ని నాటకాలు రచింపబడ్డాయి. అనిశెట్టి "గాలిమేడలు" ఆర్.వి.చెలం" ఇదినాటకంకాదు" ఇసుకపల్లి మోహనరావు "డియర్ ఆడియన్స్సినిస్సియర్లీ యువర్స్" మొదలగు నాటకాలు మానవస్వభావ ఆంతర్యాన్ని అన్వేషిస్తూ అతని వైవిధ్యాన్ని ప్రవృత్తిని సమీక్షించే నాటకాలు.

1965 నుండి తెలుగు నాటకం స్వరూపంలోనూ, స్వభావంలోనూ పాత కొలమానాల్ని పారవైచుకొని, కొత్త విన్యాసాల కేరింతలతో కళాకాంతుల్ని, పూర్వ వైభవాన్ని పోగొట్టుకొంది. ఇంటిలోని పైడిపాల గిన్నెను విసిరి వేసుకొని, పొరిగింటి లక్కపిడతను నోట పెట్టుకొని మురిసిపోయే పాపాయి విధంగా తెలుగు నాటకం ఒక నిశ్చేతన ఛాయా రూపంగా తనని తాను మార్చుకొంది వారసత్వ కళా సృజనకు కాలదన్ని, పాశ్చాత్య సిద్ధాంత, ప్రయోగ, టెక్నిక్‌ల అనుకరణ భజనలో అంత శక్తిని తెలుగునాటకం జారవిడుచుకొంది; సమాజ పరిశీలనలో నాటక రచయితలకు దృష్టి మాంద్యం ఏర్పడింది. నటులలో, దర్శకులలో నాటక సందేశాన్ని ప్రేక్షకుల హృదయాల్లోకి చేర్చాలన్న లక్ష్యంకన్నా ప్రయోగాలహంగు ఆర్భాటాలతో, ట్రిక్స్ జిమ్మిక్స్‌తో ప్రదర్శనను మాంత్రికుని మంత్రదండ జన్మమందిరంగా మలచా లన్న ఆరాటం అధికమైపోయింది. ఫలితంగా నాటకం ప్రజలకు అందనంతగా ఆకాశపు అంచుల్లో విహరించసాగింది. ఈ దీనావస్థను కొంత పరిశీలించుదాం. 1965 నుండి తెలుగు నాటక రచనలో, ప్రదర్శ నలో ఒక విలక్షణత చోటు చేసుకొంది. అనేక సిద్ధాంత, ప్రయోగాల మిశ్రత ప్రవృత్తులు నాటకంలోకి చొచ్చుకొచ్చి, నాటక స్వభావాన్ని వికృతం చేశాం; సందేశాన్ని దురవగాహన చేశాయి. "మరో మొహెంజోదారో" నాటకంతో ప్రారంభ మైన ఆకర్షణీయ ప్రయోగ ప్రదర్శనా విధానం, ఆ తర్వాత నాటక రచయితలకు, దర్శకులకు మార్గ దర్శకంగా మారి పోయింది; అయితే "మరో మొహెంజొ దారో" నాటకంలో సమకాలీన సమాజ సమూహిక మనస్సు, వర్గ సంఘర్షణల చేతనాగ్ని, మానవ మనస్తత్వ వైవిధ్య అంతస్సత్త్వం బలంగా చిత్రీకరింపబడి ఉన్నాయన్న సత్యాన్ని మరువరాదు; ఆనాటక విషయం కేవలం నూతన ప్రయోగ ఆకర్షణతోనే లభించినట్టిది కాదు. ప్రజల ఆదరాన్ని, అభిమానాన్ని చూరగొనే ఇతివృత్తం అందులో ఉంది. ఏ ప్రయోగమైనా, పరిణామమైనా ఒక్క సారి ఊడి పడదు. అనేక సాంప్ర దాయాల్ని, గతవిలువల్ని సంఘర్షించు కొంటూ, దాటుకొంటూ వస్తుంది. అట్లా వచ్చిన ప్రయోగం యథాస్యవహారికంగా, అలంకారికంగా కాక గత సాహిత్య విలువ లకు వన్నె తెచ్చేదిగా ఉండాలి. ప్రజలను ఆకట్టుకొనేదిగా ఉండాలి; నాటక విషయంలో అయితే ఈ ప్రయోగదృష్టి మరింత విచేచన అవసరమవు తుంది. నాటక ప్రయోజనానికి పరస్పర పోషకం గానో, సమాంతరంగానో, సమన్వయంలో అవగాహనా పరంగానో ప్రేక్షకుడికి కొత్త వెలుగుల్ని కొత్త ఆలోచనల్ని అందించ గలగాలి. ఎందుకంటే నాటకానికి ప్రధాన డైమన్షన్ ప్రేక్షకుడే గనుక. ప్రేక్షకుణ్ణి జాగృతం చేసే, స్వీయ అనుభూతుల సమాహార స్వరూపం నాటకమేనన్న విషయం మర్చిపోరాదు. నాటకంలో జొప్పించే సిద్ధాంతాలూ, ప్రయోగాలు పొడిపొడిగా ఉండి, నాటక లక్ష్యానికి విపత్తిగా ఉండరాదని చెప్పటానికే ఈ పై వివరణం తాను. రంగ స్థలం విస్తృతంగా వికాసం చెందిన పాశ్చాత్య దేశాల్లో ఈ ప్రయోగాల పట్ల ఉబలాటం ఉధృతి చెందటం వేరు; రంగ స్థల వికాసమే లేని తెలుగు నాట గూడా వీటిని అనాలోచితంగా అనుకరిం చటం వేరు. వస్తువులో, పాత్ర చిత్రణలో ఈ ప్రయోగాలు ఘోరంగా విఫల మయ్యానని "బెర్టోల్డ్ బ్రెష్ట్" వంటి వారు లోగడే ఆవేదన చెందారు.

తెలుగు నాట మెలో డ్రామా స్థితి నుండి వాస్తవ స్థితిగతుల చిత్రణకు పరిణామం చెందుతూ వచ్చిన ఈ ప్రయోగ వ్యామోహం పాయలు పాయలై విభిన్న రూపాలుగా విస్తరించింది. రియలిజం, నాచురిలజం, సర్రియలిజం, ఎగ్జిస్టెన్షి లిజం, ఎక్స్ప్రెషనిజం, అబ్జర్డిజం, థియే ట్రకలిజం, మేయర్ హోల్డ్ ప్రయోగం మొదలగు వివిధానేక సిద్ధాంతాల ప్రభావ ప్రదర్శనా పద్ధతులు తెలుగు నాటకం పై

గూడా ఆధిపత్యాన్ని ముమ్మరం చేశాయి. మనసులో పొంగి పొరలే భావాలను, ఆశయాలను ఉద్రేకంగా, అట్టహాసంగా, కృతకంగా వివరించే విధానం మెలోడ్రామాది. ఆనాటి చింతామణి, రంగూన్ రౌడి, మొ॥ నాటకాలు ఈ కోవలోకే వస్తాయి. వాస్తవిక దృష్టితో, సహజ వస్తువుతో నాటకానికి రూపకల్పన చేయాలన్న ఉబలాటంతో నేడు, నాటక రచయితలు కథా వస్తువును నిర్లక్ష్యం చేస్తున్నారు; ఏం చెప్తున్నాం అన్నది గతంలోని నాటక రచయితల ఆదర్శ లక్ష్యమైతే, వస్తువును ఎట్లా ఆకట్టుకొనే విధంగా ప్రదర్శిస్తున్నాం అన్నది నేటి రచయితలకు ప్రధాన ధ్యేయమైంది; ఫలితంగా ఒక దార్శనికతను, జీవన సమగ్రతను వ్యాఖ్యానించగల నాటక కథా వస్తువు కరువై పోయింది. మానవ వికాస లక్ష్యాన్ని కళాత్మకంగా కార్యరంగంలోకి తేగల ప్రయోజనాత్మక నాటకం కొరవడి పోయింది. వివిధ జీవితానుభవాల సంస్కృతిని విశ్వజనీనంగా వ్యక్తం చేయగల నేర్పు, ఓర్పు నాటక రచయితలలో లుప్తమైంది; ఏదో పాక్షిక జీవిత కోణాల్ని స్పృశిస్తూ, ప్రయోగాల టచ్‌లతో అభివ్యక్తం చేస్తున్న నేటి నాటకంలో కథా సంవిధానం అంతస్సూత్రం ఆకుకూ పోకకూ అంద నట్లుగా ఉంటుంది; ఉదాహరణకు ఈ దశాబ్దంలో ప్రసిద్ధి గాంచిన కొన్ని నాటకాలను పరిశీలించుదాం. ఇసుకపల్లి మోహన రావు వ్రాసిన "డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్" అన్న నాటకం స్త్రీ పురుషుల మధ్య ఉండవలసిన అన్యోన్యత, పరస్పర విశ్వాసం పురుష సాంప్రదాయ దురహంకారాల్ని ప్రధానంగా ప్రస్తావిస్తుంది. నాటకానికి ఎన్నుకొన్న శిల్పం ప్రయోగ పరమైంది; "పర్సనల్ డ్రామాలో సన్నివేశాలు చాలా ఇన్ కోహెరెంట్‌గా, అసంబద్ధంగా, ఎబ్సర్డ్‌గా కన్పించ వచ్చు. దయచేసి లింక్ చేసుకోండి" అని నాటకం ఆదిలో రచయిత పాత్ర చేత ప్రకటింప చేస్తాడు. నాటక రచయిత. తన జీవితంలో అనుభవమైన దాన్ని అంతరాత్మలో రగులుకొంటున్న దాన్ని ప్రేక్షకులతో ముఖాముఖి తెలియ చెప్తుంటాడు. రచయిత పాత్రధారి. నాటకాంతంలో మనం గ్రహించేది సుశీల ఆత్మహత్య చేసికోలేదనీ, హత్య చేయబడిందన్న వాస్తవాన్ని. ఈ హత్య చేసి గూడా భర్త పాత్రలో రంగ స్థలం అభినయిస్తున్న రచయితే. మనిషిలో ఉన్న "డ్యూయల్ రోల్"ని ఈ నాటకం ఫోకస్ చేస్తుంది. "ఇన్ హ్యూమన్ బిహేవియర్"తో బాధ పడే మానవ ద్వంద్వ ప్రవృత్తికి దర్పణం పడుతుంది నాటకం. నాటకాంతంలో 'సుహాసిని' పాత్ర ద్వారా చెప్పించిన సుదీర్ఘ ఆంగ్ల సంభాషణలున్నాయి; ఇంగ్లీషులో సంభాషణలు చెప్తే తప్ప, ఆ సంభాషణలకు సార్థకత రాదనో, లేక పాత్రకు ఎమోషన్ రాదనో మన అవగాహనకే వదిలిపెట్టాడు రచయిత. పిరాండిలో "సిక్స్ కారెక్టర్స్ ఇన్ సెర్చి ఆఫ్ యాన్ ఆథర్" నాటకంలో గూడా పాత్రలు దర్శకునికి ఎదురు తిరుగుతై; రంగ స్థలంపై కథా గమనానికి అడ్డు తగుల్తై ఈ నాటకంలో గూడా రంగ స్థలం నుండి వెళ్ళి పోవటానికి హీరోయిన్ పాత్ర ప్రయత్నిస్తుంది. ప్రయోక్తకు అడ్డు తగులుతుంది; ప్రేక్షకుల్లో నుండి పాత్రలు రంగ స్థలంపైకి ప్రవేశిస్తాయి. శ్రీ మోహన రావు ఎంచుకొన్న విషయం సమగ్ర సమాజ సామూహిక చేతనకు ప్రతినిధి గాకపోయినా, ఎన్నుకొన్న ప్రయోగంలో నూతనత్వం ఉంది. అయితే ఈ ప్రయోగ పోకడకు మన ప్రేక్షకులు అలవాటు పడ్డారా అన్న విషయం యోచించుకోవటం ముఖ్యం. ప్రేక్షకుల అంతరాంతరాళాల్లో భావ స్పందనను, సంస్కార సాంద్రతను వర్షింపలేని ఏనాటకానికీ చిరంజీవత్వం ఉండదు; ఈ నాటకంలో జీవితం, అనుభవం స్థానికమైనదైనా, ప్రయోగం, మస్తిష్కానికి ప్రాధాన్యమైంది. అందువల్ల సాహిత్యంలో ఎంత పరిణితి చెందిన ప్రయోగమైనా, తెలుగునాట సమగ్ర వ్యక్తిత్వాన్ని సాధించుకొంటుందని భావించలేం. నాటకంలోని భావాత్మక సంవేదనను, తన సంవేదనగా ప్రేక్షకుడు అనుభూతి చెందగలిగేది, నాటక వస్తువులో, సందేశంలో తన జీవ ప్రవృత్తిని, భావతీవ్రతను పసిగట్ట గలిగిన నాడే; ఈ రీత్యా చూసినపుడు "డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్" నాటకం ఆధునిక నాటక రచనలో ఎంత వైవిధ్యాన్ని సంతరించుకొన్నదైనా, కేవలం ప్రయోగాన్ని ఆధారం చేసుకొని, ప్రతీకాత్మక టెక్నికల్ వ్యాల్యూస్‌కే ప్రాధాన్యం ఇచ్చినందువల్ల, సామాన్య ప్రేక్షకుణ్ణి సైతం ఆకట్టుకొనే సార్వకాలిక కథా వస్తువు కానందువల్లా, అనుకొన్నంతగా ప్రజల్లోకి రాలేక పోయింది; పరిషత్తుల ఆదరణలకే పరిమితమైంది. ఇసుకపల్లి మోహన రావు వ్రాసిన మరో నాటకం "ఓ బూతు నాటకం". భార్య లేచిపోయిన రాము జోగి కూతురు "వరలక్ష్మి", మధ్య తరగతి మంద భాగ్యమే వారసత్వంగా వెన్నాడి వస్తున్నా, స్త్రీ సహజమైన బానిస భావ జాలాన్ని, కాలానుగుణ పరిణామ జ్వాలగా రగుల్కొల్పజేసి అందర్నీ చకితుల్ని చేస్తుంది. వరలక్ష్మి; సెక్సు సంబంధములలో ఉద్రేక పర్చి లోబర్చుకోవాలని

తాపత్రయపడిన విఠల్‌ని, కౌగిలి వద్దే జీవశక్తిని నీరుకార్చుకొనే దాసును ఉద్దేశించి " ఆ ఇద్దరి వెధవల కాళ్ళ మీద పడమంటున్నారు. ఆ వెధవలు కట్టే నాసుమాత్రపు తాళి లేకుండా నేను బ్రతగ్గలను." అంటూ రౌద్ర రూపం దాల్చిన వరలక్ష్మి పాత్రను మారుతున్న వ్యవస్థకూ స్త్రీ పురుషులు సమంగా, సఖ్యతగా, సమున్కంధుల్లా జీవించాలన్న ఆధునిక చైతన్య భావనకూ నిండైన ప్రతీకగా, ప్రతినిధిగా రచయిత అద్భుతంగా చిత్రణ చేశారు; నాటకాంతంలో వరలక్ష్మి చేత ఘాటైన; దీటైన ఆంగ్ల సంభాషణల్ని మహా ఎమోషనలా ప్రవహింప జేస్తాడు రచయిత. అనాదిగా మగవాడి ఆంక్షల మధ్యా, అధికారం మధ్యా మైనపు బొమ్మలా బ్రతుకీడ్చిన ఆడదానిలో విస్ఫూర్తి నుందమవుతున్న విప్లవ జ్వాలేమో ఆ ఎమోషన్ తీవ్రత.

ఈ నాటక ప్రయోగం ద్వారా రచయిత ఆశించే ప్రయోజనం, ఇవ్వదల్చు కొన్న సందేశం ప్రేక్షకులపై ప్రభావం చూప గల్గుతున్న స్థాయిలో ఉన్నదా ? సమకాలీన ప్రధాన సమస్య గాక, ఏదో ఒక పాక్షిక సమస్యకు, పాక్షిక అనుభవంతో, సంవేదనాత్మక దృష్టితో వ్యాఖ్యానించిన ఈ కోవ నాటకాలకు శాశ్వతత్వం లభిస్తుందా అన్నది వేచి చూడాలి. ఇక్కడ రచయిత నిస్సందేహంగా శక్తి మంతుడు. సమాజ సామూహిక చేతనను అభిలక్షించే కథా వస్తువును శ్రీ మోహన్ రావు ఎంచుకొని ఉన్నట్లైతే ఆ నాటకానికి ప్రయోగ పరిపూర్ణతతో పాటు, ప్రవృత్తి సమగ్రత ఏర్పడి ఉండేది. ప్రతి చారిత్రిక సంధ్య లోనూ రంగ స్థల ప్రదర్శన పోకడల్లోనూ మార్పు రావాలి" అని ప్రకటిస్తాడు 'అవినెస్కో' "నోట్స్ అండ్ కౌంటర్ నోట్స్" అన్న గ్రంథంలో నాటకానికి ప్రధాన డైమన్షన్ ప్రేక్షకుడు గనుక; 'ఏ మార్పు జరిగినా ప్రేక్షకుడి అవగాహనా పరిధిని దాటి పోగూడదన్న వాస్తవాన్ని నాటక రచయితలు దృష్టిలో ఉంచు కోవాలి.

వరకట్న దురాచారాలకు దారుణంగా ఆహుతైపోతున్న అభాగ్య యువతుల గూర్చి ట్రలిగ్ టెక్నిక్‌లో "మార్గశీర్ష" వ్రాసిన నాటకం "పసుపు బొట్టు పేరంటానికి", ఇటువంటి అభాగ్య స్త్రీల మానసిక విప్లవానికి విత్తునై వస్తానంటూ రచయిత పాత్ర చేత అభయమిప్పిస్తాడు నాటక రచయిత. ఈనాటకం పరిషత్తుల్లో ఎన్నో బహుమతులు గెల్చుకొంది; సమస్య పాతదే అయినా దానిని శిల్పించి ప్రయోగించిన తీరు నూతనంగా, వైవిధ్యంగా ఉంది. వరకట్న దురాచారాన్ని తుద ముట్టించమని రచయిత సమాజ సామూహిక ప్రతినిధిగా హితబోధ చేస్తాడు. ప్రేక్షకుల్లో ప్రేరేపణ కలుగ జేస్తాడు. అయితే ఈ నాటకంలో ప్రయోగిస్తున్న టెక్నిక్ పట్ల, ఒక్కోసారి మన సామాన్య ప్రేక్షకుడిలో గజి బిజి, రసాభాస కలిగే ఆస్కారం లేకపోలేదు. నాటకం చైతన్యమయంగా ఉండాలి గాని సాంకేతిక మయం చేసినట్లు ఉండగూడదు. ఈ యాంత్రికమయ ప్రదర్శన వల్ల ప్రధాన సమస్య పట్టుకోల్పోయే ప్రమాద ముంది; "నాటకం కొఱకు రంగ స్థలం ఉండాలిగాని, రంగ స్థలం కొఱకు నాటక కల్పన జరగ గూడదు" అని ప్రకటిస్తాడు బెర్నార్డ్ షా రచయిత ఎన్నుకొనే ప్రయోగ విధానం నాటక ప్రయోజనాన్ని, ప్రమాణాన్ని, రచనా తత్వాన్ని పెంపొందించేదిగా ఉండాలి. అయితే ఇప్పుడొస్తున్న ప్రయోగ అభివ్యక్తిని ఆధారం చేసుకొని వస్తున్న నాటకాలు అధిక భాగం ప్రజాభిమానాన్ని చూరగొన లేక పోతున్నాయి, పదికాలాల పాటు ప్రేక్షకుల ముందు నిలబడ లేక పోతున్నాయి. రూపంలోనూ, స్వభావంలోనూ, ప్రదర్శన లోనూ అభినవత్వాన్ని ఆవిష్కరింప జేస్తున్నారు నాటక రచయితలు. విభిన్న మానవ ప్రవృత్తుల్ని ప్రతీకాత్మకంగా, సృజనాత్మకంగా చిత్రీకరిస్తున్నారు. సమిష్టి భావన, సహజీవనం, మానవతా చింతన లక్ష్యాలుగా, అవినీతి, అధర్మం, దోపిడీ, వర్గ వ్యవస్థలో బడుగు జీవి బండలైన బ్రతుకు వ్యధ మొదలగు దృష్టికోణాలతో కూడిన నాటకాలు కూడా ఈ దశాబ్దంలో ఎన్నో వచ్చాయి. ఇటువంటి నాటకాలలో విశిష్టమైనది. "అం అః". ఈ నాటక రచయిత అనంత్ హృదయ్ రాజ్, " ఏ వ్యవస్థలో పదవుల కోసమే పార్టీలు కుమ్ములాడుకొంటాయో ఆ దేశాన్ని 'మార్క్స్' బాగు చేయలేడు; గాంధీ బాగు చేయలేడు. వ్యవస్థ స్థితి పట్ల సరైన అవగాహన ఇవ్వలేని పార్టీలే ఈ దేశ అధోగతికి కారణం''. అంటూ 'నామాట'లో నాటక ఆంతర్యాన్ని ఆవిష్కరింప జేస్తాడు నాటక రచయిత. దేశాన్ని కుటుంబంగా సంక్షిప్తీకరించి, గృహ సభ్యుల్నే విభిన్న పదవుల్లో ఉన్న కీలక సభ్యులుగా ప్రతీకరించి చూపెట్టిన నాటకం ఇది. రచయిత నాటకంలో సృష్టించిన పాత్రలు, కల్పించిన సంఘటనలూ సహజంగానూ, సజీవంగానూ ఉండి ఒక సందేశాత్మక, ఆదర్శ వ్యవస్థ కోసం రచయిత పొందే తపనలో తాద్మ్యామై పోతాయి. "మా భూమి, ముందడుగు" నాటకాలు ప్రజా చైతన్యానికి ఎంతో ఉద్యమ స్ఫూర్తిని గూర్చి పెట్టాయో ఈ

"అం అః" నాటకం కూడా అంతే బలమైన, గాఢమైన సాంఘికోద్యమ లక్ష్యం వైపు మనల్ని మళ్ళిస్తుంది. సమకాలీన సమగ్ర స్వరూపాన్ని, జీవన వైవిధ్యాన్ని సమ మోతాదులో అక్షర బద్ధం కావింప బడ్డ ఈ నాటకం, తొలినాటి సంస్కరణాత్మక నాటకాల స్థాయిలో తెలుగు నాటక రంగాన్ని చాలా కాలం ప్రభావితం చేయగలదనటంలో సందేహం లేదు.

నేటి తెలుగు నాటక స్థితిగతులపై వివేచనాత్మకంగా సాగిన ఈ అధ్యయనం వల్ల, నాటక పరిణామంలోని ప్రతిఫలన రూపాన్ని సమీక్ష చేసుకొనే అవకాశం కల్గింది; అంతేగాక తెలుగు నాటక పునర్వికాసానికి కొన్ని ప్రతిపాదనలూ, సూచనలు చేయవలసిన అవసరమూ ఏర్పడింది.

సామాజిక దర్శనాన్ని తన నాటక సాహిత్య దర్శనానికి ఆలంబనంగా చేసి కోవటం నాటక రచయిత ప్రధాన లక్ష్యంగా ఉన్నప్పుడే ఏ నాటక మైనా ప్రజలను తట్టి లేప కల్గుతుంది; రచయిత సాహిత్య అస్తిత్వంలో పాటు సమకాలీన సమాజ అస్తిత్వాన్ని కూడా పరిగణనలోనికి తీసుకోవాలన్న మాట. ప్రయోగాల్ని, సిద్ధాంతాల్ని పాశ్చాత్యం నుంచి తీసుకొన్నా, వాటిని ఇక్కడి జీవనంలో వినియోగం చేసుకొన కలిగే సమన్వయ పునర్దర్శన దృష్టి నాటక రచయితల కుండి తీరాలి.

కేవలం ప్రయోగం కోసమో, సిద్ధాంతం కోసమో, దృక్పథం కోసమో నాటకంలో ప్రయోగాన్ని ప్రవేశ పెట్టరాదు; అని నాటక సందేశంలో మిళితమై, నాటక ప్రయోజనానికి పోషకంగా నిలబడగలగాలి. ఒక సిద్ధాంతం, ఒక పాక్షిక సత్యానికే గాక సంపూర్ణ మానవ జీవితంపై వ్యాఖ్యానం చేసేదిగా నాటక ఇతివృత్తం ఉండాలి.

ఏం చెప్తున్నాను? ఎవరిని ఉద్దేశించి చెప్తున్నాను? ఏ ప్రయోజనాన్ని సాధించ టానికి ఎవరిని ఉద్దేశించి చెప్తున్నాను? ఏ ప్రక్రియలో చెప్తున్నాను? అన్న వివేచన ప్రతి నాటక రచయితలలోనూ ఏర్పడాలి. తెలుగు వారికి మొదట నుండీ సంగీతం పట్ల, పద్యం పట్ల ఆసక్తి అధికం గనుక నాటకంలో పద్యాల్ని గాని, పాటల్ని గాని ప్రవేశ పెట్టి, సంగీతానికి అధిక ప్రాధాన్యం ఇచ్చే విషయం ప్రస్తుతం రచయితలలో, దర్శకులలో చర్చనీయాంశం కావాలి. కేవలం వాస్తవికత, సహజత్వం అన్న పరిధిలోనే కూరుకుపోతే ప్రగతి ఉండదు; భారత దేశంలో అనాది నుండి నృత్య, సంగీతాలకు నాటకంలో ప్రాధాన్యం ఉంది; ఇప్పుడు ఆధునికంగా కూడా "సైడ్ సైపర్" "కైలాసం" మొ|| నాటకాలను బి.వి. కారంత్, సంగీతాత్మక నాటకాలుగానే మలచిన విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి ఇక్కడ.

ఇప్పుడు, తెలుగు నాటకానికి గత వైభవ ప్రతిష్ఠల్ని తిరిగి కల్పించి, పునరుజ్జీవింప చేసే కృషిలో నాటక రచయితలు, దర్శకులు, నటులూ అందర్నూ మనస్ఫూర్తిగా, ఏక దీక్షలో పాల్గొనవలసిన అవసరం ఎంతైనా ఉంది.

# రేడియో నాటిక

**గొల్లపూడి మారుతీరావు**

చాలా సంవత్సరాల క్రితం విశాఖ పట్నం హిందూరీడింగ్ రూంలో ఒక సభ జరిగింది. అబ్బూరి రామకృష్ణ రావుగారు అధ్యక్షులు. నేనూ, పోణంగి శ్రీరామ అప్పారావు గౌరవ వక్తలం. నేను రేడియో నాటికల గురించీ, ఆయన స్టేజి నాటకాల గురించి అనర్గళంగా మాట్లాడాం. అంతా అయాక అబ్బూరి వారు లేచిః "ఇదా ఈ రెండింటికీ తేడా? ఏమయినా, నాకేమో స్టేజి నాటకం కంటె రేడియో నాటకమే గొప్పది" అని ఆగారు.

నేను గర్వపడిపోయాను. ఆయనే మళ్లీ అన్నారు : "ఎంచేతనంటే స్టేజి నాటకానికి వెళ్తే అది చచ్చుగా ఉన్నా బయటికి రాలేం. రేడియో నాటకం బాగు లేక పోతే వెంటనే రేడియో ఆపెయ్యవచ్చు" అన్నారు.

అప్పటికి అందరితో పాటు నేనూ నవ్వు కున్నా ఈ వాక్యం నేను మరిచి పోలేదు. సంవత్సరాల తర్వాత ఆలిండియా రేడియో నాటక ప్రయోక్తల సమావేశంలో నేను కోయంబత్తూరులో మాట్లాడి నప్పుడు-మొదట గుర్తు చేసిన సందర్భం యిదే. రేడియో నాటిక శ్రోత చేతుల్లో ఆటబొమ్మ. శ్రోత విని ఆనందించనూ గలడు అక్కర లేదో ఆ క్షణానే గిరాటేయగలడు. ఇదే నాటక రచనకీ, ప్రయోక్తకీ చాలెంజ్.

నా యిరవై య్యేళ్ల రేడియో జీవితంలో నిజమైన రేడియో నాటికలు వ్రాసిన వారు చాలా అరుదు. నిర్మోహమాటంగా చెప్పు కోవలసి వస్తే ఆ ప్రక్రియ స్కోపు, బలం తెలిసిన వారు చాలా తక్కువ. నాటక మంటే ఇద్దరు మాట్లాడుకొంటే చాలునన్న అపోహ లాంటిదే, కొన్ని శబ్దాలతో అదే మాటలు రేడియో నాటిక అవుతుందని చాలా మంది ఉద్దేశం. ఇవాళ ఎంత తియ్యగా, ఎంత ఎక్కువగా, ఎంత అందమయిన 'బొంకు' మాట్లాడితే సినీమా అయినట్టు. సినీమాకి పెద్ద లోపం-మాట. సినీమాలో కథని చెప్పేది కెమెరా. రేడియో నాటకంలో ఏది జరిగినా, ఏది చెప్పవలిసి వచ్చినా-ఒకే ఒక ఇంద్రియం ద్వారా జరగాలి. చెవి, నాటకంలో యింకా విస్తృతమయిన ఆలంబనలున్నాయి.

ఆ మధ్య తెలుగు టీవీలో ఒక నాటిక ప్రారంభమయింది. ఆసక్తి కొద్దీ చూస్తు న్నారు. ఓ గదిలో ఓ కుర్రాడు ఎక్కాలు చదువు కొంటున్నాడు. బాగుంది. ఓ ముసలాయన వచ్చాడు. ఆ కుర్రాడ్ని చూసి "ఎక్కాలు చదువు తున్నావా బాబూ" అనడిగాడు అంతే. ఆ నాటిక మీద ఆకాస్త ఆసక్తి చచ్చింది. ఎక్కాలు చదువుచున్న కుర్రాడ్ని చూసాస్తా తాతయ్య "ఎక్కాలు చదువుతున్నావా"? అనడిగితే "నీకెమైనా దొడ్డపిచ్చా! అనాలి ఆకుర్రాడు. ఇంట్లో కాగితం పట్టుక రాస్తున్న రచయితకి కళ్ళలో చూస్తున్న ప్రేక్షకుడికీ ఆ వాక్యం ఎంత అసందర్భంగా ఉంటుందో తోచ లేదు. ఇలాంటి సందర్భాలు రేడియో నాటికల్లో కో కొల్లలు.

కాగితం మీద వ్రాసిన ప్రతీదీ రేడియో నాటిక కాదు. నా 'కళ్ళు' నా రచనల్లో మంచి రచన ఎంత అనుకొన్నా దాన్ని రేడియోలో ప్రసారం చెయ్య లేక పోయాను. కారణం - తప్పని సరిగా అది దృశ్య నాటిక. కళ్ల కేమి? ప్రేక్షకుడు చూస్తే తప్ప ఆనాటికలో సందర్భం రాణించదు అది శబ్దం ద్వారా సూచించ గలిగేది కాదు.

బి.బి.సి చరిత్రలో ఎక్కువసార్లు ప్రసారామయి, చాలా గొప్పగా రాణించిన. అతి చక్కని, చిన్న నాటిక "సారీ, రాంగ్ నెంబర్ ప్లీజ్" లేడీ గ్రిగరీ అనే ఆమె వ్రాసింది. సరైన రేడియో నాటికకి దీన్ని మచ్చు తునకగా చెప్పుకుంటారు. ఊరు శివార్లలో ఉన్న ఒక ఇంట్లో మంచం మీద నుంచి లేవలేక ఒక స్త్రీ నరాల బలహీనత, ఆశక్తత రోగం అన్నీ ఉన్నాయి. అదొక శనివారం. భర్త 60 మైళ్ల దూరంలో ఉద్యోగానికి వెళ్లాడు. తిరిగి రావాలి. తన దగ్గర పనిచేసే నర్సుకి ఆరోజు సెలవు. ఆమెలో కంగారు ఎక్కువైంది. భర్త ఆఫీసుకు ఫోను చేస్తుంది. ఇప్పుడు నాటిక ప్రారంభమైంది. ఆపరేటరు ఏదో తప్పుడు లైను ఇచ్చింది. ఆలైనులో ఇద్దరు గొంతులు ఒకావిడని ఆ రాత్రి హత్య చేయాలని కూడబలుక్కుంటున్నారు. ఆమెకు కంగారు ఎక్కువైంది. టెలిఫోన్ డిపార్టు మెంటుకు ఫిర్యాదు చేసింది. కాని తప్పుడు లైను ఎలా పట్టుకోవడం? ఆమె కంగారు మరింత ఎక్కువైంది. చివరికి ఆమె ఇంట్లోనే ఆ ఇద్దరు ప్రవేశించి ఆమెనే హత్య చేస్తారు. భర్తే ఆ హత్యకి పథకం వేశాడు. చివరలో భర్త ఫోను చేశాడు. హంతకుడు ఒకడు "సారీ రాంగ్‌నెంబర్ ప్లీజ్" అన్నాడు. పని ముగిసిందనటానికి అది సంకేతం. ఇది

నూటికి నూరు పాళ్లు రేడియో నాటిక. టెలీఫోను డైల్ చేయడం ఆపరేటర్ గొంతు, పోలీసుల గొంతులు, భర్త గొంతు, హంతకుల గొంతులు ఇంతే వినిపించేది. అన్నీ కలిపి మనకి ఒక కథని, ఒక సందర్భాన్ని చెపుతాయి.

రేడియో నాటిక రాణించడానికి తప్పనిసరిగా శ్రోత తెలివితేటలు, గ్రహణ శక్తి అవసరం. అది రేడియో నాటిక డినూండు. శ్రోత ఊహని ఎంత తెలివిగా, ఎంత చురుకుగా, ఎంత తేలికగా రెచ్చ గొట్టగలిగితే ఆ మేరకి ఆ నాటిక రుచి ఆ శ్రోతకి పెరుగుతుంది. తనని ఆ సూత్రం ఆలోచింపచేసినందుకు శ్రోత ఆనంధ పడతాడు. తనని సరిగా ఊహింప చేసిన రచయిత, ప్రయోక్తకి కృతజ్ఞత చూపిస్తాడు. ఆ నాటిక మీద అతని శ్రద్ధ ఆమేరన కలుగుతుంది. కేవలం చెవిన వ్యాపించిన శబ్దంద్వారా ఆ పరిసరాలు, పాత్రల వయస్సులు, వాళ్ళ మనోప్రవృత్తులు, వాళ్ల కదలికలు-ఒకటేమిటి నాటిక చెప్పవలసిన సమస్తం శ్రోతకి చేరాలి. **The listeners' interest is directly proportional to what is left unsaid and limited .**

ప్రక్క గదిలో హంతకుడు ఉన్నాడు. భార్యా భర్తలు తప్పించుకోవ డానికి శతధా ప్రయత్నం చేస్తున్నారు. ఏ క్షణానైనా ఆ హంతకుడు లోనికి రాగలడు. కేవలం తలుపు చప్పుడు మనిషి ఊపిరి, కాలి అడుగులు ఏదైనా క్రొత్త అర్థాన్ని ఉత్కర్షని కలిగిస్తాయి.

ఒక బండ గుర్తు, రేడియోలో వినిపిస్తూ రాణించగల గొప్ప నాటిక ఎంత ప్రయత్నించినా దృశ్య నాటికగా పనికిరాదు. వినిపించే నాటిక శ్రోత మనసులో రూపం దిద్దు కుంటుంది. రచయిత, ప్రయోక్త శక్తి మేరకు శ్రోత సంస్కారం, ఆలోచన, ఊహ మేరకి ఎంత మహత్తరమైన రూపమైనా దాలుస్తుంది. అపూర్వమైన రేడియోనాటిక ఉత్తమమైన శ్రోత మనస్సులో కనిపించని 'తాజ్‌మహల్'. ఊహకి హద్దులు లేవు. అలానే శ్రోత మనస్సులో చోటు చేసుకునే భావనకి, వేసే ముద్రకి హద్దులు లేవు. ఇంత గొప్ప **dimention** , ఇంత తక్కువ పరికరాలు (కేవలం శ్రవణేంద్రియం ద్వారా) ద్వారా సాధించగలిగిన ఒకే ఒక్క ప్రక్రియ రేడియో నాటిక. అయితే ఇది ఎంత విస్తృతమో, అంత కష్ట తరం. **Appeal** ఎంత గొప్పగా ఉండగలగదో అది సాధించలేకపోతే అబ్బూరి వారి సూచిన మేరకు రేడియో మూసేసే అవకాశం ఉంది.

కేవలం శబ్దం ద్వారా మాత్రమే శ్రోతకు చేరుతున్న కారణం వలనే రేడియో నాటికలో ఫాంటసీలు, ఊహా చిత్రాలు, ప్రాణంలేని వస్తువులని **animate** చేయడం సుసాధ్యం. ఈ అవకాశం దృశ్య నాటికలో లేదు. కేవలం **symbolise** చేసి ఏదో ఒక దృశ్య రూపాన్ని యివ్వగలిగితే తప్ప. ఉదాహరణకి-మృత్యువు. దృశ్య నాటికలో మృత్యువుకి ఆరూపం యిస్తాం. అలాగే ప్రేమ, వృద్ధాప్యం ఇలాగా. నా 'మృత్యువు ఆత్మ హత్య' ఆ రోజుల్లో మదరాసు కేంద్రం నుంచి జనమంచి రామకృష్ణగారు చాలా హృద్యంగా ప్రసారంచేశారు. అందులో కొడుకుని చంపుకొన్న వృద్ధురాలు పాత్ర శ్రీమతి కొమ్మూరి పద్మావతీ దేవి గారు వేసినట్టు గుర్తు. నేను అనిసెట్టి సుబ్బారావుగారి 'క్ర చెప్పులు' అనే నాటికను ప్రసారం చేశాను. రేడియో మీడియంను దృష్టిలో పెట్టుకొని మంచి రచనలు చేసినవారిలో ఆరోజుల్లో గోరా శాస్త్రిగారు ఒకరు. అనిశెట్టి సుబ్బారావుగారు రేడియో మీడియంను కాచి వడపోసారు. ఆయన వన్ని **typical** రచనలు. ఎన్నో రచనలు వారి చేత వ్రాయించిన అవకాశంవాడి. అలాగే, శ్రీ శ్రీ, పాల గుమ్మి పద్మరాజు గారు ఇలా కొంత మందిని చెప్పవచ్చు. ఆరుద్ర గారి 'దేవుని ఎదుట' మంచి రేడియో నాటిక. మేం ఆంధ్రా యూనివర్శిటీలో చదివే రోజుల్లో కూర్మా వేణుగోపాల స్వామి గారు మాచేత స్టేజి మీద వేయించారు కూడా.

తన దైనందిన జీవితంలో అన్ని రకాల సమస్యలతో సతమతమవుతూ తన ఇంట్లో, తన గదిలో వెయ్యి ఆలోచనల మధ్య ఉన్న శ్రోతలు చొక్కాపట్టుకొని రేడియో దగ్గరకు లాక్కొచ్చి, అతని ఊహలు తలుపులు తెరచి మరే ఆలోచనకు కూడా తావివ్వకుండా తాను ఆశించిన అనుభూతిని అతని మనస్సుకి- అతని సంస్కారం అందుకునేంత సూటిగా అందించే అతి క్లిష్టతరమైన ప్రయోగం రేడియో నాటిక. ఇది పెద్ద ఛాలెంజ్. దీనికి ప్రథమ తాంబూలం రచయితది. తరువాత ప్రయోక్తది. రేడియో నాటిక శ్రోత మనస్సులో నిలదొక్కుకునేటట్టు చేయడం అసిధార వ్రతం లాంటిది. కాని అలా నిలిచిన రచనలు-ఆమనస్సులో నిలిచినట్లు మరి ఏఅనుభూతి నిలవదు. కళ్ల ముందు కనిపించే తాజ్‌మహల్ కన్న మనస్సులో మన ఊహలు మేరకు కొత్త అందాలు దిద్దుకున్న తాజ్‌మహల్ ఏనాటికైనా గొప్పది. ఏదో రేడియో నాటిక శ్రోతల మనస్సులో పునాదులు వేసుకుని కనిపించని తాజ్‌మహల్.

# ఆంధ్ర నాటకరంగంలో
# పౌరాణిక, చారిత్రిక నాటకాలు

డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

మనకు ఈనాడు కనిపించే నాటకరంగం ప్రారంభం 114 సంవత్సరాల క్రితం జరిగింది. పండితులకు తప్పా పామరుల్కకు అర్థం కాని ఆనాటి సంస్కృత నాటకాలు మినహా తేట తెలుగులో నాటకాలంటూ లేవు.

ఆనాటి ప్రజాసామాన్యానికి అందు బాటులో వున్న కళారూపాలు జానపదకళా రూపాలు మాత్రమే . ఆంధ్రదేశంలో ఆనాటికి చెప్పుకోదగిన నాటక కళాభివృద్ధి ఇంత మాత్రమే. దేశమంతా బ్రిటిష్ వారి బానిసత్వంతో మ్రగ్గిపోతూన్న రోజులవి. అంతకు ముందు అభివృద్ధి పొందిన కళా సాంప్రదాయమంతా ధ్వంసం అయి పోయింది.

1880 ప్రాంతాల్లో మహారాష్ట్ర ధార్వాడా కంపెనీ వారు దక్షిణ దేశసంచారం చేస్తూ ఆంధ్ర దేశానికి వచ్చారు. వీరి నాటకాలంటే వాడ వాడలా ప్రజలు కదిలి వచ్చేవారు. విద్యాధికులూ, కవులూ, కళాప్రియులూ ప్రదర్శనాలకు హాజర య్యేవారు. ధార్వాడా వారు క్రమ శిక్షణతో నాటకాలను ప్రదర్శించటమే కాక ఎన్నో అపూర్వమైన అద్భుతాలను చూపించి ప్రజలను ఆకర్షించారు. ఆంధ్ర నాటక రంగంలో తొలి దశలో ఎంతోఉత్సాహాన్ని పట్టుదలనూ కలుగ జేసింది మహారాష్ట్ర ధార్వాడా కంపెనీయే. ఆనాడే ఆంధ్ర నాటకరంగానికి అంకురార్పణ జరిగింది. ఆనాడే ఆంధ్రదేశంలో నాటక సమాజాలు వెలిశాయి.

ధార్వాడావారి క్రమశిక్షణనూ, కట్టుబాటునూ నేర్చుకున్నారు. ఈ విధంగా ధార్వాడావారు ఆంధ్రనాటకరంగానికి తొలి వెలుగు ప్రసాదించారు. ఆ వెలుగులో విజయనగరం, విజయవాడ, విశాఖపట్టణం, కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, బందరు, నెల్లూరు, బళ్ళారి, గుంటూరు, తెనాలి, మొదలైనచోట్ల ఎన్నో ఔత్సాహిక నాటక సమాజాలు ప్రారంభమైనాయి.

కాని వారు ప్రదర్శించటానికి నాటకాలేవి? అభినయాన్ని గూర్చి తెలియచెప్పే, అనుభవజ్ఞులేరి? ఎవ్వరూ లేరు కాని కొన్ని సంస్కృత నాటకాలూ, భరత ముని నాట్య శాస్త్రమూ ఆధారంగా కొంత అనుభవాన్ని సంపాదించి ధార్వాడా వారి అడుగు జాడల్లో ప్రారంభంలో హిందీ నాటకాలను ప్రదర్శించారు. అన్ని పట్టణాల్లోనూ నాటకోత్సాహం వెల్లి విరి సింది. బందరు వాస్తవ్యులు నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రి ఎన్నో హిందీ నాటకాలను రచించారు.

ఆధునిక విమర్శకులు నాటకాలను నాలుగు రకాలుగా విభజించారు. అవి పౌరాణిక నాటకాలు, చరిత్రాత్మక నాటకాలు. జానపదనాటకాలు, సాంఘిక నాటకాలుగా అవి ప్రచారంలోకి వచ్చాయి.

**పౌరాణిక నాటకాలు :–** ఆనాడు సంస్కృత పౌరాణిక నాటకాలను ఆంధ్రీకరించటంలో ఒకరి కొకరు పోటీ పడి ఒక కథను ఒకే నాటకాన్ని అనేక మంది రచయితలు వ్రాసినట్లు తెలుగులో వ్రాసిన స్వతంత్ర నాటకాలను కూడా అనేక మంది ఒకేకథను నాటకాలుగా వ్రాశారు. అలా వ్రాయటానికి కారణం ఒకరినొకరు మించిపోవలెనని గానీ లేక ఆయా కథల మీద నున్న అభిమానంతో కాని వ్రాసి వుండవచ్చు. అలా ఎన్నో నాటకాలను ఎంతో మంది రచయితలు వ్రాశారు. ఈ నాటకాలను ఆనాటి ప్రసిద్ధ నటులు నటించగా ఎంతో ప్రజాభి మానాన్ని అందుకున్నాయి.

### హరిశ్చంద్ర

ఈ నాటకాన్ని కొండుభొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి వచనంలో వ్రాశారు. కందుకూరు వీరేశలింగం, వడ్డాది సుబ్బారాయుడు, ధర్మవరం కృష్ణమా చార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, నాదెళ్ళ పురుషోత్తమకవి, బలిజేపల్లి లక్ష్మీ కాంతం కవి, మంత్రి ప్రెగ్గడ భుజంగరావు, మల్లాది విశ్వనాథ శర్మ మొదలైనవారు రచించారు. అయితే ఇందులో బలిజేపల్లి వారి హరిశ్చంద్ర నాటకం ఆనాటి నుంచి ఈనాటి వరకూ బహుళ ప్రజాదరణ పొందింది. ఆనాటి డి.వి. సుబ్బారావు అద్దంకి శ్రీ రామమూర్తి, హరిప్రసాదరావు మొదలైనవారు హరిశ్చంద్ర పాత్రలో ఎంతో ప్రఖ్యాతి వహించారు.

**ప్రహ్లాద :–** ప్రహ్లాద నాటకాన్ని కందుకూరు వీరేశలింగం , ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, బండ్ల సుబ్రహ్మణ్యం మొద లైనవారు రచించారు. వీరిలో ధర్మవరం



డా. గోవిందరాజుల సుబ్బారావు

వారి ప్రహ్లాద నాటకాన్ని ఆ రోజుల్లో ప్రదర్శించారు.

## సావిత్రి

ఆంధ్ర ప్రజలను ఉర్రూత లూగించిన నాటకాలలో సావిత్రి నాటకం ముఖ్యమైంది. ఆనాడు అనేక నాటక సమాజాలు ఈ నాటకాన్ని ప్రదర్శించాయి. ఈ నాటకాన్ని ధర్మవరం రామకృష్ణమాచార్యులు - శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రి, పసుమర్తి యజ్ఞ నారాయణ శాస్త్రి మల్లాది విశ్వనాథ శర్మ, ద్రోణంరాజు సీతారామారావు మొదలైవారు రచించారు. వీరిలో శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రి గారి సావిత్రి నాటకాన్ని మైలవరం బాలభారతీ నాటక సమాజం వారు ఎంతో ప్రచారంలోకి తెచ్చారు. ఈ నాటకంలో కపిలవాయి , నిడుముక్కల, యడదర్లి, గురజనాయుడు అద్భుతంగా నటించారు.

అలాగే మోహినీ రుక్మాంగద నాటకాన్ని ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, భేతపూడి భగవంతరావు మొదలైనవారు రచించారు.

ధర్మవరం కృష్ణమాచార్యులు, వేదం వెంకటరాయ శాస్త్రి, ఉషాపరిణయం నాటకాన్నీ. ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, గిరిజా కల్యాణం నాటకాన్నీ.

ధర్మవరం, కోలాచలం, చంద్రహాస నాటకాన్నీ

అలాగే, పాతాళభేది సుబ్రహ్మణ్యం- భేతపూడి భుజంగరావు, కోలాచలం, ధర్మవరం మొదలైన వారు వరూధిని నాటకాన్నీ

పానుగంటి లక్ష్మీ నరసింహం - కోలాచలం, ధర్మవరం, దుర్భాకరాజశేఖర శర్మ - సీతా స్వయంవర నాటకాన్ని.

ధర్మవరం, కోలాచలం, పానుగంటి, జనమంచి శేషాద్రి శర్మ, పాతాళభేది సుబ్రహ్మణ్యం, పాదుకాపట్టాభిషేక నాటకాన్ని.

పసుమర్తి యజ్ఞ నారాయణ, కోలాచలం, ధర్మవరం, లంకాదహన నాటకాన్ని.

కోలా సుబ్రహ్మణ్య శాస్త్రి, కోలా శ్రీనివాసరావు, మల్లాది విశ్వనాథ శర్మ, కాశీనాధుని వీరమల్లయ్య, విష్ణు భొట్ల సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి, రామ నారాయణ కవులు, లవకుశ నాటకాన్ని.

అలాగే కోలాచలం శ్రీనివాసరావు, మల్లాది అచ్యుతరామశాస్త్రి, ద్రౌపదీ వస్త్రాపహరణ నాటకాన్ని.

సుసర్ల ఆనందరావు, జనమంచి శేషాద్రిశర్మ, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, మొదలైనవారు పాండవాజ్ఞాతవాసం నాటకాన్ని

వనప్పాకం శ్రీనివాసాచార్యులు, కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి, కాళ్ళకూరి నారాయణరావు, (పద్మవ్యూహం) పై రచయితలు - సైంధవ వధ నాటకాన్నీ.

కీచక వధ నాటకాన్ని - విశ్వనాథ సత్యనారాయణ -నర్తనశాల గానూ, చిలకమర్తి లక్ష్మీ నరసింహం కీచకవధ నాటకంగానూ రచించారు.

అలాగే చిలకమర్తి లక్ష్మీ నరసింహం, మారేపల్లి రామచంద్ర శాస్త్రి, నాదెళ్ళ పురుషోత్తంగార్లు పారిజాతాపహరణం



బళ్ళారి రాఘవ

నాటకాన్ని రచించారు.

ప్రభావతీ ప్రద్యుమ్న నాటకాన్ని తిరుపతి వెంకట కవులు, హెూతా వెంకటప్పయ్య రచించారు.

కళా పూర్ణోదయ నాటకాన్ని శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, ఘట్టి లక్ష్మీనరసింహం శాస్త్రి, పరాశరం వెంకట కృష్ణమాచార్యులు రచించారు.

## భారత నాటకాలు

ఇతర నాటకాలతోపాటు ఆంధ్ర నాటక రంగంలో భారత గాథలకు సంబంధించిన నాటకాలు అశేష ఆంధ్రజనాల్ని అలరించాయి. వాటిలో ముఖ్యంగా తిరుపతి వెంకట కవుల నాటకాలు విశేష ప్రఖ్యాతిని సంతరించుకున్నాయి.

వాటిలో పాండవ జననం, పాండవరాజసూయము -పాండవ ప్రవాసము - పాండవోద్యోగము- పాండవ విజయము. పాండవాశ్వమేధము. వీటిలో అఖండ ప్రఖ్యాతి వహించిన నాటకం పాండవోద్యోగం.

అలాగే ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు పాంచాలీ స్వయంవరము, యుధిష్ఠర యౌవరాజ్యం, బృహన్నల, ఘోషయాత్ర, ప్రమీలార్జునీయం మొదలైన వాటిని వ్రాశారు.

**రామాయణ నాటకాలుః**— భారత నాటకాలు ప్రేక్షకులచే ఎలామన్నన



వేదం వెంకటరాయ శాస్త్రి

పాండాయో, రామాయణ నాటకాలు కూడ అంత పేరును తెచ్చుకున్నాయి. పానుగంటి లక్ష్మీ నరసింహంగారు, కల్యాణ రాఘవము, విజయ రాఘవము, వనవాస రాఘవమును వ్రాశారు. దుర్భాక రాజశేఖర కవి, సీతాపహరణము, జనమంచి శేషాద్రి శర్మ, శ్రీ రామవనవాసము వ్రాశారు.

కృష్ణుని గాథలకు సంబంధించిన నాటకాలలో రాధాకృష్ణ నాటకాన్ని పానుగంటి లక్ష్మీ నరసింహం, శ్రీకృష్ణ తులాభార నాటకాన్ని ముత్తరాజు సుబ్బారావు, రచించారు. తులాభారం నాటకం ఆంధ్రదేశం నాలుగుచెరగులా ప్రదర్శింపబడి ప్రజా మన్ననలను అందుకుంది. ఈ విధంగా పౌరాణిక నాటకాలు ప్రఖ్యాతి వహించాయి.

## చారిత్రిక నాటకాలు

విజయనగరం గజపతి రాజులకూ, బొబ్బిలి వెలమవీరులకూ సంబంధించిన, బొబ్బిలి యుద్ధం నాటకాన్ని ఎంతోమంది రచించారు. వారిలో కాళ్ళకూరి సాంబశివరావు, వేదం వేంకట రాయశాస్త్రి, శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి, జలకాని వెంకట సూర్యారావు, కోటగిరి వెంకట కృష్ణారావు, శేషాద్రి రమణకవులు, బుర్రా శేషగిరిరావు, భాగవతుల నరసింహశర్మ మొదలైనవారు రచించారు. ఈ నాటకాలలో ప్రదర్శనానికి నోచుకున్న నాటకాలు, వేదం వేంకట రాయశాస్త్రి, శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారి నాటకాలనే ప్రదర్శించారు.

## పల్నాటి వీర చరిత్ర

పలనాటి వీరుల చరిత్రను గూర్చి వారి పౌరుషాలను గూర్చి ఆంధ్రదేశంలో తెలియని వారెవరూ లేరు. ఈ నాటకాన్ని రచించిన వారిలో ప్రముఖులు ఉన్నవ లక్ష్మీ నారాయణ (నాయకురాలు) నావిలాల సోమయాజులు, వంగనాముల రామచంద్రరావు, ప్రభులింగా చార్యులు మొదలైనవారు రచించారు. ఉన్నవ వారి నాయకురాలు నాటకాన్ని ఆయా సమాజాలు ప్రదర్శిచాయి.

## సారంగధర

తూర్పు చాళుక్య వంశానికి సంబంధించిన రాజ రాజ నరేంద్రుడు, చిత్రాంగి, సారంగధరుల గాథ ఈ నాటకాన్ని ఆంధ్రదేశంలో ఆయా నాటక సమాజాలు ప్రముఖ నటులతో విస్తృతంగా ప్రదర్శింపబడింది. ఈ నాటకాన్ని ధర్మవరం కృష్ణమాచార్యులు, పానుగంటి లక్ష్మీ నరసింహం, విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి, నాదెళ్ళ పురుషోత్తమ కవి, గుడిపాటి వెంకటచలం (వచనంలో) ఉపద్రష్ట వెంకట సీతారామయ్య వచనంలో రచించారు, వీరిలో ధర్మవరం వారి సారంగధర, పానుగంటి వారి సారంగధర నాటకాలు మాత్రమే ప్రముఖంగా ప్రదర్శించబడ్డాయి.

## శివాజి, రోషనార

మహారాష్ట్రకు సంబంధించిన శివాజి - రోషనారకు సంబంధించిన గాథను ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, వనప్పాకం శ్రీనివాసాచార్యులు, కొప్పరపు సుబ్బారావు కందాడి శ్రీనివాసన్ మొదలైనవారు రచించారు. వీటిలో కొప్పరపు సుబ్బారావు గారి రోషనార నాటకాన్ని తెనాలి రామవిలాస సభవారు అజ్ఞాతంగా ప్రదర్శించారు. అయితే హిందూ ముస్లిం విభేదాలను రెచ్చగొడుతుందనే సాకుతో నాటి బ్రిటిష్



పానుగంటి లక్ష్మీనరసింహారావు

ప్రభుత్వం నిషేధించింది.

## చంద్ర గుప్త నాటకాన్ని

పానుగంటి లక్ష్మీ నరసింహం - ఉసుర్ ఆలీషా, ముత్తరాజు సుబ్బారావు గార్లు రచించారు. అయితే ఈ నాటకాన్ని పెద్దగా ప్రదర్శించిన ఆధారాలు మనకు లేవు. కారణం ఉత్తర హిందూ స్థానానికి సంబంధించిన కథ కావటమే.

రాణా ప్రతాప్ లేక చిత్తూరు ముట్టడి - నాటకాన్ని వేదుల సత్యనారాయణ శాస్త్రి, గుండిమెడ వెంకట సుబ్బారావు, చంద్రమౌళి చిదంబర రావు గార్లు రచించారు. ఈ నాటకం పఠన యోగ్యం గానే మిగిలిపోయింది. అలాగే అనార్కలి, సలీం ప్రేమగాథకు సంబంధించిన ఈ నాటకాన్ని విశ్వనాథ సత్యనారాయణ, బి.వి. నరసింహారావు గార్లు రచించారు. ఈ నాటకాల్లో బి.వి. నరసింహారావుగారు సలీం పాత్ర ప్రదర్శించి గొప్ప పేరు తెచ్చు కున్నారు.

అలాగే బల్హణీయాన్ని బులుసు వెంకట కవి, మారేపల్లి రామచంద్ర శాస్త్రి, ఖడ్గ తిక్కన వధుల చింతామణి శాస్త్రి, నండూరి బంగారయ్య గార్లు రచించగా సక్కుబాయి నాటకాన్ని, ముల్లాది అచ్యుత రామశాస్త్రి మరికొందరు రచించారు. అయితే, అచ్యుత రామశాస్త్రి గారి నాటకం తుంగల చలపతిరావు,జొన్న విత్తుల దైతా గోపాలం బృందం ఆంధ్రదేశమంతటా

ప్రదర్శించి అఖండమైన పేరు ప్రఖ్యాతుల్ని సంపాదించింది.

## ఇతరులు వ్రాసిన, చరిత్రాత్మక నాటకాలు

ప్రతాపరుద్రోదయాన్ని, వేదం వేంకట రాయశాస్త్రి - ఇచ్ఛాపురం యజ్ఞ నారాయణ శాస్త్రి రసపుత్ర విజయాన్ని కోలాచలం శ్రీనివాసరావు రామరాజ్య పతనాన్ని మైసూరు రాజ్యాన్ని ధర్మవరం గోపాలాచార్యులు, రామదాసు నాటకాన్ని గుండిమెడ వెంకట సుబ్బారావు, ఖిల్జీ రాజ్య పతనం, మేవాడ పతనం, నాటకాన్నీ వేలూరి శివరామ శాస్త్రి మాధవవర్మ నాటకాన్ని కోటగిరి వెంకట కృష్ణారావు, పాదుషా పరాభవము, తిరుపతి కవులు పండిత రాజము, శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి, భోజరాజ విజయము, శ్రీనాథ కవిరాజీయము, రామరాజుపుండరీకాక్షుడు, గాంధీ విజయము, బుద్ధ నాటకాన్ని దాసు శ్రీ రాములు, పానుగంటి లక్ష్మీ నరసింహం మొదలైనవారు రచించారు.

## బెంగాలీ చారిత్రిక నాటకాలు

మన ఈ నాటక రచయితలు, ఇతర భాషలకు సంబంధించిన చారిత్రిక నాటకాలను కూడా అనువదించారు. అలా అనువదించిన వారిలో బెంగాల్‌కు చెందిన ద్విజేంద్రలాల్ రాయ్ నాటకమైన చంద్రగుప్త (లేక) ప్రచండ చాణక్యము నాటకాన్ని శ్రీపాద కామేశ్వరరావు గారు రచించారు. అలాగే దుర్గాసు నాటకాన్ని - జంధ్యాల శివన్న శాస్త్రి, నండూరి శివరావుగార్లు అనువదించారు. షాజహాన్ నాటకాన్ని - జొన్నలగడ్డ సత్యనారాయణ, భాగవతుల నరసింహశర్మ ఆంధ్రీకరించారు.

ఇంకా అనేక మంది షేక్స్పియర్ నాటకాలను తెలుగులోకి అనువదించారు.

## పౌరాణిక చారిత్రిక, నటులు

నాటి పౌరాణిక, చారిత్రిక నాటకాలలో ఎందరో మహానటులు, ఎన్నెన్నో మహా పాత్రలను ధరించారు. కొందరు కొన్ని పాత్రలకు పరిమితమై అఖండమైన పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు. ఆయా నాటకాలలో ఆయా నటీ నటులు ఏయే పాత్రలను ఏలా అభినయించారో వివరించాలంటే స్థలాభావం వల్ల వారి పేర్లు మాత్రమే ఉదహరిస్తూ వున్నందుకు విచారిస్తున్నాను.

## మహానటులు

ఈ తరం వారెవరికీ తెలియని ఆ మహానటులు హరిప్రసాదరావు, యడవల్లి సూర్య నారాయణ, కందాడై శ్రీనివాసన్, నెల్లూరు నగరాజారావు, తాడిపత్రి రాఘవాచార్యులు, ఈవెనలక్ష్మణస్వామి, ముంజులూరు కృష్ణారావు, గోవింద రాజుల సుబ్బారావు, మాధవపెద్ది వెంకట రామయ్య, గురజనాయుడు, డి.వి. సుబ్బారావు, మల్లాది గోవింద శాస్త్రి, వెంపటి వెంకటేశ్వర్లు, వెదురు మూడి శేషగిరిరావు, రేచర్ల కోటరంగారావు, రామాయణం సర్వేశ్వరశాస్త్రి, అద్దంకి శ్రీరామమూర్తి, ఎనముండ్ర శీనయ్య, పింగళి లక్ష్మీకాంతం, ముప్పిడి జగ్గరాజు, ఉప్పలూరి సంజీవరావు, స్థానం నరసింహారావు, పారువల్లి సుబ్బారావు, కె.యస్. వాసుదేవరావు, కె. శ్రీనివాసాచారి, జొన్న విత్తుల శేషగిరి రావు, కపిలవాయి రామనాథ శాస్త్రి, సి.యస్.ఆర్. ఆంజనేయులు, కె. రఘురామయ్య, తుంగల చలపతిరావు, పర్వత రెడ్డి రామచంద్రారెడ్డి, వంగల ఆంజనేయులు, వెంపటి వెంకటేశ్వర్లు మొదలైన ఎందరో మహానటులు, మహోన్నత పాత్రలను పోషించారు.

## సురభి వారి పౌరాణిక నాటకాలు:

ఆంధ్ర నాటక రంగంలో అత్యంత ప్రాముఖ్యం వహించేవి సురభి నాటకాలు. ఆంధ్రదేశంలో నాట్య కళలనే వృత్తిగా పెట్టుకుని కుటుంబాలతో సహా నాటకాలు ప్రదర్శిస్తూ ఊరూరా నాటకాలు ప్రదర్శించే వీరు ఆంధ్రులకు చిరకాలపరిచితులు, ఆంధ్ర నాటక రంగ చరిత్రలో వారి నాటకాలకు ఎంతో ఉన్నత స్థానం వుంది.

సురభి వారు ఎన్నో పౌరాణిక, చారిత్రిక జానపద నాటకాలను ప్రదర్శించారు. వారి ప్రథమ నాటకం కీచక వధ, రాప్తాటి సుబ్బదాసుగారు హరిశ్చంద్ర, శాకుంతలం, సారంగధరనూ, మారేపల్లి రామచంద్రశాస్త్రి, పారిజాతాపహరణం, బిల్హణీయం. శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రి శూర్పణఖ గర్వభంగం కాంతామతి - తడకలూరి కుప్పుస్వామి, మైరావణ భల్లాణ చరిత్రి - మల్లాది అచ్యుత రామశాస్త్రి జగన్మోహన - కె. సుబ్రహ్మణ్య శాస్త్రి సంపూర్ణ మహా భారతం, చిలకమర్తి, సీతా కల్యాణం, విశ్వనాథ కవిరాజు సతీ సావిత్రి, సత్యహరిశ్చంద్ర మహానంది కృష్ణావతారం, లవకుశ-వసంతసేన మొదలైన అనేక మంది రచయితలు వ్రాసిన, పౌరాణిక, చారిత్రిక నాటకాలను ప్రదర్శించారు.

## ప్రసిద్ధ, సురభి నటీ నటులు

సురభి నాటకాలలో వనారస గోవిందరావు, వనారస పెద్ద రామయ్య, చిన్న రామయ్య, అవేటి నాగేశ్వరరావు, అవేటి బాబారావు, కృష్ణాజీరావు, అబ్బాజీ రావు, పుల్లయ్య, రామచంద్రరావు, పాపారావు, సురభి పాపాబాయి, సురభి కమలాదేవి, వనారస లక్ష్మమ్మ, అవేటు పూర్ణిమ, సురభి బాలసరస్వతి, ధనలక్ష్మి, శకుంతలాదేవి, కోటేశ్వరీ దేవి, సత్యవతి, నాగలక్ష్మి, వసుంధరాదేవి; నవరత్నం సుభద్ర, అనసూయ వెంకటరావు మొదలైన కొన్ని వందల మంది స్త్రీ పురుష కళాకారులు, వారి పౌరాణిక, చారిత్రిక, కాటకాలలో ప్రముఖ పాత్రలు ధరించి, ఆంధ్ర ప్రేక్షకుల హృదయాలలో నిలిచిపోయారు.

• • •

# తెలుగు సినిమా ఆవిర్భావం-పురోగతి

పి.ఎస్.ఆర్. ఆంజనేయ శాస్త్రి

"కాశీపట్నం చూడర బాబూ, గంగానదినీ చూడర బాబూ, కాలభైరవుని చూడర బాబూ, డుంఠి గణేశుని చూడర బాబూ, గంగాధరునీ చూడర బాబూ, కాశీ విశాలాక్షిని చూడర బాబూ" అంటూ కాశీ పట్నం పెట్టెలోంచి భూతద్దం వెనక కదిలిస్తున్న బొమ్మల్ని చూడ్డానికి ఆరోజుల్లో కానీ డబ్బు ఖర్చు చేసి ఏదో పెద్ద సంతోషం పొందిన వారు ఇప్పటికీ కొందరుండవచ్చు. ఇప్పుడు గ్రామ గ్రామానికీ ఆధునిక వినోదంగా 70 ఎం.ఎం., సినిమా స్కోప్ పద్ధతుల దాకా విరాట్రూపం తాల్చిన 'సినిమా'కు ఆ కాశీ పట్నం పెట్టె మూలం. కాశీ పట్నం పెట్టెను ఒక్కసారి ముగ్గురే చూడ గలిగేవారు. ముగ్గురు ప్రేక్షకులతో ప్రారంభమైన దృశ్య వినోదం ఇప్పుడు ఒకేసారి పదిహేను వందల మందిదాకా ఏకకాలంలో చూడదగిన సినిమా థియేటర్‌గా ఎదిగింది. థియేటర్‌కూ మూలం కాశీపట్నం పెట్టె!

తేదీ, నెల, సంవత్సరం, కచ్చితంగా చెప్పటానికి గట్టి ఆధారాలు లభ్యం కాకపోయినప్పటికీ మన దేశంలో కదిలే బొమ్మల్ని తెరమీద చూసే ప్రక్రియ 1895లో మొదలై 1897 నాటికి లూమియర్ బ్రదర్స్ పుణ్యమా అని సినిమా రూపం దాల్చింది.

ఆ విధంగా చూసుకుంటే రాబోతున్న 1995 వ సంవత్సరం భారత దేశంలో సినిమాకు శతాబ్ది సంవత్సరం! మూరేళ్ళ నాటక రంగంతో సన్నిహిత సంబంధం ఉన్న తెలుగు వారికి మూరేళ్ళ సినిమా రంగం తోనూ గట్టి సంబంధమే ఉంది.

తెలుగు సినిమా వికాసం రంగస్థల నటీనటులతోనే మొదలైంది.

చిన్న చిన్న బిట్లుగా తెరమీద చూసే చలన చిత్రాలకు పూర్తి నిడివి రూపం రావడానికి పందొమ్మిదొందల ఇర్వై వరకూ జరిగిన కృషి ఫలితంగా మూకీ సినిమాలు తయారయ్యాయి. మూకీ సినిమాలు మరో పదేళ్ళు కృషి తర్వాత టాకీలుగా పరిణమించాయి. ఈ పరిణామం 1931 నాటికి స్థిరరూపం ధరించింది.

తెలుగులో 1931లో తొలి టాకీ చిత్రం "భక్త ప్రహ్లాద" వచ్చింది. దానికి సృష్టికర్త హనుమంతప్ప మునియప్ప రెడ్డి - ఆయనే హెచ్. ఎం. రెడ్డి! 'శ్రీ కృష్ణా' బ్యానర్‌తో ఆ తొలి తెలుగు టాకీని బొంబాయి లోని ఇంపీరియల్ ఫిలిం స్టూడియోలో, ఆ స్టూడియో అధిపతి ఆర్దేషిర్ ఇరానీ సహాయ సహకారాలతో మునిపల్లె సుబ్బయ్య, సురభి కమలాబాయి తొలి తెలుగు సినిమా నాయక నాయకులుగా తెరకెక్కించిన ప్రముఖుడు హెచ్. ఎం. రెడ్డి: ఇప్పుడు బొంబాయి, మద్రాసు, హైదరాబాద్, బెంగుళూరు, కలకత్తా, భువనేశ్వర్ నగరాల్లో వ్యాపించిన ప్రసాద్ వ్యవస్థలకు మూలపురుషుడైన అక్కినేని లక్ష్మీ వరప్రసాద్ - ఎల్.వి. ప్రసాద్ - ఆ భక్త ప్రహ్లాద లో ఓ మొద్దబ్బాయి వేషం వేశారు. ఆ రకంగా తెలుగు చలన చిత్ర చరిత్రకు ఆద్యులు హెచ్. ఎం. రెడ్డి, మునిపల్లె సుబ్బయ్య, సురభి కమలాబాయి, ఎల్.వి. ప్రసాద్‌లు. ఈ నలుగురూ నాలుగు మూలలుగా తెలుగు తెర విస్తరించింది.

తెలుగువారి వార్తా వికాసానికి మొన్న మొన్నటి వరకూ తోడ్పడిన ఆంధ్ర పత్రికకు, తెలుగు వారి వినోద వికాసానికి జీవితంలో ఒక భాగంగా మారిపోయిన తెలుగు సినిమాకు ఆదిక్షేత్రం బొంబాయి కావడం విచిత్రం, విశేషం!

ఆ తొలి రోజుల్లో పౌరాణిక గాథలు, పౌరాణిక నాటకాలే సినిమాలకు ఇతి వృత్తాలు. రంగస్థల నటీనటులే నాటి సినిమాతారలు. ఇప్పటికీ రంగస్థలంతో ఏ కొంతైనా బాదరాయణ సంబంధం వున్నవారే సినిమాల్లోఉంటున్నారు. సినిమా ప్రక్రియకు మూల రూపం కాశీ పట్నం పెట్టె అయితే సినిమా నటనకు మాతృక రంగస్థలం. రాజకీయ పరిణామాల ప్రాబల్యం వల్ల ప్రజా నాట్యమండలి వారంతా ఒక్కొక్కరే సినిమాల్లో చేరిపోయిన నాటివరకూ తెలుగు సినిమాకు నాటక రంగమే ఒక ఫిలిం ఇన్‌స్టిట్యూట్. తర్వాత అనేకమైన ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లు ప్రభుత్వ ప్రయివేటు రంగాల్లో వెలిశాయి.

తెలుగు సినిమా తొలి కార్యక్రమ క్షేత్రాలు బొంబాయి, కొల్హాపూర్, కలకత్తాలు. హెచ్.ఎం. రెడ్డి 'భక్త ప్రహ్లాద' తీసినాక బొంబాయిలో తెలుగు సినిమా వాతావరణం ఏర్పడింది. అక్కడి సాగర్ టాకీస్ సంస్థ బాదామీ అనే పార్శీ దర్శకునితో యడవల్లి సూర్యనారాయణ నాటక బృందంతో 'శకుంతల' 'పాదుకా పట్టాభిషేకం' తీసింది -1932లో. ఇంపీరియల్ వారు ఆరణి సత్యనారాయణ, ఘంటసాల రాధా కృష్ణమూర్తి నటించిన

'రామదాసు' చిత్రాన్ని తీశారు.

అప్పటికే తెలుగు నాట మూకీ సినిమాన్ని ప్రదర్శించే సినిమాహాళ్ళు ఏర్పడ్డాయి. వీటికి మూలం రఘుపతి వెంకయ్య. ఆయన దగ్గర చిత్తజల్లు పుల్లయ్య (ప్రసిద్ధ దర్శకులు సి.ఎస్. రావు తండ్రి) సుమారు ఐదేళ్ళపైగా అనుభవం సంపాదించి సినిమా హాళ్ళను ఏర్పాటు చేసి ప్రజలకు కొన్ని వినోద కేంద్రాలుగా అవి పెంపొందటానికి ఉద్యమించడంతో పాటు టాకీల నిర్మాణానికి కూడా నడుం కట్టారు. ఆయన సి.ఎస్.ఆర్. ఆంజనేయులు, రామతిలకంతో కలకత్తాలో 'భక్తరామదాసు' తీశారు. నిర్మాణ కృషి నానాయాతనల పాలైతే విశాఖపట్నంలో వ్యాపారవేత్త గ్రంథి మంగరాజు – ఆరోజుల్లో పూర్ణయాత్రా స్పెషల్ ట్రెయిన్ నిర్వహిస్తూ కలకత్తా చేరి రావు బహదూర్ హరదత్ లాల్ మోతీలాల్ చమ్రియాతో మాట్లాడి ఆ చిత్రాన్ని బైటపడేయించారు. ఆ తర్వాత మంగరాజు తెలుగు నాట పూర్ణ పిక్చర్స్ పంపిణీ సంస్థను స్థాపించి పంపిణీ రంగానికి శ్రీకారం చుట్టారు.

సి. పుల్లయ్య, చమ్రియా సహాయంతో నిడుముక్కల సుబ్బారావు, వేమూరి గగ్గయ్య, రామతిలకం నటించిన 'సతీ సావిత్రి'ని రూపొందించారు. పౌరాణిక చిత్రాలు ముమ్మరించాయి. 'చింతామణి' నాటకాన్ని కాళ్ళకూరి నారాయణరావు మనుమడే కాళ్ళకూరి సదాశివరావు మదన్ థియేటర్స్ సహాయంతో పులిపాటి వెంకటేశ్వర్లు, రామతిలకం నటిస్తే సినిమాగా తీశారు. విజయవాడలో తొలి సినిమాహాలు మారుతీ సినిమాకు ఆద్యుడైన పోతిన శ్రీనివాసరావు, ఈలపాట రఘురామయ్య, పారుపల్లి సత్యనారాయణలతో సరస్వతీ సిని టోన్ వారికి 'పృథ్వీపుత్ర' (నరకాసురవధ) తీసిపెట్టారు.

అలా అలా గతుకులబాటలో నడుస్తున్న తెలుగు టాకీ పుల్లయ్య తీసిన 'లవకుశ' (పారుపల్లి సుబ్బారావు, శ్రీ రంజని) చిత్రంతో లాభాలార్జించటం ప్రారంభించింది. ఈ టాకీల్ని ప్రదర్శించడానికి మూకీ థియేటర్లే కేంద్రాలు కాబట్టి చిత్రంలోంచి శబ్దం వినిపించే సాధనాలను బెంగుళూరు, మద్రాసుల నుంచి తెచ్చి పెట్టుకొని ప్రదర్శించేవారు. టాకీలు ప్రారంభమైన నాలుగైదేళ్ళ దాకా థియేటర్లు లో ఇదే పద్ధతి.

సంపూర్ణంగా తొలి తెలుగు నిర్మాణ సంస్థ 1935లో ఏర్పడింది. అది మద్రాసులో వేల్ పిక్చర్స్. దాన్ని పి. వి. దాసు ప్రారంభించారు. ఆయన రామనాధ్, శేఖర్ లను చిత్రపు నరసింహారావును పిలిపించి మాస్టర్ కల్యాణ్, బెజవాడ రాజరత్నం నటించిన 'సీతా కళ్యాణం' నిర్మించారు. రఘుపతి వెంకయ్య అవార్డు గ్రహీత, అపార సంగీత ప్రజ్ఞానిధి అయిన సాలూరు రాజేశ్వరరావు 1935లోనే వేల్ పిక్చర్స్ వారి "కృష్ణ లీలలు" లో బాలకృష్ణుడుగా నటించారు. ఆ రోజుల్లోనే బి.వి. రామానందం (యశస్వి ఎస్వీ రంగారావు మేనమామ) తలపెట్టిన 'సతీ సక్కుబాయి' చిత్రాన్ని కలకత్తాలోని అరోరా ఫిలిం కార్పొరేషన్ తో కలిసి నిర్మించి తొలి తెలుగు మహిళా నిర్మాత కాగలిగింది దాసరి కోటిరత్నం. ఆంధ్ర సినీ టోన్ అనే విశాఖపట్నం సంస్థ 'భక్త జయదేవ' చిత్రాన్ని పూర్తి చేయలేని పరిస్థితులెదురైతే నటిగా దర్శకురాలుగా ఎడిటర్ గా తానే నడుం కట్టి తెలుగు మహిళా ప్రతాపాన్ని చూపి చిత్రాన్ని పూర్తి చేయించింది కమలాబాయి. బహుముఖ ప్రజ్ఞాశాలిగా పేరుతెచ్చుకున్న రఘుపతి వెంకయ్య అవార్డు గ్రహీత భానుమతీ రామకృష్ణ స్ఫూర్తికి కోటిరత్నం కమలాబాయి ఆద్యులు.

సి. పుల్లయ్య తర్వాత తెలుగు టాకీకి లాభాలార్జించి పెట్టిన వ్యక్తి సి.పుల్లయ్య. 'శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం' రెండు సార్లు తీసి (1939లో సి.ఎస్.ఆర్. ఆంజనేయులు, శాంత కుమారిలతో, 1960లో ఎన్టీరామారావు, సావిత్రి, శాంతకుమారి, వరలక్ష్మిలతో) కనకవర్షం కురిసేటట్లు చేశారు.

తెలుగు టాకీ నిలబడింది. ఈ లోగానే పౌరాణికాలనుంచి సాంఘికాలవైపు సినిమాను మళ్ళించాలని గూడవల్లి రామబ్రహ్మం 1936లోనే ప్రయత్నించినా సాగిరాలేదు.

ఆ రోజుల్లోనే సరస్వతీ ఫిలింస్ సంస్థ సి.ఎస్.ఆర్. ఆంజనేయులు, మాధవపెద్ది వెంకట్రామయ్య, కన్నాంబలతో హెచ్.వి. బాబు (హెచ్. ఎం. రెడ్డి అల్లుడు) దర్శకత్వంలో "ద్రౌపదీ వస్త్రాపహరణం" తీశారు. జగన్నాథ్ దర్శకత్వంలో "ద్రౌపదీ మానసంరక్షణ" తీశారు. ఒకే సమయంలో పోటీ చిత్రాలు రావడానికి ఇది నాంది పలికింది.

పి. పుల్లయ్య దర్శకత్వంలో కొచ్చెర్లకోట రంగారావు, రుష్యేంద్రమణి, కపిలవాయి రామనాథ శాస్త్రి నటించిన 'శ్రీ కృష్ణ తులాభారం' లో ఓ చిన్న పాత్ర – మిత్రవింద గా – కొన్నేళ్ళు చిత్ర ప్రపంచాన్ని, ప్రేక్షక ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన కాంచనమాలను పరిచయం చేశారు.

1940 నాటికి తెలుగు సినిమా కొంత స్థిరపడింది. రంగస్థల నటీనటుల నుంచి తెలుగు సినిమా ప్రొఫెషనల్ నటీనటులతో సినిమాలు తీసే సంధి సమయానికి చేరుకొంది. ఈ తరుణంలోనే తెలుగు ఫిలిం జర్నలిజం కూడా ప్రారంభమైంది. దానికి డాక్టర్ ఇంటూరి వెంకటేశ్వరరావు ఆద్యుడు.

ఇప్పటికి తెలుగు సినిమా వికాసంలో తొలి దశాబ్దం గడిచినట్లే. ఈ తొలి దశాబ్దంలో సినిమా కళాకారులుగా రాణించిన వారెవ్వరూ ఈ తరం వారికి తెలియని వారు కావడం వల్ల కొంత విపులత అవసరమైంది. తెలుగు సినిమా తొలి పదేళ్ళలోనూ ఎన్నో బాలారిష్టాల్ని ఎదుర్కొని నిలిచింది. ఆ నిలదొక్కుకోవడమే ఒక వికాసం.

ఈ తొలి దశలోనే కొన్ని ప్రయోగాలు కూడా జరిగాయి. బాలలతో తీసిన 'ధ్రువ-అనసూయ' లఘు చిత్రాలు వచ్చాయి. బాలలతో తీయడం ఒక ప్రయోగం. రెండు చిన్న సినిమాలు తీసి వాటిని కలిపి ఒక పూర్తినిడివి సమయానికి అనుకూలంగా విడుదల చేయడం మరో ప్రయోగం.

ఇంకో ప్రయోగం కూడా జరిగింది. వాద్రేవు కామరాజు, హైమవతి నటించిన "శ్రీ సత్యనారాయణ వ్రత మహాత్మ్యం" చిత్రం 8 వేల అడుగుల్లోనే తీశారు. అప్పట్లో సినిమా టికెట్టు రెండణా లుండేది. ప్రేక్షకుడికి అది పూర్తి సంతృప్తిని కలిగించేదనే ఉద్దేశంతో కాళ్ళకూరి హనుమంతరావు, సుందరమ్మ నటించిన 'కాసులపేరు', వాలి సుబ్బారావు, పుష్పవల్లి నటించిన 'చల్ మోహన రంగా' లఘు చిత్రాలు కలిపి 1938 లో విడుదల చేశారు.

ఈ తొలి దశాబ్దంలోనే రాజమండ్రిలో నిడమర్తి సూరయ్య దుర్గా సినీ టోన్ స్టూడియో పెట్టి 'దశావతారాలు' తీసి నష్టపోతే ఆ స్టూడియోను 'ఆంధ్ర టాకీస్' గా మార్చి పుల్లయ్య 'శ్రీ సత్యనారాయణ వ్రత మహాత్మ్యం" తీశారు.

ఇది పౌరాణిక చిత్రాల యుగం కాబట్టి సెట్స్‌కు ప్రాధాన్యం ఉండక తప్పదు. అడవి బాపిరాజు, బి.వి.ఎస్. శర్మ, మాధవపెద్ది గోఖలేలు ఆర్ట్ డైరక్టర్‌లుగా ముందంజ వేసిన యుగం కూడా ఇదే.

అలా, తెలుగు సినిమా తొలి దశాబ్దం ఎంతో కృషికి ఆటపట్టయింది.

1940లోపలే 'మాలపిల్ల' వచ్చింది. 1939లో 'అమ్మ', 'మళ్ళీ పెళ్ళి', 'రైతు బిడ్డ', 'వందేమాతరం', 'వర విక్రయం', వంటి సాంఘిక చిత్రాలు కూడా వచ్చాయి. పౌరాణికాల్లోంచి సాంఘికాల వైపు చిత్ర పరిశ్రమ మళ్ళుతున్న ధోరణులు కనిపించాయి. మొదటి పదేళ్ళలోనూ 62 తెలుగు సినిమాలు రావడం విశేషం. ఈ పౌరాణికాల మధ్యనే 1936లోనే 'ప్రేమ విజయం' అనే తొలి సాంఘిక చిత్రం రావడమూ విశేషమే!

1940-50 దశాబ్దం తెలుగు సినిమా వికాసంలో కొంత సాంఘిక రూపం కనిపించినప్పటికీ ఎక్కువ గా జానపద చిత్రాల యుగమనిపిస్తుంది. ఈ పదేళ్ళలో 86 తెలుగు సినిమాలు వచ్చాయి. వీటిలో పది పౌరాణిక చిత్రాలు కూడా వున్నాయి. 'బారిస్టర్ పార్వతీశం', 'బొండాం పెళ్ళి' వంటి సంపూర్ణ హాస్య చిత్రాలూ వచ్చాయి. సుమారు ముప్పయి దాకా సాంఘిక చిత్రాలున్నాయి. వాటిలో ప్రసిద్ధి చెందిన 'ఇల్లాలు', 'చదువుకున్న భార్య', 'జీవన జ్యోతి', 'తల్లిప్రేమ', 'దేవత', 'ధర్మపత్ని', 'తాసీల్దార్', 'స్వర్గసీమ', 'గృహప్రవేశం', 'ద్రోహి', 'మనదేశం' వంటివి వున్నాయి. మిగిలినవన్నీ జానపద చిత్రాలే. వాటిలో కూడా ప్రజాదరణ పొంది పేరు మోసిన 'మాలతీ మాధవం', 'చంద్రహాస', 'భక్తి...', 'బాలనాగమ్మ', 'చెంచులక్ష్మి', 'సంసార నారది', 'మాయలోకం', 'మాయా మచ్ఛీంద్ర', 'వాల్మీకి', 'నారదనారది', 'ముగ్గురు మరాఠీలు', 'గొల్లభామ', 'రత్నమాల', 'బాలరాజు', 'వింధ్యారాణి', 'కీలుగుర్రం', 'గుణ సుందరి', 'రక్షరేఖ', వంటివి వున్నాయి. ఈ దశాబ్దంలో పౌరాణికచ్ఛాయలతో జానపద చిత్రాలు తీశారు. 1941లో మహాత్మా గాంధీ అనే జాతీయవాద చిత్రం కూడా వచ్చింది. హీరో వర్షిప్‌కు ఆద్యులైన అక్కినేని నాగేశ్వరరావు, ఎన్టీ రామారావు అడుగు పెట్టిన దశాబ్దమిది.

తెలుగు సినిమా వికాసంలో రెండవ దశాబ్దం పౌరాణికాలు సన్నగిల్లి, జానపదాలు ముమ్మరించి, సాంఘిక చిత్రాలు క్రమంగా ఊపిరిపోసుకున్న సమయం. అంతకు మునుపు నటీ నటులే తాము నటిస్తూ పాట పాడుకునే పద్ధతిపోయి నేపధ్యగానం అంటూ ప్రారంభమైన దశాబ్దం ఇది. నేపధ్యగానం ఒక విభాగమైపోయి గాయనీ గాయకులకు వాద్య కళాకారులకు ప్రోత్సాహం, ఉపాధి ఏర్పడడం ఒక మంచి పరిణామం. అయితే ఇది రాను రాను వాద్య ఘోషగా మారి పాటల్లోని సాహిత్యానికి ప్రాధాన్యం అవసరం లేకపోయిన వెర్రి తనానికి దారి తీయడం చిత్రాల కమర్షియలైజేషన్ వల్ల వచ్చిన విపరిణామం.

1950-60 వరకు సాగిన పదేళ్ళలో తెలుగు సినిమా వికాసం కథాపరంగాను, సంఖ్యా పరంగాను బాగా విస్పష్టమైనది. దాదాపు 230 చిత్రాలు ఆ పదేళ్ళలో విడుదలయ్యాయి. కథాబలం కోసం కృషి, సాంఘిక సమస్యలకు సంబంధించిన చిత్రాల కోసం కృషి, కుటుంబ గాథా చిత్రాలు తీసే కృషి – ఈ పదేళ్ళలో ముప్పిరిగొంది. ఆంధ్ర ప్రదేశ్‌లో చలనచిత్రాల నిర్మాణం గావించిన ఆలోచనలు రావడం, శ్రీ సారధీ స్టూడియోస్ నిర్మాణం, 1959లో హైదరాబాద్‌లో తీసిన తొలి చిత్రంగా 'మా యింటి మహాలక్ష్మి' విడుదల; ఈ పదేళ్ళలో సాగిన విశేషాలు. ఈనాటికీ

చెదిరిపోని జ్ఞాపకాలు మిగిల్చిపోయిన నటి సావిత్రి 'సంసారం' చిత్రం ద్వారా ఈ దశాబ్దంలోనే చిత్రరంగంలో ప్రవేశించింది. అప్పట్లోనే కోటి రూపాయలు ఖర్చు పెట్టి తీసిన 'జీవితం' చిత్రం 1950లోనే వచ్చింది. లక్ష్మమ్మ- శ్రీ లక్ష్మమ్మ కథ - రెండూ పోటీ సినిమాల ధోరణి 1950లో సాగి వచ్చింది. బహుకాలం గుర్తుంచుకుంటున్న 'బీదల పాట్లు', 'షావుకారు', 'దీక్ష', 'పాతాళభైరవి', 'మల్లీశ్వరి', 'సల్లెటూరు', 'పెళ్ళిచేసి చూడు', 'కన్నతల్లి', 'నాయిల్లు', 'పక్కింటి అమ్మాయి', 'పుట్టిల్లు', 'అసుర సందేశం', 'చక్రపాణి', 'పెద్ద మనుషులు', 'మాగోపి', 'విప్రనారాయణ', 'అర్ధాంగి', 'దొంగ రాముడు', 'మిస్సమ్మ', 'రోజులు మారాయి', 'శ్రీకృష్ణ తులాభారం', 'ఇలవేల్పు', 'చిరంజీవులు', 'తెనాలి రామకృష్ణ', 'ముద్దు బిడ్డ', 'పాండురంగ మహాత్మ్యం', 'మాయాబజార్', 'సువర్ణ సుందరి', 'పెళ్ళినాటి ప్రమాణాలు', 'భూకైలాస్', 'అప్పుచేసి పప్పుకూడు', 'ఇల్లరికం', 'మా యింటి మహాలక్ష్మి', 'సిపాయి కూతురు', 'కుంకుమ రేఖ', 'చివరకు మిగిలేది', 'మహాకవి కాళిదాసు', 'శాంతి నివాసం', 'శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం', 'సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి', వంటి చిత్రాలు రూపొంది తెలుగు సినిమా పరిశ్రమ ఆర్థికంగానూ, హార్దికంగానూ నిలబడగలిగింది. అక్కినేని నాగేశ్వరరావు, ఎన్టీరామారావు, జమున, సూర్యకాంతం, శంకరమంచి జానకి, కె. ప్రకాశరావు, గుమ్మడి వెంకటేశ్వరరావు, జగ్గయ్య, కె. సత్యనారాయణ వంటి నటీనటులు ప్రజాభిమానం చూరగొనగలిగే బలం వున్న పాత్రలు పోషించడానికి అనువేర్పడిన కాలమిది. చిత్ర పరిశ్రమలో వాసి కోసం నిరంతర కృషి జరిగిన దశాబ్దమిది. సాంకేతికంగా కూడా తెలుగు సినిమా పుంజుకుంది. తెలుగు సినిమా కలర్ యుగం లోకి అడుగు పెట్టాలని నిర్ణయించుకుంటున్న దశాబ్దమిది. సాంకేతికంగా తప్ప కథాపరంగా విదేశీ వాసనలు తెలుగు సినిమాలో ఈ దశాబ్దం నాటికి ప్రవేశించలేదు. ప్రేక్షకులకు వైవిధ్యం బహుళంగా అందించి తెలుగు సినిమా అంటే ఒక ఆకర్షణ సృష్టి అయిన దశాబ్దం. ముప్పయి సంవత్సరాల్లోనే తెలుగు సినిమా అభివృద్ధి పొందినట్లు సంతృప్తి కలిగించిన దశాబ్దమిది.

1960 నుంచి 1970 వరకు తెలుగు సినిమా గౌరవ స్థానం సంపాదించుకుంది. ఆ పదేళ్ళు స్వర్ణయుగమన్న పేరు తెచ్చుకుంది. 'ఇద్దరు మిత్రులు', 'కలసి వుంటే కలదు సుఖం', 'జగదేకవీరుని కథ', 'పెళ్ళికాని పిల్లలు', 'బాటసారి', 'భక్త జయదేవ', 'భార్యాభర్తలు', 'వెలుగు నీడలు', 'ఆత్మ బంధువు', 'ఆరాధన', 'కులగోత్రాలు', 'పదండి ముందుకు', 'భీష్మ', 'మంచి మనసులు', 'మహామంత్రి తిమ్మరుసు', 'అనుబంధాలు', 'ఎదురీత', 'చదువుకున్న అమ్మాయిలు', 'నర్తనశాల', 'పునర్జన్మ', 'బందిపోటు', 'లవకుశ', 'అమరశిల్పి జక్కన్న', 'ఆత్మబలం', 'డాక్టర్ చక్రవర్తి', 'పూజా ఫలం', 'మంచి మనిషి', 'మూగమనసులు', 'రామదాసు', 'రాముడు-భీముడు', 'వివాహ బంధం', 'అంతస్తులు', 'కీలుబొమ్మలు', 'తేనె మనసులు', 'తోడు-నీడ', 'దేవత', 'పాండవ వనవాసం', 'ప్రేమించి చూడు', 'మనుషులు-మమతలు', 'వీరాభిమన్యు', 'ఆత్మగౌరవం', 'కన్నెమనసులు', 'గూఢచారి 116', 'చిలకా గోరింక', 'భక్తపోతన', 'మనసే మందిరం', 'మోసగాళ్ళకు మోసగాడు', 'లేత మనసులు', 'శ్రీకృష్ణపాండవీయం', 'ఉమ్మడి కుటుంబం', 'చదరంగం', 'నిర్దోషి', 'పూలరంగడు', 'పెద్దక్కయ్య', 'ప్రాణమిత్రులు', 'మరపురాని కథ', 'మా వదిన', 'రంగుల రాట్నం', 'రహస్యం', 'సాక్షి', 'సుడిగుండాలు', 'ఉండమ్మా బొట్టు పెడతా', 'గ్రామ దేవతలు', 'చుట్టరికాలు', 'పాల మనసులు', 'మూగజీవులు', 'ఆత్మీయులు', 'ఆదర్శకుటుంబం', 'ఆస్తులు-అంతస్తులు', 'కర్పూర హారతి', 'నిండు హృదయాలు', 'బంగారు పంజరం', 'బుద్ధిమంతుడు', 'మనుషులు మారాలి', 'మూగనోము', 'సప్త స్వరాలు', వంటి ఎన్నెన్నో సినిమాలు వచ్చిన ఈ దశాబ్దంలో బాపు, విశ్వనాథ్, ఆదుర్తి సుబ్బారావు వంటి మంచి దర్శకుల ప్రతిభ ప్రేక్షకులకు తెలిపిన రోజులవి.

ఇప్పుడు గమనించబోతున్న దశాబ్దం 1970 నుంచి 1980 వరకు. తెలుగు సినిమా రంగంలో విలువలు క్రమంగా తగ్గుతూ, వ్యాపార లక్ష్యాలు వేగంగా పెరుగుతూ ప్రభాభిరుచుల పేరుతో అన్ని రకాల దిగజారుడు విధానాలూ ప్రారంభమైన ఈ దశాబ్దం రాబేయో 1980-1990 దశాబ్దానికి కర్టెన్ రైజర్ వంటిది. బి.ఎన్.రెడ్డి వంటి వారి లక్ష్యాలకు దూరమైన సినిమాలు రూపొందడం - అంతకన్న ఉత్పత్తి కావడం అంటే మంచిది - మొదలైంది. సినిమా కళా రూపం నుంచి పరిశ్రమ రూపంలోకి మారింది. ఆర్ట్ కోసం ఆత్రుత చెందడం తగ్గి హక్కులు, ఆధిపత్యాల కోసం హంగామాలు ఎక్కువయ్యాయి: సినిమా ఒక పరిశ్రమ కాబట్టి ట్రేడ్ యూనియనిజం ప్రవేశించింది. స్టంట్ కళాకారులు, మ్యూజిక్ కళాకారులు, జూనియర్ కళాకారులు వంటి విభాగాలకు కొంత భద్రత ఏర్పడింది. ఇది ఒక రకంగా మంచి పరిణామమే అయినప్పటికీ సృజనాత్మక కృషి మరో రకంగా యాంత్రికమైపోయింది. ఈ దశాబ్దంలో చిత్రాల

సంఖ్య ఎక్కువైంది. మంది ఎక్కువైతే ముజ్జిగ పలుచనౌతుందన్న సామెత సినిమా రంగానికీ వర్తించింది. కళకోసం తపన కన్న కాసు కోసం తపన చిత్రాల నిండా కనిపించడం ఆర్డర్ ఆఫ్ ది డే అయింది.

ప్రతి మంచి వెనుక, ఒక చెడు ఏదో నీడలా వుంటుంది. ప్రతి చెడు వెనుకా అలాగే మంచి నడిచి వస్తుంది. తెలుగు సినిమా రంగంలో వాణిజ్య దృక్పథం పెరగడం ఒక వంక జరుగుతున్నప్పటికీ సామాజిక స్పృహతో కొన్ని ప్రయోగాలు కొన్ని ప్రమాణాలూ సాధించడానికి ఉద్యమించడం కూడా కనిపిస్తుంది. ఆదికాలం నుంచి ఏ కళా రూపానికీ చెడు మీద మంచి విజయం సాధించడమే లక్ష్యం. అయినప్పటికీ అదొక ప్రత్యేక లక్షణంగా దానికొక ప్రత్యేక స్వభావాన్ని ప్రతిష్టించి ఉద్యమించడం సినిమా రంగంలో 1970-80 దశాబ్దంలో ప్రారంభమైంది. 'లెఫ్ట్ ఓరియెంటెడ్ చిత్రాలూ, మార్క్సిస్ట్ మైండెడ్ చిత్రాలు రావడానికి ఈ ఉద్యమం ఊపునిచ్చింది. 'మరో ప్రపంచం', 'రైతే రాజు', 'మట్టిలో మాణిక్యం', 'రైతు బిడ్డ', 'కాలం మారింది', 'ప్రజా నాయకుడు', 'మానవుడు-దానవుడు', 'గాంధీ పుట్టిన దేశం', 'తాత మనుమడు', దేవుడమ్మ 'నేనూ-నాదేశం', 'నేరము-శిక్ష', 'మేమూ మనుషులమే', 'అల్లూరి సీతారామరాజు', 'ఓ సీతకథ', 'కోడెనాగు', 'జీవితరంగం', 'నీడలేని ఆడది', 'భూమికోసం', 'సత్యానికి సంకెళ్ళు', 'దేవుడే దిగివస్తే', 'నాకూ స్వాతంత్ర్యం వచ్చింది', 'బలిపీఠం', 'భారతంలో ఒక అమ్మాయి', 'ముత్యాల ముగ్గు', 'లక్ష్మణ రేఖ', 'స్వర్గం-నరకం', 'ఒక దీపం వెలిగింది', 'తూర్పు-పడమర', 'పాడవోయి భార తీయుడా', 'మనిషి రోడ్డున పడ్డాడు', 'మనుషులంతా ఒక్కటే', 'శీలానికి శిక్ష', 'సీతా కళ్యాణం', 'అమరదీపం', 'ఇదెక్కడి న్యాయం', 'ఊరుమ్మడి బ్రతుకులు', 'ఓ మనిషీ తిరిగి చూడు', 'చిలకమ్మ చెప్పింది', 'చిల్లర దేవుళ్ళు', 'తరం మారింది', 'ముత్యాల పల్లకి', 'స్నేహం', 'అంగడి బొమ్మ', 'కలియుగ స్త్రీ', 'కరుణా మయుడు', 'చలి చీమలు', 'దూడూ బసవన్న', 'నాలాగ ఎందరో', 'పదహారేళ్ళ వయసు', 'ప్రాణం ఖరీదు', 'మనవూరి పాండవులు', 'మరో చరిత్ర', 'శివరంజని', 'కమలమ్మ కమతం', 'కలియుగ మహాభారతం', 'కుక్కకాటుకు చెప్పు దెబ్బ', 'గుప్పెడు మనసు', 'గోరింటాకు', 'ఛాయ', 'తూర్పు వెళ్ళే రైలు', 'నీడ', 'పునాదిరాళ్ళు', మొదలైన చిత్రాలు నచ్చి కొన్ని ఆడినా ఆడక పోయినా తెలుగు సినిమా ఒక కమిటెడ్ సినిమా అనిపించిన దశాబ్ది ఇది.

దాసరి నారాయణరావు, వంశీ, బాలచందర్, చిరంజీవి, రాజేంద్ర ప్రసాద్, కె. రాఘవేంద్రరావు, గోపాలకృష్ణ, మొదలైన నవతరం దర్శకులు, తారలు ఈ దశాబ్దంలోనే పరిచయమయ్యారు. చిత్రీకరణలో ఎంత జుగుప్స, వెకిలితనం, అనవసర శృంగారం చోటు చేసుకుంటూ, జనాకర్షణ ఫార్ములాల కోసం తెలుగు సినిమా ముందంజ వేసినప్పటికీ ఆలోచనాత్మకంగా ఈ దశాబ్దంలో అనేక చిత్రాలు వచ్చాయనడానికి ఇంతకు పూర్వం ఉదహరించిన తెలుగు సినిమాలే నిదర్శనం. సాంకేతిక ప్రమాణాలను పెంచుతూ కృషి సాగిన దశాబ్దమిది.

దిగజారిన యుగంలోనూ మంచి సినిమాలు వచ్చాయి. స్వర్ణయుగంలోనూ దిగజారుడు తత్వం కొంత కనిపిస్తుంది. ఇది ఒక్కొక్క సినిమా మంచిచెడ్డల బేరీజు కాదు. ఆ దశాబ్ద లక్షణాన్ని ప్రధానంగా ప్రెజెంట్ చేసే సింహావలోకనం వంటిది కాబట్టి కొన్ని పేర్ల ప్రస్తావన లేకపోవడం యాదృచ్ఛికం మాత్రమే. తెలుగు సినిమా చరిత్రలో వివాదాస్పదంగా మారిన కమర్షియల్ యుగం 1980 నుంచి 1990 వరకు. హింస, సెక్స్, వెకిలి హాస్యం విశృంఖలంగా జనాభిమానాన్ని పెడతోవ పట్టించిన యుగమిది. సినిమా నిర్మాణ వ్యయం, హీరోవర్షిప్, కథాబలం కాసు బలానికి తలవొగ్గడం ఈ దశాబ్దంలోనే ఎక్కువైంది. దాని ఫలితాలు విపరీత పరిణామాల్ని తెచ్చిపెట్టాయి. 1980 వరకూ పెద్ద పెద్ద తారలతోకూడా యాభై లక్షల్లో తీయదగిన చిత్రం ఈ దశాబ్దంలో కోటికి పడగలెత్తింది. దీనితో సినిమా వ్యాపార రంగం అనుపానులే మారి పోయాయి. భారీతనంతో మెస్మరైజ్ చెయ్యాలనుకునే తత్వం సినిమారంగంలో పెరిగింది. వ్యాపార భ్రమలు అధికం కావడం వల్లను, తెలుగు సినిమా రంగం ప్రభుత్వ ప్రోత్సాహాల వల్ల రాష్ట్రంలోని ప్రజలు ముందుకు రావడం వల్లను, తారలు దర్శకులు, అభిమానులు అభివృద్ధి చెందడం వల్లను, ప్రచార సాధనాలను మునుపటికన్న ఎక్కువగా సినిమారంగం ఉపయోగించుకుంటుండడం వల్లను, తెలుగు సినిమా వాతావరణం రాష్ట్రవ్యాప్తం కావడం వల్లను ప్రజలకు సినిమాకు సాన్నిహిత్యం అవగాహన పెరిగాయి. సినిమా విమర్శలూ, సినిమా పరిజ్ఞానం అభివృద్ధి చెందాయి. ఈ దశాబ్దంలోనే తెలుగు సినిమా రంగానికి ప్రత్యేకమైన ప్రాంతీయ సెన్సార్ మండలి ఏర్పాటు కావడంతో ఇదివరకు సెన్సారింగ్ వ్యవహారాల మీద ఎక్కువ పరిజ్ఞానం లేని ప్రజలను సెన్సార్ వ్యవస్థ ఉపయోగాలు తెలిశాయి. సెన్సార్ వ్యవస్థను ఉపయోగించుకొని సినిమా రంగం తమ చిత్రాలప్రచారాన్ని సాగించుకొనే అవకాశాలు పెరిగాయి. దానా దీనా సినిమా ప్రజల్లోకి ఎక్కువగా చొచ్చుకు పోయిన దశాబ్దం 1980-90.

'అందాలరాణి' తో ప్రారంభించి 'హై హై నాయకా' తో ముగిసిన ఈ దశాబ్దంలో పేర్కొనదగిన చిత్రాలివి - 'అగ్ని సంస్కారం', 'ఆడది గడప దాటితే', 'ఏడంతస్తుల మేడ', 'కుక్క', 'గోపాలరావు గారి అమ్మాయి', 'జాతర', 'డప్పుసాయిగాడు', 'ధర్మం దారితప్పితే', 'నాగుమల్లి', 'నిజం', 'పారిజాతం', 'బొమ్మలకొలువు', 'మా భూమి', 'శంకరాభరణం', 'మానవుడు - మహనీయుడు', 'మూగకు మాటొస్తే', 'యువతరం కదిలింది', 'రాజాధిరాజు', 'వంశవృక్షం', 'సన్నాయి అప్పన్న', 'సమాధి కడుతున్నాం, చందాలివ్వండి', 'సిరిమల్లె నవ్వింది', 'అంతం కాదిది ఆరంభం', 'అమావాస్య చంద్రుడు', 'ఆకలి రాజ్యం', 'ఊరికిచ్చిన మాట', 'ఎర్రమల్లెలు', 'చట్టానికి కళ్ళులేవు', 'జేగంటలు', 'డబ్బు డబ్బు డబ్బు', 'తొలి కోడి కూసింది', 'పాలు నీళ్ళు', 'మరో కురుక్షేత్రం', 'రాధా కల్యాణం', 'ఇంట్లో రామయ్య, వీధిలో కృష్ణయ్య', 'ఈ చరిత్ర ఏ సిరాతో', 'ఏకలవ్య', 'ఓ ఆడది ఓ మగాడు', 'జగన్నాధ రథచక్రాలు', 'ధర్మవడ్డీ', 'నాదేశం', 'పూలపల్లకీ', 'మంచుపల్లకీ', 'విప్లవ శంఖం', 'శుభలేఖ', 'సుబ్బారావుకి కోపం వచ్చింది', 'అభిలాష', 'ఆంధ్రకేసరి', 'ఈ పిల్లకు పెళ్ళవుతుందా?', 'ఎం.ఎల్.ఏ. ఏడుకొండలు', 'కీర్తి-కాంత-కనకం', 'కుంకుమ తిలకం', 'గ్రహణం విడిచింది', 'పోలీసు వెంకటస్వామి', 'బహుదూరపు బాటసారి', 'రెండు జళ్ళ సీత', 'సాగర సంగమం', 'ఈ చరిత్ర ఇంకెన్నాళ్ళు?', 'జడగంటలు', 'తెల్లగులాబీలు', 'ముఖ్యమంత్రి', 'మెరుపుదాడి', 'శ్రీవారికి ప్రేమలేఖ', 'స్వాతి', 'ఓటుకు విలువీయండి', 'టెర్రర్', 'దేశంలో దొంగలు పడ్డారు', 'అనాదిగా ఆడది', 'అర్ధరాత్రి స్వతంత్రం', 'కాష్మోరా', 'చాణక్య శపథం', 'పూజకు పనికిరాని పువ్వు', 'శ్రావణ మేఘాలు', 'శ్రీ దత్త దర్శనం', 'సిరివెన్నెల', 'స్రవంతి', 'స్వాతిముత్యం', 'ఇదా ప్రపంచం', 'గాంధీ నగర్ రెండో వీధి', 'దయామయుడు', 'పడమటి సంధ్యారాగం', 'పసివాడి ప్రాణం', 'పుష్పక విమానం', 'ఆగష్టు 15 రాత్రి', 'కనకమహాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్', 'కాంచన సీత', 'జానకి రాముడు', 'వివాహభోజనంబు', 'స్వర్ణకమలం', 'ముత్యమంత ముద్దు', 'జీవన పోరాటం', 'సూత్రధారులు', వంటి చిత్రాలు వచ్చిన దశాబ్దం కూడా ఇదే. **తెలుగు సినిమా రంగంలో విలువల దృష్ట్యా ఇది క్షీణయుగం అనిపించినప్పటికీ ఇన్ని మంచి చిత్రాలు రానడంకూడ ఆనందించవలసిన విషయం.**

**జంధ్యాల, పి.ఎన్. రామచంద్ర రావు, క్రాంతి కుమార్ వంటి దర్శకుల యుగం కూడా ఇదే. కే.కే. వేజెళ్ళ సత్యనారాయణ, పరుచూరి బ్రదర్స్ మంచి చిత్రాలందించిన యుగం కూడా ఇదే.**

అయితే డబ్బు సంపాదన మీద దృష్టి కేంద్రీకరించి నిర్మాతలు, దర్శకులు, తారలు ఎవరి ప్రాబల్యం కోసం వారు ప్రేక్షకుల్ని దిగజార్చారు. చెత్త చిత్రాలు తప్ప మంచి చిత్రాలు బాక్సాఫీస్ విజయం పొందలేవనే భ్రమను నిజం చెయ్యడానికి అన్ని విధాలా వ్యాపారపరమైన అక్రమాలు ప్రారంభమైన దశాబ్దం 1980-90. ఈ దశాబ్దం తెలుగు సినిమాకు చేసిన చెడు ప్రభావం 1990 నుంచి నాలుగేళ్ళపాటు కొనసాగింది. 1990 నుంచి కొత్త దశాబ్దం మొదలైంది. వచ్చిన సినిమాలన్నీ అందరి దృష్టి పథంలోనూ ఇంకా మెదులుతూనే వున్నాయి.

ఈ దశాబ్దం మొదటి మూడేళ్ళు చిత్ర పరిశ్రమ ఘోరమైన వైఫల్యాలను ఎదుర్కొంది. ప్రతిఏడూ వ్యాపార మాంద్యం ఎదురవుతూనే వచ్చింది. భారీ బడ్జెట్ సినిమాల పేరుతో మంచి విలువల్ని నట్టేట కలిపిన చిత్ర పరిశ్రమ వ్యాపార తత్వానికి పరాకాష్ట ఈ మూడేళ్ళలో సంభవించింది. ప్రభుత్వం చిత్ర పరిశ్రమ మనుగడ కోసం, మంచి సినిమాలకు ప్రోత్సాహం కోసం ఎన్నెన్నో సదుపాయాలు, రాయితీలు కల్పించినప్పటికీ పరిశ్రమ కోలుకోలేనంత అపకారం 1980-90 దశాబ్దం వల్ల కలిగింది. గడచిన మూడేళ్ళలో పరిశ్రమ తల తిరిగిపోయేటంతటి పరాజయ పరిణామాలు సంభవించాయి. భారీ చిత్రాలూ దెబ్బ తిన్నాయి. మంచి ప్రయోగాలూ దెబ్బ తిన్నాయి. చిన్న చిత్రాలూ దెబ్బ తిన్నాయి. ప్రభుత్వ సహాయాన్ని రాయితీని దుర్వినియోగపరుచుకొనైనా స్లంప్ నుంచి బైటపడాలని పరిశ్రమ ప్రయత్నం చేసింది.

1980 నుంచి తెలుగు సినిమా వికాసంలో ఇతివృత్తాల విషయంలో, నిర్మాణ పద్ధతుల విషయంలో, రచనల విషయంలో, సంగీతం విషయంలో, ప్రతిఫలాల విషయంలో, విదేశీ చిత్రాల ప్రభావం విషయంలో యాంత్రిక సాంకేతిక ప్రగతి విషయంలో సుస్వరాలు వినిపించడం తగ్గి అపస్వరాలే వినిపించాయి. విలువలతో ప్రజల్ని మెప్పించడం తగ్గి వలువలు విప్పి చూపించి, ద్వంద్వార్థాల సంభాషణలపైనే మక్కువ పెంచి, శాడిస్టిక్ హింసా ప్రవృత్తిని, నేర ప్రవృత్తిని, రాజకీయ అవినీతిని, చీల్చి చెండాడుతున్నట్లు కనిపించినా నాటినే అమాయక ప్రజల్లోకి ఇంజెక్ట్ చేసే సినిమాలు విపరీతంగా వచ్చాయి. ప్రజలు చూసి మనకు డబ్బివ్వాలన్న గమనిక పోయి ప్రజలు చూసేట్లు ఎలా చేసి డబ్బు సంపాదించాలా అన్న ధ్యాస ఎక్కువై తెలుగు సినిమా కీర్తి పతాకం అవనతమైన యుగం - 1994 నుంచి గత చరిత్ర లానే ఆశపుడుతోంది. అయినా వేచి చూడాల్సిందే.

• • •

# తెలుగు గడ్డపై - తెలుగు చలనచిత్ర పరిశ్రమ

**గుడిపూడి శ్రీహరి**

తెలుగు చలనచిత్ర పరిశ్రమ అనేక సమస్యలతో సతమతమవుతూ కాలం గడుపుకుంటూవస్తోంది. తెలుగు భూభాగంపై తెలుగు సినిమా నిర్మాణం అన్న నినాదానికి కార్యరూపంలో, రూపకల్పన జరిగి దాదాపు ముప్పయ్యేళ్ళు కావస్తోంది. అయినా ఇప్పటికీ ...... చాలావరకు అది నిర్మాతల్లో ఉన్న అనిశ్చిత ధోరణి. రాష్ట్ర ప్రభుత్వం ఏదోవిధంగా రకరకాల ప్రోత్సాహకాలను ఇవ్వడమే కాకుండా, మొత్తం దేశంలో ఏ చలనచిత్ర పరిశ్రమలో ఎరగనంతగా- సబ్సిడీల రూపేణా కూడా అనేక రాయితీలు ఇవ్వడమే కాకుండా మద్రాసు నుండి ఇతర ప్రాంతాల నుంచి, తరలివచ్చే చలనచిత్ర పరిశ్రమల వారికి, ఇళ్ళ స్థలాల వంటి సదుపాయాలను ఇవ్వడమే కాకుండా - ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కి కూడా .. రుణ సౌకర్యం. నిర్మాణానికి స్థలాలు కూడా కేటాయిస్తూ వస్తోంది రాష్ట్ర ప్రభుత్వం.

చలనచిత్ర పరిశ్రమలకు కావలసిన మౌలిక సదుపాయాల్లో దాదాపు అన్ని వచ్చినా ఎటు తిరిగి రికార్డింగ్, రీరికార్డింగ్ ల కోసం పాటల్లో అవసరమైన లొకేషన్ల కోసం, మద్రాసు, ఇతర ప్రాంతాలకు వెళ్ళడానికిగాను ప్రభుత్వం చిత్రం మొత్తం నిడివిలో 20 శాతాన్ని కేటాయించి అనుమతించినా, చిత్ర నిర్మాణంలో కొంత మద్రాసులో జరుగుతోందన్న అపఖ్యాతి ఇంకా వినపడుతూ వస్తుంది. హైద్రాబాద్ లో త్వరలో ' బహుశా ఉగాది కల్లా - .... రికార్డింగ్, రీరికార్డింగ్ స్టూడియోలు పూర్తయి పని ప్రారంభిస్తాయి. దానికావలసిన రుణ సదుపాయాన్ని, రాష్ట్ర చలన చిత్రాభివృద్ధి సంస్థ కలుగ చేసింది. అవి కూడా పనిని ప్రారంభించిన తర్వాత, సంగీత వాయిద్యాళ్ళని ఇక్కడ, సినిమా స్థాయికి తగ్గంతగా వారిని తయారు చేయించు కోవలసి వస్తుంది. ఈ విషయంలో, మద్రాసులో వున్న వారి సహాయం తీసుకోవాలని చలనచిత్ర పరిశ్రమ ఆలోచిస్తోంది.

. చలనచిత్రాలు పుంఖాను పుంఖాలుగా వస్తున్నా, నాణ్యత గల మంచి చిత్రాలకి ఇప్పుడు కొరత ఏర్పడింది. త్వరగా డబ్బు చేసుకునే ధోరణి తప్ప, సబ్సిడీలు, డబ్బు రాయితీల రూపంలో ప్రభుత్వం అందించే 'ప్రజల డబ్బు'కి, చలన చిత్ర నిర్మాతలు బాధ్యత వహించాల్సిన దృష్ట్యా - ఈ అశ్లీలతలనీ, హింసలనీ అరికట్టడానికిగాను, ప్రభుత్వమే చొరవ తీసుకుని - 'మంచి చిత్రాలకే సబ్సిడీ' ఇస్తామనడం ఒక మార్గదర్శక చర్య. ఈ విషయంలో ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి గారు ముందడుగేసి ఈ నిర్ణయం తీసుకోవడం వరకు ముదావహమైన విషయం. 1993 జూన్ మాసం నుంచి నిర్మిస్తున్న చిత్రాలకి ఇది వర్తిస్తుంది. ప్రభుత్వం త్వరలో నియ మించబోయే మంచి సినిమా కమిటీ సభ్యులు దీన్ని నిర్ణయిస్తారు. ఇదొక మంచి నిర్ణయం, పరిశ్రమ వారు కూడా శ్లాఘిస్తే మంచి సినిమాగా గుర్తించి సబ్సిడీ మొత్తాన్ని కనీసం పది లక్షల రూపాయల దాకా పెంచితే బాగుండగలదని అభిప్రాయం వ్యక్తం చేస్తున్నారు.

ఈ రోజున తెలుగు సినిమా పరిశ్రమ దాదాపు ఆంధ్రప్రదేశ్ లో పాతుకుపోయినట్లైనవి. ....... ఈ రాయితీలు ఎత్తివేసిన రోజున, మళ్ళీ కొందరు, తమ మకాం మద్రాసుకు మార్చి అక్కడే చిత్ర నిర్మాణం సాగిస్తారన్న అనుమానం కూడా వ్యక్తం చేస్తున్నారు.

నిజానికి, చలనచిత్ర పరిశ్రామిక ఆంధ్రప్రదేశ్ ఎంతో అనువైన ప్రదేశమని ఎప్పుడో గుర్తించారు. ఆంధ్ర ప్రాంతాలో, ముఖ్యంగా కోస్తా తీరంలో ఈ సినిమా ఏక్టివిటీ ఎక్కువగా వుండేది. అప్పటి ఉమ్మడి రాష్ట్రానికి మద్రాసు ముఖ్యపట్టణం అవడం, ఈ ఉమ్మడి రాష్ట్రంలోనే, తమిళ, కన్నడ, మళయాళ భాషా ప్రాంతాలు కూడా కలిగి వుండడంతో - మద్రాసులోనే చలన చిత్ర నిర్మానం పుంజుకుంది. అంతేకాక దక్షిణ భారత చలన చిత్ర పరిశ్రమలో సైతం ఆకాలంలో కూడా ముందు వరుసలో వున్న వారు తెలుగు వారే కావడం విశేషం. చాలామంది కోస్తా ప్రాంతం నుంచి చిత్ర నిర్మాణం కోసం తరలివెళ్ళి, స్టూడియోలు నిర్మించి, చలన చిత్ర రంగానికి ప్రాణం పోసిన వారే. తెలుగు చలనచిత్ర పరిశ్రమ పునాది, ఎక్కడ పడ్డా, బాగా గట్టిగా పడింది. అందుకే, ఈనాటికే, దేశంలో ప్రధమ స్థానంలో వున్న హిందీ చలన చిత్ర పరిశ్రమకు ధీటుగా మువ్వా నేనా అంటూ పోటీపడుతుంది. రాసిలోను, వాసిలోనే

కూడా తెలుగుకే కాకుండా, దక్షిణ భారత చలనచిత్ర పరిశ్రమకు ఆది వ్యక్తిగా చెప్పుకుంటున్న వ్యక్తి - రఘుపతి వెంకయ్య. తెలుగు చలనచిత్ర పితామహుడుగా ఆయన పేరిట రాష్ట్ర ప్రభుత్వం - ఓ బహుమతి కూడా ఏర్పాటు చేసి, ఏటా ఇస్తున్న సంగతి విదితమే. ఆయన కొడుకు ప్రకాష్, ఆవరసలోనే వచ్చినవారు, వారికి శిష్యరికం చేసిన సి. పుల్లయ్యలు ముగ్గురూ కూడా సాంకేతికపరంగా ఎంతో కృషి చేసినవారు. తెలుగు చలనచిత్ర భవనానికి వరుసగా పునాదులు వేస్తూ వచ్చినవారు. మద్రాసులో ఈనాటికి రఘుపతి వెంకయ్య నిర్మించిన థియేటర్లు స్టూడియోల గురించి చెప్పుకుంటారు. 1909, 1914ల మధ్య 'గెయిటీ', 'క్రౌన్' థియేటర్లు నిర్మించిన వెంకయ్య, ఆయన కొడుకు ప్రకాష్ దర్శక, నిర్మాత చలనచిత్ర పారిశ్రామిక నేత్త కూడా. లండన్, హాలీవుడ్ లకి వెళ్ళి, సీసిల్ బీడి మిల్ వంటి అగ్రశ్రేణి దర్శకుల వద్ద పనిచేసిన ప్రకాష్ తండ్రి పునాది మీద చలనచిత్ర అంతస్థులు నిర్మించి ప్రారంభించాడు. మూకీయుగంలో మొదటి మూకీ చిత్రం 'భీష్మ ప్రతిజ్ఞ'. అది ప్రకాష్‌దే. ప్రకాష్ భీష్ముడిగా నటించడం విశేషం. మిస్ పెగ్గే కేసెల్లు అనే ఆంగ్ల వనిత గంగగా నటించింది,

ఇదిలావుండగా, మద్రాసుకు దూరంగా తెలుగు గడ్డ నడిబొడ్డున - జాతీయవాది ముద్దూరి అన్నపూర్ణయ్య శిష్యుడైన సి. పుల్లయ్య గురువుగారి జాతీయతా దృక్పథంతో, కాంగ్రెస్‌లో చేరడానికి, బొంబాయి వెళ్ళి, సినిమా పరిశ్రమలో చేరడం ఓ మలుపు. అక్కడ ఆనాటి ప్రక్రియల్లో మెళుకువలు నేర్చుకుని ఓ కెమెరా ముడి ఫిలిం వెంటతెచ్చుకుని, పుల్లయ్య గారు కాకినాడ వచ్చి కొని ప్రయోగాలు చేశారు. 'భక్త మార్కండేయ' అనే మూకీ, తెలుగు గడ్డ మీద తీసిన మొదటి సినిమా పుల్లయ్య గారు యముడుగా, ముద్దూరి బుచ్చన్న శాస్త్రి మృకండ మహర్షిగా నటించారు. 1925లో తీసిన సినిమా ఇది. ఈ సినిమా నిర్మాణంలోని సాంకేతిక విలువల గురించి, చెప్పుకునేవారు. కెమెరానే మరోరకంగా ఉపయోగించి, సెట్లో మాగ్నా లైటు సాయంతో ప్రింట్లు వేసుకోవడం తన వద్దవున్న ఓపెన్ హట్టర్ ప్రొజెక్టర్ సాయంతో సినిమాని ఓ గోడమీద ప్రదర్శించడం, ఇవన్నీ చిత్ర విచిత్ర సంఘటనలు. గోడనే సినిమా తెరగా వాడిన థియేటర్ గురించి ఇప్పటికే చెప్పుకుంటారు. మరోపక్క - పుల్లయ్య గారు - రఘుపతి వెంకటయ్య గారి స్టూడియోల్లో తీసిన, నందినార్, గజేంద్ర మోక్షం, భీష్మప్రతిజ్ఞ వంటి చిత్రాల్లో నటిస్తూ వచ్చారు కూడా. పుల్లయ్య గారికి ఆయన గురువు, రఘుపతి క్రాస్, ఓ ప్రొజెక్టరూ, ఇచ్చి, ఆంధ్రదేశం నలు మూలలా ప్రదర్శనలు ఏర్పాటు చేయించారు. నాలుగు తాటి దూలాలు పాతి, వెదురు కర్రలు కట్టి, సైను గుడ్డలు తగిలించి, మూగ చిత్రాలకు వ్యాఖ్యానాన్ని జోడించి, వాటికి గేయాలు కల్పించి రంగు టద్దాల్లో సైతం ప్రొజెక్టు చేసేవారు. ఈ 'మూగ' చిత్రాలకు వ్యాఖ్యానావిచ్చిన వాణిల కాళ్ళకూరు సదాశివరావు, కస్తూరి శివరావు వంటి వారు కారు. 1930 ప్రాంతాల్లో ఆంధ్రదేశంలో బియ్యపు మిల్లులు పెరగడంతో అయిలింజన్లు వచ్చి, విద్యుచ్ఛక్తి ఉత్పాదక ప్రారంభమైంది. కార్బైడ్ లైట్లు, గాసు లైట్లు పోయి, ఆర్కులైట్లు వచ్చాయి.

టాకీయుగం 1931లో ఆర్దెషి 'ఆలం ఆరా'లో ప్రారంభమైంది. అదే సమయంలో ఇక్కడ తెలుగు రంగంలో హెచ్.యం. రెడ్డి గారు 'భక్త ప్రహ్లాద' తీశారు. మచిలీపట్నానికి చెందిన పి.వి.దాస్,- 1934లో సీతాకల్యాణం నిర్మించాడు. అవి భారతదేశ స్వాతంత్ర్య సమరం జరుగుతున్న రోజులు. సాంఘిక సమస్యలతో అంతర్లీనంగా జాతీయతా భావాన్ని పెట్టి చిత్రాలు నిర్మించేవారు. ఆ వరసలోనే వృత్తి పేరిట నాగేశ్వరరావు 'ప్రేమ విజయం' హెచ్.యం.రెడ్డి 'గృహలక్ష్మి' ఇంకా సి.పుల్లయ్య, గూడవల్లి రామబ్రహ్మం, కె.ఎ.రెడ్డి, బి.యన్.రెడ్డి, ఐ.వి.రావు ఇంకా అనేకమంది దర్శకులు చిత్రాలు తీస్తున్న రోజులు. తెలుగు వారంతా అక్కడ వుండడంతో తెలుగు చలనచిత్ర పరిశ్రమ అక్కడే స్థిరపడుతూ వచ్చింది. అయితే అదే సమయంలో నిడమర్తి రాజమహేంద్రవరంలో దుర్గా సినీ టౌన్ పేరిట ఓ స్టూడియో నిర్మించడం జరిగింది. అదే స్టూడియోలో 20వేల అడుగుల 'సంపూర్ణ రామాయణం' నిర్మించారు. పుష్పవల్లి కోడేరు రాజు వంటి ప్రముఖులు నటించారు. అదే సమయంలో విశాఖపట్నంలో ఆంధ్రా సినిటోన్ పేరిట మరో స్టూడియో నిర్మాణం జరిగింది. 'భక్త జయదేవ్' చిత్రం తీశారిక్కడ. రెండు చింతల సురభి కమలాబాయి ముఖ్య తారాగణం. సరైన టెక్నీషియన్లు కాక, ఆర్థిక స్థోమత లేని ఈ స్టూడియోలు కాలక్రమేణా మూత పడ్డాయి. ఆర్థిక స్థోమత వున్న కొత్తవారు, మద్రాసు తరలడం ప్రారంభించి అక్కడ నిర్మాణం ప్రారంభించారు. పివి. దాస్ తర్వాత, మీర్జాపురం రాజా శోభనాచలం

స్టూడియో 1941లో నిర్మించాడు. స్టార్ కంబైన్సు, సాహిని, భరణి, రోహిణి - ఇట్లా స్టూడియోలు వెలుస్తూ వచ్చాయక్కడ.

హైదరాబాద్‌లో, నిజాం సహకారంతో ధీరేన్ గంగూ స్టూడియో నిర్మాణం ప్రారంభించి షార్టు ఫిలింస్ తీశాడు. 1945, 47 ప్రాంతాల్లో అంబర్‌పేటలో మహబీర్ సింగ్ ఉన్నాయి. హైదరాబాద్ ఫిలిం స్టూడియో నిర్మించి ఉన్నా సినిమా తీశాడు. అవి కూడా ఆర్థిక కారణాల వల్ల మూసుకుపోయాయి. తిరిగి నాళ్ళు హైదరాబాద్‌లో స్టూడియో నిర్మాణం గురించి గాని, తెలుగు చిత్రాలు తీయడం గురించి గాని, ఆలోచన వచ్చింది 'రోజులు మారాయి' 1955లో. హైదరాబాద్‌లో వందరోజులు పండగ జరుపుకున్నప్పుడు వంద రోజులు నైజాం ఏరియాలో ఆడిన మొదటి చిత్రం అది. స్టూడియో నిర్మించాలన్న ఆకాంక్షతో సారథీ ఫిలింస్ ప్రైవేట్ లిమిటెడ్ సంస్థ వారు అమీర్‌పేటలో స్వంత స్టూడియో నిర్మాణం ప్రారంభించారు.

బూర్గుల రామకృష్ణారావు మంత్రివర్గంలో రెవెన్యూ మంత్రిగా పనిచేసిన రంగారెడ్డి గారు ఈ స్టూడియో నిర్మాణానికి స్ఫూర్తినిచ్చారు. ఈయన చెన్నారెడ్డి గారి మామగారు. ఈ సారథీ స్టూడియోస్ దేశం నలుమూలల నుంచి, సాంకేతిక నిపుణులని తీసుకొచ్చి, నియమించారు. ఇప్పటిలాగే అప్పుడు కూడా సమస్య - మద్రాసులో పాతుకుపోయిన, నటీనటులని దర్శకులని హైదరాబాద్‌కు రప్పించడం. 1962లో ముడిఫిలిం కొరత వల్ల, మద్రాసులో కొన్ని స్టూడియోలు మూతపడ్డంతో, కొందరు నిర్మాతల దృష్టి హైదరాబాద్ పైకి మళ్ళింది. డుక్కిపాటి మధుసూధనరావు గారు 'చదువుకున్న అమ్మాయి' తీశారు. ఆ తర్వాత పి.ఏ.పి. సంస్థ ఎ.వి. సుబ్బారావు గారు, జగపతి రాజేంద్ర ప్రసాద్ గారు, పద్మశ్రీ ఫిలింస్ పి. పుల్లయ్య, బాబూ మూవీస్ ఆదుర్తి సుబ్బారావు తదితరులు ఇక్కడ చిత్ర నిర్మాణం ప్రారంభించారు.

మద్రాసులో చిత్ర నిర్మాణానికి, హైదరాబాద్‌లో చిత్ర నిర్మాణానికి, ఖర్చులతేడా 75 వేల రూపాయల తేడా వస్తోందంటే సంజీవరెడ్డి ప్రభుత్వం ఆ తర్వాత కూడా ఆలోచించి 1963 లో ఒక కమిటీ వేసి 50 వేల రూపాయలు సబ్సిడీగా ఇవ్వాలని నిర్ణయించడంతో సబ్సిడీ యుగం ప్రారంభమైంది. బ్రహ్మానందరెడ్డి ముఖ్య మంత్రిత్వం సహాయంతో చలనచిత్ర పరిశ్రమ ఇంకా పుంజుకొని 'బ్రహ్మానందచిత్రపురి' పేరిట చలన చిత్ర నిర్మాణ కాంప్లెక్సొకటి నిర్మించ ప్రారంభించారు. తెలంగాణా ప్రత్యేక తెలంగాణా ఉద్యమ ప్రభావంతో అది వెనక పడింది. అప్పుడు ఎన్టీరామారావు, ఎల్వీ ప్రసాద్‌లు ప్రారంభించిన భారీ నిర్మాణాలు కూడా ఐరన్ స్ట్రక్చర్ల దగ్గరే ఆగిపోయాయి. ఆ తర్వాత ప్రత్యేక ఆంధ్ర ఉద్యమ ప్రభావం వల్లకూడా పరిశ్రమ ప్రగతి పోరాటంలో పడింది. మళ్ళీ పుంజుకొన్నది. వెంగళరావు హయాంలో, అప్పుడే అన్నపూర్ణ స్టూడియో, రామకృష్ణ స్టూడియో, భాగ్యనగర్ స్టూడియోలురావడం, సుదర్శన్ మూవీ టోన్ అనే పాత స్టూడియోకి రిపేర్లు చేయడం, సారథి స్టూడియో మళ్ళీ ముందంజ వేయడం జరిగింది. 1975 ఫిబ్రవరి 26న వెంగళరావు గారు, మద్రాసులో చలనచిత్ర ప్రముఖులతో ఓ సమావేశం జరిపి త్వరిత నిర్ణయాలు తీసుకొని వినోదపు పన్నులు 7 శాతాన్ని చలనచిత్రపరిశ్రమ అభివృద్ధికి ఇవ్వాలని నిర్ణయించి, రాష్ట్ర చలనచిత్ర పరిశ్రమాభివృద్ధి సంస్థ ఏర్పాటు చేశారు. సబ్సిడీ మొత్తాన్ని లక్షరూపాయల పెంచటం కూడా జరిగింది. ఆ తర్వాత వచ్చిన చెన్నారెడ్డి హయాంలో, ఆంధ్రప్రదేశ్ చలనచిత్ర వాణిజ్య మండలి ఏర్పాటు జరిగింది. మూడు కమిటీలు వేసి ఆయన, చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి మార్గాలు అడగడం, వాళ్ళ రిపోర్టులు ఇవ్వడం జరిగింది. గృహవసతులకోసం గృహనిర్మాణ సహకార సంస్థ ప్రారంభించారు.,

ఆతర్వాత కొంత కాలానికి, ఎన్టీ రామారావు నేతృత్వంలో, తెలుగు దేశం పార్టీ ప్రభుత్వం వచ్చింతర్వాత, 'శ్లాబ్' విధానాన్ని పన్నుల వసూలులో పెట్టడంతో, ఈ పద్ధతి, అనర్థానికి దారితీసి - అనాదిగావున్న పంపిణీ పద్ధతులు మారిపోయి, బయ్యర్లు రావడం ప్రారంభించారు. పరిశ్రమ రకరకాల ఇబ్బందులకు గురికావడం ప్రారంభించింది.

మళ్ళీ తిరిగి కోట్ల విజయ భాస్కరరెడ్డి గారి ఇప్పటి హయాంలోని, తెలుగు చలనచిత్ర పరిశ్రమ ముందడుగు వేస్తోంది. ఇక్కడ కొరతగావున్న రికార్డింగ్ రికార్డింగ్ స్టూడియోల నిర్మాణానికి ఆర్థిక సహాయం చెయ్యడం, సబ్సిడీసొమ్మును చెల్లించడంతో పాటు, మంచి సినిమాలకి ప్రోత్సాహించిన వాటిని ఏరి, ఎక్కువ సబ్సిడీ మొత్తం ఇచ్చే ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఆవిధంగా ప్రస్తుతం వున్న స్లాబ్ విధానం లోని, చిన్న, పెద్ద చిత్రాల తేడా, వాటిని అనుసరించిన టాక్సి విధానాన్ని మార్చే సూచనలు కనపడుతున్నాయి. ●

# శ్రేయో భావ ఉగాది

డా॥ జె. బాపురెడ్డి

రమ్మన్నా వద్దన్నా
వస్తుంది ఉగాది
తెమ్మన్నా వద్దన్నా
తెస్తుంది ఆశల వసంతాన్ని–
మోడువారిన చెట్లగుండెల్లో
చైతన్యం ఇంకిపోలేదు
ఎండిపోయే గాలి గొంతుల్లో
ఆవేశం రాలిపోలేదు
పగిలిపోయిన పాతకడవలోని
పాయసం
కొత్తకుండలో కూడా ఉంది అంటూ
నిత్యసత్యాలనూ, నిగూఢ తత్వాలనూ
రంగరిస్తూ వచ్చింది ఉగాది.
రమ్మన్నా వద్దన్నా వస్తుంది ఉగాది–
రాళ్లల్లో చిక్కుకున్న శిల్పాలు
బయటపడే కిటుకు తెలుసుకుందట
బీజంలో పడిపోయిన భూజం
గొప్పెక్కే గుట్టు కనుక్కొందట
పేదరికాన్ని పిండిపోస్తున్న
(దో) పిడికిలిని
విత్తుచేసే సత్తు తనకుందట
దురాశానాగసర్పాల
నల్లతలల ఖోతాల్లో దాగిన
విలువలేని రత్నాల నిలువర్ని
వెలికితీసే విద్య నేర్చుకుందట
మరి, ఈ ఉగాది
మామూలు పచ్చడి పండుగ కాదట
శైశిర పాశవశక్తులకు
చరమగీతం పాడే చైత్రోదయమట–
అరణ్యంలో అల్లాడే అజ్ఞాత వసంతాన్ని
జనారణ్యంలోకి రమ్మంటూంది
గట్లమీద కాదు
ఓట్ల చెట్ల మీద కూర్చుని
మార్పు గీతాలల్లుమంటూంది
కొండల్లో కాదు
ప్రజల గుండెల్లో పాడుమంటూంది
తుపాకి గుండ్ల నెత్తురు పాటల్లోని
త్రుప్పు పట్టిన విదేశిబాణీలతో
విసిగిపోతున్న స్వదేశానికి
శాంతి విప్లవం ఇమ్మంటూంది–
అవును, ఆశావాది, ఆలోచనవాది ఈ ఉగాది
శ్రీముఖంనుంచి వెలువడ్డ
శ్రేయోభావ చైత్రం ఈ ఉగాది
అందుకే, ఈ వాణి భాషలో, భావంలో
సద్యోజాత పరిమళాలు గుబాళిస్తున్నాయి
మానవ చరిత్ర గతినే మార్చే
విజ్ఞాన వేదనాదాలు వినిపిస్తున్నాయి
ఈ ఉగాది మోసుకొచ్చింది
భయం కాదు–అభయం
ఈ ఉగాది ప్రబోధించేది
సిద్ధాంతబుద్ధికాదు, త్రికరణశుద్ధి
చిలుక పలుకులు కాదు–స్వేచ్ఛాలోచనాశక్తి
ఇజాలు కాదు, బ్రతుకునిజాలు
సంహరణం కాదు, సంస్కరణం
మరణం కాదు–మార్పు

# ఆంధ్రదేశములో నాట్యకళా వికాసము

వేలూరి సుమిత్రా పార్థసారథి

క్రీస్తుశకము ప్రారంభ కాలమునకే దక్షిణాపథమందు చక్కని నాట్య వ్యవస్థ ఏర్పడి ఉన్నదని చెప్పవచ్చును. నాడు భారతదేశమున సుస్థిర నాట్య వ్యవస్థ నెలకొన్న ప్రాంతములలో ఆంధ్రదేశ మొకటని నాట్య శాస్త్రమును బట్టి స్పష్టముగా చెప్పగలము. నాట్య శాస్త్రమును భరతముని క్రీస్తుశకము ప్రారంభ కాలములో రచించాడని ప్రతీతి. ఈ గ్రంథమునందు ప్రవృత్తి వివరణ అధ్యాయములో ఆంధ్రులు దాక్షిణాత్య ప్రవృత్తికి చెందిన వారనియు, దాక్షిణాత్యులు బహునృత్త - గీత - వాద్య లలితాభినయ ప్రియులనియు భరతుడు పేర్కొన్నాడు. ఈ విషయమును బట్టి క్రీ.శ. మొదటి శతాబ్దము నాటికే ఆంధ్రులు లలిత కళల విషయంలో ఎంతో అభివృద్ధి సాధించారన్న విషయం స్పష్టమవుతోంది.

ఆంధ్రదేశంలోని నాట్యకళా ఔన్నత్యమును గూర్చి బౌద్ధ క్షేత్రాలైన అమరావతి, నాగార్జునకొండ, గోలి, ఘంటశాల, జగ్గయ్యపేటలలోని శిల్పాల ద్వారా తెలుసుకోవచ్చును. ఆంధ్ర దేశములో క్రీ.శ. ఆరంభం నుండి 15వ శతాబ్దం వరకు పరిపాలించిన రాజులందరూ లలిత కళల అభివృద్ధికి అగ్రతాంబూలం ఇచ్చారనటానికి వారి వారి కాలములలో రచింపబడిన ఆ కాలము నాటి నాట్య గ్రంథాలు నేటికీ ఆధారాలుగా నిలిచి ఉన్నాయి. నాట్యశాస్త్రము తరువాత నాట్యమునకు సంబంధించి రచింపబడిన మరొక మహత్తర గ్రంథము అభినయ దర్పణము. ఈ గ్రంథము క్రీ.శ. 3వ శతాబ్దములో రచింపబడెనని చరిత్రకారుల అభిప్రాయము. ఈ గ్రంథ ప్రతులన్నీ తెలుగు లిపిలోనే వ్రాసి ఉండుట వలన రచయిత నంది కేశ్వరుడు ఆంధ్రుడేనని స్పష్టమవుతున్నది. క్రీస్తుశకం 7 శతాబ్దము నుండి ఆంధ్రదేశమును రమారమి 400 సంవత్సరములు పాలించిన తూర్పు చాళుక్య రాజులు కూడా లలిత కళలను ఆదరించి పోషించేవారని తెలుస్తున్నది. వీరి కాలములో చాలా దేవాలయములలో నాట్యమంటపములు నిర్మించినట్లు శాసనాధారములు ఉన్నాయి.

క్రీస్తు శకము 12 శతాబ్ది అయిన పాల్కురికి సోమనాధుని రచనలైన బసవ పురాణము, పండితారాధ్య చరిత్రములలో సంగీత-నృత్య-వాద్యాదుల గూర్చి ప్రస్తావించబడింది. బసవ పురాణములో సంగయ్య కథలో నృత్యవిధానము కూడా వర్ణితమైనది. 13వ శతాబ్దం నాటి కాకతీయుల కాలంలో కూడా నాట్య ప్రగతి జరిగింది. గణపతి దేవరాజు బావ మరిదియగు జాయప సేనాని నృత్య విద్యా పారంగతుడు. ఇతడు "నృత్త రత్నావళి" అను గ్రంథమును రచించాడు. ఇందులో మార్గ నృత్య సంప్రదాయమే కాక, ఆ కాలములో ఆంధ్ర దేశములో ప్రచారంలో ఉన్న దేశి నృత్య రూపకములైన పేరిణి, దండరాసక్, ఘటిసరి, బహురూపకము, కోలాటము, చిందు, చర్చరి మొదలగు పద్ధతులన్నిటిని ప్రతిభా రీతిలో వర్ణించాడు. కాకతీయుల కాలములోనే వరంగల్లు జిల్లాలో పాలంపేటలోని రామప్ప దేవాలయము కట్టబడినది. ఈ ఆలయము నాట్యశిల్ప కళాయుతమై అలరారుతున్నది.

క్రీస్తుశకము 12వ శతాబ్దములోనే భావప్రకాశమనెడి ఉత్తమ నాట్యశాస్త్ర గ్రంథము రచింపబడింది. దీనిని శారదా తనయుడు వ్రాసెను. ఇతడు కూడా ఆంధ్రుడేనని చరిత్రకారుల అభి



కాకతీయుల కాలంనాటి నాట్య శిల్పాలు

ప్రాయము.

క్రీ.శ. 14వ శతాబ్దములో ఆంధ్రదేశమును పరిపాలించిన రెడ్డిరాజుల కాలములో కూడా నృత్య సంగీతాది లలిత కళలకు అగ్రతాంబూల మివ్వబడింది. రెడ్డిరాజుల కాలపు నాటి ఎఱ్ఱాప్రగడ కవి తన "నృసింహ పురాణమనే" గ్రంథములో నృత్య సంగీతములకు చెందిన పెక్కు ప్రస్తావనలు చేసాడు. రెడ్డిరాజుల ఆస్థానంలో విద్యాధికారిగా ఉన్న శ్రీనాథకవి సార్వభౌముడు తన రచనలైన కాశీఖండము, పల్నాటి వీర చరిత్ర మొదలైన గ్రంథములలో నృత్య ప్రస్తావనలు అనేకం చేసాడు.

క్రీ.శ. 14వ శతాబ్దంలోనే విజయనగర సామ్రాజ్య స్థాపకులైన హరిహర-బుక్కరాయల కాలములో నాచనసోముడు 'నాట్య చూడామణి'ని రచించి కోలారు దగ్గర కొన్ని గ్రామము లలోను దానముగా పొందెనని ప్రతీతి.

క్రీ.శ. 15వ శతాబ్దంలో తంజావూరు నాయక రాజులైన రఘునాథ - విజయ రాఘవ నాయకులిరువురూ తాము స్వయముగా సంగీత సాహిత్య నాట్య నేత్తలగుటయే కాక పెక్కు గ్రంథములను రచించి, రచింప చేసిరి. వీరి కాలము యక్షగాన, ప్రబంధములకు, వీధి నాటకములకు స్వర్ణ యుగమైనది. రఘునాథుడు తన వాల్మీకి చరిత్రలో పేరిణి, దండలాస్యము, బెక్కిణి, కుండలి వంటి దేశి నృత్యములను పేర్కొన్నారు. రఘునాథుని ఆదరణలో చాలామంది నాట్యకత్తెలు ఉన్నట్లు విజయరాఘవుని కావ్యములను బట్టి తెలియస్తున్నది. రఘునాథ రాయలు ఆస్థాన నృత్యములనే కాక దేవాలయ నృత్యములను కూడా పోషిం చాడని 'రాజగోపాల విలాస'మనే గ్రంథము ద్వారా తెలుస్తున్నది. విజయ రాఘవుడు స్వయముగా అనేక యక్షగానములను నాట్యానుకూలముగా రచించాడు. ఈతనిని మహాకవి క్షేత్రయ్య సందర్శించి అతనిపై పదములను చెప్పెనని ప్రతీతి.

ఈవిధముగా క్రీస్తు శకము 1వ శతాబ్దము నుండి 15వ శతాబ్దము వరకు కూడా ఆంధ్రదేశమును పరిపాలిచిన చక్రవర్తులు, సామ్రాజ్యాలు, ప్రజలు అందరూ కూడా నాట్య కళాభివృద్ధికి నిరంతర కృషి సల్పారు. భారతీయ సంస్కృతికి కళల ద్వారా నీరాజన మిచ్చారు. కానీ దురదృష్టవశాత్తు 16వ శతాబ్దం నుండి ఆనాటి రాజకీయ, సాంఘిక, మత, కారణాల వల్ల ఒక విశిష్ఠ సంస్కృతిని రూపొందించి తద్వారా భారతీయ సంస్కృతీ వికాసానికి ఎన్నో విధముల తోడ్పడిన భారతీయ లలిత కళలన్నీ చాలా దీనస్థితిని అనుభవించాయి. ఆనాటి ఆర్థిక పరిస్థితుల వల్ల కూడా ఎందరో ఉత్తమ కళాకారులు, కళావేత్తలు నృత్య కళారాధన నుండి విరమించారు. దానితో మన లలిత కళలన్నీ మరుగున పడినవి. ఈ పరిస్థితి ఎంతవరకు వచ్చిందంటే, లలిత కళల వికసన చరిత్ర పునరావృత్తమై తిరిగి నాంది ప్రస్తావనల నుండి మొదలైంది.

క్రీ.శ. 16వ శతాబ్దం నాటి ఆంధ్రులు తిరిగి ఈ లలిత కళల జీర్ణోద్ధరణకై కంకణం కట్టుకున్నారు. కొన్ని కుటుంబాలు ఊరూరా బండ్లపై తిరుగుతూ ఆ బండిలోనే నివాసముంటూ ప్రతి ఊరులోనూ నాలుగు వీధులు కలిసే కూడలిలో తమ తమ ప్రదర్శన లిస్తూ తమను పోషించుకునేవారు. వీరినే పగటి వేషగాళ్లు అనేవారు. రానురాను పగటి వేషాలు వారి జీవన వృత్తి అయినది. చేసిన ప్రదర్శననే మరల మరల ప్రదర్శిస్తే జనాదరణ తరిగి పోతుందని క్రొత్త రూపకములను రూపొందించేవారు. ఒక్కో ఊరిలో పదేసి రోజులు ప్రదర్శనలు ఇచ్చేవారు. చివరి రోజున శారదావేషం వేసి బహుమతులను పుచ్చుకొని వేరొక ఊరు తరలి పోయేవారు. ఈ పగటి వేషాలలో ఎక్కువ భాగం హాస్యం ఉండేది. బహుళ కళ ఉద్దేశ్యం కేవలం వినోదం మాత్రమే అని వారి అభిప్రాయం కాబోలు. ఈ పగటి వేషాల ఇతివృత్తాలన్నీ ఆనాడు సమాజంలో ఉన్న మూఢనమ్మకాలను, మోసాలను ప్రతిబింబించేవిగా ఉండేవి. కొన్ని పగటి వేషాల వివరణ :-

**బైరాగి వేషం :** ఈ వేషం దొంగ సన్యాసులు అమాయక ప్రజలను మోస గించే విధానం బట్టబయలు చేస్తుంది.

**కోమటి వేషం :** కోమటులు వారి పారిభాషిక పదాలతో గోప్యంగా మాట్లాడు కోవడం, వారి యుక్తి ప్రయుక్తులలో మేళవించి ఉంటుంది.

**సోమయాజులు – సోమిదేవి :** చాలాకాలం వరకు ఈ దంపతులకు సంతానం లేనందువల్ల సోమయాజుల వారు కాశీకి వెళ్ళి గుమ్మడికాయకు సూదిగ్రుచ్చి దానిపై తలమోపి తలక్రిందుగా ఒక పుష్కరకాలం సంతానం కోసం తపస్సు చేసి ఇంటికి మరలి వస్తాడు. భర్త కాశీకి వెళ్ళింది మొదలు సోమిదేవి కోరిన విటులతో గూడి భర్త వచ్చుసరికి ముగ్గురు పిల్లల తల్లి అవుతుంది. భర్త నిందీయగా "స్వామీ ఇదంతా మీ తపోమహిమ కాదంటారా" అని గడ్డరితనాన్ని ప్రదర్శి స్తుంది.

ఈవిధమైన హాస్య, వ్యంగ్య రూపకాలనంతరం ఈ పగటి వేషగాళ్ళు మెల్లగా భక్తి రూపకాలను రూపొందించారు. తమ ప్రదర్శనల ద్వారా కీర్తనల ద్వారా భగవంతుని ఆరాధిస్తూ భాగవతులని పించుకున్నారు. వీరు భాగవత, భారతాది పురాణాల నుండి కథలను తీసుకొని వాటిని కీర్తన రూపములో మలచి వాటికి నృత్య బాణిని కట్టి ప్రదర్శన లిచ్చేవారు. వీటిలో ముఖ్యమైనవి దరువులు, కీర్తనలు మొదలైనవి. వీటి తరువాత వాక్కును గేయ రూపములో మలిచిన వాగ్గేయ కారులు ఎంతోమంది తమ తమ రచనల

ద్వారా ఈ నాట్యపు అభినయ పరిధిని పెంచి నాట్య వికాసానికి తోడ్పడ్డారు. ఈ నాట్య ప్రదర్శనలు ఒక క్రమ పద్ధతి, లయ, తాళం, అభినయం ఇత్యాదులన్నీ సంతరించుకున్న మీదట వీరి ప్రదర్శనలను, కళా రూపాలను, కళాకారు లను ఆ ప్రాంత రాజులు, జమీందారులు కూడా పోషించడం జరిగింది.తత్ఫలితంగా ఈభాగవతులు భగవంతుని కీర్తిస్తూ చేస్తున్న తమ ప్రదర్శనాంశాలతో పాటుగా ఆ కళా పోషకులైన జమీందారులను, రాజులను కూడా పొగుడుచూ నృత్యాన్ని ప్రదర్శించేవారు. వీటిలో ప్రధాన మైనవి తిల్లానాలు, శబ్దములు, సల్లాము దరువులు మొదలైనవి.

ఉదా : రాజ శ్రీ భోసల కుల చంద్ర
రతిపతి సుందర రాజ నరేంద్ర
రాజ తుళజ మహారాజ తనుజ
ప్రతాప సింహేంద్ర కుమారా సలామ్ ॥

అలాంటిదే మరొకటి !

దామెర తిమ్మేంద్ర కుమారా
శతకోటి మన్మథాకారా....

ఈ పరిస్థితులలో సిద్దేంద్రయోగి కూచిపూడి గ్రామం రావటం సంభవించింది. అతడు "పారిజాతాపహరణమనే" రూపకాన్ని నాట్యానికి అనువుగా రచించి భాగవతులు కొందరికి అభినయం నేర్పించి ప్రదర్శన లిప్పించెను. వారి భామాకలాప ప్రదర్శనను తిలకించిన గోల్కొండ నవాబు అబుల్ హసన్ తానీషా కూచిపూడి గ్రామాన్ని ఆ భాగవతులకు అగ్రహారముగా ఇచ్చెను. వందల సంవత్సరములు తరబడి నిరంతరం నాట్యాభివృద్ధికై పరిశ్రమిస్తూ ఊరూరు తిరుగాడు భాగవతులకు ఈ అగ్రహార దానం వల్ల ఒకచోట స్థిరముగా ఉండి నాట్యాభివృద్ధికై మరింత కృషి చేసే అవకాశం లభించింది. కూచిపూడి గ్రామంలో పరిపూర్ణ అభివృద్ధిని పొందింది కాబట్టి ఈ నృత్య శైలికి "కూచిపూడి నృత్యమన్న" పేరు వచ్చింది. ఈ గ్రామం ఆంధ్రప్రదేశ్ లోని కృష్ణాజిల్లాలో ఉంది. భామా కలాపం పిమ్మట వీరు ఆధ్యాత్మిక రచనలకు ప్రదర్శనలో అవకాశ మిచ్చారు. ఇటువంటిదే "గొల్లకలాపం". ఆధ్యాత్మిక విషయములను బోధించే వేదస్మృతి, పురాణేతిహాసముల నుండి కొన్ని ధర్మ సూక్తులను తత్త్వములుగా వ్రాసి గోపికా వేషముతో ప్రత్యేకముగా గొల్లకలాపము పేరుతో ప్రదర్శన లిచ్చారు. ఈ గొల్ల కలాపములో గొల్లభామ పాత్రధారిణి గొల్లల గొప్పదనము గూర్చి పొగుడుతుంది. బ్రాహ్మణుల యజ్ఞ యాగాది క్రతువులకు సంబంధించిన వస్తువులగు పాలు, పెరుగు, నెయ్యి మొ॥వి గొల్లవారి ఉత్పత్తులే అనీ, గొల్లవారే లేకపోతే యజ్ఞ యాగాదులు జరిగే అవకాశమే లేదని, సర్వ క్రతువులలోను గొల్లల ముఖ్య పశువు మేక ప్రధానమని గొల్లభామ వివరిస్తుంది. పిమ్మట పిండోత్పత్తి క్రమమును ఇంకనూ వేదాంత విశేషములను విదూషకునితో చర్చిస్తుంది. ఈవిధముగా గొల్ల కలాపము సాగిపోతుంది.

ఇవేకాక, శ్రీ సిద్దేంద్రుని సమకాలీనులైన శ్రీ నారాయణ తీర్థుని రచనలు - తరంగాలు, క్షేత్రజ్ఞుని పదాలు, మొదలైన వాటికెన్నింటికో నృత్య బాణీలు కట్టి నర్తించే వారు ఈ భాగవతులు. క్రీ.శ. 16వ శతాబ్దం నాటి సాంఘిక, రాజకీయ, మత పరిస్థితుల వల్ల ఆనాటి స్త్రీలు క్రమంగా నర్తించటం మానుకున్నారు. తరువాత కాలంలో పురుషులు మాత్రమే నాట్యం చేసే నాట్యమేళంతో పాటుగా స్త్రీలు మాత్రమే నాట్యం చేసే నట్టువ మేళానికి కూడా శ్రీకారం చుట్టారు ఈ భాగవతులు.

ఈ విధంగా కూచిపూడి గ్రామంలోని వారందరూ నాట్య కళోద్ధరణకై పాటుపడ్డారు. వారిలో ముఖ్య వంశీయులు వెంపటి వారు. వేదాంతం వారు, భాగవతుల వారు, చింతా వారు, మహంకాళి వారు, పసుమర్తి వారు, జోస్యుల వారు మొ॥ వారు. ఈ కూచిపూడి భాగవతులు తమ తమ పూర్వీకుల నుండి నేర్చుకొన్న విద్యతోనే సంతృప్తి పడక నిరంతర కృషితో నూతన ప్రక్రియ లెన్నింటినో కల్పించి పూర్వ సంప్రదాయముల ననుసరించి నృత్యకళ నభివృద్ధి పరచుకుంటూ వచ్చినారు. క్రొత్త పోకడలను సృష్టించి తమ నాట్యవిద్యకు విశాలతను చేకూర్చినారు. నేడు ఈ కూచిపూడి భాగవతులు కళాప్రచారకు లయినారు.

ఇంతటి అంకిత భావమూ కలది దేవదాసి వ్యవస్థ. భగవంతునికి తన జీవితాన్ని అంకితం చేసి స్వామిని రంగ భోగములో తన గీత-నృత్యాదులతో అర్చించి, ఆరాధించి జీవితాన్ని తరింప చేసుకున్న పుణ్యాత్మురాలు దేవదాసి. ఈ దేవదాసి వ్యవస్థ అనాదిగా వస్తున్న ఆచారము. ఈ దేవదాసిలు 16వ శతాబ్దం వరకూ పెద్ద పెద్ద దేవాలయములలో వందల మంది ఉండేవారు. ఈ దేవదాసిల అపవిత్ర జీవనం వల్లనూ, ఆనాటి సాంఘిక, రాజకీయ పరిస్థితుల వల్లనూ క్రమేణ పూర్తిగా ఈ వ్యవస్థ విచ్ఛిన్న మయింది. దురదృష్టవశాత్తు నేడు మచ్చుకైనను దేవదాసిలు ఆంధ్రదేశమున కానరారు.

ఆంధ్రదేశమున 16వ శతాబ్దములో తిరిగి మొదలు పెట్టిన నాట్యం క్రమేణా వృద్ధి చెందుతూ వచ్చి ఈ 20వ శతాబ్దం నాటికి కూచిపూడి నాట్య వైభవం ప్రపంచ వ్యాప్తంగా విస్తరింప బడింది.

• • •

# ఎప్పటి కప్పుడే క్రొత్త

డా॥ బోయి భీమన్న

ప్రతి వసంతము క్రొత్తదే, ప్రతి పిక స్వ
రమ్ము క్రొత్తదే సృష్టి ప్రారంభ మాది;
క్రొత్తదై ప్రతి క్షణము నీ కొరకు విరియు!
నింపుకొనుచుంటివే గుండెనిండ మధువు?

ప్రతి పసిపాప క్రొత్త, పది
పన్నెండేండ్ల గొంతు ప్రతీది క్రొత్తదే!
ప్రతి యువ వాక్కు క్రొత్త, పది
పదిలపు నర్తనసమాన జీవన
ప్రణయము క్రొత్తదే; చెవుడు
పట్టిన ఏ కుంజాతి! కానిచో
మరిసెడి లోక మానవ స
మాజపు వాకిట వాసి లొగ్గునా?

నూత్న యుగములు, క్రొత్త గొంతుకలు సతము
వచ్చి పోవుచు నుండు ప్రభాతము లటు;
మేలుకొనియుండుటే రాజ్య మేలుకొనుట!
జోగులాంధ్రకు లే వుషశ్శోభనములు!

సిరి వాల్జూపు, సరస్వతీ ప్రియదర
స్మేరమ్ము, శైలాత్మజా
పరిసత్త్వమ్ము సమానమై భువికి ల
భ్యంబౌ సదా; నేడు తత్
కర పీయూషము గ్రోలు వంతు మనదా
కా వచ్చె; మేల్కొల్పవే
భరత క్ష్మాజనయిత్రి శ్రీ చరణసే
వాసక్తికిన్ నీ ప్రజన్?

బహు జనమ్ముల చీకట్ల బడగద్రోసి
కువలయము నెల్లు గెల్తురు కొద్దిమంది?
కులమతాలను పిచ్చుక గూళ్ళలోన
సంచరిలు టెల్లు వసుధైక జాతి రవులు?

గాంధి చెప్పిన దేమిటి? క్రైస్తు, మార్క్సు,
వ్యాసు, డంబేద్కరుడు, బుద్ధు డదియె చెప్పె!
వేద మేదైన, పలికిన నాద మొకటె!
సృష్టి రాహస్యమేమి గుర్తించినావు?

మన అదృష్టేందిరాదేవి మనసు పండి
రాష్ట్రమైనవి అవకాశ రాజనాలు!
దక్కునో ఇప్పుడేవి బీద బిక్కి ప్రజకు?
తెరచియున్నవి నరిజకాసురుల నోళ్లు!

ఆగస్టు పదునైదు అర్థమేమిటి? స్వరా
జ్యశ్రీని ఏ నల్గురో
భోగుల్ పట్టి చెరన్ గొనన్ గలుగుటో?
బ్యూరోక్రసీ దాస్యమో?
వాగర్థాల విడాకులో? ప్రజకు నం
వాగ్దాన సంతర్పణో?
త్యాగుల్ జానపదుల్; తదీయ ధన ధా
న్యశ్రేయముల్ ముఖ్యముల్!
కావున డెందము నిండుగ
జీవన సుధ నొంచు కొమ్ము, చిల్‌సత్ గతిలో
నీ వంతు వచ్చె; నసుగే
లా? వీరముగొమ్ము, ముందు కడుగిడు మింకన్!

# శాస్త్రీయ సంగీతం - వాగ్గేయకారులు

డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు

మన శాస్త్రీయ సంగీతం పేరు కర్ణాటక సంగీతం! అది పాడవలసిన కీర్తనాది ప్రక్రియల్లోని భాష నూటికి తొంభై పాళ్ళు తెలుగు భాష. 19శ శతాబ్దంలోను, ఈ శతాబ్దిలోని మొదటి రెండు మూడు దశాబ్దుల్లోను తెలుగు కీర్తనల (కృతుల)తో నిండిన కర్ణాటక సంగీతానికి విరివిగా సభా ప్రచారం కలిగించిన విద్వాంసులు ప్రధానంగా తమిళదేశీయులు. వాగ్గేయకారులు ఈ సంగీతంలో రచన సాగించిన వారిలో ఎక్కువంది తెలుగు భాషలోనే రచించారు. ఇవన్నీ చారిత్రక చమత్కారాలు. ఆ చమత్కారాలు ఈ వ్యాసంలో విశ్లేషించుకుందాము.

యజ్ఞవేదిక, ఆలయమంటపం, కోవెలతిన్నె, తీర్థక్షేత్రాలలో వివిధజాతి జనసముదాయాలు జరుపుకునే జాతర బయళ్ళూ, మన సంగీతానికి తరతరాలా దోహదం జరుగుతూ వచ్చిన సాంస్కృతిక కేంద్రాలు!

సామవేదం నుంచి సంగీతాన్ని పితామహుడూ, సృష్టికర్త అయిన బ్రహ్మ సంగ్రహించి, నాట్యవేదం అనే పంచమ వేదాన్ని సృష్టించాడని భరతముని నాట్యశాస్త్రంలోని నాట్యావతరణ గాథను బట్టి తెలుస్తుంది. ఆ సూత్రాలను అనుసరించి, త్రిపురదాహమూ, అమృత మథనమూ నృత్యరూపకాలుగా - సదాశివ భారతానికి ముందు భరతుని శిష్య బృందం ప్రదర్శింపగా సంతోషించి, సదా శివుడు తాను తన సంధ్యా తాండవ సందర్భాలలో కూర్చుకొన్న దేశినృత్త విషయాలను కూడా కలుపుకొమ్మని భరతాదులకు ఆదేశిస్తాడు.

సదాశివుడు శాంబరీభిల్లుడు, గజచర్మాంబర ధారి, డమరువాద్యం వాయిస్తూ, (అ ఇ ఉ ణ్ మొదలయిన) అకారాదిక్షకారాంతం సాగే అక్షరసూత్రాలనూ, సరిగమపదనీ అనే సప్త స్వరాలనూ పలికించాడని పాణిని వ్యాకరణం ద్వారాను, నందికేశ్వరుని రుద్రడమ రూద్భవసూత్ర వివరణ ద్వారానూ తెలుస్తుంది.

భరతుని నాట్య శాస్త్రంలోని ఆ కాలపు రాగాలలో మధ్యమగ్రామవికృత స్వర సంపుటి ద్వారా - ఒక ప్రాంతీయ ప్రజా సముదాయం పేరుతో 'ఆంధ్రి' అనే పేరు ఆనాటి ఆంధ్ర ప్రజ భారతీయ సంగీత సంపదకు చేసిన సాంస్కృతిక ప్రదానం(సుమారు క్రీ.పూ. 4వ శతాబ్ది) గురించి తెలుకుంటాము.

భరతుని తర్వాత - క్రీ.శ. 4-7 శతాబ్దులలో మతంగుడనే ముని బృహద్దేశి అనే లక్షణగ్రంథం వెలువరించాడు. ఉదారభావశాలియైన సంఘసంస్కర్త. దేశమంతటా అన్ని ప్రాంతాలూ సంచారం చేసి, అన్ని జాతుల సంగీత రీతులను పరిశోధించి అనేక దేశి సంప్రదాయాల రాగాలకూ, ప్రబంధాలకూ, రూపకాలకూ



త్యాగయ్య



అన్నమయ్య



క్షేత్రయ్య

సంగీత శాస్త్రంలో లక్షణం కల్పించి ఆదేశి సంగీత రీతులకు శాస్త్రీయతా గౌరవం చేకూర్చాడు.

'మార్గ' సంగీతం అంటే భరతునకు పూర్వం బ్రహ్మాది శాస్త్రకారుల చేత పరిశోధితమై నిర్దేశితమైనదీ వేదనిబద్ధం అయిన ఆనాటి శాస్త్రీయ సంగీతమునీ, దేశి సంగీతం అంటే సంస్కృతేతర దేశ భాషలలోని ఆయా వాగ్గేయ కారుల గేయాలు, ఆయా ప్రాంతల జనులు నిత్య జీవితంలో పాడుకునే సంప్రదాయం అనీ - మార్గ దేశి పద్ధతుల నిర్వచనం మతంగుని వరకూ సాగింది. భరతుని నాటి గ్రామములూ జాతులూ క్రమంగా రాగాలుగా రూపొందాయి. దేశి రాగాలెన్నో లక్షణ గ్రంథాలకు ఎక్కాయి.

దాక్షిణాత్య, లేక ద్రావిడి (ద్రావిడ దేశపు రాగం) గౌళగాడ, దేశపురాగం, సౌరాష్ట్ర దేశపురాగం సౌరాష్ట్రి, ఘూర్జర దేశపురాగం ఘూర్జరి, మౌఖరీ ప్రజల రాగం ముఖారి; కాంబోజపు జలరాగం కాంభోజి, అభీరజనుల రాగం ఆభీరి ఇలా జాతుల పేర్లతో దేశిరాగాలెన్నో శాస్త్రీయతా గౌరవం పొంది, మతంగుని బృహద్దేశిలోనికీ శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరంలోనికీ ప్రవేశించాయి. శార్ఙ్గదేవుడు (తమిళదేశపు) తేవారాలకు నాడే దేవారవర్ధని అనే రాగాన్ని పేర్కొన్నాడు.

భరతుడి నుండి శార్ఙ్గదేవుడి వరకూ అంటే క్రీ.పూ. 4వ శతాబ్ది నుంచి క్రీ.శ. 13వ శతాబ్ది వరకూ, ఆలయ భగవత్ప్రార్థనలకూ సంగీత నృత్య నాటకాలకూ ప్రధానమైన గేయరచన రసైకదృష్టి కలదిగాను, ముఖ్యంగా ఆధ్యాత్మికతా ప్రాధాన్య భావాలతో శబ్దబ్రహ్మోపాసనాన్వితంగా ఉంటూ వచ్చింది. భాష ప్రధానంగా సంస్కృతమూ, ద్వితీయ స్థానంలో అష్టవిధ ప్రాకృతాలూ వినియుక్తాలయ్యేవి.

ఆయా ప్రాంతీయ జాతులకు చెందిన జనులు వారి వారి భాషలలో తమ తమ దేశిరూపకాలను తమ తమ దేశ భాషలలో ప్రాకృతంలోను ప్రదర్శిస్తూ, దేశం అంతటా వివిధ ప్రాంతాలకు ఉత్సవమేళా సందర్భాలలో పర్యటనలు చేస్తుండడాన, ఆ సేతుహిమాచల భానమూ, శివ, విష్ణు, శక్తి క్షేత్రాల ద్వారా సంకీర్తనల సాంప్రదాయ వ్యాప్తి ద్వారా ఆయా క్షేత్రాల్లో ఆయా దేశి రూపకాల ప్రదర్శనల ద్వారా లక్షణ గ్రంథాలకెక్కిన ఒక ప్రాంతీపు రాగాలు మరొక ప్రాంతాన గాయక ప్రదర్శకులకూ సామాజికులకూ పరిచితాలై ప్రచార మాధ్యమంగా రూపొందిన భారతీయ రాగ సంపదగా పెంపొందింది.

భరతమునికి సమకాలీనమైన ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యానికి అనంతరం - సామ్రాజ్య పీఠం - బరువుగా మొగ్గినది కర్ణాటకం వైపే! దానికి తార్కాణాలు - ద్వార సముద్రం రాజధానియైన హొయసల రాజ్యమూ, పశ్చిమ దక్కనులోని బాదామి, కళ్యాణి రాజధానులుగా ఏలిన పశ్చిమ చాళుక్య చక్రవర్తులూను. 12 శతాబ్దం నుంచి 15శతాబ్ది దాకా కర్ణాటక దేశం నుంచి నటులు దక్కన్లోని అన్ని రాజ్యాలూ దర్శించి నాటక ప్రదర్శనలిచ్చే వారని శ్రీనాథుని పద్యంద్వారా తెలుస్తుంది. 10, 11, శతాబ్దులలోనే నాన్యదేవుడనే కర్ణాటక సాహసికుని వంశం మిథిలలో రాజ్యం ఏలింది. నాన్యదేవుడు భరతుని నాట్య శాస్త్రానికి భాష్యం వ్రాశాడు.

13 వ దశాబ్దిలో కాకతీయ సామ్రాజ్యం ఓరుగల్లు రాజధానిగా గణపతిదేవ, రుద్రమదేవుల పాలనలో బాగా గణతికెక్కింది. కాని, దానికి పడమటగా దేవగిరి రాజధానిగా ఉండిన కర్ణాటక రాజ్యంలో యాదవ వంశస్థుడైన సింఘణ-గణపతి దేవ చక్రవర్తికి రాజకీయంగా సాంస్కృతికంగా కూడా అన్ని విధాలా ప్రతిస్పర్థి! దేవగిరిలో సంగీత రత్నాకర కర్తయైన శార్ఙ్గ దేవుడు ఆస్థానకవి కాగా ఓరుగల్లులో నృత్తం త్నావళీకర్త జాయప సేనాని కాకతీయుల ఆస్థానకవీ గజసైన్యాధ్యక్షుడును. ఇద్దరి గ్రంథాలూ ఆనాటి సంగీత నృత్యాల దేశ సంపదను గురించి ప్రకటించేవే. విధివైపరీత్యాన రెండు రాజ్యాలూ ఢిల్లీ పాదుషా అల్లా ఉద్దీన్ ఖిల్జీ సేనానియైన మాలిక్ కాపుర్ దండయాత్రలలో నాశనం అయ్యాయి. దక్షిణ కర్ణాటకలోని ద్వారసముద్రాన్ని కూడా మాలిక్ కాఫర్ వదలిపెట్టలేదు.

శార్ఙ్గదేవుడు దేవారవర్ధని రాగం గురించి చెప్పాడు కనుక అప్పటికి ఒకటి రెండు శతాబ్దులుగా తమిళదేశంలో ప్రచారంలో ఉండిన ఆళ్వారుల భక్తి రచనలైన తేవీరాలకు శార్ఙ్గదేవుడు విన్నాడనీ, ఆయా రాగాలను లక్షణ లక్షితాలు చేశాడనీ నమ్మవచ్చు. 11వ శతాబ్దం నాటికి-తూర్పు దక్కన్‌లో వేంగీ చాళుక్యుల చక్రవర్తి రాజరాజ

నరేంద్రుడు తెనుగులో నన్నయ భట్టారకుని చేత-భారతరచన చేయించి "ఆంధ్ర విషయమున తెనుంగును నిలిపె" నన్న నన్నెచోడుని ఉద్ఘాటనకు కారకుడయ్యాడు.

"హరిహరాజగజాన నార్కషడాస్య నూత్నసరస్వతీ
గిరి సుతాదిక దేవతానళికిన్ నమస్కృతి చేసి" అని నన్నయ్య గారు భారతాదిని చేసిన సకల దేవతా ప్రార్థన-(శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ దధతో అనే సంస్కృతంలో చేసిన త్రిమూర్తి ముగురమ్మల ఉమ్మడి ప్రార్థనకు తోడుగా) చేయడం-కేవలం తెలుగు దేశిరూపక ప్రదర్శనల సంప్రదాయంగా తెలుసుకుని ఆ తెలుగు తనానికి గర్వించ వచ్చనుకుంటాను.

13వ శతాబ్దిలో కాకతీయ సామ్రాజ్యమూ దేవగిరీ మాలిక్ కాఫర్ సైన్యం రూపుమాపిందని పైని చెప్పాము. ఖిల్జీ సుల్తానులతర్వాత వచ్చిన మహమ్మద్ బిన్ (పిచ్చి) తుగ్లక్ రాజధానిని ఢిల్లీ నుంచి దేవగిరికి మార్చి, దేవగిరి పేరు దౌలతాబాద్‌గా మార్చాడు. ఢిల్లీ నుంచి సెక్రటేరియట్‌తో పాటు పారశీక కవి పండిత సంగీత విద్వన్నర్తకీ సమాజం కూడా దౌలతాబాద్‌కి మారింది. పాదుషా రాజధాని తిరిగి ఢిల్లీకి మార్చి సెక్రటేరియట్‌ను తీసుకుపోయాడు. సంగీత నర్తకీ విద్వల్లోకం దక్కన్‌లోనే ఉండిపోయింది. దక్కన్‌లో భామినీ రాజ్య స్థాపన జరిగింది. అది నాలుగు ముక్కలయింది. విద్యారణ్యుడు కర్ణాటక రాజ్య స్థాపన చేసి, విజయనగరంలో ప్రధానమంత్రీ, రాజగురువు, (హరిహర బుక్కరాయలకు) శృంగేరీ పీఠమూ నిర్వహిస్తూ సంగీత సారం అనే గ్రంథంలో తననాటి తురుష్క రాగాలకు కూడా లక్షణ లక్షితాలు చేసి 15 జనకరాగాలను ప్రకటించాడు.

విద్యారణ్యుని అనుసరించి లక్షణగ్రంథాలు రచించిన గోవింద దీక్షితుడు సంగీత సుధలోను, రామామాత్యుడు స్వరమేళ కళానిధిలోను గోవింద దీక్షితుని కొడుకు వేంకటమఖి చతుర్దండి ప్రకాశికలోను జనక,జన్యరాగ పద్ధతిని-ఆనాటికి దేశంలో కలిసిపోయిన పారశీక సంగీత పద్ధతుల సాంకర్యం ద్వారామారిపోయిన సంగీత వాద్యాలూ, శ్రుతులూ, రాగ పరిణామాలూ పాటిస్తూ శాస్త్ర రచన కావించారు. లక్షణ కర్తలు నాన్యదేవుడు, సోమేశ్వరుడూ, శార్ఙ్గదేవుడూ, విద్యారణ్యుడూ, అనుయాయులూ అంతా కర్ణాటక రాజ్యస్థులు కావడం చేత కర్ణాటక సంగీతం అయింది-మన సంగీతం! ఇక్కడ తెలుగువారు మరువరాని అంశం ఏమిటంటే, విద్యారణ్యుల శిష్యులు-సంగమవంశపు మొదటి యిద్దరు చక్రవర్తుల నుంచీ ఆదవాని వారయిన హరిహరబుక్కరాయలూ వారి వంశమూ, తరువాత వచ్చిన సాళువ నరసింహరాయలూ, తెలుగువారన్న విషయమూ, తుళువ వంశస్థుడయినా అష్టదిగ్గజాలకు పోషకుడయిన శ్రీ కృష్ణదేవరాయలు.

"తెలుగదేలయన్న దేశంబుతెలుగేను తెలుగు వల్లభుండ, తెలుగొకండ
యెల్లనృపులు గొలువ నెరుగవేబాసాడి,
దేశభాషలందు తెలుగులెస్స" అని తన తెలుగు ప్రబంధం 'ఆముక్తమాల్యద'లో శ్రీకాకుళాంధ్ర విష్ణువు చేత తన స్వప్నంలో పలికించిన అమృతపు గుళికలు-మరవరానివి! ఆయుగంలోను తరువాత యుగంలోను వాగ్గేయకారులైన వారందరూ పాటలు తెలుగులోనే వ్రాయాలి అనే ఒరవడిని పెట్టిన ఒజ్జ-తాళ్లపాక అన్నమాచార్యులే ప్రధానకారణం!-ఆయన సంకీర్తనాచార్యుడూ, పదకవితా పితామహుడూ కూడా గనుక!

కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తికి సమకాలికుడుగా రాయలసీమలోని వంతూరున జన్మించి, ఉత్తరాంధ్ర సముద్రతీరం పక్కన సింహాచలం కొండపై వెలసిన వరాహనరసింహస్వామి దత్తత తీసుకున్న భక్తుడై వెలసిన కృష్ణమాచార్యులు తెలిసినంతమట్టుకు తెలుగులో తొలి వాగ్గేయకారుడు. ఈయనకు సమకాలికులైన ఆహోబిల నరసింహస్వామి భక్తులూ, కృష్ణమాచార్యులూ కూడా, తంబురదండే చిటితాళాలతో తెరపై చిత్రించిన స్వామి శ్రీమూర్తికి ఎదుట-తాళనర్తనాలతో గద్య ప్రబంధగానమూ, నామసంకీర్తనమూ చేసి తన్మయత్వం చెందుతూంటే స్వామి ప్రత్యక్షమై నాట్యం చేసే వారని-కృష్ణమాచార్యుడు సింహగిరి నరహరివచనాల ద్వారా మనకు తెలుస్తుంది.

ఆళ్వారులు, జయదేవుడు, కృష్ణమాచార్యులు, అన్నమాచార్యులు రచనా రంగంలోకి ప్రవేశించేవరకూ శాస్త్రీయసంగీతం-రాజదర్బారుల్లో సాహిత్య ప్రాధాన్యం లేని సంస్కృత, ప్రాకృత భాండీవ భాషలలో భాషా

పటిమ లేకుండా రసమూ భావమూ లేకుండా, విద్వాంసుల ద్వంద్వయుద్ధ ప్రదర్శనలుగా ఉండేవి. ఎవరు ఎక్కువ (సర్కసు ఫీట్లు) మల్ల విద్యాప్రదర్శనలో పిల్లిమొగ్గలు వేస్తారో వారికి కరతాళ ధ్వనులూ కంకణాలూను.

భక్తియోగుల రచనలద్వారా గేయరచనలో ఒక మహావిప్లవం సాధ్యం అయింది. మధురభక్తి సిద్ధాంతమూ, జీవాత్మ పరమాత్మ సంబంధమూ ఇతివృత్తాలుగా నమ్మాళ్వారు ఆండాళ్లు వంటి ఆళ్వారులు రచించిన పద్ధతిలో అన్నమాచార్యులు రచించిన శృంగార కీర్తనలు - వేలకొద్దీ రచనలు జన సామాన్యాన్ని ఉర్రూత లూగించాయి. పాటలో ఇది నాదీ, నాకు సంబంధించినదీ అయిన ఇతివృత్తం అనే భావాన్ని కలిగించి, శ్రోతలకు ప్రణయభక్తి భావాలనూ, తత్త్వాలూ ఆధ్యాత్మిక కీర్తనల ద్వారా వైరాగ్యభక్తిభావాలూ కలిగి శ్రోతలకు ఆకర్షణ కలిగించేవి. కృష్ణమాచార్యాదుల సంకీర్తన గోష్ఠులు తన్మయత్వం కలిగించి, సద్యః పరనిర్వృతిని పొందించేవి.

సంకీర్తనాచార్యుడైన అన్నమాచార్యుడు 'సంకీర్తన లక్షణము' అనే లక్షణ గ్రంథాన్ని కూడా వ్రాసిన వాగ్గేయకారుడు దాన్ని సంస్కృతంలో రచించాడు. అంతవరకూ లక్షణగ్రంథాలన్నీ సంస్కృతంలోనే వెలువడేవి. తనకాలం నాటికి పండిత సభా మర్యాదను పొందని ఏలలూ, వెన్నెల పాటలూ, యక్షగానపు దరువులూ, స్త్రీల పెళ్లి పాటలూ వంటి తెలుగుగేయాలకు ఆభందాలకు నకళ్లు తన వేలకొద్దీ గేయాలలో చొప్పించి, ఇటువంటివి కోవెలలోను, కొలువులోను గౌరవం పొంది గుర్తింపదగినవే అని తన కాలపు పండితలోకానికి చాటాడు. పాటలద్వారా పామరలోకానికి సన్నిహితుడయ్యాడు. ఈ రచనలు యక్షగాన ప్రసక్తలయిన సిద్ధేంద్రయోగీ, కృష్ణలీలాతరంగిణీకర్తయై సంకీర్తన పద్ధతికి ఇతోధిక దోహదం చేసిన నారాయణ తీర్థులకూ దారిచూపాయి. అన్నీ క్షేత్రయపదాలతో పాటు కూచిపూడి వారి నాట్యాభినయానికి దోహదం చేశాయి.

అన్నమాచార్యులననుసరించి, ఆయన కొడుకూ, మనుమడూ మాత్రమే కాక, క్షేత్రయ్య, సారంగపాణి వంటి వాగ్గేయకారులు పదకవితను బహువిధాలుగా విస్తరింపజేశారు. క్షేత్రయ పదాలలో సాహిత్యం చాలా తేలిక వ్యావహారిక సంవాద శైలిలో సాగి, రాగభావవిస్తృతికీ, సాత్త్వికభావ ప్రదర్శనకూ అవకాశాలను పెంచి, జీవితశృంగార ఘటనా సందర్భాలతో సమన్వయంచేసే విస్తృత ప్రయోగాల ద్వారా తెలుగుభాష నుడికారంలో అందాలు దిద్దుకొంది. అన్నమయ్యగారి శృంగారపదాల పద్ధతిని క్షేత్రయ్యాదులవలంభించారు. భక్తి కీర్తనల పద్ధతిని-భద్రాచలరామదాసు అని ప్రసిద్ధి పొందిన కంచెర్ల గోపన్న అనుసరించాడు. రామదాసు కీర్తనలలోని సాహిత్య రచనా, రాగభావరచనా కూడా పదీ, ఇరవై, ముప్పై మంది భజనగోష్ఠిగా కలిసి పాడుకోడానికి వీలుగా చాలా తేలికగా ఉంటాయి. ఈ గుణంలో రామదాసు కీర్తనలకు సాటి అనదగినవి నారాయణ తీర్థుల కృష్ణలీలాతరంగాలే.

కాళహస్తి సంస్థానపు ఆస్థాన విద్వాంసుడయిన మునిపల్లె సుబ్రహ్మణ్య కవి-18వ శతాబ్ది ఆరంభం లోకాని, అంతకు ముందుగాని, రాగతాళ నృత్యశబ్దాలతో కూడిన కథా కథనాత్మకములైన కీర్తనలతో రచించిన అధ్యాత్మరామాయణం-నృత్యానుగుణం కూడాను.

తాళ్ళపాక అన్నమాచార్యాదుల కీర్తనలను, ఇతర రచనలను రాగిరేకులపై చెక్కించి తిరుపతి వేంకటేశ్వర స్వామి దేవాలయ ప్రాంగణంలో సంకీర్తన భాండారం ఏర్పాటు చెయ్యడానికి తోడ్పడిన వారు కృష్ణదేవరాయల తర్వాత విజయనగర సామ్రాజ్యం ఏలిన అచ్యుత దేవరాయలు, సదాశివ రాయలు. కర్ణాటక సంగీత పితామహుడని వాసిగాంచిన పురందర దాసు, తాళ్లపాక అన్నమాచార్యుల మనుమడయిన చిన తిరుమలాచార్యులు మున్నగు వారి సహకారంతో అచ్యుత దేవరాయలకాలంలో అతని ఆధ్వర్యం లోనే కర్ణాటక సంగీతాన్ని అభ్యసించే విద్యార్థులకు సరళీ వరుసలు జంట వరుసలు, అలంకారము, గీతములు, వర్ణములు నేర్పే తరగతి వారీ క్రమాభ్యాస పద్ధతి ఏర్పాటయింది. సదాశివ రాయలకు రక్షకుడూ ప్రతినిధీ, ప్రధానమంత్రీ అయిన అళియరామ రాయలే- వసుచరిత్ర కర్త అయిన రామరాజ భూషణునికీ, స్వరమేళ కళానిధి సంగీత శాస్త్ర గ్రంథకర్త అయిన రామామాత్యునికీ పోషకుడు. 1565లో రామరాయల నాయకత్వంలో విజయనగర సామ్రాజ్యం పతనం అయింది. రాచరికపు బరువుతో పాటు-సంస్కృత కేంద్రం

తంజావూరుకు మారింది. తెలుగు నాయకరాజుల కాలం యక్షగానానికి స్వర్ణయుగం!

అచ్యుతప్పనాయకుని పరిపాలనా కాలంలో ఆంధ్రదేశంలో కూచిపూడికి చెందిన భాగవత మేళం వారు తంజావూరు వచ్చి తమ భాగవత ప్రదర్శనలతో రాజును ప్రజలను మెప్పించి, అచ్యుత రాయ సముద్రం అనే గ్రామాన్ని అరణం పొందారు. అదే మేలట్టూరు అయింది. మేలట్టూరు ఇంటిపేరు గల వీరభద్రయ్య, కాశీనాథయ్యగారులు ఎన్నో ప్రసిద్ధ ములయిన స్వరజతులను కీర్తనలను రచించారు. వారు తమ రచనలలో ప్రయోగించిన రాగపద్ధతులే తరువాత రాబోయే కర్ణాటక సంగీత వాగ్గేయకార త్రిమూర్తులకు మార్గదర్శకాలయ్యాయి. రఘునాథ నాయకుని మంత్రియైన గోవింద దీక్షితుడు రాజు పేరిటనే 'సంగీతసుధ' అనే లక్షణ గ్రంథంలో విజయనగర సామ్రాజ్య స్థాపకుడయిన విద్యారణ్య శ్రీ చరణుల సంగీత సారగ్రంథంలోని సిద్ధాంతాలను తన గ్రంథంలో తరచు స్మరించడమే కాక, జనక, జన్యరాగ పద్ధతిని కూడా అనుసరించాడు. ఆ తరువాత విజయరాఘవ నాయకుడి ఆస్థాన విద్వాంసుడయిన వెంకటమఖి తన చతుర్దండి ప్రకాశికలో తనకు వెనుకటి లక్షణకర్తల పద్ధతులను విమర్శిస్తూ ఈనాటి కర్ణాటక సంగీతంలోని రాగాలకు ప్రమాణనిర్దేశం చేశాడు. 72 మేళకర్తల సృష్టియానికే దారిచూపాడు.

నాయకరాజుల తర్వాత వచ్చిన మహారాష్ట్ర రాజులు, తంజావూరులో నాయకరాజులు పోషించిన సంగీత సాహిత్యాది కళలను యథాతథంగా పోషిస్తూవచ్చారు. తులజాజీ సంగీత లక్షణ గ్రంథకర్త, ఈయన రచించిన సంగీత సారసంగ్రహంలో ఈనాటి రాగాల స్వరూపాలు స్వరబద్ధములైన పరిచ్ఛేదాలలో ప్రదర్శించాడు.

1762, 1767, 1775 సంవత్సరాలలో తంజావూరు జిల్లాలోని తిరువారూరులో వరుసగా శ్యామశాస్త్రి, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు ప్రసిద్ధులయిన కర్ణాటక సంగీత వాగ్గేయకారమూర్త్రిత్రయం జన్మించారు. మన సంగీత పరిణామ చరిత్రలో ఈ ముగ్గురు వాగ్గేయకారుల రచనలూ కలిసిన మహాతటాకం ఒకే ఒక జలపాతం నుంచి సేకరించిన సంగీతవాహిని! ఆ జలాశయం నుంచి ప్రవహించే సాంప్రదాయిక జలాలతో ఈనాడు మనం చెప్పుకునే కర్ణాటక సంగీత సభా సంప్రదాయాలవాహిని నిరంతరాయంగా ఈ రెండు మూడు శతాబ్దాల్లోను ప్రవహిస్తోంది!

ఈ ముగ్గురు రచనలలోను త్యాగరాజ భక్తి భావసంపదలోను ముత్తుస్వామి దీక్షితులు విరాగ ప్రదర్శనలోను, శ్యామశాస్త్రులు తాళ చమత్కృతిలోను ఒక్కొక్కరి సంగీతం ఒక్కొక్క విషయంలో ప్రత్యేకత కలిగి, ముగ్గురూ మొత్తం మీద భావరాగతాళ సంపన్నమైన తమ తరువాత గాయకలోకానికి తరగని సంపదనిచ్చారు.

అందుకే ఏసంగీత సభయినా నూటికి అరవై పాళ్లు ఈ త్రిమూర్తుల రచనలు లేనిదే సాగదు. త్యాగరాజు శ్యామశాస్త్రుల రచనలలో ఎక్కువగా ఇష్టదేవతకు భక్తులు చేసుకునే విన్నపాలలా ఉంటాయి. దీక్షితులకు ఇష్టదైవాన్ని గురించిన దటస్థ వర్ణనలు! మూర్త్రిత్రయాలు రాకముందు రాజసభలలోగాని, విద్వత్కూటాలలోగాని గంటల తరబడో, రోజుల తరబడో రాగాలాపనలో, పల్లవి స్వరకల్పనల పోటీలో, తాళ చమత్కృతుల ప్రదర్శనలో ఆడంబర విద్వత్ప్రదర్శనలు సాగుతూండేవి. ఆలయాలలోగాని, గృహాలలోని ఇష్టదేవతా మందిరాల ముందుగాని, భాగవతారుల సంకీర్తన గోష్ఠులుండేవి.

విద్వత్సభలలో అది వరకు లేని సాహిత్య భావ మర్యాదాతా సంకీర్తన గోష్ఠులలో అంతవరకు లేని శ్రుతిలయ శుద్ధతా, శ్రద్ధాభక్తులూ, సంగీత త్రిమూర్తులు మన సంగీత సంప్రదాయానికి చేర్చిన మెరుగులు! అది వరకు ప్రయోగంలో లేక, లక్షణ గ్రంథాలలో ఏ మాత్రంగానో సూచనగా కనబడే ఎన్నో చిన్న రాగాలలోను, మేళకర్త రాగాలన్నింటిలోను సాహిత్య భావానికి తగిన రీతిని రాగభావాన్ని జోడించి, రాగస్వరూప నిరూపణ చేస్తూ పోయే కృతి రచనలు అశేషంగా అందించి, త్రిమూర్తులు సంగీత సభలకు అంతులేని భిక్షపెట్టారు. త్రిమూర్తులకు తర్వాత నేటి దాకా వారి ననుసరించి సంగీత కృతులను రచించే వాగ్గేయకారులే వచ్చారుగాని, మంగళంపల్లి బాల మురళీకృష్ణని తప్పించి, సంగీత బంధంలోగాని, సాహిత్య బంధంలోగాని, త్రిమూర్తులను మరపించే వారింకా పుట్టలేదు.

• • •

# తెలుగునాట సంగీత విద్యావ్యాప్తి

చాగంటి కపాలేశ్వరరావు



"పదమెత్తన్ కలహంసలీల, అధర
స్పందంబు సేయన్ శుభా
స్పదమౌ రాగకదంబంబు శ్రుతి జూ
పన్ శ్రీ విలాసంబకే
అదిలింపన్ సుకుమార పల్లవన
వైలాలక్ష్మి..."

అంటూ రాయల అష్టదిగ్గజ కవులలో ఒకరైన భట్టుమూర్తి అనే రామరాజ భూషణుడు "వసుచరిత్ర" కావ్యంలో సౌందర్య వర్ణనతోపాటు సంగీతార్థం వచ్చేటట్లు శ్లేషిస్తారు. ఆయన గొప్ప కవేకాక, సంగీత శాస్త్ర విద్యాపారంగతుడు కావడం వలన సంగీత పక్ష పాతి కావడమే ఈ రకమైన చమత్కృతి ప్రదర్శించగలిగారు. "పదమెత్తన్ కలహంసలీల" అంటే సంగీతార్థం పాట ఎత్తుకునీ ఎత్తుకోగానే, హంసధ్వని రాగలీల వినిపిస్తుంది. హంసధ్వని ప్రారంభ రాగాలలో ప్రముఖమైనది, "వాతాపి గణపతిం" "వినాయకా నిను" వంటి కృతులు-విఘ్నేశ్వర స్తుతి పరమైనవి ప్రారంభంలో ఆలపించేవీ, హంసధ్వనిరాగ రంజితాలే. "అధర స్పందంబు చేయన్ శుభాస్పదమౌ రాగ కదంబం" అంటే రక్తి ప్రధానరాగమైన శుభ పంతువరాళితో మొదలుపెట్టే రాగమాలిక, అని చెప్పుకోవాలి.

"శ్రుతి జూపన్ శ్రీ విలాసంబు" అంటే శ్రుతి శుద్ధంగా ఉండే శ్రీరాగ ("ఎందరో మహానుభావులు" త్యాగరాజ పంచకృతి శ్రీ రాగంలోనే వున్నది) విలాసం అన్న అర్థం స్ఫురిస్తుంది. 'వేలది దలింపక; పల్లవ నవ , ఏలా లక్ష్మి" అంటే ఏల పదాలకుపయోగించే ఏక్‌తారపై వేలితో మీటినపుడు కనిపించే వేలు కుదుపులలోని వయ్యారం అనుకోవచ్చు. ఆంధ్రుల పూర్వ కావ్యాలలో సంగీత సంబంధమైన ఇటువంటి ఉదాహరణలెన్నో ఉన్నాయి.

ఇంచుమించు ఈ భావనే ' నా ఊళ కేదారగౌళ' అనే శ్రీశ్రీ కవితలో ధ్వనించింది. ఈ పూదరిగా కావ్యాలలోనే కాక 15-16 శతాబ్దులలో తాళ్లపాక అన్నమాచార్యులు రచించిన వేలాది తెలుగు కీర్తనలు, పదాలు (శృంగార-భక్తి) ఏల, తందాన, తుమ్మెద, గొబ్బి వంటి అనేక రకాలైన జానపద పద రీతులు ఇవన్నీ 12వ శతాబ్ది, పండితారాధ్య చరిత్రలో, పేర్కొన్న పద రచనా విశేషాలే. "లలనాజనాపాంగ వలనావసదనంగా తులనాధికాసంగ దోస్సంగ" అనే సీసపద్యం వీణావాద్యంతో గళం కలిపి పాడడానికై రచించిన జంత్ర గాత్ర గేయరచన అంటారు. సీసపద్యం వంటి మాత్రా ఛందస్సుపై ఆధారపడిన పద్యాలన్నీ ఖండ, మిశ్ర ఇత్యాది లయ బద్ధమైన గేయాలుగానూ, నృత్త గీతులుగానూ కూడా ఉపయోగమైనవేకాక, ఇప్పటికీ కందార్థ దరువూ వంటి పద్యగేయ పదబంధాలున్నాయి. ఇంతగా మార్గదేశ సాహిత్యాలతో ముడిపడిన సంగీతకళ వేరే దేశ భాషల్లో ఉందా అనే విషయం పరిశీలనాయోగ్యమైనదే. (చెప్పవచ్చిన మాట, సంగీతానికీ తెలుగు వారికీ సంబంధం తెలుగు సాహిత్య చరిత్ర కంటె కూడా పూర్వమైనదే. నన్నయ్యకు పూర్వం ఉండిన ఏల, జోల, తెన్న, చిలకా, తుమ్మెద, వెన్నెల వంటి పద విశేషాలు



RAVINDRA BHARATHI

జాను తెనుగులో ఉండేవనీ కళాధ్యాయానికి సంబంధించిన సూత్రా చంధస్సు ఈ పాటలకు ఆధారమైనదనీ, లయ బద్ధమై, గాన యోగ్యతకు పుట్టినిల్లైనవనీ, తెలుగు వారి చరిత్ర స్పష్టం చేస్తున్నది.)

(పాల్కురికి సోమనాథుడు (12వ శతాబ్ది) ఓరుగల్లు (నేటి వరంగల్లు) వద్ద నున్న పాలకుర్తి ప్రాంతం వాడు కావటం, అదే కాలంలో రాజ్యం చేసిన కాకతీయుల సేనాని, జాయప్ప (13వ శతాబ్ది), గీతరత్నావళి, నృత్య రత్నావళి, వాద్య రత్నావళి, అనే మూడు లక్షణ గ్రంథాలు వరుసగా సంగీతం, నృత్యం, తాళ వాద్యాలపై రచించి వుండటం (ఇందులో నృత్య రత్నావళిని తెలుగులోనికి ప్రొఫెసర్ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ అనువదించారు) బట్టి కూడా తెలుగు నాట సంగీత సంప్రదాయ బహుళ వ్యాప్తిలో ఉన్నట్టున్నూ, ఈ సంప్రదాయాన్ని సవివరంగా సవిస్తరంగా జాయప్ప తన గీత రత్నాకరంలో లక్షణీకరించినట్టూ స్పష్టమే.

ఇక పదిహేను శతాబ్ది నుండి తెలుగు ప్రాంతం మొగలుల పాలన క్రిందికి రావడంతో రామదాసాది వాగ్గేయకారులు ఒకరిద్దరు ఇక్కడ మిగిలారే తప్ప, తక్కిన యావన్మందీ 16వ శతాబ్ది నుండీ తంజావూరు నేలిన తెలుగు నాయక రాజుల ఆస్థానంలోకి వలస వెళ్ళడం, తత్కారణం గానే కాకర్ల వారైన త్యాగరాజాది సంగీత విదులు, వాగ్గేయకారుల పూర్వ వంశీయులు తంజావూరు ప్రాంతంలో స్థిరపడి రాజాశ్రయం పొంది తమ శాస్త్ర, కళా వైదుష్యాలను ఆ ప్రాంతంలో ప్రకటించే అవకాశాలను అన్వేషించు కుంటూ విజయం సాధించారు. శారదా ధ్వజాన్ని రెపరెపలాడించారు. సంగీత సాహిత్యాలకు స్వర్ణయుగం అని భావించే ఈ కాలానికి కొంచెం ముందే కర్నాటాంధ్ర సామ్రాజ్యాన్ని విద్యారణ్యుల వారి ఆశీస్సులతో అక్కరాయలు, బుక్కరాయలు స్థాపించిన తదనంతరం ఆ రాజ్యంలోనే శ్రీ కృష్ణ దేవరాయలు తెలుగు సంగీత సాహిత్య సృష్టిని ప్రోత్సహించారు, తను వంతు కృషిని కూడా జతచేశారు. ఆ కాలంవారే కర్నాటక సంగీత పితామహ బిరుదాంకితులు పురందరదాసు తమ లక్షాధిక కన్నడ దేవరనామ సంకీర్తనలతోపాటు, సంగీతాభ్యాస స్వర వరుసలు, పిళ్ళారి గీతాలు, లక్షణ గీతాలు రచించారు. ఇందువల్లనే నేటి కర్నాటక సంగీతానికి ఆ పేరు వచ్చింది. గమనించవలసిన విషయం, కర్నాటక సంగీత నామం అప్పుడు కర్ణాటాంధ్ర సామ్రాజ్యానికి సమానంగా వర్తించిన నామధేయం పేరు. కర్నాటకం, రచనా సంపద అధిక తరంగా ఇప్పటికీ తెలుగు భాషలో ఉండటం, తమిళులు ఈ సంగీత శాస్త్రాన్ని కృతి సంపదను తమ స్వంతంగా పరిరక్షించి, పెంచి పోషించారు. పేరు కన్నడ, రచన తెలుగు, పాడేది తమిళులు. ఇదీ సంక్షిప్తంగా ఆధునిక కర్నాటక సంగీత పూర్వ చరిత్ర.

అదే సంగీతం అరవ సంగీతమని మన తెలుగువారు బహుళంగా అపోహపడి నిర్లక్ష్యం చేయడం వల్లనే తెలుగు నాట శాస్త్రీయ సంగీతం 19-20 శతాబ్దాలలో వెనకబడి, ప్రజాదరణ కోల్పోయింది. ఇటువంటి నిర్లక్ష్యం రెండు దశాబ్దుల వరకూ కొనసాగడం, కర్నాటకసంగీతానికి అభివృద్ధి కేంద్రం (గ్రోత్ సెంటర్) పూర్తిగా తంజావూరుకు మారి, తెలుగు నడిగడ్డకు, కృష్ణా గోదావరి మండలానికి, సుదూరం కావడంవల్ల, రాకపోకలు దుస్తరమైన ఆ రోజులలో ఇక్కడ సంగీత కళ ఉన్నది ఉన్నట్టు ఉండిపోయి, పెరుగుదల నిలిచిపోయి, కాలక్రమేణా నన్నగిల్లిందేమో అని కూడా

అనుకోవచ్చు. మునిపల్లె సుబ్రహ్మణ్య కవి 18వ శతాబ్దివాడు, శ్రీకాళహస్తి సంస్థాన విద్వాంసుడు, రచించిన ఆధ్యాత్మిక రామాయణ కీర్తనలు, కథాకథన ప్రక్రియలో ఆద్యమైనవి. విలంబకాల, మధ్యమకాల సమ్మేళనం కలిగినవి. ఇవి దీక్షిత కృతులలోని 'మిశ్రం' అనే సాహిత్య రచనా విశేషానికి మార్గ దర్శకమైనవి అనుకొనే వీలున్నది. త్యాగరాజ కృతులకు పూర్వం అటువంటి రచనలు లేకపోవడం మూలాన కృతి అనే సంగీత రచనా ప్రబంధానికి త్యాగరాజే (18-19 శతాబ్దులు) ఆద్యులని ప్రతీతి. పదములకు ఆద్యుడు పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమయ్య (1404-1500) 15వ శతాబ్దివాడు. కడప జిల్లా ప్రాంతాలకు చెందినవాడు. చిత్తూరు జిల్లాలోని తిరుమల - తిరుపతులలో జీవితంలోని అధికభాగం గడిపినవాడు, శ్రీ కృష్ణ దేవరాయల తరువాత రాజైన సాళువ నృసింహదేవరాయలు కాలంవాడు. పురందర దాసు సమకాలీనుడు. ఈయన తనసంగీత(గేయ) రచనలకు కేవలం రాగం మాత్రం సూచించి ఊరుకున్నారు. స్వర రచన (రాగ వరుస) లభ్యం కాలేదు. ఆ రోజులలో ప్రతి రాగానికి స్వరమెట్టు అని ఉండేదని, ఒక్కొక్క రాగంతో ఒక్కొక్క తాళంతో పాడవలసిన గేయానికి ఒకే స్వర వరుస వుండేదనీ, దీన్నే స్వరమెట్టు అనే వారనీ అని సంధ్యావందనం శ్రీనివాసరావు అనే రాయలసీమ ప్రాంత సంగీ మహా విద్వాంసు లొకరి వలన వినడం జరిగింది. ఈ కారణంగా తాళ్లపాక అన్నమయ్యగాని, ఆ తరువాత క్షేత్రయ్య (16వ శతాబ్ది నాయకరాజులకాలం) కూడా కేవలం రాగాల పేర్లను మాత్రం తన గేయాలకు పదాలకు సూచించినారనీ, 'రాగమెట్టు'కు ఉదాహరణగా శంకరాభరణ చాపుతాళ కృతి మొదట క్షేత్రయ్య(ఎవ్వడే వాడు?) ఆ తరువాత త్యాగరాజు (మనసు స్వాధీనమైన), దీక్షితార్ (అక్షయలింగ విభో) అదే రాగ (తాళ) మెట్టులో కృతులు రచించినారని విద్వాంసుల వలన వినిన విశేషము. అంతకు కొంచెం ముందు భద్రాచల రామదాసు కూడా "నన్ను బ్రోవుమని చెప్పవె, సీతమ్మ తల్లీ" అనే శంకరాభరణ రాగ చాపుతాళ కీర్తన (ఇప్పుడు కల్యాణి మెట్టుతో పాడుతున్నారు) కూడా ఇదే స్వర వరుసలో రచించిగానం చేసి వుండటం, ఆ కీర్తన తెలుగు తమిళ ప్రాంతాలలో సమాన ప్రచారం కలిగి ఉండటం బట్టి చూస్తే ఈ కీర్తన మెట్టును తరువాతి వాగ్గేయ కారులు అనుకరించినారనుకోవడం కంటే ఒకే స్వర మెట్టు అందరికీ అనుసరణీయమైనది ప్రజాదరణ పొంది అందరూ పాడ గలిగేందుకు అవకాశం వుంటుందనీ, అందువల్లనే వాగ్గేయకారులు పరిమితంగానైనా 'స్వరమెట్టు' పద్ధతి పై రచనలు చేసి వుంటారని అనుకోవడం సమంజసం. లేకపోతే మహాద్రష్టలయిన త్యాగరాజాది వాగ్గేయ కారులకు ఒకరిని అనుకరించవలసిన అగత్యం లేదు. ఒకే స్వర మెట్టు ఉండటంవలన స్వర రచన వేరుగా చూపించవలసిన అవసరం లేదు. అందుకే ఆ రోజుల్లో స్వర రచన అనేదే వాడుకలో లేదు. అపార వైవిధ్యంతో కూడిన కృతి రచనలు ప్రారంభించిన త్యాగరాజుల కాలంనుండి, గేయాలకు రాగ వరుసలు కూడా వైవిధ్యంతో కూడినవి కావటం వల్ల, అప్పటినుంచే గేయాలకు వేరుగా స్వరరచన కూడా సూచించవలసినపద్ధతి ప్రారంభమైంది. అంతకు కొంచెం ముందుగా వ్రాసిన పదవర్ణాలకు స్వర రచన ఉండేది కాదు. వర్ణాలు కేవలం సంగీత రచనలు కాగా, కృతులు (త్యాగరాజు ప్రారంభించిన సంగీత రచనలు) సంగీత, సాహిత్య, భక్తి (ఆధ్యాత్మిక) భావాల త్రివేణీ సంగమాలు. ఇప్పటి మన రాష్ట్ర ప్రాంతంలో సంస్థానాలలో మాత్రం శాస్త్రీయ సంగీత విద్యా పోషణ జరిగేది తప్ప ఇతరత్రా శాస్త్రీయ సంగీతం అభివృద్ధి ఇంచుమించు రెండు మూడు శతాబ్దాలు స్తంభించి పోయిందనే చెప్పవచ్చు.

మనకు తెలిసిన శాస్త్రీయ సంగీత చరిత్ర, విజయనగరం, బొబ్బిలి, పిఠాపురం, నూజివీడు, శ్రీకాళహస్తి, వెంకటగిరి, కార్వేటినగరం సంస్థానాలకు పరిమిత మైనది. ఇందులో మళ్లీ విజయనగరం, బొబ్బిలి, పిఠాపురం, శ్రీకాళహస్తి, కార్వేటినగరం, సంస్థానాలకు సంబంధించి రచనలు, మహా విద్వాంసుల వ్యక్తిగత చరిత్రలు ఉండటం వల్ల ఇక్కడ సంగీత శాస్త్ర విద్యకు పోటాపోటీలుగా ప్రోత్సాహం అందుతుండేదని అనుకోవచ్చు. త్యాగరాజు స్వామిసైతం తమ తీర్థయాత్రా సందర్భంలో నెల్లూరు ప్రాంతంలోని కోవూరు వచ్చి శిష్యుడైన సుందరేశ మొదలి ఆతిథ్యంలో ఉండి కోవూరి సుందరేశ్వర స్వామిపై మీనాక్షిపై కోవూరి పంచ

రత్నాలు అనే ఐదు కృతులు 'ఈ వసుధ' (శహనరాగం), 'సమ్మినచ్చిన'(కల్యాణి), 'కోరి సేవింప'(ఖరహర ప్రియ), 'శంభో మహాదేవ (పంతువరాళి), 'సుందరేశ్వ రుని' (శంకరాభరణం) కృతులు రచించారని ప్రతీతి. కోవ్వూరు అచ్చం తెలుగు ప్రాంతమే కనుక త్యాగరాజు స్వామి వారి కృతి రచనా సంపద ఆ ప్రాంతం వరకూ వ్యాప్తిలో ఉండినట్లు భావించవచ్చు. పైగా బొబ్బిలి కేశవయ్య (భూలోక చాప చుట్టి' బిరుదాంకితుడు) త్యాగరాజుల వారిని కోవ్వూరులో సందర్శించిరట. వారు స్వామి వారి కీర్తనలనేకములను త్యాగరాజు శిష్యుల ద్వారా సేకరించి (అప్పుడు కాపీరైట్లు, ఇంటలెక్చువల్ ప్రాపర్టీ రైట్లు అనేవి అనూహ్యాలు) తెలుగునాట ప్రచారం చేయడం వల్లనే, తెలుగు ప్రాంతంలో కూడా త్యాగరాజకృతులు యక్కించిత్ పరిచయములయినవి. వీటిలో "శాంతము లేక) (సామ) 'క్షీరసాగర (దేవగాంధరి), నగుమోము (ఆభేరి), వందనం (శహన), 'ఎన్నగా మనసుకురాని (నీలాంబరి), వరమూన సుతుడు (సౌరాష్ట్రం - మంగళం) సుజన జీవనా (ఖమాస్) వంటి కీర్తనలను 19-20 శతాబ్దాలలో మధ్యతరగతి కుటుంబాలలో గృహిణు లలో ఇంటింటి కీర్తనలుగా ప్రచారంలో ఉండేవి. 18-19 శతాబ్దంలో బొబ్బిలికేశ్వయ్య గారే కాక వీణ వెంకట రమణదాసు వంటి మరి కొందరు కూడా సంగీత విద్యావేత్తలుగా ప్రతీతి గాంచిన వారు. ముఖ్యంగా వీణా వాద్యానికి మన ప్రాంతంలో ఎక్కువ ప్రాముఖ్యత ఉండినట్లు కూడా స్పష్టమైన ఆధారాలున్నాయి. వీణల తయారీ గృహ పరిశ్రమ, వంశ పారంపర్య విద్యగా బొబ్బిలి, నూజివీడు సంస్థానాలలో శతాబ్దాలుగా అమరివున్న సంగతి తెలుగువారికి విదితమే. వీణ సంగీత వాద్యాలకు తల్లి వంటిది. తంత్రీ వాద్యాలలో మీటు వాద్యాలన్నీ వీణ ప్రాతిపదికపై నిర్మితమైనవే.

ఇక్కడ ఒక విషయం ప్రత్యేకంగా చెప్పాలి. భారతీయ సంగీతం గాత్రానికీ, వాద్యానికీ ఒకటే గాని దేనికది ప్రత్యేకంగా లేదు. గాత్రంలో పాడే దాన్ని వాద్యం పైన కూడా అదే శైలిలో, అదే గమకాలలో, గాత్ర ధర్మంలో పలికించడమే వాద్యకారులకు ఆదినుండీ ఆదర్శం. ఎక్కడో ఒకటీ, అరా ఆయా వాద్యాలకు అనువైన కొన్ని వాద్య వైచిత్రాలు (గిమ్మిక్కులు) వాద్య కారులు ప్రదర్శిస్తారు. కాని శ్రోతలలో కూడా అధికులు వాద్యంపై కూడా వాద్య వికారం కంటే గాత్ర ధర్మశైలినే ఆశించి ఆదరిస్తారు.

తెలుగు నాట, విజయనగర ప్రాంతంలో వాసావారి వీణ సంప్రదాయం మహోత్కృష్టంగా యెంచు తారు. పిఠాపురం వీణ సంగమేశ్వర శాస్త్రిగారు జంత్రగాత్ర నిపుణులేకాక, తమ వాద్య ప్రతిభతో రవీంద్ర నాథ్ టాగూరునే తన్మయులను చేసినారు. శాంతినికేతన్ స్థాపన కాలంలో కొంతకాలం అక్కడ వుండి అక్కడి పరిస్థితులకు అలవాటు కాలేక వెనుదిరిగి స్వస్థలమైన పిఠాపురం వచ్చేశారట. ఇంకా ఈమని శంకరశాస్త్రి పూర్వీకులు సైతం ఒక విశిష్టమైన, వీణా వాద్యశైలిని ప్రదర్శించే వారు.

ఫిడేలుతో అవినాభావ సంబంధం గల ద్వారం వెంకటస్వామి నాయుడు సంగమేశ్వరశాస్త్రి గారి వద్ద శిష్యరికం చేయడం మాత్రమే కాక, వారితో కచేరీలలో పాల్గొన్నట్లు ప్రసిద్ధం. శాస్త్రిగారు హెచ్చుశ్రుతి చిన్నవీణను నిలువుగా ధరించి వాయించేవారనీ, ఒక్కొక్కసారి ఫిడేలు కమానుతో వీణపై వాయించే వారనీ అంటారు.

24 మెట్ల వీణను తెలుగు నాయకరాజైన రఘునాథ నాయకరాజు కాలంలో రామామాత్యుడు, గోవింద దీక్షితులు రూపొందించారు. దీనికే రఘునాథవీణ, ఇప్పటి సరస్వతీ వీణ, సర్వరాగవీణ, అని పేర్లు. ఆ తరువాత తంజావూరు పాలించిన మహారాష్ట్ర రాజుల కాలంలో కూడా తెలుగే రాజ భాషగా కొనసాగింది.

మహారాష్ట్ర రాజులైన షాహజీ, శరభోజీ వంటివారు తెలుగులో అధిక సంఖ్యలో యక్షగానాలు రచించారు. అప్పుడు త్యాగరాజు, శ్యామాశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు అనే దక్షిణాది సంగీత త్రిమూర్తులుగా పేరొంది పందలాది తెలుగు వాగ్గేయ రచనలుచేసి, సర్వోన్నత ప్రసిద్ధులైన వాగ్గేయ కారులుగా చరిత్రలో నిలిచిపోయారు. ముత్తుస్వామి తమిళుడైనా సంస్కృతం లో కృతులు రచించారు. కొన్ని తెలుగులో కూడా వాగ్గేయాలు రచించారు (రూపము జూచి, తోడి రాగ వర్ణం) మరి కొన్ని తెలుగు తమిళ భాషలలో మణి ప్రవాళ సాహిత్య రచనలు చేశారు. ఎలాగైనా నేడు మనం తమిళులదేనని అపోహ పడుతున్న కర్నాటక సంగీతం తెలుగు తమిళ మేధా సంపత్తుల మేలు కలయిక. తెలుగువారు

ఏనాడో తను సొత్తైన తెలుగు గాన సంపదను తమిళుల వద్దనే ఉంచి దాని సంగతే మరచిపోగా, తమిళులు దానిని సొత్తుగా భావించి పరిరక్షించి ఇప్పటి వరకు నిల బెట్టారన్నది అక్షరసత్యం. అలా నిలబడి వున్న తెలుగు సంగీత సంపదను ఇప్పుడు మళ్లీ మనం స్వంతం చేసుకునే ప్రయత్నంలో వున్నాం. కాని ఇప్పటికీ ఈ ప్రయత్నంలో ఉండవలసినంత చిత్త శుద్ధి ఉండటం లేదన్నదీ నిస్సందేహమే.

తెలుగు సంగీతాన్ని మళ్లీ తెలుగు గడ్డపై పునరుజ్జీవింప చెయ్యడానికి కృషి చేసిన చరితార్థులను స్మరించడం ఈ సందర్భంలో అవసరం. త్యాగరాజ శిష్యుడైన మానాంబుచావడి వెంకట సుబ్బయ్య గారి వద్ద వారి చివరి దశలో శిష్యరికం చేసిన సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి గారికి వెంకటసుబ్బయ్య గారి సేకరణ అయిన త్యాగరాజ కృతి సంపద మొత్తం వారసత్వంగా సంక్రమించినట్లు అంటారు. అయితే ఆ గ్రంథాలు (తాళపత్ర) ఇపుడేమయ్యాయో, ఉన్నాయోలేవో, ఎవరికీ తెలీదు. వారి వద్ద శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులు శిష్యరికం చేసి, త్యాగరాజకృతి సంపదతో సంగీత శాస్త్ర సంప్రదాయ సంపత్తిని, కృతులెన్నో సముకూర్చుకుని వందలాది శిష్యులను సంగీత విద్వాంసులుగా తీర్చి దిద్దారు. ఇటు విజయనగరం మహారాజావారి సంగీత కళాశాలలో తొలి ప్రిన్సిపాల్ శ్రీ మదజ్జాడా దిభట్ల నారాయణ దాసు గారు ఆ తరువాత శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు గారు, తను తను అధికార అధ్యాపక కాలాలలో వందలాది గాత్ర వాద్య సంగీత కళాకారులను సృష్టించారు.

విజయవాడ పారుపల్లి వారూ, బందరు హరినాగ భూషణంగారూ కూడా వయొలిన్ వాద్య నిపుణులు. అందువలన ఈ ప్రాంతం కూడా వయొలిన్ విద్యార్థులకు కల్ప వృక్షమయింది. ఇలాగే మృదంగ వాద్య విద్యకు వారణాశి ఘంటయ్యగారు, ముళ్లపూడి లక్ష్మణరావు గారు, అశ్వధాటి రామమూర్తిగారు, పొట్లూరి వీరరాఘవయ్య గారు, మృదంగ తత్వ గ్రంథకర్త ధర్మాల రామమూర్తిగారు మరెందరో ప్రసిద్ధులు, అసంఖ్యాకులైన శిష్యకోటిని తయారు చేసినవారు.

సన్నాయి (నాదస్వరం)కి దాలి పర్తి పిచ్చిహరి, షేక్ చిన్న పీరు, షేక్ పెద్దమేలా, ఇంకా యెందరో మహా మహోపాధ్యాయు లనదగిన పెద్ద లున్నారు. వీరందరూ తెలుగునాట కర్నాటక శాస్త్రీయ సంగీత వ్యాప్తికి శక్తి వంచన లేకుండా కృషి చేసిన ప్రాతః స్మరణీయులు.

లోగడ ఆకాశవాణి ద్వారా, శాస్త్రీయ సంగీతానికి మరి కొంత మంచి జరిగింది. కీర్తి శేషులు శ్రీ వోలేటి వెంకటేశ్వర్లు రేడియో గురువుగా దక్షిణాది అంతా, బొంబాయి ప్రాంతంలో కూడా పూజనీయులైనారు. రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన దశాధిక సంగీత నృత్య కళాశాలల ద్వారా సంగీత వ్యాప్తి మరింత చురుకైంది. ప్రేక్షకులలో సంగీతాభిరుచి అభివృద్ధి చెయ్యడానికి ఊరూరా సంగీత సభలు వెలసి, నెలవారీ సంగీత కార్యక్రమాలు, సంగీత పోటీలూ నిర్వహిస్తున్నారు.

సంగీతోత్సవాలు నిర్వహిస్తున్నారు. లోగడ టి.వి. కూడా వచ్చి ఈ కృషికి మరికొంత ఊపు వచ్చింది. ఇవన్నీ ఉన్నా సరిపోయినది మాత్రం కాదు. ఇంకా యెంతో జరుగవలసి వున్నది. ముఖ్యంగా ఔత్సాహిక సభలు తను కృషిని ఇతోధికం చెయ్యాలి. ప్రేక్షకులు శాస్త్రీయ సంగీతంపట్ల ఉన్నతాభిరుచిని పెంచు కోవాలి.

ప్రభుత్వం సంగీత విద్యను పాఠ్యాంశంగా పాఠశాల స్థాయినుంచీ ప్రవేశపెట్టాలి. ముఖ్యంగా త్యాగరాజాది మహావాగ్గేయ కారుల రచనలను సుస్థిరం చెయ్యడానికి ఆధునిక ఎలక్ట్రానిక్ పరికరాలను ఇతోధికంగా ఉపయోగించి సమర్థులైన విద్వాంసులచే ఆ రచనలను గానం చేయించి ఆడియో, వీడియో పక్క వాద్యాలతో సహా రికార్డు చేయించి సర్వ సాహిత్యాలను క్రమపద్ధతిలో ముద్రింపించాలి. బాధ్యత అందరిదీ. ఒక్క ప్రభుత్వం పూనుకుంటే సరిపోదు. ప్రజా సహకారం, విద్వాంసుల సహాయం కూడా ఉండాలి.

ఇది శాస్త్రీయ సంగీతానికి పరిమితమైన కృషికాగా ఇంకా ఇంతకృషి జానపద సంగీతాన్ని సంగీత వాద్యాలను పునరుద్ధరించడానికి జరగాలి. పాల్కురికి సోమనాధుడు పేర్కొన్న అంశాలను పరిశీలిస్తే, జానపద సంగీత రీతులే శాస్త్రీయ సంగీతానికి స్ఫూర్తి ప్రదాతలైనందున, జానపద సంగీతం మళ్ళీ వర్ధిల్లేటట్లు ప్రభుత్వం, ప్రజ సహకారంతో సంయుక్తంగా కృషి చెయ్యాలి.

• • •

## ఒకటిన్నర శతాబ్ది చరిత్ర గల్గిన

# తెలుగు పత్రికా రంగం

**జి.యస్. వరదాచారి**

తెలుగులో పత్రికా రచన 1835లో "సత్యదూత"తో ప్రారంభమైందనే నేను నమ్ముతాను. "వృత్తాంతిన్" మరాఠీతో మొదటి తెలుగు పత్రిక అనే వాదన నాకు సమంజసంగా తోచదు. ఎందుకంటె ఆ రోజులలో పత్రికలను ముద్రించడానికి గాని, పుస్తకాలను అచ్చు వేయడానికి గాని ముద్రాక్షరశాలలుఏర్పాటు చేసుకోవడానికి గాని బ్రిటిష్ వారు విదేశీ మత ప్రచారకులకు అనుమతి ఇచ్చినంత సులభంగా దేశీయులకు ఇచ్చేవారు కాదు. "సత్యదూత" మద్రాసు నుండి కాక జిల్లా ప్రాంతమైన బళ్లారిలోని క్రిస్టియన్ ట్రాక్ట్ సొసైటీ ప్రచురణగా వెలువడిందన్న కారణాన అది మొదటి పత్రిక కాదనడం సమర్థనీయంగా తోచదు, దాని ప్రతులు దొరక్కపోవడం దాని ఉనికిని గుర్తించక పోవడానికి సరైన కారణం కాదు. ఈ రెండు కారణాలను బట్టె బంగోరే (బండి గోపాలరెడ్డి) ప్రథమాంధ్ర పత్రికగా "సత్యదూత"కు గుర్తింపు ఇవ్వడానికి నిరాకరించారు. లోగడ "సత్యదూత" తెలుగు లో ప్రథమ పత్రిక అయి ఉండకపోవచ్చునని వాదించడానికి నేనూ ఉబలాటపడ్డాను. 1956 నవంబర్ ఒకటిన "ఆంధ్రజనత" దిన పత్రిక రాష్ట్రావతరణోత్సవ ప్రత్యేక సంచికను ప్రచురించింది. "ఆంధ్రదేశంలో పత్రికల పుట్టుక, పెరుగుదల, అభివృద్ధి" అనే శీర్షికతో దానిలో నేను సదీర్ఘమైన వ్యాసం రాశాను. అందులో రెవరెండ్ జె. లాంగ్ నివేదిక నుండి ఉల్లేఖిస్తూ "1833 నాటికే తెలుగు లోనూ తమిళంలోను పత్రికలు బయలు దేరాయని, నాటికి మద్రాసు ప్రభుత్వం గ్రాంటులిస్తూ ఉండేదని" రాస్తూ దాన్ని బట్టి 1835 నాటి "సత్యదూత" కంటె ముందే తెలుగు పత్రిక ఉన్నట్టు నిర్ధారించవచ్చు నన్నాను. మరి ఆ పత్రిక ఏది? ఆధారాలు దొరకాలి కదా! పరిశోధనాత్మక పత్రికా రచయితలు మామూలుగా చేసే పనే ఆ వయసులో నేనూ చేశాను. ఒక నిర్ధారణకు వచ్చి దాన్ని సమర్థించే సాక్ష్యాధారాల కోసం వెతకడమన్నమాట. పరిశోధనాత్మక జర్నలిస్టులూ, ఆ మాట కొస్తే చారిత్రిక పరిశోధకులూ వాస్తవాల కోసం అన్వేషించాలే తప్ప సాక్ష్యాల కోసం కాదు అని ఒక నానుడి ఉంది. పరిణత మనస్కులు అలాగే చేస్తారు. కాని నేను వయోధర్మాన్ని బట్టి అనుకుంటూ సామాన్య భావనకు భిన్నమైన ప్రతిపాదన చేయాలనే చాపల్యానికి లోనయ్యా. అందుచేత మరవరం ప్రతాప రెడ్డి గారి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"లో ఉన్న ఒక వాక్యాన్ని పట్టుకున్నా. "19వ శతాబ్ది మధ్యకాలంలో బళ్లారిలో 'శ్రీయక్షిణి' అను వారపత్రిక ప్రారంభమయింది. అదే తెనుగు వారి మొట్ట మొదటి పత్రిక" అని రెడ్డిగారు రాశారు. దాని ఆధారంగా తమిళ కన్నడ తదితర భాషలలో వలె తెలుగులో మొదటి పత్రిక క్రైస్తవులు ప్రారంభించినది కాదని అంటూ "శ్రీయక్షిణియే మొదటి పత్రిక కాదన డానికి ఆధారము లేదు" అంటూ నకారాత్మక ప్రకటన ఒకటి చేశాను. 1868 ఏప్రిల్ లో "తత్వబోధిని" అనే పత్రికని వ్యాసంలోంచి ఇంకా ఇలా ఉల్లేఖించాను. "దిన వర్తమాని తప్ప ఆంధ్రదేశమందు వేరొక పత్రిక లేదు. శ్రీయక్షిణి, హితవాదియను పత్రికలు రెండుండెను. కాని యిటీవల నవియు యస్తమించినట్లు కానంబడియెడి" అంటె "శ్రీయక్షిణి" కొంత కాలం వెలువడి ఆగిపోయినట్టు అర్థమవుతున్నది. వరుస క్రమంలో దాన్ని ముందు పేర్కొన్నందువల్ల అదే మొదటి పత్రిక అయి ఉంటుందని నిర్ధారించడానికి యత్నించానన్నమాట. ఇవాళ ఆ వాదన నాకే సమంజసంగా తోచదు. ఆ వ్యాసం ప్రచురితమైన కొద్ది రోజుల తర్వాత మల్లంపల్లి సోమశేఖర శర్మగారు "ఆంధ్ర జనత" కార్యాలయానికి వచ్చారు. ఆ వ్యాసమున్న పత్రిక ప్రతి అడిగి తీసుకున్నారు. నన్ను పిలిపించుకొని మాట్లాడారు. ఏదైనా ఒక నిర్ధారణకు రావాలంటె అది కాదు కనుక ఇదియే ఉంటుందన్న వాదన పనికిరాదన్నారు. స్వతంత్ర ఆధారాలు చూపడం పరిశోధకుడి బాధ్యత అని హితవు చెప్పారు. చారిత్రక సత్యాలకు మన ఇష్టాయిష్టాలతో

నిమిత్తమేమిటి? ఈనాటికీ కొందరు కొమ్ములు తిరిగిన చారిత్రక పరిశోధకులు తమ సైద్ధాంతిక విశ్వాసాల పేరిట చరిత్రను వక్రమార్గం పట్టించే ప్రయత్నాలు చేస్తున్నారు. గనుక ఇంత రాయాల్సి వచ్చింది. లేకపోతే తెలుగులో మొట్ట మొదటి పత్రిక "సత్యదూత" అని ఒక్క వాక్యం రాసి ముగించవచ్చు.

## వృత్తాంతినిలో వ్యావహారిక భాష

బంగ్లోరే అభిప్రాయం ప్రకారం తెలుగులో మొదటి పత్రిక "వృత్తాంతిని" కాక, దీన్ని 1838 లో మద్రాసుకు చెందిన సంపన్నులు కొందరు, స్వంత ప్రెస్‌లో అచ్చు వేసి ప్రచురించనారంభించా రనడానికి ఆధారాలు దొరికాయి. దీనికి మండిగల వెంకటరాయశాస్త్రి సంపాదకులుగా ఉండే వారని, ఇది వార్తా వారపత్రిక అని తెలుస్తున్నది. కాని దీని ప్రతులయా దొరకలేదు. దీని గురించి తర్వాత వెలువడిన "వర్తమాన తరంగిణి" అనే పత్రికలో ప్రచురితమైన లేఖం నుండి సమాచారం లభించింది. ఈ లేఖను బ్రౌన్ తన సంపుటాల్లో పునర్ముద్రించారు. 'గిడుగు రామ్మూర్తి పంతులు కూడా తమ గద్య చింతామణిలో ఉదాహరించారు.' దానిని బట్టి "వృత్తాంతిని" ఆనాటి సాంఘిక దురాచారాల మీద కత్తి గట్టినట్టు అర్థమవుతుంది. మరో విషయం తిరుమల రామచంద్ర గారు తమ "తెలుగు పత్రికల సాహిత్య సేవ" అనే గ్రంథంలో రాసినట్లు "ఆనాడు తెలుగులో పత్రికానుభవం కలవారు లేరు. పత్రికా పరిభాషకూడా లేదు". అంతేకాదు. తర్వాత వచ్చిన గ్రాంథిక భాషా వేషం కూడా లేదు "వృత్తాంతిని"లోని భాష పూర్తిగా ఆనాటి మద్రాసు శిష్ట వ్యావహారికం.

"వర్తమాన తరంగిణి" 1842లో వెలువడి ఎనిమిదేళ్లు సాగింది. దీనికి పువ్వాడ వెంకటరావుగారు సంపాదకులు. "వృత్తాంతిని" కన్నా దీని భాష మరింత "నేవళంగా" ఉండేదని రామచంద్రగారు రాశారు. "వృత్తాంతిని"లో సాహిత్యము ఊసే లేదు. వర్తమాన తరంగిణిలో సాహిత్య విషయాలు ప్రచురితమయ్యేవి. చిన్నయ సూరి ఒకపద్యం రాసి, దానికి పండితుల నుంచి అర్థం తెప్పించి ప్రచురించాలని కోరగా సంపాదకులు అలాగే చేశారు. 1848 లో "హితవాది", "దినవర్తమాని" పత్రికలు వెలువడాయి. "దినవర్తమాని" మద్రాసు ప్రభుత్వం నుంచి అడ్వర్టయిజ్ మెంట్ల రూపంలో ధన సహాయం పొందుతూ పాఠకుల విమర్శకు గురైంది. ?"మితవాది" కొద్ది కాలం తర్వాత ఆగిపోయింది. అలా ఆగిపోవడాన్ని, గురించి 1865లో వెలువడిన "తత్త్వబోధిని"లో ప్రచురితమైన వార్త చూడండి. "తత్త్వసర్తులు మొట్ట మొదట దానిని ప్రారంభించినప్పుడు కొంతకాలము లోనే తమ పత్రిక తెలుగు దేశమెల్ల వ్యాపించి పన్నెకెక్కుననియు, చందాదారులను పోషకులను బెక్కుండ్రను గల్గుదురనియు, ద్రవ్యములను నింకను విశేషమైన గ్రంథముల ప్రచురింపనగుననియు దలచి ...... రెండు మూడు సంవత్సరములు దానిని జరుపుట యందు ద్రవ్యమును వెచ్చించి, దేహశ్రమను బొందుతూ వచ్చిరి. " అంటే ఈ రోజుల్లో లాగానే ఆనాడు కూడా పెద్ద ఆశలు పెట్టుకొని పత్రికలు ప్రారంభించి చేతులు కాల్చుకునే వారు ఉండేవారన్నమాట.

ఈ వార్తను చదివి గమనించవలసిన విషయం మరొకటుంది. ఆ పత్రిక భాషలో వచ్చిన మార్పు.

## భాషా సేవకు ప్రాధాన్యం

అప్పటికే పత్రికలలో అచ్చవు తున్న విషయాలపై ప్రభుత్వ నిఘా పెరిగింది. కొన్ని పత్రికలు ప్రభుత్వ ప్రాపకం కోసం పాకులాడడం ప్రారంభించాయి. బ్రౌన్ లాంటి వారు రంగప్రవేశం చేసి సాహిత్య విషయాల ప్రచురణను ప్రోత్సహించారు. దాంతో పత్రికలు కూడా వివాదరహితమైన సాహిత్య విషయాలకే ప్రాధాన్యమివ్వడం మొదలు పెట్టాయి. ఆ విధంగా పూర్తిగా సాహిత్య విషయాలకే అంకితమైన పత్రికలు రాసాగాయి. అలాంటి వాటిలో మొదటి పత్రిక "సుజనరంజని" 1862లో ప్రారంభమైన ఈ పత్రికకు వింజమూరి కృష్ణమాచార్యులు, బహుజనపల్లి సీతారామాచార్యులు, పరుసుంచి సుబ్బరాయులు నాయుడు సంపాదకులు. కుముచంద్ర, భాస్కర రామాయణం పద్యాలకు చిన్నయసూరి పద్యంకరా లఘుటిప్పణి, తాత్పర్యాలు ప్రచురించడమే గాక దీనిలో విద్యార్థులకు ఉపయోగకరమైన ప్రశ్నాపత్రాలు, వ్యాకరణాంశాలు ఇచ్చేవారు. అంతేగాక ఆంగ్ల పారిభాషిక పదాలకు తెలుగు సమానార్థకాలు ఇచ్చేవారు. ఈ పారిభాషిక పదాలను తర్వాత విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు రచించిన వారెందరో వాడుకున్నారు.

తర్వాత చెప్పుకోదగిన ప్రముఖ పత్రిక కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి "ఆంధ్రభాషా సంజీవని". పేరును బట్టి తెలుస్తున్నట్లుగా ఇదీ భాషా సేవకే ప్రాధాన్యమిచ్చింది. కొక్కొండ వారు అనేక భాషలు తెలిసిన వారు. బహుశాస్త్ర పారంగత [illegible] ఆయన బహుముఖ ప్రజ్ఞ [illegible] పత్రికలో సంపాదకీయం ఉండాలన్న

పద్ధతిని ప్రారంభించింది ఆయనే. సారస్వత చర్చలు, గ్రంథ సమీక్షలు, కవితలు ప్రచురించారు. వీరేశలింగం గారితో తర్వాత కాలంలో హోరాహోరి పోరు సాగించిన ఆయన తొలిపద్య కావ్యం "శుద్ధాంధ్ర భారతం" లోని కొన్ని పద్యాలు కొక్కొండ వారే ప్రచురించారు. తెలుగు సాహిత్యంలో తొలి స్మృతికావ్యంగా భావించబడే పద్మాది సుబ్బారాయుడి శోకగీతం ఆయనే ప్రచురించారు. "పురుషార్థ ప్రదాయిని"లో దీని గురించి రాసిన సమీక్ష చదువదగింది.

"ఈ పత్రిక యందు చదువుటకు మిగుల నానందముగను, ఉపయుక్తముగను నుండు ఆంధ్రభాషా విషయములును, దేశాభివృద్ధికరములగు నితరములైన పద్ధతులును, మంచి వృత్తాంతములును, ఇంకను కొన్ని కొన్ని విషయములను ఎన్నికకు రాదగిన తిన్నని మధురమైన శైలిలో వ్రాయబడుచున్నవి", ఐతే కొక్కొండ వారిలో గ్రాంథిక భాషాభిమానం కరడుగట్టింది.

## సంస్కరణోద్యమానికి సాధనం

తెలుగు పత్రికారంగంలో కందుకూరి వీరేశలింగంగారి ప్రవేశంతో నూతనాధ్యాయం ప్రారంభమవుతుంది. 1874 అక్టోబర్ లో ఆయన 'వివేకవర్ధని' పత్రికను మాసపత్రికగా ప్రారంభించారు. బెంగాల్ లో రాజారామ్ మోహన్ రాయ్ వలె తెలుగుదేశంలో వీరేశ లింగంగారు పత్రికను సమాజంలోని దురా చారాల నిర్మూలనకు, పాలనావ్యవస్థలో అవినీతిని తూర్పారబెట్టడానికి, ప్రజలలో తమ హక్కుల గురించిన చైతన్యం తీసుకు రావడానికి శక్తిమంతమైన సాధనంగా ఉపయోగించారు. పత్రికా రచనలో తన లక్ష్యాలను ఆయన ఇలా వివరించారు. "నేనేర్పరచుకున్న భాషాభివృద్ధి మార్గము తెలుగు భాషలో మృదువైన సులభశైలిని, సలక్షణమైన వచన రచన చేయుట, దేశాభి వృద్ధి మార్గము జనులలో గల దురాచార దుర్వర్తనముల బాపియు వృద్ధి పద్ధతులను జూపియు వారి నధిక నీతిమంతులుగా జేసి దేశము నున్నత స్థితికి దెచ్చుటకై శక్తి వంచన లేకుండ పాటుపడుట దేశాభివృద్ధి కలుగు టకయి విద్యా విషయమునను వ్యవహార విషయమునను, కులాచార విషయమునను, నీతి విషయమునను, మత విషయమునను నానాముఖముల కృషిచేయ దలంచియు నదియే కాని యొక్క రాజ్యాంగ (రాజకీయ) విషయమునందే పనిచేయుట నా ఉద్దేశము కాదు."

తర్వాత పక్షపత్రికగాను, వారపత్రికగాను మారిన "వివేకవర్ధని" తన ఆశయసిద్ధికి నిర్విరామంగా పోరాడింది. అవినీతి పరులైన ఉద్యోగులకు, సమాజంలో పెద్ద మనుషులుగా చలామణి అవుతూ తప్పుడు పనులు చేసే వారికి సింహస్వప్నంగా ఉండేది. ఈనాడు పరిశోధనాత్మక జర్నలిజమని పిలువబడు తున్న ప్రక్రియకు ఆనాడే ఆయన నాంది పలికారు. అయితే వీరేశలింగం గారుఏది రాసినా సంస్కరణాభిలాషతోనే కాని ఈనాటి జర్నలిస్టు ఉద్యమకారులు కొందరి వలె కక్షసాధింపు ధోరణిలో కాదు. పత్రికకు మకుటంగా ఆయన ఎంచుకున్న మహాభారత పద్యమే ఆయన ప్రవృత్తిని తెలుపుతుంది.

"ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియంబు తన మనంబున
కగుదా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మ పథములకెల్లన్"

(ఈ పద్యాన్నే తర్వాత 'ఆంధ్ర పత్రిక' తన ఆశయ ప్రకటనగా ప్రచురించు కొంటూ వచ్చింది)

పంతులుగారు విశ్వ విద్యాలయ పరీక్షా పత్రాలలో దొర్లిన తప్పులను ఎత్తి చూపినా రాజమండ్రి మునిసిపల్ సభ్యులు దాస్య ప్రవృత్తిని ఖండించినా ఈ ఉద్దేశంతోనే. కొక్కొండ వారితో వచ్చిన అభిప్రాయభేదాలు తీవ్రస్థాయికి చేరుకొని ఒకరినొకరు విమర్శించుకోడానికి ప్రత్యేకంగా పత్రికలను పెట్టి ఉద్యమాలు నడిపినప్పటికీ తర్వాత ఆ వాదులాట నిరర్థకమని తెలుసుకొని మాను కొనడానికి కారణమిదే. ఆయనే ఇలా రాసుకున్నారు.

"నన్నును ,నావ్రాతలను దూషించుటకయి వెంకటరత్నం పంతులు 'హాస్యవర్ధని' యని పేరు పెట్టి యొక పత్రికను బయలుదేరదీయగా, నేనును దానికి విరోధముగా 'హాస్యసంజీవిని' యని పేరు పెట్టి మరి యొక పత్రకను బయలు దేరదీసితిని..."

"... మొట్ట మొదటి వారి మాటలకు మారు వ్రాయ గొంత ప్రయత్నించితి కాని తరువాత నది యవివేకమనియు, నెవ్వరికినీ లాభం లేని వృథా కాలక్షపమనియు దెలిసికొని వారేమి వ్రాసినను మారుమాట్లాడక యూరకుండి యుపేక్షాపరుడనయి యా పత్రికను చదువుటయే మానుకొంటిని".

అంతేకాక వీరేశలింగంగారు స్త్రీల కోసం "సతీహిత బోధిని" అనే పేరుతో 1883లో ఒక మాసపత్రికను ప్రారంభించారు. తెలుగులో ఇదే స్త్రీల తొలిపత్రిక. పంతులుగారు "సత్యసంవర్ధనీ" అనే పత్రిక కూడా నడిపారు. ఈ పత్రికలన్నీ లాభసాటిగా నడిచినవి కావు.

**"చందా మూలమున వచ్చినది పోగా దానికయ్యెడు మిగిలిన వ్యయము లన్నిటినీ నేను భరింపవలసివాడనయితిని"** అని **ఆయన రాసుకున్నాడు.**

తెలుగులో దాదాపు అన్ని సాహితీ ప్రక్రియలలో తొలిరచనలు తానే చేశానని వీరేశలింగంగారు తెలిపారు. అంతే కాక పత్రికా రచనకు అవసరమైన పరభాషా నిర్మాణానికి కూడా ఆయన కృషి చేశారు. వివేకవర్ధనిలో ఆయన కొన్ని ఇంగ్లీషు పద బంధాలకు వాడిన తెలుగు సమానార్థకాలు ఇలా ఉండేవి.

సబ్ మేజిస్ట్రేట్ = అనుగత దండనాయకుడు

డిస్ట్రిక్టు మేజిస్ట్రేట్ = మండల దండ విధాయకుడు

డిస్ట్రిక్టు జడ్జి = మండల న్యాయాధిపతి

డిస్ట్రిక్టు కలెక్టరు = మండల కరగ్రాహకుడు

పార్లమెంట్ = రాజ్య నిర్వాహక మహాసభ

లెజిస్లేటివ్ కౌన్సిల్ = శాసన నిర్మాణ సభ

స్టాండింగ్ కమిటీ = స్థిర సభ

ఇలాంటివి ఇంకా ఎన్నో ఉన్నాయి. తర్వాత పత్రికల వారు వీటిలో కొన్నిటిని వాడుకున్నారు. వీరేశలింగం గారు ఈ విధంగా తెలుగు పత్రికా రంగ సర్వతోముఖ వికాసానికి పాటుపడ్డారు. మొదట ఆయన కొంత గ్రాంథిక భాష రాసినా "భాషాభివృద్ధియే పత్రికల ముఖ్యోద్దేశము కావాలన్న" ఆయన అంగీకరించలేదు. "పత్రికల గ్రాంథిక ఫణితియున్న బండితులు- గాని వారికి పనికి రానిచో, అప్పుడు పత్రికోద్దేశమే కొరవడునని" ప్రకటించారు.

తెలుగులో వెలువడిన మొట్ట మొదటి దిన పత్రిక "దేశాభిమాని". దేవగుప్తాపు శేషాచలపతి దీనిని పక్షపత్రికగా ప్రారంభించి వార, ద్వైవార పత్రిక గానే కాక కొంత కాలం దినపత్రికగా కూడా ప్రచురించారు. 1901లో రాజమండ్రి నుండి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి సంపాదకత్వంలో వెలువడిన "గౌతమి" అనే దిన పత్రిక లాయాకు సమీక్ష వార్తలో దీని ప్రస్తావన ఉన్నది. "గౌతమి" తెలుగులో మొదటి లేదా రెండవ దినపత్రిక అయి ఉంటుందని తిరుమల రామచంద్ర గారురాశారు. కాని "దేశాభిమాని" సమకాలిక మైన "శశిరేఖ" కూడా కొంత కాలం దిన పత్రికగా వెలువడినట్టు సమీక్షలను బట్టి తెలుస్తుంది. "తెలుగు..."లో గౌతమి గురించి సమీక్షరాస్తూ "ఆంధ్ర లోకమునకు గౌతమియే మొదటి దిన పత్రిక,కాదు. దేశాభిమాని కొంత కాలము కిందట దినదినము దలచూపుచూ వచ్చెను అని రాశారు. దీని వల్ల "దేశాభిమాని" తెలుగులో మొదటి దినపత్రిక అని ధ్రువపడుతున్నది. ఈ పత్రికలన్నీ చాలా కాలం లాభసాటిగా నడవకపోయినా తెలుగు జర్నలిజానికి గట్టి పునాదులు వేశాయి.

## నవ్య భావోదయానికి నాంది

ఈ పునాదుల పైనే 20వ శతాబ్దం ఆరంభంలో 'కృష్ణాపత్రిక' వంటి పత్రికలు వెలసి నవ్యభావోదయానికి నాంది పలుక కలిగాయి. 1902లో కృష్ణా జిల్లా సంఘం పక్షాన కొండా వెంకటప్పయ్య గారు, దాసు నారాయణ రావుగారు మచిలీపట్నం నుంచి ప్రారంభించిన ఈ వార పత్రిక పురాణం సూరిశాస్త్రిగారి మాటలలో వంగ సాంప్రదాయములను పుణికిపుచ్చుకొని తెలుగుజాతికి చైతన్య స్ఫూర్తి నివ్వడంలో అగ్ర భాగాన నిలబడింది. 1903లో కృష్ణా పత్రికలో సహాయకుడిగా చేరి 1907 లో సంపాదకుడైన ముట్నూరి కృష్ణారావు పంతులుగారు, సర్వసానన్ని లెక్క చేయక కలాన్నికత్తిగా ఝుళిపించి సంపాదకత్వాన్ని నెరుపుతూ తెలుగు జర్నలిజానికి కొత్త నడకడి దిద్దారు. అధికార పదవులలో ఉన్న వారి అవినీతిని బట్ట బయలు చేయడానికి ఆయన ఏనాడూ జంకలేదు. ఆనాటి కృష్ణా జిల్లా బోర్డు ప్రెసిడెంట్ తిక్కాని బాలాజీరావు బోర్డు కోసం లారీలు కొనడంలో "కొంత ప్రయోజనం" పొందారని రాసి పరువు నష్టం కేసును ఎదుర్కొని గెలిచారు.

1929 ఫిబ్రవరి 8వ తేదీనాడు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు తనకు జరిగిన సన్మానసభలో మాట్లాడుతూ కృష్ణారావుగారు అన్నమాటలు పత్రిక రచయితలందరూ గుర్తుంచుకోదగినవి.

"పత్రికా నిర్వహణము చాలా బాధ్యతలో కూడిన కార్యము. భాషా పాటవము, రచనా కౌశలము, భావోద్రేకము ఉన్న వాలవు. క్రమానుగతములైన సాంప్రదాయములను, ధర్మాధికములైన మర్యాదలను గుర్తింపగల చరిత్ర జ్ఞానము, ప్రజల మనోరథము, నిగూఢ చిత్తవృత్తులను పరీక్షింపగల విశాల దృష్టి దేశ జనితవ్య మునుపలక్షింపగల గంభీర విశ్వాసము పత్రికాధిపతులు అలవరచు కొనదగిన లక్షణములు. వీటన్నింటి కంటే కావలసినది నిర్మలమైన సత్యనిరతి".

ప్రజాభిప్రాయాన్ని గురించి ఆనాడు ఆయన చెప్పిన మాటలు ఆశ్చర్యం కలిగించేవిగా ఉన్నాయి. ఎంత నిజం!

"ప్రజాభిప్రాయమని చెప్పబడు స్పష్టముగ నిర్ణీతమై యుండదు గాబట్టి - పత్రికాధిపతి తన యిష్టమొచ్చినట్టో, తన పత్రిక యొక్కయో లాభాలను బట్టి నిర్ణయమును సర్వజన మోదము చేయు

టకు వాని ప్రాశస్త్యమును, స్వతంత్ర యుక్తులనె నిరూపించుటకు బదులు దానిని ప్రజలపై రుద్ది, వారు నమ్ముచున్న సిద్ధాంతములదియే యను వ్యామోహము కల్పించుట పత్రికా రచన నైపుణ్యముగ నెంచబడుచున్నది".

## ఉదాత్త ఆశయాలతో 'ఆంధ్రపత్రిక'

అప్పటికే దేశంలో జాతీయోద్యమం బాగా బలపడింది. ప్రజలను జాగృత పరచడం కోసం పత్రికలు కృషి చేయాలన్న భావం యువకులలో ఏర్పడింది. 19 వ శతాబ్దంలోనే ఎ.పి. పార్థసారథి నాయుడు గారి సంపాదకత్వంలో ప్రారంభమైన "ఆంధ్ర ప్రకాశిక" రాజకీయ వార్తలకు ప్రాముఖ్యమిచ్చే పత్రికగా ప్రజల మన్ననలు పొందింది. ఈ వాతావరణంలో వ్యాపార రీత్యా బొంబాయి నగరంలో ఉన్న కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు మరాఠీ పత్రికలైన కేసరి వంటి పత్రికల వల్ల ఉత్తేజితులై తెలుగు వారిలో రాజకీయ చైతన్యాన్ని ప్రేరేపించాలనే ఉద్దేశంతో 'ఆంధ్ర పత్రిక'ను వారపత్రికగా ప్రారంభించారు. అయితే ఆంధ్రేతర ప్రాంతం నుండి తెలుగు పత్రికను వెలువరించి విజయవంతం చేయడంలో గల సాధక బాధకాలను గుర్తించి ఆయన 1914లో "ఆంధ్రపత్రిక"ను మద్రాసు నగరానికి తెచ్చి దిన పత్రికగా మార్చారు. మొదటి రోజున పత్రికలో ఏయే విషయాలుండాలో శీర్షికలు పెట్టి వివరించారు. [illegible] కొత్తగా పత్రికను ప్రారంభించా [illegible] పత్రిక విజయవంతం [illegible] విషయాలు అవసరమని భావిస్తారో వాటన్నిటినీ పంతులుగారు తమ జాబితాలో చేర్చారు. ఆంధ్రోద్యమము అనే శీర్షిక కింద "ఆంధ్రదేశాభ్యుదయమునకు సాధన భూతములైన రాజ్యాంగ వ్యవస్థలు, విద్యా వ్యాసనము, వ్యవసాయ వాణిజ్య వ్యవస్థలు, భాషాభివృద్ధి మొదలగు సకలోద్యమములీ పత్రిక యందు స్వతంత్ర విధమున విపులముగ విమర్శింపబడును" అని తెలిపారు. అలాగే వార్తావళి అనే శీర్షిక కింద "ఆంధ్రదేశ వార్తలు, పరరాష్ట్ర వార్తలు, విదేశీ వార్తలు మొదలగు సమస్త వార్తలను సకాలమున సంగ్రహముగా ప్రచురింపబడును" అని తెలిపి "ఆంగ్ల పత్రికాపేక్ష లేకయే సమస్త వార్తలను దీని యందు చదువుటకు వీలుండును" అని హామీ ఇచ్చారు. ఇంకా చిత్రపటాలు, చమత్కార చిత్రపటాలు జనరంజకంగా ముద్రిస్తామన్నారు. రాజ్యాంగ వ్యవస్థలు అనే శీర్షిక కింద "నిరంకుశాధికారములను తగ్గించుటకును, ప్రజాతంత్రమును వృద్ధి చేయుటకును సాధనభూతములైన గ్రామ వ్యవస్థలు, స్థానిక పరిపాలనా వ్యవస్థలు, శాసన నిర్మాణ సభల వ్యవహారములనుచిత రీతిని స్వతంత్ర విధమున దీని యందు జర్చింపబడును." అని చెప్పారు. మత సాంఘిక చర్చలు అనే మరో శీర్షిక కింద "జాతి కుల మత పక్ష వాతము బూనక సకల మతావలంబులును, అన్ని జాతుల వారును, భిన్నాభిప్రాయములను గల వారును నభివృద్ధి బొందుటకు దగిన యుదారభావములును, నాదర్శములును నిష్పక్షపాత బుద్ధిలో వ్యక్తీకరింపబడును" అని రాశారు. నిజానికి పత్రికారచనలో ఇంతకంటె ఉదాత్తమైన ఆశయాలు ఇంకేముంటాయి? అందుకే "ఆంధ్ర పత్రిక" తెలుగు దేశంలో జాతీయ భావవ్యాప్తికీ, తెలుగు ప్రజల సర్వతోముఖ వికాసానికి చేసిన కృషి అనితరసాధ్యమైనది. నాగేశ్వరరావు పంతులుగారు తాము చక్కగా రాయగల్గి ఉండి కూడా పత్రిక సంపాదకుడుగా తన పేరు వేసుకోక గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిని తొలి సంపాదకుడుగా నియమించారు. మహారాష్ట్రలో తిలక్ మహాశయుని వలె తెలుగులో హరిసర్వోత్తమరావుగారు వారి రచనలు కారణంగా రాజద్రోహ నేరారోపణకు గురై శిక్షననుభవించిన మొదటి వ్యక్తి. ఆయన 1919లో నేషనలిస్టు అనే ఇంగ్లీషు వార పత్రికలోకి వెళ్లి పోగా నాగేశ్వరరావు ఆంధ్రపత్రిక సంపాదకునిగా తన పేరే వేసుకున్నారు.

"ఆంధ్రపత్రిక" ఉగాది సంచికల ద్వారా తెలుగు సాహిత్యానికి నాగేశ్వరరావు పంతులుగారు ఎనలేని సేవ చేశారు. అంతటితో ఆగలేదు. సాహిత్యా నుబంధాలు ప్రచురించారు. తెలుగు సాహిత్య విమర్శకు అవి వరవడి దిద్దాయి. 1924లో పూర్తిగా సాహిత్య సేవకు, చరిత్ర పరిశోధనకు అంకితమైన "భారతి" మాసపత్రికను ప్రారంభించారు. తిరుమల రామచంద్ర గారి మాటలలో "భారతి తెలుగు సాహిత్యానికేగాక, సంస్కృతసాహిత్యానికి, చరిత్రకు, పురా తత్త్వానికీ, శాసన పరిశోధనకు, విజ్ఞాన శాస్త్రానికి, సంఘ పురోగతికి, మహాభ్యుదయానికి, వేయేల రాష్ట్ర దేశ పురోభివృద్ధికి సంబంధించిన సకల కార్యకలాపాలకు దోహదం చేసింది." అరవై సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా నడిచి భారతి ఆగిపోవడం దురదృష్టకరం. ఆ తర్వాత తెలుగులో పరిశోధనా వ్యాసాలు ప్రచురించగల ప్రామాణిక పత్రిక మరొకటి ఇంత వరకు వెలువడక పోవడం మరీ బాధాకరం.

(భారతికి ముందు 1921లో శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు "ప్రబుద్ధాంధ్ర" అనే పేరుతో ఒక పత్రికను ప్రారంభించారు. పత్రికా సంపాదకత్వాన్ని గురించి శాస్త్రి గారికి విచిత్రమైన అభిప్రాయాలు ఉండేవి. "పత్రికా సంపాదకత్వం అంటే ఆచార్య పీఠం అని నా నమ్మకం. లౌక్యాలకూ, స్వార్థానికి స్థానం కాదది. సత్యం నిర్ధారణ చెయ్యవలసిన ధర్మాసనం అది.. సత్యానికీ, ధర్మానికీ దాసుడు అయి ఉండాలి సంపాదకుడు. అసత్యానికీ, అధర్మానికీ దండధారినీ అయి ఉండాలి. ముఖ్యంగా స్వతంత్రుడు కావాలి. గురుపీఠం అధివసించి ఉండాలి. ఒకడి వెనుకబడిపోయే పరప్రత్యయనేయ బుద్ధికాగూడదు, అని "అనుభవాలూ - జ్ఞాపకాలూ" లో రాసుకున్నా రాయన. శ్రీపాదవారు గిడుగు వారి వ్యావహారిక భాషా వాదాన్ని సమర్థించారు. ఆయన వ్యాసాలను ప్రచురించారు. వ్యావహారిక భాషా ప్రయోజనాన్ని నొక్కి చెబుతూ మారేపల్లి రామచంద్ర కవిగారు రాసిన వ్యాసాన్ని ప్రచురించారు. శాస్త్రి గారు తను రచనలన్నిటిలోనూ చక్కటి వ్యావహారిక బాషనే రాశారు. ఆయన వాక్య నిర్మాణ శైలి అతి రమ్యమైనది.

## శిష్ట వ్యావహారికం
## పత్రికల భాష

వ్యావహారిక భాషావాదం బలపడుతున్న ఈ రోజులలోనే 1936లో తాపీ ధర్మారావు నాయుడు గారి "జనవాణి" పత్రిక వెలువడింది. తెలుగు వార్తాపత్రికలో పూర్తిగా వ్యావహారిక భాషను ప్రవేశపెట్టిన ఘనత నాయుడు గారికి దక్కింది. వ్యావహారిక భాషా ప్ర[illegible]జనాన్ని గురించి మరెవ్వరూ మెరుగు[illegible]డానికి అవకాశం లేనంత సమగ్రంగా ఆ[illegible]న ఇలా చెప్పారు:

"పత్రికలు ముఖ్యంగా ప్రజాస్వామ్యం కోసం అన్న మాట మరచి పోకుండా ఉంటే ఏ భాషలో ఏ స్థాయిలో వ్రాయాలో చెప్పనక్కరలేదు. మన దేశంలో చదువు వచ్చినవారు తక్కువ. వారికి వార్తాపత్రికల ఉపయోగం అందాలంటే ఒకడు చదువుతుంటే వారు విననైనా వినాల లేదా ఎవ్వరయినా వారికి చెప్పాలి. కాబట్టి రచయిత తన పాండిత్యం చూపడం కాదు కావలసింది. పాఠకుడు అసందిగ్ధంగా గ్రహించాలి. కాబట్టి నిత్య పరిచయమైన వ్యావహారికమే శరణ్యం కావాలి. వార్తలూ, వాని లోని విశేషాలూ చెప్తున్నామువాని పాఠ్యపుస్తకంలోని పాఠం చెప్పడం లేదని జ్ఞప్తిలో ఉంచుకోవాలి. సుబోధకంగా ఉండటమే ప్రథమావశ్యకత. తర్వాతనే శైలీ, పదగుంబన మొదలైనవి."

పత్రికల ప్రథమ లక్ష్యం విషయ ప్రసారం గనుక అందరికీ అర్థమయ్యే ప్రామాణిక శిష్ట వ్యావహారికం వాడటం తప్పనిసరి. తాపీ వారి దగ్గర ఉపసంపాదకులుగా పని చేసి తర్వాత 1938లో ప్రారంభమైన ఆంధ్రప్రభలో వార్తా సంపాదకుడుగా చేరి కొన్నేళ్లకు సంపాదకుడైన నార్ల వెంకటేశ్వరరావు గారు ఆయన పెట్టిన వరవడిలో వ్యావహారిక బాషను సుప్రతిష్ఠితం చేయడానికి కృషి చేశారు. ఆ విధంగా తెలుగు పత్రికలు వ్యావహారిక భాషలో సాగిన రచనలతో ప్రారంభమై మధ్యలో కావ్య ప్రచురణావశ్యకత దృష్ట్యా గ్రాంథిక బాష వాడటం ప్రారంభించి చివరకు విషయ ప్రసార లక్ష్యాన్ని గుర్తించి శిష్ట వ్యావహారికానికి తిరిగి వచ్చాయి. పత్రికలు అన్ని ప్రాంతాల వారికీ, అన్ని వర్గాల వారికీ అర్థమయ్యేట్టుగా ఉండాలి గనుక మాండలికాలు ఇలా ఉన్నాయని చెప్పడానికి తప్ప ఇతరత్రా మాండలికాలు వాడరాదన్న నియమం ఒకటుంది. ఇటీవలి కాలం జిల్లా ఎడిషన్లు వచ్చిన తర్వాత అవి ఆయా మండలాలకే పరిమితం గనుక వాటిలో మాండలికాలు వాడవచ్చునన్న భావన ప్రబలుతున్నది. కాని అలా చేయడం వల్ల కలిగే ప్రయోజనాన్ని, పరిణామాన్ని ఇంకా పరిశీలించవలసి ఉంది.

## తెలంగాణా కృషి

(ఇది ఇలా ఉండగా పూర్వ హైదరాబాద్ సంస్థానంలో నిజాం నిరంకుశ పాలనలో తెలుగు పత్రికలు వెలువడటానికి ఏ మాత్రమూ అనుకూలమైన పరిస్థితులు ఉండేవి కావు. అయినప్పటికీ 1913 మే నెలలో మహబూబ్‌నగరం నుండి శ్రీనివాస శర్మగారి సంపాదకత్వంలో "హితబోధినీ" అనే పేరుతో ఒకపత్రిక వెలువడింది. ఇదే తెలంగాణ నుండి వెలువడిన తొలి వార్తా పత్రిక. దీనికి బి. నారాయణరావు గారు యజమాని, ఈ పత్రికలో వైద్యము, పారిశ్రామికము, సంఘ సంస్కరణ విషయాలు ఉంటాయని నిర్వాహకులు రాసుకున్నారు. 1914మే సంచికలో ఈ పత్రిక ఆర్థిక దుస్థితికి లోనైనదని ప్రభుత్వ సహాయాన్ని కోరాముని రాసుకున్నారు. కాని ప్రభుత్వ సహాయం తెలుగు పత్రికకు దుర్లభం కనుక ఇది ఆగిపోయినది.

తర్వాత 1922లో ఆగష్టు 24వ తేదీన నల్లగొండ నుండి వెంకటరామ నరసింహారావు సంపాదకత్వంలో "నీలగిరి" అనే పత్రిక వెలువడింది. మూడు రోజుల తర్వాత ఆగష్టు 27వ తేదీనాడు వద్దిరాజు సీతారామచంద్రరావు సంపాదకత్వంలో వరంగల్ జిల్లా మహబూబ్ బాద్ తాలూకా ఇనుగుర్తి గ్రామం నుండి 'తెనుగు' అనే పత్రిక వెలువడింది. కాని ఆనాటి రాజకీయ వాతావరణంలో ఈ పత్రికలు కూడా

ఎక్కువ కాలం నిలువలేదు. కాని 1925లో వార పత్రికగా కవి పండిత పరిశోధకుడు సురవరం ప్రతాపరెడ్డి సంపాదకత్వంలో వెలువడిన "గోలకొండ పత్రిక" నాలుగు దశాబ్దాల పాటు ఈ ప్రాంత వాసులకు ఎనలేని సేవ చేసింది. గోలకొండ పత్రిక వార్తా పత్రికే అయినా ప్రతాపరెడ్డి గారి సాహిత్యానికీ ఎంతో ప్రాధాన్యమిచ్చారు. అజ్ఞాత కవులెందరినో ప్రోత్సహించి వెలుగులోకి తెచ్చారు. ఈ పత్రిక 1948లో నూకల నరోత్తమరెడ్డి సంపాదకత్వంలో దినపత్రికగా మారింది. ఈ ప్రాంత ప్రజల రాజకీయ హక్కుల కోసమే గాక, ఆనాటి కాంగ్రెస్‌లో రెడ్డి వర్గంగా పేరు పొందిన కొండా వెంకట రంగారెడ్డి వర్గ ప్రయోజనాల కోసం పోరాడింది.

1953లో పొట్టి శ్రీరాములుగారి ఆత్మాహుతి ఫలితంగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడ్డ తర్వాత తెలుగు వారందరి విస్తృత రాష్ట్రంగా విశాలాంధ్ర స్థాపన కోసం ఉద్యమం మొదలైంది. తెలంగాణా వెనుకబడిన ప్రాంతం గనుక దాన్ని విద్యా విషయికంగా అభివృద్ధి చెందిన ఆంధ్ర ప్రాంతాంతో కలిపితే ఈ ప్రాంత ప్రజలు నష్టపోతారంటూ, తెలంగాణాను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని ప్రతి ఉద్యమం ఒకటి బయలుదేరింది. దీనికి గోలకొండ పత్రిక అండగా ఉండగా, విశాలాంధ్ర మద్దతుదారుల భావాలకు ప్రచారమివ్వడానికో పత్రిక అవసరమని భావించి బూర్గుల రామకృష్ణరావుగారు, వి.బి. రాజుగారు, జనార్దనరావు దేశాయి కలిసి 'ఆంధ్రజనత' అనే పేరిట 1955లో సికిందరాబాద్ నుంచి ఒక దినపత్రికను ప్రారంభించారు. దీనికి కూచిమంచి సత్య సుబ్రహ్మణ్యంగారు సంపాదకులు. 1956 నవంబరు ఒకటిన 'ఆంధ్రప్రదేశ్ అవతరించే నాటికి ఈ పత్రిక ఓ మోస్తరు సర్క్యులేషన్‌తో స్వయం వృద్ధిని సాధించగల స్థితికి వచ్చింది. కాని తర్వాత దీని నిర్వహణ బాధ్యతను ప్రదేశ్ కాంగ్రెస కమిటి చేపట్టడం తో క్రమంగా క్షీణించి చివరకు మూతబడింది.

## ప్రవాసం నుంచి స్వరాష్ట్రానికి

1960లో తెలుగు పత్రికా రంగ చరిత్రను మలుపు తిప్పిన సంఘటన ఒకటి జరిగింది. అంతకు కిందటేడు మద్రాసులో 'ఆంధ్రప్రభ' 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' పత్రిక లలో సమ్మె జరిగింది, ప్రభ సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావు ఉద్యోగుల పక్షంలో చేరి సంపాదక బాధ్యతలు వదలి బయటకువచ్చేశారు. దాంతో ఆయన శ్రేయోభిలాషులు కొందరు కె. యల్.ఎన్. ప్రసాద్ గారి నేతృత్వంలో ఏకమై 'ఆంధ్ర జ్యోతి' అనే పేరిట నార్ల సంపాదకత్వంలో విజయవాడ నుంచి ఒక దినపత్రికను ప్రారంభించారు. ఆనాటి వరకు తెలుగులో పెద్ద పత్రికలైన "ఆంధ్రప్రభ", "ఆంధ్ర ప్రతిక" మద్రాసులో స్థిరపడి ఉన్నాయి.

విజయవాడలో 1945 డిసెంబర్ 3 నుంచి 'ప్రజాశక్తి ' దినపత్రిక, 1952 జూన్ 22వ తేదీ నుంచి విశాలాంధ్ర దినపత్రిక కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో వెలువడినప్పటికీ విజయవాడ తెలుగుపత్రికల కేంద్రంగా రూపొందలేదు. "ఆంధ్రజ్యోతి" వస్తుందనగానే దాని కంటె ముందుగానే "ఆంధ్రప్రభ' కూడా విజయ వాడ నుంచి ప్రచురణ ప్రారం భించింది. మరికొంత ఆలస్యంగా 'ఆంధ్రపత్రిక' కూడా 1965లో విజయవాడకు తరలి వచ్చింది. దాంతో ఆంధ్రప్రదేశ్ సాంస్కృతి రాజధానిగా గణతి కెక్కిన విజయవాడ ముఖ్య పత్రికా కేంద్రంగా కూడా మారింది. తర్వాతి కాలంలో పాక్షమిలీ ఎడిషన్లు, మోడెమ్ వంటి సాంకేతిక పరికరం తెచ్చిన వెసులుబాటుతో పలు కేంద్రాలలో అంటే విశాఖ పట్నం, తిరుపతి, విజయనగరం, రాజమండ్రి, అనంతపురం, కరీంనగర్‌లో వివిధ పత్రికలు ఎడిషన్లు ప్రారంభించడంతో కొంత వికేంద్రీకరణ జరిగింది. అది ప్రస్తుత విషయం కాదు. పెద్ద తెలుగు పత్రికలు తెలుగు నేల విడిచి సాము చేసే పరిస్థితి తొలగిపోయిందంటె చాలు. అప్పటి వరకు తెలుగు ప్రాంతం నుండి వెలువడే పత్రికలు ముఖ్యంగా "విశాలాంధ్ర" ప్రజాఉద్యమాలకు బాసటగా ఉండి ఆ తర్వాత పత్రికలకు ప్రజల దైనందిన సమస్యలతో సన్నిహిత సంబంధం ఏర్పడి పీడిత వర్గాల సమస్యలను ఇతోధికంగా ప్రతిబింబించ డానికి అవకాశమేర్పడింది.

1960లోనే "దక్కన్ క్రానికల్" ఆంగ్ల దిన పత్రిక ప్రచురణ కర్తలు పండితారాధ్యుల నాగేశ్వరరావు సంపాదకత్వంలో 'ఆంధ్రభూమి' అనే దిన పత్రికను ప్రారంభిం చారు. తెలంగాణ ప్రాంతంలో ఆధునిక ముద్రణా సౌకర్యాలతో అంటే ఆనాడు ఆధునిక ముద్రణ పద్ధతిగా భావించబడే రోటరీ ముద్రణ సౌకర్యంతో వెలువడిన తొలి తెలుగు పత్రిక ఇది. తర్వాత దీనికి గోరా శాస్త్రిగారు సంపాదకుడుగా ఉన్నారు. సమర్థులైన సంపాదక సిబ్బంది కల్గిన ఈ పత్రిక ఆనాడు బహుళ ప్రజాదరణ చూరగొన్నది.

## ఆధునిక సాంకేతిక యుగం

తెలుగు పత్రికా చరిత్రలో మరొక మైలురాయిగా నిలిచిన "ఈనాడు" పత్రిక 1974లో విశాఖపట్నంలో రంగ ప్రవేశం చేసే లోగా చాలా దినపత్రికలు వచ్చాయి. రాయలసీమ ప్రముఖులు "ప్రజాప్రభ",

మూర్తి రాజుగారి "ఆంధ్ర రత్న" రహమాన్ గారి "నవ్యాంధ్ర" గౌతు లచ్చన్నగారి "బహుజన" వరంగల్ నుండి ఎం.ఎస్. ఆచార్యగారి "వరంగల్ వాణి", విజయవాడ నుండి రామ్మోహన్‌రావు గారి "జనత" రాజమండ్రి నుండి గంధంవారి "సమాచారం", అనంతపురం నుండి "జన ప్రభ", వీటిలో ముఖ్యమైనవి. వీటిలో ఎక్కువ పత్రికలు కొద్ది కొద్ది కాలమే నడిచి నిలిచిపోయాయి. కాని "ఈనాడు" యజమాని రామోజీరావుగారు తమ అనేక ప్రయోగాలలో ఒకటిగా గొలుసు పత్రికల యుగానికి నాంది పలికారు. పత్రికను పాఠకుని ముంగిట్లోకి తీసుకు వెళ్లడానికి ఖర్చుకు వెనకాడక స్వంత రవాణా సౌకర్యాలు ఏర్పాటు చేసుకున్నారు. ఐతుపు పోరులో వెనుకబడటం ఇష్టం లేని ఇతర పత్రికలు కూడా స్వంత రవాణా ఏర్పాట్లు చేసుకున్నాయి. దానితో వాటి సర్క్యులేషనూ పెరిగింది. పత్రికను తెల్లవారే సరికే అన్ని ప్రాంతాల పాఠకులకూ చేరవేయాలనే ఒక్క విషయంలోనే కాక, వార్తలను కాలయాపన లేకుండా అందించాలనే విషయంలో, సరళంగా, సమగ్రంగా అందించాలనే విషయంలో, ఆకర్షణీయమైన ముద్రణతో అందించాలనే విషయంలో పత్రికలలో పోటీ పెరిగింది. ముఖ్యంగా సినీ ప్రముఖుడు దాసరి నారాయణరావు ప్రారంభించిన "ఉదయం" తెలుగు పత్రికలో రంగుల పోటీని ప్రారంభించింది. ఈ రోజు భారతదేశంలో ఒక్క తెలుగుపత్రికలే ప్రతి రోజూ రంగుల చిత్రాలతో రంగురంగుల శీర్షికలతో వెలువడుతున్నాయి. గడిచిన ఆరేళ్లలో ముద్రణా రంగంలో సంచలనాత్మకమైన ప్రగతిని వినియోగించుకొని అన్ని పత్రికలూ లాభపడ్డాయి. విషయ వైవిధ్యం వైపు దృష్టి మరల్చాయి. లోగడ ఒక "ఆంధ్రభూమి" మాత్రమే కొన్నేళ్ల పాటు క్రమం తప్పకుండా "వాణిజ్యభూమి" పేరిట సర్తక వాణిజ్య, స్టాక్, బులియన్ మార్కెట్ల వార్తలు ప్రచురిస్తూ వచ్చింది. పాఠకులకు ఆనాడు ఈ వార్తల పట్ల అట్టే ఆసక్తి లేనందున తర్వాత ఆ శీర్షికను విరమించింది. ఈనాడు అన్ని పత్రికలూ వ్యాపార వార్తలకు దాదాపు ఒక పేజీని కేటాయిస్తున్నాయి. అలాగే క్రీడారంగ వార్తలకో పేజీని ప్రత్యేకించాయి. సినిమా వార్తలకు కూడా దాదాపు ఒక పేజీ వినియోగిస్తున్నాయి. వారాంతపు అనుబంధాలు వార పత్రికలంత ఆకర్షణీయంగా మార్చాయి. సాహిత్య విమర్శకు కూడా తగిన స్థానమిస్తున్నాయి. గ్రామీణ వార్తలకు ఇది వరకెన్నడూ లేనంత ప్రాముఖ్యమిస్తున్నాయి. జర్నలిస్టులకు రచనా పద్ధతులలో న్యాయపరమైన అంశాలలో శిక్షణ అవసరమున్న సత్యాన్ని గుర్తించాయి. సాంకేతిక సౌకర్యాలను సద్వినియోగం చేసుకోవడంతోటే ఆగక లేఖన ప్రమాణాలను పెంచుకోవడం పట్ల కూడా ఆసక్తిని కనబరుస్తున్నాయి. ఎలెక్ట్రానిక్ మీడియా గంట గంటకు వార్తలందిస్తున్న కారణంగా ఎదురవుతున్న పోటీని వివరణాత్మక, విశ్లేషణాత్మక రచనా పద్ధతుల ననుసరించడం ద్వారా తట్టుకోవాలని పత్రికలు ప్రయత్నిస్తున్నాయి.

• • •

## నమస్తే

బోడగిరి చంద్ర రావు

ప్రాచి నవ్వు సుర పొన్నల విడిచి —
పున్నమ రాత్రి విహారము మరచి
రావి నీడనొక జాతి బొమ్మ వై
దర్శన మిచ్చే తండ్రీ ! నమస్తే
లోకమ్మున ఈ శోకమేల యని
వ్యాకులమందిన శాక్యమహాముని
రావినీడ నొక జాతి బొమ్మ వై
దర్శనమిచ్చే తండ్రీ ! నమస్తే
రాణీ యశోధర నర్ధరాత్రమున వదలి
రాజ్యరమ విరహాన రగులగావదలి
కపిలవస్తును వదలి గౌతమీ తల్లికి
వరముగా మాయేటి
దరిని కూర్చున్నావ !

# పత్రికా రచయితలలో మా పూర్వీకులు కొందరు

జి. కృష్ణ

స్వాతంత్ర్యం రాకముందు ఈ దేశంలో పలువురు పత్రికా రచయితలే జాతీయ ఆస్థాన రచయితలు. పత్రికారచన అంటే దేశసేవ అన్నాడు గాంధీజీ.

1945 నవంబరులో అనుకుంటాను, కోటంరాజు రామారావు గారిని చూసి, నేషనల్ హెరాల్డ్‌లో పత్రికా రచయితగా ఉద్యోగం సంపాదించటానికి లక్నో వెళ్లాను. వ్యక్తిత్వం ప్రధానంగా ఎంచుకునే వారు, సాధారణంగా, "అభిమానులను" మెచ్చరు, మన్నించరు. నేను పాదాభివందనం చేయలేదు కానీ, పొగడ్తలో లోపం చేయలేదు. ఆయన "ఇదంతా అనవసరం. మాకు ఇప్పుడు అదనంగా ఉద్యోగులు అక్కరలేదు. అసలు, పత్రికారచన అంటే ఏమనుకుంటున్నారు? కరపత్ర రచనమనుకున్నారా? స్పెల్లింగ్, గ్రామరు వేళ్లకు వచ్చి ఉండాలి-లేకపోతే రూళ్ల కర్రతో వేళ్ల మైన కొడ్తాను...." అని ఒక ఉపన్యాసం ఇచ్చారు...

అక్కడే ఉన్న ఎం. చలపతిరావుగారు నాకు టీ ఇప్పించి, నాకు తెలుగు ఎంత వచ్చునో "అడిగి" తెలుసుకున్నాడు.... "కొంతకాలం గడచిన తర్వాత, రండి. ఇప్పుడు ఖాళీలు లేవు" అని నన్ను పంపించేశాడు.

వచ్చేస్తూ "వ్యాసాలు పంపిస్తూ ఉంటాను. దయచేసి ప్రచురించండి" అని నేను అనగా, "బాగున్న వ్యాసాలువేస్తాం-దాని కోసం ప్రత్యేకంగా అర్థించనక్కరలేదు" అన్నాడు.

అట్లా లక్నో యాత్ర ముగిసింది. కానీ ఐదారు నెలలలో మరొక యాత్ర...

ఈ పర్యాయం మద్రాసులో ఖాసా సుబ్బారావుగారి వద్దకు యాత్ర. కొంత జాగ్రత్త పడ్డాను. పరిచయ పత్రాలు తీసుకు వెళ్లాను! "అభిమాన సంఘ సభ్యుడు"గా వెళ్లలేదు గానీ, అభిమానినే. సుబ్బారావు రావు గారికి, నేను శిష్యుడను అని అడివి బాపిరాజుగారు వ్రాయగా, "ప్రేమ పూజారి" అని వ్రాశాడు డాక్టరు జైనాచార్య. సుబ్బారావుగారు 'ఫ్రీ ప్రెస్‌లో' ఉద్యోగంలో చేర్పించాడు. అప్పటికి ఆయన "స్వతంత్ర" ఇంగ్లీషు వారపత్రిక ప్రారంభం అయింది. ఆయన మద్రాసు నగరాన్ని అనుభవించటానికి జన్మించాడనిపిస్తుంది. బ్రహ్మాండమైన పలుకుబడి గలవాడు. ఏ విషయమూ నాన్చడు, తేల్చి చెప్పేస్తాడు.

## పారిస్ పతనం

ఒకప్పుడు సుబ్బారావుగారు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ సంపాదకుడు. అది రెండవ ప్రపంచయుద్ధముప్పు రోజులు. వార్తా సమీకరణ బాధ్యత ఎం.ఎస్. సుబ్రహ్మణ్యం అనే వ్యక్తిది. ఆయన మంచి పనివాడు. తర్వాత కాలంలో ఫ్రీప్రెస్‌లో చేరాడు. నేనూ అక్కడ పనిచేశాను. ఆయన పనితనానికి గుర్తింపుగా ఆయనను "యముడ్" అని కొందరు అనేవారు. (యం.యస్... అనే అక్షరాలను కలిపితే యమున్.. యముడు అని). ఎం.ఎస్. చాలా సరదా మనిషి కూడాను. కష్టజీవి. ఇంతకూ ఒక నాటి రాత్రి పారిస్‌నగరం జర్మన్ల పరం అయినట్లు వార్త వచ్చింది. దాదాపు పత్రిక పుటలను సిద్ధం చేసి, ఇక అచ్చు కొట్టటానికి పంపించే సమయంలో ఆలస్యంగా వచ్చిన వార్తగా పారిస్ పతనాన్ని, మొదటి పుటలోనే, కంటికి ఎదురుగా కనపడే అక్షరాలలో ప్రచురించాడు సుబ్రహ్మణ్యం. పత్రిక అచ్చును ఏమాత్రం ఆలస్యం చేయలేదు.

కానీ ఇతర పత్రికలు, పారిస్ పతనాన్ని పతాక శీర్షికలో ప్రచురించాయి! అట్లా చెయ్యటం వలన వాళ్ల పత్రికలు అచ్చుకు పోవటానికి కొద్దిగా ఆలస్యం అయి ఉంటుంది.

భళ్లున తెల్లవారింది. పతాక శీర్షికలు పెట్టిన వారిదే ఆ గొప్ప వార్తను ప్రచురించిన ఘనత. అట్లా అయింది.

మధ్యాహ్నం అయ్యేసరికి ఎం.ఎస్. ఆఫీసుకు వచ్చాడు. పని చేసుకుంటు న్నాడు. అప్పుడూ వచ్చాడు సుబ్బారావు గారు. వస్తూనే, "ఎం.ఎస్. పారిస్ పతనవార్త మన పత్రికలో ప్రచురించావా?" అని అడిగి, జవాబు కోసం చూడకుండా లోపగదిలోకి వెళ్లిపోయాడు. 'ఆలస్య వార్త"గా వేశాను అని ఎం.ఎస్. చెప్పున్నా కూడా వినకుండా.

వెంటనే ఎం.ఎస్. సంపాదకుని గదిలోకి వెళ్లి ఒక్క వాక్యం రాజీనామా ఇచ్చేశాడు. సుబ్బారావుగారు దానిని ఆమోదిస్తూ సంతకం పెట్టాడు. ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు. ఎం.ఎస్. ఇంటికి వెళ్లాడు. ఆ రాత్రికి భోజనం ఉందో లేదో అనే స్థితి అతడిది.

మరి కాస్సేపటికి సుబ్బారావు అతడికి కొంత డబ్బు (అసది) పంపించాడు!

## నన్ను గురించే

ఒక పర్యాయం సుబ్బారావుగారు ఎక్కడో ఉపన్యసిస్తూ, పత్రికలపైన సాంఘికమైన అదుపు ఉండాలనీ, అవి విశృంఖలంగా వ్యవహరించే పెట్టుబడి దారులచేతులలో కరపత్రాలు కాగూడదనీ చెప్పారు. పూర్తాడు ఆపేసుకు రాగానే యజమాని రాంనాథ్ గోయెంకా "ఖాసా!! నువ్వు నన్ను గురించే కదా నువ్వు మాట్లాడింది?" అని అడిగాడు. సుబ్బారావు గారి జవాబు కోసం ఎదురు చూడకుండా గోయెంకా వెళ్లి పోయాడు!

అంతే ఖాసా వారు క్షణంలో గోయెంకాకు ఒక్క వాక్యం రాజీనామా సమర్పించు కున్నాడు! గోయెంకా వెంటనే ఆమోదించాడు. మర్నాటి నుంచి సుబ్బారావుగారి వంట మనిషికి రహస్యంగా డబ్బు ఇచ్చి, సుబ్బారావుగారి ఇల్లు హాయిగా గడిచేటట్లు కొంత వరకు జాగ్రత్త పడ్డాడు గోయెంకా!

సుబ్బారావుగారు ప్రకాశంగారి స్వరాజ్యలో సహాయ సంపాదకుడుగా పనిచేశారు. స్వరాజ్య పత్రికకు బాగా పేరు వచ్చేది, వ్యాపార రీత్యా గనీ, ప్రకాశంగారు తెచ్చి ఇస్తేగానీ మేనేజ్మెంటు వాళ్లు పట్టిగా మాట్లాడే వాళ్లకు జీతాలు ఇచ్చే వాళ్లు.

అదీ చెయ్!

చెరుకుపల్లి వెంకటప్పయ్య అనే యువకుడు స్వరాజ్యలో ఉపసంపాదకుడుగా చేరాడు. అతడు విలేఖరిగా కూడా పనిచేయగలడని తెలుసుకుని ప్రకాశంగారు అతడిని విలేఖరిగా కూడా పనిచేయమన్నాడు కూడా. అప్పట్లో పణిక్కర్, కృపానిధి, ఖాసా, ఎన్.ఎస్. వరదాచారి ప్రభృతులు స్వరాజ్యలో పై పదవులలో ఉండే వారు. వెంకటప్పయ్య బాగా వ్రాయగలడని ప్రకాశంతో సహా స్వరాజ్య పెద్దలందరూ తెలుసుకున్నారు. అయితే, ప్రత్యేక వ్యాసాలు, సంపాదకీయాలు కూడా వ్రాయమన్నారు. ఆ తర్వాత ప్రకాశం గారికి వెంకటప్పయ్య బాగా పద్యాలు వ్రాయగలడనీ, ఆఫీసు ఉత్తర ప్రత్యుత్తరాలు బాగా వ్రాయగలడనీ తెలిసింది. మేనేజ్మెంటులో కూడా పనిచేస్తూ ఉండమని వెంకటప్పయ్యను పురమాయించాడు. వెంకటప్పయ్యకు ప్రకాశమే దేవుడు. అతడు ఇరవై నాలుగు గంటలూ స్వరాజ్య కార్యాలయములోనే ఉండేవాడు! అది చూసి స్నేహితులు అతడిని స్వరాజ్య మనిషి ఎప్పుడూ, న్యాయశాస్త్ర కళాశాలలో చేర్పించారు. అతడు స్వరాజ్యలో ఉండగా దినచర్య వ్రాసుకున్నాడు. ఆ పుస్తకాలు ఆయన స్నేహితుడు దిగవల్లి వెంకట శివరావుగారి వద్దకు చేరుకున్నాయి!

తీరా వెంకటప్పయ్య న్యాయశాస్త్రం చదువు తున్నాడని తెలిసి, ప్రకాశం సంతోషించాడు!

అప్పట్లో నుంచి పనివాడిని చూసి పెద్దలు సంతోషించే వాళ్లు, ప్రోత్సహించే వాళ్లు. ఒక్క వెంకటప్పయ్యనే, ఇంక ప్రోత్సహిస్తే అతడికి ఇరవై నాలుగు గంటలు చాలవని, భయ పడ్డారు.

ఇంతకూ ఖాసా సుబ్బారావు గారు స్వరాజ్య పత్రికను ఇంగ్లీషులో పెట్టి బాగా నడిపాడు. ఆ పైన తెలుగు స్వరాజ్య కూడా పెట్టాడు. పత్రికలు సరిగా రూపొందు తున్నా లేదా అనే చూశాడు కానీ, అవి ఇతర పత్రికలను పోటీలో కొట్టివేయ గలుగుతున్నా లేదా అని ఆయన చూడలేదు.

సుబ్బారావుగారు దేశభక్తుడు. కోటంరాజు రామారావు దేశభక్తుడు. ఇద్దరూ బ్రిటిష్ వాళ్ల చెరసాలలో ఉన్నారు. సుబ్బారావుగారికి ఆప్తుడు రాజగోపాలాచారి. రామారావు గారికి ఆప్తుడు గాంధీజీ. సుబ్బారావుగారు వ్యాస రచయిత. రామారావుగారు వ్యాసరచయిత, విలేఖరి, పత్రికలో ఏ పని అయినా చేయగలవాడు. సుబ్బారావుగారు మూడు నాలుగు పత్రికలలో పనిచేసి, స్వంత వారపత్రిక పెట్టుకున్నాడు. రామారావుగారు దాదాపు ముప్పయ్ పత్రికలలో పనిచేశాడు. తనకు ఇష్టం లేక పోయినా, యజమాన్యానికి ఇష్టం లేక పోయినా ఉద్యోగం వదులుకునే వాడు. సుబ్బారావుగారి రచనలో వాక్యాలు పండిత బాణీలో ఉంటాయి. రామారావుగారి వాక్యాలు సూటిగా, వాడిగా, వేడిగా ఉంటాయి. జవహర్ లాల్ నెహ్రూ గారి "నేషనల్ హెరాల్డ్" పత్రిక సంపాదకుడు, రామారావుగారు. దానికి అపరాధ ధరావతు కట్టాలని బ్రిటిష్ ప్రభుత్వం ఆదేశించగా, ప్రజలు ఇచ్చికంగా విరాళాలు పంపించారు. రామారావుగారి పత్రికా రచన స్వాతంత్ర్య సమరంతో ఆత్మీయంగా పెనవైచుకున్నది.

## పెళ్లికి ముందు ఎడాకులు

1946-47 ప్రాంతంలో శుభోదయ సంస్థ అనేది ఏర్పడి, ఇంగ్లీషులో ఒక దినపత్రికను వెలువరించాలని నిర్ణయించింది. మద్రాసు మౌంట్ రోడ్డులో శుభోదయ భవనం, ఇప్పుడు రామకృష్ణ భవనం అయిందనుకుంటాను. అక్కడ కోటంరాజు రామారావుగారు రాబోయే ఇంగ్లీషు దినపత్రిక సంపాదకుడుగా, తన వద్ద పని చేయబోయే ఉప సంపాదకులకూ, విలేఖరులకూ శిక్షణ ఇచ్చేవాడు. శిక్షణలో రహస్యం ఏమిటి? నేర్చుకునే వాళ్ళకూ, నేర్పే వాళ్లకూ

సమతూక శ్రద్ధ ఉండాలి. రామారావుగారు అటువంటి స్థితిని కుదుర్చుకొనగలడు. కానీ పెళ్లికి ముందే విడాకుల లాగా, పత్రిక ఇంకా వెలువడక ముందే శుభోదయా వారికీ సంపాదకునికీ పడలేదు. రామారావుగారు ఢిల్లీకి వెళ్లి పోయాడు. అప్పటికే పత్రికా నిర్వహణ అంటే గుమాస్తా ద్వారా నిర్వహించే "ఉప్పు మిరపకాయ చింతపండు వ్యాపారం" అనే నమ్మకం డబ్బున్న రాజకీయ వాదులకు కలిగి ఉన్నది.

రామారావుగారు మద్రాసులో ఉన్నకాలంలోనే వారి అన్నగారు కోటంరాజు పున్నయ్యగారు వచ్చాడు. ఆయన తాను ఐదవ ఫారం చదువుతున్న కాలంలోనే బ్రహ్మ సమాజ ప్రచారానికి ఒక వారపత్రిక పెట్టాడు. బాపట్ల స్వస్థలం. ఫూటకుళ్లమ్మకు డబ్బు ఇవ్వటం ఆలస్యం చేసి పత్రిక నడిపాడు. ఆపైన చదువు ఆపి బొంబాయి వెళ్లి, ఒక సేఠ్‌జీకి కింది అంతస్థు నుంచి పై అంతస్థుకు నీళ్లు మోసి భోజనం ఖర్చు సంపాదిస్తూ, పత్రికా రచయితగా నిలదొక్కుకున్నాడు. తర్వాత వెళ్ళాడు కరాచీకి. అక్కడ "సింధ్ అబ్జర్వర్" అనే పత్రికను పెట్టించి, దానికి సంపాదకుడైనాడు. ఆయన అందరికీ స్నేహితుడే. మంచితనం అంటే పున్నయ్య గారి సొత్తు అనాలి. అట్లా అని పట్టుదల లేని మనిషి అని కాదు. ఒక పర్యాయం "సింధ్ అబ్జర్వర్" నిర్వాహక మండలి అధ్యక్షుడు ఒక వింత నిర్ణయం చేశాడు. సింధ్‌లో జవహర్లాల్ నెహ్రూ పర్యటన వార్తలు వేస్తే పున్నయ్య ఉద్యోగం ఉండదని! వేయరాదని! కానీ పున్నయ్య గారు నెహ్రూతో పర్యటించి, వార్తలు ప్రచు-రించాడు! నిర్వాహక మండలిలో ఈ ప్రస్తావనవచ్చింది. మండలి అధ్యక్షుడే తొలగవలసి వచ్చింది! కరాచీలో ఒక అభి[illegible] ప్రాంతానికి అక్కడి వారు ఏకగ్రీవంగా పెట్టిన పేరు "పున్నయ్య పూర్"!

## మతం కులం లేని వాడు

దేశ విభజన కాలంలో కరాచీలోని ప్రజలు, ముందుగా పున్నయ్య గారి కుటుంబాన్ని బొంబాయికి తరలించి, ఆ పైననే హిందూ ముస్లిం కొట్లాటలు సాగించుకున్నారు. పున్నయ్యగారికి మతం, కులం లేవు. మానవత మతం. ఆయన దేవునికి మతం లేదు. ఆయన భార్య తారాబాయ్ డాక్టరు. వైద్యాన్ని మానవసేవగా చేసింది.

కానీ ఆ కుటుంబం చాలా విపత్తులను అనుభవించింది. ఇద్దరు కొడుకులు, ఒక అల్లుడు, ఇద్దరు మనుమలు ప్రమాదాలలో మరణించి, పున్నయ్యగారి జీవితాన్ని విషాదం చేశారు. ఆపైన భార్య మృతి. కడకు పున్నయ్య గారు, బొంబాయిలో ఎక్కడికో వెళ్తూ, రోడ్డు పక్కనపడి మరణించారు. ప్రభుత్వాసుపత్రి శవాలశాలలో ఆయన దేహాన్ని చూసిన విలేఖర్లు నిర్విణ్ణులై, ఆ సంగతి లోకానికి ఎరిగించారు.

ఇంతకూ పున్నయ్యగారు ఆంధ్రపత్రిక కార్యాలయానికి వచ్చారు. గొప్పవాడు వచ్చినాడని అందరం మురిసిపోయాం. ఆయన పైనుంచి, రోడ్డు మీదకు చూస్తూ, ఎందుకో గబ గబా కిందికి దిగి పోసాగాడు. కొందరం ఆయనతో కిందకు దిగాం. రోడ్డు మీద ఒక తోపుడు బండిలో మిఠాయి అమ్ముకుంటున్న ఒక వ్యక్తికి పున్నయ్య గారు పాదాభివందనం చేసి - అతడిని కౌగిలించు కున్నాడు. ఆ మిఠాయి వ్యాపారి పాకిస్తాన్ ఏర్పడటి పూర్వం, సింధ్ అబ్జర్వర్ నిర్వాహక మండలి అధ్యక్షుడు..!

ఇటీవలి కాలంలో, పన్నెండు, పదమూడు సంవత్సరాల క్రితం, విలేఖర్లం కొందరం, సికింద్రాబాద్‌లో ప్రాంతీయ సేనాని బ్రిగేడియర్ మోహన్ నివాసానికి వెళ్లాం. బ్రిగేడియర్‌గారు తన భార్యను పరిచయం చేయటానికి, నివాసంలోకి తీసుకెళ్ళాడు. పాత విలేఖర్లు ఆమెను చూస్తూనే కన్నీరు పెట్టుకున్నారు. ఆమె పున్నయ్యగారి కుమార్తె!. ఈ విలేఖర్లు కూడా, కరాచీలో పనిచేస్తుండేకాలంలో, పున్నయ్య గారి ఇంట్లో, ఆ కుమార్తె లాగానే పెరిగారు.

## ధీరుడు పున్నయ్యగారు:

కొన్నాళ్లకు నిజంగా శుభోదయా వారి ఆంగ్ల పత్రిక "ఇండియన్ రిపబ్లిక్" వెలువడింది. దానికి సి.వి. హనుమంతరావు గారు సంపాదకుడు. మెత్తని వాడు. దేనిపైనా తన అదుపు ఉండాలని అపేక్షించే వ్యక్తి కాదు. ఆంగ్ల పత్రికా సంపాదకుడుగా రావుగారు పనిచేసినంతకాలం వేపెప్పుయా చేసి ఉండరు. పాకిస్తాన్ ఏర్పాటు వలన లాహోరు నుంచి వచ్చేసి, మద్రాసు రాష్ట్ర సమాచార డైరెక్టరుగా కొంతకాలం పనిచేశాడు.

1947-48 ప్రాంతంలో హైదరాబాదు రాష్ట్రం రజాకార్ల అల్లర్ల వలన చికాకులో పడింది. అప్పట్లో కొంతకాలం దివాన్‌గా వచ్చిన మీర్జా ఇస్మాయిల్‌తో సమాచార శాఖ అధిపతిగా ప్రముఖ పత్రికా రచయిత కందూరి ఈశ్వరదత్ వచ్చాడు. రజాకార్లకూ, నిజాంకూ, మీర్జా అంటే పడలేదు. అందువలన ఆయన మైసూరు వెళ్లిపోయి మళ్లీ తిరిగి రాలేదు. దత్‌గారు

మరి కొంత కాలం అక్కడ ఉండి పోయాడు.

దత్ గారు ఒక పర్యాయం మద్రాసు వచ్చాడు. బాపుగారి (చిత్రకారు నాగయ్యగారు) ఇంట్లో దిగాడు. దత్ గారి (నిజాం ప్రభుత్వ) సహాయాన్ని ప్రాజెక్టులు ప్రాజెక్టులుగా అనుభవించే ప్రగతిశీల రచయితలు పదైరాలు అప్పట్లో కొన వచ్చారు కానీ, సాహసంలేని మామోంట్లకు ఆయన స్నేహమే దక్కింది.

రామారావుగారు సుబ్రహ్మణ్యం. దత్ గారు తీర్చిదిద్దిన తోట.

## నేను వస్తే నీకు సెలవు

1950-52 ప్రాంతంలో నేను బెజవాడకు బదిలీఅయ్యాను. 1952లో ఎన్నికలు వచ్చాయి గదా. ఖైరవరను హనుమంత రావుగారు బొంబాయి నుంచి జాబు వ్రాశాడు. తాను బెజవాడకు వస్తున్నానని నాకు అతిథిగా ఉండటమే కాక, నన్ను వెంటవేసుకుని వారం రోజులు ఎలెక్షన్ వార్తలు సేకరించుకుంటాననీ! ఆయన రాగానే అడిగాను, "న వృత్తి నేను చేసుకోవాలా లేదా" అని .... "సెలవు పెట్టు!" అని తాపీగా, హితవు చెప్పాడు.

గాంధీజీ "దండియాత్ర"లో తెలుగు వాళ్లు ఉన్నారా? యాత్రకు ముందు తెన్నేటి విశ్వనాథంగారిని ఏదో పనిమీద గాంధీజీ పంపించి వేశాడు. యాత్రలో ఎర్నేని సుబ్రహ్మణ్యం గారు ఉన్నారు. యాత్రను గురించి బ్రిటన్ లోని "లండన్ టైమ్స్"కు వర్తమానం పంపిన విలేఖరి ఖైరవరను హనుమంత రావుగారు. అప్పట్లో హనుమంత రావుగారు బొంబాయిలోని టైమ్స్ ఆఫ్ ఇండియా ప్రధాన విలేఖరి... దండికి వెళ్లాడు. విలేఖరులు పంపే టెలిగ్రాములను పోలీసులు ఆమోదించాలి. అందువలన మనదేశంలోని పత్రికలకు వెళ్లే టెలిగ్రాములు ఆలస్యం అయ్యాయి. కానీ హనుమంతరావుగారు లండన్ టైమ్స్‌కు కూడా విలేఖరి! . బ్రిటన్ లోని పత్రికకు పంపే వార్తను భారతదేశంలోని పోలీసులు చూస్తారా చెప్పండి. చూడ లేరు!.. అంతే! అప్పటికీ ఇప్పటికీ ఇంగ్లీషు అంటే మనకు హడలు!

హనుమంతరావుగారు తన కాలపు నాయకులందరికీ ఆప్తుడు. ప్రతి నాయకునికీ మాట్లాడటంలో, వ్రాయటం లో ఒక శైలి ఉంటుంది కదా అశైలులన్నీ ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. ఎవ్వరి చేతా మాటపడ కుండా, హాయిగా జీవయాత్ర గడిపాడు. ధనికుడు కాదు . ఏ పత్రికా రచయితా ధనికుడు కాడు. ఆకాలంలో ప్రతి పత్రికా రచయితా భాగ్యవంతుడు. అందువలన హనుమంత రావుగారు ఉద్యోగ విరమణ చేసికూడా, మళ్లీ వ్రాసుకుంటూ గడపవలసి వచ్చింది.

హనుమంతరావుగారితో తిరిగి, ఆంధ్రపత్రిక పని చేయలేకపోయాను. ఆయన వెళ్లిన నాలుగైదు రోజులకు కృపానిధి గారొచ్చారు. ఆయన ఢిల్లీలోని హిందూస్థాన్ టైమ్స్‌లో సంయుక్త సంపాదకుడు. ఈయనగారిది ఒక భిన్న పద్ధతి. నన్ను దాదాపు నౌకరుగా ఉపయోగించాడు. ఆయనా నేనూ కలిసి విన్నవీ, కన్నవీ అన్నీ వ్రాసి పెట్టమన్నాడు! హనుమంతరావుగారితో తిరిగి ఐదారు రోజులు పోగొట్టుకున్నానని చెప్పు కున్నాను. వారి ఐదారు రోజులు పోగొట్టు కొన్నందుకు పంపా ఇచ్చాడు! నేను వ్రాసినవన్నీ కలిపి, తన మూసలో, వేరే కథ వ్రాశాడు! అదీ గొప్ప! ఆయన వ్రాతలో కానవచ్చే పట్టు, ఆయన సంభాషణలో కానరాదు. సౌమ్యుడుగా కనపడ్డాడు. ఆయన ఏదో రాజవంశం వాడనుకుంటాను.

ఆ ఎన్నికలు కాగానే, నేను ఢిల్లీకి బదిలీ అయ్యాను. పూర్వ పరిచయాలన్నీ అక్కడ నాకు ఉపకరించాయి. కృపానిధి గారు "చెప్పండి! మీకోసం ఏం చేయ గలను?" అని అడగగా, "అంత పెద్దాయన నాకు ఏదైనా చేసి పెట్టటం ఏమిటి?" అని బిడియపడ్డాను. ఆయన బంధువు, శతగోపన్ అనే పత్రికారచయిత చెప్పిన దానిని బట్టి, వాళ్ళ కుటుంబం వాళ్ళు ఎక్కడో దక్షిణాదిన పరిపాలకులు అనీ, ఈస్ట్ ఇండియా కంపెనీ వాళ్లో ఆ తర్వాత వచ్చిన బ్రిటిష్ ప్రభుత్వం వాళ్లో, ఆ కుటుంబం వాళ్లని చాలాకాలం వేలూరు కోటలో బందీలుగా ఉంచారనీ తెలుసుకున్నాను.

ఢిల్లీలో నాకు చాలామంది ప్రముఖు లతో పరిచయం చేసిన పత్రికా రచయిత (అప్పట్లో హిందుస్థాన్ టైమ్స్‌లో సహాయ సంపాదకుడు) ఈశ్వరదత్ గారు. నాకు పరిచయాలు కలిగించటానికి దత్ గారు కొన్ని అల్పాహార విందులు కూడా ఏర్పాటు చేశాడు. దత్ గారి భార్య (పేరు మరిచాను) గొప్ప ఆతిథేయురాలు.

ఎం. చలపతిరావు గారిది ఒక ప్రత్యేక వ్యక్తిత్వం. ఆయనకు ఇంగ్లీషు వాళ్ళ ఇంగ్లీషు భాషలో అమేయ పాండిత్యం ఉంది. యూరోపియన్ చరిత్రలో, మతగ్రంథాలలో, పురాణ కథలలో ఆయన దృష్టిని తప్పించుకు పోయిన విశేషం

అవేది ఉండదు. అట్లా అని ఆయన రాజకీయ అవగాహన తక్కువది కాదు. రామారావు, చలపతిరావు జంట పత్రికా రచయితలు. రామారావుగారి తర్వాత చలపతిరావుగారు నేషనల్ హెరాల్డ్‌కు సంపాదకుడయ్యాడు. నిజమైన ప్రజాస్వామ్య వాది ఉద్యోగులందరూ బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తారని స్వేచ్ఛ ఇచ్చాడు కానీ మనదేశంలో ఉద్యోగులకు చాకిరీ తప్ప వేరే నీతులు ఉండవు. ఈ కొత్త స్వేచ్ఛ వాళ్లకు అర్థం కాలేదు.ఆదుర్దా వలన, చలపతిరావుగారికి గొంతు దెబ్బ తిన్నది.

ఒక్క విశేషం నాకు హృద్యమైనది. చలపతిరావుగారు తెలుగును, అక్కడి కక్కడే, అప్పటికప్పుడే ఇంగ్లీషులోకి అనువదించేతీరు చూసినప్పుడల్లా నేను ముగ్ధుణ్ణి అయ్యేవాడిని. ఆయన బుర్రలో శబ్దకోశమే కాక, ఔచిత్యం గూడు కట్టుకుని ఉండేది. దానికి దీటైన సాహితీ రసికుడు. చమత్కార ప్రియుడు. అవసరమైతే హాస్యాన్ని ఎంతైనా ప్రవహింప జేయ గలడు. తెలివికి పాండిత్యం తోడు అయితే చలపతిరావుగారూ!

రామారావుగారు అప్పట్లో, అఖిల భారత కాంగ్రెసు పక్షాన ఒక వారపత్రికను తీర్చిదిద్దేవాడు. దానిని కాంగ్రెసువారే ప్రచురించేవాళ్లు. కానీ కాంగ్రెసు వాళ్లెవళ్లూ దానిని చదివేవారు కారని నా ఊహ!

రాజ్యసభ సభ్యుడుగా ఎన్నిక చేయించండని ఒక వ్యక్తి పేరును తమిళనాడు కాంగ్రెసుకు రాజాజీ సూచించాడు. ఆ వ్యక్తి అంటే కామరాజు నాడర్‌కు ఇష్టం లేదు. అదే సమయంలో తనను రాజ్యసభ సభ్యుడుగా ఎన్నుకొమ్మని కోటం రాజు రామారావుగారు అభ్యర్థించాడు. ఇది తెలిసిన నాడారు, రామారావును తమిళనాడు నుంచి రాజ్యసభకు ఎన్నిక చేయిస్తే, జవహర్లాల్ కూడా సంతోషిస్తాడని అనుకున్నాడు. అట్లా రామారావుగారు రాజ్యసభకు ఎన్నికైనాడు.

## చెవిలో పెన్సిల్

ఒక్క విశేషం చెప్పి ముగిస్తాను.

ఒక నాడు రామారావుగారు, ఈశ్వర దత్‌గారు, జి. కృష్ణకలిసి ఉపరాష్ట్రపతి డాక్టరు రాధాకృష్ణన్ గారింటికి వెళ్లారు. రాధాకృష్ణన్ గారు రూర్కీ విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసం చేయాలి. దానిని వ్రాసుకున్నాడు. జవహర్లాల్, రాధాకృష్ణన్ గ్రంథనిబద్ధం చేస్తున్నట్లు మాట్లాడగలరు. డిక్టేషన్ ఇవ్వగలరు. గాంధీజీ లాగా నిరాడంబర, నిరలంకృత శైలిని వాళ్లు వ్రాయలేకపోవచ్చు. కానీ రామారావు ఇందరి శైలులనూ మచ్చిక చేసు కున్నవాడు. "రామారావ్! ఈ ఉపన్యాసాన్ని చూసి, కరెక్టు చేసి పెట్టు" అని రాధాకృష్ణన్ గారు తన స్నాతకోపన్యాసాన్ని ఇచ్చాడు.

రామారావుగారు, మేము చూడనేలేదు, అమాంతం చెవి వెనక నుంచి పెన్సిల్ ముక్క లాగి, దిద్దనారంభించాడు!

ఈశ్వర్‌దత్ ఇది చూసి, చకితుడై...

"ఒరే! రామారావ్... ఏమిటది!..." అన్నాడు.

రాధాకృష్ణన్‌గారు "థ్యాంక్స్ రామారావ్.." అంటూ, అప్పుడే అక్కడికి చేరిన కాఫీ కప్పులలో ఒక దానిని తీసుకుని, తన చేతులలో రామారావు గారికి ఇచ్చాడు!....

. అదే నేను అనేది... మేము ధనికులం కాక పోవచ్చు.....కానీ భాగ్యవంతులం!

## చైతన్యపు పాప

ఈ ఉగాది
పలికిస్తోంది
ప్రతి తెలుగు గుండెను
సమతా మమతా
పునాదులకు
నాంది వచనం!
మానవత్వం మసకబారితే
సమానత్వం ఎక్కడుందంటున్నది
పశువులవలె ప్రవర్తిస్తే
నలుగురిలో నగుబాటేనంటున్నది
కొత్తతరం రావాలంటూ
తెలుగు వెలుగుల పురిటి నుంచి
చైతన్యపు పాపను కంటున్నది

కొఠారి మల్లికార్జునరావు

## సం-సారం

అక్షరమే
ఆయుధమై
మహిళా వుద్యమం
ఉవ్వెత్తున లేస్తే
మద్యపాన నిషేధం తథ్యం!
సంసారంలో పూలబాట నిత్యం!!

# తెలుగు భాషా వాడకం-నేడు-రేపు

జస్టిస్ ఆవుల సాంబశివరావు

తెలుగు భాషా వాడకం అనే అంశాన్ని అనేకకోణాలనుంచి పరిశీలించవచ్చు.

కాని ఈ వ్యాసంలో "ప్రజాస్వామ్యంలో తెలుగు భాషా వాడకం-నేడు-రేపు" విషయానికే పరిమితం చేయబడుతున్నది.

ప్రజాస్వామ్యం, ప్రజలరాజ్యం. ఈ ప్రజల రాజ్యం ప్రజలచేత, ప్రజల కొరకు నిర్వహించబడుతుంది. రాజ్యంలో కీలకమైన వ్యవస్థలు కేంద్ర పార్లమెంటు, రాష్ట్రశాసన సభలు. అందులోని సభ్యులను సమర్థులైన పౌరులందరూ ఎన్నుకుంటారు. ప్రజల ప్రతినిధులుగానే ఆ చట్టసభల్లో వారి అస్తిత్వం కొనసాగుతుంది. వారిలో అధిక సంఖ్యాకుల బలం ఉన్నవారు ప్రభుత్వాన్ని ఏర్పరుస్తారు. వారికి లోబడే పాలనాయంత్రాంగం పనిచేస్తుంది. కనుక రాష్ట్రభూమిక, పటుత్వం ప్రజలమీద ఆధారపడి ఉంటుంది. ప్రజలలో చైతన్యం, నిశిత పరిశీలన ఉన్నప్పుడు ప్రభుత్వాల పనితీరు, చట్ట సభల బాధ్యతా నిర్వహణా మార్గం ఆధారపడి ఉంటాయి. ప్రజలలో ఉండే చైతన్యము, జాగృతే ప్రభుత్వాల ప్రవర్తనపై అంకుశం. ప్రజలజాగృతి పాలకులకు [illegible]యకం

ప్రజలలో జాగృతి, బాధ్యత పెంపొందించడానికి భాషావాడకం ప్రముఖమైన సాధన. అటు పాలక యంత్రాంగం, ఇటు మేధావుల ప్రసంగ ప్రబోధాలు ప్రజలకు అందాలి. వారికి చెప్పే విషయం ఏదో మనసుకు నాటాలి. భాషా ప్రయోగం ఈ కీలక పాత్ర నిర్వహిస్తుంది. పలికిన పలుకుగాని, వ్రాసిన మాటగాని ప్రజలకు తేటతెల్లం కావాలి. దేశంలో మాతృభాషతో పాటు ఇంగ్లీషు, హిందీ అధికార భాషలుగా చలామణి అవుతున్నాయి. అయితే ప్రజల మేధస్సుకు అందేటట్లు విషయాన్ని చెప్పాలీ అంటే మాతృభాష ఒక్కటే అత్యుత్తమ సాధనం. ఆంధ్రప్రదేశ్‌లో ప్రధానమైన మాతృభాష తెలుగు. మహమ్మదీయులు ఉర్దుని వాడుకుంటారు. అల్పసంఖ్యాకులు తమ తమ ప్రత్యేక భాషలను ఉపయోగించుకుంటారు. కాని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మొత్తం మీద దాదాపు 95శాతం తెలుగు మాతృభాషగా ఉన్నవారే. అందుచేత ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుభాష వాడకం చాలా ముఖ్యమైన స్థానాన్ని పొంది ఉన్నది.

భాషావాడకానికి మన రాష్ట్రంలో ఒక ఇబ్బంది ఉన్నది. 70 శాతం జనం చదువు లేని వారు. వారు తెలుగులో మాట్లాడగలరుగాని, చదవను, వ్రాయను తెలియనివారు. కష్టపడి సంతకం పెట్టడం నేర్చుకున్నవారు ఇతర పదాలను చదవలేరు, వ్రాయనూలేరు.

దీనిని బట్టి తెలుగు భాషా వాడకంలో, ప్రజాస్వామ్య జీవితంలో, ప్రజలందరూ, చదవనూ, వ్రాయనూ తెలిసినవారై ఉండాలి. మౌలికమైనంత వరకైనా భాషలో పరిచయమైనవారై ఉండాలి. కనుక ప్రజలందరకు ప్రాథమిక విద్య అత్యవసరం. ఆ అవసరం వ్యక్తి దృష్ట్యానే కాకుండా రాజ్యదృష్ట్యా కూడా స్పష్టమౌతుంది. విద్యాగంధం లేని పౌరుడు సక్రమమైన రాజ్యాన్ని నిలబెట్టుకోలేడు.

తెలుగు భాషా వాడకంలో ప్రాథమిక విద్యా బోధన తొలిమెట్టు. రాజ్యం నడిచేది, జీవితం గడిచేది ఒక్క విద్యాధికులకు మాత్రమేకాదు. అంతా కలిపితే విద్యాధికులు తెలుగువారిలో 20 శాతానికి మించి ఉండరేమో. మిగిలిన 80శాతం జనం కూడా పౌరులే. నిజానికి చట్ట సభలలోని ప్రజా ప్రతినిధులను ఎన్నుకోవడంలో ప్రధానపాత్ర వారిదే. వారిని జనసామాన్యం అని పిలుస్తారు. జనసామాన్యపు వికాసమే, రాష్ట్ర వికాసం, జాతి వికాసం, ప్రజాస్వామ్య వికాసం. కనుక అందరికి ప్రాథమిక విద్య గరపడంలో రాష్ట్రకేంద్రప్రభుత్వాలు దృష్టిని కేంద్రీకరించాలి. అది వారిగురుతరమైన బాధ్యత. రాజ్యాంగ చట్టంలోని 45వ అధికరణ ఈ బాధ్యతను ఆదేశిస్తున్నది.

అందరికీ చదువు అందడానికి కొంతకాలం పడుతుంది. అప్పటిదాకా మానసిక వికాసమూ, జీవిత వికాసమూ, ప్రజాస్వామ్య వికాసము ఆగరాదు. ఏనాటికానాడు పొంగిపొర్లుతున్న నూతన విజ్ఞానం ప్రజాసామాన్యంలోకి ప్రవహించాలి. వ్యవసాయ అభివృద్ధి, స్వయం ఉపాధి కల్పనా కృషిలో నిమగ్నులై ఉన్న గ్రామీణులు, గ్రామసీమల జీవితాభ్యుదయం, లభ్యమవుతున్న నూతన విజ్ఞానం పైన ఆధారపడి ఉన్నాయి.

అయితే చదువురాని వారికి ఈ నూతన విజ్ఞానాన్ని అందించడం ఎలా? గడిచిపోయిన కాలంలో సమాజం ఇందుకు ఒక మార్గం ఏర్పాటు చేసుకున్నది. గ్రామీణ కళల ద్వారా వినోదం, విజ్ఞానం

అందే పద్ధతిని పూర్వ సమాజం నిర్మించుకున్నది. చదువు రానివారికి కూడా చక్కగా తెలిసేటట్లు, భావం అందేటట్లు ఆ కళలు ప్రజలను అలరించాయి. బుర్రకథ, ఒగ్గుకథ, హరికథ, వీధి నాటకం, తోలు బొమ్మలాటలు, గ్రామీణ ప్రజా కళలలో కొన్ని మాత్రమే. వాటిలో భాషా ప్రయోగం గానీ, అందులోని భావాన్ని, అందాన్ని అందించడంలోగానీ అనువైన తెలుగు భాషను వాడేవారు. వాటిని చూసిన వారికి, విన్నవారికి పాట వల్ల వినోదం కలగటమే కాకుండా వాటి సందేశాన్ని ఆచరణ చేసుకునే అవకాశం కూడా ఉండేది. నేడు ఆ ప్రజా కళలు తెరమరుగై పడుతున్నాయి. అందులోని భాషా ప్రయోగం అరుదై పోతున్నది. వాటి స్థానే ఇప్పుడు సినిమా, రేడియో, దూరదర్శనలు వచ్చాయి. వాటిలోని భాషా ప్రయోగం చాలా వరకు శిష్ట వ్యావహారికం. ప్రజా సామాన్యపు వాడుక భాష కాదు. వాడుక భాషలో వ్రాయగలిగిన రచయితలు కూడా పరిమితంగానే ఉన్నారు. వ్యావహారికంలో వ్రాసే వారు అనేకులు ఉన్నారు. ఇక్కడ గమనించవలసింది వ్యావహారిక భాషకు వాడుక భాషకు ఉన్న తేడా. ఆ రెండు పదాల శబ్దాలలోనే తేడా ధ్వనిస్తున్నది. ఈనాటి వ్యావహారిక తెలుగుభాష భాషలో పరిచయమున్న తెలుగు గ్రామీణులు, ప్రజా సామాన్యం నిత్యజీవితంలో ఉపయోగించేది వాడుక భాష. తెలుగుపుడికారం, జాతీయత వాడుక భాషలో ఎక్కువగాను, వ్యావహారిక భాషలో తక్కువగానూ ఉంటుంది. కాబట్టి చదువు కొని ప్రజలకు విజ్ఞాన్ని అందించి, వారికి నూతన స్ఫూర్తిని కలిగించాలీ అంటే తెలుగుపుడికారమూ, జాతీయత ఉన్న వాడుక భాష ఈనాడు అవసరం. రేపు మరీ అవసరం. అన్ని వైపుల నుండి అట్టడుగు ప్రజలు మేము ఉన్నాం, మేము పాలుపంచుకుంటామని అనిపిస్తున్న ఉద్యమ కెరటాలు మనకు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ప్రజాసామాన్యం అలా ఉద్యమించడం ప్రజాస్వామ్యానికి ఒక పెద్ద అండ. అటువంటి జనానికి తేటతెల్లమయ్యే వాడుక భాష వెంటనే ఉపయోగంలోకి రావాలి.

అందుకని పండితులు, కవులు, విద్యాధికులు పండిత భాష, కావ్య భాష వాడవద్దని కాదు. తెలుగు భాష పెరగాలి. అన్ని ఇంపు సొంపులతోనూ కళ కళలాడాలి. పండిత భాష ఒక వైపు, కావ్యభాష మరొక వైపు, వ్యావహారిక భాష వేరొకవైపు తెలుగుభాషా సంస్కృతిని పెంపొందించాలి. ప్రజాసామాన్యం, ప్రజాస్వామ్య రథసారథులుగానూ తమ సంపద నిర్మాతలుగా బంగారు భవిష్యత్తులోకి ప్రవేశించాలి అంటే అందుకు అనువైన వాడుక భాష, బాగా ప్రచారంలోకి రావాలి. నూతన జీవిత సందేశాన్ని వారికి అందించాలంటే అటువంటి భాషే వారికి ఉపయుక్తం.

ఇవ్వాళా రేపట్లో ఆ భాషావాడకం పెరుగుతున్నది. రేడియో, దూరదర్శనం తేలికభాషను క్రమంగా ప్రవేశపెడుతున్నాయి. పత్రికలు-దిన, వార, పక్ష మాసపత్రికలు ప్రజల భాషను వాడటంలో చాలా ముందుకు వస్తున్నాయి. ప్రజల హృదయాలను చేరడం వాటి ధ్యేయం. అందుచేత ప్రజలకు అర్థమై వారిని ఆకట్టుకునే ప్రజాభాషను పత్రికలు బాగా ప్రచారంలోకి తీసుకొచ్చాయి. ఆ ప్రయత్నం ఇంతటితో ఆగిపోలేదు. ముందు, ముందు పత్రికల ప్రయత్నం విస్తృతమవుతుంది. పత్రికలు ముఖ్యంగా దినపత్రికలు నూతన పదప్రయోగాలలో ముందంజ వేస్తున్నాయి. నూతన పదాలను సృష్టిస్తున్నాయి. నూతన విజ్ఞానం పెరిగినప్పుడల్లా, నూతన, పద ప్రయోగం తప్పనిసరిగా, పెరిగి తీరుతుంది. ఈనాటి తెలుగు భాషా ప్రయోగాన్ని పరిశీలిస్తే, పత్రికలు నిర్వహిస్తున్న ప్రముఖపాత్ర కళ్ళకు కట్టినట్లు కనిపిస్తున్నది. దీనితో తెలుగు భాషా ప్రయోగం విస్తరిస్తున్నది. ముందు ముందు అది మరింత [illegible] [illegible]. [illegible] [illegible] [illegible] [illegible].

తెలుగు [illegible] [illegible] [illegible], ఇప్పుడు ముఖ్యభాగం. సందేశాన్ని మరింత అందించ ప్రయత్నించే వచన రచన, వ్యాసరచన, కథా, నవలా, నాటక రచన, సుగమమైన భాషా ప్రయోగంతో జరగాలి.

గేయం, పాట పదమొక్కటేని [illegible] నయితం ప్రజలందరినీ ఆకట్టుకుంటాయి. వాటిలోని పాట, లయబద్ధమైన మాట, ఎవరినైనా ఇట్టే ఆకర్షించగలవు. పూర్వకాలపు ప్రజా కళలు క్షీణించి పోయాక, వాటి స్థానంలో క్రొత్త వాటిని నిర్మించుకోవాల. ఆట పాటలలో కూడిన నాటకాలు, గేయాలు, పాటలు ప్రజ వాణిని బాగా రంజింపజేస్తాయి. వాటిలో ప్రజా జీవితాన్ని మెరుగుపరిచే సందేశాన్ని సాధించిస్తే, ప్రజల గుండెలకు లేలెగ్గా హత్తుకుపోతాయి. కేరళ మొదలైన కొన్ని రాష్ట్రాలలో ఈ ప్రయత్నం సాగింది. కొంతకు కొంత ఈ ప్రయోగం ఫలించింది కూడ. స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వాలు, స్థానిక సంస్థలు అభివృద్ధి కార్యక్రమాలను ప్రజలలోకి పాకించాలంటే ఈ రీతులను బాగా ఉపయోగించుకోవాలి. ఒకనాడు అనగా 11-13 శతాబ్దాల మధ్య ఒక వైపు

శైవం, ఒక వైపు వైష్ణవం ప్రజలలో బహుళ ప్రచారం చేసినయి. ప్రజలలోకి చొచ్చుకుపోవడానికి జాను తెలుగును, దేశిరచనారీతులను ప్రజా కళలను గట్టిగా ప్రోత్సహించాయి. ఆకారణంచేతనే 12-13 శతాబ్దాలలో శివ కవుల జాను తెలుగు ప్రయోగంతో నిండిన, దేశికవితా సాహిత్యం వచ్చింది. బుర్రకథలు వచ్చాయి. జంగం కథలు వచ్చాయి. అలాగే సాతాని జియ్యరు పాటలు, మంగళగీతాలు, మాలదాసర్ల సంకీర్తనలు, వైష్ణవ ప్రచారం చేస్తూ పెరిగాయి. ఉద్యమ విస్తరణకు ప్రజాదరణ అవసరమని, వారిని అందుకునే మార్గాలు అత్యవసరమని అనాడే గుర్తింపబడ్డాయి. ఇవ్వాళ-రేపు అటువంటి ప్రజాహిత మార్గాలను విస్మరించడం సబబుకాదు. వాటిని తక్కువ దృష్టితో చూడడం భావ్యం కాదు. అటువంటి దృష్టి ఆంధ్ర ప్రజల-ఆంధ్రా భాషా ప్రయోగం పట్ల అన్యాయం చేసినట్లవుతుంది.

భాషాప్రయోగం, ఆదర్శం చదివిన వారిని విన్నవారిని అందుకోవడం. చెప్పదలచినది వారికందించడం. పాఠకులు, శ్రోతల యొక్క స్థాయినిబట్టి భాషా ప్రయోగం జరగాలి. ప్రజాస్వామ్య యుగంలో, ప్రజాసామాన్యాన్ని భాగస్వాములను చేయడానికి, అన్ని వైపుల నుండి ప్రజాజీవితాన్ని అభివృద్ధి పరచడానికి, భాషా ప్రయోగం కీలక పాత్ర వహిస్తుంది. ప్రభుత్వం వారి ఉత్తర్వులు కాని, ఉత్తర ప్రత్యుత్తరాల్లో కాని అటువంటి భాషను అలవరచుకోవలసి ఉంటుంది. న్యాయ స్థానాల తీర్పులు సహితం అట్టి భాషలో ఉండాలి. ఆంధ్రప్రదేశ్ లో తెలుగు భాషా ప్రయోగం నానాటికీ అభివృద్ధి [illegible] వికసించాలి.

• • •

# అందాల ఆంధ్రధాత్రి

శ్రీమతి నాగపద్మిని

ఆగమమ్ముల పోలు నాంధ్ర భారతకర్త
  లాముప్పురును మాకు నన్నగారె!
సుగమ భాగవతాన సుధలను చిలికించు
  పోతన్న గారు మా పెద్దనాన్న!
అగణిత గుణగణానేక దీప్తులనించు
  ప్రియమైన రాయలు పిన్నతండ్రి!
సంగీత సాహిత్య సారస్వతాల జిమ్ము
  వసుచరిత్రమ్ము మన వారి సొమ్ము!

"సకల సాహిత్య లోకాన సాటిలేని,
ఖ్యాతి బడసిన మాయుత్తమ కవులు,
జాతి ముత్యాల హారాలు సారమణులు
భవ్య గుణరాశి
అందాల ఆంధ్రధాత్రి!

రంగారు బంగారు సింగారమొలికించు
  తుంగభద్రాదేవి హంగులలలు
కన్నబిడ్డలనెల్ల కడుప్రేమలాలించు
  పెన్నానదీ దివ్యప్రేమసుధలు
ఆర్ద్రత తన ప్రజల నాదుకొంచును బ్రోచు
  గోదావరీ దేవి యాదరములు
మిన్నాగు దీప్తుల దశదిశల్ ప్రాకు నా
  కృష్ణవేణీ కన్నె సోయగములు

అందాలరాశి మాయాంధ్రభూమి
ఎన్ని పుణ్యాల ఫలమొ! అది యెంత ఘనమొ!
నేడు యీ రీతిగా వెల్గి నిలిచెనిట్లు
నాదుదేశమ్ము ఆంధ్రుల నాడు సుమ్ము!



చదువు

చిత్రకారుడు : పి.టి. రెడ్డి

బాలసాహిత్యం

# పిల్లలకో మంచి పుస్తకం

బుడ్డిగ సుబ్బరాయన్

సాహిత్యమంతా ఈ రోజుల్లో నేరుగా ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా కంప్యూటర్ సాయంతో సి.డి.రామ్ (కంపాక్ట్‌డిస్క్ -రీడ్ ఆన్ మెమరీ) లో లభించే పరిస్థితుల్లో ఇంకా "పిల్లలకో మంచి పుస్తకం' అని పేరుపెట్టారేమిటి? అని అంటారేమో! అది వాస్తవమే కావచ్చు!! పేపర్‌లెస్ సొసయిటీ రావడానికి ఇంకా కొంత కాలం పడుతుంది. అందుకే ఈశీర్షికను పిల్లలకో మంచి పుస్తకం అన్నాను.

అయితే బాల సాహిత్య రూపాలు ఒక విధంగా చెప్పాలంటే, మూడు రకాలు. అవి. మొదటిరకం శ్రవ్యసాహిత్యం ఇతర్లు అంటే ఇంట్లో పెద్దవారు అమ్మమ్మలు నాయనమ్మలూ తాము విన్నవీ కన్నవీ పిల్లలకు రాగయుక్తంగా పాడి వినిపించడం, కథలుగా అల్లి చెప్పడం పరిపాటి పేదరాశి పెద్దమ్మ కథలు పురాణాలను ఉపాధ్యాయులు కథలుగా చెప్పడం ఈ కోవకు చెందుతాయి. ఇక రెండవ రకం, పఠనసాహిత్యం. పెద్దలు తాము పిల్లలకై ప్రత్యేకంగా రాసిన పఠన సామగ్రి. ఇక మూడవ రకం దృశ్యసాహిత్యం. ఇందులో పిల్లలకై ప్రత్యేకంగా రూపొందించిన నాటికలు, నృత్యనాటికలు వగయిరా చేరతాయి. ఇప్పుడు ఇవి ఎలక్ట్రానిక్ మీడియాలు ముమ్మరంగా వస్తున్నాయి. కాగా, పిల్లందరూ ఒకే అవగాహన స్థాయిలో ఉండరు. వారి వారి వయోవర్గాన్ని బట్టి పిల్లలకు సాహిత్యం అందించవలసి ఉంది. దాదాపు నాలుగు దశాబ్దాల క్రితం జాతీయ స్థాయిలో జరిగిన బాలసాహిత్యసదస్సులో బాలబాలికలు చదువ వలసిన సాహిత్యం తీరు తెన్నుల గురించి చర్చించి నిర్ణయించారు. ఆరు మాసాలు నిండే వరకూ పిల్లల్లకు పాటలే వినిపించాలి. ఆతరువాత ఏడాది పూర్తయ్యేవరకూ ఆతర్వాతా రంగు రంగుల బొమ్మల పుస్తకాలు చూపిస్తూ ఉండాలి. రెండు-మూడేళ్ల పిల్లలకు జంతువుల కథలు చెప్పాలన్నారు. నాలుగయిదేళ్లవారు పాలబడి (నర్సరీ) లోనే ఆటపాటలతో కాలక్షేపం చేస్తూ పరిసరాలతో పరిచయం చేసుకుంటూ తోటి వారితో స్నేహం నెరపుతూ ఉన్నప్పుడు అక్షరాభ్యాసమై చిన్న చిన్న ఈ పొడుపు కథలు అంటే 'నక్క-ద్రాక్షపండ్లు'వంటివి అంటే యిష్టపడతారు.

ఎనిమిదేళ్ల వయసప్పుడు కొత్త ఆలోచనలు వారిలో బయలు దేరతాయి. అప్పుడే పురాణ కథలు అంటే యిష్టపడతారు. ఆ తర్వాత తొమ్మిది లగాయితూ పన్నెండేళ్ల వయస్సులో ఊహ పెరిగి పిల్లల అవగాహన శక్తి ఇనుమడించి బాగా అర్థం చేసుకునే శక్తి వస్తుంది. సమాజంలో ఎలా నడవాలో అనే వ్యవహారజ్ఞానం క్రమేపీ అలవడు తుంది. దేశ చరిత్ర భూగోళ విశేషాలు, మార్గ దర్శకులుగా గుర్తింపబడిన వారి జీవిత విశేషాలు చదవడానికి ఇష్టపడతారు. ఆపై వయసుల పిల్లలు విజ్ఞాన విశేషాలు, సాహస ప్రక్రియలు అంటే బాగా ఇష్టపడతారు. ఆయా సమయాలలో తగు పఠనా సామగ్రిని ఇటు ఇంటి వద్ద తలిదండ్రులూ అటు పాఠశాలల్లో ఉపాధ్యాయులు పిల్లలకు అందిస్తూ వారి పఠనాసక్తిని ఎప్పటికప్పుడు పెంపొందిస్తూ ఉండాలి.

### తెలుగులో పఠన సామాగ్రి

ఒకప్పుడు పిల్లలకై ప్రదేశ సాహిత్యం వెలువడలేదు. తెలుగులో అటువంటి ప్రయత్నం చేసిన వారిలో కందుకూరి వీరేశలింగం పంతుల్ని ఆద్యుడుగా పేర్కొంటారు. ఆయన పిల్లకై 'నీతికథామంజరి' నీతిదీపిక, పంచ తంత్రంలోని 'సంధి' విగ్రహం భాగాలు పిల్లలకు అందుబాటులోకి తెచ్చారు. పంచతంత్రాన్ని నీతిచంద్రిక, మిత్రలాభం, మిత్రబేధంద్వారా పంచతంత్రాన్ని తెలుగు బాలబాలికలకు అందించిన సులోక సాహితీపరుడు పరవస్తు చిన్నయసూరి (1806-1862). భాష గ్రాంధికమైన వస్తువు నాటి పిల్లనాకర్షించింది. ఆ తర్వాత వెంకట పార్వతీశం జంట కవులుగా పేరుపడ్డ కవులు ఓలేటి పార్వతీశం (1882-1955) బాలాంత్రపు వెంకట రావు (1881-1973) తెలుగులో బాలసాహిత్యానికి గట్టి పునాదులు వేశారని విజ్ఞుల అభిప్రాయం. వారి 'బాలగీతావళి' సుప్రసిద్ధమయింది. అంతకు ముందు నావితికొలను సుబ్బారావు (1863-1936) పిల్లలు దయాధర్మాలూ, సత్య వర్తనం పరోపకారం వంటి సుగుణాలను ఇనుమడింప చేయడానికి 'ఆర్యకథానిధి' అనే కథా సంపుటాలను వెలువరించారు.

### గిడుగు –చింతా వారికృషి

వీరు పాశ్చాత్య దేశాల్లో ఆసమయంలో ముమ్మరంగా ..... వెల్లివిరుస్తున్న బాలల సాహిత్యాన్ని తెలుగు పిల్లలకు అందివ్వటానికి మహాకృషి చేసిన సాహితీపరులు గిడుగు వెంకట సీతాపతి (1885-1968), చింతా దీక్షితులు

(1891-1960) వీరిద్దరికీ 'భారతి' సాహితీ మాసపత్రిక ఆలంబన. గిడుగువారి, 'చిలకమ్మ పెళ్లి' 8-11 ఏళ్ల బాలబాలికల్ని అలరిస్తుంది. వారి 'రైలుపాట', 'పాలీడు-ఈగ' కూడ. ఇక, చింతావారు 'బాల వాఙ్మయ బ్రహ్మ' ప్రసిద్ధి పొందాయి. వారి 'లక్కపిడతలు' ప్రభుత్వ పురస్కారం నందుకుంది. (1949) ఇందులోని భాగంగ దీక్షితులు రూపకల్పన హనుమంతుడి తోక లో రామాయణాన్ని సంగ్రహంగ పొందుపరచారు. ఇక 'సూరి సీతితంకి' (1931) తెలుగింటి నడయాడే పసిపిల్లల ప్రవృత్తిని ప్రతిబింబించే రచన, 'బంగారుపిలక', 'లీలాసుందరి', 'శంపాలత' (1933) పిల్లల రచనల్లో వీటికివే సాటి వారి ప్రతి రచన ఒక జాతి రత్నంగా కొనియాడబడిందే.

## న్యాయపతి దంపతుల కృషి

పిల్లలే వీరి లోకం. వాల్ట్‌డిస్నే, శంకరపిళ్లై (పిబిటి) వంటివారికి పిల్లల్ని అలరించే కృషికే తమజీవితాన్ని అంకితం చేశారు. అట్లాగనే, తెలుగు దేశంలో న్యాయపతి రాఘవరావు న్యాయపతి కామేశ్వరి (1905-84) (మరణం 1982) వారి జీవితాంతం పిల్లలకే వారి కృషిని ధారపోశారు. వీరిద్దరూ రేడియో తెగ అన్నయ్య, అక్కలుగా ప్రసిద్ధిపొందారు. అయితే వీరిద్దరికీ రేడియోయే ఆలంబన. 1939 నుండి ఆకాశవాణి పిల్లల కార్యక్రమం నిర్వహించే అవకాశం వీరిని వరించింది. అది లగాయితూ ఆదివారం వచ్చిందంటే వారి శక్తినంతటినీ ధారపోసి ఆటవిడుపు కార్యక్రమం సాహితీ రూపొందించి తెలుగు నాట మారుమూలన ఉండే పిల్లలకు అందించేవారు. 1945 లో 'బాల' పత్రికను స్థాపించి చిన్న పిల్లలకై ప్రత్యేక రచన సాగించి అందించారు. వీరి రచనల్ని డాక్టరు వెలగ వెంకటప్పయ్య పది సంపుటాలుగా వర్గీకరించి సంకలించారు. ఈ సంపుటాలను పుస్తకం రూపంలో ముద్రించవలసిఉంది.

## ఇంకొందరు బాలల సాహితీ వేత్తలు

పిల్లలకై ప్రత్యేక రచనలు చేసే ప్రయత్నం ఎంతో మంది చేశారు. వారిలో మహాకవి పండితులు విశ్వనాథ సత్యనారాయణ (1895-1976) అడవి బాపిరాజు, నాళం కృష్ణారావు (1890-1931) కలివికొడల వెంకటరాం (1892-1968), ఏటుకూరి వెంకటనరసయ్య (1911-1949) వేటూరి శివరామశాస్త్రి (1892-1967), దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి (1897-1980) మున్నగు వారున్నారు.

### బాలసాహిత్యం – పత్రికలు:

పిల్లలకై ప్రత్యేక రచనలు సాగించిన వారి కృషికి ఆలంబనం మొదట్లో పత్రికలనే. కందుకూరి వీరేశలింగం నాటి పత్రికల్లో 'బాదంకాయ', 'పరికంకులు', బ్రాహ్మణి-ముంగిస' పరోపకారం, వంటి చిన్నచిన్న కథలు, అబద్దాలాడటం ఎంత అనర్థమో వివరించడానికి 'సత్యసంజీవని' పత్రిక ద్వారా వెలువరించారు.

ఆంధ్రపత్రిక దినపత్రికాధిపతులు కాశీనాధుని నాగేశ్వరావు గారు 1923లో ప్రారంభించిన సాహిత్య మాసపత్రిక తొలి సంచిక నుండి పిల్లలకై ప్రత్యేక రచనలు, ప్రచురించేవారు. నాటి మేటి బాలల రచయిత చింతా దీక్షితులు ఈ బాలానందం లోనే అనేక రచనలు సాగించారు. 1940లో తాను సంపాదకత్వం నిర్వహించిన నాటి నుండే గిడుగు వేంకట సీతాపతి 'బాలనందం' శీర్షిక రూపొందించి నిర్వహించారు. ఇందులో పైనచెప్పిన బాపిరాజు, వేలూరివారు, చింతావారు తమ తమ రచనలనందించి బాలసాహిత్య ప్రగతికి చక్కని పునాదులు వేశారు. 'గృహలక్ష్మి బాలవినోదిని, 'కృష్ణాపత్రిక' మున్నగు పత్రికలు బాలల సాహిత్యానికి దోహదం చేశాయి.

### సాహిత్యానికి తొలి పిల్లల పత్రిక

మేడిచర్ల ఆంజనేయమూర్తి 'బాలకేసరి' ని 1940 లో వ్యవస్థాపించి పిల్లలకోసం ప్రత్యేక పత్రిక నొకదానిని సృష్టించారు. ఆతర్వాత 'బాల' పత్రిక న్యాయపతి రాఘవరావుగారి పర్యవేక్షణలో మద్రాసునుండి 1945 నుండి వెలువడి 1977 వరకూ సాగింది. ఇది ఒక వినూత్నమైన ప్రయోగంగా ప్రాచుర్యం పొందింది. దీని ప్రభావం తెలుగు బాల సాహిత్యంపై అపారం, అనంతం అని విజ్ఞులు అభిప్రాయం. ముళ్లపూడి వెంకట రమణ, బాలాంత్రపు రజనీకాంతరావు, కె. సభా వంటి మేటి రచయితలకూ బాపూ, బుజ్జాయి, సత్యమూర్తి వంటి చిత్ర కారులకు 'బాల' ఆలంబన అయింది.

'బాల' పుట్టిన మరుసటి సంవత్సరం లోనే (1946) 'చందమామ' పుట్టి చివరకు ఇప్పుడు కుటుంబ సభ్యులందరికి పత్రికగా మారిపోయింది. ఇందులో జంతువుల కథలు, సాహస గాథలు, పురాణ కథలు, బేతాళ కథలు, జానపథకథలు, రాజుల కథలు, వింత కథలు వగయిర కొత్త కొత్త మార్పులతో అందరి ప్రశంసలనందుకొన్న బాలల పత్రిక అయింది. ఇది ఇప్పుడు పదకొండు బాషల్లో వెలువడుతూంది. 'చందమామ' పత్రికను ఈ విధంగా రూపొందించిన స్రష్టలు 'చక్రపాణి' (ఆలూరి వెంకట సుబ్బారావు), బి.సుబ్బారావు ప్రభృతులు.

దిగువన పిల్లల పత్రికల ప్రగతి ని సూచించే జాబితాలో ఆయా పత్రికల పేరు నాటి సంపాదకులు (ఎడిటర్స్)

ప్రారంభ సంవత్సరం ఇవ్వడం జరిగింది.

ఇవీకాక హరివిల్లు, విజ్ డమ్, కోకిల, పాట్టిబాన, చిన్నారి లోకం, బాలచెలిమి, మున్నగు పత్రికలు ప్రచురించబడ్డాయి. పై పట్టికలో కొన్ని మాత్రమే ప్రస్తుతం వెలువడుతున్నాయి.

**పురస్కారాలు అందుకున్న బాలసాహితిః**

రాష్ట్రప్రభుత్వం తరపున తెలుగు భాషాసమితి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కేంద్ర ప్రభుత్వం తరపున జాతీయ విద్యాపరిశోధక, శిక్షణసంస్థ) (నేషనల్ కౌన్సిల్ ఫర్ ఎడ్యుకేషన్, రీసెర్చి అండ్ ట్రైనింగ్) న్యూఢిల్లీవారు పిల్లల సాహిత్యాన్ని రూపొందించేవారిని ప్రోత్సహించడానికి పురస్కారాలు అందించడం పరిపాటి, కొన్ని వివరాలు దిగువ జాబితాలో పొందుపర్చడమైంది. ఈ జాబితా సమగ్రం కాదు. పురస్కారాలు అందుకుని బాలలసాహిత్య రచనలు ఇంకను వున్నవి.

ప్రముఖ బాలల సాహిత్య నేత్తల రచనలు పైన పేర్కొన్నవి గాక బాలల సాహితీలోకంలో కృషి చేస్తున్న అనేక మంది ప్రముఖల రచనలను ఈ సందర్భంలో ఉటంకించవలసిఉంది. అందులో ముఖ్యంగా పేర్కొనదగినవి చంద్రం (కె.సభా) వీధిగాయకుడు (నార్లచిరంజీవి) 'చిరుకప్ప' (పాలంకి వెంకటరామచంద్రమూర్తి), పిల్లలదొంగ (న్యాయపతి రాఘవరావు) పంచతంత్రం విశ్వాశాత్ముల నరసింహమూర్తి, బొమ్మల రామాయణం(బాపూరమణ) రోజుకోకథ అనే నెలవంక' (అముద్రితం - కవికాల రావు) గోపీ మోహిని (చింతా దీక్షితులు) దసరా అల్లుడు(నండూరి సుబ్బారావు) పిల్లల పాటలు (సంకలనం -వెలగా

| సంఖ్య | పేరు | సంపాదకుడు | ప్రారంభ సంవత్సరం |
|---|---|---|---|
| 1. | బాలకేసరి | మేడీచర్ల ఆంజనేయమూర్తి | 1940 |
| 2. | బాల | న్యాయపతి రాఘవరావు కామేశ్వరి | 1945 |
| 3. | చందమామ | 'చక్రపాణి(ఆ.వెం.సుబ్బారావు' | 1946 |
| 4. | బాలమిత్ర | బి.వి.రాధాకృష్ణ | 1949 |
| 5. | పాపాయి | డి.అప్పారావు | 1949 |
| 6. | బొమ్మరిల్లు | జె.రామారావు | 1949 |
| 7. | బాలవినోదం | గోలేటి రామారావు | 1950 |
| 8. | బాలప్రభ | పాటిబండ మాధవశర్మ | 1952 |
| 9. | మామనసంఘం | లవణం | 1952 |
| 10. | ఉదయబాల | -- | 1952 |
| 11. | బాలానందం | న్యాయపతి రాఘవరావు | 1956 |
| 12. | బాలప్రభ | జి.మునిరత్నం | 1958 |
| 13. | బాలబంధు | ఆర్.ఎస్.మూర్తి | 1962 |
| 14. | చంద్రభాను | కోటిపాటి, ఎమ్.వి శేషయ్య | 1962 |
| 15. | బాలరాజ్యం | గోలేటి రామారావు | 1963 |
| 16. | బాలానందం | ముదుపలమూరి రామారావు | 1964 |
| 17. | నందన | -- | 1965 |
| 18. | రఘుబాల | ఎ.ఎల్లయ్య | 1965 |
| 19. | పసిడిబాల | చింతాహనుమంతరావు | 1969 |
| 20. | బాలప్రపంచం | మసూనా | 1970 |
| 21. | ఆనందబాల | బి.కె.విశ్వేశ్వరరావు | 1970 |
| 22. | బొమ్మరిల్లు | విజయ బాపినీడు | 1972 |
| 23. | పాలవెల్లి | గిరిజశ్రీ భగవాన్ | 1974 |
| 24. | వసంతబాల | విశ్వప్రసాద్ | 1974 |
| 25. | పొదరిల్లు | జి.వి.రంగాచార్యులు | 1974 |
| 26. | బుజ్జాయి | గీతాసుబ్బారావు | 1975 |
| 27. | బేబీ | సి.నాగేశ్వరరావు | 1977 |
| 28. | చంపక్ | విశ్వనాథ్ | 1978 |
| 29. | బాలభారతి | వి.వి.నరసింహారావు | 1978 |
| 30. | ప్రమోద | ధనికొండ హనుమంతరావు | 1978 |
| 31. | మాబడి | నాయిని కృష్ణమూర్తి | 1978 |
| 32. | పాఠశాల | నాయిని కృష్ణమూర్తి | 1978 |
| 33. | బాలచంద్రిక | ఏడిద కామేశ్వరరావు | 1979 |
| 34. | బాలవాణి | -- | 1979 |
| 35. | విద్యాబాల | కపుల ఆంజనేయశర్మ | 1979 |
| 36. | మిలియన్ జోక్స్ | -- | 1979 |
| 37. | బాలజ్యోతి | నండూరి రామమోహనరావు | 1980 |

శశికాంత్ శాతకర్ణి
(ఆధారం,బాలసాహితీవికాసం, వెలగ వెంకటప్పయ్యా)

| | |
|---|---|
| 1. లక్కపిడతలు | చింతా దీక్షితులు (1949) |
| 2. బొమ్మరిల్లు | కవిరావు(1955) |
| 3. బొమ్మల భారతం | మాగంటి బాపినీడు (1955) |
| 4. ముద్దుపాప (శతకం) | కవిరావు (1956) |
| 5. నర్తనబాల | నటరాజరామకృష్ణ (1957) |
| 6. పాలబడిపాటలు | బి.వి. నరసింహారావు (1958) |
| 7. గంగావతరణం | ఉత్పల సత్యనారాయణాచార్య1959 |
| 8. జంతుపురాణం | ఎస్.ఎల్.నరసింహారావు (1960) |
| 9. ఆకాశం | విస్సా అప్పారావు (1960) |
| 10. విజ్ఞానలోకం | వెలగా వెంకటప్పయ్య (1964) |
| 11. బంగారునడచిన బాట | కలనకొలను సదానంద(1966) |
| 12. చిట్టిముత్యాలు | గంగరాజు సుశీలాదేవి(1966) |
| 13. యువరాజు | కె.రామలక్ష్మి(1966) |
| 14. స్వతంత్ర భారత్ | వక్కలంక లక్ష్మీపతిరావు (1968) |
| 15. మూడు మొగ్గలు | ఏ.లక్ష్మీరమణ(1968) |
| 16. ప్రకృతి వింతలు | గిడుగు విశాలాక్షి (1969) |
| 17. రంగురంగుల రత్నాలదీపాలు | మిరియాల రామకృష్ణ(1970) |
| 18. అనంతం అంతం | కంచిరమాదేవి(1970) |
| 19. ఆంధ్రదేశయాత్ర | విలాసం సుశీలాదేవి (1970) |
| 20. గాలిలో ప్రయాణం | రెడ్డిరాఘవయ్య (1973) |
| 21. యాగ్నికం | సీత(1974) |
| 22. బాలవిజ్ఞాన కథానిధి | ఏ.వి.ఎస్.రామారావు (1975) |
| 23. చంద్రలోకయాత్ర | ఎ.వి.ఎస్ రామారావు(1977) |
| 24. వింతమొక్కలు | కొత్త శేషాద్రి (1979) |
| 25. చెట్లోస్తున్నాయి | కొత్త శేషాద్రి (1979) |
| 26. అందరమూ ఒక్కటే | డి.సుజాతదేవి |
| 27. కలిసిసాగుదాం | మరికొండల లక్ష్మీనారాయణాచార్య |
| 28. తల్లీభారతినందనం | గుడివాడ ప్రభావతీ దేవి |
| 29. సుజలాంసుఫలాం | డి.సుజాతదేవి. |
| 30. సత్యమేవజయతే | రావెళ్లకృష్ణారావు |

వెంకటప్పయ్య), జలతారుజాబిలి (శ్రీ వాత్సవ) కోటివీరన్నసాహసం (అంతటి నరసింహం) జేజిమామయ్య పాటలు(బాలాంత్రపు రజనీ కాంతరావు), చందమామ (ఏటుకూరి వెంకట నరసయ్య), అల్లరి సూర్యం (చొక్కాపు వెంకటరమణ), పారిపోయిన బఠానీ (గీతాసుబ్బారావు) మున్నగునవి. ఇంకను వేమరాజు భానుమూర్తి రాసిన చక్రవర్తి లేఖలు సైన్సుపుస్తకాలు, పురాణపండరంగ నాథ్ రాసిన విజ్ఞాన దాయకమైన పిల్ల పుస్తకాలు, సత్తిరాజు కృష్ణారావు గారి బంగారు కథలు, ఏడిదకామేశ్వరావుగారి 'ఒప్పుల కుప్ప', ఇల్లెందుల సరస్వతీదేవిగారి బాలవీరులు యుద్దనపూడి సులోచన దేవిరాణి గారి బాలసాహితీ పేర్కొనదగినవి.

## బాలలసాహితీ, ప్రభుత్వ కృషి- బాలల అకాడమీ:

ఈ శీర్షిక లోనికి వచ్చేది రాష్ట్ర ప్రభుత్వసంస్థ- ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి. 1974లో అఖిల భారత తెలుగు బాలల రచయితలసమావేశం జరిగిన సందర్భంలో వేదిక మీద సమావేశమయిన బాలల రచయితలు ఈ రంగంలో కృషికి ప్రేరణకు ప్రోత్సాహానికిగాను ఒక సంస్థ ఉంటే బాగుంటుందని నిర్ణయించి నాటి ప్రభుత్వానికి నివేదించారు. తత్ఫలితంగా జి.వో.ఎమ్.ఎస్.నెం.241 ఎడ్యు, తేదీ 4 మార్చి 1976 ద్వారా ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ నెలకొని ఆఏడాది సెప్టెంబర్ నుండి కార్యకలాపాలు సాగిస్తూ వచ్చింది. క్రమేణా ఈ సంస్థ రాష్ట్ర స్థాయి బాలల సాహిత్య కేంద్రంగా రూపుదిద్దుకుంది. శిక్షణ శిబిరాలు నిర్వహించింది. ఇప్పటికి సుమారు 120 పుస్తకాలు అందించింది. ఇందులో ఏడేళ్లలోపువారికి బుజ్జికథలు 12 ఆడియో కాసెట్లు ఆల్బమ్స్ చిలుక పలుకులు పేరిట విడుదలయ్యాయి. 8-11 వయోవర్గానికి పంచదార చిలకలు, 12+వయోవర్గానికి పఠన సామగ్రి ప్రచురితమయ్యాయి. అకాడమీ ప్రచురించిన పుస్తకాలలో పలు సంకలనా లున్నాయి. డాక్టరు కొక్కారోకో రంగుల పుస్తకం పౌష్టికాహారం గురించి వినూత్నపక్కాలో చెబుతుంది. అకాడమీ ప్రచురించిన స్వరాజ్యం నాజన్మ హక్కు' అనే పుస్తకాన్ని ప్రముఖస్వాతంత్ర్య యోధుడు డి.రామ నాథం లింగం రాశారు. ఇది తెలుగు యూనివర్సిటీ పురస్కారాన్నం దుకుంది. 'మల్లెపూదండ' తెలుగు కవుల చరిత్రను సులభశైలిలో పిల్లలకు పరిచయం చేస్తుంది. దీన్ని ప్రముఖకవి పండితులు

బొమ్మకంటి శ్రీనివాసా చార్యులు రచించారు. ఇటీవల బాలల వీడియో సంచికలను 'ఇంద్రధనస్సు' పేరిట విడుదల చేసింది. రాష్ట్ర స్థాయి బాలల సాహిత్య సంస్థను నెలకొల్పడంలో ఆంధ్రప్రదేశ్ ముందడుగు వేసింది. ఆ తర్వాతనే 1981లో కేరళ ప్రభుత్వం స్టేట్ ఇనిస్టిట్యూ ఆఫ్ చిల్డ్రన్ లిటరేచరు'ను నెలకొల్పి బాలల విజ్ఞాన నిర్మాణంలో నిమగ్నమైంది.

## ప్రతిబడికీ బాల సరస్వతీపీఠం

1985-86 బాలల అకాడమీ చేపట్టిన పథకాలలో ప్రతి బడికీ బాల సరస్వతీ పీఠం ఒక వినూత్న పథకం, దీన్ని ఈ సంస్థ ప్రత్యేకంగా రూపొందించి రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించింది. ఈ పథకం ప్రకారం రాష్ట్రంలో అయిదువేల ప్రాథమిక పాఠశాలలకుఅంటే దాదాపు జిల్లాకు రెండు వందల పాఠశాలలనంతున పుస్తకాల కిట్ అందిందింది. అంతకుముందు ఏ పాఠశాలకు పాఠ్యేతర పఠన సామగ్రి అందుబాటులో లేదు. ఇందులో బాలల అకాడమీ ప్రచురించిన ఇరవై పుస్తకాలు ఒక ఆడియో కాసెట్టు పథకం కింద వచ్చిన ప్రతి పాఠశాలకు అందాయి.

దరిమిలా 1987-88 నుండి నూతన విద్యా విధానం ప్రకారం కేంద్ర ప్రభుత్వం రూపుదిద్దుకున్న 'ఆపరేషన్ బ్లాక్ బోర్డు'పథకంలో ఏకాదశవిధ ప్రాథమిక సౌకర్యాలలో దేశంలోని ప్రతి బడికీ ఇటువంటి సరస్వతీపీఠాలు దేశవ్యాప్తంగా అందుతున్నాయి. ఈ కార్యక్రమం లో రాష్ట్రానికి సంవత్సరానికి ఏడాదికి సుమారు మూడుకోట్ల రూపాయలు అందుతున్నాయి.

## బాలచంద్రిక

బాలల అకాడమీ అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా 1979 నుండీ బాలచంద్రిక, అనే మాసపత్రిక వినూత్న పంథాలో రూపొందించి రాష్ట్రంలో సుమారు నలభయివేల ప్రాథమిక పాఠశాలల్లో తప్పనిసరిగా అందునట్లు చేసి పదేళ్లు నిర్వహించారు.

ఇక ప్రభుత్వ స్థాయిలో బాలల సాహిత్యం వెలువరిస్తున్న సంస్థ నేషనల్ బుక్ ట్రస్ట్ ఇందులో అంతర్భాగంగానే 'నెహ్రూబాలపుస్తకాలయ' పేరుతో పిల్లల పుస్తకాలను అందిస్తున్నది. వీరు ప్రచురించిన అరవయికిపైగా ఉన్న తెలుగు పుస్తకాలలో 'బంగారు పిలక' (తురగా జానకీరాణి సంకలనం) తప్ప మిగతా వన్నీ అనువాదాలే. ఇటీవల జాతీయ బాలల సాహిత్య కేంద్రం (నేషనల్ సెంటర్ ఫర్ చిల్డ్రన్స్ లిటరేచర్' అనే సంస్థ నేషనల్ బుక్ ట్రస్ట్‌కు అనుబంధ సంస్థగా రూపొందించినట్టు భోగట్టా. భారత ప్రభుత్వ సమాచార ప్రసార మంత్రిత్వ శాఖ ఆధ్వర్యంలో పనిచేస్తున్న పబ్లికేషన్ డివిజన్ కూడ పిల్లలకై కొన్ని ప్రత్యేక రచనలను చేయించి ప్రచురించింది.

## బాలసాహిత్యం ఎలక్ట్రానిక్ మీడియా

ఈ శీర్షిక మొదటి పేరాలో పేర్కొన్నట్టు జనజీవనంపై ఎలక్ట్రానిక్ మీడియా ప్రభావం ముమ్మరంగా ఉంది. అందులో ఎదురవుతున్న పిల్లల మనస్సుంపై దీని ప్రభావం ప్రగాఢం. పైగా ఆ ప్రభావం శీఘ్రుంగా పడుతుంది. వాస్తవానికి ఎలక్ట్రానిక్ మీడియా ప్రభావం ఆకాశవాణి ద్వారా అయిదు దశాబ్దాలకు పైగా ఉన్నా ఆనాడు 1937లో దుర్గాబాయి (దేశ్‌ముఖ్) ప్రారంభించిన 'ఆటవిడుపు' క్రమంగా సేకేటి శివరామ్, న్యాయపతి దంపతుల చేతుల మీదుగా అత్యంత శ్రద్ధాశక్తులతో నిర్వహించిన కార్యక్రమాలను దాటి మారుమూల గ్రామీణ బాలబాలికలకు అందుబాటులో ఉండేది కాదు మరి ఇప్పుడో ఆకాశంలో నెలకొన్న జియోస్టేషనరీ శాటిలైట్ ఛానల్స్ ద్వారా ప్రసారితమయ్యే రేడియో, టెలివిజన్ కార్యక్రమాలు ప్రతిమారుమూల గ్రామానికి అందుబాటులో ఉండేలా సులభతరమయి పోయాయి.

ఈ సందర్భంలో కార్యక్రమ నిర్వాహకులు కడు అప్రమత్తతతోనూ జాగ్రత్తలతోనూ ప్రసారకార్యక్రమాలను ముఖ్యంగా పిల్లల నుద్దేశించినవి, రూపొందించి మరీ ప్రసారం చెయ్యాలి. పిల్లలకై ఉద్దేశించిన వాటిని రూపొందించడం తయారు చేసే 'సాఫ్ట్‌వేర్' ను జాగ్రత్తగా విధి నిషేధాలకు లోబడి తయారు చేయించి ప్రసారం చేయవలసి ఉంది. బాలల నుద్దేశించి సిద్ధపరిచే రచయితలకు ప్రత్యేక శిక్షణా తరగతులు ముమ్మరంగా సాగాలి. ఇప్పటికి అయిదుగురు పి.హెచ్.డి. పట్టాలు పొందారు. అంతర్జాతీయ బాలల సంవత్సరం 1979లో శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ వారు ఎమ్.కె.దేవకికి డాక్టరేట్ ప్రధానం చేశారు. ఈమె పరిశోధనాంశం తీసుకున్న విషయం 'బాలగేయాలు'. తర్వాత వెలగా వెంకటప్పయ్య' బాలసాహిత్య వికాసం పై అధ్యయనం చేసి ఆంధ్రా యూనివర్సిటీ నుండి పి.హెచ్.డి. పట్టం పొందారు. (1981) గంగిశెట్టి శివకుమార్ 'బాలల సాహిత్యంలో కథలపై డాక్టరేట్ చేశారు. గుడివాడ ప్రభావతి, బాలసాహిత్యంలో విలువలు' గూర్చి పరిశోధనలు చేసి డాక్టరేట్ పొందారు. లక్ష్మి 'బాలల సాహిత్యంలో నవలపై అధ్యయనంచేసి పి.హెచ్.డి. సంపాదించారు. ఇంకను పెక్కుమంది బాలలసాహిత్యం'లోని పెక్కుఅంశాలపై ఎమ్.ఫిల్ చేశారు. ఇంకను ఈ పరిశోధనలు సాగుతునే ఉన్నాయి. ●



# బాపూజీ బతికే వుంటే

డా॥ సి. నారాయణరెడ్డి

పల్లవి॥ : బాపూజీ బతికే వుంటే
ఏంచేసేవాడు / ఏం చేసేవాడు/

చరణం : జాతిని నడిపే రాజనీతిలో
నీతిని చంపే నేతల చూసీ/
ఏంచేసేవాడు/ జాలిగ నవ్వేసేవాడు/

చరణం : స్వజాతి పరువును బజారుకీడ్చే
సంఘద్రోహుల యెత్తులు చూసీ
ఏంచేసేవాడు/ తన తలదించేసేవాడు/

చరణం : గమ్యం తెలియని ఉన్మాదంలో
గతి తప్పిన యువశక్తుల చూసీ
ఏంచేసేవాడు / కర్రను విసిరేసేవాడు/

చరణం : జాతిగుండెనే చీల్చేసే కి
రాతక ఘాతుక చర్యలు చూసీ
ఏంచేసేవాడు / భోరునేడ్చేసేవాడు/

# స్త్రీవాద సాహిత్యం–ఒకపరిశీలన

డా॥ రావి భారతి

స్త్రీలు ఏదేశంలో ఉన్నా వాళ్ల సమస్యల యొక్క స్వభావం ఒకటిగానే ఉంటుంది. సమస్యల స్వరూపాలు భిన్నంగా ఉండవచ్చు. ఎందుకంటే స్త్రీల యొక్క అనుభవాలు, అనుభూతులు సెంటిమెంట్లు, ప్రతిస్పందనలు ప్రపంచ వ్యాప్తంగా ఒకటిగానే ఉంటాయి, ఎలాంటి తేడా లుండవు. వివాహం, కుటుంబం, మాతృత్వం, ఆర్థికావసరాలు, సామాజిక సంబంధాలు–ఇవి ఎక్కడ ఉంటాయో అక్కడ సహజంగానే సమస్యలుత్పన్నమౌతాయి. అయితే చైతన్యం, ప్రతిఘటన ఈ రెండూ ఎక్కడ ఉంటాయో అక్కడ స్త్రీ విముక్తి ఉద్యమాలు ఊపిరి పోసుకుంటాయి. అంతర్జాతీయంగా ఫెమినిస్టు ఉద్యమం అట్లా పుట్టిందే.

ఈనాడు అన్ని రంగాలలో స్త్రీలు అనుభవిస్తున్న దుర్భర జీవితాన్ని చారిత్రకనేపథ్యంలో పరిశీలించి మన దేశంలో పాలకవర్గాలు ఏయే దశల్లో ఏవిధంగా స్త్రీలను లొంగదీసుకోవడానికి ప్రయత్నించారో చారిత్రికులు ఇండాలజిస్టులు స్పష్టంగా వివరించారు.

ఆదిమ మానవ సంఘంలోని మాతృస్వామ్య దశలో ఆహారసంపాదనలో స్త్రీ పురుష భేదం లేదు. ఎవరి మీదా ఎవరూ ఆధారపడి జీవించలేదు. కనుక ఎవరి మీదా ఎవరి పెత్తనం లేదు. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే మొట్టమొదట వ్యవసాయం ఆరంభించింది పురుషుడు కాదు స్త్రీ అని ఇండాలజిస్టులంటారు. "తన కడుపులో నుండి తనను పోలిన రూపాన్ని ఉత్పత్తి చేయగల స్త్రీలు భూమినుండి జరిగే ఉత్పత్తిని పురుషులకంటే ముందే స్త్రీలు గ్రహించారు". అంటే మొట్టమొదటి ఉత్పత్తి దారిణి స్త్రీ అన్నమాట. ఇలాంటి మాతృస్వామ్య దశనుండి పితృస్వామ్య దశకు చేరుకోగానే ఆమె శరీరం మీద, మనసుమీద, పిల్లల మీద ఉన్న హక్కును పురుషుడు ఎలా బలవంతంగా లాక్కున్నాడో చరిత్ర చెబుతుంది. తరువాత చారిత్రక పరిణామదశల్లో స్త్రీ జీవితమే ఒక సమస్యల విషవలయంగా మారిపోయింది.

అయితే ఈనాడు స్త్రీల సమస్యల్ని కేవలం సమస్యలుగానే చూడకుండా వాటి యొక్క మౌలిక రాజకీయ తత్వాన్ని విశ్లేషణాత్మకంగా విమర్శనాత్మకంగా గుర్తించి మౌలికమైన ప్రశ్నల్ని రేకెత్తించడమే తమ ధ్యేయంగా ఫెమినిస్టులు

ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే మొట్టమొదట వ్యవసాయం ఆరంభించింది పురుషుడు కాదు స్త్రీ అని ఇండాలజిస్టులంటారు. "తన కడుపులో నుండి తనను పోలిన రూపాన్ని ఉత్పత్తి చేయగల స్త్రీలు భూమినుండి జరిగే ఉత్పత్తిని పురుషులకంటే ముందే స్త్రీలు గ్రహించారు". అంటే మొట్టమొదటి ఉత్పత్తి దారిణి స్త్రీ అన్నమాట.

చెబుతున్నారు. సమాజంలోని సాంఘిక సంబంధాలను ముఖ్యంగా స్త్రీ పురుష సంబంధాలను, కుటుంబంలో అమలులో ఉన్న పురుషాధికారాన్ని మౌలికంగా ప్రశ్నించడం ఈవాదం యొక్క ముఖ్యోద్దేశం విశ్లేషణ–విమర్శనాత్మకత. ఈ రెండూ ఫెమినిజానికి రెండు కళ్లు. నిర్వచన రూపంలో చెప్పాలంటే "ఫెమినిజం ఒక విశ్లేషణా పద్ధతి. జీవితాన్ని రాజకీయాలను అర్థం చేసుకునే ఒక విధానం. స్త్రీ యొక్క వ్యక్తిగత అనుభవాల ద్వారా కలిగే అవగాహనతో రాజకీయ పరిష్కారాన్ని సూచించే ఒక సాధనం అంటే ఈ విశ్లేషణ నింగి నుండి కాక నేల నుండి మొదలౌతుంది. ఒక్క వాక్యంలో చెప్పాలంటే సమాజంలో స్త్రీ పరంగా ఆర్థిక రాజకీయ నైతిక రంగాల్లో మౌలికమైన మార్పుల్ని కోరడమే ఈ ఉద్యమం యొక్క పరమోద్దేశం".

ఎప్పుడైతే మనం సమస్యల యొక్క మౌలికాంశాల్లోకి వెళతామో వాటికొక చారిత్రకనేపథ్యం తప్పని సరిగా ఉంటుంది. వాటి కొక సిద్ధాంతమూ ఉంటుంది. అది ఉద్యమానికి కరదీపిక లాంటిది. ప్రపంచ వ్యాప్తమైన ఈ ఫెమినిస్టు ఉద్యమానికి మార్క్స్, ఎంగిల్స్, లెనిన్, L.H. మారన్ వంటి ఆర్థిక, సాంఘిక, రాయకీయ నేత్తల సిద్ధాంతాలే ఆయువు పట్టులు. ఇవి సాంఘిక ఆర్థిక జీవితాన్ని నడిపించే శక్తుల్ని విశ్లేషించి తద్వారా ఒక కార్యక్రమాన్ని ఉద్యమకారులకు అందిస్తాయి.

ఇలాంటి చారిత్రక సిద్ధాంతాల వెలుగులో శాస్త్రీయ అవగాహనతో సమస్యల్ని విశ్లేషించి విమర్శించే విధానంపై ఫెమినిజం యొక్క శక్తి ఆధారపడి ఉంటుంది.

స్త్రీ వాద ధోరణుల్లోని ప్రధానమైన ఆలోచనల్ని సంక్షిప్తంగా తెలుసుకో వాలంటే-

1. పితృస్వామ్య వ్యవస్థలోని స్త్రీల పతనాన్ని పురుషాధిక్యత నిర్మాణ పరంగానూ, భావజాల పరంగానూ గుర్తించడం.
2. సెక్సుకూ జండర్‌కూ మధ్య ఉన్న తేడాను తేటతెల్లం చేయడం.
3. లైంగికత్వం యొక్క రాజకీయ స్వభావాల్ని నొక్కి-చెప్పడం.
4. కుటుంబాన్ని ఒక ప్రైవేటు యూనిట్‌గా కాకుండా సాంఘిక పరమైన యూనిట్‌గా పరిగణించడం.
5. ఈనాటి భూస్వామ్య పెట్టుబడిదారీ వ్యవస్థలో స్త్రీలకు జరుగుతున్న నష్టాన్ని అంచనా వేయడం-ఇవి కొన్ని మాత్రమే.

ఇలాంటి ఆలోచనలూ సిద్ధాంతాలూ ప్రజల్లోకి వెళ్లడానికి సాహిత్యం ఒక శక్తివంతమైన సాధనంగా ఉపయోగ పడుతుంది. ఒకవైపు సిద్ధాంతపరమైన సాహిత్యాన్ని సృష్టిస్తూనే మరోవైపు కవిత్వాన్ని ఇతర సాహిత్య ప్రక్రియల్ని సాధనంగా గ్రహిస్తున్నారు. స్త్రీల సమస్యలకు ఒక భిన్నమైన పద్ధతిలో ప్రతి స్పందిస్తూ కొందరు యువతులు ఒక నూతన స్త్రీ దృక్కోణం నుంచి కవిత్వం రాస్తున్నారు. స్త్రీ దృష్టి నుంచి కనిపించే స్త్రీ ప్రపంచాన్ని ఏమీ దాసరికం లేకుండా ప్రదర్శిస్తున్నారు.

ఈ స్త్రీవాద ధోరణుల్లో రచనలు చేసేవారు మనకు రెండు రకాలుగా కనిపిస్తారు.

1. స్త్రీ, పురుష సంబంధాల్ని గూర్చిన భావ జాలవునాదితో రచనలు చేసేవారు కొందరు.
2. భావజాలంతో సంబంధం లేకుండా స్త్రీ అస్తిత్వంలో వేదనల్ని ఆర్ద్రంగా రూపొందించే రచయిత్రులు మరి కొందరు. ఈ రెండు భిన్న దృక్పథాలతో 1980 నుంచి రచనలు సాగుతున్నా 1985 నుంచి ఈ సాహిత్యం ప్రచండవేగాన్ని పుంజుకొని స్త్రీవాద రచయిత్రులకు ఒక ఇమేజ్‌ను సంపాదించి పెట్టింది.

ఈ స్త్రీవాద సాహిత్య సృష్టి క్రమంలో కొన్ని కవితా సంకలనాలు, కథలు, ఒకటి రెండు నవలలు, ఒక త్రైమా సపత్రిక (భూమిక) వెలుగులోకి వచ్చాయి. వివిధ రచయిత్రుల భాగస్వామ్యంతో నీలిమేఘాలు అన్న కవితా సంపుటి, కొండేపూడి నిర్మల కవితాసంపుటి "నడిచే గాయాలు" జయప్రభ రాసిన "ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మేఘానిది?" యుద్ధోన్ముఖంగా, ఓల్గా రాసిన "రాజకీయ కథలు, ఆకాశంలో సగం" అన్న నవల, "మాకు గోడలు లేవు" అన్న సిద్ధాంత అవగాహనలో కూడిన ఒక వ్యాససంపుటి ఈ దృక్కోణం నుంచి వెలువడ్డవే.

ఒక స్త్రీ గర్భస్థ శిశువుగా ఉన్న దశ నుండి పండుముదుసలిగా మారే దశ వరకు ఒక స్త్రీ పురుషాధిపత్యపు విషపుకోరల్లో ఎలా చిక్కుకుంటుందో ఈ కవితా సంపుటులు చదివితే తెలుస్తుంది. రజియాబేగం "అలాగే అన్నారు" సావిత్రి "బందిపోట్లు" విమల "వంటిల్లు" పాటిబండ్ల రజని "అబార్షన్ స్టేట్‌మెంట్" రావులపల్లి సునీత "అమ్మ అలిగింది" వంటి నాటి నెన్నో మనం చెప్పుకోవచ్చు. ఈ కవితల్లో ఆర్తి ఉంది. ఆర్ద్రత ఉంది. అన్నిటిని మించి గొప్ప సాంఘిక ప్రయోజ నముంది. మచ్చుకి ఒక్క ఉదాహరణ గర్భస్థ శిశువు ఆడపిల్లని తెలిసి గర్భవిచ్ఛిత్తికి బలవంతంగా పాల్పడవలసిన దశలో ఒక స్త్రీగా, కవయిత్రిగా ఈశ్వరి భావించిన తీరు ఈనాటి దుస్థితికి పరాకాష్ఠగా భావించవచ్చు. తన గర్భస్థ శిశువుతో ఒక మాతృమూర్తి ఆవేదనతో అంటున్న మాటలివి.

"నీకూ మంచి రోజులొస్తున్నాయిరా కన్నా
ఆడదిగా పుట్టానని
అడవిలో మానైనా కాలేదని
విలపించే రోజులు
పోతున్నాయిలేతల్లీ...ఎందుకంటే
నీవు అమ్మ పొట్టలోంచి
బైటికేరావుగా".....కడుపులు

చుమ్మలు చుట్టించే ఆ మాతృమూర్తి ఆర్తి మన సంస్కృతిని ఆకాశానికెత్తే నాగరిక సమాజం సిగ్గుపడేటట్లు చేస్తున్నది. వస్తువులో నవ్యత ఉంటే మామూలు భాషలో కూడా ఉన్నత కవితా విలువలకు ఊపిరి పోయొచ్చునని ఈ ఖండిక చెబుతుంది.

అలాగే శ్రీమతి ఓల్గా రాసిన "ఒక రాజకీయ కవి ఉత్పత్తిక్రమంలో స్త్రీ పురుషుల మధ్య సమాజం ఎంత వివక్ష కనబరుస్తున్నదో తెలుపుతుంది. మార్క్సిజం వెలుగులో స్త్రీవాద దృక్పథం నూటికి నూరుపాళ్ళు పుణికి పుచుకున్న కథ యిది. ఒక భర్త తాను పనిచేసే ఫ్యాక్టరీలో జరిగిన ఒక ప్రమాదంలో మొండిచేతివాడౌతాడు. అయినా అతని

భార్య సానుభూతితో సేవలు చేస్తూ, నైతిక బలాన్నిస్తూ మానసికంగా శారీరకంగా మామూలు స్థితికి రావడానికి అన్ని విధాలా తోడ్పడుతుంది. కొన్ని కారణాల వల్ల ఆమెకు గర్భసంచి తొలగించవలసిన అవసరం ఏర్పడుతుంది. సంతానోత్పత్తికి ఆమె అనర్హురాలు అని తెలిసిన భర్త ఆమెను విసుక్కోవడం ప్రారంభిస్తాడు. పుట్టింటికి పంపి రెండో పెళ్లికి సిద్ధపడతాడు. అప్పుడామె ఇలా అనుకుంటుంది. 'ఆడదంటే ఒక గర్భసంచీ రెండు ఓవరీలేనా"? –ఒకరికి ఆర్థిక ఉత్పత్తి క్రమంలో ప్రమాదం జరిగింది. మరొకరికి సంతానోత్పత్తి క్రమంలో ప్రమాదం జరిగింది. అందుకు ఆమెను మాత్రమే అందరూ దోషిగా నిలబెట్టిన పద్ధతికామె విస్తుపోయింది. "నా జీవిత సాఫల్యం నామాంగల్యంలో లేదు. నాపతి సేవల్లోనూ లేదు. నా తోటి స్త్రీలందరితో చేయి కలిపి నడవడంలో ఉంది" అని గుర్తిస్తుంది. ఈ చేదు నిజం ఎంత మంది పాఠకులకు మింగుడు పడుతుంది?–ఇలా ప్రతీ ఒక్కరినీ తీవ్రంగా ఆలోచింపజేసే ఒక సాహసవంతమైన ముగింపు అనిపిస్తుంది.

లింగ నిర్ధారణ పరీక్షలు, గర్భవిచ్ఛిత్తి ఇంటిచాకిరీ, వేశ్యాసమస్య, వృద్ధాప్య సమస్య, ఈ వ్ టీసింగ్ లాంటి వస్తు వైవిధ్యానికి కవితా రూపాలను కల్పించిన ఈ స్త్రీవాద రచయిత్రులు దాదాపు సమాజాన్ని 80 శాతం ఆక్రమించిఉన్న శ్రామిక రైతాంగ కూలీ స్త్రీల సమస్యల్ని విస్మరించడం విచారకరం. గ్రామీణ జీవనంలో పాతుకుపోయిన పేదరికం, అమాయకత్వం, అవిద్య, అజ్ఞానం, మూఢాచారాలు, మద్యపానాలు, మారు మనువులు, భర్తల హింసాప్రవృత్తి, ఆర్థిక

> **"నా జీవిత సాఫల్యం నా మాంగల్యంలో లేదు. నాపతి సేవల్లోనూ లేదు. నా తోటి స్త్రీ లందరితో చేయి కలిపి నడవడంలో ఉంది" అని గుర్తిస్తుంది. ఈ చేదు నిజం ఎంత మంది పాఠకులకు మింగుడు పడు తుంది?– ఇలా ప్రతీ ఒక్కరినీ తీవ్రంగా ఆలోచింపజేసే ఒక సాహసవంతమైన ముగింపు అనిపిస్తుంది.**

సాంఘికనైతిక దోపిడీ ఇవేవీ చాలామంది కవయిత్రుల దృష్టికి వచ్చినట్లు కనిపించదు. ఒక సమాజంలో అత్యధిక సంఖ్యాకులెవరైతే ఉంటారో వాళ్ల సమస్యలే నిజమైన సమస్యలు. ఆ సమస్యల్ని కూడా స్పృశించినప్పుడే ఆ స్త్రీవాద కవిత్వానికి సమగ్రత ఏర్పడుతుంది.

స్త్రీవాద కవిత్వంలో ప్రయోగింప బడిన కొంత పదజాలంపై గతంలో ఎంతో తర్జన బర్జన జరిగింది. కొందరు వీటిని నీలి కవిత అన్నారు. మరి కొందరు "ముట్టు" కవితలన్నారు. ఉచ్చ కవిత్వం, రక్తస్రావ కవిత్వం అని ఈసడించే కవిత్వ కరణలో అనివార్యంగా ఒక సామాజిక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు ప్రత్యామ్నాయ పదమేదీ అందుబాటులో లేనప్పుడు ఎలాంటి పదం వాడినా ఎవరికీ అభ్యంతరముండ కూడదు. ఉదాహరణకు "వేల వేల వీర్యాలు" అన్న పద ప్రయోగం ఒక వేశ్యావ్యవస్థలోని రుగ్మతకు అద్దం పడుతున్నది. ఒక్కమాట మనం గుర్తుంచుకోవాలి. కవితావేశం ఉండాలి కాని అది ఆలోచనల్ని మింగివేసి జుగుప్సను మిగిల్చకూడదు.

పాశ్చాత్య భావజాల ప్రేరితులైన స్త్రీవాదులకు పురుషాధిపత్యమే ప్రధాన శత్రువు. మార్క్సిస్టు భావప్రేరితులకు పురుషాధిపత్యం శత్రువే అయినప్పటికి దానికి మూలకారణమైన వర్గ వ్యవస్థ ప్రధానశత్రువు. సమసమాజంలోనే సమానత్వం సాధ్యం అంటారు వీరు. అయితే ఒక ప్రశ్న. ఈనాడు సోషలిస్టు దేశాల్లో పురుషులు తమ దురహంకారాన్ని వదులుకున్నారా? ప్రపంచాన్ని చాలా భాగం ఆక్రమించిన పారిశ్రామిక కార్మికులు తమ స్త్రీలను సమాన హోదాలో చూస్తున్నారా? ఈ ప్రశ్నలకు సమాధానాలు రాబట్టవలసి ఉన్నది.

ఈనాడు పెట్టుబడీ దారీ విధానం భూస్వామ్య విధానం–ఈ రెండూ కలిసి స్త్రీ పురుషులిద్దరిని అణగదొక్కుతున్నాయి. సమాజంలో నెలకొన్న పురుషాధిక్యత మూలంగా స్త్రీలు మాత్రం రెండు విధాల అణిచివేతకు గురౌతున్నారు. కనుక స్త్రీలు ఇటు ఆర్థిక వ్యవస్థతో, అటు పురుషాధిక్యతతో సమాంతరంగా పోరాడవలసి ఉన్నది. అయితే 80% రైతు కూలీ స్త్రీలలో సామాజిక స్పృహ, రాజకీయ స్పృహలేవు. స్త్రీవాదమంటే ఏమిటో, వాటి మౌలిక సిద్ధాంతాలేమిటో తెలిసే అవకాశం లేదు. కనుక మొట్టమొదటిగా విద్యా విజ్ఞానాల ద్వారా వాళ్లలో చైతన్యం కలిగించాలి. కేవలం కవిత్వాలు రాసినంత మాత్రాన, రచనలు చేసినంత మాత్రాన ఉద్యమాలు రావు. ప్రతీ స్త్రీ నరనరాల్లోకి స్త్రీవాద చైతన్యం ప్రవహించాలి. స్త్రీవాద సాహిత్యమంతా ఇంగ్లీషునుండి తెలుగులోకి అనువదింప బడాలి. మన స్త్రీల పరిస్థితులకు పరిసరాలకు అనుగుణంగా పరివర్తన చెందాలి. సిద్ధాంతాలకు సులభ వ్యాఖ్యాన రూపాలు రావాలి. అప్పుడే అది సామాన్య స్త్రీకి కూడా అందుబాటులోకి వస్తుంది. రచయిత్రుల కృషి సార్థక మౌతుంది.

● ● ●

# తెలుగు సాహిత్య పరిశోధన

బూదరాజు రాధాకృష్ణ

పూర్వం సాహిత్య పరిశోధనలు రెండు మూడు విధాలుగా ఉండేవి. అముద్రిత గ్రంథాలను, శాసనాలను సేకరించి, పాఠపరిష్కరణ చేసి, సాధ్యమయినంతలో గ్రంథగౌరవాన్ని విమర్శించే పీఠికతో ప్రచురించటమనే మౌలిక పరిశోధన అప్పుడు జరిగింది. సమాన ధర్మాలో, లక్షణాలో ఉన్న భిన్నరచయితల గ్రంథాలను తుల నాత్మకంగా పరిశీలించి తారతమ్య నిర్ణయం చేసే పరిశోధనకూడా పూర్వం వ్యాప్తిలో ఉంది. అందుకు నిదర్శనగా మన వసు చరిత్రలను, ఎర్రన, సోమనలను పోల్చి చేసిన పరిశోధనలను చెప్పవచ్చు. పాశ్చాత్య విమర్శ పద్ధతులను పాటించి మన సాహిత్యాన్ని పరీక్షించిన వారున్నారు. ఉదాహరణకు కట్టమంచి రామలింగా రెడ్డిగారి 'కవిత్వతత్వ విచారము'. ప్రాచ్య (సంస్కృత) విమర్శ విధానాల ప్రకారం తెలుగురచనలను పరిశీలించి గుణదోష నిరూపణ చేసిన వారున్నారు. మచ్చుకు అక్కిరాజు ఉమాకాంతంగారి 'నేటి కాలపు కవిత్వం' లటువంటిగ్రంథం. విమర్శ గ్రంథాల మీద విమర్శలు వచ్చాయి. అప్పట్లో రచయితప్రశస్తిని గమనించి వారి కీర్తి గానంతో సరిపెట్టుకున్న వాళ్లు కొద్దిమంది. ఏనాటి నుంచో పరమ ప్రామాణికమని గౌరవం పొందిన భారత రామాయణాదుల కథా విధానాలను పాత్రలను నిర్భయంగా ప్రశ్నించిన పరిశోధకులుండేవారు. అవన్నీ పాత సంగతులు.

ప్రస్తుతం పరిశోధన విధానాలు సమాజ లక్షణాలకు అనుగుణంగా మారిపోయాయని పిస్తుంది. స్వాతంత్ర్యం రాకముందు కొన్ని ఆదర్శాలను సాధించాలనే లక్ష్యం ఉండేది. వాటిని సాధించటం కన్నా ఆ సాధనలో అవ లంబించవలసిన విధానం ప్రధానమనే విశ్వాసముండేది. ఏదో విధంగా పనులు నెరవేర్చుకోవాలనుకొనేవారి కన్నా సక్రమమార్గంలో సాధించదలచిన వారి సంఖ్య అధికంగా ఉండేది. విమర్శలకు భయపడటం, విమర్శవస్తే మనం బతకమనే భయం, ప్రతివిమర్శ చేయలేమోనన్న సందేహం కొద్ది మందికే పరిమితం. ఆత్మబలం, ఆత్మ విశ్వాసం, కఠోరదీక్ష, మహాత్ముల మీద గురుభావం, తప్పును ఒప్పుకోగల ఔదార్యం, విమర్శను విషయనిష్ఠమని పరిగణించి వ్యక్తి గౌరవ ప్రతిష్ఠలతో వాన్ని ముడిపెట్టని సౌహార్దం ఉండేవి. సమాజంలో విలువలు మారగానే సాహిత్యరంగంలో అవి ప్రతిఫలించటం మొదలయింది. సాహిత్య పరిశోధనలో కూడా ఈ దౌర్బల్యం ప్రతిబింబించింది.

తొలిదశలో సాహిత్య పరిశోధన సృజనాత్మక సాహిత్యానికి మాత్రమే పరిమితం కాలేదు. తెలుగులో వెలువడిన శాస్త్ర గ్రంథాలు పరిశోధన వస్తువులుగా ఉండేవి. తెలుగుజాతి చరిత్ర, దేశచరిత్ర, సమాజ చరిత్ర, సాహిత్య చరిత్ర మొదలయినవి పరిశోధనాంశాలుగా ఉండేవి. అంటే పరిశోధన పరిమితి అత్యంత విస్తృతంగా ఉండేదన్నమాట. ప్రాథమికా ధారాల సేకరణ కష్టసాధ్యంగా ఉన్నప్పటికీ నాటి పరిశోధకులు పరిశ్రమకు భయ పడలేదు. పరిమిత కాలంలోనే అపార పరిశోధనలు చేయాలని ఆరాటపడలేదు. కందుకూరి వీరేశలింగంగారి కవుల చరిత్ర గాఢాంధకారంలో గడ్డివామినుంచి సూదిని వెలికి తీసినంత శ్రమ దాయకమైన కార్యం అయినా దీక్షాపరుడైన పరిశోధకుడు నానా బాధలకోర్చి అరణ్యమధ్యంలో బాటవేశాడు. అప్పటి పరిశోధనల్లో అనేక దోషాలు, లోపాలు, తేలని విషయాలు ఉన్నా తెలిసినంతలో, చేతనయినంతలో ప్రాథమిక సమాచారం సేకరించి ఫలితాలు ప్రకటించారు. ఇతరుల సిద్ధాంతాలను అన్వయించటంకన్నా స్వీయ సిద్ధాంతా లను ప్రతిపాదించాలనే తపన ఆ దశలో పరిశోధన లక్ష్యం. కాలాంతరంలో కొత్త పద్ధతులు రావచ్చు. కొత్త విషయాలు బయటపడవచ్చు.కానీ అన్నీ తెలియవని ఏమీ చేయని నిష్క్రియత్వం నాటి పరిశోధనతత్వం కాదు. అయితే మొదటి తరం వారికున్న మౌలిక పరిశోధనా వకాశాలు తరవాతి వారికి లేకపోవచ్చు లేవని కూడా అంగీకరించవచ్చు. కానీ విషయ విస్తృతినీ, పరిశోధనాంశాలనూ కుదించి సూక్ష్మంలో మోక్షం సంపాదించా లనుకోవటం క్షంతవ్యం కాదు.ఈ అభిప్రాయం–ఏదో విధంగా వీలయినంత త్వరలో ఏదో పరిశోధించి నట్లు పరిగణన పొంది పట్టాలు పొందాలనే భావం– విశ్వవిద్యాలయాల పుణ్యమా అని విస్త రిస్తున్నది. ఫలితంగా నేటి పరిశోధనలు సులభశైలి రామాయణాల్లాగా విస్తృతిగాని,

గాంభీర్యంగాని, ప్రయోజనంగాని లేక పోతున్నవి.

తెలుగు సాహిత్య పరిశోధకుల వ్యుత్పత్తి లోపం దయనీయమయిన పరిస్థితికి దారితీస్తున్నది. నేటి తెలుగు శాఖల్లో సంస్కృత భాషా పాండితికి పూర్వమున్నంత స్థానంలేదు. పూర్వ సాహిత్యం సంస్కృత మర్యాదలను పాటించింది కాబట్టి ఈ పాండిత్యలోపం అనేకాంశాలను పరిశీలించ నీయటం లేదు. తెలుగుపండితుల ఆంగ్లభాషా పరిజ్ఞానం అంతంతమాత్రం. అందువల్ల ఇంగ్లీషు ద్వారా యావత్ప్రపంచంలోని సాహిత్య ధోరణులను, మహారచనలను, నాటి స్వభావగుణ వైవిధ్యాన్ని పరిశీలించగల శక్తి సన్నగిలిపోతున్నది. ఛందోవ్యాకరణా లంకారాది సంప్రదాయ సిద్ధ శాస్త్రాల్లో నానాటికీ పరిచయం తగ్గిపోతున్నది. ఫలితంలో ప్రాచీన సాహిత్య పరిశోధనకు పరిశోధకుడు దూరంగా ఉంటున్నాడు. తులనాత్మక విమర్శ అతని స్థాయికి మించిన పని అవుతున్నది. కేవలం తన ప్రతిభమీదనే ఆధారపడవలసి వస్తున్నది. ఇది ప్రథమ లోపం.

చాలామంది పరిశోధక విద్యార్థులకు తమ అభిమాన విషయాలను పరిశోధనాంశాలుగా ఎన్నుకొనే అవకాశం లభించటం లేదు. పర్యవేక్షకుల అభిరుచులు, అవసరాలు, అధికార పరిధులు వగయిరా విషయ నిర్ణయం చేయటం వల్ల డిగ్రీ కోసం తలవంచి తట్టతగలేసినట్లు ఏదో రాసిపారేసి కాలం గడుపుకొనే వారి సంఖ్య పెరుగుతున్నది. తన అధీనంలోని పరిశోధకుల సంఖ్యను బట్టి తనకు గౌరవప్రతిష్ఠలు పెరగటమే గాక పదోన్నతి కూడా లభిస్తుంది కాబట్టి తమకు ఆయా విషయాల్లో, అభిరుచి, పాండిత్యాలున్నా లేకపోయినా విద్యార్థులను చేర్చుకొంటున్న పర్యవేక్షకులకు పరిశోధన గుణాత్మకతమీద పట్టుదల లోపిస్తున్నది. మరోవైపు ఉద్యోగావకాశాలు లేని విద్యార్థులు పరిశోధనావకాశాలకోసం ఎగబడి కాలం దొర్లిస్తున్నందువల్ల పరిశోధనమీద మనసు పెట్టి శ్రమించేవారి సంఖ్య తగ్గుతున్నది. ఫలానా విషయాన్ని పరిశోధనాంశంగా స్వీకరించ టానికి విద్యార్థి శక్తిమంతుడా, కాదా? అనే వివేచనకు తావులేకపోతున్నది. పరిశోధన విషయం కన్నా, దానికి న్యాయం చేయటంకన్నా, దాని ద్వారా డిగ్రీ, ఆ తరవాత వీలయితే విశ్వవిద్యాలయోద్యోగం సంపాదించాలన్న ఆకాంక్ష బలపడుతున్నది. ఇవి చాలనట్లు ఒకే విషయం మీద పదిమంది పది విశ్వవిద్యాలయాల్లో పరిశోధించే దుష్ట సంప్రదాయ మొకటి బయలుదేరింది. పలుకుబడిగల ఉపాధ్యాయులు తమ మీద, తమ రచనల మీద, తమ బంధుమిత్రుల మహత్తర రచనల మీద పరిశోధించి, ప్రశంసాత్మకంగా సిద్ధాంతవ్యాసం రాయమని నిర్బంధించటమూ మొదలయింది. ఆ శుభ సందర్భంలో తమ పరిశోధన విషయమైన వ్యక్తిగాని రచనగాని ప్రపంచసాహిత్యంలోనే ధ్రువతారలని నిరూపించటంకోసం తక్కిన రచయితలనూ, రచనలనూ కించపరచటం పరిపాటి అయింది. ఇటువంటి అసందర్భ ధోరణులవల్ల తెలుగు సాహిత్య పరిశోధనలు 'నానాటికి తీసికట్టు నాగంభట్లూ' అన్నట్లు పతనదశకు వస్తున్నాయి. అలాగని ఆయా విశ్వవిద్యాలయాల పరిశోధనాచార్యులే సభలు జరిపి, సమావేశాలు నిర్వహించి, చర్చించి, అనుభవ పూర్వకంగా తీర్మానిస్తున్నారు. ప్రతిభకూ పరిశ్రమకూ నిష్పాక్షికతకూ నిర్మమ విమర్శనకూ స్థానంలేని సాహిత్య పరిశోధనలు అపారంగా వస్తున్నాయి.

నేటి సాహిత్య పరిశోధనలలో కనిపించే సాధారణ లోపాలను కింది విధంగా పేర్కొనవచ్చు.

1. తమ పరిశోధన విషయానికి గాని అంశానికి గాని సంబంధించిన ప్రసంగాలు అంతకు పూర్వం ఎక్కడెక్కడ ఎవరి అభిప్రాయాలుగా వెలువడ్డాయో ఎత్తిరాసి, తాము నిగ్గుతేల్చిందేమిటో స్పష్టంగా చెప్పక పోవటం. తరుచు "ఇంకను పరిశోధింపవలసి యున్నది" అని తమ పరిశ్రమ అసంపూర్ణమనిపించటం.
2. పరస్పర విరుద్ధ పూర్వాభిప్రాయాలను పేర్కొన్నప్పుడుగాని, భిన్నదృక్పథాలను పరీక్షించినప్పుడు గాని వాటిని సమన్వయించే ప్రయత్నం చేయకపోవటం.
3. పరిశోధన విషయంలోని భాగాలను విశ్లేషించి ఒకటో రెండో ఉదాహరణ లివ్వటంతో తృప్తిపడక దొరికినన్ని ఎత్తిరాసి గ్రంథ విస్తృతి పెంచటం. అందువల్ల ప్రత్యేక ప్రయోజనం లేకపోయినా అలా చేయటం.
4. కాలక్రమాన్నిగాని సాధ్యాసాధ్యాలనుగాని పరిగణించకుండా భిన్న సిద్ధాంతాలకు ఎక్కడో మూలమున్నదని తొందరపాటు నిర్ణయానికి రావటం, ఉదాహరణకు కారల్ మార్క్స్ సిద్ధాంతం జిడ్డు కృష్ణమూర్తి తత్వశాస్త్రంవల్ల ప్రభావితమయిందని రాసినవారున్నారు.
5. అభిమాన రచయితను ప్రస్తుతించి ఆవ్యక్తి గౌరవం పెంచటంకోసం తక్కిన రచయితలను గురించి

కించపాటు మాటలు రాయటం. ఉదాహరణకు శ్రీశ్రీ విశిష్టతను చెప్పటానికి గురజాడ, దేవులపల్లి వగైరాలను చిన్నకవులనటం.

6. తమ విధానానికి విరుద్ధమైన వాదనలను ప్రస్తావించకపోవటం. శ్రీరంగం నారాయణబాబును గురించి ఆయన ఇంగ్లీషు పాండిత్యం గురించీ పొగుడుతూ 'సంపెంగ తోట' వ్యవహారాలలో అబ్బూరి, శ్రీశ్రీలు చేసిన విమర్శలను ప్రస్తావించకపోవటం.

7. ఇతరుల ప్రసంగాలనూ, ఇతర రచనలనుంచి ఉద్ధరణలను రాసేటప్పుడు మూలాన్ని యథాతథంగా రాయకపోవటం.

8. ఇతర భాషాసాహిత్యాలతో పరిశోధన విషయాన్ని తులనాత్మకంగా పోల్చి పరీక్షించి స్థాన నిర్ణయం చేయకపోవటం.

9. తమకు స్పష్టంగా తెలియని శాస్త్ర విషయాలను, తమకు సరిగా అర్థంగాని వైదిక సంస్కృతంవంటి భాషను ఆధారంగా తీసుకొని సిద్ధాంత ప్రవచనం చేయటం. ఉదాహరణకు సంగీతశాస్త్ర పరిజ్ఞానం లేక తాళ, లయ లోకటే అనుకొని, వేద సంస్కృత భాషా మర్యాదలు తెలియక మంత్రాలనూ స్తవాలనూ మార్చి జానపదధోరణిలో వాటిని పాడుకోవాలనటం.

తెలుగు పరిశోధనలు చాలా వరకు విశ్వవిద్యాలయ బిరుదులకోసమే కొనసాగుతున్నాయి. రానురాను ప్రక్రియా పరిశీలన నుంచి వాటి విస్తృతి సన్నగిల్లి మహారచనలోని ఒక ప్రకరణాన్నో, ఆశ్వాసాన్నో ఏకదేశమయిన ఒక లక్షణాన్నో పరిశోధిస్తున్నారు. అందువల్ల మొత్తం మీద ఆ సాహితీ గ్రంథానికి సాహిత్యంలో ఉన్న స్థానంగాని, ఒకే గ్రంథంలోని భిన్నాంశాల మధ్య సమన్వయంగాని పరిశోధకుడు గుర్తించటం లేదు. పరిశోధన గ్రంథాలకు ఇప్పుడు ప్రచురణావకాశాలు పెరిగాయి. ఆర్థిక సహాయం లభిస్తున్నది. ప్రచురణానంతరం వాటిని సమీక్షించే పత్రికలున్నాయి. సమీక్షకులు పరిశోధన గ్రంథం గురించి వ్యతిరేక విమర్శలు చేస్తారేమో నన్న భయంతో, విమర్శకు తమ పరిశోధన నిలువదేమోనన్న భయంతో తామే తమ అభిమానుల చేత సమీక్షలు రాయించుకొని వాటినే సమీక్షలుగా వెలువరించమని నయానో భయానో కార్యసాధన చేసుకొనే పరిశోధకు లేర్పడ్డారు. ఈ దుష్ట సంప్రదాయం గుణ గౌరవం పెంచినా, దోషాలను కప్పి పుచ్చుతున్నది. కాళిదాసాదులు శతాబ్దాలపాటు విమర్శలకు నిలిచారు. నిన్న మొన్నటి భావకవులూ అలాగే బతికారు. నేటి రచయితల ఆత్మవిశ్వాస లోపం ఈ కుసంస్కారాన్ని పెంచిపోషిస్తున్నది.

తెలుగు సాహిత్య పరిశోధనల స్థాయి పెరగాలంటే కింది సూచనలను పరిగణించాలి.

1. పరిశోధకులకు తమ తమ అభిరుచులను బట్టి పరిశోధనవిషయాన్ని ఎన్నుకొనే స్వతంత్ర్యమివ్వాలి.

2. పర్యవేక్షకులు తమకున్న పూర్వానుభవాన్ని విషయాభిమానాన్నీ పురస్కరించుకొని మాత్రమే పరిశోధక విద్యార్థులను చేర్చుకోవాలి.

3. పరిశోధనాంశం విషయంలో ప్రాథమిక పరిచయం, తగినంత భాషాపాటవం విద్యార్థికి ఉన్నాయో లేదో పరీక్షించిగాని ఆవిషయం గురించిన పరిశోధనావకాశం కల్పించగూడదు.

4. పరిశోధన విషయంలోని ఏ ఒక్క అంశానికో కాక మొత్తం రచనకు సబంధించి జరగాలి అప్పుడు గాని సమన్వయం, సమగ్రత పొందలేదు.

5. ఇతరుల అభిప్రాయాలనూ ఇతర గ్రంథభాగాలనూ ఎత్తిరాయటం తగ్గించి వాటిని సంక్షిప్తంగా పరిచయం చేసి,వాటి సారాంశం మాత్రమే చెప్పాలి. భిన్నాభిప్రాయలను ఉట్టంకించినప్పుడు వాటి గుణదోషపరీక్షచేసి ఏయే కారణాలవల్ల, ఏయే ఆధారాలవల్ల, ఎవరి నిర్ణయం సమంజసతరమో చర్చించి, పరిశోధకుడు తన అభిప్రాయా లను స్పష్టంగా చెప్పాలి.

6. పరిశోధన శాస్త్రపద్ధతిలో సతార్కిక మార్గంలో నిష్పాక్షికంగా కొనసాగాలి.

7. తులనాత్మక పరీక్షలేని కావ్యగౌరవ కవిప్రతిష్ఠా నిర్ణయాలను పరిహరించాలి.

8. పరిశోధన విషయమైన రచయితపై గాని రచనపై గాని వ్యతిరేకాభిప్రాయ లుంటే వాటిని సేకరించి చర్చించటం కర్తవ్యంగా భావించాలి.

9. పరిశోధకుడి అభిమాన గౌరవాలూ అభిరుచులూ శాస్త్ర ప్రసంగాల్లో పనికిరావని గుర్తించాలి. పై సూచనలు పాటించిన సాహిత్య పరిశోధనలు దేశకాల పాత్రాతీతంగా రాణిస్తాయి.

●●●

# తెలుగు సంవత్సరాది - కవుల కలాలు

మునుగోటి యాదయ్య

ప్రపంచ దేశాలన్నిటిలోకి మనదేశానికొక ప్రత్యేకత ఉంది. మనదేశంలో ఉన్నన్ని మతాలు, దేవాలయాలు, పుణ్య నదులు,పండుగలు సంస్కృతీ సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు బహుశా ఇంకెక్కడా లేవేమో!

మన ఆచారాల్ని సాంప్రదాయాల్ని రెండురకాలుగా విభజించుకోవచ్చు. కొన్ని నిత్యకృత్యాలుగా ప్రతిరోజు నిర్వర్తించుకునేవి కాగా మరికొన్ని ఉత్సవాల రూపంలో సామూహికంగా జరుపుకునేవి.

తెలుగు వారు జరుపుకునే పండుగలన్నింటిలోకి 'ఉగాది'ని ముఖ్యమైన పండుగగా పేర్కొనాలి. ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ పాడ్యమినాడు వచ్చే యీ ఉగాది పండుగను తెలుగు ప్రజలంతా తమ మొదటి పండుగగా ఆనందోత్సాహాలతో జరుపుకోవడం పరిపాటి.

ఉగాది తెలుగు కవుల రసహృదయాలను ఎంతగానో ప్రభావితం గావించింది. శిథిలమైన ప్రకృతికి నవచైతన్యాన్ని కలిగించే వసంత ఋతువన్నా, ఆ ఋతువులో అరుదెంచె ఉగాది పండుగన్నా తెలుగు కవులు ఎంతగానో పారవశ్యం చెందుతారు.

కవిసామ్రాట్ విశ్వనాధసత్యనారాయణ తన "తెలుగు ఋతువులు" అనే కావ్యంలో వసంత ఋతువును మనోహరంగా వర్ణిస్తారు. అచ్చతెనుగు తనానికి వసంతశోభను తనదైన మృదు మధుర శైలిలో అన్వయిస్తారు.

ప్రొద్దు గ్రుంకెడు వేళ ముగ్ధభావప్రచా
లిత ప్రియ హస్త గుంఫితములగుచు
రేయివడ్డన వేళ ప్రియురాలి చొళ్ళమ్ము
పైని ముద్దులు గుల్కు బంతియగుచు.

మరోచోట వసంతాన్ని ఎంతో హృద్యంగా చిత్రించారు.

"విరియ గాచిన పండ్లు బరువుచే వంగి ర
సాలమ్ము వాలిచె జూలాలు వోలె
కోకిల జిగిగొంతు కోవెత్తి ప్రలపించె
వనవీధి భార్య ప్రవాసి వోలై
వరులకే పువు బువు దిరిగి తేనియ బొట్టు
లుగ గూర్చె భృంగమ్ము లోభివోలె"

వసంతఋతు ధర్మాన్ని వ్యక్తం చేసే, పండిన పండ్ల బరువుతో నిండిన మామిడి చెట్ల వర్ణన చేసినారు.

"నా తెలంగాణా కోటి రతనాల వీణ" అని నిండుగా పలికిన ఆస్థాన కవి దాశరధి కృష్ణమాచార్యులుగారు. వసంతం గురించి చెప్పినా వడగాడ్పుల గురించి వివరించినా పాఠకులనకు రసానుభూతిని కలిగించడంలో అందె వేసిన చేయి. తన కలాన్నే కాకుండా జీవితాన్ని సైతం ప్రజాపోరాటాలకు అంకితమిచ్చిన కవి నైజాం పరిపాలనకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో నిర్వహించిన పాత్ర తెలంగాణా చరిత్రలో సువర్ణ-అక్షరాలతో లిఖించతగ్గది. నానాటికి సమాజంలో మృగ్యమై పోతున్న రసరమ్య భావనలకు చింతిస్తునే ఉగాదినాడైనా చిగురాకుతో చేతులు కలుపుదామని ఆహ్వానిస్తాడు తన 'గ్రీష్మ కిరీటం' కవితలో

పండుగనాడు మామిడాకు దొరుకుతుందా?
పసందైన వేపపూత లభిస్తుందా?
మార్కెట్లో కొనండి వేప ప్రసాదం
గుండెపగిలె సామాన్య మానవుడు
అందుకోసం ఆకాశం వైపు చూస్తున్నాడు
....... మండించినా ఎండించినా
మనదేగా ఉగాది.
నిండుగుండెతో స్వాగతం చెప్పక
ఎందుకు వేరే సోది?
ఎగరేయండి ఎండల జెండాలు దండిగా
చిగురాకుల ఉగాదితో
చేతులు కలపండి నిండుగా.

ఆధునిక కవి కవిత్వాన్ని సృష్టించిన "జ్ఞానపీఠం" అవార్డు గ్రహీత డా॥ సి. నారాయణరెడ్డిగారు 'ఉగాది' వసంత ఋతువుల గురించి చెప్పిన కవిత్వం హృద్యంగా ఉంటుంది. ప్రకృతి ధర్మాన్ని మానవ జీవితానికి అన్వయిస్తూ చెట్టు చిగురిస్తే ఉగాది అంటారు శ్రీ రెడ్డిగారు.

**చెట్టు చెబుతుంది**
**స్వేచ్ఛకు నిర్వచనం**
**తలపొంగిస్తుంది అలలా**
**చేతులు ఝళిపిస్తుంది**
**ఊరేగింపుల్లో మారుమ్రోగేనినాదాల్లో**
**అక్రమాల సుడిగాడ్పులను నిరసిస్తుంది.**
**ఆకుల ఆక్రందనలతో**
**చెట్టు పరవశిస్తే చిగుళ్ళ 'ఉగాది'**
**చెట్టు పరితపిస్తే శిశిర నిశీథి.**

భావోద్వేగంతో కవిత చెప్పగలిగిన నేర్పు వారికి వెన్నతో పెట్టిన విద్య. వారి "అక్షరాల గవాక్షలు" అనే ఖండకావ్యంలో "నిత్యవసంతం" అనే కవితా ఖండికను రచించారు.

**"చిగుళ్ళు పురిట్లో సంధి గొట్టిన**
**శిశువుల్లా ఊడి పడుతున్నాయి**
**పండుటాకు లేమో గబ్బిలాల్లాగా**
**పట్టుక వ్రేలాడుతున్నాయి.**

తెలుగు పండుగలకు వెలుగును చేకూర్చే ఉగాది పండుగ వసంత ఋతువుతో ప్రారంభమౌతుంది. అందువల్ల వసంతానికి ఉగాదికి అవినాభావ సంబంధముంది.

నవ్యాంధ్ర కవిత్వంలో నవ్యభావాలకు ఉగాది దర్పణం పట్టింది. మహాకవి శ్రీ శ్రీ మాటల్లో

**వాసంత సమీరం నీవై**
**హేమంత తుషారం నేనై.**

అంటూ వసంత సమీరం ప్రత్యేకతను తనదైన కవితా మార్గంలో ఆవిష్కరిస్తారు.

శ్రీ నుల్లవరపు విశ్వేశ్వరరావు గారి "వైతాళికులు" ఇంద్రగంటి వారి "వాసంత సౌరభం" కవితా ఖండికలు మొదలగునవి ఎందరో మహాకవులు ఉగాది, వసంత ఋతువుల వర్ణన గావించినారు.

ఉగాది రోజు ఉదయం తలస్నానం చేసి ముందుగా వేపపూవు పచ్చడిని ప్రసాదంగాతీసుకోవడం మనకు అనాదిగా వస్తున్న ఆచారం. మానవుడు తన జీవయాత్రలో అనేకమైన అనుభవాలు రుచు చూడాలి. అన్నింటినీ సమదృష్టితో స్వీకరించి ధైర్యంతో, వివేకంతో ప్రశాంతంగా జీవించటం తెలుసుకోమని ఈ పచ్చడిని తీసుకోవటంలోని అంతరార్థం. వ్యక్తి మానసిక అభ్యుదయానికే జీవితముంటే సరైన అవగాహనకూ యీ ఆచారాలు నిర్దేశించబడ్డాయి.

ఉగాది పచ్చడి అనడం ఆచారమైందని చారిత్రికుల అభిప్రాయం. అయితే ఆచార రూపంలో సేవించే ఈ ఉగాది పచ్చడివెనుక అంతర్గతంగా ఆరోగ్య చర్య, సందేశం దాగి ఉన్నాయి.

ఈ ఉగాది పచ్చడి అనేది షడ్రుచుల రసాయనం. దీనిలో వేప పువ్వు ప్రధాన పాత్ర వహిస్తుంది. వేప పూవు చింతపండు, మామిడిపిందెల ముక్కలు, బెల్లం, మిరియాలు, కొందరు కొబ్బెరి ముక్కలు (చూరు) మొదలగు వాటితో చేసి స్వీకరిస్తారు. పల్లె ప్రాంతాల్లో ఇప్పటికి ఉగాది పచ్చడిని దేవాలయము [illegible] ఏదో ఒక పాత్రలో పోసి వస్తారు. సాయంత్రము పెద్ద మొత్తముగా ఉగాది పచ్చడి చేసి దేవాలయం దగ్గర గ్రామం వారందరికి సంతోషంగా పంచిపెడుతారు.

పంచాంగ శ్రవణం ఉగాది విధుల్లో ఒకటి. సంవత్సరాది నాటి పంచాంగ శ్రవణం గంగస్నాన సమఫలాన్ని లభింప చేస్తుందని మనవారి విశ్వాసం.

ఆస్తికులైన హిందువులందరూ తిథి, వార, నక్షత్రములు వర్జ్యమూ, దుర్ముహూర్తమూ తెలుసుకునేందుకు పంచాంగం ఎంతో అవసరం. అదీగాక శుభముహూర్తాలు తెలుసుకునేందుకు జాతకాల నిమిత్తం గ్రహగతులను తెలుసుకునేందుకు కూడా పంచాంగాలు అవసరం.

ఉగాది నాడు రాబోవు శుభాశుభ ఫలితములను తెలిసికొని అశుభ పరిహారమునకు చేయవలసిన ప్రతిక్రియలను తెలిసికొని, మానవుడు తన భావి సుఖమును కోరుకొనుచు సంవత్సరపు ఫలమును ముందుగా తెలిసికొను ముఖ్యమైన దినము ఈ యుగాది.

ఉగాదినాడు దేవాలయాలన్నీ వేదగానాలతో ప్రతిధ్వనిస్తుంటాయి. అనేక చోట్ల కవి సమ్మేళనాలు జరుగుతాయి. ఉగాదినాటి సాయంత్రము దేవాలయం దగ్గర బ్రాహ్మణుడుగాని, లేదా పంచాంగం తెలిసిన వారుగాని వచ్చి, ఫలితంను వారి వారి పేరుపై తెలుసుకుంటారు. ఇప్పటికీ ప్రతి పల్లెలో గ్రహచారం అడిగి తెలుసుకుంటారు.

పచ్చని మామిడాకులతో తియ్యని పిండి వంటలతో, నూతన వస్త్రములతో ఆనందంగా ఉంటూ ఒకరి కొకరు నూతన తెలుగు సంవత్సర శుభాకాంక్షలు తెలుపుతారు. ●

# అరవయ్యేళ్ళ అభ్యుదయ సాహిత్యోద్యమం

## ఒక చారిత్రిక సమాలోచన

డా॥ ఆవంత్స సోమసుందర్

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభమయింది మొదలు సర్వసాహిత్యం సమాజాశ్రయంగా రూపు దిద్దు కోవారంభించింది. వెయ్యేళ్ళ ఆంధ్ర సాహిత్యం చరిత్రలో గతానుగతికంగా వస్తున్న ప్రధాన ధోరణి పురాణ పురుషుల కథలనో,దేవతల కథలనో, పితృదేవతల కథలనో చర్విత చర్వణంగా చెప్పు కొంటూ సాగుతున్న సంప్రదాయాన్ని ఇరవయ్యో శతాబ్దపు ఆరంభ దినాలలోనే స్వస్తి పలకడం జరిగింది. కావ్య నాయకుడు, ధీరోధాత్తుడు, ధీరలలితులు వగైరా మానవాతీత గుణాలు కలవారు మాత్రమే ఉండాలన్న ఆలంకారిక శాసనాన్ని విచ్ఛిన్నం చేయడం జరిగింది. ఆ విచ్ఛిత్తి సర్ కట్టమంచి రామలింగారెడ్డి రచించిన 'ముసలమ్మ మరణం'తో ప్రారంభమయ్యింది. 'ముసలమ్మ' అనే పేరుగల ఒక రైతు కోడలు గ్రామానికి సంభవించనున్న జలప్రళయాన్ని నిరోధించడానికి ఆత్మ బలిదానం చేసిన స్థల పురాణ గాధను (ఒక ప్రాంతంలో జరిగిన గాధను) ఇతివృత్తంగా తీసుకొని ప్రాచీన పద్యకవితా పద్ధతినే కావ్యంగా వ్రాశారు.

స్త్రీని, మంది కోసం ఆత్మ బలిదానం చేసిన వీరవనితను నాయకురాలిగా సూచించడం విప్లవాత్మక చర్య. ఇంతకు పూర్వమే పీఠాపురం ఆస్థాన కవీశ్వరులైన దేవులపల్లి సోదర కవులలో చిన్నవారు ప్రఖ్యాత భావ కవి కృష్ణశాస్త్రి గారి తండ్రి గారైన దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి (తమ్మన్నశాస్త్రి) 'నయ నోల్లాసం' అనే ప్రబంధాన్ని రెండేరెండు అశ్వాసాలుగా ఒక బాలిక ఇతివృత్తాన్ని తీసుకొని రచించారు. అంతకు పూర్వం స్త్రీ నాయికగా వెలువడిన కావ్యాలే లేవు. కాని కట్టమంచి వారి 'ముసలమ్మ మరణం'లో సమాజ శ్రేయస్సు కోసం ఒక సాధారణ పౌరకుటుంబం నుండి వచ్చిన యువతి ఆత్మబలిదానం చేయడం ఒక అపూర్వ సందేశం. దానితోనే గతానుగతిక ప్రబంధాది సంప్రదాయ సాహిత్యానికి స్వస్తి పలకడం వినూత్న కవితా రీతికి స్వాగతం పలకడం ఒక దేశంగా జరిగింది. ఆ కావ్యం 1900లో ప్రచురితమైంది.

1902 మొదలు వంగ కవిత ప్రభావంలో శ్రీ వెంకట పార్వతీశ కవులు కొద్ది పద్యాలనే కావ్యం అని పిలువగలిగిన ధైర్యాన్ని తెచ్చుకున్నారు.

దాదాపు 18 సంవత్సరాలు రచించిన అట్టి ఖండకావ్యాలను 'కావ్య కుసుమావళి' అనే పేరుతో 1920లో ప్రచురించారు. అవి భావకవితా విధానానికి లఘు కవితకు కావ్యస్థాయి కల్పించడానికి ప్రథమ ప్రయోగాలు.

1910లో తెలుగు కవిత్వంలో ఆధునిక యుగం ప్రారంభమయ్యింది. 'వర్జీనియా ఉల్ఫ్' అనే మహా రచయిత్రి విశ్లేషించిన రీతిగా ఆంగ్ల సాహిత్యంలో కూడా అదే సంవత్సరం ఆధునిక యుగం ప్రారంభమయ్యింది. తెలుగులో ఆధునిక యుగం గురజాడ మహాకవితో ప్రారంభమయ్యింది. దీనిని ఆధునిక యుగం అనడం ఎందుకంటే ఇది ఇరవయ్యో శతాబ్దానికి సంబంధించిన కాలదాచి కాలం వల్ల కాదు ఆనుపూర్వికంగా వచ్చే విశ్వాసాలను ఆపి ప్రశ్నించడం, సామాజికుల నడుమ ప్రేమను స్నేహాన్ని ప్రవర్తింప చేయడానికి పూనుకోవడం, సంఘ జీవులలో దేశభక్తిని, పరస్పర అభిమానాలను, సంఘటిత శక్తిని కలిగించడం, స్త్రీలకు అనూచానంగా జరుగుతున్న అన్యాయాలను ప్రతిఘటించడం, సర్వదా సాహిత్యం సమాజ శ్రేయోదాయంగా నడవడం అనే ఐదు ప్రాణశక్తులతో గురజాడ తన 'ముత్యాల సరాలను' ప్రారంభించడం వల్లనే ఆధునిక యుగానికి నాందీ వాచకం అనడం. ఆ తదుపరి కాలాలలో గురజాడ నిర్వచించిన ప్రేమ ప్రధాన ధాతువై స్త్రీని ఉన్నత స్థానంలో నిలిపి భోగవస్తువుగా పరిగణించడాన్ని నిరసించి భావకవిత్వం పెంపొందుతూ వచ్చింది. ఈ భావ కవిత్వంలో ఒక అనుశాఖగా దేశభక్తి కవిత్వం విస్తరించింది. 1910 నుంచి 30 వరకు ప్రవర్తిల్లిన ఈ నవ్య కవితా యుగం మరో నూతన యుగానికి మాతృత్వం వహించింది.

గురుజాడ నిర్వచించిన ప్రధాన ధాతువులలో ప్రాణ ప్రదమైనవి కొన్ని లుప్తం కావడం వల్ల శ్రీరంగం శ్రీనివాస రావు, శ్రీరంగం నారాయణబాబు, పురిపండ అప్పలస్వామి, శిష్టా ఉమామహేశ్వరం మున్నగు వారు ఆధ్యులుగా తెలుగు కవిత్వంలో అచ్చమైన ఆధునిక యుగం పునరుజ్జ్వలించింది.

1930లో గాంధీ మహాత్ముడు నాయకత్వం వహించి నడిపిన దండీ

యాత్ర ఉప్పు సత్యాగ్రహం, సహాయ నిరాకరణోద్యమం, సంపూర్ణ స్వాతంత్ర దీక్షా సంకల్పం, దేశంలో అలుము కొంటున్న ఆర్థిక మాంద్యం, క్షామం వంటివన్నీ ఈ యువకులలో కొత్త ఆలోచనలకు, కొత్త కవితా రీతులకు ప్రయత్నింపజేశాయి. అదే కాలంలో ఇంగ్లాండ్, ఫ్రాన్స్ దేశాలలో హంగ్రీదటీస్, హంగ్రీదటీస్, 'హంగ్రీఎంగ్‌మన్' అనే పేర్లతో నూతన కవితా ప్రయోగాలు విస్తరించాయి. కవులకు ప్రప్రథమంగా అంతర్జాతీయ స్పృహ ఏర్పడింది. 1917 లో లెనిన్ నాయకత్వాన ఏర్పడిన సోవియట్ రష్యాలో తప్ప ప్రపంచంలో మిగిలిన పెట్టుబడి దేశాలన్నింటిలోనూ సామ్రాజ్య వాద వలస దేశాలన్నింటిలోనూ తీవ్రమైన ఆర్థిక మాంద్యం ఏర్పడింది.నిరుద్యోగం, క్షామం, ఆకలి చావులు, దైన్యం, పెచ్చరిల్లి పోయింది. ఈ నేపధ్యంలోనే సామాన్య మానవుడే తమ కవితను అదిష్టాన దేవతగా భావించి శ్రీ శ్రీ ప్రభృతులు ఆధునిక కావ్యాన్ని చెప్పారు. అవి ధనికుడు మరీ ధనికుడై, పేదవాడు నిరుపేదగా మారు తున్న ఈ ధన స్వామ్య వ్యవస్థలో పీడిత మానవుని పక్షాన నిలబడి కవిత్వం ఎలుగెత్తి చాటాలన్న స్పృహను, అభ్యుదయ దర్శన ప్రప్రథమంగా అక్షరబద్ధం చేసింది. దీనితో శ్రీ శ్రీ ప్రభృతుల ప్రభావం వల్ల సంప్రదాయక సంస్కృత పండితులైన ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, పిలకా గణపతి శాస్త్రి వంటివారు కూడా సంప్రదాయ దిక్కారణ కవితల్ని రచించారు. 1933లో ఉరితీయబడ్డ భగత్ సింగ్ ప్రభృతులు వీరికి ఆదర్శ అధిదేవతలుగా మారారు. వ్యవస్థను మార్చడానికి ప్రజలు ఏలాంటి వాటికైన సిద్ధం కావాలని వీరి కవిత్వం విశ్వసించింది. పిలుపు నిచ్చింది. శ్రీ శ్రీ మహా ప్రస్థాన గీతాలు నారాయణబాబు 'రుధిరజ్వాల' గీతాలు పురిపండ 'పులిసంజం' గీతాలు శిష్టా విష్ణుధనువు, నవమిచిలుక, పిఠాపురం యువరాజు కవితలు, పఠాబి పిడేలురాగాలు మున్నగునవి ఆ దశాబ్ద కవిత్వంలో సార్వత్రికంగా ప్రగతి శీలము. విప్లవ దర్శనము, స్పష్ట రేఖలుగా స్ఫురి స్తాయి."ఉపనిష ద్వీధిలో ఊరేగు దేవా ఉర్వి దౌర్జన్యాలకు ఊరుకున్నావా"? అని తీవ్రవాదిగా ప్రశ్నిస్తూ హనుమచ్ఛాస్త్రి గీతాలు ఆలపించాడు.

1936లో భారతీయ రచయితలు, ముల్కరాజ్ ఆనంద్ ప్రభృతులు లక్నోలో ప్రేమచంద్ అధ్యక్షతన అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభ జరిపారు. దీనికి రవీంద్రనాథ్ టాగూర్, శరశ్చంద్ర చటర్జీ జవహర్‌లాల్‌నెహ్రూ ప్రభృతులు అభినందన సందేశాలు పంపిం చారు.

కాని ఆంధ్రలో అభ్యుదయ రచ యితల సంఘం 1943లో మాత్రమే రూపొంద గలిగింది. దాదాపు ఒక సంవత్స రం పాటు యావదాంధ్రలోనూ నిర్మాణం జరిగి 43 మార్చి- 13, 14 తేదీలలో తెనాలిలో ప్రథమ మహాసభ ఆంధ్ర విశారద తాపీ ధర్మారావు గారి అధ్యక్షతన జయప్రదంగా జరిగింది.ఆమహాసభలో శ్రీ శ్రీ; కొడవటిగంటి కుటుంబరావు వంటి అభ్యుదయ కవులు, రచయితలు కొందరు పాల్గొనక పోయినా 1945 జనవరిలో రాజమండ్రిలో జరిగిన తృతీయ మహాసభలో దేవులపల్లి కృష్ణ శాస్త్రి, శ్రీరంగం శ్రీనివాసరావు, పిలకా గణపతి శాస్త్రి, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి, ప్రయాగకోదండ రామశాస్త్రి వంటి ఉద్దండులైన కవులు, పండితులు పాల్గొని జయప్రదం కావించారు. అప్పటికే ఆంధ్రప్రజానాట్య మండలి ఏర్పడి అనూచితంగా వస్తున్న ప్రజల జానపద కళా రూపాలకు వినూత్న ప్రాణశక్తిని ఘటింపచేసి వర్తమాన పరిస్థితులకు అనుగుణంగా రూపొందించి ప్రచారం చేయనారంభించారు. ఈ కళా రూపాల సమాదరణ కార్యక్రమంలో ప్రథమ గణ్యులు ప్రజాకవి సుంకర సత్య నారాయణగారు 1920 నుంచి జాతీయ మహాకవిగా ప్రఖ్యాతులైన గరిమెళ్ళ సత్యనారాయణ గీతాలు కూడా ప్రజా నాట్య మండలి గాయకులు ప్రజలకు వినిపించ నారంభించినారు. ఆధునిక ఆంధ్రసంఘానికి సమాజాన్ని సంస్కరించి నూతన జీవశక్తిని అందించిన కందుకూరి వీరేశలింగం, గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు,కొమర్రాజు లక్ష్మణరావు వంటి మహనీయులు, అప్పటికే విస్మృతికి పాల్పడ్డారు. వారు ప్రజలకు అందించిన జీవ శక్తిని పునరుజ్జీవింపచేయడానికి ఆ మహనీయుల వర్ధంతులు, జయంతులు ప్రజానాట్యమండలి, అభ్యుదయ రచ యితుల సంఘం, ముఖ్య కేంద్రా లన్నిటా జరిపి వారి సందేశాన్ని అందించ నారంభించినాయి. ఈసందర్భంగా సుంకర వారు వీరేశలింగం జీవితాన్ని బుర్రకథగా రచించగా, నాజర్, మిక్కిలినేని రాధాకృష్ణ మూర్తి, ప్రభృతులు రాజమండ్రి అభ్యు దయ రచయితల మహాసభలో గానం చేయగా, కృష్ణశాస్త్రిగారు కదలిపోయి కన్నీళ్ళతో కథ మధ్యలో అద్భుతమైన ఉపన్యాసం ఇచ్చి అందరినీ ఆవేశపరిచారు.

1943లో నరసరావు పేటలో భావ కవిత్వ ధోరణిపై తిరుగుబాటుగా నూత్న కవిత్వం రావాలని ఆశించిన యువకులు నిత్యకళాసమితిని స్థాపించారు. అందులో అనిశెట్టి సుబ్బారావు, ఏల్చూరి సుబ్ర హ్మణ్యం, కుందుర్తి ఆంజనేయులు, బెల్లంకొండ రామదాసు, రెంటాల గోపాల కృష్ణ, సి.వి. కృష్ణారావు మున్నగువారు సభ్యులై అభ్యుదయ కవితా ప్రయోగాలు చేయనారంభించారు. కాని అదే సంవత్సరం

మద్రాసులో లా చదువుతున్న అనిశెట్టి బెంగాల్ రహస్య విప్లవకార్యకర్తలతో సంబంధం పెట్టుకున్నాడని ప్రభుత్వం కేసుపెట్టి విచారణజరిపి రెండున్నర సంవత్సరాలపాటు జైలు శిక్ష విధించింది. అతని వివాహానికి అన్ని ఏర్పాట్లు జరిగి వివాహం జరుగవలసిన రోజున జైలు శిక్షపడింది. అనిశెట్టి జైలు నుండి వచ్చిన తరువాత వివాహం జరుగుతున్న సందర్భంగా ఏల్చూరి, కుందుర్తి, బెల్లంకొండ గారలు తమ కవితలను 'నయాగార' అనే సంపుటిగా ప్రచురించి వివాహ వేదికవద్ద రాజమండ్రిలో వధూవరులకు అంకితం చేశారు. ఈ'నయాగార' యే ప్రప్రథమంగా వచ్చిన అభ్యుదయ కవితా సంపుటి.

1943 నుండి ఆరుద్ర, సోమసుందర్, రాంషా, శశాంక, మాన్యా, మమూన, అవసరాల సూర్యారావు వంటి యువకవులెందరో అభ్యుదయ సాహిత్యాన్ని సృష్టించనారంభించారు. శ్రీ శ్రీ ప్రభృతులతోనే చైతన్యం పొంది ఆచార్య రోణంకి అప్పలస్వామి సాహచర్యంతో విజయనగరంలో ప్రాశ్చాత్య అభ్యుదయ ధోరణులను ఆకళింపు చేసుకొన్న చాగంటి సోమయాజులు, శెట్టి ఈశ్వరరావు వగైరా విస్పష్టమైన అభ్యుదయ దృక్పథంతో ఉద్యమ కథారచయితలుగా గణనకెక్కారు. 1945లోనే శెట్టి ఈశ్వరరావు 'మహాకవి మహాపురుషుడు' అనే శీర్షికన గురజాడ వారి సాహిత్య కృషిని సంగ్రహంగా రచించి అభ్యుదయ రచయితల పక్షాన గ్రంథంగా ప్రచురించారు. అరసం చిలకమర్తి వారి స్వీయ చరిత్రను 400 పుటల గ్రంథాన్ని ముద్రించి, ఆ ప్రతులన్ని వారికి సమర్పించారు. ఈ విధంగా జాతీయ పునరుజ్జీవన ఉద్యమాన్ని అభ్యుదయ రచయితల సంఘం చేపట్టింది. దీనిలో ఎందరో రచయితలు, కవులు ఇంతకు పూర్వమే ప్రఖ్యాతులైన వారు ఈసంఘంలో చేరారు.

పంచాగ్నుల ఆది నారాయణశాస్త్రి, కోరాడ రామకృష్ణయ్య వంటి ఉద్దండులూ చేరారు. కుటుంబరావుగారు అంతోదయం అనే నవల ప్రచురించి తత్పూర్వ విరచిత సాహిత్యానికి భిన్నమైన అభ్యుదయ దృక్పథ సాహిత్యంలో గొప్ప రచన సాగించారు.

తెన్నేటిసూరి, విద్వాన్ విశ్వం, గోఖలే, [illegible]కాంత్ మోహన్, వంటి వారెందరో ప్రముఖులు ఉత్తమ అభ్యుదయ రచనలను వెలవరించారు. 1947లో జనవరిలో మద్రాసులో జరిగిన నాలుగవ మహాసభకు దేవులపల్లి కృష్ణశాస్త్రి, దరిసి చెంచయ్యగారు, (గదర్ వీరుడు) గార్ల ఆహ్వానసంఘ కార్యదర్శులుగాను పి.వి. రాజమన్నార్, వింజమూరి గోవిందార్యులు వంటి న్యాయమూర్తులు అధ్యక్షులుగా ఏర్పడి జరిగిన గొప్ప సభలో కె. అబ్బాస్ వంటి అభ్యుదయ రచయిత లెందరో పాల్గొన్నారు. ఆ సభకు తెలంగాణా వీరకవి కిశోరం దాశరథి రహస్యంగా వచ్చి పాల్గొన్నారు. తదుపరి తెలంగాణాలో అరెస్టయి నిజామాబాద్ జైలులో ఉండగా 'నైజాంరాజు జన్మ జన్మల బూజు' అనే గొప్ప కవితలు రచించారు.

1946లో విస్నూరు దేశం విపరీత కౌర్యంతో ప్రజలను చంపుతున్న దశలో ప్రజలు సాయుధులై విముక్తి పోరాటం ప్రారంభించారు. విస్నూరు దేశముఖ్ తల్లి జానమ్మ ద్రొట్టి కొమురమ్మ అనే రైతు బిడ్డను కాల్చిచంపిన సంఘటనలో ప్రచలితుడైన సోమసుందర్ ఖబడ్దార్, ఖబడ్దార్ నైజాం పాదుషాహి, అనే గీతం రచించారు. ఈ గీతం ఆంధ్రప్రజానాట్య మండలి యానదాంధ్రలో బృందగానంగా ప్రజానాట్యమండలి పాడుతుంటే లక్షలాది మంది ప్రజలలో గొప్ప విప్లవస్ఫూర్తి కలిగింది. తెలంగాణా పోరాటంలో ఆ గీతం నిరంతర స్ఫూర్తి నిచ్చింది. ఆ పోరాటంలో వివిధ ఘట్టాలకు చెందిన అనేక గీతాలు సోమసుందర్ రచిస్తుండగా 1946 లో కృష్ణాపత్రికలో ఒక ఉదంతాన్ని చదివిన ఆరుద్ర 'త్వమేవాహం', రచించి 'తెలుగు స్వతంత్ర'లో ధారావాహికంగా ప్రచురించారు. 1948లో కమ్యూనిస్టుపార్టీ దుందుడుకుగా భారతదేశానికి లభించింది స్వాతంత్రం కాదంటు సత్వర స్వాతంత్ర సాధనకు సాయుధ విప్లవం చేసెట్టాలంటూ చేసిన తీర్మానం ఫలితంగా దేశమంతటా ఘోరమైన నిర్బంధ కాండ చెలరేగింది. అభ్యుదయ రచయితల ప్రజానాట్య మండలి ఉద్యమాలను సైతం ప్రభుత్వం విడవలేదు. సోమసుందర్ వంటి కవులను జైళ్ళపాలు చేసింది. అభ్యుదయ వాణి వినిపించడమే కరువైపోయింది. "అభ్యుదయ'పత్రిక నిషేధింపబడింది. ఆ నిషేధం న్యాయ సమ్మతం కాదని నిషేధం తొలగించాలని కోరుతూ శ్రీకాకుళం నుండి మద్రాసు వరకు సోమసుందర్ పర్యటించి తెలుగు దేశంలో రచయితల సంతకాలతో ఒక మహజరును రూపొందించి కృష్ణాజిల్లా కలెక్టరుకు ఇచ్చినా ఖాతరు చేయబడలేదు. నగారా వంటి పత్రికలు కూడా నిషేధింపబడ్డాయి.

ఈ దశలో అభ్యుదయ వాణిని బతికించడమే బాధ్యతగా రచయితలందరితో సంప్రదించి సోమసుందర్ 'కళాహేళి' పక్షాన వజ్రాయుధం, త్వమేవాహం ప్రచురించాడు. అనిశెట్టి అగ్నివీణను నరసారావుపేట నుండి ప్రచురించారు. దాశరథి అగ్నిధార, రుద్రవీణ హైదరాబాదులో ప్రచురించ బడ్డాయి. కె.వి. రమణారెడ్డి అడవి, భవనఘోష అనే కావ్యాలు ప్రచురింప బడ్డాయి. రెంటాల గోపాలకృష్ణ బెజవాడ నుండి సంఘర్షణ, సర్పయాగం అనే రెండు కావ్యాలు ప్రచురించారు. దీనితో మహా ప్రస్థానాన్ని ప్రచురించడంలో జాప్యం చేస్తున్న శ్రీ శ్రీ వెంటనే పూనుకొని 1950 మేలో నళినీరంజన్ కుమార్ అనే మిత్రుని సహాయంతో మచిలీపట్నం నుండి ప్రచురించారు. అదే సంవత్సరం 'ఉదయిని'ని శ్రీ గంగినేని వెంకటేశ్వర రావు ప్రచురించారు. కాని 1950 ఫిబ్రవరి

నాటికి ఒక సంవత్సరం గడవకముందే మద్రాసు ప్రభుత్వం సోమసుందర్ 'వజ్రాయుధం' నిషేధించి మిగిలిన ప్రతులను జప్తుచేసింది.

ఈ నిర్బంధంను తట్టుకొనేందుకు కొందరు రచయితలు సినీమాలను ఆశ్రయించి బ్రతకవలసి వచ్చింది. భిన్న భిన్న వృత్తులతో చీలిపోవలసి వచ్చింది. తిరిగి వారందరిని ఏకోన్ముఖం చేసిన కీర్తి ఆదినుంచి అభ్యుదయ రచయితల సంఘానికి వెన్నెముకగా నిలిచిన తుమ్మల వెంకటరామయ్య గారికి దక్కుతుంది. 1955లో బెజవాడలో శ్రీ శ్రీ అధ్యక్షతన జరిగిన 5వ మహాసభ పునరుత్తేజణం చేసింది. ఏకాగ్రతతో సంఘ నిర్మాణం కోసం అంకిత భావంతో పనిచేసే వ్యక్తులు లేకపోవడం వల్ల ముఖ్యులంతా మదరాసులో ఉండిపోవడం వల్ల సంఘం పటిష్టంగా నడవకపోయినందున అభ్యుదయ భావజాలం మాత్రం యావదాంధ్రలో ప్రజ్వలనగా ప్రధాన భూమిక వహించింది. ఏ కొత్త రచయిత కలం పట్టినా అభ్యుదయ దృక్పథంతో కథకని, కవితకని రాయటం పరిపాటి. తద్భిన్నంగా వ్రాసిన రచయితలు సంఘ విదూరుడుగా పరిగణింపబడే స్థితి ఏర్పడింది.

1970లో విశాఖలో జరిగిన శ్రీ శ్రీ షష్టి పూర్తి యావదాంధ్ర రచయితలు పాల్గొన్న ఒక జాతీయ మహోత్సవంగా జరిగింది. కాని అప్పటికే శ్రీకాకుళం గిరిజన నక్సలైటు పోరాటాలు సాగుతుండటంతో ఆ తక్షణ విప్లవాన్ని సమర్థించే రచయితలనే రచయితలుగా పరిగణిస్తారనే ఒక పిడివాద ధోరణి శ్రీ శ్రీ షష్టిపూర్తి సభలో కొందరు రచయితలు ప్రవేశపెట్టారు. దానిలో కలకలం చెలరేగింది. భిన్నాభిప్రాయాలు ఏర్పడ్డాయి. అదే సంవత్సరం జూన్ నెలలో హైదరాబాద్‌లో 'సెవెన్‌స్టార్ సిండికేట్' వారు ఏర్పాటు చేసిన అభ్యుదయ సదస్సులో ఈ చీలిక కార్యరూపం ధరించి సదస్సు ప్రారంభం రోజునే అర్థరాత్రి విరసం ఏర్పడినట్లు, అరసం నుండి విడిపోతున్నట్లు శ్రీ శ్రీ, కె.వి. ఆర్ వగైరా రచయితలు ఒక ప్రకటన ఉదయం పంచిపెట్టారు. శాస్త్రీయ సామ్యవాదాన్ని కోరే రచయితల ప్రగతిశీల సంఘటనతో పెద్ద చీలిక ఏర్పడటమే కాక సాహిత్యములో ఏది అనుసరణీయ మార్గమో తేలని కల్లోలము కలిగింది. రెండు ప్రబల శక్తులుగా విడిపోయాయి. నక్సల్‌బరీ విప్లవానికి బాసటగా విరసం తన యావచ్ఛక్తినీ వినియోగించి రచయితలను కూడకట్టడం ప్రారంభించింది. దీనితో అరసం కూడా పునఃనిర్మాణానికి పూనుకొని గుంటూరులో మహాసభ జరిపింది. మౌలికమైన భావ సామ్యం రెండింటికీ ఒకటేఅయినా తక్షణ సాయుధ విప్లవమా? ప్రజలలో చైతన్యం కలిగిస్తున్న సామ్యవాద స్థాపన ముఖ్యమా అన్న ప్రధానాంశాలపట్ల విభేదం చెలరేగింది. కాని నక్సలైటు ఉద్యమంలోనే వచ్చిన భిన్న భిన్న ధోరణులతో విరసంలోనే రచయితలు కూడా భిన్న భిన్న శాఖలుగా విడిపోయారు. పరస్పర విధ్వంసకాండకు పూనుకున్నారు. కాని అరసం మాత్రం ఏకోన్ముఖంగా సంఘటితంగా సాగుతూ గత మార్చి 12, 13 తేదీలలో తొలి మహాసభ వజ్రోత్సవాన్ని జయప్రదంగా జరుపుకొంది. ప్రముఖ అభ్యుదయ రచయితలు ఆధ్యాత్మిక వాద ప్రచారకులు, నూత్న రచయితలు పుంఖాను పుంఖంగా శక్తివంత మైన రచనలు చేస్తూ అభ్యుదయ సాహిత్యాన్ని సంపన్నం చేస్తున్నారు.

నేడు మానవజాతి ఎదుర్కొంటున్న ప్రమాదాలు రెండు. 1. ప్రపంచం మొత్తం మీదనే కొత్త ప్రసారా సాధనాలతో స్టార్ టి.వి. వంటి ప్రసార సాధనాలతో విషప్రచారాన్ని స్లో పోయిజన్‌గా ఎక్కించడం, ఆయా దేశాలలో సంచలనాత్మక చైతన్యం కలిగించిన మహా పురుషుల జీవితాలకు అపకీర్తి కలిగించడం. తద్వారా మానుష శక్తులపై విశ్వాసం పోగొట్టే అమానవీయ శక్తులను, అమానవీయ పిశాచాలకు పట్టం కట్టడం. వీటికి ఉదాహరణలుగా లైంగిక ప్రవృత్తిని పశుప్రవృత్తిగా మార్చే కళాప్రక్రియలను విస్తరింప చేయడం స్పష్టంగా కన్పిస్తుంది. కారణం లేని అమానుష హింసావాదాన్ని అభివ్యక్తీకరించే చిత్రాలను, నవలలను విరివిగా అభివృద్ధి గావించుతున్న దేశాలపై రుద్దటం. దీనితోపాటు హిందు, ముస్లిం సనాతనవాదం పెచ్చరిల్లి దేశసమైక్యతను ఛిన్నాభిన్నం చేసే దుశ్శక్తులకు ప్రోత్సాహం అందిస్తుంది. పాకిస్తాన్ మతవాద పిడికిలి నుండి విముక్తమైన బంగ్లాదేశ్‌లో నజ్రీన్, 'లజ్జ' అనే నవల రచించినందుకు శిరఃఖండన విధించిన ముస్లిం ముష్కరవాదులు, సాలమన్ రష్దీపై మరణశిక్ష విధించిన ఖొమేనీ అనుచరులు పెచ్చరిల్లుతున్న దుష్కర కాలంలో ప్రగతిశీల రచయితలు, మేధావులు, ఆలోచనాపరులు అందరూ విశాల ప్రాతిపదికపై ఏకోన్ముఖమై మతోన్మాదుశ్శక్తులను ఎదుర్కొనకపోతే మనదేశంలో మానవత్వాన్ని రక్షించలేము. ప్రగతి వాదాన్ని రక్షించలేము. శ్రేయోరాజ్యాన్ని స్థాపించలేము. మన దేశ పునర్జీవనోద్యమానికి కృషి సల్పిన మహనీయుల మధురస్వప్నాలను సంరక్షించ లేము.

అందుకే ప్రగతిశీలురంతా ఏకమై మానవుడిని మానవత్వముతో ప్రవర్దిల్ల చేయటానికి కృషి సల్పుదాం. అందుకు మన సర్వ మేధాశక్తులను అంకితం చేద్దాం. ఇదే అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడిన తొలినాటినుండి కంటున్న ఏకైక స్వప్నం, ప్రణాళికా బద్ధమైన కార్యక్రమం. సరిగ్గా ఆరేళ్ళలో ఇరవై ఒకటో శతాబ్దంలోకి ప్రవేశిస్తున్న మనం జంతువుల వలె కాక సంపూర్ణ మానవులుగా ప్రవేశించి ఉజ్జ్వల భవిష్యత్తును ఆహ్వానించాలన్నదే నా ఆకాంక్ష.

• • •

# ఆంధ్ర కవుల కళా కౌశలము-అవధానములు

రాపాక ఏకాంబరాచార్యులు

"దేశభాషలందు తెలుగులెస్స" అని శ్రీనాథ మహాకవి, శ్రీ కృష్ణదేవరాయ సార్వభౌములు తెలుగు భాషను ప్రశంసించుటకు గల కారణములలో నొకటి ఇతర దేశ భాషలలో లేని కొన్ని సొగసులు. అపూర్వ ప్రక్రియలు-తెలుగు భాషలో నుండుట యేయని చెప్పవచ్చును. అందు అవధాన కళ యొకటి. సంస్కృతమునందును, ఇతర దేశభాషలలోను తెలుగున వున్నట్లు బహుళ ప్రచారము లేకపోవుట వలన ఈ అవధాన విద్య ఆంధ్రుల సొత్తు అనవచ్చును. తెలుగు సాహిత్యమునందు 13వ శతాబ్ది వరకు నాడునుండీ కళకు అంకురార్పణ జరిగి 20వ శతాబ్దారంభమునవిది పుష్పించి ఫలించి నది. విద్వాన్ మాడభూషి వేంకటాచార్యులు గారు ప్రప్రథమముగా అష్టశతావధాన స్వరూప స్వభావాదులు ఆంధ్రదేశ సాహితీ రససింధువులకు తెలియజేసినా, తిరుపతి వేంకట కవులీ కళను, ఊరూరా వాడవాడలా త్రిప్పి తెలుగు కవిత్వముపై మక్కువ కలిగించారు. తిరుపతి వేంకటకవుల కిందుకపూర్వము వరకు రాజాస్థానములలో వర్ధిల్లు కవితా కన్యను తిరుపతి వేంకటకవులు తమ అవధాన, ఆశు కవితా సభల మూలమున ప్రజా మధ్యమునకు తీసికొని వచ్చి కవితపై మక్కువ కలిగించి వారు తెలుగు కవితా ప్రజాస్వామ్య వ్యవస్థాపకులుగా కీర్తి గడించారు. మూర్తిభవించిన సర్వజ్ఞులే శ్రీ తిరుపతి వేంకటకవులు. "అవధానముల చేతనే కవిత ప్రజా సామాన్యమున ప్రచారము కాగలదు" అను రహస్యము నెరిగిన మహా ద్రష్టలు వీరు. వీరి యవధాన సభల నిర్వహణమున కచ్చెరువంది ఎంతో మంది యువకవులు వీరి వద్ద శుశ్రూష చేసి వారు గురువులకు తగిన శిష్యులుగా కీర్తి గడించారు. ఆంధ్రదేశము నందనేక మంది విద్వత్కవులు వీరి శిష్యులై, ప్రశిష్యులై, ఏకలవ్య శిష్యులై వన్నెకెక్కారు. తిరుపతి వేంకటకవుల కాలమున అవధాన విద్య దివ్య ప్రభంతిగా రూపొంది తీర్థరాజమై వరలినది. ఆంధ్రుల జీవితములో విశిష్ట స్థానము నాక్రమించిన ఈ అవధాన విద్యను, తత్కవులను, సమగ్ర స్వరూపమును తెలిసికొనుట ఆంధ్రుల కర్తవ్యము.

## అవధాన నిర్వచనము

"అవ" పూర్వక (డు) ధాఞ్-ధారణ పోషణయోః "అను ధాతువు నుండి" "అవధానము" మాట జనించినది. సామాన్యార్థమున అవధానము మాటకు "ఏకాగ్రత" (Attention) అని అర్థము.

వామనాచార్యుడు తన కావ్యాలంకార సూత్ర వృత్తియందు కావ్యాంగములను వివరించుచు అవధానమును కూడ కవిత్వ బీజముగా పేర్కొనెను. లోకము-విద్య-ప్రకీర్ణము-అను మూడును కావ్యమున కంగములు. వీనిలో మూలభూతములైనవి. ప్రతిభావధానములు. "ప్రతిభ లేనిదే కావ్యమావిర్భవించదు. అవధానము లేనిదే అర్థ దర్శనము కాదు", అని వివరించుచు "చిత్తైకాగ్ర్య మవధానమ్" అని వామనుడు అవధానమును



తిరుపతి వేంకటకవులు

నిర్వచించెను. మనస్సు బాహ్యేంద్రియముల ద్వారా బాహ్యార్థము లందు ప్రసర్తింపక అంతర్ముఖమై యుండుట అవధానము. అట్టి యవధానముండిననే మనస్సు తాను చూడదలచిన వస్తువులను చూడగల్గును.

## వేదావధానులు

అవధానము మొదటి వేదాధ్య యనంచేసే వారు చేసే ప్రక్రియ అని తెలుస్తుంది. వేదంలో ఘన-మూల-శిఖ-జట- ఇత్యాది వేద పాఠ విశేషాలున్నాయి. వీటికి సంబంధించిన అవధానాన్ని వేదాధ్య యన పరులలో బుద్ధి మత్తరులైన కొందరు చేసేవారు. అట్టివారిని అవధానులని పిలిచే వారు. కొంతకాలం తరువాత అవధానం చెయ్యకపోయినప్పటికీ వేదం చెప్పు కొంటే చాలు-అవధానులు అని పేర్లు పెట్టుకొనడం మొదలు పెట్టారు. ఆవిధంగా పేర్లు పెట్టుకొన్న వారే-రామావధాన్లు, వేంకటావధాన్లు, సుబ్బావధాన్లు, కృష్ణావధాన్లు అనేవారు.

## ఆంధ్రసాహిత్యంలో అవధానులు

క్రమ క్రమంగా ఈ అవధానం కొంత కాలానికి తెలుగు కవిత్వంలో ప్రవేశించింది. పూర్వాంధ్రకవులలో అవధానములను సమర్థించిన వారు కొలచెలమ మల్లినాధసూరి, జక్కన, చరికొండ ధర్మనామాత్యుడు, భట్టు మూర్తి, నెల్లూరి వీరరాఘవకవి, మధురవాణి, హరిభట్టు, ముతింగంటి సింగరాచార్యులు ముఖ్యులు. ఈ పైన పేర్కొనిన కవులు శతలేఖినీ పద్య సంధాన ధౌరేయులమనిన్నీ, అష్టఘంటావధానులమని తమ తమ ప్రబంధాలలో చెప్పుకొనుటచే ఆనాడు అవధాన ప్రచారము కలదని తెలియుచున్నదే కాని వారు గావించిన అవధాన స్వరూప స్వభావములు మనకు పలభ్యమానములు కాలేదు.

ప్రసిద్ధ శతావధానులు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు తమ "శతావధానం" అను వ్యాసములో ప్రాచీనావధానులను గూర్చి తెలుపుచు శతావధాన స్రవంతి చరికొండపై పుట్టి తిరుపతి వేంకటకవుల కాలానికది దివ్యస్రవంతిగా మారి తీర్థరాజమై విస్తరించిందని ఈ క్రింది పద్యంలో వివరించారు.

**చిత్రభారతము రచించి మించిన చరి**
**కొండ ధర్మండను కొండ నెక్కి-**
**వసుచరిత్రము వ్రాసి వాసికెక్కినరామ**
**రాజభూషణు వ్యాఘ్రమ్మ గ్రమ్మి**
**మూడర్థముల కావ్యముంజెప్పు నెల్లూరి**
**రాఘవకవి వచోహ్రదమునింపి**
**అపరపండితరాయ లౌ వేంకటాచార్యు**
వాచాస్రవంతిలో వచ్చి కలిసి
వఱలి తిరుపతి వేంకటేశ్వరుల దరుల
మూలమున తీర్థరాజమై యోలి కడలి
కరగెడు శతావధాన దివ్యస్రవంతి

.................................."

ఈ పై అవధానులనే తిరుపతి వేంకటకవులు తమ గుంటూరు సీమలో పేర్కొనుచు ఈ విధముగా వ్రాకుచ్చిరి.

**"చరికొండ ధర్మ(డార్జనచేసె సీపీఠ**
**మేలె దేవేంద్రు(డై యెన్ని నాళ్లొ**
**అవల(బట్టా పల్లమై భట్టునకు వచ్చె**
**నెల్లూరి రాఘవుని కది చేరె**
**మాడభూషికి నది తోడివేదం బయ్యె(**
**దిరుపతి వెంకటేశ్వరుల కబ్బె**

.................................."

## కొలచెలమ మల్లినాథుడు

మనకు పలభ్యమానమైన గ్రంథము లను బట్టి కొలచెలమ మల్లినాథుడే శతావధాన ముమ నిర్వహించిన, వారిలో ప్రాచీన తముడైనట్లు వేటూరి ప్రభాకర శాస్త్రిగారి "కొలచెలమువారు" అను వ్యాసమును బట్టి తెలియుచున్నది. అందు

**"కొల చెల్మాన్వయాబ్దీందు ర్మల్లినాథో**
**మహాయశాః**
**శతావధాన విఖ్యాతో వీరరుద్రాభి వర్ణితః"** అనిన్నీ,

"ఈయన శతావధానము చేసి విఖ్యాతి గాంచినవాడు. నేటి కాలమున నస్మద్గురు వర్యులు శ్రీ తిరుపతి వేంకటేశ్వరు లఖండ ప్రతిభతో నాచరించుచున్నట్టియు-నాంధ్రదేశమందే విపుల ప్రచారము గల్గి నట్టియు నీ శతావధాన మానాడే మల్లినాధ సూరి నిర్వహించినాడు. మనకు దెలియ **వచ్చిన** శతావధాన చతురులలోనెల్ల నీతడే ప్రాచీన**తము(డు.** అద్భుతప్రతిభా ప్రదర్శక మైనయా శతావధాన **చాతుర్యమునకు** మెచ్చి కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి **మనవండిత** పరమేశ్వరునకు( గనకాభిషేక సత్కారము **గావించినాడు."**

## జక్కన

విక్రమార్క చరిత్రమును వ్రాసిన **జక్కన కూడ** అవధానినని తన గ్రంథములో నిట్లు నుడివినాడు.

ఎవ్వ(డే యవధాన మెఱుగు నయ్యవధాన
మునవానికించుక ముల్లు నూప



కొప్పరపు కవులు (శతావధానులు)

కాని ఇక్కడ ఏ యవధానము గావించెనో మనకు తెలియుట లేదు.

## చరికొండ ధర్మన

చరికొండ ధర్మన తన చిత్రభారతమున "శతలేఖిన్యవధాన పద్య రచనా సంధాన ధురీణుడి హిన్నతనామా చరికొండ ధర్మనకవి"

అని తన కృతి భర్త చెప్పిన మాటల వలన ధర్మన శతలేఖినీ పద్య సంధాన ధౌరేయుడని తెల్లమగుచున్నది.

## భట్టు మూర్తి

రామరాజ భూషణుడు అను నామాంతరము గల భట్టు మూర్తి తన వసు భూపాలీయమునందు – తాను

శతలేఖినీ పద్య సంధానధౌరేయు

ఘటికా శతగ్రంథ కరణ ధుర్యు" డనని నుడివినాడు.

## నెల్లూరి వీరరాఘవకవి

"యాదవ రాఘవ పాండవీయము" అను త్ర్యర్థి కావ్యమును రచించిన వీరరాఘవ కవి తన గ్రంథమున తాను

"శత లేఖినీ పద్య సంధాన చాతురి

ఘటికా శతగ్రంథ కరణ పటిమ" కలవాడనని చెప్పుకొనినాడు.

## మధురవాణి

తంజావూరు పాలకులైన రఘునాథ రాయల ఆస్థాన విద్వత్కవయిత్రి మధురవాణి నిజముగ మధురవాణియే. తన సంస్కృత రామాయణమునందు తాను నూరు సమస్య పూరించగల సమర్థురాలనని–"ధృత్వా సమస్యాశ్శతం పద్యస్సంపతి సాధుపూరయతి యాదత్తా కవీంద్రైరపి" అని వ్రాసుకొచ్చినది.

## హరిభట్టు

మత్స్య, నృసింహ, వరాహపురాణము లను ఆంధ్రీకరించిన హరిభట్టు తాను అష్టావధాని నని తన వరాహ పురాణమునవిట్లు తెలిపినాడు.

"అష్టఘంటావధాన విశిష్ట బిరుద

నీవు రచియింపఁదలచిన నిరుపమార్థ

రమ్యమగు నీ వరాహపురాణ కావ్య

మంకితము చేయు నాపేర నభిమత ముగ"

దీనిని బట్టి హరిభట్టు అష్టావధానమును చేసినట్లూహించవచ్చును కాని దాని స్వరూప స్వభావాదులు మనకు తెలియుటలేదు.

## మఱింగంటి సింగరాచార్యులు

"దశరథరాజ నందన చరిత్రము" అను నిరోష్ఠ్య కావ్యమును రచించిన మఱింగంటి సింగరాచార్యులు గారు కూడ శతలేఖినీ పద్య సంధాన ధురీణులు

శుద్ధాంధ్ర, నిరోష్ఠ్య సీతాకల్యాణము నందలి

"భారతీ సంపూర్ణ భావార్థ వివరణ

రాజిత శతఘంట రాయకవన

శబ్ద శాసన ధుర్య శతలేఖినీ పద్య

ఘటికా శతగ్రంథ కల్పనీయ" అను పద్యపాదము వలన చల్ల పిల్లరాయచరిత్రము నందలి

"శతలేఖినీ పద్య సంధాన నిపుణుండు

ఘటికా శతగ్రంథ కల్పితుండు" అను పద్య పాదము వలన సింగరాచార్యులు శతలేఖినీ పద్య సంధాన నిపుణుడని వెల్లడగుచున్నది.

## చింతలపల్లి వీరరాఘవుడు

18వ శతాబ్దికి చెందిన యీ కవి తన "మధురవాణీ

విలాసము" అను గ్రంథము నందు తాను అనేక అవధానములు చేసినట్లే క్రింది పద్యము వలన వెల్లడగుచున్నది.

**"అవధానంబులనేకమున్నెఅపి రాజా స్థానముల్**
**చేరి వా**
**దవిధిన్ ధీరుఁడవై చతుర్విధ కవిత్వ ప్రౌఢిమల్**
**చూపి భూ**
**ధవ దత్త ద్విపఘోటు కాది బహుసత్కారంబు గైకొన్న మి**
**న్నవు నీకబ్రమె వేంకటేశ్వరుడు స్వప్నంబుంబ్రసాదించుటల్"**

అంతేకాక వేఱొక పద్యము నందు "బహుళావధానముల్ సఱపి నాలుగునగల్ తేజినందితి మల్లధీరువల్ల" అని తన యవధాన విద్యాప్రాగల్భ్యమును చాటినాడు.

## విద్వాన్ మాడభూషి వేంకటా చార్యులు

## (1835–1895)

అభినవ పండితరాయ బిరుదాంకితులైన వేంకటాచార్యులు గారు ఆధునిక కాలమున అవధాన విద్యాపితామహులు. బహు ముఖ ప్రజ్ఞానంతులు. – ఏకసంథాగ్రాహులు, శబ్దగ్రహణ పారీణులు, అష్టభాషా వ్యస్తాక్షరీ ధురీణులు, అనులోమ, ప్రతిలోమ పద్య పఠన కుశలురు. నూజివీడు సంస్థానాధీశుల ఆస్థాన కవియై భరతాభ్యుదయము రామావధూటి తారావళి, పుష్పబాణ విలాసము ఆనంద గజపతీంద్రులపై పద్యములు మున్నగు రచనలు గావించిరి.

ఆచార్యుల వారు – ప్రప్రథమముగ అష్టశతావధానములకు నియమము లేర్పరచి పలు తావులందవధానములు గావించిరి. అందు 1872 మార్చిలో నూజివీడులో గావించిన శతావధానము, 1879 నవంబరు నందు పీఠికాపుర సంస్థానమున గావించిన అవధానము పేరెన్నికగన్నవి. తరువాత వచ్చిన అవధానులందరకు ఆచార్యుల వారే మార్గదర్శకులు. తిరుమల బుక్కపట్టణము రాఘవాచార్యులు, దేవులపల్లి సోదర కవులు, కార్యము పూడి రాజమన్నారు. తిరుపతి వేంకట కవులు వీరందరికి ఆచార్యుల వారే అవధాన మార్గమును చూపినారు.

## తిరుమల బుక్కపట్టణము రాఘవాచార్యులు

వీరు 16వ యేటనే పండితులు మెచ్చు విధముగా అష్టావధానము గావించిరి. వీరు తెలుగున, సంస్కృతమున, ఇంగ్లీషున అష్టావధానములుగావించినట్లును, నూజివీడు లో ప్రభుసన్నిధిని, వేంకటాచార్యుల వారి యెదుట అద్వైత ప్రతిభతో అవధానము చేసిరి.

## దేవులపల్లి సోదర కవులు

పీఠికాపురాధీశులు – గంగాధర రామారావుగారి ఆస్థాన కవీశ్వరులై మహేంద్ర విజయము, రావువంశ ముక్తావళి మున్నగు గ్రంథములను తెలుగు సాహితీ సరస్వతికి కంఠమాలలుగా సమర్పించి శతలేఖినీ పద్య సంధాన ప్రతిభతో విలసిల్లిరి. వీరు విద్వాన్ మాడభూషి వేంకటా చార్యుల వారి సన్నిధిని పిఠాపుర సంస్థానంలో గావించిన శతావధానము ప్రసిద్ధమైనది. పిమ్మట వారు కొన్ని పర్యాయములు పిఠాపురంలోను, మద్రాసులోను అష్టశతావ ధానములు గావించి ప్రఖ్యాతి నందిరి.

## తిరుపతి వేంకట కవులు

జగదాశ్చర్యకరావధాన కవితా సంపత్తితో అర్థశతాబ్ది కాలం ఆంధ్రదేశము నందు తమ అష్టశతావధానాశు కవితా సభలతో సాహితీ రస పిపాసువులను రంజింపజేసి కవితపై మక్కువ కలిగించిన కవితల్లజులు వారు. గద్వాల–చెన్నపట్టణము–విజయనగరము మధ్యగల దేశమునందు చటుల స్ఫూర్తితో సహస్రాధికంగా అవధాన సభలు నిర్వహించారు. గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, వెంకటగిరి, విజయనగరము, మొగలుతుర్రు, మున్నగు సంస్థానములలోను, ఆంధ్రదేశము నందనేక ప్రసిద్ధ పట్టణములలోను, పల్లెలలోను–'నహి ప్రతి' యనునట్లు వారు అవధాన సభలు నిర్వహించి అవధానములను జగద్విఖ్యాతము గావించినారు.

## శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

శాస్త్రిగారు కొంతకాలం అవధాన సభలు నిర్వహించారు. వారు ఆంధ్రప్రాంత ములలో ముందెన సమీపంలోని "పెదపల్లె", విజయనగరము, బొబ్బిలి మున్నగు తావులలో తెలుగులోను–ఆంధ్రేతర ప్రాంతములైన ఛత్రపురము, కల్లికోట, మయూరభంజి మున్నగు తావులందు సంస్కృతమునందు అవధానములు గావించి సాహితీ పిపాసువుల మన్నన లంది విశేషమైన గౌరవ మర్యాదలను పొందిరి.

## వేంకటరామ కృష్ణకవులు

పీఠికాపుర సంస్థాన కవీశ్వరులై పేర్గాంచిన వేంకటరామ కృష్ణకవులు అనేక అవధానములు గావించిరి. అవధాన విద్యయందు గతానుగతికముగా కాక స్వ ప్రతిభతో వారు నూతన ప్రక్రియలను సృష్టించి తమ ప్రత్యేకతను లోకమున చాటిరి. అత్యద్భుత శతావధానము, శతవిధానము, శతప్రాసము అనునవి అట్టివే.

## కొప్పరపు సోదర కవులు

జగద్విఖ్యాతి గాంచిన ఆశుకవి చక్రవర్తుల కొప్పరపు సోదర కవులు. వారు అత్యాశువుగా గంటకు మూడు వందలకు పైగా పద్యములను శరవేగంతో చెప్పేవారు. ఆశుకవిత్వం చెప్పడంలో ముందుగా పేర్కొనదగిన వారు కొప్పరపు సోదర కవులు. వీరు దేశము నలుచెరగుల తిరిగి పలుతావులందవధానములు గావించారు. అందు ప్రధానమైనవి గుంటూరు, మద్రాసు, బాపట్ల, హైదరాబాదు, విశదల, చీరాల, సంగిడి గూడెము మున్నగు పలు పట్టణములలోను, గ్రామములలోను శతావధానములు గావించిరి.

## ఇతర ప్రసిద్ధ అవధానులు

ప్రసిద్ధ శతావధానులలో వేలూరి శివరామశాస్త్రి గారు, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, కాశీ కృష్ణా చార్యులుగారు, పిశుపాటి చిదంబరశాస్త్రి గారు, గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు, రాజశేఖర వేంకట శేష కవులు, దోమా వేంకటస్వామి గుప్త గారు, జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, కార్యమపూడి రాజమన్నారు గారు, నేమాని వెంకటశాస్త్రిగారు, వేమూరి శ్రీరామ శాస్త్రిగారు, శ్రీ పతి త్ర్యంబక రావుగారు, కాకర్ల కొండలరావుగారు, సోకూరి కాశీపతి వాన్యకంఠ గణపతిముని, కిళాంబి రామానుజాచార్యులు, పరవస్తు రంగాచార్యులు మున్నగు వారు కలరు.

## మరికొందరవధానులు

శ్రీయుతులు బంకుపల్లి మల్లయ శాస్త్రి, హరిరామ లింగశాస్త్రి, ములుకుట్ల వేంకట శాస్త్రి, ఆలుకూరు మల్లికార్జున శాస్త్రి, శేషాద్రి రమణ కవులు, శ్రీనివాస సోదర కవులు, రామేశ్వర కవులు, కోట సోదర కవులు, సత్యదర్గేశ్వర కవులు, పల్నాటి సోదరకవులు, వేదుల సత్యనారాయణశాస్త్రి, విక్రాల నరసింహ శాస్త్రి, గోరుగంతుల అచ్యుత సూర్య నారాయణమూర్తి, గొల్లమూక్కల రామ కృష్ణ శాస్త్రి, బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులు, గోపాలపేట రామచంద్రాచార్యులు, పులుగుర్త రామారావు, కందుకూరి వేంకటసుబ్బారావు, సరిమి సుబ్రహ్మణ్య భాగవతార్, బొడ్డు బాపిరాజు, అవధానం చంద్రశేఖరశర్మ, సోంపల్లి సంపత్ కృష్ణమూర్తి, పుల్లాపంతుల వేంకటరామశర్మ డోకూరి కోట్ల బాలబ్రహ్మాచార్యులు, పూసపాటి నాగేశ్వరరావు, వంగవోలు ఆది శేషశాస్త్రి, రావూరి వెంకటేశ్వర్లు, మాడుగుల సూర్యవరప్రసాదరావు, ప్రసాదరాయ కులపతి (పి.వి.యల్.వి. ప్రసాదరావు), చిలుకూరి రామభద్రశాస్త్రి, గాడేపల్లి కుక్కుటేశ్వరరావు, ముప్పాళ్ల జానకి రామశాస్త్రి, నందగిరి శేషగిరి రావు, చిల్లరిగె యోగానందకవి, పోతరాజు లక్ష్మీనరసింహకవి, గోపాలుని హనుమంతరాయశర్మ, ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశర్మ, చిల్లర వేంకటేశ్వరకవి, కొప్పరపు వేంకటరత్నకవి, కొప్పరపు బుచ్చి రామకవి, నల్లూరి వేంకటరామ లింగశర్మ, పొసరాజు వీరరాఘవ శర్మ, కాళ్లకూరి నారాయణ రావు, వడ్లమాని సుబ్బావధాని, సింగుమహంతి పార్థసారథి, పెమ్మరాజు సత్యనారాయణమూర్తి, సూరవరపు పురుషోత్తమావధాని, వింజమూరి వీరరాఘవాచార్యకవి, ఓంకారము గురవ రాజుకవి, కోగంటి లక్ష్మీనరసింహాచార్యులు, మంచికంటి పాపయ్య, రాజా మంత్రి ప్రెగడ భుజంగరావు బహద్దరు, నాదెళ్ల పురుషోత్తమకవి, కొప్పరపు వేంకటనరసిహకవి. యాగళ్ల జానకి రామయ్య, భమిడి పాటి అప్పయ్య శాస్త్రి, భమిడి పల్లి సీతారామకవి, మధిర సుబ్బన్న దీక్షితులు, చంద్రమౌళి చిదంబరరావు, కొప్పరపు సీతారామ వరప్రసాదరావు, నరసింహాచార్యులు, పాటిబండ సూర్య నారాయణరావు, కొండముది నరసింహకవి, పోతరాజు రామకవి, ప్రత్తిపాటి కామేశ్వరకవి, పెళ్లూరు శ్రీనివాస రంగేశ్వర శర్మ, చించినాడ వేంకటరత్న శాస్త్రి, తిరువాది లక్ష్మణాచార్యులు, ఈచంబాడి శ్రీనివాసా చార్యులు, నేమాని వేంకట నరసింహాచార్యులు, గౌరావఝ్ఝుల రామకృష్ణశాస్త్రి, మామిడి వేంకటాచార్యులు, తిరుమల బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులు, శిష్టుసర్వశాస్త్రి, శ్రీరామ నరసింహమూర్తి కవులు, పూసపాటి వీరసరాజు, వెంకట నీలాద్రిరాజు, నరసింహ సుబ్రహ్మణ్య కవులు, త్రిపురనేని రామస్వామి చౌదరి, వడ్డాది సీతారామాంజనేయకవి, పట్టమట్ట సోమనాథ సోమయాజి, దివాకర్ల వేంకటావధాని, పళ్లె పూర్ణ ప్రజ్ఞాచార్యులు, గరికపాటి మల్లావధాని, సామవేదుల సూర్యనారాయణ, జూపూడి హనుమచ్ఛాస్త్రి, ములుకుట్ల వేంకట కృష్ణశాస్త్రి మేడవరపు రామనాథ శాస్త్రి, పంద్రంగి రామారావు, బూరాడ గున్నేశ్వర శాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు, తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రి మున్నగు వారెందరో కలరు.

## ప్రస్తుతం అవధానాలు చేసే కవులు

నేడు అవధానములు చేయుచున్న కవులలో ప్రసిద్ధులు శ్రీయుతులు సి.వి. సుబ్బన్న, కడిమిళ్ల వరప్రసాదు, మేడసాని మోహన్, బులుసు వేంకటరామమూర్తి, పేరాల భరత శర్మ, దోర్బల ప్రభాకరశర్మ, మాడుగుల నాగఫణి శర్మ, గండ్లూరి దత్తాత్రేయశర్మ, రేవూరి అనంతపద్మనాభరావు, నరాల రామారెడ్డి, బేతవోలు రామబ్రహ్మం, పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, కావూరి

పూర్ణ చంద్రరావు, చెరుకు సత్యనారాయణ శాస్త్రి, మాచిరాజు శివరాజురాజు మున్నగు వారున్నారు.

## అవధాన సామగ్రి

అవధాన కార్యనిర్వహణమునకు కవికి "ధ" కార చతుష్టయము కావలెనని ఈ క్రింది శ్లోకమున మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు నుడివియున్నారు.

"కవిర్య ద్యవధానీ స్యాత్సంపాద్యం ధ
చతుష్టయమ్
ధైర్యం ధారా ధోరణీ చ ధారణేతి
సునిశ్చలమ్"[17]

అష్ట, శత, సహస్రావధానములు గావించు కవికి తప్పక పైన పేర్కొన్న 'ధ' కార చతుష్టయము – అనగా (1) ధైర్యము, (2) ధార (3) ధోరణి (4) ధారణ ముఖ్యములు. ఇవి లేకుండ అవధానము నిర్వహించుట దుర్లభము.

అవధాన చరిత్రమును బాగుగ పరిశీలించిన యెడల మనకు గోచరమగు విషయమేమనగా అవధానులుగా పేరు పొందిన కవులు చాల తక్కువ మంది మాత్రమే. దీనికి చాల కారణములు కలవు. కవిత్వము చెప్పగల ప్రతివారు అవధాని యగుట కష్టము. దానికి కారణమేమనగా అవధానమునకు కావలసిన పరికరములు చాల అధికముగుట. కవిత్వమునకు కావలసిన ప్రతిభా వ్యుత్పత్తులేకాక, ధారణ, ఆశుధార, ధైర్యము, ధోరణి (సమయస్ఫూర్తి, చమత్కార భాషణము, కల్పన) మున్నగు సామగ్రి ఈ అవధాన నిర్వహణమునకు అత్యంతవసరములు.

## ధారణాశక్తి

అవధానికి కావలసిన శక్తులలో ధారణా పటిమ ప్రప్రథమముగా పేర్కొనదగినది. ధారణ లేకున్న అవధాన మొనర్చుట కష్టము. ధారణయనగా స్థూలముగ జ్ఞాపక శక్తి యని చెప్పవచ్చును. అవధాన కార్యనిర్వహణ సమయమున పృచ్ఛకు లడిగిన ప్రశ్నలు, వాటికి అవధాని సమాధానములు, సంఖ్య, వర్ణ్యముల పూర్వాపరాలు, అవధానాంతమున పద్యములు కాని, ఇతర విషయములు ఎవ్వరును జ్ఞాపకము చేయనవసరము లేకుండగనే అవధానిప్రకటించుటకు ధారణాశక్తి చాల అవసరము.

## ఆశుధార

అవధాని కుండవలసిన సామగ్రిలో మరియొకటి ఆశుధార. పృచ్ఛకులడిగిన ప్రశ్నలకు అవధాని సమాధానము ఆశువులో పద్యములు చెప్పవలెను. కొందఱవధానులు అష్టావధానములందు ఆశువు ఒక అంశముగా చేర్చుకుందురు. సభాసదులను రంజింప జేయుటకు శతావధానములలో కొందరవ ధానులు ఆశువులో వర్ణన చేయుచు కొన్ని పద్యములు చెప్పుదురు. కవిత్వము చెప్పుటను కుంటుపడక నల్లేరుపై బండి నడక మాదిరి అవధాని నడిపింప గలిగిన ఆయవధాని సభాసదుల స్తుతికి పాత్రుడగును.

## ప్రతిభ–వ్యుత్పత్తి – అభ్యాసము

ఈ మూడును అవధానికి కావలసిన సామగ్రిలో ముఖ్యములు. నవనవోన్మేష శాలురైన బుద్ధి మత్తరులు సభారంజకముగా నవధాన కార్యమును నిర్వహించగలరు. అవధాన నిర్వహణమున మంచి వ్యుత్పన్నుడైన కవి చక్కగ సభ నిర్వహించగలడు. లోక జ్ఞానము–కావ్యజ్ఞానము, శాస్త్ర జ్ఞానములు అవధానికి చాల అవసరము.

## సమయస్ఫూర్తి

అవధానికి కావలసిన సామగ్రిలో మరొకటి సమయస్ఫూర్తి. సభాసదులను బట్టి అవధాని తన ప్రజ్ఞను, చమత్కారమును చూపని యెడల సభ రక్తి కట్టదు. సమయమునుబట్టి అప్పుడప్పుడు సభను తన వాగ్వైచిత్రిచే మోహితము చేయుశక్తి అవధాని కుండవలయును. అవధాన కార్యక్రమ నిర్వహణ సమయమున మధ్య మధ్యలో హాస్యముతో సభాసదుల రంజింప చేయవలయును.

## కల్పనా వైచిత్రి

అవధాని సభలో చెప్పు పద్యములు మంచి మంచి కల్పనలతో కూడిన వైనచో సభాసదులు మెచ్చుకొందురు.

## శ్రావ్యమగు పద్యపఠనము

శ్రావ్యముగ పద్యములు చదువగల శక్తి అవధానికి అవధానమున ముఖ్యావలంబనము. రాగ తాళయుక్తముగ శ్రావ్యముగ పద్యములను చదువగలిగిన అవధాని సభను రంజింపజేయగలడు.

## ధైర్య స్థైర్యాలు

పై వాటికి తోడు ప్రత్యర్థుల నెదుర్కొను ధైర్య స్థైర్యాలు అవధానికి ముఖ్యావశ్యకములు. అవధాన నిర్వహణ సమయమున ఎట్టి క్లిష్ట సమస్యనైన పరిష్కరించగల శక్తి, ధైర్యము లేని యెడల అవధాని పనికిరాడు.

ఈ పైన నుడువబడిన అవధాన సామాగ్రి లేకపోయిన అవధాని యగుట దుర్లభము. అందువలననే శ్రీ తిరుపతి

## శతావధానము

శ్రీ తిరుపతి వేంకటకవులు శతావధాన విధానమును గూర్చి

శ్లో ॥

"తత్తన్నామనవ మానసాద్భుత
తమం వృత్తం తథా వస్తుచన
స్వీకృత్య ప్రథమం శతాయ నరయం
తత్పాదమేకం వదేత్
భూయః క్రైర్నచ బోధితః
క్రమవశాత్పాదత్రయం కీర్తయే
దేతన్నామ శతావధాన మథచేత్పద్యాని
సంకీర్త యేత్" అని నుడివినారు.

శతావధానమునందు నూరుగురు పృచ్ఛకులుందురు. వారు కోరిన వర్ణ్యములను కోరిన ఛందస్సులో అవధాని చెప్పవలయును. అవధాని మొదట ప్రథమ పాదము చెప్పుకొని పోయి తరువాత ఎవరు జ్ఞాపకము చేయవలసినదిరము లేకయే ఆయా పృచ్ఛకులకు క్రమముగా రెండవ పాదము, మూడవపాదము, నాల్గవ పాదము చెప్పవలయును. నాల్గుపాదములు పూర్తిజేసి నూరు పద్యములు వరుసగా చదువవలయును, లేదా అచ్చటచ్చట పద్యములడిగిన చెప్పవలయును. అష్టావధానమునందువలె కాక శతావధానమునందు కవిత్వమొక్కటియే వస్తువు. సంపూర్ణ శతావధానమొనర్చుటకు రెండు రోజులు కాని మూడు రోజులు కాని పట్టును.

### అత్యద్భుత శతావధానముః

ఈ మూడు రోజుల కాలములో సభాసదులకు విసుగు జనించును. అందువలన స్వల్ప కాలములో శతావధానమును పూర్తి జేయుటకై వేంకట రామకృష్ణకవులు అత్య ద్భుత శతావధానమును నూతన ప్రక్రియను సృష్టించిరి. ఈ అత్యద్భుత శతావధాన విధానమును గూర్చి వేంకట రామకృష్ణ కవులు.

"నాలుగునైదు గంటలు దినంబునకుంబనిసేయ
నెంతయుం
దాలమితోడ నీ శతవధానము మూడు దినాలు
పట్టునీ
కాలములోపలన్ విసుగు గల్గును మీకును
మాకుగాన భూ
పాలక యాలకింపు మొక పద్ధతి జేసిన వార
మిత్త ఱిన్"
"చేయుట కొక్క గంట యది చెప్పిన
చొప్పునఁదప్పకుండగా
వ్రాయుట కొక్క గంట సరిపారలలో నవధాన
పాండితీ
స్థేయత కొక్కగంట యరు దెంచిన పెద్దల
గారవింప నొం
డో యరగంటయో వ్యవధి యుండవలెన్ ధరణీ
పురందరా".

అని తెలిపి పీఠికా పురాధీశుని కొలువున నాలుగు గంటల కాలములో పీయత్యద్భుత శతావధానమును నడిపినట్లు తెలియుచున్నది.

### శతవిధానము

అత్యద్భుత శతావధానమే కాక శతవిధానము, శతప్రాసము అను నూతన అవధాన ప్రక్రియలు కూడ వేంకట రామకృష్ణ కవులే అవధాన విద్యయందు ప్రవేశపెట్టిరి. ఈ నూతన ప్రక్రియలకు సృష్టికర్తలు వీరే కనుక వీని లక్షణములను కూడా వీరే యేర్పరచిరి. శత విధానమును గూర్చి "పృచ్ఛకుడు కవి యెఱింగిన పురాణ ప్రసిద్ధమగు కథ నెద్దాని నైనఁదనయిచ్ఛ వచ్చిన దాని గోరవచ్చును. ఒక వస్తువును నూరు పద్యములలో వర్ణింపుమని కాని, యా కథలో నీవర్ణన మెక్కువగా నుండవలెనని కాని చెప్పరాదు. ఈ వృత్తములఁజెప్పవలెనని నియమింపరాదు. కవి కథా సందర్భములోఁదనయిచ్ఛ వచ్చినట్లు వర్ణింప వచ్చును. ప్రసిద్ధములగు పురవర్ణనములు, రాజవర్ణనము మొదలగునవి మహాప్రబంధములలో వలె విశేషించి వర్ణింపరాదు. శైలి సర్వత్ర సమముగా నుండ వలెను. కృత్యాదిని రెండు మూడు మాత్రము ప్రార్థన పద్యములుండవచ్చును. తగుచోట్లఁ బదివచనములఁ కన్న నెక్కుడుగఁజెప్ప జనదు" అని లక్షణములను తెల్పిరి.

### శతప్రాసము

శతప్రాసమునగా ఒకే ప్రాసము వచ్చు నట్లు ఒక ప్రసిద్ధమగు కథను నూరు పాదము లలో చెప్పుట. వేంకట రామకృష్ణకవులు భారత కథను–

"సిరి మన రావు సూర్య నృప శేఖరునింట వసింతుగాత సు
స్థిరముగ ......... అని ప్రారంభించి..........
..............................................నే
నురవుగఁజెప్పుచుంటినని యూహ యొనర్పకుమయ్య భూపురం
దర! బహుధాప్రసంగ వశతన్ వచియింతినట్లు భూపతీ!

### సహస్రావ ధానము

సహస్రావధానము అనునది మరి యొక అవధాన ప్రక్రియ.



డా॥ మేడసాని మోహన్

పృచ్ఛకుండుగగా అవధాని తగిన ఆహార్యమును పాద్యమును తానే కల్పించుకొని వేదికపై అప్పటి కప్పుడు వానిని అభినయించును.

## ఇతర అవధానములు

వైద్యము (ఆయుర్వేదము) నకు సంబంధించిన ఆయుర్వేదాష్టావధానమును ఏలూరు శాస్త్రుల్లు భిష్యగత్న శ్రీ కందుకూరి వేంకట సుబ్బారావుగారు అనేక పర్యాయములు గావించిరి. అదే విధముగా శ్రీ పులివర్తి శరభాచారిగారు కూడా గణితాష్టావధానమును నొక నూతన అవధాన ప్రక్రియను గణితమునకు సంబంధించినది పలుతావులందు ప్రదర్శించి విద్వాంసంతులైన రసహృదయులను అలరింపజేసిరి. జగద్విఖ్యాతులు, హరికథా పితామహులు ఆదిభట్ల నారాయణదాసుగారు సంగీతమునకు సంబంధించినది, అభినయమునకు సంబంధించిన అవధానమును గావించెడి వారని తెలియుచున్నది.

## అవధాన ప్రచారము లేకుండుటకు కారణములు

ఆంధ్రదేశమున మాడభూషి వేంకటాచార్యులు గారితో ప్రారంభమయి తిరుపతి వేంకట కవుల నాడు పతాకస్థాయి నందుకొనిన అవధాన విద్య యీనాడు బహుళ ప్రచారమున లేకుండుట కనేక కారణములు కలవు. అందు ప్రధానమైన కారణము రాజాదరణ కాని, ప్రజాదరణ కాని లేకుండుటయే. ఆరు దశాబ్దములకు పూర్వము చాల రాజాస్థానములుండెడివి. సాహితీ ప్రియులైన ప్రభువులు అవధాన విద్య నాదరించి అవధానులను సరసమగు రీతిలో సత్కరించెడివారు. రాజ్యములంతరించుటతో కళాపోషణ తగ్గినది. అవధానులను ఉచిత రీతిని సత్కరించువారు కఱవైరి.

ప్రజలలో కూడ అవధాన విద్య యందు అనాదరము హెచ్చినది. కాని ఒక రాజాస్థానమున శ్రీ తిరుపతి వేంకట కవులు చెప్పినట్లు

"దొమ్మరిసాని యెంతయును దుడ్కు మెయిన్
గడ నెక్కి యాడుపో
ల్కిమ్మతి బల్మికల్మి గడుఁగీర్తికై
యవధానమ్మొంటొన
ర్చుమ్మను ...దవికాక చోద్యముగా
...క ప
త్సమ్మతిగా ... కవితా రసముల్ జవిజూడు
భూవరా!"

వినోదముతో సరస కవితా రసాస్వాద నము చేయుసాధనము ఈ అవధాన విద్య. రానురాను ఈ అవధాన విద్యకు ప్రచారము తగ్గిపోయినది. అవధాన విద్యకు పుట్టినిల్లయిన ఆంధ్రదేశమున "అవధానము" అనగా నేమి? అను దుర్దినములు వచ్చినవి. ఇది చాల శోచనీయమైన విషయము.

## ఆంధ్రుల కళాఖండము

అవధాన విద్య ఆంధ్రజాతికే చెందినది. ఇది ఒక అపూర్వమగు కళ. ఇది కవిలోకమున ఆవేశము పెంచి కవిత్వమును సమయస్ఫూర్తిని, చమత్కారమును, ప్రతిభను వృద్ధి నొందించు విద్య. కవితా శక్తికి కాని, సమయస్ఫూర్తికి గాని లోపములేని ఆంధ్రలోకము ఈ అవధాన విద్యకు మరల చేయూత నిచ్చి ఆంధ్రప్రజానీకమున కవితాసక్తిని పెంపొందించును గాక.

## ప్రభుత్వ కర్తవ్యము

ఈ అవధాన విద్యను ప్రోత్సహించుట నేటి ప్రజా ప్రభుత్వ ప్రథమ కర్తవ్యము. మన తెలుగు విశ్వవిద్యాలయము ద్వారా దీనిని వృద్ధి నందింపవలయును. కవితాసక్తిగల వారికి అవధాన విద్యయందు శిక్షణ నిచ్చుటకై ప్రత్యేక కళాశాలలను ఏర్పాటు చేయుట అత్యంతావశ్యకము. శిథిలమగుచున్న ఈ విద్యకు ప్రభుత్వము ప్రాపునీయనిచో ఆంధ్రుల చరిత్ర, సంస్కృతిలో ఒక శాఖ శుష్కించినట్లగును. దీనిని ప్రోత్సహించిన నాడే సామాన్య ప్రజకు కవిత్వ మర్థమగు శక్తి దాని వలన ప్రాచీన సాహిత్య పరిపోషణము జరుగును. కావున నేటి సమర్థులగు కవులు ప్రభుత్వము కలిసి ఈ అవధానవిద్యను వృద్ధిచేసి దేశాభ్యుదయమునకు తోడ్పడగలరని ఆశించుచున్నాను.

• • •

# తెలుగు సంస్థానాలూ—సాహిత్య పోషణమూ

ప్రొ॥ తూమాటి దొణప్ప

'మణినా వలయం వలయేన మణి
ర్మణినా వలయేన విభాతి కరః
కవినా చ విభు ర్విభువా చ కవిః
కవినా విభునా ప్రతిభాతి సభా'

మణివల్ల కడియమూ, కడియం వల్ల మణీ, మణీకడియం రెండింటివల్లా తొడిగిన చెయ్యీ శోభిస్తాయి. అలాగే కవి మూలంగా ప్రభువూ, ప్రభువు మూలంగా కవీ, కవి ప్రభువు లిద్దరి మూలంగా రసిక జనసభా శోభిస్తాయి. సాహితీ పోషణ **మనున్నది దేశపాలకుల విధులలో ముఖ్యమైనదన్న** విశ్వాసం వేదకాలంనుంచీ **అనూచానంగా** వస్తూ వుందని విమర్శకులు వివరిస్తూ వుంటారు. యుగ యుగాలుగా చక్రవర్తులు, వారి సామంతులు, దేశంలోని యితర శ్రీమంతులు మొదలైన వారి ఆశ్రయాలవాలంలో సాహితీవృక్షం శాఖోపశాఖలుగా విస్తరించి కావ్యపుష్పపరి మళాలను సీమాంతాలదాక వ్యాపింపజేస్తూ వచ్చింది; రాజోపప్లవాదుల వల్ల అప్పు డప్పుడు ఆకులపాటు కలిగినా ఎప్పటి కప్పుడు సరికొత్తగా చిగిర్చి, రెమ్మలెత్తి, కొమ్మలువేసి, ఏపుగా పెరిగి, పూచి, కాచి, ఫలించి, రసికజన స్వాదు ఫలాలను ప్రసాదిస్తూ వచ్చింది. తెలుగు సంస్థానాధీశ్వరులూ, జమీందారులూ ఈ సాహితీ వృక్షానికి తమ కాలంలో యథాశక్తిగా దోహదం చేసి, కావ్య పుష్పసారాన్ని తీసి, రసికలోకంలో కొత్త అత్తరుల ఘుమఘుమల్ని గుభాళింపజేసిన తీరు తెన్నులను ఈ ప్రసంగంలో విహంగావ లోకనం చేద్దాం.

పండువంటి విజయనగర సామ్రాజ్యం అంతరించిపోగా దాని శిథిలాలమీద చిన్న చిన్న సంస్థానాలెన్నో అవతరించాయి. ఇవి ఇంగ్లీషు కుంఫణీపాలన కాలంలో ఎన్నెన్నో పరిణామాలకు లోనై చివరికి జమీందారీ లుగా మార్పొందాయి. 1802 నాటి శాశ్వతకర నిర్ణయంతో కొత్త కొత్త జమీందారీలు, ప్రొప్రయిటరీ యెస్టేటులు అనేకం రూపొందాయి. తెలంగాణంలోని సంస్థానాలు కొన్ని సుల్తానుల కాలంలోనూ, మరికొన్ని నిజాముల హయాములోనూ ఏర్పడ్డాయి. ఆంధ్ర ప్రాంతంలోని జమీందా రీలు నాలుగు పందలకు పైబడి, తెలంగాణం లోని సంస్థానాలు పాతిక పైచిలుకు. వీటిలో సాహితీ పోషణంగావించిన సంస్థానాలు మూటికి దగ్గర దగ్గరగా వుంటాయి. సాగరాం ధ్రంలో అమరావతి, చల్లపల్లి, నరసరావుపేట, నూజివీడు, పిఠాపురం, పెద్దాపురం, బొబ్బిలి, ముక్త్యాల, మునగాల, విజయనగరం సంస్థానాలు, పశ్చిమాంధ్రంలో కార్వేటి నగరం, కాళహస్తి, వెంకటగిరి సంస్థానాలు, తెలంగాణంలో ఆత్మకూరు, గద్వాల, జటప్రోలు, దోమకొండ, వనపర్తి, సురపురం సంస్థానాలు కొన్ని ముఖ్య కేంద్రాలుగా పేర్కొనవచ్చు. విజయనగర ప్రభువుల ముత్యాలశాలలో ముద్దుముచ్చటలు చెల్లించు కున్న ఆంధ్ర సాహిత్య లక్ష్మి అనంతర యుగాలలో ఈ చిన్న చిన్న పాలకుల దివాణాలలో తలదాచుకోవలసి వచ్చింది. చేతికి చిక్కిన చిన్నచిన్న సీమలను జారి పోకుండా జాగ్రత్త పరుచుకోవటంలోనే చాలామంది పాలకుల బతుకులు గడిచి పోయాయి. రాజకీయాల రగడలలోనో, కుటుంబ కలహాల గొడవలలోనో యెడాపెడా నలుగుతూ వున్నందున చాలా మందికి కవితాగానా లకూ, శాస్త్ర చర్చలకూ సాహితీ గోష్టులకూ తీరికి లేకపోయినట్లు గోచరిస్తుంది.

సమరాంగణంలోనూ, సాహితీరంగం లోనూ సవ్యసాచిత్వం నెరపి పై యనిపించు కున్న నన్నెచోడుడు, బుద్ధారెడ్డి, సర్వజ్ఞ సింగభూపాలుడు, కాటయ వేమారెడ్డి, కృష్ణరాయలు, రఘునాథ నాయకుడు - మొదలైన రాజకవులలాగా మన చర్చాయుగంలో కూడా కవి రాజులవంటి రాజకవులెందరో వెలసి వుండట ఒక విశేషం. జటప్రోలు సురభి మాధవరాయలు, బిక్కనవోలు కామినేని యెల్లారెడ్డి, కళింగ విజయనగరం పూసపాటి తుమ్మ భూపాలుడు, గద్వాల ముష్టిపల్లి సోమభూపాలుడు, వనపర్తి అష్టభాషాకవి గోపాలరాయులు, పెద్దాపురం వత్సవాయ బలభద్ర జగపతీ, మొగల్తుర్రు కలిదిండి రామరాజబహద్దరు, బొబ్బిలిరావు రాయడప్ప రంగారావు, సురపురం రాజ మహి రీపామన్నపాలుడు, సంగంవలస రాజా మృత్యుంజయ నిశ్శంక బహద్దరు, పోలవరం కొచ్చర్లకోట కృష్ణారావు, లక్కవరం మంత్రిప్రెగ్గడ భుజంగరావు, నూజివీడు మేకా వెంకటాద్రి అప్పారావు బహద్దరు, దేవిడి కందుకూరి బాలసూర్య ప్రసాదరావు - ఇంకా ఎందరో పాలకులు కృతిభర్తలుగానే కాక, కృతికర్తలుగా పైతం సాహిత్య పౌరోత్యాన్ని సమర్థంగా సరసంగా నిర్వహించారు.

అమరావతి, ఉర్లాం, చల్లపల్లి, పిఠాపురం, విజయనగరం వంటి సంస్థానాలు సంస్కృత విద్యాలయాలను నెలకొల్పటం వల్లనూ, ఉర్లాం, పిఠాపురం, వనపర్తి వంటి సంస్థానాలు యేటేట వేదశాస్త్ర పరీక్షల్ని నిర్వహించి, పండితలోకాన్ని పోషించడం వల్లనూ ఈ సీమలో ఆర్ష ధర్మ విజ్ఞానజ్యోతి ఆరిపోకుండా నిల్చిందని విజ్ఞులు పేర్కొంటూ

వుంటారు. ఉండ్రాజవరం, ఎర్నగూడెం, కపిలేశ్వర పురం, గద్వాల, దోమకొండ, పిఠాపురం, పోలవరం, బొబ్బిలి, ముక్త్యాల, వనపర్తి, విజయనగరం, వుయ్యూరు, వెంకటగిరి మున్నగు సంస్థానాల పాలకులు అచ్చుకూటాలను స్థాపించి, ప్రాచీనార్వాచీన గ్రంథాలను ప్రచురించి భాషోపకారం గావించారు. చల్లపల్లి, పాల్వంచ, పిఠాపురం, వెల్లూరు జమీందారులు సాహితీసేవకులైన యితరులు స్థాపించిన ముద్రణా యంత్రశాలలకు ఆర్థికంగా సాయపడ్డారు. గ్రంథప్రచురణ మండలాలకూ, సాహితీ సంస్థలకూ, సాహితీ పత్రికలకూ, తదితర విద్యా సంస్థలకూ జమీందారులందరూ ఉదారంగా విరాళాలిచ్చి భాషోద్ధరణకు తోడ్పడ్డారు. ఎర్నగూడెం, జయంతిపురం, పోలవరం, లక్కవరం మొదలైన జమీందారులు స్వయంగా సాహిత్య పత్రికలను స్థాపించి, నిపుణంగా నిర్వహించి సాహిత్యాసక్తిని పెంపొందించారు.

ఆస్థానకవి పండితులను పోషించటమేకాక, తెలుగు సీమ నాలుగంచులనించి, ఇరుగుపొరుగు సీమలనించీ తమ ఆస్థానాలకు వచ్చే కవిపండితులతో అవధానాదులూ, శాస్త్రార్థాలూ, సాహితీ చర్చలూ జరిపించి, వార్షికాలు, భూదానాలు, గజారోహణాది సత్కారాలతో వారిని సన్మానించి పాలకులనేకులు పూర్వభారత సంప్రదాయాలను పునరుద్ధరించారు.

అనకాపల్లి, ఉండ్రాజవరం, కపిలేశ్వరపురం, చల్లపల్లి, పిఠాపురం, బొబ్బిలి, వనపర్తి, విజయనగరం, వుయ్యూరు మున్నగు జమీందారులు విశ్వవిద్యాలయాలకు ప్రోఛాన్సలర్లుగానో, వైస్ ఛాన్సలర్లుగానో, సెనేట్, సిండికేటు సభ్యులుగానో వుంటూ విద్యారంగంలో చేసిన విశిష్టమైన సేవను తెలుగులోకం విస్మరించలేదు. రాజకీయ రంగంలోనూ, సాంఘిక సేవాక్షేత్రంలోనూ కొందరు జమీందారులు నిర్వహించిన, నిర్వహిస్తున్న ప్రధాన పాత్ర జగమెరిగిన సత్యం.

ఈ యుగం చివరిదశలో ఆయా సంస్థానాలను పాలించిన వారిలో స్త్రీలు చాలామంది వుండటం ఒకవిశేషం. కవి పండిత పోషణలో, సాహితీ సముద్ధరణలో వీరంతా విశేషాసక్తిని ప్రదర్శించటం - యాదృచ్ఛిక సంఘటనమే అయినా - వింతలలో వింతగా కన్పించకపోదు. అనకాపల్లి జమీందారిణి గోడే చిట్టి జానకయ్యమ్మ గజపతిరావు, ఆత్మకూరు సంస్థాన ప్రభ్విణి సవై రాణి భాగ్యలక్ష్మమ్మదేవి, ఉర్లాం జమీందారిణి కందుకూరి మహాలక్ష్మమ్మ, కోలంకం జమీందారిణి రావు రామయ్యమ్మారావు, గద్వాల మహారాణి ఆదిలక్ష్మీదేవమ్మ, గూటాల జమీందారిణి మన్యం మహాలక్ష్మమ్మ, తుని మహారాణి వత్సవాయ వెంకట సుబద్ర య్యమ్మ జగపతిరావు, పాపన్నపేట సంస్థానాధీశ్వరి రాణి వెంకట లక్ష్మాయమ్మ సర్దేశాయి మొదలైనవారు తను పూర్వులు పోయిన దారిలో నడచి విద్యత్పోషణం గావించిన సాధ్వీమణులు. వీరిలో కొందరు కవయిత్రులుండటం మరోవిశిష్టత. విశాఖపట్టణం గొడేవారి ఆడబడుచు మదిన సుభద్రయ్యమ్మ, మహారాణి గోడే చిట్టి జానకయ్యమ్మ, చెలికాని చెల్లయ్యమ్మ, రాణి వెంకట లక్ష్మాయమ్మ సర్దేశాయి మున్నగువారు సాహిత్య చరిత్రలో మరుగునపడిన మాణిక్యాలు.

ఇక, యీ యుగంలో ప్రవర్తితమైన సాహితీ శాఖలను గూర్చి సంగ్రహంగా పరిశీలిద్దాం. పూర్వ యుగాలలో రూపొందిన సకల సాహిత్య శాఖలూ యీ యుగంలో కన్పిస్తాయి. అచ్చ తెనుగు కావ్యాలు, అనేకార్థక కావ్యాలు, క్షేత్ర మాహాత్మ్యాలు, చారిత్రిక కావ్యాలు, తాత్త్వికరచనలు, నాటకాలు, పురాణాలు, ప్రబంధాలు, యక్షగానాలు, వచనరచనలు, విమర్శక గ్రంథాలు, శతకాలు, తర్క-వ్యాకరణాలంకారజ్యోతిషాది శాస్త్ర రచనలు - ఇంకా ఎన్నో శాఖలు వెలిశాయి.

ములుగు పాపయారాధ్యుల సర్వమధురం, మండపాక పార్వతీశ్వరశాస్త్రి శ్రీకృష్ణాభ్యుదయం అచ్చతెనుగు కావ్యాల్లో పేర్కోదగ్గవి.

అనేకార్థక కావ్యాలలో తిరుమల బుక్కపట్టణం వెంకటాచార్యుల అచలాత్మజాపరిణయం, వనపర్తి చెన్న కృష్ణకవి యాదవభారతీయం, గద్వాలా సోకూరి కాశీపతి సారంగధరీయం, ఓరుగంటి సోమశేఖర కవి రామకృష్ణార్జున రూపనారాయణీయం, మంత్రిప్రెగ్గడ సూర్యప్రకాశ రాయ కవి కృష్ణార్జున చరిత్రం చమత్కార చారువులుగా చెప్పవచ్చు.

ఏనుగు లక్ష్మణకవి రామేశ్వర మాహాత్మ్యం, దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి మహేంద్రవిజయం, కాకరపర్తి కృష్ణకవి ముఖలింగక్షేత్ర మహాత్మ్యం క్షేత్ర మాహాత్మ్య కృతుల్లో చెప్పుకోదగ్గవి.

చారిత్రక కావ్యాల్లో దిట్టకవి నారాయణకవి రంగరాయ చరిత్రం, చత్రాతి లక్ష్మీనరసకవి పద్మనాభయుద్ధం, పరవస్తు వెంకటరంగాచార్యుల నిశ్శంక చరిత్రం, పార్వతీశ్వరశాస్త్రి రాధాకృష్ణ సంవాదం ప్రముఖంగా పరిగణించదగ్గవి.

పురాణాలలో కాణాదం పెద్దన మత్స్యపురాణం, రాజాబహిరి సామన్న పాలుని భార్గవపురాణం, మండ కామేశ్వర కవి కూర్మపురాణం, ముడుంబై అప్పయ్య దీక్షితుల విష్ణు పురాణం, రామ నరసింహకవుల భాగవతపురాణం ప్రసిద్ధ రచనలు

ఈ యుగంలో ప్రబంధాలు పరశ్శతాలుగా రచించబడ్డాయి. సురభి మాధవ రాయల చంద్రికాపరిణయం, కుమార ధూర్జటి ఇందుమతీ పరిణయం, కాణాదం

పెద్దన ముకుందవిలాసం, నక్కలంక వీరభద్రకవి వాసవదత్తా పరిణయం, పూసపాటి విజయరామరాజు విష్ణుభక్తి సుధాకరం, కలి దిండి రామరాజు వరసావిత్రి చరిత్రం, మాడ భూషి నృసింహాచార్యుల నల్లనీనల్లవోల్లాసం, ఓరుగంటి సోము శేఖరకవి ప్రభావతీపరిణయం, శిష్టా వెంకట సుబ్బయ్య హృదయాభిరామం నాజూకు సొగడలు పోయిన నవ్య ప్రబంధా లుగా ఉదాహరించవచ్చు.

యక్షగానాలలో రాయదుర్గం పాల కుడు కర్ణాటకరాయ దళవాయి తిమ్మ భూపాలుని ప్రసన్న వెంకటేశ్వర విజయ **విలాసం, నరుకూరి** నారాయణప్ప **పారిజాత ప్రబంధం,** కాకరపర్తి నృసింహకవి **సంగీత సారంగధరం,** మృత్యుంజయ **నిశ్శంకబహద్దరు** పారిజాతం మేలిమి రచనలుగా పరిగణించవచ్చు.

శతకశాఖలో ఆడిదము సూరకవి, గోగులపాటి కూర్మనాథకవి, తేడ పూసపాటి వీరసరాజు, ముండపాక పార్వతీ శ్వరకవి ప్రసిద్ధులు.

తిట్టు కవితలో జగ్గకవి చంద్రశేఖరా విలాసం, లక్ష్మణకవి గంనద మ్మీయం, పోలిపెద్ది వెంటరాయకవి తిట్ల దండకం, పన్నాల రామబ్రహ్మశాస్త్రుల ఖలకర్ విషాయణం విక్కిరాల రంగాచార్యుల శార్దూల శతకం విశిష్టరచనలు.

తాత్త్వికరచనలలో ఉర్లాం వారి ప్రత్యూష్రబోధం, కురపాంవారి మహా వాక్య రత్నావళి, బొబ్బిలి వారి హిందూ మతం, లక్కవరం వారి తత్త్వ మీమాంసా, విజయ నగరం వారి ఆంధ్రవై శేషికోప స్కారం, వెంకటగిరివారి సర్వమతసార సంగ్రహాదులు ముఖ్యమైనవి.

చారిత్రక విమర్శనలో జటప్రోలు పండితులు వెల్లాల సదాశివశాస్త్రిగారి ఆంధ్ర చరిత్ర విమర్శనం, తుని సంస్థానపండితులు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి పెద్దాపురం సంస్థానచరిత్ర విమర్శనం మేటి రచనలు.

ఇక, నాటకాలమాట విసరించ నక్కర లేదు. సంస్కృతాంగ్ల రచనల అనువాదాలే కాక, స్వతంత్ర రచనలు సైతం వెలిశాయి. తిరుపతి వెంకటకవులు, పసురాయలు, సత్యవోలు కామేశ్వరకవి, రాజా భుజంగరావు, గిడుగు సీతపతి మున్నగువారి ఆంధ్రీకృతులు ఎన్నిక కెక్కినవి. స్వతంత్ర్య రచనలలో గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కం' పుయ్యూరు రాజా వెంకటాద్రి అప్పారావుగారి ఆంధ్ర వరలక్ష్మీ విజయం, గంపలగూడెం జమీందారు కోటగిరి వెంకటకృష్ణారావుగారి నాటకాలు, పిఠాపురం యువరాజావారి నాట కాలు, ముందసా సంస్థానాశ్రితులు జి.సి.వి. శ్రీనివాసాచార్యుల కమలా పహరణం, పోల వరం ఆస్థానకవులు తిరుపతి వెంకటకవుల భారతకథా నాటకాలు, పిఠాపురం ఆశ్రితులు పానుగంటి వారి నాటకాలు, మైలవరం పండితులుమల్లాది అచ్యుతరామశాస్త్రి నాట కాలు ప్రశస్త రచనలుగా భావించవచ్చు.

ఇక, యీ యుగంలోమూర్తికట్టిన సాహిత్యాన్ని ఖరీదు కట్టడం చివరి అంశంగా మిగిలివుంది. విమర్శకులు ఈ యుగాన్ని బహూపపత్తికంగా క్షీణయుగమని పరిగణిం చటం కద్దు. ఈ యుగంలోపాండిత్యపు పదును హెచ్చి, కవిత్వపు కదును తగ్గినమాట మాత్రం వాస్తవం. అంతర్దృష్టి చెదరి, బాహ్య దృష్టి ముదరటమే దీనికి ముఖ్య కారణంగా పేర్కొనవచ్చు. పాశ్చాత్య వాస్తన మూలంగా సాంఘికార్థికాది వ్యవ స్థలలో వచ్చిన మార్పులు సైతం యీ రుచిభేదానికి దోహదం చేశాయ నవచ్చు. రస నిర్భరమైన కవితా వ్యవసాయం కంటె, అవధానవిద్యలూ, ఆశుకవితారీతులూ, సమస్యాపూరణలు సంస్థానపాలకులనూ, వారి ఆస్థాన సభ్యులనూ అమితంగా ఆకర్షించినట్లు కనిపిస్తుంది. ప్రభువును బట్టే కదా పరివారం. సాహిత్య స్రష్టలలో కూడా కళా దృష్టి సన్నగిల్లి శాస్త్ర దృష్టి ప్రబలటం కూడా యీ సాహిత్యం యిలా రూపొందటానికి హేతువుగా నిరూపించ వచ్చు. అంతేకాదు, తర్క కర్కశ బుద్ధులైన శాస్త్ర పండితులు చాలామంది సాహితీరంగంలో ప్రవేశించి, పాలకుల మెరమెచ్చులకోసం, పాండిత్య ప్రకటన కోసం కవిత్వపు గారడీ కసరత్తుల గమ్మత్తులు చెయ్యటంవల్ల ఆకర్షనీయ మూదిక రచనలు అంటే నిరోష్ఠ్య అనేకార్థక సంచసర్గీయ నిర్గద్య చిత్రబంధ శుద్ధాంధ్ర రచనలు అతి వేగంగా అవతరించాయి

ఈ సాహిత్యమంతా నిరుపస్తుండని సహృదయ విమర్శకులెవ్వరూ జోస్యం చెప్పలేదు. దీనిలో చాలపాలు కాలపరీక్షకు ఆగలేకపోవచ్చు. పూర్వ యుగా లలోని యెంతెంత చెత్త కొట్టుకుపోయి, ఉత్తరోత్తర యుగాలలో నికరమైన సరకు ఎంత సరకు నిల్చి మనదాకా వచ్చిందో మనం అంచనా వేస్తూనేవున్నాం. బండ్లకెత్త వలసి నంత చెత్తపోగా, పుత్తముపదార్థం యేచిన్న మెట్టో చేతికందటం మన అనుభవంలోనిదే. ఇందులో ముక్కాలుమువ్వీసం కొట్టుకు పోయి వీసంపాలు నిల్చినా చాలు! 'కతి కవయః కతి కృతయః కతిలుప్తాః కతి చరంతి' అని కదా నీలకంఠ దీక్షితసూక్తి, ఇంతేకాకుండా యీ యుగంలోని సాహిత్యం ఆంధ్ర సృష్టిని ఉన్నతస్థాయికి ఉద్ధరించలేదని మనం నిందించ నక్కర లేదు. ఉన్నతస్థాయి మాట అలావుం చండి; ఉన్నతస్థానంనించి పతనం కాకుండా ఆదుకోవటానికి కొంతలో కొంతయినా తోడ్పడిందని ఒప్పుకోక తప్పదు. అయినా, ఏమాటకామాటే చెప్పు కోవాలి కదా! మెరుగూ తరుగూ యుగ ధర్మం కాబట్టి, సాహితీ కృషిని పోషించి, ప్రోత్సాహించాలనే సనాతన సంప్రదా యాన్ని నిలబెట్టి నందుకైనా మన మీ సంస్థానాధీశ్వరులని ప్రశంసించక తీరదు. సరసులు దోషై కదృక్కులు కాకూడదు కదా! ●

# ఆంధ్రప్రదేశ్
## సంక్షిప్త సమాచారం

| | |
|---|---|
| 1. విస్తీర్ణం | 2,75,068 చ.కిమీ. |
| 2. జిల్లాలు | 23 |
| 3. నివాసిత గ్రామాలు | 2[illegible],379 |
| 4. నగరాలు, పట్టణాలు | 252 |
| 5. జనాభా | 6,63,04,854 |
| 6. షెడ్యూలు కులాల వారు | 79.6 లక్షలు |
| 7. షెడ్యూలు జాతులవారు | 31.76 లక్షలు |
| 8. రెవిన్యూ మండలాలు | 1,104 |
| 9. మండల ప్రజా పరిషత్తులు | 1,091 |
| 10. పంచాయతీలు | 19,580 |
| 11. పార్లమెంటు సభ్యులు (లోక్‌సభ మరియు రాజ్యసభ) | 60 |
| 12. విధానసభ సభ్యులు | 295 |
| 13. విశ్వ విద్యాలయాలు | 13 |

# దళిత సాహిత్యం

ఆచార్య కొలకలూరి ఇనాక్

1. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం తర్వాతే భారతీయ భాషల్లో ఆధునిక సాహిత్యం అవతరించిందని గుర్తిస్తే, నేటి సాహిత్యానికి పోరాటానికి సంబంధం విశదం అవుతుంది. పోనీ సాహిత్యానికి సంఘానికి ఉన్న సంబంధం స్పష్టమవుతుంది. కందుకూరి వీరేశలింగం పంతులు సాహిత్యం, సాంఘిక సంస్కరణలు గమనిస్తే సంఘం-సాహిత్యం సంబంధం తెలుస్తుంది. సాంఘిక సమస్య, సాహిత్య వస్తువు, ఇతివృత్తం కావటం అర్థమవుతుంది.

1.1. నేటి సాహిత్యంలో ప్రధాన సమస్యలు అసమానతా నేపథ్యం నుంచి రూపొందుతున్నాయి. ఈ అసమానతలు ఆర్థిక, సాంఘిక కోణాల నుంచి గోచరమవుతున్నాయి. ఆర్థిక అసమానతలకు భారతదేశంలో ఉత్పత్తి కేంద్రమయిన భూమి చుట్టూ పరిభ్రమించాయి. భూదానోద్యమం, బంజరు భూముల పంపకం, జమిందారీల రద్దు, దున్నేవాడిదే భూమి, భూమి పట్టా, భూ పరిమితి శాసనం స్థాయిలో ఉన్నా సంచలనం ఉంది కాని, సమస్య పరిష్కారం లేదు. భూమి పోరాటం సాహిత్య వస్తువు అయింది.

1.2. సాంఘిక అసమానతలలో స్త్రీలు, దళితులు ప్రధానాంగాలు. స్త్రీ సమస్యకూ పురుష భయానికీ సంబంధం ఉంది. దళిత సమస్యకూ, మనిషి స్వార్థానికీ లంకె ఉంది. భయానికి భగవంతుడు స్వర్గం సహాయపడినట్లుండటం దాని విజృంభణమే. స్వార్థపరుడి శక్తి యుక్తులు పీడన చుట్టూ పరివేష్టించి ఉంటాయి. బలవంతుడికి బలహీనుడికి మధ్య సంబంధం పీడనదే! పీడన అలవాటు అయితే దానికి పునాది ఏర్పడటం సహజమే. ఆ పునాదికి వేదం తాపు అయింది. దళితుడు వేదోక్తంగా పీడితుడు. వేదకాలంలో పంచములు లేరనే పండితులు పురుష సూక్తం చూస్తే వాళ్ళెక్కడ ఉద్దేశింపబడ్డారో తెలుస్తుంది. చరిత్ర పొడుగునా మనిషి భయానికీ, స్వార్థానికీ సంకేతాలుగా స్త్రీలు, దళితులు అసమానతలకు సంఘంలో ప్రతినిధులయ్యారు.

1.3. ఈ అసమానతల మీద ఈ యుగంలోనే కొంత ఆలోచన సాగింది. ఈ అసమానతలను అలాగే గుర్తించక పోయినా, కొంత అస్పష్టంగా గుర్తించిన ప్రాచీన సంఘం ప్రాచీన సాహిత్యంలో ఈ వస్తువును గ్రహించక పోలేదు. అయితే అది సాంఘిక నేపథ్యంగా కాక మత నేపథ్యంగా మిగిలిపోయింది. సమస్యను సాంఘిక అసమానతగా భావించిన సాహిత్యం సాహిత్యం ఆధునిక కాలంలోనే రూపొందింది. తెలుగులో కందుకూరి కాలం నుంచి స్త్రీ అసమానతల మీద సమాలోచనం ప్రారంభమయితే, ఉన్నవ మాలపల్లి నుంచి దళితుల అసమానతల మీద ఆలోచనం మొదలయింది. ఇవే మొదళ్ళ కాపు కానీ, వీటి పునాదులు ముందే ఉన్నా, నిర్మాణం కనిపించినంతగా దీని పునాది గోచరం కాదు.

2. సంఘంలోనూ, సాహిత్యం లోనూ, దళితులకు చాలా కాలం నుంచి చాలా పేర్లున్నాయి. ఏ పేరూ పూర్తిగా అన్వయించదు. ఏ పేరూ గౌరవ ప్రదం కాదు. అన్వయించక పోవటానికి కారణం వస్తుతత్వం తెలియక పోవటం. గౌరవ ప్రదం కాకపోవటానికి కారణం అసమానతకు ప్రతీకగా ఉండాలని భావించటం. ఈ రెండు సందర్భాలలో దళితుడి ప్రమేయం లేదు, జోక్యం లేదు, భాగస్వామ్యం లేదు.

2.1. ఆధునికాంధ్ర సాహిత్యంలో కవిత్వం, నాటకం, నవల, కథానిక సృజన ప్రక్రియలు. అవి బహుళ ప్రచారం పొందుతున్నాయి. అసమానతల మధ్య నలిగే దళితుడి సమాన తాపత్రయం వీటి ముఖంగా అభివ్యక్త [illegible] సమస్య స్వరూపం, [illegible] రూపొం[illegible], [illegible] వింగడించటానికి [illegible] కాకపోయినా ప్రక్రియా నేపథ్యమే, విభజన విధానంలో స్వీకరించక తప్పదు.

2.2. దళితుడి జీవితం ఉన్నది

ఉన్నట్లుగా చిత్రించే సాహిత్యం ఉంది. ఇది దళితుడి ఉనికిని,సమస్య ఉనికిని గుర్తించిన సాహిత్యం అవుతుంది. దళితుడి వృత్తి నేపథ్యం నుంచి రూపొందే సాహిత్యం ఉంది. ఇది శ్రమ స్వరూపాన్ని పీడన స్వభావాన్ని వ్యక్తం చేస్తుంది. హరిజనుణ్ణి కాపాడాలి, ఉద్ధరించాలి అనే ధోరణిలో సాగే సాహిత్యం ఉంది. అందులో సంస్కరణ హృదయం, ఉదారవాదం దాగి ఉన్నాయి. హరిజనుడి ఆవేదన, ఆత్మీయత అభివ్యక్తం చేసే సాహిత్యం ఉంది. అది అసలు జీవితం దర్శించే మార్గంలో ఉంది. హరిజనుడు సమానతా ప్రయత్నంలో తిరుగుబాటు వాదిగా, విప్లవ వాదిగా గోచరమయ్యే సాహిత్యం ఉంది. ఇది సమస్య అసలు స్వరూపం గుర్తించే విధానాలతో రూపొందుతూ ఉంది.

3. దళితులకు ఉన్న ప్రమాదం అంటరాని తనం వల్ల వచ్చింది. అది సంక్రమించటానికి చారిత్రక కారణాలు ఎలా ఉన్నా, అది స్థిరమయింది. అంటరానితనం తప్పు అని, ప్రమాదమని, అన్యాయమని, అసహజమని, అధర్మమని ఎన్ని గొంతులు కొండెక్కి కూసినా శబ్ద బ్రహ్మలో చలనమే లేదు. చట్టాలు చేసినా, శిక్షలు వేసినా, కోర్టుల కీడ్చినా మాయమయినట్లు కనబడి మళ్ళీ మళ్ళీ ప్రత్యక్షం కావటం పునర్జన్మ పుణ్యం. అంటరాని తనం ఎప్పుడు పుట్టిందో తేల్చి చెప్పటం కుదరదుకానీ, ఒకటిన్నర సహస్రాబ్దాల నుంచి ఉంది.

3.1. దీన్ని రూపుమాపాలని చరిత్ర పొడుగునా సంస్కర్తలు, మేధావులు, భక్తులు, కవులు–చాలా మంది ప్రయత్నించారు. ఫలితం లేదు. ఈ అంటరానితనం హిందూమత మంత విశాలం. అంటరాని తనం అడుగంటటం లేదు సరికదా రూపాంతరంలో, భంగ్యంతరంగా విజృంభిస్తూనే ఉంది.

3.2. అంటరానితనం వల్ల మిగతా హిందువులతో కలిసి పనిచేసే సమూహ శ్రమ జీవనం దళితులకు లేకపోయింది. దళితులకు శ్రమ విభజనంలో పంచి ఇచ్చిన వృత్తులు రోజుకు తగినంతా లేక, సంవత్సరం పొడుగునా లేక, మరో వృత్తి చేయటానికి లేక, చేసే పనిలేక, ఊరికే కూర్చోవటం వల్ల సోమరితనం అలవడింది. సోమరితనం దారిద్ర్యాన్ని కలిగించింది. దారిద్ర్యం నుంచి దైన్యం వచ్చింది. దైన్యం మరణం కంటే హీనం. దళితుడు హీనుడయ్యాడు. ఈ హైన్యం నుంచి బయటపడటానికి దళితుడు చేసే ప్రయత్నం, కాళ్ళూ చేతులూ నోరుకట్టి, ప్రవాహంలోనికో, తగలబడే ఇంట్లోనికో నెడితే తనుకులాడే వాడి ప్రయత్నం.

3.3. పుణ్యాత్ములు చేసే ఉద్ధరణ కార్యక్రమాల ఫలితాలు పాక్షికంగా, పరోక్షంగా, ఫల శూన్యంగా ఉంటే తనను తాను కాపాడుకోవటానికి దళితుడు పూర్వం నుంచి చేసిన ప్రయత్నం మతనేపథ్యంలోనే గింజుకోవటంగా కన్పిస్తుంది. హిందూ మతం మీది మొదటి తిరుగుబాట్లు బౌద్ధ, జైనమతాలు. అప్పటిలో దళితుడు బౌద్ధ, జైనాలు ఆశ్రయించాడు. ఫలితం అంతగా లేదు. సిక్కు అయ్యాడు. ముస్లిం అయ్యాడు. క్రైస్తవుడయ్యాడు. ఏమైనా దళితుడు అంటరానివాడు గానే ఉన్నాడు. మతాంతరీకరణం తాత్కాలిక ప్రయోజనంగా ఉన్నా, శాశ్వత పరిష్కారంగా లేదు. సాంఘిక అసమానతలను దళితుడు అధిగమించలేక పోయాడు.

4. దళితుడి నేటి స్థితి మూలాలు చరిత్ర సంక్లిష్టాలలో దాగి ఉన్నాయి. దళితుడి పేదరికం నిర్మూలించాలని సాహిత్యం ప్రబోధిస్తూ ఉంది. విద్య ఉండాలని, వైద్యం ఉండాలని, ఆరోగ్యం ఉండాలని, పరిశుభ్రత ఉండాలని ఈ సాహిత్యం ప్రకటిస్తుంది. హరిజనుల వృత్తుల్ని అవమానకరంగా చూడకూడదని ప్రచారం చేస్తుంది. వాళ్ళూ మనుషులే అంటుంది. మనుషులుగా చూడమంటుంది. ఇవన్నీ ఉన్నా, వచ్చినా, అంటరాని తనం పోదని ఈ సాహిత్యానికి తెలియదు.

4.1 వీళ్ళ ఇళ్ళు, ఇళ్ళ స్థలాలు ఒక రచన వాంఛిస్తుంది. కొలను, బావి తాగే నీటి వనరులు కావాలని మరో రచన కోరుతుంది. పొలం ఉండాలని సేద్యం కావాలని ఇంకో రచన చెబుతుంది. మత దృష్టి అతిశయించాలని ఒక నవలాకర్త, ఒక కవి కాంక్షిస్తారు. తిరుగుబాటు చేయాలని కవులు, మేధావులు, రచయితలు ప్రబోధిస్తారు. ఇవన్నీ జరిగినా అస్పృశ్యత పోదని వాళ్ళకూ తెలియదు. కమ్యూనిష్టులైనా, నక్సలైట్లు అయినా, గాంధీ వాదులైనా, జన సంఘీయులైనా, మంత్రులైనా కలెక్టర్లు అయినా హరిజనులు హరిజనులే అనేది గుర్తుండాలి.

4.2. హరిజనులు ఆత్మవిశ్వాసం పెంచుకోవాలని, స్వశక్తి పెంపొందించుకోవాలని, ఐకమత్యంగా పెరగాలని సంఘటిత సమూహశక్తిగా రూపొందించాలని కమ్యూనిష్టు సాహిత్యమార్గం హెచ్చరిస్తుంది. హరిజనుల అనైక్యం పారద్రోలటం మంచిదే. అసలు హిందువుల

అనైక్యం పార్రదోలితే ఇంకా మంచిది. వేదకాలంలోనే భిన్నవర్ణాలుగా చీలిన హిందూజాతి, క్రమ క్రమంగా కులాల వారీగా రోజు రోజుకూ చీలిపోతుంటే, చీలిక దాని జీవిథాతువు అయితే ఐక్యం ఎక్కణ్ణుంచి వస్తుంది? సమష్టిలో లేని సమైక్యం వ్యష్టిలో ఎలా వస్తుంది? అనైక్యానికి ఐక్యం ఎలాపుడుతుంది? అనైక్యం ఉండక పోతే మంచిదే. ఉండక పోవటం ఎలా సాధ్యం?

4.3. నాటకాలలో నవలల్లో కథానికల్లో ఎక్కువగా కులాంతర మతాంతర వివాహాలు హరిజనులు ఎదుర్కొనే అసమానతలు రూపు మాసే పరిష్కార మార్గాలుగా రచయితలు భావించటం కద్దు. సాధారణంగా హరిజనులు బ్రాహ్మణ యువతుల్నే పెళ్ళాడినట్లు వీళ్ళు రచిస్తారు. బ్రాహ్మణ యువకులు హరిజన యువతుల్ని పెళ్ళాడినట్లు వీళ్ళు ఎందుకు వ్రాయటం లేదు? పోనీ రెడ్డి, కమ్మ, రాజు, నాయుడు యువతులో, యువకులో హరిజన యువకుల్నో, యువతుల్నో పెళ్ళాడినట్లు ఎందుకు వ్రాయటం లేదు? సాహిత్యం సంఘానికి ప్రతిబింబం కాబట్టి, సంఘంలో బ్రాహ్మణ యువతులతో, హరిజన యువకుల వివాహాలు జరుగుతున్నాయి కాబట్టి, సాహిత్యంలో ఇలా ప్రతిబింబించిందని చెప్పవచ్చు. సంఘంలో ఇతర కులాల, మతాల మధ్య వివాహాలు జరుగుతూ ఉంటే కూడా వాటికి సాంఘికంగా కాని, సాహిత్యంలో కాని గుర్తింపు లేకపోవటానికి కారణం ఏమిటి? దీనికి కారణం పెళ్ళిళ్ళు చేసుకొనే వాళ్ళ అవసరాలు, పోనీ ఆదర్శాలు కంటే వ్రాసే వాళ్ళ అభిప్రాయాలు ప్రాముఖ్యం సంతరించుకొంటూ ఉండటమే కదా! పోనీ ఈ కులాంతర, మతాంతర వివాహాలు సత్కార్యాలే కాని సంఘంలో వాటి స్థానమేమిటి? వీళ్ళు ఈ అసమానతలను ఎలా దాటగలుగుతున్నారు? బ్రాహ్మణ యువతికి హరిజన యువకుడికి పుట్టిన పిల్లలు హరిజనులుగా గుర్తింపు పొందుతారు. ఈ హరిజనులు మునుపటి హరిజనుల కంటే ఏం మెరుగు? హరిజనుల అసమానతలు ఏం తొలగినట్లు? ఈ కొత్త హరిజనులు కొంత తెలివితేటలు, కొంత చురుకుదనం కలిగి ఉంటే ఉండవచ్చు. కానీ అది సర్వేసర్వత్రా సాధ్యం కాదు. వీళ్ళు పేదవాళ్లు. విద్యావిహీనులు అయితే మాత్రం హరిజనులు కూడా వీళ్ళను అంటరాని వాళ్ళుగా చూస్తారు. చూడటం తప్పు కాదు. వాళ్ళూ హిందువులే! మిగతా హిందువుల కంటే వాళ్ళేం తక్కువ తిన్నారు. సాహిత్యంలో కులాంతర, మతాంతర వివాహాలు ప్రతిఫలించి సమాజగతికి చేసే దోహదం గమనించాలి. పెద్ద మార్పుగా అసమానతలు తొలిగే మార్గంగా గుర్తించటం అదృష్టమే!

4.4. హరిజనులు పొందే సాంఘిక అసమానతల మీద తిరగబడమనే ప్రబోధం సాహితీ ముఖంగా ఉంది. ముఖ్యంగా కవిత్వంలో ఈ కోణం విశదంగా ఉంది. తిరగబడటం ఎక్కడ, ఎలా అన్నది చాలా పెద్ద ప్రశ్న. వర్ణ దృష్టితో దళితుల తీవ్రవిధానం సాధ్యం కాని సమాచారం. వర్గ దృష్టిలో కూడా వీళ్ళకు వర్ణ సమస్య ఉంది. కత్తి పట్టుకోవటం కుదరని వ్యవహారం. కుల నిర్మూలనం పరిమిత పరిధిలో అసాధ్యం. ఈ అసంబద్ధాల మధ్య హరిజనుడి తిరుగుబాటు ఉంటుంది. మతం మారటం పెద్ద సంగతి కాదు. కులం మారటం సాధ్యం కాదు. దళితుడి మార్పు అంతతేలిక కాదు. హరిజనుడు పల్లెలో, పట్టణంలో సాంఘిక, రాజకీయ, మత, ఆర్థిక, ఉద్యోగ రంగాలలో జీతగాడు, కూలివాడు, పనివాడు, సేవకుడు మాత్రమే. పొరపాటున అధికారి, యజమాని, నాయకుడు అయినా అది వేషం మాత్రమే. అది నకిలీ. అసలు నేరు.

4.5. సాహిత్యంలో భిన్న ప్రాంగణాల హరిజన జీవితం, పాత్రలు, పరిస్థితులు, పరిసరాలు, ప్రభావాలు, ప్రాభవం కనిపించటం కద్దు. ఇది అసలుగా కంటే ఆశగా, నిజంగా కంటే కల్పనగా, వాస్తవంగా కంటే ఊహగా గోచరమవుతూ ఉంటుంది. మాలపల్లి, బలిపీఠం, నైమిశారణ్యం, ఇంక్రెడిబుల్ గాడెస్, హరిజన జీవితం పాక్షికంగానే దర్శించాయి. హరిజనాభ్యుదయం, కన్నీటి కబురు, గబ్బిలం, మత్కుణం ప్రతిబింబించిన కావ్యాలు పాక్షిక జీవితమే ప్రదర్శించాయి. పాలేరు, కూలిరాజు, మునివాహనుడు, మాట తప్పకు, నిచ్చనమెట్లు, నిషిద్ధాక్షరి అసంపూర్ణ హరిజన జీవితానికే నాటక రంగంలో దర్పణమయ్యాయి. శ్రీపాద, వేటూరి, చలం కథలు సమగ్ర హరిజన జీవితం చిత్రించటానికి తంటాలు పడటమే కన్పిస్తుంది. తెలుగులో వెలువడ్డ నవలలు, నాటకాలు, కవిత్వం, కథానికలు ఈ సాహిత్యమంతా హరిజన జీవితం అన్నీ అందాలా చిత్రించటానికి ఇంతవరకూ కృషిచేస్తూనే ఉంది. ఫలితం వేచి చూడవలసే ఉంది.

5. ఈ స్థితికి కారణం పరి

కింపవలసే ఉంది. హరిజన సాహిత్యం సృష్టించిన వాళ్ళల్లో హరిజనులూ ఉన్నారు, ఇతరులూ ఉన్నారు. ఇతరుల్లో సానుభూతి, జాలి, దయ, కరుణ, వాత్సల్యం వంటి మంచి దృష్టి ఉండే వాళ్ళు కొంతమంది అయితే, సంప్రదాయ దృష్టి ఉండేవాళ్ళు మరికొందరు. సంప్రదాయవాదులు కూడా హరిజన పాత్ర సృష్టించేసి, సంప్రదాయాన్ని ప్రతిఘటించిన బద్దన్న సేనాని లాంటి వాళ్ళు నాశనమయి పోవటం, వీరవల్లడు లాంటి వాళ్ళు చాలా గొప్ప సమర్థులై ఉండి, యజమానికి గొప్ప సేవకులుగా ఉండటమే చిత్రిస్తారు. మంచి దృష్టే ఉన్న వాళ్ళు విప్లవవీరులు, మత ధీరులుగా అతకని అతుకుల బొంత కుడతారు. లేదంటే అధర్మం, అన్యాయం మీద తిరగబడతారు. కాదంటే మాల మాదిగలంతా సుసంఘటితంగా పీడనను ఎదుర్కోవా లంటాడు. ఇవన్నీ తమ సమాజంలో ఊహించుకొని హరిజన సమాజంలో ప్రతిష్ఠిస్తారు ఈ రచయితలు. వీళ్ళకు ఆశ ఎక్కువ. తరతరాల పీడన వల్ల దళితుల్లో అణగారిపోయిన శక్తుల్ని అంచనా వేయటంలో పొరపాట్లు జరుగుతాయి. ప్రతిఘటించే సామర్థ్యం ఉండే దళితుడు ఎంత వాక్ శక్తో, అంతగా క్రియాశక్తి కాదని అర్థం కావాలి. దళితుల్లో తిరగబడగలవాళ్ళు అతి బాల్యంలో అంతరించి పోతారన్న సత్యం తెలియాలి. సంయమనంతో పోరాడే సామర్థ్యం దాస్యమయి పోతుందని గుర్తించాలి. ప్రతిఘటించే వ్యక్తిత్వం విభిన్న స్థాయిల్లో పరాభవానికి గురవుతుందన్న విజ్ఞత ఉండాలి. అన్నీ ఉన్న వాళ్ళకు సాధ్యమయిన అన్నీ, ఏమీలేని వీళ్ళకు కూడా సాధ్యమవుతాయని భావించటంలో కవుల, రచయితల అత్యాశ కన్పిస్తుంది. అందుకే ఈ జీవితం తెలియని వాళ్ళు రచనలు చేస్తే మంచి మనస్సు గాని, వాళ్ళ స్వార్థం కాని, వాళ్ళ ప్రతీకారం కాని పరోక్షంగా వాళ్ళ అంతర్వాణి ఆరాటం కాని ఉంటుందే తప్ప హరిజన జీవితం ఉండదు.

5.1. ఏ దేశానికి, ఏ కాలానికి, ఏజాతికి ఏ వ్యవస్థకు, ఏసంఘానికి అవసరం అయిన సాహిత్యం క్రమంగా ఆదేశంలో, ఆ కాలంలో, ఆజాతితో ఆ వ్యవస్థలో, ఆ సంఘంలో అవతరించిన సామాన్యుడు సృష్టిస్తాడన్న సత్యం అర్థం చేసుకోవటానికి కష్టం లేకపోతే, హరిజనుడికి అవసరమయిన సాహిత్యం హరిజనుడే సృష్టిస్తాడని తీర్మానించటంలో పేచీ ఉండదు. సాహిత్యంలో వైవిధ్యం దృష్టితో ఈ తీర్మానం అంగీకరింపవచ్చు. ఆ దృష్టితో దళిత సాహిత్యం పరిశీలించటం సాధ్యమే.

5.2. దళితులు, సాహిత్యం చాలా మంచిది సృష్టించారు. ఈ సాహిత్యమంతా ఈ శతాబ్ది సాహిత్యమే. తెలుగులో దళితుల కవిత్వమే ఎక్కువ. కవులంతా ఆరంభంలో క్రైస్తవులయిన దళితులే. మోషీ జాషువా, జోసఫ్, జ్ఞానానందకవి, జాన్, ప్రసన్న, దత్తు, అబ్రహాం. హిందువులుగా ఉన్న దళితులు తర్వాతే రంగప్రవేశం చేశారు. బోయి భీమన్న, ఇనాక్, ఏకాంబరం, నంబూరి దూర్వాస మహర్షి పేర్కొన దగ్గ కవులు. ఎక్కువ మంది నాటకకర్తలు దళితుల్లో లేరు. కానీ మంచి రచనలు చేసినవాళ్ళు బోయి భీమన్న, ఇనాక్, జాన్‌సన్, ఆనందరావు వంటి వాళ్ళు తక్కువ. నవలా, కథానికా సాహిత్యంలో ఈ నత్త రచయితతో పాటు బోయ జంగయ్య వంటి వాళ్ళు పరిమితంగానే ఉన్నారు.

5.3. ఈ రచయితలు చాలా సందర్భాలలో తమ కులం గొప్ప చాటుకోవటం అనిష్టమైన సత్యమే కాని, అది బాహాటంగా లేకపోవటం ఒక అదృష్టం. అయితే వాళ్ళు రెండు విధాలుగా చీలి ఉన్నారు. ఉన్నది ఉన్నట్లుగా ఉంచి అందులోనే అభ్యుదయం కోరేవాళ్ళు ఒక తెగ. వీళ్ళకు హిందూమతం కళంకం లేనిదిగా కనబడుతుంది. ఆర్షమతం వైశిష్ట్యం గోచరమవుతుంది. రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ సద్భావన ఉంటుంది. జన సంఘం ధోరణి ఉంటుంది. 'కుర్వంతు విశ్వమార్యం' అని కూడా కేక పెడతారు. వీళ్ళకు కొంతలో కొంత గాంధీ ఇష్టం. క్రవ విరక్కుండా, పాము చావకుండా, అంటరాని తనం ఉండ కూడదు. హరిజనుడు సుజనుడే, హిందువులు అంటరానితనం పాటించ కూడదంటూ నివాసాలు వేరుగా, దేవాలయాలు వేరుగా అంతా మునుపున్నట్లే ఉండాలనే యథాతథ వాదులు వీళ్ళు.

5.4. వీళ్ళ కంటే భిన్నంగా కమ్యూనిస్టులుగా, విప్లవ ప్రవర్తకులుగా, మార్క్సిస్టులుగా తిరుగుబాటు ధోరణి ప్రదర్శించే వాళ్ళున్నారు. వర్ణ దృష్టి తిరస్కరిస్తారు. వర్గ దృష్టి గుర్తిస్తారు. కులమత రహిత సమాజం కాంక్షిస్తారు. సమాజం సమూలంగా చైతన్యం పొందటం కాంక్షిస్తారు. హిందూమతం ఆటుపోటు లకు, పరీక్షకు, తాకిడికి గురి అయ్యేటట్లు చేస్తారు. వీళ్ళను హిందూ సమాజం, ఆర్య సమాజం తిరస్కరిస్తుంది, ద్వేషిస్తుంది. అయినా పోరాడే స్వభావం పెంచుకొన్న వాళ్ళు వీళ్ళు. ఈ దృక్పథం మత ప్రయోగ

నేపథ్యంగా పకడ్బందీగా రూపొందించిన క్రాంతదర్శి, మహా ప్రవక్త డా॥ అంబేద్కర్ వల్ల కలిగింది. దళిత పాంథర్స్‌కి దృష్టి ఉంది. భారత దేశమంతటా ఉన్న దళిత కవులకీ దృక్పథం ఉంది. ఇది పోరాటం. తిరుగులేని ప్రతిఘటన.

5.5. ఈ రెండు దృక్పథాల సాహిత్యం తెలుగులో దళిత రచయిత కృషిగా అవతరించింది. ఇవి రెండూ రెండు మార్గాలు. ఒకటి గాంధీ మార్గం, శాంతియుతం, యథాతథం, సమన్వయ ప్రయత్నం కలగలిసిన పద్ధతి. మరొకటి అంబేద్కర్ మార్గం. పోరాటమే. మూల మట్టంగా పరిణామం. సమూల చైతన్యం. పైపై పూతలు, పులుముళ్ళు కాదు.

5.6. ఈ రెండు దృక్పథాలలో మొదటి దాని వల్ల పెద్ద మార్పు ఉండదు. అంత ఆశాజనకం కాదు. రెండవది విశేష పరిణామ కారకం. అధికంగా ప్రయోజన కారి. సాహిత్యంలో ఈ రెండు దృక్పథాలూ ఉన్నాయి. దళితుల్లో ఈ రెండు మార్గానుయాయులున్నారు. అందువల్ల ద్వివిధ సాహిత్యం ఆవిర్భవిస్తూ ఉంది. ఇతరులు సృష్టించే సానుభూతి సాహిత్యం కంటే దళితులు సృష్టించే సాహిత్యం ప్రయోజనకారి. దళితుల్లో యథాతథ వాదుల కంటే, ప్రయోగవాదులు ప్రయోజనకర సాహిత్యం సృష్టిస్తారు. ఈ దృక్పథం సంఘంలో అర్థశతాబ్ది నుంచి, సాహిత్యం రెండు దశాబ్దాలనుంచి ఉంది. ఈ దృక్పథ సాహిత్యం విశేషంగా అవతరింపవలసి ఉంది. ఈ పత్ర రచయితకు ఈ మార్గం అభీష్టం. చేసిన పరిశోధన, చేస్తున్న పరిశోధన, చేయిస్తున్న పరిశోధన, చేయిస్తున్న సంశోధన మాత్రమే కాక సృష్టించిన నాల్గుదశాబ్దాల సాహిత్యంలో వచన, కథానిక, నాటకం, కవిత్వం, వ్యాసం, పరిశోధన, విమర్శనం అంతా ఈ ముఖంగానే ఉంది.

6. దళితులు సంఘంలోని అన్ని చీలికలను తనులో అంతర్గతం చేసుకొన్న కారణంగా, కుల, మత, ప్రాంత, రాజకీయ నేపథ్య ప్రభావం వల్ల విభిన్నంగా చీలిపోయి ఉన్నారు. వీళ్ళు చీలి ఉంటే పాలించటం, అధికారం హస్తగతం చేసికొన్న వాళ్ళకు సులభం. ఆ సౌలభ్యం గుర్తించిన రాజకీయ పక్షాలనుంచి చిన్న చిన్న యజమానుల దాకా ఈ కళ్ళను, ఈ వ్రేళ్ళతోనే పొడుస్తారు. ఈ చేతులతో ఈ గొంతులు కోస్తారు. అందువల్ల సంఘంలోని కుళ్ళు, కుత్సితం, కాపట్యం, కౌటిల్యం బాగా తలకెక్కి ఉన్నాయి. వీళ్ళు సమైక్యం కావటం అంత తొందరగా సాధ్యం కాదని అనుభవం చెబుతుంది. అంబేద్కర్ అనుభవించాడు.

6.1. ఈ నేపథ్యం నుండి దళిత సాహిత్యం వెలువడుతుంది. అది భిన్న ప్రక్రియలుగానే కాదు, విభిన్న మార్గాలలో కూడా సాగుతుంది. ఈ విభిన్నత్వం వల్ల ఈ సాహిత్యం వైరుధ్యం కూడా ప్రదర్శిస్తుంది. ఏమైనా దళిత సాహిత్యం నాలుగు రోడ్ల కూడలిలో ఉంది. అభ్యుదయం వైపు ప్రయాణం చేసేట్టు చూడవలసిన బాధ్యత, ఆంధ్ర మేధావి వర్గం మీద ఉంది. అంతకంటే అధికంగా దళితమేధావి నాయక, యువక భవితవ్యం మీద ఉంది. ఉత్తమ దళిత సాహిత్యం ఆవిర్భావానికి రంగం అనుకూలంగా రూపొందుతూ ఉంది. మంచి దళిత సాహిత్యం వెలువడి, సంఘంలోని అసమానతలు తొలగి, సమానత్వం సిద్ధించి, అందరిలో అందరూ కలసి జీవించే మంచి క్షణంకోసం ఎదురు చూడవచ్చు.

6.2. దళిత సమస్య సార్వత్రిక సమస్యగా పరిచయమయ్యే స్థితి లేకపోలేదు. అది విరాట్ విస్తృత సాంఘిక సమస్యలో ఒక చిన్న సమస్యగా గుర్తించటం అవసరం. పెద్ద సమస్య పరిష్కరింపబడితే చిన్న సమస్య తీరిపోతుంది. పెద్ద సమస్య వర్ణ సమస్య. వర్ణాలు, కులాలు అంతరించి పోతే, దళితుల సమస్యా అంతరించి పోతుంది. భారతదేశానికే ప్రత్యేకమయిన కుల సమస్య అంతరిస్తే హరిజన సమస్య ఉండదు. అంతదాకా, అంటరానితనం ఉండకూడదని, హరిజనులూ మనుషు లేనని, వాళ్ళను ముడితే తప్పుకాదని, సహపంక్తి భోజనం మంచిదేనని, బీదతనం పోవాలని, వృత్తి స్వేచ్ఛ ఉండాలని, ఉద్యోగాలు రావాలని, రిజర్వేషన్లు కావాలని, ఆర్థిక స్వాతంత్ర్యం ఉండాలని, రాజకీయ స్వాతంత్ర్యం పటిష్టం కావాలని, అందువల్ల సాంఘిక స్వాతంత్ర్యం వస్తుందని, సాంఘిక అసమానతలు తొలగుతాయని, అందు కోసం సాహిత్యంలో దళితుల ఆరాటం, పోరాటం, కృషి, దీక్ష, వృత్తులు, ప్రతిఘటనలు, ఆవేదనలు, ఆత్మీయతలు, ప్రభుత్వ కృషి, ప్రజల అండదండలు, సహాయం, సహకారం, సానుభూతి, జాలి ఉండే సాహిత్యం మూపే సారస్వతం అవతరిస్తూ ఉంటుంది. ఈ అవతరణ నేపథ్యం నుంచి అభ్యుదయ సోపానం కలిగి ఒక నాటికి కులరహిత, భారత సమాజం దర్శించాలని ఆశించటం కంటే ప్రస్తుతం చేయగలిగింది ఏమీ లేదు.

• • •

# ఆంధ్ర యశస్సు

ఏ రాజు పంచెనో యిచట శౌర్యపుపాయ
సమ్ములు నాగులచవితినాళ్ళ,
ఏ యెఱ్ఱసంజలో నెలమి పల్లవరాజ
రమణులు కాళ్ళఁ బారాణు లిడిరొ,
చిత్రరథస్వామి శ్రీరథోత్సవములో
తెలుఁగు పిల్లలు కత్తిత్రిప్పి రెపుడొ,
ఏ రెండు జాముల యినుని వేడిమి వచ్చి
కలసిపోయెనొ త్రిలింగప్రభువుల;

నా జగచ్ఛ్రేయసంబులై యలరు, తొంటి
వేంగిరాజుల పాదపవిత్రచిహ్న
గర్భితమైన, యీ భూమిఖండమందు
నశ్రువులు జార్చు జీవచ్ఛవాంధ్రజనులు!

ఇఁట వేఁగీశుల పాదచిహ్నములు లేవే! లేవుపో!
భావనాసుప్తమూర్తిత్వమునైనఁ బొందవు, నెదో
పూర్వాహ్ణదుష్కాలపుంఘటికల్
గర్భమునం దిముడ్చుకొనియెం గాబోలు,
నీ పల్లెచో టట లోకాద్భుతదివ్య దర్శనమఁటే
యాభోగ మేలాటిదో!

నీ యతులప్రభావమహనీయత
వేఁగిపురాధిరాజమా, ఆయతధర్మమూర్తులు
మహాత్ములు వారలు బ్రహ్మకోశగోపాయిత
లాంధ్రపల్లవనృపాలుర హుంకృతి
వ్యాఘ్రగర్జగానై యరిలోకభీకరమహాద్భుత
శౌర్యరసాకృతిం జనెన్!

ఈ నా పదార్పితక్షోణి నేరాజు ధ
ర్మాసనం[illegible]ండి సన్నుత్యర మనెనొ,
ఈ నా దృగావృత[illegible] హాములలోన
నే [illegible]ర్యధనులు శిక్షింపఁబడిరొ,

ఈ నా శరీరమం దివతళించిన గాలి
యెంత పారతన్య మేచుకొనెనొ,
ఈ నా తనూపూర్ణమైన యాకాశమ్ము
నే క్రతుధ్వనులు శబ్దించినవియొ;
అస్మదజ్ఞాతపూర్వదివ్యత్వ మొప్పు
నీ పునీతావనీఖండ, మిచట నిలిచి
యస్వతంత్రత దొరలు నాయాంధ్రశక్తి
నన్నుఁ గంపింపఁజేయుచున్నది భృశమ్ము.

వేఁగిరాజ్యపు పల్లెవీథుల చెడుగుళ్ళ
రిపులఁ గవ్వించు నేరుపులు తెలిసి,
ఎగురు గోడిబిళ్ళ సొగసులో రిపుశిర
స్సుల బంతులాడు శిక్షలకు డాసి,
చెఱ్ఱాడి యుప్పు తెచ్చిననాఁడె శాత్రవ
వ్యూహముల్ పగిలించునొఱపు గఱచి,
కోతికొమ్మచ్చిలో కోటగోడల కెగ
బ్రాకి లంఘించు చంక్రమణ మెఱిగి;
తెనుఁగు లంతవ్వె, యవి, నేర్చుకొనియయుందు,
రెన్నగాఁ, దెల్గుతల్లులు మున్ను, శౌర్య
రస మొడిచి యుగ్గుఁబాలతో రంగరించి
బొడ్డుకోయని కూనకే పోయుదురఁట!

శిళహోలెన్ కదలంగలేక, హృదయస్నిగ్ధార్ద్ర
సద్భావనాఖిలచైతన్యుడవై, పురావిదిత
వేంగిపూజ్య సామ్రాజ్య గాథల యోజించుచు,
నాంధ్రపల్లవ నరేంద్ర శ్రీయశస్స్తంభమున్ బలె
నిల్చుంటిన, యీ పవిత్ర ధరణీ భాగంబునం
దీగతిన్ !

ఏ దివ్యపూరుషు, లీ శాద్వలాంకూర
శేఖరమ్ముల లిఖించిరొ, యివెల్ల
ఈ వాయువీచిలో, నే యప్సరస్సమా
జము, నింపిరో గీతిసముదయంబు,

ఏ దివ్యశిల్పు, లీ రోదసీ కుహరాన
వ్రాసిరో, దివ్యశిల్పంబు లిన్ని !
ఈ పథాంతరమునం,దే పురాణమునీంద్ర
సంతతులో ప్రశంసలు పొసగ్రు
ఎటఁ గనిరఁ బూర్వపల్లవ నృపచరితలె
వ్రాయబడి, పాడఁబడి, గీయఁబడి యుపన్య
సింపఁబడి, శ్రోత్రపేయమై చెన్నుదాల్చె
నీ యతీంద్రియశక్తి నా కెట్టు లబ్బె !
ఈ పొలా లెంత చే వెక్కించుకొన్నవో
గుండె వ్రయ్య సముద్రగుప్పు డడలె,
ఈ నేల పావిత్ర మెంత కుంభించెనో
చిత్ర రథస్వామి సేవలు కొనె,
ఇట పల్లవుల రాచయెలనాగ లే వ్రత
మ్ములు చేసిరో లచ్చి నిలుకడపడె,
ఈ కాశ్యపీఖండ మే శరజ్జ్యోత్స్నలో
పులకించెనో, కీర్తి తెలుపు లూరె;
ఇట నెచట త్రవ్వినను బంగరేనట, యది
యెంత శ్రీయొ, యదెంత రాజ్యేందిరమో, వ
దానతనఖాగ్ర పాతనిర్యన్నిదాన
మైన యీ చోట నుపభోగ్యమయ్యె నేడు !
ఈ పొదలం జరించుచు షహీన మహా
మాహిమానుభావమౌనే పురవీతులందొా
చరియించుచునుంటి నటంచుఁ, భారతంత్ర్యా
పతితుండ నయ్యును, పురామహాంధ్రమునన్
స్వతంత్రుడౌ నేపురుషుండనో యనుచు నీ భ్రమ
సత్యముగా తలంచుదున్!
ఏ పల్లవనృపాలుఁ డెత్తిన బావుటా
చాళుక్యనృపుల రాజ్యంబునందు,
ఏ దేశికవిత పాలించిన కవిరాజు
నన్నయ్య వ్యాకరణంబునందు,
ఏ యులిఁజెక్కు నేర్పేలు మహాశిల్పి
గోదావరీ నదీ ఘోషయందు,
ఏ తొంటి తెలుఁగుల యెక్కువాచారమ్ము
బలవన్నృపుల ప్రాభవమ్మునందు

# అద్భుత తేజము

వేఁగిరాజుల సతీవితతికి గురవంపు
నడక నేర్పినది నన్నయ్య రచన
తెనుగుఁ భాషాపద్మమునకుఁ జాలని వన్నెఁ
బట్టించినది కవిబ్రహ్మపలుకు
కంచుడక్కల నోరు గట్టించి జయకేత
నముల నెత్తినది శ్రీనాథు జిహ్వ
ప్రతిలేని యవవర్గ పదవివంకకు రహ
దారి దీసినది పోతన చరిత్ర
విజయనగరాధిపుల భుజావేదికలకు
నందలంబులు మోయు మర్యాద గలపి
తనివిఁగొన్నది మొన్న పెద్దన కవిత్వ
మాంధ్ర భారతి ! నీ తేజ మద్భుతంబు !

– జాషువా

సమసిపోయెనో, ఉన్మత్తసామజంబు
కొలను జొరబడి తమ్మితూడులను పెరికి
వైచుటె యెఱుంగుగాని, తత్పద్మగర్భ
కేసరవిమిశ్రమధురసాగ్రియత గలదె?
ఇమ్ముగఁ గాకుళమ్ము మొదలీవరకుంగల
యాంధ్రపూర్వ రాజ్యమ్ముల పేరు చెప్పిన,
హృదంతర మేలా చలించిపోవు
నార్ద్రమ్మగు చిత్త వృత్తుల పురాభవనిర్ణయమేని
ఎన్ని జన్మమ్ములుగాగ నీ తనువునన్
బ్రవహించునొ యాంధ్రరక్తముల్ !
ఇది వినిపింతునంచు మది నెంచెద మిత్రులకున్,
గళస్థగాద్గదికము, లోచనాంత
బహుధాస్రుతబాష్పనదమ్ము, స్పందనాస్పద
హృదయమ్ము, నా పనికిఁ జాలక చెసెదు, నన్ను
వింతగా నెద వదలించుకొన్న దిది యెక్కడి
పూర్వపు జన్మవాసనో !

– విశ్వనాథ

## 1991 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో జిల్లాల వారీ జనాభా

| | రాష్ట్రము/జిల్లా | జన సంఖ్య | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|---|
| | **ఆంధ్రప్రదేశ్** | **6,63,04,854** | **3,36,23,738** | **3,26,81,116** |
| 1. | శ్రీకాకుళం | 23,14,442 | 11,48,958 | 11,65,484 |
| 2. | విజయనగరం | 21,01,394 | 10,50,673 | 10,50,721 |
| 3. | విశాఖపట్టణం | 32,72,110 | 16,56,305 | 16,15,805 |
| 4. | తూర్పు గోదావరి | 45,41,306 | 22,73,212 | 22,68,094 |
| 5. | పశ్చిమ గోదావరి | 35,13,979 | 17,61,464 | 17,52,515 |
| 6. | క్రిష్ణా | 36,93,179 | 18,77,646 | 18,15,533 |
| 7. | గుంటూరు | 40,85,904 | 20,72,070 | 20,13,834 |
| 8. | ప్రకాశం | 27,50,340 | 13,94,016 | 13,56,324 |
| 9. | నెల్లూరు | 23,90,485 | 12,07,569 | 11,82,916 |
| 10. | చిత్తూరు | 32,49,565 | 16,51,863 | 15,97,702 |
| 11. | కడప | 22,59,154 | 11,54,128 | 11,05,026 |
| 12. | అనంతపురం | 31,83,781 | 16,35,353 | 15,48,428 |
| 13. | కర్నూలు | 29,73,709 | 15,20,640 | 14,53,069 |
| 14. | మహబూబ్‌నగర్ | 30,71,765 | 15,57,216 | 15,14,549 |
| 15. | రంగారెడ్డి | 25,28,208 | 13,04,663 | 12,23,545 |
| 16. | హైదరాబాద్ | 30,91,718 | 16,11,574 | 14,80,144 |
| 17. | మెదక్ | 22,64,124 | 11,47,714 | 11,16,410 |
| 18. | నిజామబాద్ | 20,34,794 | 10,07,723 | 10,27,071 |
| 19. | అదిలాబాద్ | 20,80,231 | 10,50,741 | 10,29,490 |
| 20. | కరీంనగర్ | 30,43,228 | 15,32,048 | 15,11,180 |
| 21. | వరంగల్ | 28,11,174 | 14,32,535 | 13,78,639 |
| 22. | ఖమ్మం | 22,00,081 | 11,22,356 | 10,77,725 |
| 23. | నల్గొండ | 28,50,183 | 14,53,271 | 13,96,912 |

# తెలుగులో భావకవిత్వము

డా॥ ఎన్. నిర్మలా దేవి

ప్రప్రథమ స్వాతంత్ర్య పోరాటం (1857) విఫలమై మన దేశమంతా బ్రిటిష్ రాణి పరిపాలనలోకి రావడంతో పరిపాలనా సౌలభ్యానికి మెకాలే విద్యా ప్రణాళిక రూపొందింది. తత్కారణంగా దేశమంతటా ఆంగ్ల భాషా బోధనకు పాఠశాలలు, కళాశాలలు నెలకొల్పడం జరిగింది. ఆంగ్లేయుల పరిపాలన వల్ల పాశ్చాత్య నాగరికతా సంస్కృతుల, వారి జీవనాదర్శాల సంపర్కం వల్ల ఎన్నో ధార్మిక, సాంఘిక, రాజకీయ, నైతిక సమస్యలు తలెత్తి వాటి ప్రభావం దేశమంతటా పడనారంభించింది. రవాణా సౌకర్యాలేర్పడడం వల్ల, ముద్రణా యంత్రాలు నెలకొల్పబడడం వలన మనిషికీ మనిషికీ మధ్య దూరభారాల అడ్డంకులు తొలగిపోయి తమ తమ భావాభివ్యక్తికి సారస్వత ప్రచార సాధనాలు విరివిగా చేకూరాయి. ప్రధానంగా ఆంగ్ల విద్యాభ్యాస కారణంగా, ఆంగ్ల సాహిత్యాన్ని చదివిన యువకుల హృదయాలు ఆనాడు కాల్పనికోద్యమం పట్ల, వర్డ్స్‌వర్త్, కాల్రిడ్జి, బైరన్, షెల్లీ, కీట్సు మొదలైన కాల్పనిక కవుల రచనల పట్ల ఆకర్షింపబడ్డాయి.

పాశ్చాత్య కాల్పనికోద్యమం 17వ శతాబ్ది ఉత్తరార్థంలో ప్రారంభమైనదని విమర్శకుల అభిప్రాయం. ఆత్మాశ్రయత్వం (**Subjectvity**), భౌతికాతీత ప్రియత్వం (**Love of the Supernatural**), విషాదం (**Melancholy**), ప్రకృతి ప్రీతి (**Love of Nautre**), మానవతా వాదం, ఆడంబర నిరసనం మొదలైనవి ఆంగ్ల కాల్పనికోద్యమ లక్షణాలు.

ఇదే గాక ఆనాటి బ్రహ్మ సమాజ స్థాపకుడు రాజారామ్మోహన రాయల మానవోద్యమం, హైందవ జాతీయోద్యమం, గాంధీ యుగం, రవీంద్ర కవీంద్రుని రచనలు ఆనాటి యువకులపైన ప్రగాఢ ముద్రను వేశాయి. యుగానుకూలమైన భావాభివ్యక్తికి పద్యాలు అనుకూలించకపోవడం చేత మాత్రా ఛందస్సుకు, గద్య రచనకు, వ్యావహారిక భాషా రచనలకు ప్రాధాన్యం లభించనారంభించింది. ఈ విధంగా ఆధునిక యుగంలో కాల్పనికోద్యమం వివిధ భారతీయ భాషా సాహిత్యాలపైన తన ప్రభావాన్ని చూపింది.

పైన పేర్కొన్న కారణాలవల్ల, ఉద్యమాల వలన తెలుగు సాహిత్యంలో కూడా ఆధునిక యుగం 19వ శతాబ్దిలో ప్రారంభమయింది. సంఘ సంస్కర్తగా కందుకూరి వీరేశలింగం గారు ఈ యుగ ప్రవర్తకుడనవచ్చు. 1900లో కట్టమంచి రామలింగారెడ్డి గారి 'ముసలమ్మ మరణం'లో నవ్య కవితా బీజావాపం జరిగిందని కొందరి అభిప్రాయం. అచ్చమైన సాంఘికేతివృత్తంతో స్వతంత్ర కావ్యంగా మొట్టమొదటి తెలుగులో విరచితమైన దిదేనని వలువురి అభిప్రాయం. దీనిని "ఇరవై శతాబ్ద్యారంభంలో మన సారస్వతాకాంశంలో నవ్య కాంతులతో ఆవిర్భవించిన నూత్నాంధ్ర కావ్యం"గా పింగళి లక్ష్మీకాంతం గారు పేర్కొన్నారు. డాక్టరు కొత్తపల్లి వీరభద్రరావు గారు కూడా భావ కవితోద్యమం బాగా ప్రచారానికి రాక ముందే భావకవిత్వానికి మార్గదర్శిగా ఆంగ్ల సాహిత్య ప్రభావంతో వచ్చిన కావ్యంగా చెప్పారు. శ్రీ వాత్సవ గారు కూడా ఈ అభిప్రాయాన్నే వెల్లడించారు.

కాని కురుగంటి సీతారామయ్య గారు నవ్యకవిత్వ లక్షణాలతో కూడుకున్న మొదటి కావ్యంగా రాయప్రోలు వారి 'లలిత'నే పరిగణించాలనీ 'ముసలమ్మ మరణం' అప్పటికే వ్రాసినప్పటికీ 'లలిత', 'తృణకంకణం' కావ్యాల ప్రచురణ తర్వాతనే పాఠకుల దృష్టి దానిపైన పడిందని అన్నారు. వారి దృష్టిలో 'లలిత' నూతనత్వాన్ని మొదట వెలార్చిందనీ దీన్నే నవ్య కవిత్వపు ప్రథమ గ్రంథాల్లో ఒకటిగా భావించవలెనని అభిప్రాయం. అప్పటికి (1909) గురజాడ వారి 'నీలగిరి పాటలు', 'ముత్యాల సరాలు' కూడా ముద్రితము కాలేదుట. 1912లో రాయప్రోలు వారి 'తృణకంకణం' అచ్చయింది. తల్లావఝుల శివశంకర శాస్త్రి గారు ఆధునిక కవిత్వానికి తృణకంకణాన్నే ఆదికావ్యంగా భావించారు. ఈ సాహిత్య యుగానికి రాయప్రోలు సుబ్బారావు, గురజాడ అప్పారావు గార్లు ఆద్యులు, మార్గదర్శకులు అనేది సుస్పష్టం. వీరిద్దరిలో ఎవరు ఆద్యులు అనే విషయం కూడాపై నవ్య కవిత్వ లక్షణాలను ప్రతిఫలించే ప్రథమ కావ్యమేది? అనే అంశాన్ని పురస్కరించుకున్నదే కాబట్టి

అభిప్రాయ భేదాలు కానవస్తాయి. తల్లావఝుల వారి దృష్టిలో 'తృణకంకణం' నోరి నరసింహ శాస్త్రి గారి దృష్టిలో గురజాడ వారి "నీలగిరి పాటలు, ముత్యాల సరాలు" నవ్య సాహిత్యపు తొలి కృతులు.

"అప్పారాయోపజ్ఞకమైన రసగీతాలను రాయప్రోలు సుబ్బారావు గారందుకున్నారని విశ్వనాథ, జల సూత్రం రుక్మిణీ నాథ శాస్త్రి మొదలైనవారు గురజాడ వారే ప్రథములని భావించారని" తెలుపుతూ "కానీ వారు పొరపాటు పడ్డారనీ నవ్య కవిత్వ లక్షణాలు గల రాయప్రోలు వారి "లలిత"యే ప్రథమంగా (1909) ప్రచురితము కనుక దానినే మొదటి దానిగా లెక్కించాల"ని కురుగంటివారి నిష్కర్ష!

ఆధునిక కవిత్వానికి భావకవిత్వమనే పేరు ఏ విధంగా వచ్చిందనేదానికి స్పష్టంగా ఏ ఆధారము కనబడడం లేదు. గిడుగు సీతాపతి గారు గాడిచెర్ల హరి సర్వోత్తమ రావు గారన్నారని అన్నట్లు నవ్యాంధ్ర సాహిత్య వీధుల్లో (142 పుట) పేర్కొనటం జరిగింది. రాయప్రోలు వారు కూడా వారి కవిత్వాన్ని ఈ మాటతోనే నిర్వచించేవారు. వేలూరి శివరామశాస్త్రి, పెనుమర్తి వెంకటరత్నం భావకవిత్వమనే మాటతోనే పత్రికల్లో వ్యాసాలు వ్రాసారుట. ఇప్పటికీ ఇదే పేరు రూఢీ అయిపోయింది. దీనినే తర్వాత రాయప్రోలు 'నవ్య కవిత్వ'మని తమ 'కష్టకమల' కావ్య సూచికలో వాడారు. 'అభినవ కవిత' దీనికి పర్యాయ పదము. వీటిల్లో నవ్య కవిత్వమే సముచితమని శ్రీ నారాయణరెడ్డి గారు తమ పరిశోధనా గ్రంథంలో తెలుపుతూ దానికుపబలకంగా నోరివారి "ఆధునిక కవిత్వమంటే ఇప్పటి వాళ్ళదంతా అవుతుంది. భావ కవిత్వమంటే కథానకాది రూపమైన నవ్య కవిత్వానికి అన్వయించక అవ్యాప్తి దోషం పాలవుతుంది" అనే నిర్వచనాన్ని తెలిపారు. కురుగంటివారు 'నవ్య కవిత్వం', 'నవ్య సాహిత్యం' అనే మాటల్లో ఒక విధమైన అనిర్వచనీయ అనవస్థా, అవ్యాప్తి, అతివ్యాప్తి, అనిష్కృష్టతా వుందేమో అంటాను... భావ కవిత్వమనే మాట కొంతవరకు సమంజసంగా ఉందేమోననిపిస్తుంది." అని "భావం ముఖ్యాంశంగా పెట్టుకునే కవిత్వాన్ని భావకవిత్వమన్నారు. ఇది సమంజసమేగా" అంటారు కృష్ణశాస్త్రి గారు తమ పాతిక వసంతాల తెలుగు కవిత్వమనే వ్యాసంలో దీన్నే "కాల్పనిక కవిత"గా పేర్కొన్నారు. "లిరికల్ పాయెట్రీ"నే భావకవిత్వమంటున్నారనీ, 'శ్యామపర్ణి' భూమికలో తెలిపారు. 'ఊర్వశి' కావ్యంలో 'ఆమె కన్నులు' అనే ఖండికలో 'ఏదియో అపూర్వ మధుర రక్తి స్ఫురియించు గాని, అర్థమ్ము గాని భావగీతమ్ములవి అని 'భావ గీతములు' అనే పదమూ వాడారు. 'భావ కవి' అనే శీర్షికతో ఒక ఖండిక వ్రాసారు. నారాయణరెడ్డి గారు "ఈ నవ్య కవిత్వంలో తాలొత్తాలైన ఉద్యమాలు రెండేనని ఒకటి భావకవిత్వము, రెండు అభ్యుదయ కవిత్వము అని అన్నారు. దాదాపు మూడు దశాబ్దాల పాటు తెలుగు సాహిత్య క్షేత్రాన్ని సుసంపన్నం చేసిందీ భావ కవిత్వపు వెల్లువ.

ఆంగ్ల కాల్పనిక కవిత్వానికున్నట్లే దీనికీ విభిన్న నిర్వచనాలున్నాయి. అందులో ముఖ్యమైనది విశ్వనాథ వారి 'లిరికల్ పాయెట్రీ' అన్న వ్యాసంలో -

"కవి యొక్క ఒక అవిస్పష్ట వాంఛాంకురము, ఒక అంతర్నిగూఢ తాపము, ఒక చిన్న కావ్యములో ఊదబడినచో అది భావకవిత్వ మనవచ్చును" అన్నారు. ఆయనే "ఇంగ్లీషు కవిత్వంలో 'lyrical poetry' పేరుతో చెప్పుకోబడే కవిత్వం యొక్క లక్షణాలు కలిగిన కున సారస్వత భాగాలను తీసి అవి **'lyrical poetry'** అని చెప్పాలి అన్నారు. ఇంకా మృదువైన శబ్దములు కొన్ని చోట్ల కూర్చిన అది 'లిరికల్ పాయెట్రీ' అనవచ్చు. కవి అనుభవమును గూర్చి వ్రాసినది యీ కవిత్వమందురు. కవి తాను వ్రాయుచున్న దానియందు తన్మయీభూతమైనచో అతడు వాడు శబ్దములు పాఠకునికి తన్మయీభవన యోగ్యతా ప్రాప్తిని కలుచేయుననియు ఇట్టి ప్రాప్తి కలిగించు భావము శబ్దమును సమకూడినప్పుడే దానిని భావకవిత్వ మందురనీ విశ్వనాథవారు తెలి పారు.

కవికొండల వెంకట్రావుగారు 'భావము యొక్క కవితాస్వభావము భావకవిత్వము' అనీ, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు 'భావప్రధానమనీ ఒకే అభిప్రాయాన్ని వెల్లడించారు.

శ్రీ శ్రీ నిర్వచనం ప్రకారం "కవి హృదయంలో తటిల్లతలా అప్రయత్నంగా మెరసిపోయిన భావాల అక్షరాకృతి"గా విదితమవుతోంది.

పంచాగ్నుల వారు "ఏదో ఒక భావాన్ని ఆధారం చేసుకొని అల్పావకాశంతో పూర్ణంగా రససిద్ధిని చేకూర్చే యత్నం నవ్యులు చేస్తారని అదే భావ కవిత్వమంటూ" వచించారు.

విశ్వనాథ ఖండ కావ్యాలు భావ ప్రధానాలనీ వాటిలో భావం రసవ్యంజకము కావచ్చునీ కాని ఖండకావ్యాలు

ప్రధానంగా ఒక భావాన్ని ఆశ్రయించే ఉండడం వలన వాటిని భావ కవిత్వాలనవచ్చని తెలిపారు.

ఈ నిర్వచనాలన్నిటివల్ల కావ్యము యొక్క ప్రధానాంగాలైన వస్తు, భావ రచనలలో భావానికే ప్రాధాన్యత నిచ్చి రచించే కవిత్వానికే భావకవిత్వమనే పేరుందనే విషయం స్పష్టమవుతోంది:

కృష్ణశాస్త్రి గారు సాహిత్య రూపాలన్నిటిలో కవిత్మనెుకుక్కవగా ఆత్మాశ్రయమనీ 'అందులో లిరిక్ మరీ' అనీ అంటూ "ఏదో వస్తువో, ఏదో సంఘటనో కవి అంతరంగాన్ని స్పృశించి దానిని ఊపి, ఆవహించి, అతని సొంత అనుభవంగా అయిపోయి అతని విశిష్ట వాణిద్వారా లిరిక్ అయి వెలువడుతుంది. లిరిక్ వ్యక్తపరిచేది హృదయ భావం **(Truth of the emotion)** అని భావకవితను అభివర్ణించారు. ఇది **"Lyric has the function of revealing in terms of pure art, the secrets of the inner life, its hopes its fanlastic joys, its sorrows, its delirium"** అనే నిర్వచనంతో సంవదిస్తోంది. ముందు పేర్కొన్న విశ్వనాథ వారి నిర్వచనం కూడా వీటికి సన్నిహితంగానే వుంది.

కొంతమంది భావకవితలో గానప్రాధాన్యత వుండాలంటారు. కాని కృష్ణశాస్త్రి "లిరిక్ రాగతాళాలతో గేయమే కానక్కరలేదు. పద్యం కావచ్చు. వచనం కూడా కావచ్చు" అని అంటూ రవీంద్రుడు ఒకచోట ఇలా వ్రాసాడు. లిరిక్ లో ఛందస్సు, భావము - కరిగి అలసి ఒకటైపోతాయి. **The expression and the expressed are one.** విడదీస్తే అవి ఒకదానినొకటి మింగే శక్తులు. వాటి సహజ వైరుధ్యాన్ని పోగొట్టి సమన్వయించాలి లేకపోతే తక్కువ రకం కవిత్వం తయారవుతుంది" అని చెప్తూ లిరిక్ లో ప్రతి శబ్దానికీ ప్రత్యేక పరిమళ ముంటుంది. ప్రత్యేక వర్ణముంటుందనీ, ఆ శబ్దానికి పర్యాయపదముండదనీ అది **inevilable word** అక్కడ అది తప్ప వేరొక మాట నప్పదనీ" తెలియపర్చారు.

రాయప్రోలు సుబ్బారావు గారు తన కావ్యాల కన్వయించే లక్షణ గ్రంథంగా రమ్యాలోకాన్ని వ్రాసారు. అందులో -

"కానబడకనుమాన ప్రమాణమునకె
అందియుందని పరతత్వమువల నుంచి
పంచభూత దృశ్యంబైన ప్రకృతి యొకటి
సన్నిహిత లక్ష్యమని యే నచ్చెనేడు"
- అనీ -

"అందునీ విలక్షణ జీవయాత్రకైన
పృథివినే నవ్వులు సమాశ్రయింత్రు భక్తి
తల్లిగా, ధాత్రిగా, దేవతామతల్లి
గా సమస్త పరాపర కార్యములకు" అంటూ భావకవుల ప్రకృత్యుపాసనా లక్షణాన్ని స్పష్టపరిచారు. పూర్వ వాఙ్మయాన్ని మాన్యంగా భావిస్తానే దేశకాల పాత్రానుగుణంగా నాగరిక విజ్ఞానాల ననుసరించి సాహిత్య క్షేత్రంలో నూత్న సస్యాలను పండించి సుభిక్షం కావించాలనేది వీరి ఆశయం.

"మృదుల సరళాక్షరముల సమ్మేళనమున
ఆర్ద్ర నవనీత మార్దవమగును నుడులు
శ్రవణ సుఖమిచ్చు సలలితోచ్చారణమున
భంగిమ యటందురీ బంధ సరణి" అంటూ తన శైలికి శ్రవణ సుఖమే ప్రమాణమంటారు. అనులిన శృంగారంతోను ఓతప్రోతమై వుంటాయి రాయప్రోలు వారి కావ్యాలన్నీ అనే విషయం 'రమ్యాలోకం'లోని పద్యాల వలన విదితమవుతుంది. భావకవిత్వమాత్మాశ్రయమైనది. దీనికి అంతరుఖత్వము ప్రధాన గుణము. కనుక ఈ క్రింది లక్షణాలు అందులో మనకు స్పష్టంగా గోచరిస్తాయి.

1. ఆత్మాశ్రయత కవి చూసిన లేక విన్న ఏ చిన్న సంఘటనకైనా అతని హృదయం కదలిపోయే ఆ ఆత్మానుభూతి కవిత్వ రూపంలో బహిర్గతమవడం.
2. తన సుఖ దుఃఖాలనే సూత్రమూ మురుగుపర్చకుండా వెలిబుచ్చడం.
3. ప్రకృతి వర్ణనలో మనో నేత్రానికి గోచరించే సుకుమార సౌందర్య తత్త్వాన్నభివర్ణించడం.
4. ఆత్మార్పణ గావించుకుని ఆరాధించే తత్త్వాన్ని పెంపొందించుకోవడం
5. స్త్రీని ఉదాత్తంగా భావించి ఆరాధించడం, స్త్రీ పురుషుల బాహ్య సౌందర్యాన్ని గాక ఆత్మ గుణ సౌందర్యాలను వర్ణించడం.
6. దుఃఖంతో కూడా ఆనందాన్ని, అలౌకికా నందాన్ని పొందడం.
7. మానవతా వాదం
8. దార్శనిక దృక్పథాన్ని లవర్చుకోవడం

- మొదలైన లక్షణాలతో కూడిన భావకవితా స్వరూపం.

స్పష్టాస్పష్టంగా మనకిటువంటి భావకవితా లక్షణాలు ప్రాచీన సాహిత్యంలో కూడ కనిపిస్తూనే వుంటాయి - శతకాలలో, మేఘ సందేశాది కావ్యాలలో, పోతన భాగవతం మొదలైన వాటిలో.

ఈ భావకవితను స్థూలంగా (1) ప్రణయ (2) ప్రకృతి (3) భక్తి (4)

దేశభక్తి (5) సంఘ సంస్కరణ (6) స్మృతి కావ్యాలు గా విభజింపవచ్చు.

1. **ప్రణయ కవిత్వం:–** ఆంగ్ల కాల్పనిక కవుల ప్రేమ గీతాలు, సానెట్సు మొదలైనవి చదివిన ఆనాటి యువకవులు ముగ్ధులై ప్రణయ కవిత్వం వైపు ఆకర్షితులై ఊహా ప్రేయసినైనా సృష్టించుకుని ఆమె చుట్టూ కావ్యాలనల్లసాగారు. ఆమె అలభ్యకావడంతో విషాద విరహ గీతాలనాలపించారు. ఆ విషాదం లోనే ఆనందము, అలౌకికమైన ఆనందా న్వేషణ గావించారు - పొందసాగారు. ఇటువంటి కావ్యాలను వ్రాసిన వాళ్ళలో రాయప్రోలు, తల్లావఝుల, నేదుల, నండూరి, అబ్బూరి, దేవులపల్లి మొదలైన కవులు ముఖ్యులు.

2. **ప్రకృతి కవిత :** భావకవులలో ప్రకృతి ప్రీతి, ప్రకతిని ఆరాధించే ప్రధాన లక్షణాలు ప్రాచీన సాహిత్యం నుండే కాక కాల్పనిక కవితా సంప్రదాయాల నుండి కూడా స్వీక రింప బడింది. భావ కవిత్వంలో ప్రకృతి ఒక విశిష్ట స్థానాన్ని సంతరించుకుంది. ప్రకృతి కన్నతల్లి లాగ ఒడిలోకి తీసుకుని బుజ్జగించేదీ, గురువులాగా ఉద్బోధించేదీ, దేవతలా ఆశీర్వదించేదీ, స్నేహితుడిలా హితాన్ని తెలిపేదీ, ఆశ్వాసించేదిగా కనబడుతూ ఆత్మతృప్తికీ, సత్యాన్వే షణకీ ఆధారమైంది. దాన్ని చూసి భౌతికానందాన్ని పొందడమూ తర్వాత అంతర్ముఖుడవడం, ఆత్మా నందాన్ని పొందడం, అందులో తాదాత్మ్యాన్ని భజించడం, భగవద్ద ర్శనానికి దాన్ని ప్రతిబింబంగా భావించుకోవడం మొదలైనవిందులో నిమిడున్నాయి. ఆనాటి నవ్య కవు లందరిలో పై చెప్పిన వాటిల్లో ఏవో కొన్నైనా వాళ్ళ రచనల్లో లేకుండా లేవు. గురజాడ 'నీలగిరి పాటలు', విశ్వనాథ వారి 'కిన్నెరసాని', 'కోకిలమ్మ పెళ్ళి', నేదుల 'దీపావళి' మొదలైనవీ, రాయప్రోలు వారి "తృణకంకణాదులు" వేంకట పార్వ తీశ్వర కవుల 'కవిగీతం', 'ప్రకృతి', దువ్వూరి 'కవి మనోరథం', సింగిరి కాటూర్ల" 'తొలకరి', తుమ్మల, దేవులపల్లి, వెనుమర్తి, దాశరథి, నారాయణరెడ్డి రచనలలో ప్రకృతి ఒక ఉన్నతా సనాన్నలంకరించింది.

**భక్తి కవిత :–** ఆంగ్ల కాల్పనిక కవుల చేత మిస్టిక్ పొయెట్రీగా భావించబడిన ఈ మార్మిక కవిత్వాన్ని మన భావ కవులెందరో అత్యున్నత సథాలకు తీసుకుని పోయారు. వేంకట పార్వతీశకవులు, బసవరాజు, బి.టి.కె. ఆచార్య, కృష్ణశాస్త్రి, పారమాత్మిక కవిత్వాన్నీ, మధురభక్తి కవిత్వాన్నీ వెంకట పార్వతీశ కవుల 'ఏకాంత సేవ' కృష్ణశాస్త్రి 'అన్వేషణ', జంధ్యాల వారి 'ఉదయశ్రీ'లోని 'కరుణామయి', బసవరాజు గీతాలు, నేదుల వారి దీపావళిలోని 'మురళి', విశ్వనాథ 'బ్రహ్మగీతము' మొదలైన వన్నీ ఈకోవకు చెందినవే! తాత్త్విక కవిత్వానికి మృత్యువును ప్రియుడిగా భావించిన ఆంగ్ల కవుల, రవీంద్రుని ప్రభావంతో దువ్వూరివారు 'మృత్యువు' అన్న కండకావ్యం, 'పిచ్చి బికారి'నీ, వేంకట పార్వతీశకవులు విచారలహరిలో కాల సముద్రము' మొదలైనవి రచించారు. పారశీక సాహిత్యంలోని సూఫీతత్త్వ ప్రభా వంతో ఉమర్ ఖయామ్ 'రుబా యీలు మొదలైన వాటిని అను దించి, అనుసరించి మదిరాతత్త్వ కవిత్వం వెలసింది. దువ్వూరి రామిరెడ్డి 'పానశాల', రాయప్రోలు 'మధుకలశం', మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి గారి 'ఉమర్ ఖయ్యాం', రామచంద్ర అప్పారావు గారి అనురుక కావ్యాలు ముఖ్యమైనవి. ఉమర్ ఖయ్యాంస్ ఆదిభట్ల నారాయణదాసు, మల్లవరపు విశ్వేశ్వ రావు, దేవులపల్లి (హాఫీజ్) గేయ పద్యరూప అనువాదాలు ఈ శాఖకు చెందినవే.

**దేశభక్తి కవిత్వం:–** భారత జాతీయా భిమానాలు రాజారామ్మోహన్ రాయ్ బ్రహ్మోద్యమంతోను, గాంధీ జాతీ యోద్యమంతో ముప్పొంగి దేశభక్తి కవిత్వానికి ప్రేరణ లయ్యాయి. ముమ్మందుగా చిలకమర్తి లక్ష్మీ నర సింహం గారు రాజమండ్రిలో బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసంతో ఉత్తేజాన్ని పొంది వ్రాసి చదివిన "భరత ఖండంబు చక్కని పాడియావు" అనే పద్యం భారత జాతీయోద్యమానికి తెలుగులో మొదటి రచనగా పరిగ ణించ బడు తోంది. గురజాడ, రాయప్రోలు, దువ్వూరి, నేదుల, తుమ్మల, బసవరాజు, కృష్ణశాస్త్రి, కవికొండల, విశ్వనాథ ప్రభృతులు దేశభక్తి, మాతృ దేశాభిమాన పూరితాలయిన గీతాలెన్నో రచించి జాతిలో దేశా భిమాన బీజాలను మొలకెత్తింప జేయసాగారు.

**సంఘ సంస్కరణ కవిత్వం :–** దీనిలో దురాచార నిరసనానికి గురజాడ వారి 'పూర్ణమ్మ', మంగిపూడి వేంకటశర్మ 'బాల వితంతు విలాసం' 'అబలా విలాపం, రాయప్రోలు

'స్నేహలత', కృష్ణశాస్త్రి గారి 'బ్రహ్మ సమాజ గీతాలు' చలం, మొక్కపాటి రామ్మూర్తి గార్ల గేయాలు మొదలైనవి ప్రతిబింబాలు.

సంఘ వ్యవస్థా నిరసనం:- త్రిపురనేని రామస్వామి చౌదరి గారి 'గాంధీయ దృక్పథంలో విశ్వ మానవ జీవకారుణ్యాలకు, సింగలి కాటూర్ల 'సౌందర నందం', అస్పృశ్యతా నివారణానికి గురజాడ వారి 'లవణరాజుకల', కృష్ణశాస్త్రి 'శిథిలాలయం', కాటూరి వారి 'గుడిగంటలు', గరమెళ్ళ సత్యనారాయణ గారి గీతాలు సంఘ సంస్కరణ కోవకు చెందినవే!

**సంస్మృతి – సంస్తుతి కవిత్వం:-** ఆంగ్ల కవుల ఆత్మాశ్రయ కవిత్వంలో దీనిని 'ఎలిజీ'గా పేర్కొంటారు. మరణించిన వారిని గురించి స్మృతి పరంగా వ్రాసిన వాటినే స్మృతి కావ్యాలుగా పరిగణించే వీలుందని నారాయణరెడ్డి గారి అభిప్రాయం. దీనిలో దేశనాయక స్మృతి, సతీ స్మృతి, సుతాదిక స్మృతి, ఆప్తస్మృతి మొదలైన అంతర విభేదాలను కూడా వారే పేర్కొన్నారు. నాయని సుబ్బారావు, దేవులపల్లి, విశ్వనాథ, దువ్వూరి, బాలాంత్రపు వెంకటరావు, బసవరాజు, పెనుమర్తి, అబ్బూరి గార్ల స్మృతి కావ్యాలు ఈ శాఖకు చెందినవి. మహనీయుల గుణగణాదులను స్తుతిస్తూ రచించిన స్మృతి గీతాలు సంస్తుతి కావ్యాలుగా పేర్కొనవచ్చు. కృష్ణశాస్త్రి గారు గాంధీమీద, రఘుపతి వేంకటరత్నం నాయుడి మీద, వ్రాసినవీ, బసవరాజు గాంధీజీ పైన వ్రాసినవీ మొదలైనవీ కోవకు చెందుతాయి.

ఈ విధమైన భావకవిత్వంలో విభిన్న మార్గాలను త్రొక్కి ప్రఖ్యాతి కెక్కిన భావకవుల పేర్లిదివరకే ఆయా సందర్భాలలో పేర్కొనడమయింది. కొనికెళ్ళ వెంకటరత్నం, నండూరి సుబ్బారావు, కవికొండల వెంకట్రావు, దేవులపల్లి మొదలైన వారు స్వచ్ఛంద జానపద గేయాల బాణీలోను, పల్లెయుల జీవితాన్ని గురించీ వ్రాసిన రచనలు ఆంగ్ల కాల్పనిక కవితలోని పాస్టొరల్ పొయెట్రీగా పేర్కొంటున్నారు.

'సాహితీసమితి' అనే పేర ఒక సంస్థ 1919 ప్రాంతంలో శివశంకర శాస్త్రి గారి సభాపతిత్వం క్రింద స్థాపించబడి 'సాహితి', 'సఖి' అనే పత్రికల ద్వారా భావకవుల, నవ్యకవుల రచనల ప్రచారానికెంతైనా దోహదం చేసింది. ఈ సాహితీ సమితి ప్రథమ సభ్యులు చింతా దీక్షితులు, మునిమాణిక్యం, మొక్కపాటి నరసింహశాస్త్రి, శ్రీనివాస శిరోమణి, దేవులపల్లి, వేదుల, కొమాండూరి కృష్ణమాచార్యులు, చామర్తి రాజశేఖరావు, నోరి, తల్లావఝుల మొదలైన భావకవు లందరూ తర్వాత అడవి బాపిరాజు, విశ్వనాథ, వెంకట పార్వతీశకవులు, పెనుమర్తి, జంధ్యాల, మల్లవరపు, ఇంద్రగంటి, పాటిబండ్ల మాధవశర్మ, పిల్లల మర్రి, దిగుమర్తి, నండూరి, తిలక్, బూర్గుల, మేడిపల్లి, నాయని, తుమ్మల మొదలైన వాళ్ళందరూ సభ్యులుగా చేరారు. స్థానాపతి రుక్మిణమ్మ, విశ్వ సుందరమ్మ, విశాలాక్షి, బంగారమ్మ, సీతాకుమారి, ఇందుమతీదేవి, సరస్వతీ దేవి, లక్ష్మీకాంతమ్మ వంటి ప్రఖ్యాత కవయిత్రులూ ఈ సాహితీ సమితి సభ్యురాళ్ళే!

ఈ భావకవిత్వం తెలుగునాడులో సుమారు మూడు దశాబ్దాలు సుహోజ్జ్వలంగా విరాజిల్లింది. భావకవితా శాఖలన్నిటినీ చేబట్టి అసమాన ప్రతిభాపాటవాలతో రచనలను సాగించి భావకవిత్వోన్నిక ఉద్యమంగా తెలుగు నాడంతా నడిపిన కీర్తి దేవులపల్లి వారిదే! విశిష్టమైన తనదైన ప్రత్యేక వాణితో, బాణితో, రూపురేఖలతో నాటి యువకవు లందరిపైనా తిరుగు లేని ప్రభావాన్ని చూపి భావకవులకు ప్రతినిధిగా పరిగణింపబడిన వారు కృష్ణశాస్త్రి గారు. కృష్ణశాస్త్రి 'కృష్ణపక్షం', నండూరి వారి 'యెంకి పాటలు' నాడు ఆంధ్ర సాహితీ జగత్తులో పెద్ద గాలి దుమారాన్నే రేపాయి. అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు 'నేటి కాలపు కవిత్వం – వాఙ్మయ పరిశిష్ట భాష్యం', అనంత పంతుల రామలింగ స్వామి 'శుక్లపక్షం' అనే గ్రంథాలు భావకవిత్వాన్ని తీవ్రాతితీవ్రంగా విమర్శించాయి. భావకవుల వేషభాషలను దుయ్యబట్టాయి. ఈ విమర్శనా హేళనలకు కృష్ణశాస్త్రి గురయినంతగా వేరెవ్వరూ కాలేదు. అయినా చలించక భావకవిత్వోన్నిక ఉద్యమంగా నడిపినట్టి మేరునగధీరుడు కృష్ణశాస్త్రి. ఆయన కృషి వలనే నేటికీ ఆత్మానుభూతి ప్రగాఢత, శైలీ సౌకుమార్యం, భావనాలాలిత్యం గల భావకవిత సహృదయ పాఠకుల నలరిస్తూ వారి మన్నన లందుకుంటోంది.

• • •

# తొలి తెలుగు కవి దృష్టిలో సాహిత్య ప్రయోజనం

ప్రొ॥ ముదిగొండ శివప్రసాద్

క్రీస్తు శకం 1994లోని విమర్శకులు సమకాలీన సాంఘిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని ప్రాచీన సాహిత్యంపై మరో చూపు ప్రదర్శించాలని పూనుకోవడం ఒక విచిత్రం.

క్రీ.శ. 1124 లో జీవించిన నన్నయ్య భట్టుకు సాంఘిక సమస్యలు తెలుసా?

సామాజిక స్పృహ ఉందా ?

ధనవంతులంటే కోపమూ, శ్రామిక వర్గం మీద అభిమానం ఉన్నాయా ?

ప్రజల భాషలో, ప్రజల ఛందస్సులలో, ప్రజల కథలను రచించాలనే దృష్టి అలవర్చుకున్నాడా ?

ఇలా వస్తువు, రూపము, కావ్యాదర్శనము వంటి అన్ని వంగాలల్లోను ఆయనను తిరిగి "అంచనా" వేయాలను కుంటున్నారు.

ఆయన అంటే 'నన్నయ్య' అనే కాదు.

నన్నయ్య నుండి విశ్వనాధ వరకు గల ప్రాచీన కవితా మార్గానుయాయులైన కవులందరికీ ఈ ప్రశ్నలు వర్తిసాయి.

అందుకని, ఈ వ్యాసంలో నన్నయ్య గురించి పరిశీలించటం జరిగింది, అంటే, ఈ సమాధానం తదితర కావ్య ప్రబంధ కవులందరికీ అనువర్తింప జేసుకోవచ్చు.

సాహిత్య ప్రయోజనం :

ప్రపంచంలోని ఏ దశంలోనైనా సరే సాహిత్యానికి రెండు ప్రధాన ప్రయోజనాలు నిర్ణయించారు. ఒకటి ఆనందం. రెండు ఉపదేశం.

[illegible] ఆనందాన్ని నిర్వచించటంలోనూ, వ్యాఖ్యానించు కోవటంలోనూ , (Interpretation) (బిన్న భిన్న మార్గాలను అవలంబించిన వారున్నారు.

ఉదాహరణకు ఆనందం అంటే 'ఇంద్రియానందం' అని కొందరి భావన (వరూధిని నిర్వచనం ఇదే కదూ ! ఇదొక చార్వాక నిర్వచనం అనుకుందాం).

వ్యాపారసాహిత్యం, జఘన్య శృంగారము, హింస, నేర ప్రవృత్తులను రేకెత్తించే వాఙ్మయం ఇలా వ్యాపించింది.

అలాగే పై రెండు అంశాలలో ప్రాధాన్యాలు (Preference) నిర్ణయించడంలో కూడా భిన్న అభిప్రాయాలు ఉన్నాయి.

కొందరిది కేవలం రసైక దృష్టి. దీనినే కళా దృష్టి అని శిల్ప దృష్టి అని వర్గీకరించుకోవచ్చు. మరి కొందరిది ప్రబోధాత్మకం. ముందు వేదాంతం తరువాతే సాహిత్యం అనే అతివాద పాశ్చాత్య సాహితీ విమర్శకులు కూడా ఉన్నారు.

వాఙ్మయంలో కొన్ని తాత్కాలికమైన, కొన్ని శాశ్వతమైన ప్రయోజనాలున్నాయి. సామాజిక సమస్యలు అంటే కన్యా శుల్కం, వరకట్నం, నిరుద్యోగం, నిరక్షరాస్యత వంటి అనేకమైన సాంఘిక సమస్యలు ఇవి శాశ్వతాలు కావు. ఈ శతాబ్ద ప్రారంభంలో కన్యాశుల్కం ఉంటే శతాబ్దాంతానికి వరశుల్కం విశ్వరూపం ధరించింది. వీటి మీద సాహిత్యం పుంఖానుపుంఖంగా వస్తూనే ఉంది. ఆర్థికమైన అసమానతలు, అస్పృశ్యత, మద్యపానం వంటివి కూడా ఇలాంటివే. (తన సమకాలీన సమస్యల పై నాటకాలు వ్రాసిన షా, రచలు నేడు చాలా మరుగున పడ్డాయి. షెక్స్పియరుకున్నంత గౌరవం షాకు లేదు)

ఇవికాక కొన్ని శాశ్వత ప్రయోజనాలున్నాయి. ఇవి సార్వకాలికములు, సార్వదేశికములు సర్వమానవ సమాజాలకు అనువర్తితములు. మానవునిలోని దైవాసుర సంపద్వి భాగం భారతం వంటి రచనల బోధిస్తుంది. ప్రేమ, త్యాగము, దయ, దానము, శాంతి విశ్వజనీనమైన దేవీ లక్షణాలను ఉపదేశించడం కూడా సాహిత్య ప్రయోజనమే. మన కవులు భగవత్స్తుతి చేసేవారు. అతడు సర్వ వ్యాపకుడు కాబట్టి 'ఈశావాస్య మితం సర్వం' అనే దృష్టితో విశ్వమానవ కల్యాణాన్ని కాంక్షించడమే దీని పరమార్థం. వివాదాలు చర్మగతమైనవి.

భక్తితో మానవునిలో వచ్చే పరిణామం మానసికమైనది. ఆత్మీయమైనది, దీనినే 'ఉన్మనీదశ' అన్నారు.

స్వాతంత్ర్యానికి ముందు దేశ భక్తి సర్వమత సమభావన వంటివి కూడా ప్రత్యక్షంగాను, పరోక్షంగాను కూడా సాహిత్యం ద్వారా ప్రబోధింప బడ్డాయి. అవి ఆనాటి సామాజికావసరాలను

తీర్చేందుకు వచ్చిన సాహిత్య ఉద్యమాలుగా విమర్శకులు వ్యాఖ్యానించారు.

ప్రాచీన ఆలంకారికుడైన మమ్మటాచార్యుడు ఇలాంటి వన్నీ దృష్టిలో ఉంచుకునే కావచ్చు. సాహిత్య ప్రయోజనాన్ని తరువాతి తరాల వారు మళ్లీ, మళ్లీ ప్రశ్నించకుండా ఉండే నిమిత్తం నిర్వచించారు. "కావ్యం యశస్సును కలిగిస్తుంది. అర్థలాభం కలిగిస్తుంది. అమంగళాన్ని నిర్మూలిస్తుంది. (శివేతరక్షతి) కాంతా సంహితంగా ఉపదేశాన్ని అందిస్తుంది" అని చెప్పారు.

నన్నయభట్టు ఆదికవి. ఆయన తీసుకున్న ఇతివృత్తం ఐదువేల ఏళ్లనాటిది. ఛందస్సు కూడా ప్రాచీనమైనదే కాబట్టి వర్తమాన సమాజంలో ఇట్టి గ్రంథాల అవసరం ఏమిటి ? అని కొందరు ప్రశ్నిస్తున్నారు.

రూపనిరసన : "పద్యం వల్ల ఒక సంస్కృతి ప్రచారం చేయబడుతున్నది కాబట్టి పద్యమే వద్దు" అనే వీరవాదం కూడా ఒకటి మొదలైంది. 'అభ్యుదయ ఆత్మ, వచన కవితా రూపం (Form) పరస్పరం సంబంధం కలవి' కుందుర్తికి (1975, తరంతరం, పీఠిక) ఆ వర్గం వారే కాలదోషం పట్టించి వచన కవిత్వం మధ్య తరగతి మందహాసం అని తిరస్కరించిన స్థితి నేడు (1994)ప్రాప్తించింది. ఇలా రూపం (Form) విషయంలో కూడా So-called అభ్యుదయం కవులు పదేళ్లకొకసారి రంగులు మారుస్తున్నారు. కానీ పదివందల సంవత్సరాల అనర్ఘ సంపద పద్యం మనకు నేటికీ పదిలంగానే ఉంది. కాల ప్రవాహపు ఆటుపోటులను తట్టుకొని నిలవడమంటే ఇదే !!

సాహిత్యాదర్శం : నన్నయ భట్టు తన సాహిత్యా దర్శాన్ని భారతావతారికలో సుస్పష్టంగా తెలియ జేశాడు.

"సారమతింకవీంద్రుడు ప్రసన్న కథా కలితార్థయుక్తి లో
నారసి మేలునాన్ యితరుల క్షర రమ్యత నాదరింప నా
నారు చితార్థ సూక్తినిధి నన్నయ్య భట్టు తెనుంగునన్ మహా
భారత సంహిత రచన బంధురడయ్యె జగద్ధి తంబుగన్"
(26 వ పద్యం)

ఇందులో నన్నయ భట్టు ఉత్తమ జాతి కవిత్వం ఎలా ఉండాలో దాని ప్రయోజనం ఏమిటో కూడా నిర్వచించాడు. కొందరు అక్షర రమ్యతను ఆదరిస్తారు. మరి కొందరు 'లోనారసి మేలు మేలు' అంటారు. మొదటిది శాబ్దికం, రెండవది ఆర్థికం. ఒకే నాణెమునకు బొమ్మ బొరుసు వంటివి. తరువాత సూక్తి నిధిత్వము కూడా తన కవిత్వ లక్షణంగా చెప్పుకున్నాడు. సూక్తి అంటే మంచి మాట, ప్రబోధాత్మకమైనది. మహాభారతము ధర్మ తత్వజ్ఞులు ధర్మ శాస్త్రమని, ఆధ్యాత్మవిదులు వేదాంతమనియు నీతివిచక్షణులు నీతి శాస్త్రంబని కవి వృషభులు మహా కావ్యమని ఇలా ఎవరి దృష్టితో వారు వ్యాఖ్యానం చెప్పు కుంటున్నారు. సారాంశం ఏమంటే "ఇవన్నీ" కూడా మహాభారతంలో ఉన్నాయని నన్నయగారి తాత్పర్యం. సందర్భో చితంగా మహా భారతంలో నన్నయభట్టు స్వర్ణ కంకణంలో మణులను వలె సూక్తులను పొదిగాడు. శకుంతల దుష్యంతునితో ఆది పర్వంలో

"విమల యశోనిధీ, పురుషవృత్త మెరుంగుచు నుండు చువ్వేవే దములును పంచ భూతములు ధర్మువు సంధ్యయు అంతరాత్మ యనా"

అని చెప్పుంది. ఇలాంటివి అసంఖ్యాకాలు. మహాభారతం సూక్తి ముక్తావళి కన్నా భారత గాథయే గొప్ప సూక్తి అనుకోవచ్చు.

జగత్తు కుహితం : నన్నయ భట్టు తన సాహిత్యాదర్శం 'జగద్ధితంబుగన్' అని స్పష్టంగా చెప్పుకున్నాడు. జగత్తు యొక్క హితము. అంటే కేవలం వేంగీ సామ్రాజ్యము యొక్క శ్రేయస్సు మాత్రమే కాదు భారత దేశము యొక్క శ్రేయస్సే కాదు మొత్తము ప్రపంచము యొక్క హితము. 'జగము' అంటే మనుషులే కాదు. పశు పక్ష్యాదులు వృక్షములు పంచ భూతములు అన్నీ వస్తాయి. అంటే పర్యావరణం యొక్క హితం అని కూడా పరోక్షంగా చెప్పుకోవచ్చు. ఋషి వంటి నన్నయ్య రెండవ వాల్మీకి కాబట్టి ఆయనది ఆర్షవాక్కు...

ఈ క్రింది పద్యం కూడా గమనించండి.

"ఎయ్యది హృద్యమపూర్వం
చేయది యద్దాని వినిన ఎరుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణ
మేయది అక్కథయ వినగ నిష్టము మాకున్" (6వ తారిక)

సర్వ సమగ్రము : అపూర్వము అంటే నూతన కథ. వ్యాసుని నాటికి అది నూతనమైన సాంఘిక కథ. కేవల కల్పనా కథలు కృత్రిమ వృతములు కాబట్టి భారతం నవనవోన్మేష శాలిని అయినా ఒక సామాజిక కథయే. కథ అపూర్వంగానే కాదు హృద్యంగా ఉండాలట. ఇది చాలా మంచి మాట. సమగ్రత అంటే శారీరకావసరములు మానసిక తృప్తి సాంస్కృతిక విజ్ఞానం ఆత్మానందం అన్నీ వస్తాయి. వ్యక్తి యొక్క సంపూర్ణ వికాసాన్నే సమగ్రత అంటారు. వ్యక్తి కుటుంబంతోను, కుటుంబం సమాజంతోనూ తాదాత్మ్యం చెందినప్పుడే సమగ్రత సిద్ధిస్తుంది.

అఘునిబర్హణ : తరువాత 'అఘునిబర్హణము' అనే మాట ఉంది. అఘము అంటే పాపము. దానిని తొలగించేది ఉత్తమ సాహిత్యము. ఇది ఒక రకంగా మమ్మటాచార్యులు చెప్పిన శివేతర క్షతి వంటిది. పాపము రెండు రకములు ఒకటి మనం చేసేది. రెండు సమాజంలోని వారు చేసేది. మనం పరిశుద్ధులం కావడం మాత్రమే కాదు; వ్యక్తితో పాటు సమష్టి కూడా పాపదూరులు కావాలి. అఘ, అఘు, నిబర్హణం అంటే అది. హింసను తాను చేయడం ఎలా తప్పో ఇతరులు చేస్తే ఉపేక్షించడం కూడా అలాంటి తప్పే. తప్పు సమాజంలో జరుగుతున్నప్పుడు 'దక్షులెవ్వారలుపేక్ష చేతురది వారల చేటగు' అన్నాడు. కవి బ్రహ్మ' !

లఘునిబర్హణానికి ఇలా వ్యాఖ్యానం చెప్పుకోవచ్చు. క్రైస్తవ ధర్మంలో పాపులను దేవుడు క్షమిస్తాడు. అనే దృక్పథం ఎక్కువగా వ్యాప్తిలో ఉంది. మనం క్షమింపవలసినది పాపులనే కాని పాపాన్ని కాదు. ఈ భేదాన్ని గమనించాలి. పాపిని క్షమిస్తే అతడు మళ్లీ అదే పాపం చేయడని నమ్మకం ఏమిటి ? అందుకని 'అఘు నిబర్హణం' అంటే పాప భావనను నిర్మూలించడం అని మన ఆదికవి ప్రవచించాడు.

**తమసోమా :** నన్నయభట్టు, వేదవ్యాసుని ప్రస్తుతిస్తూ 22వ పద్యంలో 'ఘోరసంసార వికార సంతమస విజృంభముబాపి' అన్నాడు. సంసారము అంటే జగత్తు. అంటే జగత్తు మిక్కిలి కష్టతరమైనది. భయంకరమైనది. అనేక వికారములతో కూడుకొని ఉన్నది. ఈ చీకట్ల నుండి వెలుగు నిచ్చునదే ఉత్తమ సాహిత్యం. తమసోమా జ్యోతిర్గమయి అనే ఆర్ష వాక్యం ప్రతిబింబించింది. అంతేకాదు వేద వ్యాసుడు విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు" అని ఈ రచన విశ్వమానవీయ మైనదని పక్కాణించాడు.

**వేద విదుడు :** అవతారికలో 9వ పద్యంలో నన్నయభట్టు యొక్క ప్రశంస ఉంది. నిరంతర జపహోమ తత్పరుడనీ, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడనీ సంహితాభ్యాసుడనీ ప్రశంసింపబడ్డాడు. 'సంహిత' అంటే మూల వేద మంత్రం. వేదవిదుడైన వాడే విశ్వమానవ కళ్యాణాన్ని కాంక్షిస్తాడు. వేదాధ్యయనం వల్ల సత్సంస్కారాలు వానితో సత్సంకల్పాలు కలుగుతాయి. సత్సంకల్పం వల్ల సత్కార్యాలు తద్వారా సత్ఫలితాలు సిద్ధిస్తాయి. అలా లేనప్పుడు, దుష్ట సంస్కారాలు, దుష్ట సంకల్పాలు, దుష్కర్మ, దుష్ఫలితాలు ఒక పరిణామ క్రమంలో వస్తాయి. ఇది ఒక పరుస

కావ్య హేతువులు : కవికి ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము అనేవి కావ్య హేతువులు. నన్నయభట్టు వర్ప్రతిభాభియోగ్యుడట. ఈ విశేషణంలో ప్రతిభను సూచించారు. లోకజ్ఞ అనే మరో విశేషణంలో వ్యుత్పత్తి సూచింపబడింది. బహు గ్రంథ పరిశీలనము, లోక పరిశీలనము కూడా వ్యుత్పత్తి క్రిందికే వస్తుంది. ఉభయ భాషా కావ్య రచనాభిశోభితి అనే మాటలో అభ్యాసాన్ని సూచించారు. ఇలా కావ్య హేతువులు చెప్పబడ్డాయి.

**ఆర్షత్వం :** నన్నయ ఆర్షకవి. అవిరళ జపహోమ తత్పరత్వం వల్ల ఆర్షత్వం నన్నయకు సిద్ధించింది. ఒక కళాకారునికి ఆర్షత్వం ఎందుకు ? వ్యక్తిగత జీవితం వేరు కళ వేరు. "నన్ను చూడకు. నా కవితలు చదువు" అనే వాదం ఒకటి ఇటీవల మొగ్గ తొడిగింది. కలం, కుంచె, ఉలి, పాదం వంటి సాధనాల ద్వారా కళాకారుడు తన జీవితాన్నే ఆ కళా ప్రక్రియలోనికి పరివర్తన చేస్తూ ఉంటాడు. అతని మనస్సు, ప్రాణ శక్తి ఆ కళలో న్యాసం చేయబడుతుంది. అందుకే కళాకారుడు 'సంహితాభ్యాసుడు' 'సుజనుడు' అయి ఉండాలి.

**ఋతం భరము :** నన్నయ భట్టు నిత్య సత్యవచనుడట. ఇది 'ఋతము' అనే ధర్మానికి సూచనే. సత్యమేవ జయతే అనే ముండకోపనిషత్తులోని మంత్రం దీనికి ఆధారం. సత్యమనేది ఒక జీవన ధర్మం కాబట్టి ప్రాచీన కవులు తమ సాహిత్యం ఋతంభరం కావాలని కోరుకున్నారు. ఋతమే అమృతము.

**సౌజన్యం :** తరువాతి పంక్తిలో నన్నయకు 'సుజనుడు' అనే విశేషణం ఉంది. 'దుర్జనుడు' ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించ లేడు. ఎందుకంటే దుర్జనుడు ద్విపాద పశువు. జంతువు సహజాతం వల్ల (Instinct), మానవుడు వివేకం వల్ల, ఋషి సాత్విక చేతన వల్ల పని చేస్తాడు. ఒక వ్యక్తి మానవుడే కాకపోతే ఇక ఋషి ఎలా అవుతాడు. ఋషి కానిదే కవి ఎట్లా అవుతాడు. కాబట్టి మనిషి మనిషిగా మారి ఆర్షత్వంతో కవిత్వం వ్రాయడానికి సౌజన్యం ప్రాతిపదిక. అవిరళ జపహోమ తత్పరత్వం వల్ల నానా పురాణ అధ్యయనం వల్ల సిద్ధిస్తుంది. కాబట్టి పరోక్షంగా నన్నయ భట్టు సాహిత్య ప్రయోజనంతో పాటు ఉత్తమ కవి యొక్క లక్షణం కూడా ఇందులో చెప్పినట్లయ్యింది. 'నన్నయగారి కవిత్వం అందరికీ అర్థం కాదు' అని ఒక వాదం. శ్రీ శ్రీ మహా ప్రస్థానం మాత్రం అందరికీ అర్థం అవుతుందా ? ఏదీ అందరికీ అర్థం కాదు. కవిత్వం ఒక ప్రత్యేక రసవిద్య అర్థం కాదనే దృష్టితోనే నాటి నుండి నేటి వరకూ పౌరాణికులు

భారతాన్ని చదివి వినిపిస్తూ వ్యాఖ్యానాలు కూడా చెప్తూనే ఉన్నారు. కవులు వారి ప్రతిభ వల్ల కాక సమాజంలోని సమకాలీన కుల మత, రాజకీయ, ఉద్యమాల ప్రభావం వల్ల గుర్తింపు పొందే ధోరణినేడు నడుస్తున్నది. తొలి తెలుగు కవిని ఇలాంటి రంగు కళ్లద్దాలకతీతంగా దర్శింపవలసి ఉంటుంది. కాల పరీక్షకు నిలిచి వేలాది సంవత్సరాలు జీవిస్తున్న వ్యాస వాల్మీకి కాళిదాసాదులను శతాబ్దాలుగా బ్రతికిన నన్నయ్యను నాచన్న సోమునని, నేటి ఆర్థిక రాజకీయాల మూల్యాలతో అంచనా (Evaluate) చేయడం మూర్ఖత్వం లేదా ఆత్మ వంచన.

రత్నాలు - రొయ్యలు : 'నన్నయకు సామాజిక స్పృహ ఎంత వరకుంది'? అని కొందరు ప్రశ్నిస్తున్నారు. సామాజిక స్పృహ అంటే వారి దృష్టిలో వర్గ సంఘర్షణ. భారతంలో కూడా ఒక వర్గ సంఘర్షణ ఉంది. పాండవులది ధార్మిక వరం, కౌరవులది దుష్ట వర్గం. భారతం ఈ మంచీ చెడుల మధ్య జరిగిన సంఘర్షణకు అద్దం పట్టింది. లేని వాళ్లంతా సత్పురుషులని ఉన్న వాల్లంతా దుర్మార్గుని కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం కన్న దుర్మార్గం మరొకటి లేదు. నన్నయ కన్యాశుల్కం గురించి వ్రాయలేదు. కాబట్టి నన్నయ కన్న గురజాడ గొప్ప అనడం ఎలా ఉంటుందంటే రత్నాల అంగడికి పోయి ఇక్కడ రొయ్యలు దొరకవు కాబట్టి ఇది పనికిమాలిన దుకాణం అని నిందించినట్లు ఉంటుంది. దేశకాల పరీక్షలకు తట్టుకొని నిలిచినదే ఉదాత్త వస్తువులు శిల్పాలు.

నవ్య సంప్రదాయ వాది నన్నయ్య : వివాద కవుల దాడికి (offense) భయపడి ప్రాచీన సాహిత్యం పై మక్కువ కల విమర్శకులు కొందరు నవ్య సంప్రదాయ వాదం అనే భావాన్ని ఇటీవల defence గా వాడుకున్నారు.

(1) ప్రాచీన రస శిల్ప మూల్యాలు

(2) నవీన సామాజిక సంవేదన కలిస్తే నవ్య సంప్రదాయ వాదం అని వీరి నిర్వచనం.

పోనీయండి వారి సంతృప్తి కోసం మనం ఇలా చూచినప్పటికీ 11వ శతాబ్దంలో క్రొత్తగా తెలుగు అనే చిన్న ప్రాదేశిక భాషలో కవిత్వం వ్రాసిన నన్నయ్య, 12వ శతాబ్దంలో తొలి తెలుగు ప్రజాకవి పాల్కురికి సోమనాథుడు, 13వ శతాబ్దంలో మత సామరస్యం బోధించి హరిహరాద్వైత ప్రతిపాదన చేసిన తిక్కన ఆనాటికే సామాజిక స్పృహకల అతి నవ్య సంప్రదాయ వాదులవుతారు. అలా కాకపోయినా రస దృష్టి, కళా దృష్టి కల మహాకవుల కోవకు చెందిన నన్నయ్య చిరంతన సాహిత్యాన్ని సృష్టించిన ఆది కవి.

ధర్మ తత్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని :

భారతము ఇతి హాసము. ఇది ధర్మ ప్రధానమైన గ్రంథం ధర్మం వేరు మతం వేరు. వాల్మీకి నన్నయలు ధార్మిక కవులు. పాల్కురికి అన్నమయ్యలు మత కవులు. దైవ కవులు. నేడు హిందీలో ధర్మం - మతం - సమానార్థకాలుగా వాడబడు తున్నాయి. ఇది చాలా పెద్ద తప్పు స్మృతులననుసరించి నీతి మారుతుంది. మతాలు కూడా భారతీయులందరికీ ఒకటిగానే ఉండవు. మతాలు కూడా భారతీయులందరికీ ఒకటిగానే ఉండవు.

నన్నయ్య ఆర్షకవి !! ఋషులు ధర్మాన్ని ప్రబోధిస్తారు. ఆర్ష కవులు రసాన్ని ప్రధానంగా చేసుకొని ధర్మాన్ని కూడా ప్రబోధిస్తారు. వసు చరిత్ర కావ్యం ! శుద్ధ కావ్యానికి రసానందం పరమ ప్రయోజనం కావచ్చునేమో కాని (మను చరిత్రాదులు కొన్ని మళ్లీ అపవాదాలు), నన్నయ భారతం ఇతిహాసం.

ఆర్ష కవులు ధర్మానికి రసానికి కూడా సమప్రాధాన్యాన్ని ఇస్తారు.

## అథో జ్ఞాపికలు

(1) "ఫిలాసఫీ ఫస్ట్ అండ్ పొయిట్రీ నెక్స్ట్" బ్రౌనింగ్.

(2) కోవెల సంపత్కుమారాచార్య. (సవిత-చేత నావర్తం కథకులు)

(3) "కావ్యం యశసే ఽర్థ కృతే వ్యవహార విదేశివేతరక్షతయే సద్యః పర నిర్వృతయే కాంతా సమ్మితతయా ఉపదేశయుజే" మమ్మటాచార్యులు - కావ్య ప్రవేశము.
"ధర్మార్థ కామ మోక్షే షు వై చక్షణ్యం కళాసుచ
కరోతి కీర్తిం ప్రీతించ సాధు కావ్య నిషేవణమ్" భామహుడు
(కావ్యాలంకార సంగ్రహము)
ఆర్మ, అర్థ కామమోక్షములందును కళలందును విచక్షణత్వము, కీర్తి, ప్రీతి, కావ్యము కలిగించును.

(4) 'ప్రదీప్త కీలా ప్రవాళమాలా ప్రచండవేలా ప్రసారములలో మిహిరవాజితతిమణ పథమూర్ద్యుతి పుడమికినేడే పుట్టిన రోజులు (జ్వాలా తోరణం - శ్రీ శ్రీ)

(5)

| కావ్య శరీరము వ్యక్తి | | సమిష్టి | త్రిపురములు |
|---|---|---|---|
| శబ్దము | శరీరము | దేహము | స్థూల శరీరము |
| అర్థము | ప్రాణము | విరాట్ | |
| రసము | మనస్సు | సంస్కృతి | సూక్ష్మ శరీరము |
| ఉపదేశము | విజ్ఞానము | ధర్మము | |
| ధ్వని | ఆనందము | చిదాత్మ | కారణ శరీరము |

# పద్య కవిత

డా॥ నందూరి రామకృష్ణమాచార్య

పూర్వాంభోనిధి కాళహస్తి నగర శ్రీ హస్మహేంద్రాచలః
శ్రీశైల ప్రముఖ త్రిలింగ శిఖర ప్రాతర్నవోషస్వినీ
కృష్ణా కంకణ కంకణీ ఘణఘణద్ గోదావరీ
కాంబికా
ద్రాక్షాపేశల వాఙ్మయీ - విజయతాం - త్రైలింగ
ధాత్ర స్థలీ

## ఎల్లలు

ప్రాచీన కాలంలో ఆంధ్ర దేశానికి ఎల్లలు తూర్పున సముద్రం, భౌగోళికంగా ప్రతిదినం దక్షిణాపథంలో తొలి ఉషస్సులు తెలుగు గడ్డపై వెల్లి విరుస్తాయి. జాషువా కవి వర్ణించినట్లు

"ఇటు జానా అటు సింహళమ్ము వరకున్" వ్యాపించింది చరిత్రలో తెలుగు వెలుగు. అనాధుని కాలంలో ఉత్తరాన.

"చీకటియున్ చిల్క సముద్రము" వరకు తెలుగు పలుకుబడి విస్తరించి ఉంది. నేడు గూడ ఒరిస్సాలోను కర్ణాటకంలోని బల్లారి కోలారు ప్రాంతాలలో మధ్య ప్రదేశ్‌లోని బస్తరు మున్నగు చోట్ల తెలుగు మాతృ భాషగా గలవారు అసంఖ్యాకులు. చరిత్రలో ఒకనాడు తంజావూరు - పుదుక్కోట - మధుర మున్నగు పట్టణాలు ఆంధ్ర సంస్కృతికి కేంద్ర గరిమనాభులుగా వెలుగొందాయి. నేడు మారిషను, బర్మా, ఫిజి మున్నగు దేశాలలోనే గాక యావత్ భూగోళంలో తెలుగు సంతతి వారు ఉన్నారు. సంఖ్యా బలంలో హిందీ మాట్లాడే వారి తరువాత నేటి భారత దేశంలో తెలుగు మాటాడే వారు ద్వితీయ స్థానంలో ఉన్నారు.

తెలుగు - తెనుగు ఆంధ్ర శబ్దాలు భాషా పరంగా, జాతి పరంగా పర్యాయ పదాలే. "తెన్" అనే శబ్దానికి ప్రాచీన ద్రవిడ భాషలో "దక్షిణం' అని అర్థం. ఆ అర్థంలో నేటికీ - తెంకాయ - తెమ్మెర శబ్దాలు ప్రచారంలో ఉన్నాయి. భారత దేశంలో భౌగోళికంగా ఆంధ్రులు - అటు ఔత్తరాకులకు దక్షిణమున, ఇటు దాక్షిణాత్రికులకు ఉత్తరమున (వడగరులుగ) ఉన్నారు. ఓ తెలుగు తల్లీ.

ఔత్తరాహ రసార్ద్ర హృదయం
దాక్షిణాత్య విరస్థమేధా
తవశుభ గళే తరళ మంగళ
సూత్ర యుగళ దళే"

అని ఆంధ్ర కవి అభివర్ణన. తెలుగు తల్లి మంగళ సూత్రానికి ఔత్తరాహుల రసార్ద్ర హృదయం - దాక్షిణాత్యుల మెదడు "రెండు దేహాలు". ఆంధ్రుల వ్యక్తిత్వంలో మెదడు, హృదయం సంగమించినట్లే ఆంధ్ర భాషలో సంస్కృత శబ్దాలు తెలుగు పదాలు అల్లి బిల్లిగా కలిసి పోయాయి. చరిత్రలో సాంస్కృతికముగ ఆంధ్రుడు సమన్వయ వేదాంతి.

"దేశ భాషలందు తెలుగు లెస్స"

'సాహితీ సమరాంగణ సార్వభౌమ బిరుదాంకితుడైన శ్రీకృష్ణ దేవరాయలు బహుభాషా కోవిదులతో క్రిక్కిరిసిన కొలువు కూటంలో "దేశ భాషలందు తెలుగు లెస్స" అని చాటి చెప్పాడు. ఆముక్త మాల్యదలో శ్రీకృష్ణ దేవరాయలు వ్రాసిన పద్యంలోని మాట అది. అంతకు నూరు సంవత్సరాలకు ముందే - క్రీడాభిరామంలో వినుకొండ వల్లభామాత్యుడు దేశ భాషలందు తెలుగు లెస్స - అన్నాడు. వారు ఉభయులు ఆ మాట తాము చెప్పినట్లుగా గాక - అది ఆనాటికే సుప్రసిద్ధమైన సుభాషితంగా ఉదాహరించారు. అలనాటి మాటకేమి, ఆధునిక తమిళ వాఙ్మయంలో నవయుగ కవి వైతాళికుడుగా పేరు కెక్కిన సుబ్రహ్మణ్య భారతి సయితం భాంగ్యంతరంగా 'దేశ భాషలందు తెలుగు లెస్స' అని చెప్పాడు.

తమిళ సింధులహరి - తరసి వెన్నెల రేయి
పడక మీద - తెలుగు పాట పాడి
మరులు గొలుప వలెను - మళయాళ మది దాక్షి
కలలో గనెను తమిల కవి వరుండు

ప్రపంచ చరిత్రలో - తెలుగు కవులకు జరిగిన మన్నన, మర్యాద సత్కారాలు మరి ఏ భాషా కవికి జరుగ లేదు. తెలుగ కవి రాజ రాజులకు 'అనురక్తుడు', మహారాజులకు మామగారు, మహామంత్రి,

సేనాపతులకు ఆప్త మిత్రుడు, తెలుగు కవులకు సహృదయులు, కస్తూర తాంబూలాలలో, కస్తూరికా ప్రదానాలతో ముత్యాల శాలలతో కనకాభిషేకాలతో, అగ్రహారాలతో, రత్నాంబరాలతో సత్కరించారు. ఎదురైనచో మదకరీంద్రము డిగ్గి కేలూత యొసగిన రాజులు వున్నారు. గండిపెండేరాలు ఒసగిన జ్ఞాతి పతులు ఉన్నారు. హేమ పాత్రాన్నములు పెట్టిన వారు ఉన్నారు.

ఆంధ్ర దేశంలోని నదులు గోదావరి, కృష్ణ, తుంగభద్ర పినాకిని మొదలైన నదులలో ప్రవహించేది నీరు మాత్రమే గాదు. తెలుగు నదులలో పొంగి పొరలి ప్రవహించేది కవిత్వమే.

కవుల కంటె - తుహిన కర్పూరనిభ కీర్తి
తెచ్చి రెవరు నీకు తెలుగు తల్లి!
సాహితీ తరంగ సంగీత రసధుని
దేశ భాషలందు తెలుగు లెస్స

## ఆదికవి

సంస్కృతంలో వాల్మీకి, తెలుగులో నన్నయ భట్టు ఆదికవులుగా సుప్రసిద్ధులు. సంస్కృతంలో వాల్మీకికి పూర్వం ఎందరో కవులు ఉన్నారు. ఆంధ్ర మహాభారత కర్తయైన నన్నయకు పూర్వం తెలుగులో చాల మంది కవులు ఉన్నారు. చారిత్రకంగా నన్నయకు పూర్వం వెలసిన శిలా శాసనాలలో, యుద్ధ మల్లుని బెజవాడ శాసనంలో పండరంగుని అద్దంకి శాసనంలో తెలుగు పద్యాలు కన్పిస్తున్నాయి.

తెలుగు పద్యం - ఆంధ్ర మహాభారతం అవతరణకు పూర్వమే సద్యోయేననంతో - నిర్ణీత గణాలతో - సాహితీ కవచకుండలాలు అనదగిన యతిప్రాసలతో తెలుగు భాషలో ఉద్భవించింది. నన్నయకు పూర్వమే. కన్నడ భాషలో కందం, సీసం, ఉత్పలమాల, చంపకమాలాది వృత్తులు కన్పిస్తున్నాయి. అయితే ప్రాచీన కన్నడ భాషలో "యతి" నియతి లేదు. అందుచేతనే "కన్నడానికి యతి లేదు. కోణాంగికి మతి లేదు" అనే సామెత ఏర్పడింది. ప్రాచీన తమిళంలో తెలుగు యతి ప్రాసలలో పోల్చదగినవి నామ మాత్రాన శిష్టాలు గోచరిస్తున్నాయి. కన్నడంలో గూడ పూర్వ కావ్యాలలోని కందాలు సీసాలు, వృత్తాలు నేడు కవులు ఎవ్వరూ వ్రాయటం లేదు. ప్రాచీన తెలుగు ఛందస్సు నేటికీ సజీవంగా నిలిచింది. 'కందం వ్రాయని వాడు కవియే కాడు" 'వృత్త రచన - కవుల సత్తాకు ని కషమ్ము'. నన్నయ్య నాటి నుండి నేటి వరకు తెలు పద్య శిల్ప సౌష్ఠవం - పరిణామ రమణీయ రోచిస్సులు వెల్లివిరియ చేస్తుంది.

తెలుగు పద్య సాహితీ నారసత్వమ్ము
వేయి వత్సరాల వెలుగు పంట !
నడులు - ప్రాస లయలు - నాద్య సంగీతమై
బిందు లయలు - నాద బిందు కళలు

తెలుగు పద్య శిల్ప సౌష్ఠవం

సంస్కృత శ్లోకాలలో యతి ప్రాసలు లేవు

సంస్కృతంలో "యతి" అంటే విరతి విశ్రాంతి మాత్రమే.

తెలుగు పద్యానికి వేయి యేండ్ల పునాది ఉంది. తెలుగులో 'ప్రాస' అంటే పద్యంలో రెండవ అక్షరం ఒకే గుణింతానికి చెంది ఉండటం. ప్రాస - బిందు పూర్వకం అయితే, సంయుక్తాక్షరం అయితే నాలుగు పాదాలలో అట్లాగే ఉండాలి. ప్రాస పూర్వాక్షరం లఘువు అయితే సర్వత్ర లఘువే కావాలి. అట్లే గురువు. ఇక తెలుగు యతి అక్షరమైత్రి. ప్రతి పద్య పాదంలో మొదటి అక్షరానికి నిర్ణీత స్థలంలో ప్రతి అక్షరానికీ 'మైత్రీ' - ఉండాలి. సంస్కృతంలో గానీ - హిందీలోగాని - మరి యే యీతర దేశ భాషలలో గాని ఆ మాటకు వస్తే - యావత్ ప్రపంచంలో ఏ భాషలో గాని ఛందస్సులో తెలుగు పద్యానికి తుల తూగు - ఉన్న - ఒయ్యారం - హొయలతో పోల్చదగిన శిల్ప సౌష్ఠవం కనిపించదు. వేయి సంవత్సరాల నుండి, తెలుగులో పద్య కవిత్వానికి - యతి ప్రాసల గణాలకు అవినాభావ సంబంధం ఏర్పడింది.

ఇక కవిత్వానికి యతి ప్రాసలు అనవసరం. ఛందస్సు అసలే అనవసరం అనే వారు నేడు ఉన్నారు. "కావ్యాలాపాంశ్చ వర్జ యేత్" అసలు కవిత్వమే వర్జనీయం అనే వారూ ఉన్నారు. అది విషయాంతరం. 'ఛందోహీన్ న నశబ్దోఽస్తి' - న చ్ఛందశ్శబ్ద వర్జితం' ఛందస్సు లేని శబ్దం లేదు. శబ్ద వర్జితమైన ఛందస్సు లేదు - అని భరత ముని ప్రవచనం. ఆది కవి వాల్మీకిని గూర్చిన కథ రామాయణం అవతారికలో ఉంది. క్రౌంచ మిథునంలోని మగ పక్షిని బాణంతో కొట్టి చంపిన బోయవానిపై కోసం వచ్చిన వాల్మీకి మహర్షి నోటి నుండి వెలువడిన మాటలు ఛందోబద్ధమైన శ్లోకంగా ఉద్భవించాయట.

"తస్య శోకః శ్లోకత్వ మాగతః"

ఆవాల్మీకి శోకం - శ్లోకంగా అవతరించింది. నిజానికి కవిత్వం అంటే యతి ప్రాసలు గణాలు ఛందస్సు కాదు.

పెదవి నుండి వెడలు పదములా కవనమ్ము
కరగి కరగి గుండె - కవిత యగును;

అనుభవమ్ము కవిత - ఆర్తియే కవనమ్ము
కవిత - ఋషులు కార్చు కంటి నీరు

అయితే కవిత యతి ప్రాసలను గణాలకు అతీతమైనది గదా. అవును.

"కానుపించు కవుల కన్నీటి జల్లులా
ఇంపు గొలుపు నట్టి ఇంద్ర ధనువు"

భావావేశంతో వెలువడిన కవితలో - అనుభవం పలికిన గుండె నుండి వెలువడే వాక్యంలో లయాన్వితమైన భాష యతి ప్రాసలు నైసర్గికంగానే ఉంటాయి. ఉదాహరణకు సామెతలు. సామెతలకు భాష ఒక రెక్క. భావం రెండవ రెక్క. ప్రాణ నాడి అనుభూతి. లండ ఉంటే కొండ దాట వచ్చు. అడ్డాలనాడు బిడ్డలు గాని గడ్డాలు మీసాలు మొలిచాక బిడ్డలా? "మా తాతలు నేతులు త్రాగారు. మా మూతులు వాసన చూడండి. యతి ప్రాసలు లేని సామెతలు ఏ భాషలోనూ ఉండవు. యతి ప్రాసలు లేని సూక్తులు గొంగళి పురుగులు. యతి ప్రాసలు ఉన్నవి సీతాకోక చిలుకలు.

రస గుళికలు - జాతి రత్నాలు - భాషలో
యతులు గలిగి - ప్రాస గతులు గలిగి;
సామెతలును పేర - జనుల గుండెల దూరు,
అనుభవమ్ము - వాటి ప్రాణ నాడి.

సామెతలలో సహజంగా అంతర్లీనంగా కనుపించే యతి ప్రాసలు పద్య కవితలో ఛందోబద్ధాలయ్యాయి.

## కవిత్రయం

తెలుగులో మహాభారత రచయితలైన ముప్వురు కవులు నన్నయ్య తిక్కన ఎఱ్ఱనలు కవిత్రయంగా ప్రాతః స్మరణీయులయ్యారు. మహాభారత రచన మాత్రమే వారి కీర్తికి కారణం కాదు. పోతన మహా కవికి వారిని మించిన జనరంజకత్వం లభించింది. దానికి కారణం ఏ భాషలోనైనా ప్రముఖంగా చతుర్విధ కవితా రీతులు కన్పిస్తాయి.

(1) ఆఖ్యాన శైలి, దానికి మూల పురుషుడు నన్నయ (2) నాటకీయ శైలి, దానికి మూల పురుషుడు, తిక్కన (3) వర్ణనాత్మక శైలి, దానికి ప్రముఖుడు ఎఱ్ఱన. (4) ఆత్మా శ్రయ శైలి, దానిలో సిద్ధహస్తులు పోతన.

నన్నయ్య కవితా శిల్పము గూర్చి ఆ మహా కవి మాటలలోనే చెప్పవలెనంటే (1) అక్షర రమ్యత (2) ప్రసన్న కవితార్థ సూక్తి (3) నానా రుచిరార్థ సూక్తి నిధిత్యం నన్నయ పద్యాలు వేద వాక్కుల వలె నినదిస్తాయి. ఉదాహరణకు ఉదంకుడు నాగలోకంలో చేసిన ప్రార్థనము.

బహు వన పాదహబ్ది కుల పర్వత పూర్ణ సరస్సరస్వత్
సహిత మహా మహీభర మజస్ర సహస్ర ఫణాళి దాల్చి - దు
స్సహతర మూర్తికిన్ జలధిశాయికి పాయక శయ్య యైన, అ
య్య హి వ తి దు ష్కృ తాం త క ు డ నం తు డు మా కు
ప్రసన్నుడయ్యెడున్

నన్నయ మహాకవి పరిభాషలో "అక్షర రమ్యత" తెలుగు పద్య శిల్ప సౌష్ఠవంలో అంతర్వాహి ని. నాద ప్రతీక అయిన అక్షర రమ్యత అర్థానికి అతీతం. గంగానది మహిళా రూపం ధరించినట్లుగా నన్నయ చేసిన వర్ణన ఉదాహరణీయం.

గంగ - నిజాంగ దీపుత లొసగం జనుదించి - లతాంగి - సంగత్

త్తుంగ పయోధర ద్వితయ తోయరు హానన - చారు నేత్ర - ది

వ్యాంగనయై ప్రతీప వసుదాదిపు శాల విశాల దక్షిణో
త్సంగము నందు - మన్మథ వశంబున్న నుండె కరంబు కీలతో

అనుశీలించ వచ్చు ఈ పద్యంలోని బిందు పూర్వ్యక గకార ప్రాస ప్రయోగ పౌనఃపున్యం యతులు అక్షర రమ్యత మాటలలో చెప్పలేని భావాన్ని మాటలలో చెప్పటమే కవితా కళలోని విచిత్ర విరోధా భాసం! ఆ అనిర్వచనీయ సుకుమార సుందర కర్తవ్యం నిర్వహించే శక్తి యుక్తులు తెలుగు ఛందస్సుకు యతి ప్రాసలలకు నైసర్గికం తెలుగు పద్య కవితలలో తరచు యతి ప్రాసలకు "అనుప్రాసలు" తోడు పడటం కద్దు అగ్నికి వాయువు సాయమైనట్లు! ద్రౌపదీ వస్త్రాపరణం ఘట్టంలో నన్నయ భీముని నోట పలికించిన పద్యం.

కురువృద్ధుల్ గురు వృద్ధ బాంధవుల నేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుడై ద్రౌపతి నిట్లు చేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ
కర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘని
ర్ఘర ముర్వీపతి చూచుచుండ అని నా స్వాదింతు ఉగ్రా కృతిన్

ఈ పద్యంలోని యతి ప్రాసలతో పాటు ద్వియుక్త ధకార ప్రయోగ పౌనః పున్యం దంత్యాక్షర విన్యాసం - అలనాటి సభలో భీముని రౌద్రాకృతిని మాత్రమే గాక ఆతని ఆమ్రేడిత గదాదండ ప్రహరణాలు, ఆతని దంతాల పటపటలు స్వయం వ్యక్తం చేస్తున్నవి. నన్నయ నాటి నుండి నేటి వరకు తెలుగు కవులు ఈ నాద బిందు కలోపాసన చేస్తూనే ఉన్నారు.

పోతన మహాకవి ఘంటంలో తెలుగు పద్య శిల్ప సౌష్ఠవం చిందులు త్రొక్కింది. ఉదాహరణకు బలిచక్రవర్తికి అందించిన ఆశీర్వచన పద్యం.

"స్వస్తి జగత్త్రయీ భువన శాసన కర్తకు - హాస మాత్ర వి
ధ్వస్త నిలింప భర్తకు - ఉదార పద వ్యవహర్త్కృతున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు - నిర్జరీ గళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోక భర్తకున్

దుశ్శాసనుడు ద్రౌపదిని సభలోనికి ఈడ్చి తెచ్చిన సందర్భంలో నన్నయ వ్రాసిన పద్యం - అతని అభ్యాస శైలికి ఉదాహరణ ప్రాయం

"ఆవన జూననే కురూస శదుండు కడంగి రాజ సూ
యావ భదంబు నందు వసుధామర మంత్ర పవిత్ర వారి ధా
దానళి చేసి పావనము లైన శిరోజ ములం దెమర్చి, పా
పాహి ముడీ జ్జాడ్చి తెచ్చె - సభ కందరు సంభ్రమ మంది
చూడగన్"

తిక్కన - ఈ సందర్భం ఎత్తి - వెను చూపు తలపుగా చిత్రించిన పద్యం - ఆ మహాకవి "నాటకీయ శైలికి ఉదాహరణ ప్రాయం. ద్రౌపది ఆ కృష్ణునితో అంటుంది.

"నీవు - సుభద్ర కంటె కడు నెయ్యము గారకముందినిర్వ
సం

భావన సేయు దిట్టి ను సంకజనాభ ఒకండు రాజసూ
యావన్నధంబునందు శుచియై వెనుపొందిన వేణి పట్టిన ఈ
ఏపురు చూడగా సభకు ఈడ్చె - కులాంగన నిటోక్తు రే

తిక్కన - కవిత సంభాషణలో నడిపిస్తారు.

అంతేగాక - తిక్కనకు చతుర్విధాభినయ వర్ణన ఎంతో ఇష్టం.

డంబాలు పలికిన ఉత్తర కుమారుడు - కౌరవ సేనచూచి భయపడి రథం దిగి పారిపోతాడు. అప్పుడు అతనిని అర్జునుడు పరుగెత్తి పట్టుకొంటాడు. తిక్కన ఉత్తరుని వర్ణించిన తీరు.

సీ॥ వెల వెలబారుచు వెగ జూందు పెదవుల
తడియార నెంతయు తల్లడిల్లు
జల్లన అంగంబు వెల్ల నిండ చెమర్చి
పదములు కరములు గురియ నడకు
హృదయంబు తట తట నడదగ బెలుకురు
దీని కృష్ణుల మోము తేరి చూచు
ఎలుగు దగద్గదిక త్రొటెలి ఏడ్చు విడుమని
ప్రార్థించు మాట కీడ్పాటు తోప

తే.గీ. నిష్కళత శుద్ధ పేకువిబు నిర్మలోజ్జ్వ
లాష్ట వైడూర్యములు తురగాఢ్య రథము
కరటి దశకంబు ఒక యూరు పురము చొచ్చి
నపుడ ఇచ్చెద నీకిను ఆర్తుడగుచు

తిక్కన - మనుమ సిద్ధి మహా రాజునకు మంత్రి. ఇతనికి వేలు విడిచిన సోదరుడు సేనాపతి. అతనికి ఖడ్గ తిక్కన అని పేరు. (కలం) తిక్కన మహాభారతం పదునైరు పర్వాలు వ్రాశాడు. నన్నయ భట్టు ఆది సభా పర్వాలు అరణ్య పర్వాలు కొంత అతనికి ప్రబంధ పరమేశ్వరుడు అనే బిరుదు లభించింది. తెలుగులో వర్ణనాత్మక శైలికి సూత్రధారి అయ్యాడు. ఆ మహా కవి వ్రాసిన ఇతర కావ్యములు - హరివంశం నృసింహ పురాణం ఎఱ్ఱన వ్రాసిన రామాయణం ఇంత వరకు దొరక లేదు. అతడు - విద్యారణ్య స్వామికి పూర్వరంగ ప్రవర్తకుడు. కాకతీయ సామ్రాజ్య రాజధాని ఓరుగల్లు పతన సమయానికి క్రీ॥ శ॥ 1323 సంవత్సర ప్రాంతంలో ఎఱ్ఱన నూనూగు మీసాల నూత్న యౌవనంలో ఉండి ఉంటాడు. అతడు సముద్ర సేనాపతి మల్లారెడ్డికి ప్రియ మిత్రుడు. మల్లారెడ్డి కవి మిత్రుడు ఎఱ్ఱనను అన్న గారు అద్దకి ప్రభువైన వేమా రెడ్డికి బహుకృతిగా సమర్పించాడు.

ఎఱ్ఱన వర్ణనాత్మక శైలి ఒక ఉదాహరణ. ఎఱ్ఱనకు ప్రకృతిలోని సౌందర్యం, సృష్టిలోని విలాస విభ్రమం తన్మయత్వం కల్పించాయి. భారతంలో సావిత్రీ సత్యవంతులు

కమనీయ కనువిన కల్లోల వీథుల
కదలు రాయంచల గతుల యొప్పు
బహు పుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరులతా తతుల సొంపు
మకరంద రసపాన మదవిలోలంబులై
డ్రాలెడి యెల దేటి గముల యు విపు
పరిపక్వ మంజుల ఫల రసోద్ధతములై
పలుకు రా చిలుకల పటు రవంబు
ప్రియుడు నేఱువేఱ ప్రీతిమై చూపుచు
చెప్పుచును జనంగ చిగురుచూడి
కనుచు వినుచు నిద్వికార పల్లాపమీ
పారనతని తెఱగు అరయు చుండె

ఎఱ్ఱనను సమకాలీనుడు ఉత్తర హరివంశ కర్త బుక్క రాయలచే పెంచుకు దిన్నె, అగ్రహారంగా పడిసిన కవి నాచన సోముడు నవీన గుణ సనాథుడుగా పేరుకెక్కాడు. అతనిని శబ్ద రత్నాకరకారుడు అనికంబున అహి నిదాచ్చి సర్వజ్ఞుడు అని ప్రశంసించాడు.

నాచన సోముని పద్యం - సత్యభామ నరకునితో యుద్ధం చేసే సన్నివేశం-- ''అరిఁ జూచున్ హరిఁ జూచు, చూచుకను

అందంద మందార కే

సరమాలా మకరంద బిందు సవిల స్యందంబు లందంబులై

తొరగం బయ్యెర కొంగొకింత లొలగం దోడ్తో శరాసారమున్

దరహాసామృత పూరమున్ మరియుచున్ తన్వంగి హేలాగతిన్"

పై పద్యంలో సత్యభాను స్వరూపం స్థిరభంగిములో కన్పించే ఛాయా చిత్ర పటం కాదు. ఇది చైతన్య పూరితమైన అక్షర చలన చిత్ర పరంపర కవ్వించే సద్యోనేత్ర నిర్వాణం ఈ ప్రతిభా వైశిష్ట్యం కేవలం మానవ మానస సృష్టి అయిన కవితా కళలోని ప్రత్యేకత. ప్రతిభలో అంతర్భాగాలు అయిన భావయిత్రి కారయిత్రి సాయుజ్యం - సారస్వత ప్రపంచంలో అధిరోహించిన గౌరీ శంకర శిఖరానికి ఈ పద్య శిల్పం ఉదాహరణ ప్రాయం.

## యుగళ కళ

"వాగర్థా విన సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పిత రౌ వందే పార్వతీ పరమేశ్వరౌ"

ఇది రఘువంశ కావ్యంలో కాళిదాస మహాకవి వ్రాసిన ప్రార్థనా శ్లోకం. ఇది స్థూల దృష్టికి పార్వతీ పరమేశ్వర స్తుతి. కాని సూక్ష్మ దృష్టితో చూస్తే ఇందులో కవితాకళా రహస్యం ఇమిడి ఉందని సాహితీ ప్రియం భావుకులు గుర్తింపగలరు. గాంధీ మహాత్ముడు అన్నాడు. "ఆకలి గొన్నవానికి భగవంతుడు ఆహారరూపంలో తప్ప, సాక్షాత్కరించటానికి సాహసింపడు". అవును అన్నార్తునను ఆహారమే భగవత్ స్వరూపం. మరి గాయకునకు?? త్యాగరాజునకు భగవంతుని "నాదబిందు కళా స్వరూపా నమో నమో" అని స్తుతించాడు. ఇక కవికిపరబ్రహ్మ సాక్షాత్కారం "అర్థనారీశ్వర రూపంలో' నే లభిస్తుంది. కాళిదాసునకు పార్వతీ పరమేశ్వరుల అవినాభావ సంబంధం. వాగర్థాల కలయికగా కన్పించింది. భాష-భావం. సాహితీరథానికి ఇవి జోడు గుఱ్ఱాలు. ఇంకో విధంగా చెప్పాలంటే భావం-భాష, ప్రాణం శరీరం వంటివి. ప్రాణంలేని శరీరం - శవం. శరీరం లేని ప్రాణం -దయ్యం. అందుచే ప్రాయకంగా కవితలు కొన్ని శవాలుగా మరికొన్ని దయ్యాలుగా భాసిస్తాయి. ప్రపంచ సాహితీ జగత్తులో ఏకవి అయినా, భావం-భాషల సాయుజ్యం గంగా యమునా సంగమంవలె తీర్చి దిద్దినపుడే, ఉత్తమ సాహితీ స్రష్ట కాగలడు.

ఇక తెలుగు [illegible]త-యుగళ కళలో అంతర్యుగళ కళ. భావం భాషతోపాటు. ఇటు తెలుగు పదాలు అటు సంస్కృత పదాలు చక్కగా చిక్కగా [illegible]కులు కనిపించకుండా సంధించాలి.

పోతన మహాకవి - అన్నాడు." కొందరకు తెలుగు గుణమగు, కొందరకు సంస్కృతంబు గుణమగు - నే నందరి మెప్పింతు అయ్యెయెడలన్" అన్నాడు. పోతన

భాగవతము తెలిసి పలుకుట చిత్రమ్ము
శూలికైన - తమ్మిచూలికైన
విభుద జనుల వలన - విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేట పరతు

అనిచక్కని చిక్కని తేట తెలుగు నుడికారపు సంపు సొంపులతో ఆటవెలది పద్యం చెప్పగలడు.

సుదీర్ఘ సంస్కృత సమాసాలతో మత్తేభం నడిపింపగలడు.

-" పాదద్వంద్వము నేల మోపి - పవనున్ బంధించి - పంచేంద్రియో
న్మాదంబున్ హరిమార్చి - బుద్ధిలతకున్ మారాకు హత్తించి, నిః
శేద బ్రహ్మ పదావలంబన రతిన్ క్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించె -కరి పాదాక్రాంత నిర్వక్రమై"

పోతన - తేట తెలుగు పలుకు బడులతో

"కలడందురు దీనుల యెడ
కలడందురు పరమయోగి గణముల పాలన్
కలడందురన్ని దిశలను
కలడు కలండనెడువాడు కలడో లేడో"

అనగలడు, ప్రౌఢ సంస్కృత పదసుంఫకాలతత

"అల వైకుంఠపురంబులో నగరిలో ఆమూల సౌధంబు దా
పల మందార వనాంత రాంత రామృత సరం ప్రాంతేందు కాంతోపలో
త్ప ల పర్యంక రమా వినోదియగు ఆపన్న ప్రసన్నుండు - వి
హ్వల నాగేంద్రము పాహి పాహి యన నుయ్యాలించి సంరంభియై

తెలుగు కవులు అందరు - శ్రీనాథ మహాకవితోపాటు - సంస్కృతాంధ్ర పద సమ్మేళన కళను ఉపాసించిన వారే. శ్రీనాథుని కవితా జీవిత ప్రస్థానం - చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాటినుండి -నూనూగు మీసాల నూత్నయౌవనంలో - ప్రౌఢనిర్భరవయః పరిపాకంలో సమస్త పాకాలను సం త రించు కొనిన సాహితీ కిమ్మీర సమాహారం. మరణ శయ్యా మీద గూడ ఆత్మ ప్రత్యయంతో ఆ మహాకవి వ్రాసిన పద్యం

- "అరుగు చున్నాడు శ్రీనాథుడమర పురికి
దివిజ కవివరు గుండియల్ దిగ్గు రనగ."

శ్రీనాథుడు - కొండవీటి రెడ్డి రాజ్యంలో విద్యాధికారి పదవిని అధిష్ఠించాడు. తదుపరి రాజమహేంద్రవరంలో వీరభద్రారెడ్డి ఆస్థాన కవి అయ్యారు. సమకాలీన సహృదయుల మన్ననలను అతడు చూరగొన్నాడు. కావ్యంలోని పద్యాలు

రసవత్తరంగా ఉండవచ్చు. అయితే శ్రీనాథుడు వ్రాసిన అంకిత పద్యాలు గూడ కవితాయుగళ కళకూ శబ్దార్థాల సాయుజ్యానికి ఉదాహరణీయాలు. కృతిపతిని గూర్చి భీమ ఖండలాలో శ్రీనాథుడు వ్రాసిన పద్యం.

"కాంచీ కంకణ తార హార కటక గ్రైవేయ భూషావళుల్
అంచం బిత్తురు దూతికా తతికి - వీలన్ బెండపూడన్ననిన్
పంచాస్త్రోపము తారుతార కపయన్ ప్రార్థించి లోలోపలన్
సంచారాసుములందు పల్లెల పురిన్ ప్రౌఢేందుబింబాననల్.

చాటు పద్యాలు :

సాహితీ జగత్తులో సద్యోయోవనంతో ఉద్భవించే ఏకైక పద్యం చాటువు.

చాటువులు గ్రంథస్థాలు కాకపోయినా, రసజ్ఞుల హృదయస్థములై యుగయుగాంతరాలు చిరంజీవములై వర్థిల్లగలవు.

చాటువు అనే మాటకు - "మనోహరమైనది" - అని అర్థం. చాటువులు పాతాళగంగ పైకి ఉబికినట్లుగా, కవిహృదయం నుండి ఆశువుగా వెలువడే ముక్తకాలు.

చాటుపద్యం స్వయం సంపూర్ణమై ఉంటుంది. ప్రాచీనాంధ్ర వాఙ్మయం బహుళంగా సంస్కృతమూలానువాదం అని స్వతంత్ర ప్రతిపత్తి లేనట్టిది అనీ ఆంగ్ల విద్యాధికులు చేసే విమర్శను తెలుగు చాటువులు పరాస్తం చేస్తాయి. ఆంధ్రకవుల స్వచ్ఛంద కవితా ప్రతిభకు సర్వతంత్ర స్వతంత్ర ప్రతిభకు తెలుగుచాటు పద్యాలు గీటు రాళ్లు ఒక్కొక్క చాటువు ఒక మహాప్రబంధంలో సరితూగ గలదు. తెలుగులో వెలువడిన చాటువులు - కాలమనో స్రవంతికి ఎదురీది నిలిచిన సాహితీ మార్కండేయ ఖండికలూ. నవరసరుచిరాలు. నిత్యప్రత్యగ్రాలు.

శ్రీనాథమహాకవి చెప్పిన చాటువులు సుప్రసిద్ధాలు.

-" సిరిగల వానికి చెల్లును
తరుణుల పదియారు వేల తగ పెండ్లాడన్
తిరిపెమున కిద్ద రాండ్రా
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్ .

రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన ఏకులె వడకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాండైన జొన్నకూడే కుడుచున్.

చాటువు లలో వస్తు లాఘవ ముండ వచ్చును.

ఆ లాఘవమే చాటువు రచనలను గౌరవంగా పరిణమించటం కవితా కళలోని ఒక విచిత్ర విరోధాభాసం. చాటువులు బహుళముగా అజ్ఞాత కర్తృకములు.

"శివుడద్రిని శయనించుట
రవిచంద్రులు మింటినుంట రాజీవాడుం
డవిరళముగ శేషునిపై
పవళించుట - నల్లి బాధ పడలేక సుమా".

జొన్న చేనికాడ - చిన్నదానను చూడ
నిన్నటేల నుండి -నిదుర లేదు!
దాని నన్నుగూర్చి-దయసేయు మాధవా
పొన్నపూల నిన్ను పూజసేతు" -

ఈ చాటువు వ్రాసిన ఆర్ద్ర హృదయుడు-కవి-ఎవ్వడో? పెద్దనమహాకవి - శ్రీకృష్ణదేవరాయలతో ఒకసారి ఆశువుగా అన్నాడట "నిరుపహతిహతి స్థలమ్ము-రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురవిడె మాత్మకింపయిన భోజన మూయెల మంచ మొప్పు తప్పరయు రసజ్ఞులోహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్ దొరకినగాక-ఊరక కృతుక రచియింపుమటన్న శక్యమే"-

చాటువులను సమీక్షించి లక్ష్య లక్షణ సమన్వయం సాధించవచ్చు. (i) తాత్కాలిక ప్రేరేపణ (ii) స్వయంసంపూర్ణత (iii) చమత్కారం (iv) ఝటితిస్ఫూర్తి (v) ఇతివృత్త సౌలభ్యం చాటు లక్షణాలుగా చెప్పవచ్చు.

అన్యదేశ్యాలతో కూడిన ఒక ఆధునిక చాటువులో అనకద్య హృద్య పద్య విద్యా ముద్ర కనుపిస్తుంది.

"టీజనితేన్సిరేషను పటిష్ఠ మహీయ గవాయి గానవి
ద్యాజిత పీరుసాబు-నయనాంచిత గోల్డెను స్పెక్టికల్ ద్వయీ
భ్రాజితడాబు-బూతుల షరాబు - కవిత్వఖరాబు-నాట్యపుం
బోజులలో నవాబు - పొగపూతల మింటిగిలాబు - బాబయా

చాటువు లలో తొలివిరుపు-మధ్య మలుపు - కొసమెరుపు ఉన్నట్లయితే అవి ఉత్తమోత్తమములు అని చెప్పవచ్చు.

అన్ని రోగములకు - ఔషధమ్ములు వచ్చె
సగటు వయసు పెరిగె జగతి యందు
జబ్బు చేసి ఇంక - చావనక్కరలేదు
మందువలన తప్ప - మనుజులెవరు.

నేడు మినీ కవితలకు - మాతృకలు చాటువులే.

అక్షర బద్ధములైన మెరపుతీగ తలపులు చాటువులు.

రాళ్లు రువ్వినారు - రాజకీయుని పైన
వేలకొలది ప్రజలు వెక్కిరించి,
అతడు మేడకట్టె - ఆ రాళ్లనే పేర్చి
రమ్యహాసలోల! రామకృష్ణ.

చాటువులు - గాలిలో తేలి - ధూళిలో ఆడి సహృదయుని గుండెలో దూరిపోగలవు.

## ప్రబంధయుగం

శ్రీకృష్ణ దేవరాయల కాలంలో ప్రబంధయుగం ప్రారంభించింది. తెలుగులో ప్రబంధాలు తామరతంపరగా అవతరించాయి. పురాణ ప్రసిద్ధమైన ఇతివృత్తాన్ని స్వీకరించి - అష్టాదశ వర్ణనలలో పెంచి పెద్ద కావ్యంగా తీర్చిదిద్దటం - ప్రబంధరచన. వర్ణన - ప్రబంధానికి ఆత్మ.

కవిత్రయ కవితలలో - పూవులు ఎక్కువ. ఆకులు తక్కువ. ప్రబంధ కవుల కవితలలో ఆకులు ఎక్కువ. పూవులు తక్కువ. ప్రబంధ కవులు అందరు - రీతిసుభగమైన శయ్యను అల్లిక జిగిబిగితో కూడిన రచనను ఆరాధించారు.

అల్లసాని వాని అల్లిక జిగిబిగి
ముక్కు తిమ్మ నార్యు ముద్దు పలుకు
పాండురంగ విభుని పదగుంఫనమ్ములు

తరువాతి ప్రబంధములలో ముప్పిరి గొన్నాయి. ప్రబంధాలు అన్నీ అలంకారాలతో అతి శయోక్తులతో నిండాయి.

'అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ' - ప్రబంధ కవితకు పల్లవి అయింది. ప్రవరుడు - హిమాలయ పర్వతం చూచాడట.

'అటఁజని గాంచె - భూమిసురు డంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుట దభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానురూప పరిపుల్లి కలాప కలాపి జాలమున్
కటక చరత్ కరేణు కరకంపిత సాలము శీతశైలమున్ " -

ప్రబంధాలలో తెలుగు పద్య శిల్ప సౌష్ఠవం పరాకాష్ఠ చెందింది. పద్యం చెక్కటంలో ప్రబంధ కవులు సిద్ధహస్తులు. సమకాలీన శిల్పులు - శిలలు చెక్కారు. ప్రబంధ కవులు అక్షరాలు చెక్కారు. ముక్కు తిమ్మన - పారిజాతాపహరణంలో బిందు పూర్వక తకారంతో చెక్కిన పద్యం.

"అంతట ఒక్కనాడు ధవళాంబుజ నేత్రుడు వచ్చి రుక్మిణీ
కాంత గృహమ్ములోన శశికాంత శిలామయ వేడి మీద ఏ
కాంతము నందునున్న చెలికత్తెలు కొల్వగ చేరి జూదమ
త్యంత వినోద కేళిమెయి నాడుచు నుండగ అద్భుతమ్ముగన్ " -

నారద మహర్షి వస్తాడు.

శ్రీకృష్ణ దేవరాయల కొలువు కూటంలో అష్టదిగ్గజ కవులు ఉండే వారు. ఎవరి గొంతుక వారిదే.

ధూర్జటి మహాకవి వ్రాసిన పద్యం - శిల్ప సుకుమార సుందరమైనది మచ్చుకు ఒకటి. వర్ణణ-ప్రబంధానికి జీవనాడీ - చంద్రోదయ వర్ణణ ధూర్జటి ఆత్మీయతతో శివభక్తితో అతికిపోయింది.

"ఉదయ గ్రావము పానవట్ట మభిషేకోదప్రవాహమ్ము నా
ర్ద్రి, దరీధ్వాంతము ధూపధూమము జ్వలద్దీప ప్రభారాజి-కౌ
ముది, తారానివహంబు లర్పిత సుమంబుల్‌గా తమోదూద సౌ
ఖ్యదమై, శీతగభస్తి శివలింగం బొప్పె - ప్రాచీదిశన్."

తెనాలి రామకృష్ణ కవి - పద్యం - పద్యం కోసమే వ్రాసినట్లుగా చేసిన తుంగభద్రా నదీ వర్ణన.,

"గంగా సంగము మిచ్చగించునె మదిన్ కావేరి దేవేరిగా
అంగీకార మొనర్చునే యమునతో ఆనందమున్ పొందునే
రంగతుంగ తరంగ హస్తముల ఆ రత్నాకరేంద్రుండునీ
అంగంబంటి సుఖించునేని గుణభద్రా! తుంగభద్రా నదీ. "

నాటకాంతం హి సాహిత్యం - కావ్యేషు నాటకం రమ్యం అన్నారు సంస్కృతం వారు. 'ప్రబంధ్రాంతం సాహిత్యం' అయింది తెలుగులో. సుమారు మూడు వందల సంవత్సరాలు ప్రబంధ సామ్రాజ్యాం ఏర్పడింది. ఆంధ్ర సారస్వతంలో అచ్చ తెలుగు గ్రంధాలు ద్వర్థి కావ్యాలు ఎన్నెన్నో అవతరించాయి. వసుచరిత్ర - వ్రాసిన రామరాజ భూషణుడు శ్లేష కవితా చక్రవర్తి.

"చతురాస్యుల్ పురుషోత్తముల్ బుధగురువ్ సర్వజ్ఞమూర్తుల్ మహా
శతమన్యుల్ శుచిధర్మ పుణ్య జనతా శ్లాఘ్యుల్ ప్రచేతసుల్ సదా
గతు లక్షణ సకార్ద కల్పులు కళాకాంతుల్ జగద్‌బంధులా
క్షితి దేవుల్ పురి దేవతా మహిమలన్ చెన్నొందుటన్ చిత్రమే "

వసుచరిత్రలోని పద్యాలు అన్నీ శ్లేషానుప్రాణితములే. శుక్తిమతి నదిని వర్ణిస్తూ రామరాజభూషణుడు వ్రాసిన పద్యం.

"జీవనమెల్ల సత్కవి నిషేదిత మాశయ మెల్ల అచ్చతా
పావనతా గభీరతల పట్టు - ప్రచారము లెల్ల విశ్వధా
త్రీవలయ త్రికాల ఫలదేశినముల్ - నవకంబు లెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము లా నది పెంపు నుతింప శక్యమే."

జీవనము = బ్రతుకు - నీరు; సత్కవి = మంచి కవులు-నీటి పక్షులు;

(ఆశయము = నీటి మడుగు, మానసము; త్రికాల ఫలదేశికములు = ముక్కారు పంటలు, త్రికాలజ్ఞతలు; నవకంబులు = లాలిత్యములు నవ+ కంబులు + క్రొత్త శంఖాలు; ముక్తావళి = యోగుల బృందము, ముత్యాల దండలు)

రామరాజభూషణుడు, రెండర్థాలు ప్రతిపద్యం ఇచ్చి రెండుకథలు వివరించే "ద్వర్థి" కావ్యం హరిశ్చంద్రనలోపాఖ్యానం వ్రాశాడు. పింగళి సూరన - కళాపూర్ణోదయం - ప్రభావతీ

ప్రద్యుమ్నం మాత్రమే గాక, రాఘవ పాండవీయం అనే ద్వర్థి కావ్యం వ్రాశాడు. త్ర్యర్థి కావ్యం - యాదవ రాఘవ పాండవీయం (భాగవతం - రామాయణం - భారత కథలు మూడును ద్విగుచ్ఛిక కావ్యం వెలువడింది. ఇట్టి - శక్తి సామర్థ్యాలు తెలుగు భాషకే ఉన్నాయి. ఇవి సాహిత్యంలో తెలుగు కవులు చేసిన సాముగరిడీలు. తరువాతి కాలంలో - పిల్ల మను చరిత్రలు - పిల్ల నను చరిత్రలు అనదగిన ప్రబంధాలు కోకొల్లలు. భావాలకేమి - అనుకరణలకేమి గాని ప్రబంధ కవులు అందరు హృద్య పద్య విద్యాధరులే. సారంగు తమ్మయ్య వ్రాసిన వైజయంతీ విలాసంలోని పద్యం ఉదాహరింపదగింది - వేశ్యావశుడయ్యాడు విప్రనారాయణుడు.

"ఆ విప్రోత్తము వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగన సాహచర్య గుణ సంపర్కంబునన్, లోహమై
గ్రావంబై, దృఢదారులై, తరుణ వృక్షంబై, ఫలప్రాయమై
పూలై, తన్మకరందమై-కరగె-పో పో నీళ్లకున్ సల్పనై" -

ఆ మహనీయుని శీలంలోచిత్తవృత్తిలో వచ్చిన మార్పు - గణనీయమైన అణురణన క్రమ పరిణామానుక్రమణిక - మాటల పొలిమేరలు దాటి నట్టిదే గాని కవి శిల్పస్నిగ్ధమైన పద్యంలో చెక్కి పొందుపరచాడు.

పద్యం చెక్కటంలో ప్రాచీన కవులే గాక - ఆధునికులు గూడ ఉగ్గడింపదగిన ప్రజ్ఞ చూపించినవారు పలువురు ఉన్నారు. "వైతాళికులు" అందరు ముద్దుకృష్ణ సంకలనంలోని కవులు ఉదాహరింపదగినవారే.

దేవులపల్లి కృష్ణశాస్త్రి - గురుస్తుతి చేస్తూ వ్రాసిన పద్యం
"ఈ జడ జీవితమ్ము పలి కించితి వీ అఘ పంకమందు అం
భోజము మొల్వ జేసితివ పూర్వము నీదయ, ఈ నిశీధి నీ
రాజన మెత్తినావు విపులమ్మగు నీ యెద నిండె ఏ శర
ద్రాజిత చంద్రకాంతులమృతమ్ములు స్వర్గలతాంతవాసనల్".

విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన రామాయణ కల్పవృక్షం - శ్రీ గడియారం శేషశాస్త్రి వ్రాసిన శివభారతం మున్నగు ఆధునిక కావ్యాలలో సంప్రదాయ సిద్ధమైన ప్రాచీన పద్య శిల్ప రేఖలు కోకొల్లలు. తిరుపతి వెంకట కవులు పద్య విద్యను పునరుద్ధరించారు. శ్రీ పింగళి లక్ష్మీ కాంతం గారి మాటలలో చెప్పాలంటే "తిరుపతి వెంకట కవుల కవిత" ప్రాచీన సరళికి భరత వాక్యం - నవీన సరళికి నాంది" శ్రీ కాటూరి పింగళి వ్రాసిన సౌందరనందం పద్య శిల్ప సౌష్ఠవం నిండిన కవితామానస సరోవరం, అందులో ఒకపద్యం.

"కొడుకులు లేనివారలకు కూరిమిబిడ్డవు మాతృహీనులౌ
బుడుతల కెల్ల తల్లివయి పోషణ సేయుము నా యనంగలే
కడవెడు దీనులన్ మనుపు మార్తుల కాదరులై భజింపు మీ
పుడమి దినమ్ము సల్పు మిదెపో పరమార్థము బౌద్ధ జాతికిన్"

శ్రీ జాషువా కవి వ్రాసిన ప్రతి పద్యము శిల్పసుందరమే. ప్రతి పద్యంలో వేయి సంవత్సరాల సాహితీ వారసత్వం తొణికిసలాడుతుంది.

"నాయకురాలిమాయ కదనమ్మున మా పలనాటి పౌరుష
శ్రీయడుగంటె - గడ్డి మొలిచెన్ పులిచారల గద్దె మీద; కెం
జాయ మొగాన శ్రమ్మ జలజ ప్రమదామణి నాగులేటిపై
వ్రాయుచుచున్నదిప్పటికి బాలుని శౌర్య కథా ప్రబంధముల్".

కరుణశ్రీ శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి కలంలో తెలుగు పద్య విద్య పరాకాష్ఠ చెందింది. పదలాలిత్యంతో పాటు అదనంగా ఆయన యతిప్రాసలకు - అను ప్రాసలు కూర్చుకున్నాడు. దానికి సోదాహరణంలోని ఒక పద్యం.

"విరికై తుమ్మెద లీల నా హృదయ మువ్విళ్లూరు ఎల్లప్పుడున్
హరికై, సత్ కరుణాసుధాలహరికై; ఆనంద మందాకినీ
ఝరికై; నిత్యనివాస శేషగిరికై; సంతృప్త దైత్యేంద్రకే
సరికై; సుందరమందహాస సుషమాసౌభాగ్య సంచారికై" -

నేడు తెలుగు నేల నాలుగు చెరగుల, ఛందోబద్ధమైన పద్యాలు వ్రాసే కవులు ఎందరెందరో ఉన్నారు. పద్యకవితకు సంప్రదాయ సాహితి అని పేరు పెట్టటం సమంజసం కాదు. పద్య కవులలో సంప్రదాయ విధేయులు కానివారు పలువురు ఉన్నారు. మంగిపూడి వారి నిరుద్ధ భారతం - జాషువా గారి గబ్బిలం - రామస్వామి చౌదరి గారి పద్య రచనలు ప్రాచీన సంప్రదాయాలను నిశితంగా విమర్శించిన మరెన్నో పద్య రచనలు ఉన్నాయి. పద్యాలలో సామ్యవాద ప్రబోధం చేసినవారు ఉన్నారు. విప్లవవాదులు ఉన్నారు.

తెలుగు పద్యం - సులువుగా కంఠస్థం చేయవచ్చు. ఇది బహు భాషా కోవిదులకు అనుభవైకవేద్యం. సృష్టిలో మనుష్య గాత్ర యంత్ర విన్యాసానికీ, తెలుగు పద్య శిల్ప సౌష్ఠవానికీ ఏదో అనిర్వచనీయమైన అవినాభావ సంబంధం ఉంది.

అంతేగాక - ఎన్నెన్నో పద్య శకలాలు - తెలుగువారి నాలుకపై నాట్యమాడుతూ ఉంటాయి.

ఊరక రారు మహాత్ములు - నీటి కొలది తామర సుమ్మీ - నిండు మనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్ర తుల్యము - కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నములు - అధికారంతము నందు చూడవలె గాదా ఆ అయ్య సౌభాగ్యముల్ - ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే గదా -

బుద్ధి జాడ్య జనిలోన్మాదుల్ గదా శ్రోత్రియుల్ - వనిత తనంతరా వలచి వచ్చిన చుల్కనగాదె ఏలికిన్ - గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్ - వృద్ధుల బుద్ధులు సంచరింపవే - నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష - విద్య యొసగును వినయంబు ఇట్టి ఉదాహరణములు - అంతం లేని ఆకృతి గణమే.

"చదలంపైన సూర్య చంద్రులుండెడి దాక,
ఉర్విపైన కొండలుండువరకు,
జగతి నవల వరకు - శబ్దార్థ సంక్రాంతి,
తెలుగు పద్య దీప్తి - తేజరిల్లు.

## శతకములు

ఆంధ్రవాఙ్మయంలో తెలుగుదనంతో గుబాళించే రచన శతకం. ఇందు నూరు పద్యాలు ఉండవలెనని శతక శబ్దం చాటుచున్నది. సాధారణంగా నూట యెనిమిది పద్యాలు ఉంటాయి.

( ) శతకంలో ప్రతిపద్యం - స్వయం సంపూర్ణమైన ముక్తకమే. చాటువుకు శతక పద్యానికి గల భేదం ఒకటే. శతకంలోని పద్యాలలో అంతర్వాహినియైన ఐక్య సంధానం ఉంటుంది.

( ) శతకమునకు ఒక మకుటం ఉంటుంది. సుమతీ- దాశరథీ కరుణా పయోనిధీ - శ్రీ కాళహస్తీశ్వరా మున్నగు మకుటాలు సుప్రసిద్ధాలు.

( ) శతకంలో ఇతివృత్తం ఉండదు. శతకాలు కథానుసంధాయికాలు కావు.

( ) శతకాలు ప్రబోధాత్మకాలు, ఆప్రబోధం నీతిగాని - భక్తిగాని - శృంగారం గాని వైరాగ్యం గాని కావచ్చు.

శతకం - కవి హృదయం చేసే ఆత్మ నివేదన ఆత్మాశ్రయమైన భావోద్వేగం శతకానికి ఆత్మ

శతక కవిత స్వీయ హృదయ నివేదనమే. కవి చిత్త శుద్ధి సహృదయులను ఆకర్షించటం సహజం.

తెలుగులో శతకాలు కోకొల్లలు. ప్రాచీన శతకాలు - సర్వేశ్వర శతకం - వృషాధిప శతకాలు. సుమతీ శతక కాలం తెలియదు.

కనకపు సింహాసనమున
శునకము కూర్చుండ పెట్టి శుభలగ్నమునం
దొనరగ పట్టము గట్టిన
వెనుకటి గుణమేల మాను వినరా సుమతీ.

సుమతీ శతకం లోని పద్యాలు - తెలుగు దేశంలో చదువురాని వారికి గూడ కంఠస్థాలు. ఆ శతకాలలోని పద్యాలు లోకానుభవ దర్పణాలు.

కమలములు నీటబాసిన
కమలాప్తుని రశ్మిసోకి కములిన భంగిన్
తమతమ నెలవులు తప్పిన
తమ మిత్రులె శత్రులగుట తథ్యము సుమతీ.

భాస్కర శతకం - విద్యావంతులలో బహుళ ప్రచారం పొందింది.

"పండితులైనవారు దిగువంబడియుండగ అల్పుడొక్కడు
ద్దండత పీఠ మెక్కిన బుధ ప్రకరంబుల కేమి యెగ్గగున్ ?
కొండొక కోతి చెట్టు కొన కొమ్మల నుండగ క్రింద గండభే
రుండ మదేభ సింహ నికురుంబములుండవె చేరి భాస్కరా."

శతకంలో కవి వ్యక్తిత్వ ముద్ర ప్రతిఫలించినట్లుగా మరియే ప్రక్రియలోనూ కన్పించదు.

ధూర్జటి మహాకవి రచించిన శ్రీ కాళహస్తీశ్వర శతకం - ఆంధ్ర శతక వాఙ్మయంలోనే గాక విశ్వ సాహితీ జగత్తులో శిఖరాయమానమైన రచన. అష్టదిగ్గజకవులలో ప్రథముడుగా భువన విజయంలో ప్రధానుడుగా శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానకవి అల్లసాని పెద్దన - రాయల మరణానంతరం-

"బ్రదికియున్నాడ జీవచ్ఛవంబు నగుచు" అని వాపోయాడు.

## ధూర్జటి మహాకవి

"రాజుల్ మత్తులు - వారి సేవ నరకప్రాయంబు వారిచ్చు అం
భోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్షచాలు - పరితృప్తిం బొందితిన్ జ్ఞానల
క్ష్మీ జాగ్రత్ పరిణామ మిమ్ము - దయలో - శ్రీ కాళహస్తీశ్వరా"

అన్నాడు. అంతేకాక - కవిత్వాన్ని గూడ భగవత్ సాన్నిధ్యంలో కర్పూరహారతి గ సమర్పించిన జీవన్ముక్తుడు.

"ఏ లీలన్ నుతియింపవచ్చు ఉపమోత్ప్రేక్షా ధ్వని వ్యంగ్య శ
బ్దాలంకార విశేష భాషల కలభ్యంబైన నీ రూపమున్
చాలుంజాలు - కవిత్వముల్ నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీ! లజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీ కాళహస్తీశ్వరా" -

శ్రీ కాళహస్తీశ్వర శతక పద్యాలు సాహితీ ప్రపంచంలో హిమవన్నగ సదృశాలు. భూగోళంలో హిమాలయా పర్వత శిఖర పరంపరలు అత్యద్భుతములు అయితే శ్రీ కాళహస్తీశ్వర శతక పద్యాలు పద్య శిల్ప సౌష్ఠవ శిఖరాయితములు. మకుటంలో "శ్రీ" యతి స్థానంలో పడింది. నూరు పద్యాలలో నూరుచోట్ల అను రూప యతులు ప్రయోగించటం - ధూర్జటి ఛందశ్శిల్పంలో సాధించిన అక్షర విజయం.

భద్రాచల రామదాసు రచించిన - దాశరథీ శతకంలో

కూడా మకుటంలో "థ" యతి స్థానంలో పడింది. దాశరథీ శతక పద్యాలు జలపాత సదృశాలే. రామదాసు భక్తి, ఆలోచన దాటి ఆవేశ స్థాయికి చేరినట్టిది. యుగ యుగాంతరాలుగా సహృదయులైన భక్తులు ఆ పద్యాలు చదివి సద్యః సదనిర్వృతిని అనుభవించగలరు.

"భండన భీము డార్త జన బాంధవు ఉజ్జ్వల బాణతూణన్
దండ కళాప్రచండ భుజతాండవ కీర్తికి రామమూర్తికిన్
రెండవ సాటిదైవమిన్ లేడనుచున్ గడకట్టి - భేరికా
దాండ డుడాండ దాండ నినదమ్ముల జాండమునిండ - మత్తవే
దండము నెక్కి చాటెదను దాశరథీ - కరుణాపయోనిధీ.

నూరు సంఖ్య దాటి నప్పటికీ లోకం వేమన పద్యాలను "శతకం" కోసకే చేర్చింది. కారణం - సుప్రసిద్ధమైన "విశ్వదాభిరామ వినుర వేమ" అనే మకుటం మాత్రమే గాక - ప్రతిపద్యంలో వేమన ఆత్మీయత ప్రతిఫలించటం - నీతి ప్రబోధం ఉండటం.

నీటిలోన మొసలి - నిగిడి యేనుగు లాగు
బయట కుక్క చేత భంగపడును;
స్థానబలిమిగాని - తన బల్మి కాదయా
విశ్వదాభిరామ వినుర వేమ

వేమన పద్యాలు తెలుగు ప్రజల నాలుకలపై యుగయుగాంతరాల నుండి నాట్యమాడుచున్నాయి. వేమన, యోగిగా - సంస్కరణ ప్రియుడుగా స్వతంత్ర భావుకుడుగా ప్రజాకవిగా తెలుగువారికి సదా ఆరాధ్యుడు.

## వేమన పద్యాలలో

వేమన పద్యాలలో - ప్రత్యేక శిల్ప సౌష్ఠము ఉంది. తెలుగు యతి ప్రాసలతో పాటు వేమన సంస్కృత విశ్రాంతిని కూడ పాటించాడు. అంతేగాక పద్యంలో భావంలో ప్రతిపాదం స్వయం సంపూర్ణంగా ఉంటుంది. తెలుగు ఛందస్సులో "ఆట వెలది"లో ఉయ్యాల తూగు ఊపు ఇమిడి ఉంది. పేరు సార్థకమైనట్లు అనిపిస్తుంది. ఆ విధంగా వేమన అనగానే ఆటవెలది స్ఫురిస్తుంది.

తెలుగులో ఛందోమాధుర్యం పరాకాష్ఠ చెందిన శతకం "ఇందూ" శతకం.

"బృందారణ్యము నేమనూ? అచటి గో బృందంబుల్ కడున్ లెస్సలా?

నందుండున్ సతియున్ సుఖాన్వితులె నానాగోప గోపాలికా

సందోహంబులతో హలాయుధుడు కృష్ణస్వామి క్రీడింతురా?

ఇందూ నందుని మంద నుండి కద నీవే తెంచుటన్ రాకలున్ "

'బిందు పూర్వకదకార ప్రాసలు ఈ శతకంలో మూడు వందలు పై చిలుకు ఏర్చికూర్చబడ్డాయి కద. ఇది ఆంధ్ర సారస్వత జగత్తులో ఒక అత్యద్భుత ఛందో విలాసం.

శతకవాఙ్మయం గూర్చి ప్రస్తావించేటప్పుడు - విస్మరింపరానిది భర్తృహరి నీతి శృంగార వైరాగ్య శతకాలు - తెలుగులోకి సంస్కృతం నుండి - ఏనుగు లక్ష్మణ కవి చేసిన అనువాద పద్యాలు. విశ్వసాహితీ జగత్తులో - దీప స్తంభ దీధితులు వెల్లివిరియ చేసేవి భర్తృహరి సుభాషిత త్రిశత శతకానికి "ప్రబోధం" ఆత్మ. భర్తృహరి సుభాషితాలు అంతర్జాతీయ విఖ్యాతిని ఆర్జించాయి. సంస్కృత మూల శ్లోకాల కంటె ఏనుగు లక్ష్మణ కవి తెలుగు అనువాద పద్యాలే మేల్తరములు. అందుకు ఒక కారణం తెలుగు పద్య శిల్ప సౌష్ఠము.

"సంగ్రహించు కొరకు - సకల విజ్ఞానమ్ము
భారతమ్ము చదువ వలెను -నరులు;
భారతమ్ము నెల్ల పఠియింప లేనిచో
చాలు - భర్తృహరిని చదువదగును".

ఏనుగు లక్ష్మణ కవి అనువాద పద్యాలు - హృద్య పద్య శిల్ప సౌష్ఠవ విన్యాస విలసితాలు.

"విద్యచే భూషితుండయి వెలయుచున్న
తొడరి వర్జింపదగు సూవె దుర్జనుండు;
చారుమాణిక్యభూషిత శస్తమస్త
కంబయిన సన్నగము భయంకరము గాదె!

ఏనుగు లక్ష్మణ కవి పద్యాలు తెలుగులో అక్షరాస్యులను అందరినీ ఆకర్షించగలవు.

"గ్రాసము లేక స్రుక్కిన - జరాకృశమైన - విశీర్ణమైన - సా
యాసమునైన - నష్టరుచి యైనను - ప్రాణ భయార్తమైన
సం
త్రాసమదేభ కుంభ పిశిత గ్రహలాలస శీల సాగ్రహా
గ్రేసర భాసమానమగు కేసరి జీర్ణ తృణంబు మేయునే?"

తెలుగులో ఆధునిక యుగంలో మిక్కిలి ప్రచారం పొందినది. "భక్త చింతామణీ" శతకం. పద్యం నగిషీ చెక్కటంలో రచయిత వడ్డాది సుబ్బరాయకవి చూపిన ప్రజ్ఞ ఉగ్గడింపదగినట్టిది. స్థూల దృష్టికి అది భక్తి యోగంగా భాసించినప్పటికీ, సూక్ష్మ దృష్టిలో పరికిస్తే అది భారతీయ విజ్ఞాన భాండాగారంగా స్వయంవ్యక్తం కాగలదు.

"నిముషంబైనను విశ్రమింపడొకచో నీరేజ మిత్రుడు - సం
ద్రము తానించుక మేరమీరదు - జగత్ ప్రాణుండు వీచున్
సదా
క్షమ సర్వంబు వహించు - నీరదము వర్షం బిచ్చు కాలానుసా

రముగా- నీవతి చండశాసనుడ వౌరా ! భక్త చింతామణీ.

తెలుగులో ఇంతకు ముందు ఎందరో కవులు శతకాలు వ్రాశారు. ఈ యుగంలో పలువురు వ్రాస్తున్నారు. భవిష్యత్ కాలంలో గూడ ఎందరో కవులు శతక రచన చేయటం తథ్యం.

## పద్యకవిత – సామాజిక స్పృహ

ఆధునిక విమర్శకులు – తెలుగు పద్య కవితపై మోపే నీలాపనింద ఒకటి ఉంది. "తెలుగు పద్య కవితకు సామాజిక స్పృహ లేదు" అని. పద్య కవులు 'ఆకుల్ రాలని పూలు వాడని వసంతారామ మధ్యమ్ముల్ రాకాచంద్ర సహస్రముల్ వెలుగు హర్మ్యాగ్రాలలో" నివసిస్తారు. అనీ – రాజులకూ ప్రభువులకు వారు బానిసలయ్యారనీ అధిక్షేపణ. ప్రాచీనాంధ్రకవులందరూ తాము "జగద్ధితమ్ముగా" రచన చేస్తున్నామనే వ్రాశారు. 'విశ్వ శ్రేయః కావ్యమ్' అని ఉద్ఘోషించారు. నన్నయ – సంస్కృత భాషలో పుట్టి పెరిగినట్టివాడు పంచమ వేదమైన మహాభారతాన్ని తెలుగులో వ్రాయటానికి ఉద్యమించటమే ఒక ప్రగతి వాఙ్మయయజ్ఞం. అభ్యుదయ సారస్వత సత్యయాగం. తిక్కన హరిహరనాథోపాసన జగద్ధిత సంకల్పమే. ఎఱ్ఱన –సమకాలీ స్వాతంత్ర్యోద్యమ ప్రవర్తకుడు. విద్యారణ్య మహర్షికి పూర్వరంగ ప్రవర్తకుడు. దేశభక్తుడు. శ్రీనాథ మహాకవి చేసిన రాజనిగర్హణ – విమర్శకులు విస్మరించుచున్నారు. "లక్ష్మీ కటాక్షలీలా సీధు మదమున మనముల్లోపల మున్నుకొనని" భూపతి లేడట !! అన్నాడు శ్రీనాథుడు.

"ఇమ్మనుజేశ్వరాధములకు" – కృతి ఇవ్వనని ప్రతిజ్ఞ చేశాడు పోతన. మంచెన కవి

బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్

మూళలకిచ్చి అప్పడుపుకూడు భుజించుట కన్న సత్కవుల్

హాళికులైన నేమి? గహనాంతర సీమల కందమూలకే

ద్దాళికులైన నేమి? నిజదారసుతోదర పోషణంబుకై. అన్నాడు ఎలుగెత్తి

సంకుసాల నృసింహకవి – ప్రభువులను అందరిపై దుమ్మెత్తి పోశాడు. శ్రీకృష్ణ దేవరాయలకు ఆశ్రితుడయిన అల్లసాని పెద్దన గూడ మను చరిత్రలో బాహాటంగా రాజుల బహు భార్యాత్వమును నిరసించాడు. స్వరోచి – ముగ్గురు రాణులతో విహరించే సందర్భంలో హంసతో లేడి

"కావున దాసీనికరము

కైవసమై సంచరించు క్రమమున విద్యా

ప్రావీణ్య వైభవోన్నతి

చే వచ్చిన వారి వీరి చెప్పకు మింకన్ ' – అని వెక్కిరించింది.

ధూర్జటి మహాకవి చేసిన రాజనిగర్హణ విస్మరింపరానిది

రాజుల్ మత్తులు వారి సేవ నరకప్రాయంబు – వారిచ్చు అం

భోజాక్షీచతురంతయాన తురగీ భూషాదులాత్మ వ్యధా బీజంబున్

"

అన్నాడు.

వేమన కవిత్వం అంతా సమకాలీన సామాజిక స్పృహతో నిండి ఉంది. వేమన యథాక్షరంగా దిగంబర కవి. అక్షరాలా అభ్యుదయ కవి. అసలు కవిత్వం అంటే ఏమిటి?

ఆమె పేరు కవిత – అతిలోక సుకుమారి,

సవతి తల్లి జగతి చావగొట్టు;

కారుకంటనీరు మూరు ముత్యాలుగా

కోరి ఏరుకొనని వారలెవరు?

కాంతాసమ్మితంగా – కవి- కర్తవ్య బోధ చేయాలని ఆలంకారిక నిర్దేశం.

నేడికాదు – కవిత – విరుబూచు వెన్నెలే

కవిత–నాడి పదును కత్తి కాదు.

కర్తవ్య ప్రబోధం – కవితకు జీవనాడి

ప్రతి కవీశ్వరుండు – పైగంబరుడు గదా

ధర –నిరుక్త వక్త – ద్రష్ట – స్రష్ట;

బధిర సంఘమునకు – బహిరంత రాత్మలై

కదల గలరు – కవులు – మెదలగలరు.

ఆధునిక యుగంలో శ్రీ కందుకూరి వీరేశలింగంగారు తమ కలాన్ని సంఘ సంస్కరణకు పదునైన కత్తిగా ప్రయోగించారు. అవినీతి పరుడైన ఒక న్యాయాధిపతి ఆయన ధాటికి తట్టుకోలేక – ఆత్మహత్య చేసుకున్నాడు.

– చిలకమర్తి లక్ష్మీ నరసింహం కవి వ్రాసిన ఒక తేటగీతి పద్యం – సమకాలీన స్వాతంత్ర్యోద్యమమునకు దోహదం కల్పించింది.

"భరత ఖండమ్ము చక్కని పాడి ఆవు;

హిందువులు లేగదూడలై యేడ్చుచుండ;

తెల్లవారను టక్కరి గొల్లవారు

పితుకుచున్నారు – మూతులు బిగియ గట్టి " –

గాంధీ యుగంలో ఎందరెందరోకవులు జైళ్ళకు వెళ్లారు. పలువురు పద్య కవితలు వ్రాశారు. భావకవులలో పలువురు

కవుల పద్య రచనలకు "దేశభక్తి" - అంతరాత్మగా భాసించింది. రాయప్రోలు వారి "ఏదేశ మేగినా ఎందుకాలిడిన - ఎప్పరేమనిన

పొగడరా నీ తల్లి భూమి భారతిని" - ఆధునిక కవితకే పల్లవియైనది. గరికపాటి మల్లావధాని వంటి దేశభక్తులు కారాగారంలో కూడ అష్టావధానాలు చేశారు.

పురుషుల మాటకేమి పూబోడులు సైతము అమ్మవారి జాతరయని పోజు ఉద్యమరథఃబుములాగుట క్రగయానలై

వెరలకు ఏగి - క్రూర తర శిక్షలకున్ గురియై - మహాత్మునాదరమున మున్నసల్ గొనిరి - తల్లి - భవత్ కృప- భారతాంబికా.

ప్రాచీన సంప్రదాయాలపై దండెత్తిన త్రిపురనేని రామస్వామి - సంప్రదాయ పద్య శిల్పంపై అధిక్షేపణకు దిగలేదు. ఆయన వ్రాసిన కవిత - తెలుగు పద్య శిల్ప సౌష్టవ దీధితులలో వెలుగొందుచున్నది.

"మలమల మాడుపొట్ట తెగమాసిన బట్ట కలంత నెట్టగా
విల విల యేడ్చుచున్న నిరుపేదకు - జాలిని చూపకుండ - ఉత్తలపడిపోయి - జీవ రహితుండగు బొమ్మకు ఇండ్లు వాకిళుల్
పొలములు పొట్ట ఇచ్చెడి - ప్రబుద్ధులు - దాతల - నిచ్చ మెచ్చెదన్."

తుమ్మల సీతారామమూర్తి గారు గాంధీ మహాత్ముని ఆత్మకథ పద్యకావ్యంగా వ్రాశారు. వేదుల సత్యనారాయణ శాస్త్రి

"వెలిగించు కాగడా వెలిగింపవోయి - అర్థమత్తుల కధికార దృష్టులకు

భోగదాసిగ నున్న భూదేవి కొరకు" అని వ్రాశారు.

ఒక పువ్వు అనుకొంటుంది -

పేదల రక్తమాంసముల పెంపు వహించి దయారసాసుధారసా

స్వాదదరిద్రులైన ధనవంతుల పెద్దరికమ్ముకై -మతో

న్మాదము పెంచు దేవునకు మారుగ నిల్చిన రాతి బొమ్మలం

దూదర నోవు పాడు బ్రదుకొక్క నిమేషము సైప నా హృదిన్.

నీచపు దాస్య వృత్తి మననేరని భారత - మాతృదేశసే

వాచరణ మ్మునం దసువులర్పణ చేసిన వారి పార్థివ

శ్రీ చెలువారు చోట - తదస్రుగుచులన్ వికసించి - వాసనల్

వీచుచు వాడిపోవగ వలెన్ - తదుదాత్త సమాధి మృత్తికన్.

దేశభక్తుల సమాధి మట్టిలో కలిసిపోవటమే ఆ పువ్వు జీవితాశయం !

సమకాలీన సమాజంలోని లోపాలను నిశితంగా విమర్శించటమే అభ్యుదయ కవిత్వం అయితే పద్యకవితలో కూడ ఆ కోవకు చేరేవి ఎన్నో ఉన్నాయి.

"జిత్తుల మారి నక్కలును చిల్లర దైవము లడ్డగాడిదల్
నెత్తురు ద్రావు జెబ్బులును నేతలుగా రధికార దుర్మదో
న్మత్త పిశాచ జన్ముల భిమాన దరిద్రులు లంచగొండులున్
చిత్తుగ ఓడువెన్నడు? నశించుట ఎన్నడు భారతాంబికా !"

పద్య కవులు అందరూ సనాతన సంప్రదాయ పరాయణులైన శ్రోత్రియులు అనుకోరాదు.

"హేతువాదనిత్య చైతన్య జగతిలో
శ్రోత్రియత్వమునకు చోటు లేదు;"

అని వ్రాసిన పద్య కవులు ఉన్నారు. సామ్యవాద ప్రవక్త మార్క్సుపై పద్య కవితలు వెల్లి విరిసాయి.

"మనిషి శ్రమకు - రత్న మాణిక్యముల కంటె
విలువ తెచ్చినావు విశ్వమందు !
కాల పురుషు గుండె గడియారమును దిద్ది
మార్క్సు ఋషివరేణ్య ! మార్చినావు !

కమ్యూనిస్టు మేనిఫెస్టో తెలుగు పద్యంలో అవతరించింది.

"కార్మికులు - రండు - అందరేకమ్ముగండు
ఎల్లలెల్ల మరచి - చేరి-యేకమగుడు;
భూమిపై మీకు పోయెడి దేమి కలదు?
తుప్పు పట్టిన సంకెళ్ళు తప్ప-లెండు "
ఎంతమంది చెమట - ఎందరి నెత్తురు
పిండకుండ ఎవడు పేర్చె ధనము !!
దొరలు చేసినట్టి - దోపిడీయే ఆస్తి
అంతరించవలయు ఆస్తి హక్కు.. ఈ ఆటవెలది పద్యంలో సామ్యవాద సార సంగ్రహం.

జాషువా కవి వ్రాసిన గబ్బిలం కావ్యంలో సామాజిక స్పృహ అగ్ని పర్వత విస్ఫులింగాలు - భూకంప ప్రకంపనాలు చిమ్ముతున్నాయి.

కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి కవితలలో సహస్ర సంవత్సరాల తెలుగు పద్య శిల్ప సౌష్టవం పరాకాష్ఠ చెందింది.

"ప్రేయసి కన్నుదోయి కనిపించెడి తీయని స్వర్గమొక్కటే
ధ్యేయము కాదు - హీనులతి దీనుల మ్లానతనుక్ - దరిద్ర నారాయణు కీడ్చుచుండిరి తదశ్రువులన్ తుడువంగ బొమ్మ ...

కరుణశ్రీ - సహృదయ హృదయాలను దున్ని క్రొత్త విలువలు పండించటానికి ప్రయత్నించాడు. ...జగన్నృత్య స్వరూపం చూడగలిగాడు

కుక్షిస్థంబగు కుళ్లెరుంగడూ కృశాంగుండే డ్వీకీకీద్వగా
రిక్షాపై జనుచున్న ఆ పశువు దారిన్ తొల్గిపోవంచు-ని
న్నాక్షేపించును పండుకోతివలె మోమంతా కనుల్ చేసి ఏ
నెూ క్షోభించును కొంపమున్గినటులబ్బో ఎంతబిచ్చోకమో!!

"గంగనీరుతెచ్చి కానేటిలో కల్పు
వరదబాధ తగ్గు కరువుతగ్గు
కలియుగాననచ్చి - కన్యాకుమారిలో
పొంగిపొరలి-బ్రహ్మపుత్రకాల్వ"

అని జగద్ధితాకాంక్షి వ్రాస్తే -పద్యం కాబట్టి- యతి ప్రాసలున్నాయి కాబట్టి అది పాతచింతకాయపచ్చడే అవుతుందా? పాతక్రొత్తలగూర్చి కాళిదాసమహా కవి ఆవేదన సుప్రసిద్ధం.

" పాతదైనదెల్ల బంగారమూ- కాదు
కొత్తదైనెల్ల చెత్త-కాదు
మంచి ఎచటనున్న-పొంచి-గైకోవచ్చు
ప్రాజ్ఞుడైన యెడల-పండితుండు

నవయుగ వైతాళికుడుగా అభ్యుదయవాదులు కీర్తించే గురజాడ అప్పారావుగారు కోరుకొనినది.

"కొత్త పాతల మేలికలయిక"

వచనకవులలో కనిపించే జలపాత సర్వశక్తైన భావయిత్రి పద్యకవులలో కనిపించే మానస సరోవర గభీర తుల్యమైన కారయిత్రి కలుస్తే ఎంత బాగుంటుంది!

వచన కవనమునకు వ్యతిరేకమా?కాదు.
పద్యకవిత శిల్ప పరిధి వేరు
సలుపదగును-కవులు-సహజీవనము-మైత్రి
పద్యగేయ వచన పథములందు

తెలుగు పద్యకవితకు ఉజ్వల భవిష్యత్తు ఉంది. ప్రగతి శీలురై తెలుగులో నేటి పద్యకవులు ఇతోధికమైన సామాజిక స్పృహ వెల్లి విరియచేస్తున్నారు. శుభమస్తు.

కవిత - ఆంతరంగిక స్వగతంకాదు
కవిత - జగత్ కల్యాణకోసం జరిగే సారస్వత సత్రయాగం
దేశభక్తి - భౌగోళికమైన విగ్రహారాధన కాదు
భవిష్యదాంధ్రకవిధ్యేయం ఏమిటి?

ప్రపంచంలోని కవులందరి ధ్యేయం - ఒకటే . అది జగద్ధితాకాంక్ష.

మెదడు లోన మార్క్సు - హృదిలోన బుద్ధుడై
విప్లవమ్ము -కరుణ - వింగడించి
పుట్టుగాక - "సుకవి" - భువనైక వీరుడై
ప్రగతికొరకు - నూత్న జగతి కొరకు."

## అవధాన కళ

"ఆంధ్ర భాష నున్న దష్టావధానమ్ము,
వేరుచోటలేదు - వెదకి చూడ!
తెలుగు తళుకు బెళుకు - స్థిరతటిల్లత పోలె
విశ్వ మెల్ల వెల్లివిరియ జేయు."

అష్టావధానాలు - శతావధానాలు ఆంధ్రసంస్కృతికి కల్పించిన సమున్మేషం సుప్రసిద్ధం. ప్రపంచంలో ఏ భాషలోనూ, ఈ అద్భుత [illegible] కన్పించదు.

అవధానం అనే మాటకు అర్థం - ఏకాగ్రత. తదేక నిష్ఠ. ఛందోబద్ధమైన కవిత్వం - తీరికగా కూర్చుండి వ్రాయటమే కష్టం. ఇక-ఆశువుగా-పద్యః స్ఫూర్తితో -పృచ్ఛకుల దాడిని ఎదుర్కొంటూ చెప్పటం మరీ కష్టం. వాఙ్మయరంగలో అడ్డుకట్టడాలను దూకి దాటుతూ, వేగంగా ముందుకు దూసుకుపోయే పరుగుపందెం ఇది.

అద్యతనాంధ్ర కవి ప్రపంచ నిర్మాతలుగా పేరుకెక్కిన తిరుపతి వేంకటకవులు అవధాన ప్రక్రియలో ప్రాతః స్మరణీయులు. వారి సమకాలీనులు అర్వాచీనులు సమర్థులైన అవధానులు ఆంధ్రదేశంలో ఎందరో ఉన్నారు. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు ఆస్థానకవిగా నియుక్తులైనప్పుడు జరిగిన సన్మాన సభకు అధ్యక్షత వహించిన వారు కీర్తిశేషులు కట్టమంచి రామలింగారెడ్డిగారు. ఆయన ఆనాడు అన్నమాట."ఇచ్చట నేడు విజయవాడలో ఎచ్చట చూచినా కవులే. ఆహా ఆంధ్రసీమలో ఎంతమంది కవులు ఉన్నారు! ఇప్పుడు ఒక రాయి ఆకాశంలోకి విసురుతే అది ఎవరో ఒక కవి నెత్తిపై పడడం తథ్యం". ఆయన విసిరింది రాయికాదు. ఒక ఛలోక్తి మాత్రమే.

అవధానానికి ఆయువు పట్టు 'ఆశుకవిత' శతఘంటకవులు. గంటకు నూరుపద్యాలు గడగడా చందోబద్ధంగా చెప్పగల కవులు తెలుగు చరిత్రలో పలువురు. శతావధానం ఆశుకవితా ప్రక్రియ ప్రధానంగా నూరుమంది పృచ్ఛకులు కోరిన శీర్షికలపై అవధాని ఆశుకవిత చెప్పాలి.

అష్టావధానం శతావధానం కంటె గూడా కష్టమైన ప్రక్రియ అంటారు. అందులోని అష్టాంగాలు 1. సమస్యాపూరణం 2.

ఆశుకవిత 3.లోకాభిరామాయణం 4. చదరంగం లేదా ఘంటా సివాడం 5. నిషేధాక్షరి 6. న్యస్తాక్షరి 7. దత్తపది 8. గణితం.

సమస్యాపూరణం - అష్టావధానంలో హృదయంగమమైన అంశం. ఒక పద్యపాదమో, లేక పద్యపాదంలో ఒక భాగమో పృచ్ఛకులు "సమస్యగా" అవధానికి ఇస్తారు.

ప్రతిసమస్యలో ఒక వైరుధ్యం - వైచిత్ర అంతర్గర్భితంగా ఉంటుంది. సమస్యాపూరణం ఒక విచిత్ర విరోధాభాసంగా పరిణమిస్తుంది "సమన్వయ సాధన - సమస్యకు జీవనాడి.

సమస్యాపూరణం - అవధానములలోనేకాక సారస్వత సామాజిక క్షేత్రంలో గూఢ సమస్యాన్వేషం కల్పించటం సహజం. శ్రీకృష్ణదేవరాయలు భువన విజయ సదస్సులో "సమస్యలు" ఇచ్చేవాడని ప్రసిద్ధి. భువన విజయంలో రాయలవారికి వింజామరవీచే రజక మహాశయుడు -వీధిలో తెనాలి రామకృష్ణునకు ఇచ్చిన సమస్య "కుంజరయూధమ్ము దోమ కుత్తుక చొచ్చెన్", తెనాలి రామకృష్ణుని పూరణ

గంజాయి తాగి తురకల
సంజాతుల గూర్చి కల్లు చవిగొన్నావా!
లంజాకొడుకా! ఎక్కడ
కుంజర యూధంబు దోమకుత్తుక చొచ్చెన్.

ఆసమస్యనే భువన విజయసభలో రాయలవారే రామన్న ఇచ్చినపుడూ ఆతని పూరణ వేరు

రంజన చెడి పాండవులరి
భంజనులై విరటు గొల్వ పాల్పడిర కటా
సంజయ! విధి నేమందును
కుంజరయూధమ్ము దోమ కుత్తుకచొచ్చెన్

ఈ పూరణలోని ఆశుకవితాముద్ర వేత్తలకు విదితపూర్వమే. అవధాన పద్యాలలో కవిత్వం పాలు తక్కువ అని నిరసించేవారు సైతం ఈ పూరణ విన్నపుడు తలలూపక తప్పదు. అసలు భారతంలో గూడ ఇంత రసవత్ పద్యం ఉన్నదా? అనిపిస్తుంది.

'అరయంగా కర్ణుడీల్గె ఆర్గురి చేతన్" - ఒక సమస్య ఒక అవధాని -శ్రీకృష్ణుడు ఆ మాట అర్జునునితో అన్నట్లుగా మలచి పూరించాడు.

నరవర! నీచే నాచే
వరమడిగిన కుంతి చేత వాసవు చేతన్
గురుచేత శల్యుచేతను
అరయంగ కర్ణుడీల్గె ఆర్గురి చేతన్!

"భల్లూకపు కడుపులోన - భానుడు క్రుంకెన్" సమస్యకు పూరణ

అల్లంత ప్రొద్దుకాడను
విల్లుంగొని వేటకాడు వేయదొడంగెన్
చిల్లరనకోలచిక్కెను
భల్లూకపు కడుపులోన - భానుడు క్రుంకెన్.

"ఎలుకలు తమ కలుగులోని కేనుగు నీడ్చెన్"

ఇలలో ఇద్దరు రాజులు
సలయుచు చదరంగ మాడి మాపటి వేళన్
బలమెత్త మరచిపోయిన
ఎలుకలు తమ కలుగులోని కేనుగు నీడ్చెన్

రావణకుంభ కర్ణులకు రాముడు పుట్టె -గుణాభిరాముడై కరుణశ్రీ, జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి పూరణ

చేవ నొసంగ జాతికిని - జీవ మొసంగగ బండ రాతికిన్
సేవ నొసంగ కోతికిన్ శిక్ష నొసంగగ చుప్పనాతికిన్
దేవమునీంద్ర శాపమును తీరిచి "ముక్తి" నొసంగగా
రావణకుంభ కర్ణులకు రాముడు పుట్టె గుణాభిరాముడై

దత్తపది - సమస్య వలెనే జటిల మైనట్టిది. నాలుగు పదాల్లో పృచ్ఛకుడు ఇస్తాడు. అవధాని వాటిని కథానుగుణంగా సమన్వయించి పద్యంచెప్పాలి. అసందర్భ పదాలకు "సందర్భ శుద్ధి" సమకూర్చాలి. ఆశువుగా ఉదాహరణకు గోలకొండ - మాలముండ- పూలదండ - కొత్తకుండ సుప్రసిద్ధపూరణ

ఓయి ధృతరాష్ట్ర నీ కొడుకుత్త గోల
కొండ, లోక నాశన మాల ముండ నేల?
భండనము గెలిపింతు పాండు సుతుల
ఉదరమున పూలదండ రేకొత్త కుండ.

ఈ మాటలు శ్రీకృష్ణుడు పలికినట్టివని సందర్భం

రండ - ముండ-కుండ-బండ

రామాయణపరమైన పూరణ

రండటుపారిపోవకుడు- ప్రస్తరముల్ గొని తెండటంచు రా ముండని నంత - వానర సమూహములెల్లను జంకు గొంకులే కుండగ మోసి తెచ్చి యటు లొయ్యన భారము నెంచకుండ - పెన్ బంధలు చేర్చి కట్టిరి. శుభస్థిత సేతువు స్వామి మెచ్చగన్.

భారత పరమైన పూరణ

రండటు పారిపోకకుడు రండిటు చావక తప్పదంచు -భీ ముండన కీచకానుజ సమూహము కెల్లరు కేగసిగ్గులే

కుండగపారి పోయి అటు లొయ్యన దాగిరి చెట్టుగుట్ట-సెన్
బండల మాటునన్ బెదరి ప్రాణభయంబున అర్తమూర్తులై
దోసె-పూరీ-వడ-సాంబారు
పూరణ - శ్రీ మాడుగుల నాగఫణి శర్మ
జడలో దోసెడు మల్లెపూలు తురిమెన్ సౌందర్య మొప్పారగా
నడయాడెన్ ఘల్లుఘల్లనన్ హొయలు చిందన జాజిపూరీతి,
పా
వడ అట్టిట్టులు చిందులాడి పడగా - భవ్యాత్మయైనట్టి ఆ
వడతిన్ పార్వతి పెండ్లి యాడితివి సాంబారుద్ర నీ సాటియే.
విభవ - విక్రమ - బహుధాన్య-దుందుభి

రావిపాటి లక్ష్మీనారాయణ పూరణ

అతనిజతో మహా విభవ మారగ విక్రమ శాలియైనరా
ఘపుడభిషిక్తుడయ్యె-పురిగారములో చతురబ్ధికారితో
నవబహుధాన్యసంపద దనర్చ విభీషణ సోదరార్కాజుల్
సవన సుతుండు గొల్వగ దివౌకస దుందుభి మూరు
మ్రోగగన్

ఆంధ్రుల వినోద కాలక్షేపాలలో కూడ పద్య కవితలు చోటుచేసుకున్నాయి.

**పొడుపుకథ**

కాలుచేయి లేదు - కడుపు కొంచెముగాదు.
కంటి కూడు కుడుచు కలహకంఠి
అంటిన మొదలెట్టు అది ఏమిచోద్యమో
దీని భావనేమి? తిరుమలేశ (మల్లెల)
వినోద ప్రశ్న
రాముడెవ్వారిలో రావణు మర్దించె?
వరవాసుదేవుని పురమదెది?
రాజమన్నారుచే రంజిల్లు శరమెద్ది?
వెలయ కామునగవంటి విత్తరెద్ది?
అలరంగ కొప్పులో అలరు మానిక యేది?
ఏలోటు నరునిచే ఇంపుమానె?
సీతకుంకువగాగ చేసిన శరమెద్ది?
సభకేగి నవ్వించు జాణ ఎవ్వ
డన్నిటికి చూడ ఐదేసి అక్షరమ్ము
లొనర ఇరుదెస చదివిన ఒక్క పేరె
సమతిగ చెప్ప సర్వజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగురు నే చిన్నినగవు.

సమాధానాలు: 1 లోకమూకలో 2. రంగనగరం3......4. జంచీరబీజం 5. సుందారదామం 6. నందనదనం7. పంచాస్యచాపం. 8. వికటకవి

పద్యవిద్య - ఆంధ్ర సంస్కృతికి జీవనాడి

## పద్యనాటకాలు

ఆంధ్రసారస్వతంలో ఆధునిక యుగంలో అవతరించిన కొంగ్రొత్త ప్రక్రియ - "నాటకం". ఆంధ్రదేశంలో చతుర్విధాభి నయమయమైన పదాలు కోకొల్లలు. యక్షగానాలు - వీధి భాగవతాలు పూర్వకాలంలో ఉన్నాయిగాని - "నాటకాలు " లేవు. సంస్కృత సాహిత్యం నాటకాన్ని శిఖరాయమానమైన సాహితీ ప్రక్రియగా ఉపాసించింది. పూర్వకవులు సంస్కృతంలోని కావ్యాలు అన్నిటినీ అనువదించారు. నాటకాలను దృశ్యకావ్యాలను - శ్రవ్యకావ్యాలుగానే అనువదించారు. "కావ్యేషునాటకం రమ్యం - నాటకేషు శకుం..లా" అని పేరుకెక్కిన అభిజ్ఞాన శాకుంతలం గూడ తెలుగులో ప్రబంధంగా శృంగార శాకుంతలంగా అవతరించింది. పాశ్చాత్యులు విషాదాంత నాటకాలకు అగ్రతాంబూలం ఇచ్చారు. ఆంగంలో షేక్సిపియరు నాటికలు సుప్రసిద్ధాలు.

ఆధునిక యుగంలో ఆంగ్ల సంపర్కం వల్ల ఆంధ్రదేశంలో దృశ్యకావ్యమైన నాటకం అవతరించింది. అయితే ఆదిలో తెలుగు నాటకాలకు మాతృకలు సంస్కృతనాటికలే. గద్యపద్య సమ్మిళితాలు సంస్కృతనాటికలు.

నాటకం సమాహారకళ సంయుక్త సమగ్రకళ. ప్రాక్తన మానవుని హృదయం రసతరంగిత మైనప్పుడు అతడు ఆడాడు, పాడాడు. ఆ ఆటవిక తాండవాన్ని ప్రస్తరిస్తే, తాళలయాన్వితమైన నాదం, విన్యాస విక్షేపాత్మకమైన నృత్తం, అర్థభావ సమన్విత మైన శబ్దం సాక్షాత్కరిస్తాయి. ఇవి - యుగయుగాంతరాలు పిమ్మట గానం -నృత్యం - కవిత్వం అనే పరిణామ రమణీయములైన మూడు గొప్ప కళలుగా మారి చిట్టచివరకు నాటకంలో సంగమించాయి. అందుచే "కావ్యేషు నాటకం రమ్యమ్" "నాటకాంతం హి సాహిత్యం" - సార్థక సూక్తులు.

ఆధునిక యుగంలో నాటకాలు తామరతంపరగా అవతరించాయి. శ్రీ వీరేశలింగం అనువదించిన అభిజ్ఞాన శాకుంతలం ఉదాహరింపవచ్చు. ఆంధ్ర నాటకరంగ స్థలాన్ని ఉఱ్ఱూతలూపిన నాటకాలు ఎన్నో ఉన్నాయి. శాకుంతలం - చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి గయోపాఖ్యానం, ధర్మ వరం రామకృష్ణమాచార్యులవారి నాటకాలు - పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి నాటకాలు, వేదం వేంకట రాయశాస్త్రిగారి

ప్రతాపరుద్రీయం, బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి సత్యహరిశ్చంద్ర - కాళ్లకూరి నారాయణరావుగారి చింతామణి -వరవిక్రయం, శ్రీ రాముల సచ్చిదానంద శాస్త్రిగారి సావిత్రి - అన్నిటికీ మించి వేలకొలది సార్లు, ఊరూర ప్రదర్శింపబడిన తిరుపతి వేంకట కవుల ఉద్యోగ విజయాలు - పేర్కొనక తప్పదు.

ఆంధ్ర దేశంలో - నాటక పద్యాలు - రంగ స్థలంపై ననే గాక దిగ్‌దిగంతరాలు మారు మ్రోగాయి. ఇప్పటికీ ఆంధ్రుల హృదయాంతరాళాలలో ఆ ప్రతిధ్వనులు వినిపిస్తూనే ఉంటాయి. బహుశ ఆచంద్ర తారార్కం. ఆ పద్యాలు సహృదయుల హృదయాలలో చిరంజీవులుగా నిలిచి ఉంటాయి. మచ్చుకు కొన్ని-

గయోపాఖ్యానంలో శ్రీ కృష్ణుని శపథం.

జల నిధు లింకు దాక - కుల శైలము వేడును గ్రుంకుగాక ఆ జ్వలనుడు వేడిమిన్ విడిచి చల్లదనంబును దాల్చుగాక ఈ జలజహి తుండు పశ్చిను దిశన్ జనియించెడుగాక ఇంక ఆ 'గయునుఖలు మూంగమును ఖండన చేసెద చక్ర ధారలన్ నారదుని ఉపదేశం ప్రకారం గయుడు అర్జునుని శరణు వేడి అభయ ప్రధానం పొందాడు. అప్పుడు అర్జునుడు చేసిన శపథం నిటలాక్షుండుపుడెత్తి వచ్చినను రానీ అన్నదమ్ములున్ విట తాటంబుగ బాసి పోయిననుపోనీ, కృష్ణుడే వచ్చి వద్దిడు పార్థాయననీ మరేమయిన గానీ లోకమున బెగ్గిలం బటు దర్పంబున నిల్చి ఈ గయుని ప్రాణం నేను రక్షించెదన్.

పాపం-సుభద్ర పుట్టినింటి వారి మధ్య మెట్టినింటి వారి మధ్య పడి నలిగిపోతుంది.

శ్రీ కృష్ణుడు సుభద్రతో:

వంతయొకింత లేనటుల బాల్యము నుండియు పుట్టినింటివా

రెంతటి భాగ్య మిచ్చినను ఏ విధి చూచిన గాని కాంతకున్

సుంతయు ప్రేమ యుండదిక సోదరు లాదిగ బంధుకోటిపై

కాంతలు మధ్య వచ్చిన మగండనినన్ పడి చత్తు రెంతయున్.

శ్రీ కృష్ణుడు అర్జునునితో

పేరు ధర్మరాజు పెనువేప విత్తంద్రు;

మాట తేనె తేట - మనసు విసము;

నేతి బీరకాయ నీయుధిష్ఠిరు శబ్ద

మెరుకలేని వాని యెదుట పొగడు.

సత్యహరిశ్చంద్ర నాటకంలో నుండి

మరణించిన పుత్రుని - వల్ల కాటికి తీసికొని వచ్చిన చంద్రమతిని - కాటి సుంకం చెల్లించమని అడుగుతాడు కాటి కాపరియైన హరిశ్చంద్రుడు - ఆమె తన వద్ద - ఏమీ లేదని వాపోతుంటే అప్పుడు హరిశ్చంద్రుని పద్యం దళమౌ పయ్యెదలో నణంగియు సముద్యత్ కాంతులీ రెండలన్ మలయింపన్ దిశలన్ త్వదీయ గళసీమున్ బాలసూర్య ప్రభాకవితంబై వెలుగొందు చున్నయది - మాంగల్యంబు కాబోలు! ఏ వెలకైనన్ తెగనమ్మి - నీ సుతునికై వెచ్చించినన్ చెల్లదే!!

ఈ పద్యం విన్న ప్రేక్షకులు వెనువెంటనే 'ఒన్స్‌మోర్ నినాదాలు చేసేవారు.

మిన్నుముట్టేటట్లు:

కాశీరాజు - చంద్రమతిని శిశుహంత్రి యని నిందమోపి ఆమెను వధించమని ఆజ్ఞాపిస్తాడు. ఆ కర్తవ్యం కాటి కాపరియైన హరిశ్చంద్రునిపై పడింది. అప్పుడు హరిశ్చంద్రుని పద్యం

హృదయమా! సతికి నీ ఋణ మెల్ల సరిపోయె,

నీకేటి ఆస ఈ నెలత పైన?

మోహమా! నీకాలము గతించె మా చెంత,

బ్రతుకు మిందేని దంపతుల పొంత!

దుఃఖమా! నీవున్న దొసగు తప్పదు మాకు

తొలగి పొమ్మింక మా తలపు వీడి

ఖడ్గమా! మానినీ కంఠ రక్తము గూడ

చవి చూడగలవు? నిశ్చలత గొనుము,

సత్యమునకయి ఈ హరిశ్చంద్రు వంశ

మంతరించెడుగాక శ్రీ హరుని మీద

మనసు గురిచేసి, హో చంద్రమతి త్వదీయ

కంఠ మర్పింపు నీ పతి ఖడ్గమునకు॥

కాటికాపరియైన హరిశ్చంద్రుడు

చితిలో కాలే శవాన్ని చూచినప్పుడు:

మాయామేయ జగంబె నిత్యమని సంభావించి మోహంబునన్ నా యిల్లాలని నాదు పుత్రుడని ప్రాణంబుండు నందాక ఎంతో యల్లాడిన ఈ శరీర మిపుడిందున్ కట్టెలన్ కాలుచో

ఆ యిల్లాలును రాదు ఆసుతులు తోడై రారు తప్పింపగన్.

బళ్లారి కె. సుబ్రహ్మణ్య శాస్త్రి రచించిన లవకుశ నుండి సీత - తన్ను అరణ్యంలో దించి మౌనంగా నిలిచిన లక్ష్మణునితో చెప్పిన పద్యం.

మున్నా రావణు ఘోరశక్తిని ధరన్ మూర్ఛిల్లుచో ఆజిలో

సన్నాహంబున ఇంద్రజిత్తును వటక జక్కాడుచు

దైత్యులన్

ఛిన్నా భిన్నము చేయుచో అరయగా చింతింపనే లక్ష్మణా

కన్నీరేటికి గల్గె తండ్రి చెప్పనూ కల్యాణమే రామునకున్.

చింతా మణి నాటకం నుండి

భవానీ శంకరుడు చింతామణితో చెప్పిన పద్యం

తాతల నాటి క్షేత్రము లెల్ల తెగనమ్మి

దోసిళ్లతో తెచ్చి పోసినాను;

తండ్రి కట్టిన యిల్లు దాయాదులకు విక్ర

యించి వస్తువులు చేయించినాను

అత్తవారిచ్చిన అంటు మామిడి తోట

ఈవు కోరగ వ్రాసి ఇచ్చినాను

కులసతిమేని సొమ్ములు పుస్తెతో గూడ

కొని వచ్చి నీ యింట గుప్పినాను

కులము వారెల్ల నీకిది కూడదనిన

భార్యమాతకి నోటికి వరుగు విడిన

లెక్క సేయక నీ యిల్లు కుక్కవోలె

కాచుకొని యిట్టు లున్నాడ కలికి నేను.

బిల్వ మంగళునితీసికొని రమ్మన్న చింతామణితో భవాని శంకరుడు - పరస్త్రీ పరాఙ్ముఖుడు బిళ్వమంగళుడు అని సమాధానం చెప్పుతాడు. చింతామణి అప్పుడు చెప్పిన పద్యం ఇంతులు తారసిల్లు నరకే పురుషాగ్రణు లెంత లేసి సా మంతము లాడినన్ బిగువు మాటలో పల్కిన కామినీమణీ కాంత ధృగం చలాగ్ని కవికాల మించుక సోటసోకె నేన్ ఎంతటి పండితుండయిన ఇట్టె కరుంగడె వెన్న పోవికన్.

చింతామణికి స్వప్నంలో శ్రీకృష్ణ సాక్షాత్కారం లభించినపుడు మేల్కొని చెప్పిన పద్యం:

పాపిని భ్రష్టురాల అది బానిసనై బహునీచ వృత్తిలో

రేపులో మా ప్రలోంబడి చరించిన మాటయె నిన్నమింక ఆ

పాపపు దారి త్రొక్కను - భవచ్చ రణాబ్జ యుగంబు సాక్షిగా

నా పయి ప్రేమనిల్పి యదునందన కృష్ణ తరిపం చేయవే.

జ్ఞానోదయమైన పిదప బిళ్వ మంగళుడు చెప్పిన పద్యం. ఒకనాడు తనకు ప్రేయసియైన చింతామణిని తల్లిగా సంబోధిస్తాడు. తల్లిరో [illegible]ము కాగమృత ధారలు తేరి కొనంగ జేసె - మూర్ఛిల్లిన అంతరాత్మను - నశించెను కన్నులలోని కావరంబెల్ల, మించె నిక్క[illegible]ముగ [illegible] ంఛలో - మేలు కాంచెనో ఉల్లము ద[illegible]మైనా కల ము[illegible] - ఎడింగతి ఎల్ల దోషముల్ నందూరి [illegible] యకృష్ణమాచార్య వ్రాసిన

"ఛత్ర పతి శివాజీ" నుండి

శివాజీ ప్రభృతులు - శత్రువులకు చిక్కకుండా తప్పించుకొని పోయేటందుకు - కొండ కోనల మధ్య - ఇరుకు చరియ కడ తాను నిలిచి - ఆత్మార్పణ చేసుకోగలనని - బాజీ ప్రభువు - శివాజీతో చెప్పిన పద్యం

చంచల్ ఘోర శతఘ్ని నికహజ్వాలా వలాభిలమై

సంచరించు మొగల్ చమూ బలము గెల్వం జాలమెట్లైన యత్

కించిత్ కాలములోయలో నిలిపెదన్ - క్షేమంబుగా రక్షణో

దంచద్ రాజగడంబు చేరుడిదె కర్తవ్యంబు వీరా గ్రణీ

శ్రీ ముత్తరాజు సుబ్బారావు గారు వ్రాసిన శ్రీ కృష్ణ తులాభారం నుండి

సత్యభామ శ్రీకృష్ణునితో ఆగ్రహో దగ్రయై

ఇక నీ గీచిన గీటుదాటనని ఎన్నోసార్లు నాదండ ఇ

చ్చకముల్ వచ్చగ బల్కి పల్కితుదకా చందాన స్వస్త్రీలతో

ఎక పక్కెంబుల పాలు చేసి ఇటు రానేలా ఒకేసారి కు

త్తుక ఖండించి సపత్నులుంగలిసి సంతోషింప గారాదొకో

నారదుడు: శ్రీ కృష్ణుని దానంగా పరిగ్రహించినప్పుడు

ఏమి తపంబొనర్చి జనియించిన వాడనొ నేడు సత్య భా

మా మహి ళా వ్రతంబున సముంచిత రీతి పరిగ్రహించితిన్

సిద్ధి దాయకుని ఖండిత దుష్ట నిశాటు సర్వ మ

ర్త్యామర పూజితాంఘ్రు, నభిలాష విరూరు అనంతు అచ్యుతున్

తులాభార మయంలో నారదుడు: సత్యభామ ప్రశ్నకు సమాధానంగా

**అండపిండ వేదోండ సంహితులనెల్ల**

**గుప్తగతి బొజ్జలో నుంచుకొన్న యట్టి**

**తోయజాక్షుని తుల దూచిగలవె నీవు**

**ధనమూల ధనేతర మూలను తరళనయన.**

పానుగంటి లక్ష్మీ నరసింహరావుగారి

పాదుకా పట్టాభిషేకమునుండి

దశరథుడు - మునులతో

**కొడుకు లెందరున్న పెద్ద కొడుకు తనము**

**భాగ్యమున నున్నపుడె తండ్రి అలరు మిగుల**

**యుండులను పెద్దముల్లు పండ్రెండు చేరి**

**నపుడె గంట గొట్టెడు గడియార మటుల**

ప్రతాపరుద్రీయం, బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి సత్యహరిశ్చంద్ర - కాళ్లకూరి నారాయణరావుగారి చింతామణి -వరవిక్రయం, శ్రీ రాముల సచ్చిదానంద శాస్త్రిగారి సావిత్రి - అన్నిటికీ మించి వేలకొలది సార్లు, ఊరూర ప్రదర్శింపబడిన తిరుపతి వేంకట కవుల ఉద్యోగ విజయాలు - పేర్కొనక తప్పదు.

ఆంధ్ర దేశంలో - నాటక పద్యాలు - రంగ స్థలంపై నవే గాక దిగ్దిగంతరాలు మారు మ్రోగాయి. ఇప్పటికీ ఆంధ్రుల హృదయాంతరాళాలలో ఆ ప్రతిధ్వనులు వినిపిస్తూనే ఉంటాయి. బహుశ ఆచంద్ర తారార్కం. ఆ పద్యాలు సహృదయుల హృదయాలలో చిరంజీవులుగా నిలిచి ఉంటాయి. మచ్చుకు కొన్ని:

గయోపాఖ్యానంలో శ్రీకృష్ణుని శపథం.

జల నిధు లింకు దాక - కుల శైలము వేడును గ్రుంకుగాక ఆ జ్వలనుడు వేడిమిన్ విడిచి చల్లదనంబును దాల్చుగాక ఈ జలజహితుండు పశ్చిమ దిశన్ జనియించెడుగాక ఇంక ఆ 'గయునుఖలు మాంగమును ఖండన చేసెద చక్ర ధారలన్ నారదుని ఉపదేశం ప్రకారం గయుడు అర్జునుని శరణు వేడి అభయ ప్రధానం పొందాడు. అప్పుడు అర్జునుడు చేసిన శపథం నిటలాక్షుండిపుడెత్తి వచ్చినను రానీ అన్నదమ్ములున్ విట తాటంబుగ బాసి పోయిననుపోనీ, కృష్ణుడే వచ్చి వద్దిడు సార్ధాయననీ మురేమయిన గానీ లోకమున బెగ్గిలం బటు దర్పంబున నిల్చి ఈ గయుని ప్రాణం నేను రక్షించెదన్.

పాపం-సుభద్ర పుట్టినింటి వారి మధ్య మెట్టినింటి వారి మధ్య పడి నలిగిపోతుంది.

శ్రీకృష్ణుడు సుభద్రలో:

వంతయొకింత లేనటుల బాల్యము నుండియు పుట్టినింటినా

రెంతటి భాగ్య మిచ్చినను ఏ విధి చూచిన గాని కాంతకున్

మంతయు ప్రేమ యుండదిక సోదరు లాదిగ బంధుకోటిపై

కాంతలు మధ్య వచ్చిన మగండనినన్ పడి చత్తు - రెంతయున్.

శ్రీకృష్ణుడు అర్జునునితో

పేరు ధర్మరాజు పెనువేప విత్తంద్రుడు;

మాట తేనె తేట - మనసు విసము;

నేతి బీరకాయ నీయుధిష్టిరు శబ్ద

మెరుకలేని వాని యెదుట సాగడు.

సత్యహరిశ్చంద్ర నాటకంలో నుండి

మరణించిన పుత్రుని - వల్ల కాటికి తీసికొని వచ్చిన చంద్రమతిని - కాటి సుంకం చెల్లించమని అడుగుతాడు కాటి కాపరియైన హరిశ్చంద్రుడు - ఆమె తన వద్ద - ఏమీ లేదని వాపోతుంటే అప్పుడు హరిశ్చంద్రుని పద్యం దళమౌ పయ్యెదలో నణంగియు సముద్యత్ కాంతులీ రెండలన్ మలయింపన్ దిశలన్ త్వదీయ గళసీమన్ బాలసూర్య ప్రభాకవితంబై వెలుగొందు చున్నయది - మాంగల్యంబు కాబోలు! ఏ వెలకైనన్ తెగనమ్మి - నీ సుతునికై వెచ్చించినన్ చెల్లదే!!

ఈ పద్యం విన్న ప్రేక్షకులు వెనువెంటనే 'ఒన్స్మోర్ నినాదాలు చేసేవారు.

మిన్నుముట్రేటట్లు:

కాశీరాజు - చంద్రమతిని శిశుహంత్రి యని నిందమోపి ఆమెను వధించమని ఆజ్ఞాపిస్తాడు. ఆ కర్తవ్యం కాటి కాపరియైన హరిశ్చంద్రునిపై పడింది. అప్పుడు హరిశ్చంద్రుని పద్యం

హృదయమా! సతికి నీ ఋణ మెల్ల సరిపోయె,

నీకేటి ఆస ఈ నెలత పైన?

మోహమా! నీకాలము గతించె మా చెంత,

బ్రతుకు మిందేని దంపతుల పొంత!

దుఃఖమా! నీవున్న దొసగు తప్పదు మాకు

తొలగి పొమ్మింక మా తలపు వీడి

ఖడ్గమా! మానినీ కంఠ రక్తము గూడ

చవి చూడగలవు? నిశ్చలత గొనుము,

సత్యమునకయి ఈ హరిశ్చంద్రు వంశ

మంతరించెడుగాక శ్రీ హరుని మీద

మనసు గురిచేసి, హా చంద్రమతి త్వదీయ

కంఠ మర్పింపు నీ పతి ఖడ్గమునకు॥

కాటికాపరియైన హరిశ్చంద్రుడు

చితిలో కాలే శవాన్ని చూచినప్పుడు:

మాయామేయ జగంబె నిత్యమని సంభావించి మోహంబునన్ నా యిల్లాలని నాదు పుత్రుడని ప్రాణంబుండు నందాక ఎం తో యల్లాడిన ఈ శరీర మిపుడిందున్ కట్టెలన్ కాలుచో

ఆ యిల్లాలును రాదు ఆసుతులు తోడై రారు తప్పింపగన్.

బళ్లారి కె. సుబ్రహ్మణ్య శాస్త్రి రచించిన లవకుశ నుండి సీత - తన్ను అరణ్యంలో దించి మౌనంగా నిలిచిన లక్ష్మణునితో చెప్పిన పద్యం.

మున్నా రావణు ఘోరశక్తిని ధరన్ మూర్ఛిల్లుచో ఆజిలో

సన్నాహంబున ఇంద్రజిత్తును వటక జక్కాడుచు

దైత్యులన్

ఛిన్నా భిన్నము చేయుచో అరయగా చింతింపవే లక్ష్మణా

కన్నీరేటికి గల్గె తండ్రి చెప్పమా కల్యాణమే రాముకున్.

చింతా మణి నాటకం నుండి

భవానీ శంకరుడు చింతామణితో చెప్పిన పద్యం

తాతల నాటి క్షేత్రము లెల్ల తెగనమ్మి

దోసిళ్లతో తెచ్చి పోసినాను;

తండ్రి కట్టిన యిల్లు దాయాదులకు విక్ర

యించి వస్తువులు చేయించినాను

అత్తవారిచ్చిన అంటు మామిడి తోట

ఈవు కోరగ వ్రాసి ఇచ్చినాను

కులసతిమేని సొమ్ములు పుస్తెతో గూడ

కొని వచ్చి నీ యింట గుప్పినాను

కులము వారెల్ల నీకిది కూడదనిన

భార్యనాతికి నోటికి వరుగు విడిన

లెక్క సేయక నీ యిల్లు కుక్కవోలె

కాచుకొని యిట్టు లున్నాడ కలికి నేను.

బిల్వ మంగళునితీసికొని రమ్మన్న చింతామణితో భవాని శంకరుడు - పరస్త్రీ పరాఙ్ముఖుడు బిల్వమంగళుడు అని సమాధానం చెప్పుతాడు. చింతామణి అప్పుడు చెప్పిన పద్యం

ఇంతులు తారసిల్లు నరకే పురుషాగ్రణు లెంత లేసి సా మంతము లాడినన్ బిగువు మాటలో పల్కిన కామినీమణీ కాంత ధృగం చలాగ్ని కవికాల మించుక పాటసోకె నేన్ ఎంతటి పండితుండయిన ఇట్టె కరుంగడె వెన్న పోవికన్.

చింతామణికి స్వప్నంలో శ్రీకృష్ణ సాక్షాత్కారం లభించినపుడు మేల్కొని చెప్పిన పద్యం:

పాపిని భ్రష్టురాల అది బానిసనై బహునీచ వృత్తిలో

రేవులో నా ప్రలోంబడి చరించిన మాటయె నిన్నమింక ఆ

పాపపు దారి త్రొక్కను - భవచ్చ రణాబ్జ యుగంబు సాక్షిగా

నా పయి ప్రేమనిల్పి యదునందన కృష్ణ తరిపం చేయవే.

జ్ఞానోదయమైన పిదప బిల్వ మంగళుడు చెప్పిన పద్యం. ఒకనాడు తనకు ప్రేయసియైన చింతామణిని తల్లిగా సంబోధిస్తాడు.

తల్లిరో! నీదు కాగమృత ధారలు తేరి కొనంగ జేసె - మూర్ఛిల్లిన అంతరాత్మను - నశించెను కన్నులలోని కానరంబెల్ల, మించె నిక్కముగ ఇద్రియ వాంఛలో - మేలు కాంచెనో ఉల్లము దుష్టమైనా కల నుండి - ఎడింగతి ఎల్ల దోషముల్ నండూరి రామకృష్ణమాచార్య వ్రాసిన

"ఛత్ర పతి శివాజి" నుండి

శివాజీ ప్రభృతులు - శత్రువులకు చిక్కకుండా తప్పించుకొని పోయేటందుకు - కొండ కోనల మధ్య - ఇరుకు చరియ కడ తాను నిలిచి - ఆత్మార్పణ చేసుకోగలనని - బాజీ ప్రభువు - శివాజీతో చెప్పిన పద్యం

చంచల్ ఘోర శతఘ్ని నికహజ్వాలా నలాభిలమై

సంచరించు మొగల్ చమూ బలము గెల్వం జాలమెట్టైన - యత్

కించిత్ కాలములోయలో నిలిపెదన్ - క్షేమంబుగా రక్షణో

దంచద్ రాజగడంబు చేరుడిదె కర్తవ్యంబు వీరా గ్రణీ

శ్రీ ముత్తరాజు సుబ్బారావు గారు వ్రాసిన శ్రీకృష్ణ తులాభారం నుండి

సత్యభామ శ్రీకృష్ణునితో ఆగ్రహో దగ్రయై

ఇక నీ గీచిన గీటుదాటనని ఎన్నోసార్లు నాదండ ఇ

చ్చకముల్ నచ్చగ బల్కి పల్కితుదకా చందాన స్వస్త్రీలతో

ఎక నక్కెంబుల పాలు చేసి ఇటు రానేలా ఒకేసారి కు

త్తుక ఖండించి సపత్నులంగలిసి సంతోషింప గారాదొకో

నారదుడు: శ్రీకృష్ణుని దానంగా పరిగ్రహించినప్పుడు

ఏమి తపంబొనర్చి జనియించిన వాడనొ నేడు సత్య భా

మా మహి తా వ్రతంబున సముంచిత రీతి పరిగ్రహించితిన్

సిద్ధి దాయకుని ఖండిత దుష్ట నిశాటు సర్వ మ

ర్త్యామర పూజితాంఘ్రు, నభిలాష విదూరు అనంతు అచ్యుతున్

తులాభార మయంలో నారదుడు: సత్యభామ ప్రశ్నకు సమాధానంగా

**అండపిండ వేదోండ సంహితులనెల్ల**

**గుప్తగతి బొజ్జలో నుంచుకొన్న యట్టి**

**తోయజాక్షుని తుల దూపిగలవె నీవు**

**ధనమూల ధనేతర మూలను తరళనయన.**

పానుగంటి లక్ష్మీ నరసింహరావుగారి

పాదుకా పట్టాభిషేకమునుండి

దశరథుడు - మునులతో

**కొడుకు లెందరున్న పెద్ద కొడుకు తనము**

**భాగ్రమున నున్నపుడె తండ్రి అలరు మిగుల**

**యుండులను పెద్దముల్లు పండ్రెండు చేరి**

**నపుడె గంట గొట్టెడు గడియార మటుల**

పద్యాల పుట్ట పాండవ ఉద్యోగ విజయాలు

తిరుపతి వేంకట కవులు వ్రాసినట్టి నాటకాలు.

విద్యావంతుల మాట అటుంచి - నిరక్షరాస్యులైన జానపదులు కూడ ఉద్యోగ విజయాలలోని పద్యాలు - రాగం తప్పకుండా చదివే వారు ఎందరో ఉన్నారు.

అర్జునుడు: ద్వారకానగరం ప్రవేశిస్తూ చెప్తున్న పద్యం

**అదిగో ! ద్వారక, ఆలమందలవిగో అందందునోరాడు అ**
**య్యదియే అగిర్త - అవె రథ్యల్ వారలే యాదవుల్**
**యదుసింహుండు వసించు మేడ అదిగో - ఆలావ దంతావళా**
**భ్యుదయంబై వరమందిరాంతర తురంగోచ్ఛండవలై వర్వైదున్-**

ధర్మరాజు: శ్రీకృష్ణునితో సంధికి అతనిని రాయబారిగా పంపే ముందు.

**తమ్ముని బిడ్డలంచు మది దల్పడు; పుత్రులలోన గూడె, రా**

**జ్యమ్మునకు పాలొసగ దంధనృపాలుడటంచు మొన్న నీ**
**సమ్ముఖ మందె తెచ్చెగద సంజయుడా కురురాజు లుబ్ధ చి**
**త్తమ్మున కన్ను గానడిక తప్పదు యుద్ధము బంధు నాశమున్**

**సంధి యొనర్చి మా భరత సంతతి కావుము లేదయని గ**
**ర్వాంధుల ధార్తరాష్ట్రుల సహాయులతో దునిపింపుమో జగద్**
**బాంధవ రెండు కర్జముల భారము పెట్టితిమయ్య నీ భుజ**
**స్కంధము నందు; తారసిలుగావు తమకు యశంబొ రాజ్యమో**

సహదేవుడు శ్రీకృష్ణునితో

**పోరికి సిద్ధమై అడుగ బోయిన వారము గాన - వారు మా**
**దారికి రాకపోవుట విదారిత కౌరవకంఠ రక్త ధా**
**రా రమణీయ రక్తిమ మరాళకరాళ స్వధా కుమార సే**
**వారతి దాగి యున్న కరవాలము నుంబడు యోగ ముండినన్.**

శ్రీ కృష్ణుడు : రాయబారిగ కౌరవ సభలో

**అలుగుట యే యెరుంగని మహా మహితాత్ముడ జాత శత్రువే**
**అలిగిన నాడు సాగరము లన్నియు ఏకము కాకపోవు క**
**ర్ణులు పదివేవురైన అని నొత్తురు చత్తురు రాజరాజు నా**
**పలుకులు విశ్వసింపుము విపన్నుల లోకుల గావు మెల్లరన్**
**జెండా పై కపిరాజు ముందుసిత వాజి శ్రేణియున్ పూన్చి నే**
**దండంబున్ గొని తోలు - స్యందనముపై నారి సారించుచున్**
**గాండీవమ్ము ధరించి ఫల్గునుడు మూకన్ - చెండు చున్నప్పు డా**
**క్కాండవ్ నీ మొర ఆలకింపడు - కురుక్ష్మానాథ సంధింపగన్**

కర్ణుడు - శ్రీకృష్ణునితో (రహస్య సమావేశము)

**సూతుని చేతికిన్ దొరకి సూత కళత్రము పాలు త్రావి ఆ**
**సూతుని అన్నమున్ గుడిచి సూత కులాంగన యందు నందన**
**వ్రాతము గాంచి నేటి కొక రాజ కుమారుడనంచు తెల్పి నా**
**చేతము సమ్మతించునె, ఇది ఎవరేగు సిగ్గుమాలినన్**

అర్జునుడు - చేసిన ప్రతిజ్ఞ, సైంధవ వధకు ముందు శ్రీకృష్ణునితో

**కావుమటంచు ధర్మజుని కాళ్ళపయిన వడకున్న పేర్మి మై**
**ఈవె భరింతునం చభయమీయక యున్న - గురుండు కాడు గౌ**
**రీవిభుడడ్డమై నిలువరించును గాక - అని వెన్ను చూపుచున్**
**పోవక యున్న సైంధవుని పోకడకున్ రవి గ్రుంకునంతకున్**

యుద్ధ మధ్యంలో - అర్జునిని అధిక్షేపిస్తూ

కర్ణుని చేతిలో ఓడిపోయిన ధర్మరాజు - శ్రీ కృష్ణునితో

అని యొనరించు బోవు సమయమ్మున - కర్ణుని గెల్చువార నీ
యొక వివరంబు నేనడగు మోసము చేసె నితండు నేను నే
ననినను; లేక యున్న విడినాంతర భూమికి వచ్చి తాక నే
ర్చునె నిశితాంభకంబులును సూత కున్ కుని పోటు మాటలన్

ధర్మరాజు అర్జునితో

**రథియై తామర సాక్షుడు**
**ప్రథనము గావించు గాండీవం బొసగుము సా**
**రథివై తేరు నడుపుము ఈ**
**విధమున కర్ణుండు గ్రుంకు వీరమ్మన్యా**

హ్రదంలో దాగుకొనిన దుర్యోధనునితో ధర్మరాజు

**చచ్చిరి సోదరుల్ సుతులు చచ్చిరి చచ్చిరి రాజు లెల్ల ఈ**
**కచ్చెకు మూల కందమగ కర్ణుడు మామయు చచ్చిరీ గతిన్**
**వచ్చని కొంప మాపితివి బాపురె కౌరవనాథ నీ సగం**
**బిచ్చెద జీవితేచ్ఛ గలదేని బయల్పడు మయ్యా గ్రక్కునన్**

భీముడు దుర్యోధనుని శిరస్సు తన్నినపుడు ధర్మ రాజు

**చతురంబోధి పరీతమైన ధరణీ చక్రంబు శాసించి భూ**
**పతి వర్గం చరిగాపుకై కొలువ సేవానమ్ర రాజేంద్ర మే**
**ళిత లాంకృత రత్న రీధితి సరో లీ నుండ పై యుండు నీ**
**స్థితి ఈ రీతిగ నేటికిన్ పరిణమించెన్ గాదె దుర్యోధనా..**

నాటకపద్యాలు తెలుగులో గొప్ప అభిరుచిని పెంపొందించి అభినవేశం కల్పించటానికి కారణం - నాటక కవులు మృదు మధుర సన్నివేశాలను ఈ మధురోదాత్త రసభావ నిరంతరములైన ఘట్టాలను ఏరుకొని - శిల్ప సౌష్ఠవ సంభవితములైన పద్యాలు వ్రాయటమే.

* * *

# వెలుగుకు పట్టం కడదాం

మల్లెమాల

అర్వై ఆకుల కాలచక్రపుం
తిరుగుడులోనా ఇప్పటి వరకు
ఎన్ని ఉగాదులు దొర్లిపోయెనో
ఎవ్వడు లెక్కించాడు?
కాని......
తెలుగు జాతి గత వైభవాన్ని
వర్తమాన పురోగమనాన్ని
ఎప్పటికప్పుడు చరిత్రకారుడు
లెక్కిస్తూనే ఉన్నాడు.... పుటల
కెక్కిస్తూనే ఉన్నాడు॥–
అలా.......
చరిత్రకెక్కిన లెక్కలన్నింటిని
జమాఖర్చు బేరీజు వేసితే
ఏమున్నది గర్వకారణం?
మిగులుతుంది సున్నాల తోరణం॥–
నేతులు తాగిన తాతల మూతులు
నేడెందుకు పనికొస్తాయి?
పాతరలోని కీర్తి ప్రతిష్ఠలు
జాతరకే పనికొస్తాయి॥–
పంచాంగంలో ఉండే వర్షం
[illegible]యోగిస్తుందా?
పున్నమి ఘనతనువల్లె వేసితే
అమవస చీకటిపోతుందా?
అంచేత..........
ఖతమైపోయిన గతమునుమరచి
ఖరాఖండిగా సత్యాంతరచి
ఉజ్వల ప్రగతికి గట్టి పునాది... ఈ
ఉగాదికైనా వేద్దాము॥–

*Publishedby the Commissioner of Information and Public Relations and Printed at Suraj Printers & Packagers, Reddy Shopping Complex, Tilak Road, Hyderabad-1.*

పద్యాల పుట్ట పాండవ ఉద్యోగ విజయాలు

తిరుపతి వేంకట కవులు వ్రాసినట్టి నాటకాలు.

విద్యావంతుల మాట అటుంచి - నిరక్షరాస్యులైన జానపదులు కూడ ఉద్యోగ విజయాలలోని పద్యాలు - రాగం తప్పకుండా చదివే వారు ఎందరో ఉన్నారు.

అర్జునుడు: ద్వారకానగరం ప్రవేశిస్తూ చెప్తున్న పద్యం

**అదిగో ! ద్వారక, ఆలమందలవిగో అందందునోరాడు అ**
**య్యదియే అగ్గిర్త – అవె రథ్యల్ వారలే యాదవుల్**
**యదుసింహుండు వసించు మేడ అదిగో – ఆలావ దంతావళా**
**భ్యుదయంబై వరమందిరాంతర తురంగోచ్చండవల్లె పర్వెడున్–**

ధర్మరాజు: శ్రీకృష్ణునితో సంధికి అతనిని రాయబారిగా పంపే ముందు.

తమ్ముని బిడ్డలంచు మది దల్చడు; పుత్రులలోన గూడె, రా
జ్యమ్మునకు పాలొసగ డంధనృపాలుడటంచు మొన్న నీ
సమ్ముఖ మందె తెచ్చెగద సంజయుడా కురురాజు లుబ్ద చి
త్తమ్మున కన్ను గానడిక తప్పదు యుద్ధము బంధు నాశమున్

సంధి యొనర్చి మా భరత సంతతి కావుము లేదయని గ
ర్వాంధుల ధార్తరాష్ట్రుల సహాయులతో దునిపింపుమో జగద్
బాంధవ రెండు కర్జముల భారము పెట్టితిమయ్య నీ భుజ
స్కంధము నందు; తారసిలుగావు తమకు యశంబొ రాజ్యమో

సహదేవుడు శ్రీకృష్ణునితో

**పోరికి సిద్ధమై అడుగ బోయిన వారము గాన – వారు మా**
**దారికి రాకపోవుట విదారిత కౌరవకంఠ రక్త ధా**
**రా రమణీయ రక్తిమ మరాళకరాళ స్వధా కుమార సే**
**వారతి దాగి యున్న కరవాలము నుంబడు యోగ ముండినన్.**

శ్రీ కృష్ణుడు : రాయబారిగ కౌరవ సభలో

**అలుగుట యే యెరుంగని మహా మహితాత్ముడ జాత శత్రువే**
**అలిగిన నాడు సాగరము లన్నియు ఏకము కాకపోవు క**
**ర్ణులు పదివేవురైన అని నొత్తురు చత్తురు రాజరాజు నా**
**పలుకులు విశ్వసింపుము విపన్నుల లోకుల గావు మెల్లరన్**
**జెండా పై కపిరాజు ముందుసిత వాజి శ్రేణియున్ పూన్చి నే**
**దండంబున్ గొని తోలు – స్యందనముపై నారి సారించుచున్**
**[illegible] ఫల్గునుడు మూకన్ – చెండు చున్నప్పు డొ**
**[illegible]కింపడు – కురుక్ష్మానాథ సంధింపగన్**

[illegible] కృష్ణునితో (రహస్య సమావేశము)

**సూతుని చేతికిన్ దొరకి సూత కళత్రము పాలు త్రావి ఆ**
**సూతుని అన్నమున్ గుడిచి సూత కులాంగన యందు నందన**
**వ్రాతము గాంచి నేటి కొక రాజ కుమారుడనంచు తెల్పి నా**
**చేతము సమ్మతించునె, ఇది ఎవరేగు సిగ్గుమాలిసన్**

అర్జునుడు - చేసిన ప్రతిజ్ఞ, సైంధవ వధకు ముందు శ్రీకృష్ణునితో

**కావుమటంచు ధర్మజుని కాళ్ళపయిన పడకున్న పేర్మి మై**
**ఈవె భరింతునం చభయమీయక యున్న – గురుండు కాడు గౌ**
**రీవిభుడడ్డమై నిలువరించును గాక – అని వెన్ను చూపుచున్**
**పోవక యున్న సైంధవుని పోకడకున్ రవి గ్రుంకునంతకున్**

యుద్ధ మధ్యంలో - అర్జునిని అధిక్షేపిస్తూ

కర్ణుని చేతిలో ఓడిపోయిన ధర్మరాజు - శ్రీ కృష్ణునితో

అని యొనరించు బోవు సమయమ్మున - కర్ణుని గెల్చువార నీ
యొక విపరంబు నేనడగు మోసము చేసె నితండు నేను నే
ననినను; లేక యున్న విడినాంతర భూమికి వచ్చి తాక నే
ర్చునె నిశితాంభకంబులును సూత కున్ కుని పోటు మాటలున్

ధర్మరాజు అర్జునితో

రథియై తామర సాక్షుడు
ప్రథనము గావించు గాండీవం బొసగుము సా
రథివై తేరు నడుపుము ఈ
విధమున కర్ణుండు గ్రుంకు వీరమ్మన్యా

హ్రదంలో దాగుకొనిన దుర్యోధనునితో ధర్మరాజు :

చచ్చిరి సోదరుల్ సుతులు చచ్చిరి చచ్చిరి రాజు లెల్ల ఈ
కచ్చెకు మూల కందమగ కర్ణుడు మామయు చచ్చిరీ గతిన్
పచ్చని కొంప మాపితివి బాపురె కౌరవనాథ నీ సగం
బిచ్చెద జీవితేచ్ఛ గలదేని బయల్పడు మయ్యా గ్రక్కునన్

భీముడు దుర్యోధనుని శిరస్సు తన్నినపుడు ధర్మ రాజు

చతురంబోధి పరీతమైన ధరణీ చక్రంబు శాసించి భూ
పతి వర్గం చరిగాపుకై కొలువ సేవానమ్ర రాజేంద్ర మే
ళిత లాంకృత రత్న రీధితి సరో లీ మండ వై యుండు నీ
స్థితి ఈ రీతిగ నేటికిన్ పరిణమించెన్ గాదె దుర్యోధనా..

నాటకపద్యాలు తెలుగులో గొప్ప అభిరుచిని పెంపొందించి అభినవేశం కల్పించటానికి కారణం - నాటక కవులు మృదు మధుర సన్నివేశాలను ఈ మధురోదాత్త రసభావ నిరంతరములైన ఘట్టాలను ఏరుకొని - శిల్ప సౌష్ఠవ సంభవితములైన పద్యాలు వ్రాయటమే.

***

# వెలుగుకు పట్టం కడదాం

మల్లెమాల

అర్వై ఆకుల కాలచక్రపుం
తిరుగుడులోనా ఇప్పటి వరకు
ఎన్ని ఉగాదులు దొర్లిపోయెనో
ఎవ్వడు లెక్కించాడు?
కాని......
తెలుగు జాతి గత వైభవాన్ని
వర్తమాన పురోగమనాన్ని
ఎప్పటికప్పుడు చరిత్రకారుడు
లెక్కిస్తూనే ఉన్నాడు.... పుటల
కెక్కిస్తూనే ఉన్నాడు!!–
అలా.......
చరిత్రకెక్కిన లెక్కలన్నింటిని
జమాఖర్చు బేరీజు వేసితే
ఏమున్నది గర్వకారణం?
మిగులుతుంది సున్నాల తోరణం!!–
నేతులు తాగిన తాతల మూతులు
నేడెందుకు పనికొస్తాయి?
పాతరలోని కీర్తి ప్రతిష్ఠలు
జాతరకే పనికొస్తాయి!!–
పంచాంగంలో ఉండే వర్షం
పంటలకుపయోగిస్తుందా?
పున్నమి ఘనతనువల్లె వేసితే
అమవస చీకటిపోతుందా?
అంచేత..........
ఖతమైపోయిన గతమునుమరచి
ఖరాఖండిగా సత్యంతరచి
ఉజ్వల ప్రగతికి గట్టి పునాది... ఈ
ఉగాదికైనా వేద్దాము!!–

*Publishedby the Commissioner of Information and Public Relations and Printed at Suraj Printers & Packagers, Reddy Shopping Complex, Tilak Road, Hyderabad-1.*

